శ్రీ వేదవ్యాస విరచిత

# శ్రీమన్మహాభారతమ్

## శ్రీ నీలకంఠీయ వ్యాఖ్యానువాద సహితమ్



## ఉద్యోగ పర్వ

## ద్వితీయో భాగః

అనువక్త

ఆచార్య శలాక రఘునాథశర్మ



ఆర్ష విజ్ఞాన ట్రస్టు
హైదరాబాదు

# శ్రీమన్మహాభారతము

# ఉద్యోగపర్వము

## ద్వితీయ భాగము

ఆంధ్రతాత్పర్య నీలకంఠీయ వ్యాఖ్యానువాద సహితము

అనువక్త
ఆచార్య శలాక రఘునాథశర్మ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

ప్రచురణ
ఆర్ష విజ్ఞాన ట్రస్టు
హైదరాబాదు
1990

ప్రథమ ముద్రణ : ప్రమోద ఉగాది 1990

ప్రతులు వేయి



ప్రతులకు :

1. శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబిలీ హిల్సు కో - ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు - 500 034. ఫోన్ : 238237

2. శ్రీమతి కలాశ రాజేశ్వరి
A_2, స్టాఫ్ క్వార్టర్సు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, శ్రీవేంకటేశ్వరపురం,
అనంతపురం - 515 003.

మూల్యం : రూ. 60/-

గ్రంథాలయ ప్రతి వెల రూ. 80/-

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదరగూడ, హైదరాబాదు - 500 029.

# ట్రస్ట్ బోర్డు సభ్యులు




ఆర్ష విజ్ఞాన ట్రస్టు
శ్రీరామసదనము
ప్లాట్ నం. 1381, రోడ్ నం. 45
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ
హైదరాబాదు - 500 034
ఫోన్ : 238237

# ఈ సారస్వతయజ్ఞమునకు సహాయపడిన వదాన్యులు

| | |
|---|---|
| శ్రీ బొల్లంపల్లి సుభాషణరెడ్డి | హైదరాబాదు. |
| డా॥ నీలంరాజు గంగాప్రసాదరావు | వాల్తేరు. |
| ప్రొ॥ యస్. విశ్వనాథం | రాజమండ్రి. |
| శ్రీ వి. కె. రావు | హైదరాబాదు. |
| వనపర్తి ఎడ్యుకేషనల్ & చారిటీస్ ట్రస్టు | వనపర్తి. |
| శ్రీ పడాల రామారెడ్డి | హైదరాబాదు. |
| శ్రీమతి & శ్రీ సారంగపాణి | బెంగళూరు. |
| శ్రీమతి & శ్రీ రాజగోపాలన్ | బెంగళూరు. |
| శ్రీ వై. జి. రామమూర్తి | హైదరాబాదు. |
| శ్రీమతి వై. శారదాదేవి | హైదరాబాదు. |
| శ్రీమతి టి. వెంకటలక్ష్మి | హైదరాబాదు. |
| కామిశెట్టి శకుంతల మహిళా అభ్యుదయ సేవా ట్రస్టు | అనంతపురం. |
| శ్రీ దూరగాయల సత్యనారాయణ | తాడిపత్రి. |
| కుమారి సంధ్యావందనం గోదావరీబాయి | అనంతపురం. |
| కుమారి తంగిరాల లలితాబాయి | అనంతపురం. |
| శ్రీ సలకా నరసింహయ్య | బెంగళూరు. |
| శ్రీ శర్మ - దిట్టకవి | అంటారియో (కెనడా). |

# అక్షరార్చన

నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్.

* * *

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయతపత్రనేత్ర,
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః.

* * *

ధర్మమూలం జగత్సర్వం
ధర్మశ్చ శ్రుతిమూలకః,
భారతం పంచమో వేదః
శ్రుతిసర్వస్వవిస్తరః.

# శ్రీ వ్యాసులకు, భారతమునకు
# కవిత్రయము వారి నీరాజనము

భారత భారతీ శుభ గభస్తి చయంబులఁ జేసి ఘోర సం
సార వికార సంతమస జాల విజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుం డగు దివ్యుఁ బరాశరాత్మజాం
భోరుహ మిత్రుఁ గొల్చి ముని పూజితు భూరియశోవిరాజితున్.

*   *   *

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు.

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేషుండు, విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణ ద్వైపాయను, డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమున్.

వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.

—: o :—

## శ్రీమన్మహాభారతమును గూర్చి ప్రముఖ పండితాభిప్రాయములు

### ఆంగ్లమున

It is really the Mahabharata that is one of the outstanding books of the world. It is a colossal work, and encyclopaedia of tradition and legend and political and social institutions of Anciant India.

—JAWAHARLAL NEHRU

An encyclopaedia of moral teaching.

—ARTHOR MACDONELL

The Mahabharata is a comprehensive work, dealing with the whole problem of man in relation to nature and God.

—N. V. THADANI

# ఉద్యోగపర్వము

## ద్వితీయ భాగము

## విషయసూచిక

### 6. భగవద్యానపర్వము


| అధ్యాయము | విషయము | | పుట |
|---|---|---|---|
| 72. | శ్రీకృష్ణుని దౌత్య ప్రస్తావన | ... | 1 |
| 73. | శ్రీకృష్ణుడు యుధిష్ఠిరుని యుద్ధమునకు ప్రోత్సహించుట | ... | 22 |
| 74. | భీమసేనుడు శాంతిప్రసంగము చేయుట | ... | 29 |
| 75. | శ్రీకృష్ణుడు భీమసేనుని యుద్ధమునకు పురికొల్పుట | ... | 36 |
| 76. | భీముడు శ్రీకృష్ణునికి తన సామర్థ్య మెరింగించుట | ... | 41 |
| 77. | శ్రీకృష్ణుడు తనమాట పౌరుషము రెచ్చగొట్టుటకే యని చెప్పుచు భీము నూరడించుట | ... | 45 |
| 78. | అర్జునుని పలుకు | ... | 51 |
| 79. | శ్రీకృష్ణుడు అర్జునుని మాటకు బదులు చెప్పుట | ... | 57 |
| 80. | నకులుని పలుకు | ... | 63 |
| 81. | సహదేవసాత్యకుల అభిప్రాయమును యోద్ధ లందఱు సమర్థించుట | ... | 66 |
| 82. | ద్రౌపది శ్రీకృష్ణునకు తన దుఃఖము నెఱిగించుట, శ్రీకృష్ణు డామె నూరడించుట | ... | 68 |
| 83. | శ్రీకృష్ణుడు హస్తినకు బయలుదేరుట | ... | 77 |
| 84. | శుభాశుభశకునములను చూచుచు కృష్ణుడు వృకస్థలము చేరి విశ్రమించుట. | ... | 91 |

85. దుర్యోధనుడు శ్రీకృష్ణుని సత్కరించుటకై విడిదిపట్టుల నేర్పాటు చేయుట ... 97
86. శ్రీకృష్ణునకు ధృతరాష్ట్రుడు కానుకలు సమర్పించుట ... 101
87. విదురుడు శ్రీకృష్ణుని యాజ్ఞ పాలింపుమని ధృతరాష్ట్రుని ప్రబోధించుట ... 105
88. దుర్యోధనుడు శ్రీకృష్ణుని విషయమున తన ఆలోచనను చెప్పుట, భీష్ముడు కోపించి వెడలిపోవుట ... 109
89. శ్రీకృష్ణునకు స్వాగతసన్నాహము ... 114
90. శ్రీకృష్ణుడు కుంతి యింటికరిగి ఆమె నోదార్చుట ... 119
91. శ్రీకృష్ణుడు దుర్యోధను నింటి కరుగుట, అతని యింట భోజనము చేయనొల్లక విదురునింటి కేగుట ... 140
92. విదురుడు శ్రీకృష్ణునకు దుర్యోధనాదుల చెడుతల పెరిగించుట ... 149
93. శ్రీకృష్ణుడు సంధిప్రయత్నమునందలి ఔచిత్యమును ప్రతిపాదించుట ... 156
94. శ్రీకృష్ణుని సభాప్రవేశము ... 161
95. శ్రీకృష్ణుని ప్రసంగము ... 178
96. పరశురాముడు కృష్ణార్జునుల మహిమను వర్ణించుట ... 185
97. కణ్వుడు దుర్యోధనునకు మాతలి ఉపాఖ్యానమును చెప్ప నారంభించుట ... 195
98. మాతలి వరు నన్వేషించుచు వరుణలోకమున కరుగుట ... 200
99. నారదుడు మాతలికి పాతాళలోకమును చూపుట ... 206
100. హిరణ్యపురమును సంగ్రహముగా వర్ణించుట ... 212
101. గరుడలోకమును, గరుడసంతానమును వర్ణించుట ... 216
102. సురభిని, సురభిసంతానమును, రసాతలసుఖమును వర్ణించుట ... 219
103. నాగలోకమునందలి నాగులను వర్ణించుట, మాతలి వరనిర్ణయము ... 228

| | | | |
|---|---|---|---|
| 104. | గుణకేశీసుముఖుల వివాహము | ... | 228 |
| 105. | శ్రీవిష్ణువు గరుడుని గర్వమణచుట, దుర్యోధనుడు కణ్వ మునిని వెక్కిరించుట | ... | 234 |
| 106. | యముడు విశ్వామిత్రుని పరీక్షించుట | ... | 241 |
| 107. | గాలవుడు చింతించుట, గరుడు డాతని నూరడించుట | ... | 248 |
| 108. | గరుడుడు గాలవునకు తూర్పు దిక్కును వర్ణించి చెప్పుట | ... | 253 |
| 109. | దక్షిణ దిక్కు వర్ణనము | ... | 258 |
| 110. | పశ్చిమ దిక్కు వర్ణనము | ... | 264 |
| 111. | ఉత్తర దిక్కు వర్ణనము | ... | 270 |
| 112. | గరుడు నెక్కి తూర్పున కరుగుచున్న గాలవుడు వేగమునకు బెగడుట | ... | 277 |
| 113. | గరుడగాలవులు శాండిలి యను తపస్వినిని గాంచుట, గురుదక్షిణకై విచారించుట | ... | 282 |
| 114. | గరుడగాలవులు యయాతి గృహమున కరిగి గుఱ్ఱముల నిమ్మని వేడుట | ... | 287 |
| 115. | యయాతి గాలవునకు తన కన్య నొసగుట | ... | 292 |
| 116. | హర్యశ్వుడు యయాతికన్యయందు పుత్రుని పొందుట | ... | 296 |
| 117. | దివోదాసుడు యయాతికన్యయందు ప్రతర్దనుడను కుమారుని పొందుట | ... | 302 |
| 118. | ఉశీనరమహారాజు మాధవి యందు శిబిని పొందుట | ... | 306 |
| 119. | గాలవుడు మాధవిని విశ్వామిత్రుని కర్పించుట | ... | 310 |
| 120. | మాధవి తపశ్చర్య, యయాతి పతనము. | ... | 315 |
| 121. | యయాతి స్వర్గమునుండి భ్రష్టుడగుట, అతని దౌహిత్రాదులు తమ పుణ్యము నాతని కొసగ గోరుట | ... | 319 |
| 122. | యయాతి మరల స్వర్గమున కరుగుట | ... | 325 |
| 123. | స్వర్గమున యయాతికి స్వాగతము - నారదుడు దుర్యోధనునకు హితము చెప్పుట. | ... | 329 |

124. ధృతరాష్ట్రుని మాటపై శ్రీకృష్ణుడు దుర్యోధనునకు బోధ చేయుట ... 335
125. భీష్మ ద్రోణ విదుర ధృతరాష్ట్రులు దుర్యోధనునకు బోధ చేయుట ... 347
126. భీష్మ ద్రోణులు మరల దుర్యోధనునకు హితము చెప్పుట ... 353
127. శ్రీకృష్ణునకు దుర్యోధనుడు పాండవులకు రాజ్య మీయనని తెగవేసి చెప్పుట ... 357
128. శ్రీకృష్ణుడు దుర్యోధనుని గట్టిగా మందలించుట ... 362
129. ధృతరాష్ట్రుడు గాంధారిని పిలుచుట, ఆమె దుర్యోధనునకు హితము చెప్పుట ... 371
130. సాత్యకి దుర్యోధన దురాలోచనను బయటపెట్టుట ... 382
131. శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించుట ... 393
132. కుంతి పాండవులకు పంపిన సందేశము ... 401
133. కుంతి విదులోపాఖ్యానమును ప్రారంభించుట ... 409
134. విదుల తన కొడుకును యుద్ధమునకు పురికొల్పుట ... 421
135. విదుల కుమారునకు జయోపాయముల నెరిగించుట ... 431
136. విదులబోధ విని ఆమె కొడుకు మరల యుద్ధమునకు సిద్ధపడుట ... 443
137. కుంతి సందేశమును గొని శ్రీకృష్ణుడు ఉపప్లవ్యమునకు బయలుదేరుట ... 449
138. భీష్మద్రోణులు దుర్యోధనునకు బోధచేయుట ... 455
139. ద్రోణుడు శాంతికై దుర్యోధనుని మందలించుట ... 461
140. శ్రీకృష్ణుడు పాండవుల వైపు చేరుమని కర్ణునకు బోధించుట ... 466
141. కర్ణుడు తన నిర్ణయమును తెలుపుట ... 472
142. శ్రీకృష్ణుడు కర్ణునకు పాండవుల గెలుపును నిర్ణయించి చెప్పుట ... 485

143. కర్ణుడు తన స్వప్నవృత్తాంత మెరిగించుట ... 490
144. కుంతి కర్ణునికడ కరుగుట ... 501
145. కుంతి కర్ణునకు జన్మరహస్య మెరిగించుట ... 508
146. కర్ణుడు కుంతికి బదులు చెప్పుట ... 511
147. శ్రీకృష్ణుడు ధర్మరాజునకు భీష్ముని మాటలను వినిపించుట ... 518
148. ద్రోణవిదురగాంధారుల మాటలను ధర్మరాజునకు కృష్ణుడు తెలుపుట ... 527
149. ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు చెప్పిన మాటలు ... 536
150. శ్రీకృష్ణుడు కౌరవుల యెడ దండనీతియే తగినదని నిరూపించుట ... 543

## 7. సైన్య నిర్యాణ పర్వము

151. పాండవపక్షమున సేనాపతిని నిర్ణయించుట ... 547
152. కురుక్షేత్రమున పాండవసేన విడియుట ... 562
153. యుద్ధ సంబంధమైన ఏర్పాట్లు ... 566
154. కర్తవ్యమునుగూర్చి శ్రీకృష్ణయుధిష్ఠిరార్జునులు ప్రసంగించుట ... 571
155. దుర్యోధనుడు సేనాపతులను నిర్ణయించి యభిషేకము చేయుట. ... 577
156. దుర్యోధనుడు భీష్ముని ప్రధానసేనాపతిగా అభిషేకించుట. ... 588
157. యుధిష్ఠిరుడు తన సేనాపతుల కభిషేకము గావించుట, బలరాముడు తీర్థయాత్రల కరుగుట. ... 595
158. సాయము చేయుటకు రుక్మి వచ్చుట; రెండు పక్షముల వారును అతనిని తిరస్కరించుట. ... 602
159. ధృతరాష్ట్రసంజయుల సంవాదము. ... 610

## 8. ఉలూకదూతాగమన పర్వము


160. దుర్యోధను డులూకుని పాండవుల కడకు పంపుట ... 614

161. పాండవులకు ఉలూకుడు దుర్యోధన సందేశమును విని పించుట ... 640

162. పాండవులు దుర్యోధనునకు ప్రతిసందేశ మొసగుట ... 649

163. ఉలూకుడు తిరిగి దుర్యోధనుని కడకు వచ్చుట ... 661

164. పాండవసేన యుద్ధక్షేత్రమునకు చనుట ... 674


## 9. రథాతిరథసంఖ్యాన పర్వము


165. దుర్యోధనునకు భీష్ముడు కౌరవసేనయందలి రథాతిరథు లను పరిచయము చేయుట ... 677

166. కౌరవరథుల పరిచయము ... 684

167. కౌరవపక్షమునందలి రథులను, మహారథులను అతి రథులను వర్ణించుట ... 688

168. కర్ణభీష్ముల సకోపసంవాదము ... 696

169. పాండవపక్షమునందలి రథులు మున్నగు వారిని వర్ణించుట ... 705

170. పాండవపక్షమున రథులను, మహారథులను, విరాట ద్రుపదులను ప్రశంసించుట ... 711

171. ఇతరమహారథులను వర్ణించుట ... 714

172. భీష్ముడు శిఖండిని, పాండవులను చంపనని చెప్పుట ... 719


## 10. అంబోపాఖ్యాన పర్వము.


173. భీష్ముడు కాశిరాజకన్యకల నపహరించిన వృత్తాంతము ... 728

174. అంబ శాల్వరాజునెడ అనురాగము గలదని చెప్పి అతని జేరుటకు భీష్మననుమతి వేడుట ... 728

175. శాల్వు డంబను తిరస్కరించుట, అమె తాపసాశ్రమమున కరుగుట ... 731

176. అంబ హోత్రవాహనాకృతవ్రణులతో సంభాషించుట ... 740
177. అకృతవ్రణ పరశురాము లంబతో సంభాషించుట ... 751
178. పరశురాముడు భీష్ముడు యుద్ధమునకై కురుక్షేత్రమున కరుగుట ... 760
179. భీష్మ పరశురాముల యుద్ధారంభము ... 773
180. భీష్మ పరశురాముల ఘోరసంగ్రామము. ... 786
181. భీష్మ పరశురాముల యుద్ధము ... 793
182. భీష్మ పరశురాముల యుద్ధము ... 798
183. అష్టవసువులవలన భీష్ముడు ప్రస్వాపనాస్త్రమును పొందుట ... 805
184. భీష్మపరశురాములు శక్తి బ్రహ్మాస్త్రములను ప్రయోగించుట ... 809
185. భీష్మ పరశురాముల యుద్ధసమాప్తి ... 814
186. అంబ ఘోరతప మొనరించుట ... 821
187. అంబ మరుజన్మమున మరల తప మొనరించుట ... 829
188. అంబ ద్రుపదునింట కన్యగా పుట్టుట, ద్రుపదుడు పుత్రుడని ప్రకటించుట ... 833
189. శిఖండిపెండ్లి, అతడు స్త్రీయని ఎరిగి దశార్ణరాజు మండిపడుట... 837
190. ద్రుపదుడు ముప్పుతప్పు నుపాయము చెప్పుమని మహారాజ్ఞి నడుగుట ... 842
191. మహారాజ్ఞి బదులుచెప్పుట ... 847
192. శిఖండి మగతనము పొందుట ... 854
193. దుర్యోధనునకు భీష్మాదులు తమతమ శక్తుల నెరిగించుట ... 868
194. అర్జునుడు తమవారి శక్తులను పరిచయము చేయుట ... 872
195. కౌరవసేన రణమునకు బయలుదేరుట ... 876
196. పాండవసేన యుద్ధమునకు బయలుదేరుట ... 880
పరిశిష్టము ... 887

—:o:—

# శ్రీమహాభారతమ్
## *భగవద్యానపర్వ - ౬

# శ్రీమహాభారతము
## భగవద్యానపర్వము - 6

### ద్విసప్తతితమోఽధ్యాయః
### డెబ్బదిరెండవ అధ్యాయము

యుధిష్ఠిరస్య శ్రీకృష్ణం ప్రతి స్వాభిప్రాయప్రకాశనమ్, తద్దౌత్య మఙ్గీకృత్య శ్రీకృష్ణస్య కౌరవసదసి గన్తు ముద్యమనమ్, తయో రేతద్విషయే సంవాదశ్చ.

యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునకు తన అభిప్రాయమును వెల్లడించుట, అతని దౌత్యము నంగీకరించి శ్రీకృష్ణుడు కౌరవసభ కరుగ దలచుట, ఈ విషయమున వారిరువురి సంవాదము.

వైశమ్పాయన ఉవాచ - వైశమ్పాయను డిట్లు చెప్పెను.

సఞ్జయే ప్రతియాతే తు ధర్మరాజో యుధిష్ఠిరః,
అభ్యభాషత దాశార్హ మృషభం సర్వసాత్వతామ్. 1

సంజయుడు తిరిగి వెళ్ళిన తరువాత ధర్మరాజైన యుధిష్ఠిరుడు సాత్వత శ్రేష్ఠుడగు శ్రీకృష్ణునితో నిట్లు ప్రసంగము చేసెను.

అయం స కాలః సమ్ప్రాప్తో మిత్రాణాం మిత్రవత్సల,
న చ త్వదన్యం పశ్యామి యో న ఆపత్సు తారయేత్. 2

---

* భగవంతుడగు శ్రీకృష్ణుడు దౌత్యమునకై యరిగిన వృత్తాంతము గల పర్వము.

2. మిత్రవత్సల - మిత్రులయందు, బిడ్డలయందు, తలిదండ్రుల యందు సహజప్రేమ గలవాడా!

కృష్ణా! మిత్రులకు తోడ్పడవలసిన కాలము వచ్చినది. మిత్రులయందు వత్సలత గల మహానుభావా! మమ్ములను ఆపదలు గట్టెంచువాడవు నీవు కాక మఱియొకడు లేడు.

త్వాం హి మాధవ మాశ్రిత్య నిర్భయా మోఘదర్పితమ్,
ధార్తరాష్ట్రం సహామాత్యం స్వయం సమనుయుజ్మహే. 3

మాధవుడగు నిన్ను శరణు పొంది భయము లేనివారమై పనికిమాలిన గర్వము గల ఆ దుర్యోధనుని, వాని మంత్రులతోపాటు, స్వయముగా ప్రార్థింతుము.

యథా హి సర్వాస్వాపత్సు పాసి వృష్ణీ నరిందమ,
తథా తే పాణ్డవా రక్ష్యాః పాహ్యస్మాన్ మహతో భయాత్. 4

శత్రుసంహారకా! నీవు వృష్ణివంశమువారిని ఆపద లన్నింటినుండి కాపాడునట్లు ఈ పాండవులను కూడ నీవు కాపాడవలయును. మమ్ము ఈ పెను భయమునుండి రక్షింపుము.

శ్రీభగవా నువాచ - శ్రీభగవంతు డిట్లు పలికెను.

అయమస్మి మహాబాహో బ్రూహి యత్తే వివక్షితమ్,
కరిష్యామి హి తత్సర్వం యత్త్వం వక్ష్యసి భారత. 5

ఓ మహాబాహూ! ఇదిగో నేనిట నున్నాను. నీవు చెప్పదలచినది చెప్పుము. నీ వేమి చెప్పుదువో యది యంతయు నేను చేసెదను గదా!

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు చెప్పెను.

శ్రుతం తే ధార్తరాష్ట్రస్య సపుత్రస్య చికీర్షితమ్,
ఏతద్ధి సకలం కృష్ణ సఞ్జయో మాం యదబ్రవీత్. 6

ఆ ధృతరాష్ట్రుడు, వాని కొడుకును చేయదలచినది సంజయుడు నాకు చెప్పగా కృష్ణా! అది యంతయు నీవు వినియుంటివి గదా!

---

3. మోఘదర్పితః - పనికిమాలిన బింకము కలవాడు;
అనుయుజ్మహే - ప్రార్థింతుము.

తన్మతం ధృతరాష్ట్రస్య సోఽస్యాత్మా వివృతాన్తరః,
యథోక్తం దూత ఆచష్టే వధ్యః స్యాదన్యథా బ్రువన్. 7

అది ధృతరాష్ట్రుని అభిప్రాయము. ఆ సంజయుడు అతని ఆత్మ. అతని హృదయము తెలిసినవాడు. దూత రాజు చెప్పినది చెప్పును. వేరు విధముగా చెప్పినచో చంపదగినవా డగును.

అప్రదానేన రాజ్యస్య శాన్తి మస్మాసు మార్గతి,
లుబ్ధః పాపేన మనసా చరన్నసమ మాత్మనః. 8

ఆ పిసినిగొట్టు పాపబుద్ధితో సమముగా ప్రవర్తింపక రాజ్యమీకయే మనయందు శాంతిని అపేక్షించుచున్నాడు.

యత్త ద్ద్వాదశవర్షాణి వనేషు హ్యుషితా వయమ్,
ఛద్మనా శరదం చైకాం ధృతరాష్ట్రస్య శాసనాత్. 9

ధృతరాష్ట్రుని ఆజ్ఞమేరకు మేము పండ్రెండేండ్లు అడవులలో నివసించితిమి. ఒక యేడు అజ్ఞాతముగా (గుట్టుగా) నుంటిమి.

స్థాతా నః సమయే తస్మిన్ ధృతరాష్ట్ర ఇతి ప్రభో,
నాహాస్మ సమయం కృష్ణ తద్ధి నో బ్రాహ్మణా విదుః. 10

పదునాల్గవ యేట, మాటకు కట్టుబడి, చెప్పినమాట ప్రకారము మాకు రాజ్య మొసగలేదు. అది బ్రాహ్మణు లెరుగుదురు.

గృద్ధోఽ్రి రాజా ధృతరాష్ట్రః స్వధర్మం నానుపశ్యతి,
వశ్యత్వాత్ పుత్రగృద్ధిత్వా న్మన్దస్యాన్వేతి శాసనమ్. 11

లోభియగు ధృతరాష్ట్రుడు తన ధర్మమును పరికించుట లేదు. కొడుకు చెప్పుచేతలలో చిక్కి వాని మాట వెంటబడి పోవుచున్నాడు.

---

7. వివృతాన్తరః - వెల్లడి చేయబడిన హృదయభావము కలవాడు. ధృతరాష్ట్రుని హృదయ మెరిగినవాడని తాత్పర్యము.

10. స్థాతా - నిలుచును, నః = మాయొక్క, పదునాల్గవ యేట నీవు రాజ్యము కొనుమను మాటను పాటింపకున్నాడని తాత్పర్యము.

సుయోధనమతే తిష్ఠన్ రాజాఽస్మాసు జనార్దన,
మిథ్యా చరతి లుబ్ధః సన్ చరన్ హి ప్రియమాత్మనః. 12

జనార్దనా! ఆ రాజు సుయోధనుని ఇష్టము మేరకు లోభియై తనకు ప్రియము చేసికొనుచు కపటముగా ప్రవర్తించుచున్నాడు.

ఇతో దుఃఖతరం కిం ను యదహం మాతరం తతః,
సంవిధాతుం న శక్నోమి మిత్రాణాం వా జనార్దన. 13

జనార్దనా! ఇంతకంటె పెద్ద దుఃఖ మేముండును? నేను తల్లిని, మిత్రులను చక్కగా పోషించుకొనలేకున్నాను.

కాశిభి శ్చేదిపాఞ్చాలై ర్మాత్స్యైశ్చ మధుసూదన,
భవతా చైవ నాథేన పఞ్చగ్రామా వృతా మయా. 14

కాశి చేది పాంచాల మత్స్యరాజులు మధుసూదనా! నీవును దిక్కుగా నున్న నేను చివరకు అయిదూళ్ళిమ్మంటిని.

అవిస్థలం వృకస్థలం మాకన్దీ వారణావతమ్,
అవసానం చ గోవిన్ద కఞ్చిదేవాత్ర పఞ్చమమ్. 15

అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారణావతము ఏదో ఒకటి అయిదవదియు, గోవిందా! బ్రదుకుతుదిదాక ఇమ్మని నే నడిగితిని.

పఞ్చ నస్తాత దీయన్తాం గ్రామా వా నగరాణి వా,
వసేమ సహితా యేషు మా చ నో భరతా నశన్. 16

మేము నివసించుటకు అయిదూళ్లో, నగరములో ఇచ్చిన చాలును. మావలన భరతవంశమువారు నశింపకుందురు గాక!

---

13. సంవిధాతుమ్ - చక్కగా సాకుటకు - తల్లిని, మిత్రులగు విదురాదులను పోషింపలేనివాడనైతిని. వారందున్నారు అని దుఃఖము.

14. నాథేన - మీ యనుగ్రహముచేత శక్తిమంతుడనై యుండియు అని భావము.

15. అవసానమ్ - బ్రతుకుకడదాక - బ్రతికియుండునంత కాలము.

16. నః - మాకొరకయి; భరతాః - భరతవంశము వారగు భీష్మాదులు; మా నశన్ - నశింపకుందురుగాక!

న చ తానపి దుష్టాత్మా ధార్తరాష్ట్రోఽనుమన్యతే,
స్వామ్య మాత్మని మత్వాఽసౌ వతో దుఃఖతరం ను కిమ్. 17

ఆ దుష్టబుద్ధి వారినికూడ మన్నింపడు. వాడు తనయందు ప్రభుత్వమును తలపోయుచున్నాడు. ఇంతకంటె మిక్కిలి కష్ట మేముండును?

కులే జాతస్య వృద్ధస్య పరవిత్తేషు గృధ్యతః,
లోభః ప్రజ్ఞాన మాహన్తి ప్రజ్ఞా హన్తి హతా హ్రియమ్. 18

మంచి కులమున పుట్టిన పెద్దవాడు, పరుల సొమ్ములకు కక్కుర్తి పడునేని ఆ లోభము వాని ప్రజ్ఞను నాశనము చేయును. అట్లు చచ్చిన తెలివి లజ్జను రూపుమాపును.

హ్రీ ర్హతా బాధతే ధర్మం ధర్మో హన్తి హతః శ్రియమ్,
శ్రీ ర్హతా పురుషం హన్తి పురుషస్యాధనం వధః. 19

చెడిన లజ్జ ధర్మమును బాధించును. ధర్మము చచ్చి ధనమును రూపుమాపును. ధనము నశించి పురుషుని చంపును. ధనము లేకపోవుటయే పురుషుని చావు.

అధనాద్ధి నివర్తన్తే జ్ఞాతయః సుహృదో ద్విజాః,
అపుష్పా దఫలా ద్వృక్షా ద్యథా కృష్ణ పతత్రిణః. 20

చుట్టములు, చెలిమికాండ్రు, బ్రాహ్మణులు దరిద్రునినుండి మరలిపోవుదురు. పూవులు పండ్లు లేని చెట్లుపై పక్షు లుండవు గదా!

---

17. తాన్ - అపి - భీష్మాదులను కూడ; న అనుమన్యతే-మన్నింపకున్నాడు; స్వామ్యమ్ - స్వామిత్వమును - నేనే వీరందరకు స్వామిని అని తలపోయుచున్నాడని భావము. అతః దుఃఖతరం కిమ్?-వారిని నేను కాపాడదలచుకొన్నను వాడు కాపాడదలచుచున్నాడు - ఇంతకంటె దుఃఖము ఏమున్నది ? యని భావము.

18, 19- ఈ రెండు శ్లోకములలో గర్వమువలన పుట్టు అనర్థపరంపరను చెప్పుచున్నారు.

20. ద్విజాః - యాచకులైన బ్రాహ్మణు లని భావము.

ఏతచ్చ మరణం తాత యన్మత్తః పతితాదివ,
జ్ఞాతయో వినివర్తన్తే ప్రేతసత్త్వాదివాసవః. 21

చుట్టములు, మరణించిన దేహమునుండి ప్రాణములు పోయినట్లు, నేనేదో భ్రష్టుడ నన్నట్లు, నన్ను వదలి పోవుచున్నారు. ఇది నాకు చచ్చిన చావుగా నున్నది.

నాతః పాపీయసీం కాఞ్చిదవస్థాం శమ్బరోఽబ్రవీత్,
యత్ర నైవాద్య న ప్రాతర్భోజనం ప్రతిదృశ్యతే. 22

ఇంతకంటె పరమనికృష్టమైన అవస్థను దేనిని శంబరుడును చెప్పలేదు. నేటికనియే కాదు, ఈ పూటకు కూడ కానవచ్చుట లేదు.

ధనమాహుః పరం ధర్మం ధనే సర్వం ప్రతిష్ఠితమ్,
జీవన్తి ధనినో లోకే మృతా యే త్వధనా నరాః. 23

ధనమునే పరమధర్మముగా వక్కాణింతురు. ధనమునందే అంతయు నెలకొనియుండును. లోకమున ధనవంతులే బ్రదుకుదురు. ధనములేని నరులు చచ్చినవారే.

యే ధనా దపకర్షన్తి నరం స్వబల మాస్థితాః,
తే ధర్మ మర్థం కామం చ ప్రమథ్నన్తి నరం చ తమ్. 24

బలము పుంజుకొని యెవరు గాని ఒక నరుని ధనమునుండి తొలగించిరేని వా రా నరుని, ఆతని ధర్మమును, అర్థమును, కామమును గూడ కాలరాచివైచెదరు.

ఏతా మవస్థాం ప్రాప్యైకే మరణం వవ్రిరే జనాః,
గ్రామా యైకే వనా యైకే నాశా యైకే ప్రవవ్రజుః. 25

---

21. ప్రేతసత్త్వాత్ - బుద్ధిపోయిన వానినుండి - చచ్చినవానినుండి అని తాత్పర్యము.

23. ధర్మమ్ - ధర్మకారణమని భావము; సర్వమ్ - యజ్ఞము, దానము మొదలగునవి;

25. ఏతామ్ - ఈ దరిద్రతను; ప్రాప్య - పొంది; ఏకే - కొందరు - నగరవాసులని భావము; గ్రామాయ - పల్లె బ్రదుకునకు; వనాయ - మావతెఅడవులకై; నాశాయ - చచ్చుటకు.

ఇట్టి పేదరికపు అవస్థను పొందిన కొందరు చావునే వరించిరి. కొందరు పల్లెలకు పారిపోయిరి. మఱికొందరు అడవుల బడిరి. మరికొందరు సర్వనాశనము పొందిరి.

ఉన్మాద మేకే పుష్యన్తి యాన్త్యన్యే ద్విషతాం వశమ్,
దాస్య మేకే చ గచ్ఛన్తి పరేషా మర్థహేతునా. 26

ధనము కారణముగా కొందఱు పిచ్చివా రగుదురు. కొందఱు పగవారి పాలగుదురు. కొందరు ఇతరులకు దాసు లగుదురు.

ఆపదేవాస్య మరణాత్ పురుషస్య గరీయసీ,
శ్రియో వినాశ స్తద్ధ్యస్య నిమిత్తం ధర్మకామయోః. 27

ధనము పోవుట అను నీ ఆపద చావుకంటె ఘోరమైనది. ఏలయన ధనమే కదా ధర్మకామములకు హేతువు.

యదస్య ధర్మ్యం మరణం శాశ్వతం లోకవర్త్మ తత్,
సమంతాత్ సర్వభూతానాం న తదత్యేతి కశ్చన. 28

చావు అనునది యున్నదే - అది తప్పనిదగు లోకవర్తనము. ధర్మబద్ధమైనదియే. కనుక అన్ని ప్రాణులకు అది పోద్రోవరానిది. దాని నెవ్వడు మీరజాలడు.

న తథా బాధ్యతే కృష్ణ ప్రకృత్యా నిర్ధనో జనః,
యథా భద్రాం శ్రియం ప్రాప్య తయా హీనః సుఖైధితః. 29

కృష్ణా! చక్కని సంపద నొంది సుఖములతో వృద్ధిపొందినవాడు పిమ్మట ధనము కోల్పోయి పడు అవస్థ పుట్టుపేద అవస్థకంటె మించినది.

---

27. తద్ధి - ధనమే కదా!

28. ధర్మ్యమ్ - దేహస్వభావమువలన వచ్చినది - అంతేకాని లేమివలన నయ్యేడిది కానిది; మరణమ్ - చావు; తత్ - అది; శాశ్వతమ్ - నెపము లేనిది; సమన్తాత్ - అన్నియెడల, పరిహరింపరానిదని కలిపికొనవలయును; న - అత్యేతి - మీరజాలడు.

స తదాత్మాపరాధేన సంప్రాప్తో వ్యసనం మహత్,
సేన్ద్రాన్ గర్హయతే దేవాన్ నాత్మానం చ కథఞ్చన. 30

చేతులార ముప్పు తెచ్చుకొన్న ఆ నరుడు పెనుకష్టములపాలై ఇంద్రునితో పాటు సర్వదేవతలను తిట్టుచుండును. తన తప్పుమాత్ర మెన్నటికిని గుర్తింపడు.

న చాస్య సర్వశాస్త్రాణి ప్రభవన్తి నిబర్హణే,
సోఽభిక్రుధ్యతి భృత్యానాం సుహృదశ్చాభ్యసూయతి. 31

ఆ కష్టము రాకుండుట కతనికి శాస్త్రము లన్నియు అక్కరకు రావు. అతడు సేవకులపై తీవ్రకోపము వెలిగ్రక్కును. మిత్రులను తప్పుపట్టుచుండును.

త త్తదా మన్యురేవైతి స భూయః సంప్రముహ్యతి,
స మోహవశ మాపన్నః క్రూరం కర్మ నిషేవతే. 32

ఎల్లవేళల నాతనికి కోపము పెల్లుబికుచుండును. దానితో ఒడ లెరుగని తనము వచ్చును. దానివలన క్రూరకర్మముల కలవాటుపడును.

పాపకర్మతయా చైవ సఙ్కరం తేన పుష్యతి,
సఙ్కరో నరకా యైవ సా కాష్ఠా పాపకర్మణామ్. 33

పాపపు పనులవలన ఆతడు సంకరమును పండించును. సంకరము వలన నరకమే సిద్ధించును. అది పాపకర్ముల కట్టకడపటి దశ.

న చేత్ప్రబుధ్యతే కృష్ణ నరకాయైవ గచ్ఛతి,
తస్య ప్రబోధః ప్రజ్ఞైవ ప్రజ్ఞాచక్షు స్తరిష్యతి. 34

---

30. తదా - సంపద ఉన్నవేళ; ఆత్మాపరాధేన - బుద్ధిదోషముచేత; రాగాదికము చేతనని భావము.

31. అస్య - వ్యసనముయొక్క; నిబర్హణే - నిలువద్రొక్కుటయందు.

32. త త్తదా - అన్ని వేళలయందును అని భావము; మన్యుః - క్రోధము; సః - ఆ క్రోధము గలవాడు; సంప్రముహ్యతి - కార్యమిది, అకార్యమిది యని యెరుగడని భావము.

34. సంపదలేని వానికి నరకము కలుగునని చెప్పి దాని నుండి వెలికివచ్చు ఉపాయమును చెప్పుచున్నారు. తస్య - శ్రీమంతునకు; అజ్ఞానముచేత నిద్రించుచున్నవానికి; ప్రజ్ఞా - వివేకము; ప్రబోధః - మేల్కొనుట; తరిష్యతి - అవిద్యను దాటునని భావము.

కృష్ణా! అప్పటికైన మేల్కొనడేని నరకమునకే పోవును. వివేకమే ఆతనిని మేల్కొల్పును. వివేక మను చూపు గలవాడు తరించును.

ప్రజ్ఞాలాభే హి పురుషః శాస్త్రాణ్యే వాన్వవేక్షతే,
శాస్త్రనిష్ఠః పునర్ధర్మం తస్య హ్రీ రఙ్గ ముత్తమమ్. 35

వివేకము సాధించిన పురుషుడు శాస్త్రములనే పరికించును. శాస్త్రములందు చెదరని బుద్ధికలవాడు ధర్మమునే ఆచరించును. ఆతనికి లజ్జ యనునది ఉత్తమ మగు అంగము.

హ్రీమాన్ హి పాపం ప్రద్వేష్టి తస్య శ్రీరభివర్ధతే,
శ్రీమాన్ స యావద్భవతి తావద్భవతి పూరుషః. 36

లజ్జ కలవాడు పాపమన్నచో కక్కసించుకొనును. వానికి సంపద వృద్ధి పొందును. అట్టివాడు బ్రదికియుండునంతవరకు శ్రీమంతుడే యగును.

ధర్మనిత్యః ప్రశాన్తాత్మా కార్యయోగవహః సదా,
నాధర్మే కురుతే బుద్ధిం న చ పాపే ప్రవర్తతే. 37

ధర్మమును విడనాడనివాడు, ప్రశాంతమగు చిత్తము కలవాడు, ఆ యా పనులయందు చక్కగా ప్రవర్తించును. అధర్మమున బుద్ధిపెట్టడు. పాపము నందు ప్రవర్తింపడు.

అహ్రీకో వా విమూఢో వా నైవ స్త్రీ న పునః పుమాన్,
నాస్యాధికారో ధర్మేఽస్తి యథా శూద్ర స్తథైవ సః. 38

సిగ్గులేనివాడు, వివేకములేనివాడు స్త్రీయు గాడు. పురుషుడు గాడు. వానికి ధర్మ మాచరించు అధికారము లేదు. వాడు శూద్రునివంటివాడు.

హ్రీమా నవతి దేవాంశ్చ పితౄనాత్మాన మేవ చ,
తేనామృతత్వం వ్రజతి సా కాష్ఠా పుణ్యకర్మణామ్. 39

---

35. దాటుటలోని క్రమమును చెప్పుచున్నారు. హ్రీః-తప్పుడు పనులు చేయుటకు జంకుట - తస్య హ్రీ రఙ్గముత్తమమ్ - లజ్జలేనివాడు చేయు ధర్మముకూడ అధర్మమే యగునని భావము.

38. యథా శూద్రః— ఇచట శూద్రశబ్దము ధర్మభ్రష్టుని సూచించును.

లజ్జకలవాడు దేవతలను, పితృదేవతలను, తన్ను కాపాడును. దానిచేత అమృతత్వమును పొందును. అది పుణ్యము చేయువారు పొందు తుదిదశ.

తదిదం మయి తే దృష్టం ప్రత్యక్షం మధుసూదన,
యథా రాజ్యాత్ పరిభ్రష్టో వసామి వసతీ రిమాః. 40

మధుసూదనా! ఆ లక్షణము నాయందు నీవు కన్నులార చూచితివిగదా! రాజ్యము కోల్పోయియు నిన్ని బ్రదుకులు బ్రదికితిని.

తే వయం న శ్రియం హాతు మలం న్యాయేన కేనచిత్,
అత్ర నో యతమానానాం వధ శ్చేదపి సాధు తత్. 41

అట్టి మేము ఏ న్యాయముచేతను సంపదను వదలుకొనరాదు. ఇందు ప్రయత్నించు మాకు చావు వచ్చినను మేలే.

తత్ర నః ప్రథమః కల్పో యద్వయం తే చ మాధవ,
ప్రశాన్తాః సమభూతాశ్చ శ్రియం తా మశ్నువీమహి. 42

అందు మాకు మొదటి సంకల్పము మేమును, వారును కలతలేనివారమై పగను విడనాడి సంపదను సమముగా ననుభవింపవలయు ననునది.

తత్రైషా పరమా కాష్ఠా రౌద్రకర్మక్షయోదయా,
యద్వయం కౌరవాన్ హత్వా తాని రాష్ట్రాణ్యవాప్నుమః. 43

చిట్టచివరిదశ యన్ననో పరమభయంకరమైన సర్వనాశనము. మేమా కౌరవులను చంపి ఆ రాష్ట్రములను చేజిక్కించుకొనవలయును.

---

40. పాపకార్యములకు సిగ్గుపడనివాడు పశువులతో పక్షులతో సమానుడని భావము.

41. అత్ర - సంపదకొరకు; నః - మాకు;

42. ప్రథమః కల్పః - మొదటి పక్షము; సమభూతాః - పగలేనివారమై.

43. రౌద్రకర్మ - రౌద్రకర్మములకు, పరమా కాష్ఠా - తుదిదశ అని సంబంధము చెప్పుకొనదగును; క్షయోదయా - క్షయము మున్నుగా గల ఉదయము గలది - క్షయమే - నాశమే ఉదయముగా భావింపవలసినది అని భావము.

యే పునః స్యు రసంబద్ధా అవార్యాః కృష్ణ శత్రవః,
తేషా మప్యవధః కార్యః కిం పునర్యే స్యురీదృశాః. 44

కృష్ణా ! చుట్టరికము లేని వారును, పరమనీచులు నగు పగవారిని కూడ చంపరా దన్నచో ఇట్టి వారి విషయము చెప్పనేల ?

జ్ఞాతయ శ్చైవ భూయిష్ఠాః సహాయా గురవశ్చ నః,
తేషాం వధోఽతిపాపీయాన్ కిం ను యుద్ధేఽస్తి శోభనమ్. 45

వారు మాకు మిక్కిలి దగ్గర బంధువులు. వారికి తోడ్పడువారు మాకు గురువులు. వారందరిని వధించుట మిక్కిలి పాపము. ఇక యుద్ధమున మేలేమి గలదు ?

పాపః క్షత్రియధర్మోఽయం వయం చ క్షత్రబన్ధవః,
స నః స్వధర్మో ధర్మో వా వృత్తి రన్యా విగర్హితా. 46

క్షత్రియధర్మ మిది ఎంత పాపమైనది ! మనమేమో క్షత్రబంధువులము. అది మనకు స్వధర్మము. ధర్మమైనను పెరధర్మము నిందకు పాత్రమగును.

శూద్రః కరోతి శుశ్రూషాం వైశ్యా వై పణ్యజీవికాః,
వయం వధేన జీవామః కపాలం బ్రాహ్మణై ర్ధృతమ్. 47

శూద్రుడు సేవ చేయును. వైశ్యులు వ్యాపారముతో బ్రతుకుదురు. మనము వధయొనర్చి బ్రదుకుదుము. బ్రాహ్మణులు భిక్షాపాత్రను చేపట్టిరి.

క్షత్రియః క్షత్రియం హన్తి మత్స్యో మత్స్యేన జీవతి,
శ్వా శ్వానం హన్తి దాశార్హ పశ్య ధర్మో యథాగతః. 48

---

44. అసంబద్ధాః - చుట్టములు కానివారు; అవధః - వధము చేయకుండుట - రక్షించుట అని భావము. ఈదృశాః - బంధువులు, ఆర్యులు, శత్రువులు కానివారు అయిన కౌరవులను చంపరా దనుటలో ఆశ్చర్యమేమి ? అని భావము.

45. భూయిష్ఠాః - మిక్కిలి పెద్దవారు.

46. క్షత్రబన్ధవః - పాడుక్షత్రియు లన్నట్లు ఇది యొక తిట్టుగా వ్యవహరించు పదము.

48. యథా - ఏ పద్ధతిగా; ఆగతః - వచ్చిపడినదో; పశ్య - చూడు అని సంబంధము.

కృష్ణా! క్షత్రియుడు క్షత్రియుని చంపును. చేప చేపలను తిని బ్రదుకును. కుక్క కుక్కను పరిమార్చును. చూడవయ్యా! ధర్మమెట్లైనదో!

యుద్ధే కృష్ణ కలి ర్నిత్యం ప్రాణాః సీదన్తి సంయుగే,
బలం తు నీతి మాధాయ యుధ్యే జయపరాజయౌ. 49

కృష్ణా! యుద్ధమున పాపము తప్పదు. తలపడినచో ప్రాణములు పోవును. అయినను నీతిబలముతో పోరుదును. యుద్ధమున గెలుపోటములు మన ఇష్టమును బట్టి కలుగవు.

నాత్మచ్ఛన్దేన భూతానాం జీవితం మరణం తథా,
నాప్యకాలే సుఖం ప్రాప్యం దుఃఖం వాఽపి యదూత్తమ. 50

ప్రాణులకు తమ యిచ్చమేరకు బ్రదుకో, చావో కలుగదు. పొందవలసిన సుఖమో దుఃఖమో, కాలము కలసిరానిచో కలుగదు.

ఏకో హ్యపి బహూన్ హన్తి ఘ్నన్త్యేకం బహవోఽప్యుత,
శూరం కాపురుషో హన్తి అయశస్వీ యశస్వినమ్. 51

ఒక్కడు చాలమందిని చంపును. అనేకు లొక్కనిని జంపుదురు. శూరుని నీచుడు చంపును. పేరుప్రఖ్యాతులు లేనివాడు పేరొందిన వీరుని చంపును. (యుద్ధమున నిట్టివి సంభవించునని తాత్పర్యము).

జయో నైవోభయో ర్దృష్టో నోభయోశ్చ పరాజయః,
తథైవాపచయో దృష్టో వ్యపయానే క్షయవ్యయౌ. 52

రెండుపక్షములకు జయము కలుగదు. రెండుపక్షములకు ఓటమియు కలుగదు. ఓటమి యగునని పారిపోయినచో దీనత, నాశము, వ్యయము కలుగుట కన్పట్టుచునే యున్నది.

---

49 బలం తు నీతి మాధాయ యుధ్యే - నీతినే బలముగా చేసికొని పోరుదును; జయపరాజయౌ అను పదముతో తరువాతి శ్లోకమునందలి న + ఆత్మ చ్ఛన్దేన అనుదానిని కలుపుకొనవలయును - గెలుపోటములు తన యిష్ట మునుబట్టి కలుగవని తాత్పర్యము.

52. పరాజయము కలుగునని యుద్ధమునుండి విరమించినచో దీనత, మరణము, వ్యయము కలుగునుగాన యుద్ధము మానిపోవుటయు, శ్రేయస్కరము కాదని తాత్పర్యము.

సర్వథా వృజినం యుద్ధం కో ఘ్నన్న ప్రతిహన్యతే,
హతస్య చ హృషీకేశ సమౌ జయపరాజయౌ. 53

హృషీకేశా! అన్ని విధముల పోరు పాపమే. తన్ను కొట్టువానిని కొట్టక నరుడు ఊరకుండునా? కావున దెబ్బతిన్నవానికిని గెలుపోటములు సమానములే.

పరాజయశ్చ మరణా న్మన్యే నైవ విశిష్యతే,
యస్య స్యా ద్విజయః కృష్ణ తస్యాప్యపచయో ధ్రువమ్. 54

ఓటమి చావుకంటె మేలైనదిగా భావింపను. గెలుపొందినవానికిని దైన్యము తప్పదు.

అన్తతో దయితం ఘ్నన్తి కేచి దప్యపరే జనాః,
తస్యాఙ్గ బలహీనస్య పుత్రాన్ భ్రాతౄ నపశ్యతః. 55

గెలుపొందెనే యనుకొనుము. కొడుకులు, అన్నదమ్ములు మొదలగువారు చచ్చిరి గదా! పగవానికి సంబంధించిన యితర జనులు తన ప్రేమపాత్రుని చంపుదురు.

నిర్వేదో జీవితే కృష్ణ సర్వత శ్చోపజాయతే. 56

అట్లు తనవారు మిగులక పొందిన గెలుపువలన బ్రదుకున దుఃఖమే ఎటు చూచినను కలుగును.

యే హ్యేవ ధీరా హ్రీమన్త ఆర్యాః కరుణవేదినః,
త ఏవ యుద్ధే హన్యన్తే యవీయాన్ ముచ్యతే జనః. 56

ఎవరు ధీరులో సిగ్గు బిడియములు కలవారో, మంచి నడవడి కలవారో, దయ, ధర్మము తెలిసినవారో వారే పోరులలో చత్తురు. తక్కువవాడు తప్పుకొనును.

---

54. గెలుపు కలిగినను ఇష్టజన నాశమగును కావున అదియు పరాజయము వంటిదే యనుచున్నారు.

55. దయితమ్ - ప్రియుని - కొడుకు మొదలగు వారిని;
బలహీనస్య - జాతిబలము నశించినవానికి;

56. కరుణవేదినః - దయాధర్మములు తెలిసినవారు;

హత్వాఽ ప్యనుశయో నిత్యం పరానపి జనార్దన. 57

శత్రువులను చంపినను, జనార్దనా! పశ్చాత్తాపము నిత్యము క్రుంగదీయును.

అనుబన్ధశ్చ పాపోఽత్ర శేషశ్చాస్యావశిష్యతే,
శేషో హి బల మాసాద్య న శేష మనుశేషయేత్. 58

దానినంటి పాపము వచ్చును. మరియు పగవారివైపు మిగిలిపోయినవారుందురు. వారు బలము పుంజుకొని గెలిచినవారి పక్షమున మిగిలినవారిని మిగులనీయరు.

సర్వోచ్ఛేదే చ యతతే వైరస్యాన్తవిధిత్సయా,
జయో వైరం ప్రసృజతి దుఃఖమాస్తే పరాజితః. 59

అట్లు పగవారిలో మిగిలినవాడు పగను తుదముట్టింపగోరి గెలిచినవానిని కూకటివ్రేళ్ళతో పెకలించివైచుటకు ప్రయత్నించును. ఇట్లు గెలుపు పగను సృజించును. ఓడినవాడు దుఃఖపడుచుండును.

సుఖం ప్రశాన్తః స్వపితి హిత్వా జయపరాజయౌ,
జాతవైరశ్చ పురుషో దుఃఖం స్వపితి నిత్యదా. 60

గెలుపోటములను పట్టించుకొనక ప్రశాంతముగా నుండువాడు సుఖముగా నిద్రించును. పగపట్టిన పురుషుడు ప్రతిదినము దుఃఖముతో పండుకొనును.

అనిర్వృతేన మనసా ససర్ప ఇవ వేశ్మని,
ఉత్సాదయతి యః సర్వం యశసా స విముచ్యతే. 61

సుఖములేని మనసుగల జనుడు పామున్న యింటిలో నున్నవాని వలె సర్వమును పాడుచేసికొనును. వానికి మునుపున్న కీర్తియు జారిపోవును.

అకీర్తిం సర్వభూతేషు శాశ్వతీం స నియచ్ఛతి,
న హి వైరాణి శామ్యన్తి దీర్ఘకాలధృతాన్యపి. 62

---

57. అనుశయః - పశ్చాత్తాపము

58. శేషః - శత్రువువైపు మిగిలినవారు, శేషం- తన పక్షమున మిగిలినవారిని, న అనుశేషయేత్ - మిగులనీయరు.

అట్టివాడు ఎన్నడు చెడని అపకీర్తిని సర్వభూతములనుండియు పొందును. ఎంత కాలము పట్టి వ్రేలినను పగలు అణగవు గదా!

న చాపి వైరం వైరేణ కేశవ వ్యుపశామ్యతి,
హవిషాగ్ని ర్యథా కృష్ణ భూయ ఏవాభివర్ధతే. 63

కేశవా! పగతో పగ యణగదు. హోమపదార్థముతో అగ్ని ప్రజ్వరిల్లి నట్లు మరల మరల వృద్ధి పొందుచునే యుండును.

అతోఽన్యథా నాస్తి శాన్తి ర్నిత్య మన్తర మన్తతః. 64

ఇట్లు దోషము తప్పదు. ఎవరికో చావు మూడక శాంతి కలుగదు.

అన్తరం లిప్సమానానా మయం దోషో నిరన్తరః,
పౌరుషే యో హి బలవా నాధి ర్హృదయబాధనః,
తస్య త్యాగేన వా శాన్తి ర్మరణేనాపి వా భవేత్. 65

దోషము వెదకు వారిలో ఈ దోషము ఎడతెగక యుండును. మగతనము విషయమున బలవంతుడగువాడు మనోవ్యాధి వంటివాడై హృదయమును బాధించు చుండును. వానిని వదిలి వైచుట చేతనో, మరణము చేతనో శాంతి ఘటిల్లును.

అథవా మూలఘాతేన ద్విషతాం మధుసూదన,
ఫలనిర్వృత్తి రిద్ధా స్యా న్న నృశంసతరం భవేత్. 66

అట్లుకాక శత్రువులను వ్రేళ్ళతో పెకలించివైచినచో ఫలసిద్ధి దేదీప్యమానముగా నగును. అది పెద్ద ఘోరము కాదు.

---

65. 64వ శ్లోకమున చెప్పిన దోషమును దీనియందు వ్యాఖ్యానించుచున్నారు. ఒక పక్షమున బలవంతుడున్నను పగ పెరుగుచుండును. వానిని వదలుట వలననో, వాని చావువలననో మాత్రమే పగ యణగునని శ్లోక తాత్పర్యము.

66. బాగుగా బలము పుంజుకొని పగవారిని కూకటివ్రేళ్ళతో పెకలించి వైచెదము అన్న పక్షమున ఫలము సిద్ధించుటలో సందేహము లేదు. అది అంత ఘోరమైన విషయముకూడ కాదు. కాని కొంతవరకు క్రూరమైన సంగతియే కదా! అని భావము.

యా తు త్యాగేన శాన్తిః స్యా త్తదృతే వధ ఏవ సః,
సంశయా చ్చ సముచ్ఛేదా ద్ద్విషతా మాత్మన స్తథా. 67

పోనీ: రాజ్యమును వదలివైచి శాంతి పొందుదమన్నచో, అది చావే యగును. శత్రువుల ప్రవృత్తి సందేహముతో కూడినను, తాను నశించుట తథ్యము కనుక రాజ్యము వలదనుకొనుట వధతో సమానము.

న చ త్యక్తుం తదిచ్ఛామో న చేచ్ఛామః కులక్షయమ్,
అత్ర యా ప్రణిపాతేన శాన్తిః సైవ గరీయసీ. 68

కావున రాజ్యమును వదలుకొనుటయు కోరము. అట్లని, కులక్షయమును కాంక్షింపము. ఇక వేడికొనుటవలన శాంతి చేకూరినచో అది చాల మేలైనది.

సర్వథా యతమానానా మయుద్ధ మభికాఙ్క్షతామ్,
సాన్త్వే ప్రతిహతే యుద్ధం ప్రసిద్ధం నాపరాక్రమః. 69

శాంతికై అన్నివిధముల ప్రయత్నించు వారికి, పోరు కారాదని కోరు వారికి మంచితనము దెబ్బతిన్నపుడు యుద్ధము తప్పనిదే యగును. అప్పుడు పరాక్రమము చూపకుండరాదు.

---

67. రాజ్యము వలదనుకొంద మన్నచో - అది చావుతో సమానము. వలదను కొన్నను శత్రువు ఊరకుండునో ఊరకుండడో యను సంశయము వలనను చావే. లేదా రాజ్యము లేని కారణమున సంపద నశించుట వలనను చావే యగును. కావున రాజ్యత్యాగము శ్రేయస్కరము కాదని భావము.

68. ఇట్టి స్థితిలో సిద్ధాంతము నీ శ్లోకమున చెప్పుచున్నారు. అటు రాజ్యము వలదనుకొనరాదు. ఇటు కులమును రూపుమాపరాదు. కావున బ్రతిమాలి శాంతి పొందుటయే అన్నింటికన్న మిన్న- అని భావము.

69. సర్వథా - సామదానభేదము లను ఉపాయములతో; యతమానానామ్ - రాజ్యముకొరకు ప్రయత్నించువారికి; యుద్ధమ్-యుద్ధమున; ప్రసిద్ధమ్ - తప్పనిసరిగా చేయదగినపని; అపరాక్రమః-పరాక్రమము చూపకుండుట; న-యుక్తము కాదని భావము.

ప్రతిఘాతేన సాన్త్వస్య దారుణం సంప్రవర్తతే,
తచ్ఛునా మివ సంపాతే పణ్డితై రుపలక్షితమ్. 70

సామమార్గము దెబ్బతిన్నచో దారుణమగు యుద్ధము జరుగును. అది కుక్కల కొట్లాట వంటిదని పండితులు భావింతురు.

లాఙ్గూలచాలనం క్ష్వేడా ప్రతివాచో వివర్తనమ్,
దన్తదర్శన మారావ స్తతో యుద్ధం ప్రవర్తతే. 71

తోక ఆడించుట, గురగురలాడుట, మొరుగునకు బదులు మొరుగుట, నేలపై దొరలుట, కోరలు చూపించుట, గందరగోళముగా నరచుట - ఆపై కొట్లాట సాగును.

తత్ర యో బలవాన్ కృష్ణ జిత్వా సోఽత్తి తదామిషమ్,
ఏవ మేవ మనుష్యేషు విశేషో నాస్తి కశ్చన. 72

చివరకు బలముగల కుక్క గెలిచి ఆ మాంసము భ్రమింగును. మనుష్యుల యందును ఇంతియే. విశేషమేమియు లేదు.

సర్వథా త్వేత దుచితం దుర్బలేషు బలీయసామ్,
అనాదరో విరోధశ్చ ప్రణిపాతీ హి దుర్బలః. 73

---

70. దారుణమగు యుద్ధము జరుగును. అది కుక్కల పోరువలె అతి నీచమైనదని భావము.

71. పై మాటనే వివరించుచున్నారు - లాఙ్గూలచాలనమ్ - తోక ఆడించుట, యుద్ధమున జెండా లెగురుట. దానివంటిదని భావము. క్ష్వేడా - గురగురలాడుట - అది యుద్ధమున నొకరినొకరు తిట్టుకొనుట వంటిది; ప్రతివాచః - మొరగునకు బదులు మొరుగుట - యుద్ధమున ఒకరినొకరు తప్పులుచూపి నిందించుకొనుట. తమ్ము తాము పొగడుకొనుట వంటిది, వివర్తనమ్ - నేలపై పొరలాడుట; దంతదర్శనమ్ - మొగము వికారముగా తెరచి అరచుట, ఆరావః - పెద్దగా మొరుగుట;

73. అనాదరః - వీడెంత యని యూరకుండుట - అట్లైనచో రాజ్యము దక్కదు; విరోధః - కయ్యము - అదియైనచో కులక్షయమగును; ప్రణిపాతీ - బ్రతిమాలువాడు - బ్రతిమాలుకొన్నచో దుర్బలుడన్న ప్రసిద్ధి యేర్పడును.

బలహీనుల విషయమున బలవంతుల కిది అన్ని విధముల ఉచితమగు పద్ధతి. పగవానిని లెక్కచేయకుండుట - కాదా పగ సాధించుట. వేడుకొనువాడు బలహీనుడే యగును.

పితా రాజా చ వృద్ధశ్చ సర్వథా మాన మర్హతి,
తస్మా న్మాన్య శ్చ పూజ్య శ్చ ధృతరాష్ట్రో జనార్దన. 74

జనార్దనా! ధృతరాష్ట్రుడు మాకు తండ్రి, రాజు, పెద్దవాడు. అన్ని విధముల మన్నింపదగినవాడు. కావున మే మతనిని మన్నింపవలయును. పూజింపవలయును.

పుత్రస్నేహ శ్చ బలవాన్ ధృతరాష్ట్రస్య మాధవ,
స పుత్రవశ మాపన్నః ప్రణిపాతం ప్రహాస్యతి. 75

మాధవా! ఆ ధృతరాష్ట్రునకు కొడుకుమీద ప్రేమ కొండంతటిది. అతడు కొడుకు త్రిప్పలకు లోబడి మా ప్రార్థనను మన్నింపడు.

తత్ర కిం మన్యసే కృష్ణ ప్రాప్తకాల మనన్తరమ్,
కథ మర్థాచ్చ ధర్మాచ్చ న హీయేమ హి మాధవ. 76

కృష్ణా! ఇప్పుడు మన మేమి చేయవలయును? నీ తలంపేమి? అర్థమునుండియు, ధర్మమునుండియు మేము చెడని విధమేమి?

ఈదృశేఽత్యర్థకృచ్ఛ్రేఽస్మిన్ కమన్యం మధుసూదన,
ఉపసంప్రష్టు మర్హామి త్వా మృతే పురుషోత్తమ. 77

ఇట్టి మహాకష్టము వచ్చిపడగా పురుషోత్తమా! మధుసూదనా! నిన్నుగాక మఱి యెవ్వనిని హిత మడుగుదును?

ప్రియశ్చ ప్రియకామశ్చ గతిజ్ఞః సర్వకర్మణామ్,
కోహి కృష్ణాఽస్తి నస్త్వాదృక్ సర్వనిశ్చయవిత్ సుహృత్. 78

---

75. ప్రహాస్యతి - వదలును - స్వీకరింపడు.
77. ఉపసంప్రష్టుమ్ - ప్రీతిగా దగ్గరకు జేరి హిత మడుగుటకు; త్వామ్, ఋతే - నిన్నుగాక.

కృష్ణా! ప్రియుడు, మా ప్రియము కోరువాడు, ఆయా సర్వకార్యముల స్థితిగతు లెరిగినవాడు, చక్కని నిశ్చయములు తెలిసినవాడు, స్నేహము నిండిన వాడు - మాకు నీవంటివాడు ఎవడు గలడు?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవముక్తః ప్రత్యువాచ ధర్మరాజం జనార్దనః,
ఉభయో రేవ వామర్థే యాస్యామి కురుసంసదమ్. 79

ధర్మరా జిట్లు పలుకగా జనార్దనుడు ఇట్లు బదులు చెప్పెను. "మీ రెండు పక్షములవారికొరకే నేను కౌరవుల సభ కరుగుదును".

శమం తత్ర లభేయం చే ద్యుష్మదర్థ మహాపయన్,
పుణ్యం మే సుమహద్రాజం శ్చరితం స్యాన్మహాఫలమ్. 80

"మీపని చెడకుండ నేనందు శాంతిని సాధింప గలుగుదునేని రాజా! నా పుణ్యము పండినట్లు. గొప్ప ప్రయోజనము సిద్ధించినట్లు".

మోచయేయం మృత్యుపాశాత్ సంరబ్ధాన్ కురుసృఞ్జయాన్,
పాణ్డవాన్ ధార్తరాష్ట్రాం శ్చ సర్వాం చ పృథివీమిమామ్. 81

"కోపముతో పరవశ్ము ద్రొక్కుచున్న కౌరవులను, సృంజయులను, పాండుని కొడుకులను, దృతరాష్ట్రుని కొడుకులను, ఈ భూమినంతటిని మృత్యువు పాశమునుండి తప్పింప గలుగుదునేమో".

యుధిష్ఠిర ఉవాచ-యుధిష్ఠిరు డిట్లు పలికెను.

న మమైత న్మతం కృష్ణ యత్త్వం యాయాః కురూన్ ప్రతి,
సుయోధనః సూక్తమపి న కరిష్యతి తే వచః. 82

కృష్ణా! నీవు కౌరవుల కడ కరుగుట నా కిష్టముగాదు. నీ వెంత మంచి చెప్పినను సుయోధనుడు నీ మాటను పాటింపడు.

సమేతం పార్థివం క్షత్రం దుర్యోధనవశానుగమ్,
తేషాం మధ్యావతరణం తవ కృష్ణ న రోచయే. 83

అక్కడ కూడబడిన రాజుల, క్షత్రియుల సముదాయమంతయు దుర్యోధనుని చెప్పుచేతులలో నున్నది. వారినడుమ నీవు దిగుట నాకు రుచింపదు.

న హి నః ప్రీణయేద్ ద్రవ్యం న దేవత్వం కుతః సుఖమ్,
న చ సర్వామరైశ్వర్యం తవ ద్రోహేణ మాధవ. 84

మాధవా! నీకు చేటు వచ్చినచో ధనము కాదు, దేవత్వము కాదు, దేవత లందరిపై ప్రభుత్వము కాదు, మఱి యేదియు మాకు ప్రీతి కలిగింపదు.

శ్రీ భగవానువాచ-శ్రీ భగవంతు డిట్లు పలికెను.

జనామ్యేతాం మహారాజ ధార్తరాష్ట్రస్య పాపతామ్,
అవాచ్యాస్తు భవిష్యామః సర్వలోకే మహీక్షితామ్. 85

మహారాజా! నీవు చెప్పిన దుర్యోధనుని చెడుబుద్ధి యెఱుగుదును. కాని (మనము మన ప్రయత్నము చేసినచో) సర్వలోకమునందలి రాజులకును మనము నింద్యులము కాకుండవలయును.

న చాపి మమ పర్యాప్తాః సహితాః సర్వపార్థివాః,
క్రుద్ధస్య సంయుగే స్థాతుం సింహస్యే వేతరే మృగాః. 86

నేను కోపించినచో రాజులందరు కట్టగట్టుకొని వచ్చినను, సింహమునకు ఇతర మృగములవలె, యుద్ధమున నిలువజాలరు.

అథ చేత్తే ప్రవర్తేత మయి కిఞ్చి దసామ్ప్రతమ్,
నిర్దహేయం కురూన్ సర్వా నితి మే ధీయతే మతిః. 87

నీ వాదనగు నా విషయమున నేదేని జరుగరానిది జరిగినచో ఆ కౌరవుల నందరిని మాడ్చి మసిచేసి వైచెదను. ఇది నా మనోనిశ్చయము.

న జాతు గమనం పార్థ భవేత్తత్ర నిరర్థకమ్,
అర్థప్రాప్తిః కదాచిత్ స్యా దన్తతో వాఽప్యవాచ్యతా. 88

అటకు నేనరుగుట యెన్నటికిని వ్యర్థము కాదు. ఒకప్పుడు మన పని నెరవేరవచ్చును. లేదా కడకు మనపై నింద లేకుండును.

యుధిష్ఠిర ఉవాచ-యుధిష్ఠిరు డిట్లు పలికెను.

యత్తుభ్యం రోచతే కృష్ణ స్వస్తి ప్రాప్నుహి కౌరవాన్,
కృతార్థం స్వస్తిమన్తం త్వాం ద్రక్ష్యామి పునరాగతమ్. 89

---

87. తే - నీ వాదనగు; మయి - నాయందు; చేత్ అసామ్ప్రతమ్ ప్రవర్తేత - జరుగరాని కీడేది అయిన కౌరవుల వలన జరిగినచో; కురూన్ - కౌరవులను; నిర్దహేయమ్ - కాల్చివైచెదను.

కృష్ణా! నీ కిష్టమైనట్లే కానిమ్ము. మేలు. కౌరవుల కడ కరుగుము. పని చక్కచేసికొని సుఖముగా తిరిగివచ్చు నిన్ను చూతును.

విష్యక్సేన కురూన్ గత్వా భరతాన్ శమయన్ ప్రభో,
యథా సర్వే సుమనసః సహ స్యామ సుచేతసః. 90

విష్వక్సేనా! కౌరవుల కడ కరిగి భరతవంశమువార మందరము కలతలులేని మనస్సులతో బుద్ధులతో నుండువిధము సాధింపుము.

భ్రాతా చాసి సఖా చాసి బీభత్సో ర్మమ చ ప్రియః,
సౌహృదే నావిశఙ్క్యోఽసి స్వస్తి ప్రాప్నుహి భూతయే. 91

నీవు మాకు సోదరుని వంటివాడవు. మాకు సఖుడవు. అర్జుననకును నాకును మిక్కిలి ప్రియమైన వాడవు. చెలిమి విషయమున నీయందు మాకు శంకయే లేదు. మేలు, మంగళము పొందుము.

అస్మాన్ వేత్థ పరాన్ వేత్థ వేత్థార్థా న్వేత్థ భాషితుమ్,
యద్య దస్మద్ధితం కృష్ణ తత్త ద్వాచ్యః సుయోధనః. 92

మమ్మెరుగుదువు. ఎదిరి నెరుగుదువు. ప్రయోజనముల నెరుగుదువు. పలుకుతీ రెరుగుదువు. మాకు మేలైన దెల్ల దుర్యోధనునితో పలుకుము.

యద్యద్ధర్మేణ సంయుక్త ముపపద్యేద్ధితం వచః,
తత్త త్కేశవ భాషేథాః సాన్త్వం వా యది వేతరత్. 93

కేశవా! ధర్మముతో కూడిన హితమైన మాట నీకు తోచిన దెల్ల - అది సామమో, మరియొకటియో - పలుకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
యుధిష్ఠిరకృత కృష్ణప్రేరణే ద్విసప్తతితమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
యుధిష్ఠిరుడు కృష్ణుని పంపుట గల డెబ్బదిరెండవ అధ్యాయము.

—: o :—

90. తథా వద - అట్లు పలుకుమను మాట కలుపుకొనవలయును.

92. అస్మద్ధితమ్ - మాకు - అనగా మా కురువంశమువారి కందరకును - అని భావము.

93. సాన్త్వమ్ - అయిదూళ్ళిమ్మను మాటతో సామమార్గమును. ఇతరత్ - కానిచో జూదమాడుమను మరియొక పద్ధతి నైనను, భాషేథాః - పలుకుము.

# త్రిసప్తతితమోఽధ్యాయః

# డెబ్బది మూడవ అధ్యాయము

## శ్రీకృష్ణేన యుధిష్ఠిరస్య యుద్ధార్థం ప్రోత్సాహనమ్

## శ్రీకృష్ణుడు ధర్మరాజును యుద్ధమునకై పురికొల్పుట.

శ్రీ భగవానువాచ-శ్రీ భగవంతు డిట్లు పలికెను.

సంజయస్య శ్రుతం వాక్యం భవతశ్చ శ్రుతం మయా,
సర్వం జానామ్యభిప్రాయం తేషాం చ భవతశ్చ యః. 1

సంజయుని పలుకు వింటిని. నీ మాటను గూడ వింటిని. వారి అభిప్రాయ మేమో, మీ తలపేమో అంతయు గుర్తించితిని.

తవ ధర్మాశ్రితా బుద్ధి స్తేషాం వైరాశ్రయా మతిః,
యదయుద్ధేన లభ్యేత తత్తే బహుమతం భవేత్. 2

నీ బుద్ధి ధర్మమును పట్టియున్నది. వారి మతి పగనుబట్టి యున్నది. యుద్ధము కాకుండ లభించున దేదో యదే నీకు కొండంత.

న చైవ నైష్ఠికం కర్మ క్షత్రియస్య విశామ్పతే,
ఆహు రాశ్రమిణః సర్వే న భైక్షం క్షత్రియశ్చరేత్. 3

క్షత్రియుడు బ్రదుకు తుదిదాక బ్రహ్మచర్యమును, సన్యాసమును పాటింపరాదనియు, బిచ్చమెత్తరాదనియు అన్ని ఆశ్రమములవారు చెప్పుదురు.

జయో వధో వా సంగ్రామే ధాత్రాఽఽదిష్టః సనాతనః,
స్వధర్మః క్షత్రియ స్యైష కార్పణ్యం న ప్రశస్యతే. 4

---

3. నైష్ఠికం కర్మ - యావజ్జీవము బ్రహ్మచర్యమునో, సన్యాసమునో పాటించుట.

4. కార్పణ్యమ్ - ఇదూశ్శైనను ఇమ్మను జాలిమాట;

యుద్ధమున గెలుపో, చావో క్షత్రియునకు బ్రహ్మ నిర్ణయించిన సనాతనమగు స్వధర్మము. దీనముగా బ్రదుకుట మేలు గాదు.

నహి కార్పణ్య మాస్థాయ శక్యా వృత్తి ర్యుధిష్ఠిర,
విక్రమస్వ మహాబాహో జహి శత్రూన్ పరంతప. 5

దైన్యము నవలంబించి బ్రదుకుట, యుధిష్ఠిరా! సాధ్యముకాదు. మహాబాహూ! విక్రమింపుము. పరంతపా! శత్రువులను రూపుమాపుము.

అతిగృద్ధాః కృతస్నేహా దీర్ఘకాలం సహోషితాః,
కృతమిత్రాః కృతబలా ధార్తరాష్ట్రాః పరంతప. 6

ధృతరాష్ట్రుని పుత్రులు మిక్కిలి పిసినిగొట్టులు. అయినను మీరు పెద్దకాలము వారితో స్నేహముచేసి కలిసి నివసించియున్నారు. వారితో మైత్రిని పెంపొందించి యున్నారు. బలమును కూడ పెద్దచేసి యున్నారు.

న పర్యాయోఽస్తి యత్సామ్యం త్వయి కుర్యుర్విశాంపతే,
బలవత్తాం హి మన్యన్తే భీష్మద్రోణకృపాదిభిః. 7

నీయందు సమభావముతో వారు ప్రవర్తించు ఉపాయము లేదు. ఏలయన వారు భీష్ముడు, ద్రోణుడు, కృపుడు మున్నగువారితో బలవంతుల మనుకొనుచున్నారు.

యావచ్చ మార్దవే నైతాన్రాజ న్నుపచరిష్యసి,
తావదేతే హరిష్యన్తి తవ రాజ్య మరిందమ. 7

నీవు మెత్తగా వారిని కొలుచుచున్నంతవరకు వారు నీ రాజ్యమును కొల్లగొట్టుచునే యుందురు.

నానుక్రోశా న్న కార్పణ్యా న్న చ ధర్మార్థకారణాత్,
అలంకర్తుం ధార్తరాష్ట్రా స్తవ కామ మరిందమ. 9

---

5. వృత్తిః - బ్రదుకుతెరువు.

6. అతిగృద్ధాః - మిక్కిలి లోభబుద్ధి గలవారు.

7. పర్యాయః - ఉపాయము

9. అనుక్రోశాత్ - మీయందు జాలివలన : కార్పణ్యాత్ - వారికి దైన్యము కలుగునను భయమువలన; అలంకర్తుమ్ - పూర్తిచేయుటకు; సమర్థులు కారని భావము.

ఆ ధృతరాష్ట్రుని కొడుకులు మీయందు దయవలననో, తమ కిబ్బంది యగుననియో, ధర్మము, అర్థము అనునవి కారణములుగనో మీ కోరికను పండింపరు.

ఏతదేవ నిమిత్తం తే పాణ్డవాస్తు యథా త్వయి,
నాన్వతప్యన్త కౌపీనం తావత్ కృత్వాఽపి దుష్కరమ్. 10

పాండుపుత్రా! నీవు గోచిపెట్టుకొని అంతగా వనవాసాదికము చేసినను వారు పశ్చాత్తాపము పొందలేరు. ఇదియే నీకు పరాక్రమింప కారణము కావలయును.

పితామహస్య ద్రోణస్య విదురస్య చ ధీమతః,
బ్రాహ్మణానాం చ సాధూనాం రాజ్ఞశ్చ నగరస్య చ, 11
పశ్యతాం కురుముఖ్యానాం సర్వేషామేవ తత్త్వతః,
దానశీలం మృదుం దాన్తం ధర్మశీల మనువ్రతమ్, 12
యత్త్వా ముపధినా రాజన్ ద్యూతే వఞ్చితవాం స్తదా,
న చాపత్రపతే తేన నృశంసః స్వేన కర్మణా. 13

తాత, ద్రోణుడు, బుద్ధిమంతుడగు విదురుడు - సాధుస్వభావము గల బ్రాహ్మణులు, రాజు, నగరవాసులు, ఇతర కురు ముఖ్యులు అందరు గ్రుడ్లప్ప గించి చూచుచుండగా, దానశీలము కలవానిని, మెత్తనివానిని, అణకువ కల వానిని, వారి ననుసరించుటయే వ్రతముగా గల వానిని నిన్ను కపటముతో జూదమున నాడు వంచించెను. పైగా ఆ క్రూరుడు తన నీచ కర్మమునకు సిగ్గు పడకున్నాడు.

---

10. పాణ్డవ-అస్తు అని పదవిభాగము; నిమిత్తమ్ - పరాక్రమించు కారణము; అస్తు-అగుగాక! హే పాణ్డవ-ఓ పాండుపుత్రా! త్వయి-నీవు; కౌపీనం ధారయతి-గోచిపెట్టుకొనగా; తే-కౌరవులు - నాన్వతప్యన్త-పశ్చాత్తాపము పొందలేదు; తావత్-అంతటి వనవాసాదికమును; దుష్కరమ్-చేయరాని దానిని; కృత్వాఽపి - చేసినప్పటికి-వారికి పశ్చాత్తాపము కలుగలేదని భావము.

11. తాత మున్నగు వారిని కూడ లెక్కచేయక; ఉపధినా - కపటముతో మిమ్ము వంచించెనని భావము.

తథాశీలసమాచారే రాజన్ మా ప్రణయం కృథాః,
వధ్యాస్తే సర్వలోకస్య కిం పునస్తవ భారత. 14

అట్టి శీలము, నడవడికల వానితో పొత్తుపెట్టుకొనకుము. వారు సర్వలోకమునకు వధింపదగినవారు. భారతా! నీకేల కారు?

వాగ్భి స్త్వప్రతిరూపాభి రతుద త్త్వాం సహానుజమ్,
శ్లాఘమానః ప్రహృష్టః సన్ భ్రాతృభిః సహ భాషతే. 15

పోలిక చెప్పరాని తులువపలుకులతో నిన్ను, నీ తమ్ములను పొడిచి వైచెను. పొంగిపోవుచు తన గొప్పలు చెప్పుకొనుచు తమ్ములతో పలుకుచుండును.

ఏతావత్ పాణ్డవానాం హి నాస్తి కిఞ్చిదిహ స్వకమ్,
నామధేయం చ గోత్రం చ తద ప్యేషాం నశిష్యతే. 16

ఇంతకు పాండవులకు తమది యని చెప్పుకొనుటకు ఏమియు లేదు. పేరు, గోత్రము (నామరూపములు కూడ) వారి కిక మిగులవు.

కాలేన మహతా చైషాం భవిష్యతి పరాభవః,
ప్రకృతిం తే భజిష్యన్తి నష్టప్రకృతయో మయి. 17

"పెద్దకాలము గడువగా వీరికి పరాభవము కలుగును. నాకడ మానమర్యాదలు పోగొట్టుకున్న ఆ పాండవులు చత్తురు" అని దుర్యోధనుడు తమ్ములతో బీరము లాడును.

దుఃశాసనేన పాపేన తదా ద్యూతే ప్రవర్తితే,
అనాథవ త్తదా దేవీ ద్రౌపదీ సుదురాత్మనా, 18
ఆకృష్య కేశే రుదతీ సభాయాం రాజసంసది,
భీష్మద్రోణప్రముఖతో గౌరితి వ్యాహృతా ముహుః. 19

---

15. అతుదత్ - పీడించెను.

17. మయి - నాకడ; నష్టప్రకృతయః - చచ్చిన శౌర్యాదిరూపమగు స్వభావము కలవారై.

19. గౌః ఇతి వ్యాహృతా ముహుః - ఆవు, ఆవు అని పలుమారులు పలికెను. ఆవు అన్ని ఆఁబోతులకు భోగ్యవస్తువైనట్లు నీవు కూడ అందరకు అగుమని వెక్కిరింత.

పరమనీచుడు, పాపి ఆ దుశ్శాసనుడు జూదము జరుగుచుండగా ద్రౌపదీదేవిని దిక్కుమాలినదానివలె జుట్టుపట్టి రాజులున్న నిండు సభలో భీష్మద్రోణుల ముందు, ఆమె ఏడ్చుచుండగా 'ఆవు' అని పలుమారులు కూసెను.

భవతా వారితాః సర్వే భ్రాతరో భీమవిక్రమాః,
ధర్మపాశనిబద్ధాశ్చ న కిఞ్చిత్ ప్రతిపేదిరే. 20

భయంకరమగు విక్రమముగల నీ తమ్ములందరు నీవు వారింపగా ధర్మపాశమునకు కట్టువడి కొంచెమైన ప్రతీకారము చేయలేదు.

ఏతాశ్చాన్యాశ్చ పరుషా వాచః స సముదీరయన్,
శ్లాఘతే జ్ఞాతిమధ్యే స్మ త్వయి ప్రవ్రజితే వనమ్. 21

ఇవే కాక మరియు నెన్నో కారుకూతలు కూయుచు వాడు నీవు వనమేగుచుండగా చుట్టముల నడుమ గొప్పలు చెప్పుకొనుచుండెను.

యే తత్రాసన్ సమానీతా స్తే దృష్ట్వా త్వా మనాగసమ్,
అశ్రుకంఠా రుదన్తశ్చ సభాయా మాసతే సదా. 22

అప్పుడట సభలో నున్నవారందరు ఏ పాప మెరుగని నిన్ను గని పెగిలిరాని కంఠములతో ఏడ్చుచు ఊరకుండిరి.

న చైవ మభ్యనన్దంస్తే రాజానో బ్రాహ్మణైః సహ,
సర్వే దుర్యోధనం తత్ర నిన్దన్తి స్మ సభాసదః. 23

సభలోనున్న దొరలు, బ్రాహ్మణులు అందరు దుర్యోధనుని మెచ్చక తిట్టుచుండిరి.

కులీనస్య చ యా నిన్దా వధో వాఽ మిత్రకర్శన,
మహాగుణో వధో రాజ న్నతు నిన్దా కుజీవికా. 24

శత్రుసంహారకా! సత్కులమున పుట్టిన వానికి నింద యనగా చావే. కాని నిందతోడి పాడు బ్రదుకు కంటెను చావు వేయిరెట్లు గొప్పది.

తదైవ నిహతో రాజన్ యదైవ నిరపత్రపః,
నిన్దితశ్చ మహారాజ పృథివ్యాం సర్వరాజభిః. 25

భూమిలో గల రాజులందరు దుమ్మెత్తి పోసినప్పుడే ఆ సిగ్గు లేనివాడు చచ్చినవాడు.

ఈషత్కార్యో వధస్తస్య యస్య చారిత్ర మీదృశమ్,
ప్రస్కన్దేన ప్రతిస్తబ్ధ శ్ఛిన్నమూల ఇవ ద్రుమః. 26

ఇట్లు పాడుబ్రదుకు గల - వానిని చక్రమువంటి ఆకారము గల పాదులో వ్రేళ్ళు తెగి నిలిచిన చెట్టును వలె చంపుట గోటి మీది పని.

వధ్యః సర్ప ఇ వానార్యః సర్వలోకస్య దుర్మతిః,
జహ్యేనం త్వ మమిత్రఘ్న మా రాజన్ విచికిత్సథాః. 27

నీచుడు, దుష్టబుద్ధి అయిన వానిని - పామును వలె - లోకమెల్ల చంపనే వలయును. శత్రుసంహారకా! వీనిని చంపుము. ఏ మాత్రము సంశయింప వలదు.

సర్వథా త్వత్ క్షమం చైతద్ రోచతే చ మమానఘ,
యత్త్వం పితరి భీష్మే చ ప్రణిపాతం సమాచరేః. 28

నీవు నీ తండ్రియందు, భీష్మునియందు గౌరవము చూపుట తగినదే. నాకు రుచించు కార్యమే.

అహం తు సర్వలోకస్య గత్వా ఛేత్స్యామి సంశయమ్,
యేషా మస్తి ద్విధాభావం రాజన్ దుర్యోధనం ప్రతి. 29

ఎవరికైన దుర్యోధనుని గూర్చి రెండు భావములున్నచో నేను వెళ్ళి వారి సంశయము పటాపంచలు చేసెదను.

---

26. ఈషత్కార్యః - మిక్కిలి తేలికయైన పని; ప్రస్కన్దేన - చక్రమువంటి ఆకారముగల వేదికతో వ్రేళ్ళు తెగి కూలుటకు సిద్ధముగా నున్న చెట్టు చుట్టు గుండ్రముగా కొంచెము పాదు తీసినచో అది కూలి పోవును. ఆ విధముగా దుర్యోధనుని చంపుట తేలిక అని భావము.

29. ద్విధాభావమ్ - సంశయము - దుర్యోధనుడు కూడ మంచివాడేమో అను సంశయము.

మధ్యే రాజ్ఞా మహం తత్ర ప్రాతిపౌరుషికాన్ గుణాన్,
తవ సంకీర్తయిష్యామి యే చ తస్య వ్యతిక్రమాః. 30

అచట రాజుల నడుమ సర్వమానవులకు సాధారణములగు నీ గుణములను, ఆ దుర్యోధనుని పెడసరి లక్షణములను నొక్కి వక్కాణింతును.

బ్రువత స్తత్ర మే వాక్యం ధర్మార్థసహితం హితమ్,
నిశమ్య పార్థివాః సర్వే నానాజనపదేశ్వరాః. 31
త్వయి సంప్రతిపత్స్య న్తే ధర్మాత్మా సత్యవాగితి,
తస్మిం శ్చాధిగమిష్య న్తి యథా లోభా దవ ర్తత. 32

ధర్మము, అర్థము పొందుపడునట్లు నేను హితముగా పలుకు వాక్యమును విని అనేక దేశముల రాజులందరు నీవు ధర్మాత్ముడవనియు, సత్యవాక్యుడవనియు నిశ్చయము పొందుదురు. అతడెట్లు లోభముతో మెలగెనో అదియు తెలిసికొందురు.

గర్హయిష్యామి చైవైనం పౌరజానపదేష్వపి,
వృద్ధబాలా నుపాదాయ చాతుర్వర్ణ్యే సమాగతే. 33

ఊరూర, వాడవాడల నాలుగువర్ణములవారు పెద్దలను పిన్నలను తీసికొని వచ్చి జనులు మూగిన తావులలో ఈ దుర్యోధనుని చెడ్డగుణములను వక్కాణింతును.

శమం వై యాచమాన స్త్వం నాధర్మం తత్ర లప్స్యసే,
కురూన్ విగర్హయిష్య న్తి ధృతరాష్ట్రం చ పార్థివాః. 34

నీవు శాంతినే కోరుచున్నావు కాన అందెవ్వరు నీయందు అధర్మమును భావింపరు. కౌరవులను, ధృతరాష్ట్రుని దుమ్మెత్తి పోయుదురు.

---

30. ప్రాతిపౌరుషికాన్ - సర్వపురుషసాధారణములైనవానిని; - మానవులలో ఉండవలసిన మంచిగుణములను - అని తాత్పర్యము; తస్య - ఆ దుర్యోధనుని; వ్యతిక్రమాః - విరుద్ధములగు గుణములు; యే - ఏవి కలవో - వానిని.

తస్మిన్ లోకపరిత్యక్తే కిం కార్యమవశిష్యతే,
హతే దుర్యోధనే రాజన్ యదన్యత్ క్రియతామితి. 35

వారిని లోకము వెలివేయగా మనకిక మిగిలిన పని యేముండును? దుర్యోధనుడు అట్లు చావగా మన మేమి చేయవలయునో చూతము.

యాత్వా చాహం కురూన్ సర్వాన్ యుష్మదర్థ మహాపయన్,
యతిష్యే ప్రశమం కర్తుం లక్షయిష్యే చ చేష్టితమ్. 36

నేనా కౌరవు లందరికడ కరిగి, మీ పని చెడకుండ, శాంతికై ప్రయత్నింతును. వారి చేష్టలను కూడ తెలిసికొందును.

కౌరవాణాం ప్రవృత్తిం చ గత్వా యుద్ధాధికారికామ్,
నిశమ్య వినివర్తిష్యే జయాయ తవ భారత. 37

కౌరవుల ప్రవృత్తి యెట్టిది? యుద్ధమున వారికిగల ఆనుపాను లెట్టివి? మున్నగు విషయములు విని నీ జయమునకై తిరిగివత్తును.

సర్వథా యుద్ధ మే వాహ మాశంసామి పరైః సహ,
నిమిత్తాని హి సర్వాణి తథా ప్రాదుర్భవన్తి మే. 38

ఎన్ని విధముల చూచినను పరులతో యుద్ధమే యగునని తోచుచున్నది. ఆ శకునము లెన్నియో నాకు గోచరించుచున్నవి.

మృగాః శకున్తాశ్చ వదన్తి ఘోరం
హస్త్యశ్వముఖ్యేషు నిశాముఖేషు,
ఘోరాణి రూపాణి తథైవ చాగ్ని-
ర్వర్ణాన్ బహూన్ పుష్యతి ఘోరరూపాన్. 39

మృగములు, పక్షులు భయంకరముగా నరచుచున్నవి. ఏనుగులు, గుఱ్ఱములు సంజలలో ఘోరరూపములతో కానవచ్చుచున్నవి. అగ్నియు పలు రంగులలో ఘోరరూపములను ప్రకటించుచున్నది.

---

35. హతే - చచ్చినవానితో సమానము కాగా.

36. యాత్వా - వెడలి;

మనుష్యలోకక్షయకృత్ సుఘోరో
నోచేదనుప్రాప్త ఇహాన్తకః స్యాత్,
శస్త్రాణి యన్త్రం కవచా రథాంశ్చ
నాగాన్ హయాంశ్చ ప్రతిపాదయిత్వా. 40

మనుష్యలోకము నంతటిని రూపుమాపు మహాఘోరము దాపురించినది. శస్త్రములు, ఫిరంగులు, కవచములు, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు అను వాని నన్నింటిని మూకగా చేసి యము డిటకు వచ్చి కూర్చుండడేని యీ శకునము లిట్లుండవు గదా !

యోధాశ్చ సర్వే కృతనిశ్చయాస్తే
భవన్తు హస్త్యశ్వరథేషు యత్తాః,
సాఙ్గ్రామికం తే యదుపార్జనీయం
సర్వం సమగ్రం కురు తన్నరేన్ద్ర. 41

నీ యోధులందరు యుద్ధమునకే నిశ్చయము చేసికొని ఏనుగులయందు, గుఱ్ఱములయందు, రథములయందు సిద్ధముగా నుందురుగాక! యుద్ధమునకై నీవు కూడబెట్టవలసిన దంతయు లోపము లేకుండ సమకూర్పుము.

దుర్యోధనో న హ్యల మద్య దాతుం
జీవం స్తవైత న్నృపతే కథఞ్చిత్,
యత్తే పురస్తా దభవత్ సమృద్ధం
ద్యూతే హృతం పాణ్డవముఖ్య రాజ్యమ్. 42

నీకు మునుపున్న సమృద్ధమైన రాజ్యమును, జూదమున కొల్లగొట్టిన దానిని దుర్యోధనుడు ప్రాణములుండగా నీకీ నొల్లడు.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కృష్ణవాక్యే త్రిసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణవాక్యముగల డెబ్బదిమూడవ అధ్యాయము.

—: o :—

40. నో చేత్...యము డిచటకు చేరి యుండకున్నచో ఈ ఘోరములన్నియు జరుగవుగదా అని భావము - యన్త్రమ్ - గుండ్లు ప్రేల్చు యంత్రము; కవచాః - కవచములు; ప్రతిపాదయిత్వా - అన్నింటి నొక్క చోటికి చేర్చి;

# చతుస్సప్తతితమోఽధ్యాయః
# డెబ్బదినాల్గవ అధ్యాయము

## భీమసేనస్య శాన్తిప్రస్తావః.
## భీమసేనుడు శాంతినిగూర్చి పలుకుట.

భీమ ఉవాచ - భీము డిట్లు పలికెను.

యథా యథైవ శాన్తిః స్యాత్ కురూణాం మధుసూదన,
తథా తథైవ భాషేథా మా స్మ యుద్ధేన భీషయే. 1

మధుసూదనా! కౌరవుల కెట్లెట్లు పలికిన శాంతియగునో యట్లట్లు పలుకుము. యుద్ధముతో వారిని భయపెట్టకుము.

అమర్షీ జాతసంరంభః శ్రేయోద్వేషీ మహామనాః,
నోగ్రం దుర్యోధనో వాచ్యః సామ్నైవైనం సమాచరేః. 2

ఆ దుర్యోధనుడు కోపిష్ఠి. తొందరపాటువాడు. శ్రేయస్సును ద్వేషించువాడు, మొండివాడు; అట్టివానితో సామమార్గముననే పలుకవలయును. ఉగ్రముగా పలుకరాదు. మునుపును నీవట్లే వాని విషయమున వ్యవహరించితివి.

ప్రకృత్యా పాపసత్త్వశ్చ తుల్యచేతాస్తు దస్యుభిః,
ఐశ్వర్యమదమత్తశ్చ కృతవైరశ్చ పాణ్డవైః. 3

సహజముగనే పాపస్వభావము గలవాడు. వానిది రక్కసుల బుద్ధివంటి బుద్ధి. ఐశ్వర్య మదముచే ఒడలెరుగనివాడు. పాండవులతో పగగొన్నవాడు.

---

1. భీషయేః- శాంతిని చెడగొట్టు భయము వారికి కలిగింపకుము.
2. మహామనాః - కరగని మనసు గల వాడని భావము. మొండివాడు; సమాచరేః-మునుపును అట్లే ప్రవర్తించితివి.

అదీర్ఘదర్శీ నిష్ఠూరీ క్షేప్తా క్రూరపరాక్రమః,
దీర్ఘమన్యు రనేయశ్చ పాపాత్మా నికృతిప్రియః. 4

ముందుచూపు లేనివాడు. నిష్ఠురము లాడుచుండును. ఇతరులను తూలనాడును. క్రూరమైన పరాక్రమము గలవాడు. తెగని కోపము కలవాడు, బోధలకు బాగుపడువాడు కాడు. పాపాత్ముడు. అపకారములు చేయుటయే ఆతనికి ప్రియము.

ప్రియేతాపి న భజ్యేత నైవ జహ్యాత్ స్వకం మతమ్,
తాదృశేన శమః కృష్ణ మన్యే పరమదుష్కరః. 5

చావనైన చచ్చును గాని లొంగిరాడు. పట్టిన పట్టు వదలడు. కృష్ణా! అట్టి వానితో శాంతి నొందుట పరమదుష్కరము.

సుహృదా మప్యవాచీన స్త్యక్తధర్మా ప్రియానృతః,
ప్రతిహన్త్యేవ సుహృదాం వాచశ్చైవ మనాంసి చ. 6

సావాసగాండ్రకు కూడ పెడసరియే. ధర్మము పాటింపడు. అబద్ధము లన్నచో ప్రాణము. మిత్రముల పలుకులను మనసులను త్రిప్పికొట్టుచునే యుండును.

స మన్యువశ మాపన్నః స్వభావం దుష్టమాస్థితః,
స్వభావాత్ పాపమభ్యేతి తృణైశ్ఛన్న ఇవోరగః. 7

ఆ దుర్యోధనుడు కోపమునకు లోబడి యున్నవాడు. దుష్టస్వభావమున నిలుకడ కలవాడు. గడ్డి పరకలలో దాగిన పాముపలె ఆ స్వభావమువలన పాపమార్గముననే పోవును.

దుర్యోధనో హి య త్సేనః సర్వథా విదిత స్తవ,
యచ్ఛీలో యత్స్వభావశ్చ యద్బలో యత్పరాక్రమః. 8

దుర్యోధనుని సేన యెట్టిదో, శీల మెట్టిదో, స్వభావ మెట్టిదో, బల మెట్టిదో, పోటరితన మెట్టిదో అన్ని విధముల నీకు తెలిసినదే.

---

4. నిష్ఠూరీ - నిష్ఠురములు పలుకువాడు; క్షేప్తా-నోటిదురుసుతనము కలవాడు; అనేయః-ఎవరి శిక్షకును లొంగనివాడు.

6. అవాచీనః - పెడసరి;

పురా ప్రసన్నాః కురవః సహపుత్రా స్తథా వయమ్,
ఇన్ద్రజ్యేష్ఠా ఇవాభూమ మోదమానాః సబాన్ధవాః. 9

మునుపు కౌరవులు వారి కొడుకులు మాయందు కలతలేకయే యుండిరి. మేమును వారియెడ ఆ విధముగనే యుంటిమి. ఇంద్రుని పెద్దచేసికొన్న దేవతలవలె బందుగులతోపాటు ఆనందించుచు నుంటిమి.

దుర్యోధనస్య క్రోధేన భరతా మధుసూదన,
ధక్ష్యన్తే శిశిరాపాయే వనానీవ హుతాశనైః. 10

మధుసూదనా ! అట్టి భరతవంశమువారు దుర్యోధనుని క్రోధముచేత, ఎండకాలమున దావాగ్నులచేత అడవులు మాడినట్లు మాడిపోవనున్నారు.

అష్టాదశేమే రాజానః ప్రఖ్యాతా మధుసూదన,
యే సముచ్చిచ్ఛిదు ర్జ్ఞాతీన్ సుహృదశ్చ సబాన్ధవాన్. 11

ఈ పదునెనిమిదిమంది రాజులు కులమువారిని, మిత్రులను, బంధువులను కూకటివ్రేళ్ళతో కూలద్రోసినవా రని పేరొందిరి.

అసురాణాం సమృద్ధానాం జ్వలతా మివ తేజసా,
పర్యాయకాలే ధర్మస్య ప్రాప్తే కలి రజాయత. 12

ధర్మమునకు కాని కాలము రాగా గొప్ప సంపదలు కలవారు, తేజస్సుతో ప్రజ్వరిల్లుచున్నవారు నగు రాక్షసుల నాశమునకై కలి పుట్టెను.

హైహయానాం ముదావర్తో నీపానాం జనమేజయః,
బహుల స్తాలజఙ్ఘానాం కృమీణా ముద్ధతో వసుః. 13

హైహయులకు ముదావర్తుడు, నీపులకు జనమేజయుడు, తాలజంఘులకు బహులుడు, కృములకు పొగరెక్కిన వసువు -

అజబిన్దుః సువీరాణాం సురాష్ట్రాణాం రుషర్ధికః,
అర్కజశ్చ బలీహానాం చీనానాం ధౌతమూలకః. 14

12. పర్యాయకాలే - ధర్మము రాక్షసులను వదలి పోయిన కాలమున అని భావము - రాక్షసులు హద్దు మీరినపు డని తాత్పర్యము.

సువీరులకు అజబిందువు, సురాష్ట్రులకు రుషర్ధికుడు, వలీహులకు అర్కజుడు, చీనులకు ధౌతమూలకుడు......

హయగ్రీవో విదేహానాం వరయశ్చ మహౌజసామ్,
బాహుః సున్దరవంశానాం దీప్తాక్షాణాం పురూరవాః. 15

విదేహులకు హయగ్రీవుడు, మహౌజసులకు వరయుడు, సుందర వంశములకు బాహువు, దీపాక్షులకు పురూరవుడు......

సహజ శ్చేదిమత్స్యానాం ప్రవీరాణాం వృషధ్వజః,
ధారణ శ్చన్ద్రవత్సానాం మకుటానాం విగాహనః. 16

చేదిమత్స్యులకు సహజుడు, ప్రవీరులకు వృషధ్వజుడు, చంద్రవత్సులకు ధారణుడు, ముకుటులకు విగాహనుడు...

శమశ్చ నన్దివేగానా మిత్యేతే కులపాంసనాః,
యుగాన్తే కృష్ణ సంభూతాః కులే కుపురుషాధమాః. 17

నందివేగులకు శముడు - అనువారలు కులమున బుట్టిన చీడపురుగులు. కృష్ణా! ఇట్టి పరమనీచులు ఆ యా యుగముల అంతములందు పుట్టిరి.

అప్యయం నః కురూణాం స్యాద్యుగాన్తే కాలసంభృతః,
దుర్యోధనః కులాఙ్గారో జఘన్యః పాపపూరుషః. 18

ఈ యుగాంతమునందును కౌరవులకు చేటు కాలము మూడినది కాబోలు, నిప్పుకణిక వలె పరమనీచుడు పాపపురుషుడు దుర్యోధనుడు కాలమునుబట్టి యేర్పడెను.

తస్మాన్మృదు శనై ర్బ్రూయా ధర్మార్థసహితం హితమ్,
కామానుబద్ధం బహులం నోగ్ర ముగ్రపరాక్రమ. 19

కృష్ణా ! నీవు ఉగ్రమైన పరాక్రమము కలవాడవు. అయినను మెత్తగా మెల్లగా అర్థధర్మములు కలిసివచ్చునట్లు హితము పలుకుము. వాని చిత్తము ననుసరించు పలుకులే యెక్కువగా పలుకుము. ఉగ్రముగా పలుకవలదు.

అపి దుర్యోధనం కృష్ణ సర్వే వయ మధశ్చరాః,
నీచై ర్భూత్వాऽనుయాస్యామో మా స్మ నో భరతా నశన్. 20

కృష్ణా! దుర్యోధనుని బట్టి మేమందరము నేలబారు మనుజులము కావలయునా? కావున తగ్గి నడుచుకొందుము. మమ్ములను బట్టి భరతవంశము వారు నశింపకుందురుగాక!

అప్యుదాసీనవృత్తిః స్యా ద్యథా నః కురుభి స్సహ,
వాసుదేవ తథా కార్యం న కురూ ననయః స్పృశేత్. 21

కౌరవులతో మాకు సామరస్యమగు తీరు, వాసుదేవా! నీవు చేయవలయును. కౌరవులకు కులక్షయమను దోష మంటకుండు గాక!

వాచ్యః పితామహో వృద్ధో యే చ కృష్ణ సభాసదః,
భ్రాతృణా మస్తు సౌభ్రాత్రం ధార్తరాష్ట్రః ప్రశామ్యతామ్. 22

పెద్దవాడగు తాతతో, మరియు నట సభలో నున్నవారితో నా మాటగా చెప్పుము. అన్నదమ్ములకు అన్నదమ్ములతనము చక్కగా నిలుచుగాక! దుర్యోధనుడు శాంతి నొందుగాక!

అహ మేత ద్బ్రవీమ్యేనం రాజా చైవ ప్రశంసతి,
అర్జునో నైవ యుద్ధార్థీ భూయసీ హి దయార్జునే. 23

నేనిట్లు పలుకుచున్నాను. రాజు శాంతినే మేలనును. అర్జునుడు యుద్ధమును కోరనే కోరడు. అర్జునునియందు దయ ఎక్కువ గదా!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీమవాక్యే చతుఃసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీమవాక్యముగల డెబ్బదినాలుగవ అధ్యాయము.

—: o :—

21. అనయః - కులమంతయు రూపుమాయుట యను దోషము.
23. ప్రశంసతి - శమమునే ప్రశంసించు నని భావము;

## పఞ్చస ప్తతితమోऽధ్యాయః
## డెబ్బదియైదవ అధ్యాయము

### శ్రీకృష్ణేన భీమసేనస్య యుద్ధాయ ప్రోత్సాహనమ్.
### శ్రీకృష్ణుడు భీమసేనుని యుద్ధమునకు పురికొల్పుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

ఏతచ్ఛ్రుత్వా మహాబాహుః కేశవః ప్రహసన్నివ,
అభూతపూర్వం భీమస్య మార్దవోపహితం వచః. 1

గిరేరివ లఘుత్వం తచ్ఛీతత్వ మివ పావకే,
మత్వా రామానుజః శౌరిః శార్ఙ్గధన్వా వృకోదరమ్. 2

సంతేజయం స్తదా వాగ్భిర్మాతరిశ్వేవ పావకమ్,
ఉవాచ భీమ మాసీనం కృపయాభిపరిప్లుతమ్. 3

మహాబాహువగు కేశవుడు భీమునినోట మును పెన్నడు లేని మెత్తదనపు మాట వినెను. అది కొండ బెండయినట్లు అగ్ని చల్లబడిన ట్లాతనికి తోచెను. అగ్నిని వాయువు బాగుగా మండించు విధమున కృష్ణుడు నిలువెల్ల జాలితో నిండి కూర్చున్న భీమునికి తన మాటలతో ఉడుకెక్కించుచు నిట్లు పలికెను.

శ్రీభగవా నువాచ-శ్రీ భగవాను డిట్లు పల్కెను.

త్వమన్యదా భీమసేన యుద్ధమేవ ప్రశంససి,
వధాభినన్దినః క్రూరాన్ ధార్తరాష్ట్రాన్ మిమర్దిషుః. 4

భీమసేనా! నీవు చావు కోరిన క్రూరులగు ధృతరాష్ట్రపుత్రులను మర్దింప గోరువాడవై ఇతరసమయములలో యుద్ధమే మేలైన దనుచుందువు!

న చ స్వపిషి జాగర్షి న్యుబ్జః శేషే పరంతప!,
ఘోరా మశాన్తాం రుశతీం సదా వాచం ప్రభాషసే. 5

---

5. రుశతీమ్ - క్రోధముగల, న్యుబ్జః - బుజ్జపడ్డవాడు.

నీవు నిద్రలో లేవు. మేల్కొనియే యున్నావు. జబ్బుచేసి పడియుండ లేదు. మును పెల్లవేళల భయంకరముగా విజృంభించుచు రోషపు పలుకులు పలుకుచుందువు।

నిఃశ్వస న్నగ్నివ త్తేన సంత ప్తః స్వేన మన్యునా,
అప్రశా న్తమనా భీమ సధూమ ఇవ పావకః. 6

నీ కోపములో నీవే మండిపోవుచు నిట్టూర్పులు పుచ్చుచుందువు. కలత తేరని మనస్సుతో పొగచూరిన నిప్పువలె కానవచ్చుచుందువు.

ఏకా న్తే నిఃశ్వసన్ శేషే భారార్త ఇవ దుర్బలః,
అపిత్వా కేచి దున్మత్తం మన్య న్తే తద్విదో జనాః. 7

ఒంటరిగా నిట్టూర్చుచు పెద్దబరువు మోయు బలహీనునివలె పడియుండు వాడవు. అంతకుముందు నిన్నెరిగినవారు కొందరు వీడేమి పిచ్చివాడయ్యెనా? అనియు తలచుచున్నారు.

ఆరుజ్య వృక్షాన్నిర్మూలాన్ గజః పరిరుజన్నివ,
నిఘ్నన్ పద్భిః క్షితిం భీమ నిష్టనన్ పరిధావసి. 8

ఏనుగు విరచినట్లు చెట్లను విరచుచు పెకలించుచు అడుగులతో నేలను పగులగొట్టుచు పెద్ద అంగలు వేయుచు పరువెత్తువాడవు.

నాస్మిన్ జనేన రమసే రహః క్షిపసి పాణ్డవ,
నాన్యం నిశి దివా చాపి కదాచిదభినన్దసి. 9

అడవిలో జనముతో వినోదింపక ఒంటరిగా కాలము పుచ్చుచుండెడివాడవు. రాత్రింబవళ్ళు ఎన్నడును ఎవ్వనిని ఉత్సాహముతో పలుకరింపవు.

అకస్మాత్ స్మయమానశ్చ రహ స్యాస్సే రుదన్నివ,
జాన్వో ర్మూర్ధాన మాధాయ చిరమాస్సే ప్రమీలితః. 10

ఊరక నవ్వుచు అంతలో ఏకాంతమున కరిగి ఏడ్చుచున్నట్లుందువు. మోకాళ్ళలో తల పెట్టుకొని కనులు మూసికొని చాలసే పుండెడివాడవు.

---

8. ఆరుజ్య - విరుగగొట్టి; నిష్టనన్ - పెద్ద అంగలు వేయుచు; అస్మిన్ - ఈ అడవిలో; జనేన, న, రమసే - జనముతో కలిసి వినోదింపవు. క్షిపసి - కాలము పుత్తువు.

భ్రుకుటిం చ పునః కుర్వ న్నోష్ఠౌ చ విదశన్నివ,
అభీక్ష్ణం దృశ్యసే భీమ సర్వం తన్మన్యుకారితమ్. 11

మాటి మాటికి కనుబొమల ముడుచుచు, పెదవులు కొరకుచు ఎక్కువ సమయము కానవచ్చెడివాడవు. అదంతయు ఆ కోపపు చేష్టయే కదా!

యథా పురస్తాత్ సవితా దృశ్యతే శుక్రముచ్చరన్,
యథా చ పశ్చా న్నిర్ముక్తో ధ్రువం పర్యేతి రశ్మిమాన్. 12

తథా సత్యం బ్రవీమ్యేత న్నాస్తి తస్య వ్యతిక్రమః,
హన్తాఽహం గదయాభ్యేత్య దుర్యోధన మమర్షణమ్. 13

ఇతి స్మ మధ్యే భ్రాతౄణాం సత్యే నాలభసే గదామ్,
తస్య తే ప్రశమే బుద్ధి ర్ధ్రియతేఽద్య పరంతప. 14

సూర్యుడు తేజమును వెలిగ్రక్కుచు తూర్పున కానవచ్చును. పడమటి దిక్కున అస్తమించును. మరల మరల మేరువును చుట్టి వచ్చుచుండును. ఆ విధముగా ఇదిగో సత్యము పలుకుచున్నాను. నా మాటకు తిరుగులేదు. అసూయతో నిండిన ఆ దుర్యోధనుని గదతో మార్కొని చంపివైచెదను. అని అన్నదమ్ముల కడ ప్రతిజ్ఞలు పలుకుచు గద త్రిప్పుచుండెడివాడవు. ఓయి పరంతపా! అట్టి నీ కీనాడు శాంతిపై బుద్ధి నెలకొన్నది.

అహో యుద్ధాభికాఙ్క్షాణాం యుద్ధకాల ఉపస్థితే,
చేతాంసి విప్రతీపాని యత్త్వాం భీర్భీమ విన్దతి. 15

అయ్యో! యుద్ధము కోరువారి మనస్సులు యుద్ధకాలము వచ్చునప్పటికి మారిపోవును. ఇదిగో భీమా! నీకు భయ మొదవినది.

అహో పార్థ నిమిత్తాని విపరీతాని పశ్యసి,
స్వప్నాన్తే జాగరాన్తే చ తస్మాత్ ప్రశమ మిచ్ఛసి. 16

---

12. శుక్రమ్ - తేజస్సును; ఉచ్చరన్ - వ్యాపింపజేయుచు; నిర్ముక్తః - అస్తమించినవాడై; ధ్రువమ్ - నిశ్చయముగా; అభ్యేతి - మేరుపర్వతమును తిరిగి తిరిగి ప్రదక్షిణము చేయుచుండును.

16. నిమిత్తాని - దున్నపోతు నెక్కినట్లు కానవచ్చుట, ఎడమ కన్నదరుట వంటి చెడు శకునములు.

అయ్యో ! కుంతికొడుకా ! నిద్రయందు, మేలుకొన్నప్పుడును చెడు శకునములు చూచియుందువు. కావున శాంతినే కోరుచున్నావు.

అహో నాశంససే కిఞ్చిత్ పుంస్త్వం క్లీబ ఇవాత్మని,
కశ్మలే నాభిపన్నోఽసి తేన తే వికృతం మనః. 17

పేదవానివలె గుండెలో పౌరుషము కొంచెమైన భావింపకున్నావు. నిలువెల్ల నిన్నేదో జబ్బు పట్టినది. దానితో నీ మనస్సు విరిగి పోయినది.

ఉద్వేపతే తే హృదయం మనస్తే ప్రతిసీదతి,
ఊరుస్తమ్భగృహీతోఽసి తస్మాత్ ప్రశమ మిచ్ఛసి. 18

నీ గుండె వణకిపోవుచున్నది. నీ మనస్సు క్రుంగిపోవుచున్నది. స్తంభముల వంటి తొడలలో చిక్కి ముడుచుకొనిపోయితివి. కావుననే శాంతిని కోరుచున్నావు.

అనిత్యం కిల మర్త్యస్య పార్థ చిత్తం చలాచలమ్,
వాతవేగప్రచలితా అష్ఠీలా శాల్మలే రివ. 19

భీమా! మనుజుని చిత్తము మిక్కిలి చంచలమైనదట! శాల్మలి కాయతొడిమ గాలికి ఊగులాడు విధమున మనసు ఊగులాడుచుండును.

తవైషా వికృతా బుద్ధి ర్గవాం వాగివ మానుషీ,
మనాంసి పాణ్డుపుత్రాణాం మజ్జయ త్యప్లవానివ. 20

గోవులకు మానవవాక్కు గలిగినట్లు నీ కీ వికారపు బుద్ధి పుట్టినది. అది పాండుపుత్త్రుల మనసులను, తెప్పలేని వారినివలె ముంచివైచుచున్నది.

ఇదం మే మహ దాశ్చర్యం పర్వతస్యేవ సర్పణమ్,
యదీదృశం ప్రభాషేథా భీమసేనామయం వచః. 21

భీమసేనా! నీ విటువంటి తెవులు మాట పలుకుట కొండ కదలాడినంతగా వింత గొలుపుచున్నది.

---

17. కశ్మలేన - గుండె దిగులుతో
19. అష్ఠీలా - తొడిమ - శాల్మలికాయ తొడిమ కేవలము దూదివలె ఏ చిరుగాలికైనను ఊడిపోవునట్లుండును.

స దృష్ట్వా స్వాని కర్మాణి కులే జన్మ చ భారత,
ఉత్తిష్ఠస్వ విషాదం మా కృథా వీర స్థిరో భవ. 22

మునుపటి నీ పనులు తలచుకొని, ఉత్తమకులమున పుట్టుటను స్మరించి లెమ్ము. నీరు గారిపోకుము. వీరుడవై చెదరకుండుము.

న హ్యైత దనురూపం తే యత్తే గ్లాని రరిన్దమ,
యదోజసా న లభతే క్షత్రియో న తదశ్నుతే. 23

శత్రుమర్దనా! ఇట్టి నిరుత్సాహము నీకు తగదు. క్షత్రియుడు కండబలముతో సాధింపని దానిని అనుభవింపడు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వాణి భగవద్యానపర్వాణి
భీమోత్తేజకశ్రీకృష్ణవాక్యే పఞ్చసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీముని కుడుకెక్కించు కృష్ణవాక్యముగల డెబ్బదియైదవ అధ్యాయము.

—: o :—

## షట్సప్తతితమోఽధ్యాయః
## డెబ్బదియారవ అధ్యాయము

**భీమేన కృష్ణం ప్రతి స్వసామర్థ్య కథన**
**పూర్వకం స్వశాన్తిప్రస్తావస్య కృపామూలకత్త్వకథనమ్**
**భీముడు కృష్ణునికి తన సామర్థ్య మెరిగించుచు**
**శాంతిప్రస్తావన దయతో చేసినదే యని చెప్పుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

తథోక్తో వాసుదేవేన నిత్యమన్యు రమర్షణః,
సదశ్వవత్ సమాధావత్ బభాషే తదనన్తరమ్. 1

వాసుదేవు డిట్లనగా భీముడు మంచి గుఱ్ఱము వలె కదను ద్రొక్కుచు నిట్లు పలికెను.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

అన్యథా మాం చికీర్షన్త మన్యథా మన్యసేఽచ్యుత,
ప్రణీతభావ మత్యర్థం యుధి సత్యపరాక్రమమ్. 2

నేను చేయగోరిన దొకటి. నీవు నన్ను తలచునది వేరొకటి. అచ్యుతా! నేను తీర్చిదిద్దిన భావము గలవాడను. యుద్ధమున సత్యమగు పరాక్రమము గలవాడను.

వేత్సి దాశార్హ సత్యం మే దీర్ఘకాలం సహోషితః,
ఉత వా మాం న జానాసి ప్లవన్ హ్రద ఇవాప్లవే. 3

కృష్ణా! నాతో పెద్దకాలము కలిసి యుంటివి. కావున నన్నెరుగుదువు. లేక తెప్పలేని చెరువులో తేలుచున్న వానివలె నన్నెరుగకున్నావు.

తస్మా దనభిరూపాభి ర్వాగ్భిర్మాం త్వం సమర్చసి,
కథం హి భీమసేనం మాం జానన్ కశ్చన మాధవ. 4

---

1. సమాధావత్ - తీవ్రవేగము కలుగునట్లుగా.

బ్రూయా దప్రతిరూపాణి యథా మాం వక్తు మర్హసి,
తస్మాదిదం ప్రవక్ష్యామి వచనం వృష్ణినన్దన. 5

కావున, నన్ననరాని మాటలతో నొప్పించుచున్నావు. మాధవా! భీమసేనుడ నైన నన్నెరిగి యెరిగి, నీవు పలికినట్లు ఎవడుగాని, విరుద్ధమైన పలుకులు పలుకునా? కావున వృష్ణినందనా! ఇదిగో పలుకుచున్నాను వినుము.

ఆత్మనః పౌరుషం చైవ బలం చ న సమం పరైః,
సర్వథాఽనార్యకర్మైతత్ ప్రశంసా స్వయమాత్మనః 6.
అతివాదాపవిద్ధస్తు వక్ష్యామి బలమాత్మనః.

నా పౌరుషము, బలము పరులతో పోల్చదగినది కాదు. తన్ను తాను పొగడుకొనుట సర్వవిధముల ఆర్యులు చేయు పని కాదు. కాని నీ అధిక ప్రసంగము పోటు దిని నాబలమునుగూర్చి చెప్పుచున్నాను.

పశ్యేమే రోదసీ కృష్ణ యయో రాసన్నిమాః ప్రజాః,
అచలే చాప్రతిష్ఠే చా ప్యనన్తే సర్వమాతరౌ. 7
యదిమే సహసా క్రుద్ధే సమేయాతాం శిలే ఇవ. 8

చూడు. ఈ భూమి ఆకాశములు, ప్రజలందరు దీని నంటిపెట్టుకొని యున్నారు. చలనము లేనివి. బాగుగా కుదురుకొన్నవి. అంతము లేనివి. అన్నింటికి తల్లివంటివి. నేను ఒక్క పెట్టున క్రుద్ధుడనైనచో ఈ రెండును-రాల వలె- ఏకమైపోవును.

అహమేతే నిగృహ్ణీయాం బాహుభ్యాం సచరాచరే

చరాచరములతో పాటు ఈ రెంటిని నేను చేతులతో పట్టి నిలుపగలను.

పశ్యైతద న్తరం బాహ్వోర్మహాపరిఘయో రివ,
య ఏతత్ప్రాప్య ముచ్యేత న తం పశ్యామి పూరుషమ్. 9

చూడు, గొప్ప గడియమానుల వలెనున్న నా బాహువుల వైశాల్యము. ఇందు చిక్కి విడిపించుకొనగల మగవాని నే నెందును చూడలేదు.

---

7. రోదసీ-నేల, నింగి.

హిమవాంశ్చ సముద్రశ్చ వజ్రీ వా బలభిత్ స్వయమ్,
మయాఽభిపన్నం త్రాయేరన్ బలమాస్థాయ న త్రయః. 10

హిమవంతుడు, సముద్రుడు, బలుని చంపిన వజ్రహస్తుడు దేవేంద్రుడు-ఈ ముగ్వురు కలిసియు బలమంతయు పుంజుకొని కూడ నా చేతికి చిక్కిన వానిని రక్షింపజాలరు.

యుద్ధార్థాన్ క్షత్రియాన్ సర్వాన్ పాణ్డవే ష్వాతతాయినః,
అధః పాదతలేనైతా నధిష్ఠాస్యామి భూతలే. 11

పాండవులయందు ద్రోహబుద్ధి గలిగి యుద్ధమునకు సిద్ధపడిన క్షత్రియుల నందరను అఱకాలితో త్రొక్కి నేలలో పాతిపెట్టుదును.

నహి త్వం నాభిజానాసి మమ విక్రమ మచ్యుత,
యథా మయా వినిర్జిత్య రాజానో వశగాః కృతాః. 12

అచ్యుతా ! నా పరాక్రమము నీ వెరుగవనుటకు వీలులేదు. నేను రాజు లందరను గెలిచి నావశము చేసికొనుటను నీవెరుగుదువు.

అథ చేన్మాం న జానాసి సూర్యస్యే వోద్యతః ప్రభామ్,
విగాఢే యుధి సంబాధే వేత్స్యసే మాం జనార్దన. 13

అయినను, ఉదయించుచున్న సూర్యుని వెలుగు నెరుగనట్లు, నన్నెరుగ వేని ఘోరమైన దొమ్మికయ్యము కలిగినపుడు నీవే చూతువు గదా !

పరుషై రాక్షిపసి కిం వ్రణం పూతి మివోన్నయన్. 14

పుండు కెలికినట్లు వాడి మాటలతో నన్ను పొడిచెద వేల?

యథామతి బ్రవీమ్యేత ద్విద్ధి మామధికం తతః,
ద్రష్టాఽసి యుధి సమ్బాధే ప్రవృత్తే వైశసేఽహని. 15

ఏదో తోచినంతవరకు చెప్పుదును. కాని నిజమున కంతకంటె మించిన వాడ నని యెరుగుము. శత్రువులను చావగొట్టు ఘోరయుద్ధము కలిగినపుడు నీవే చూతువు గదా !

---

13. సంబాధే - దొమ్మికయ్యమునందు

మయా ప్రణున్నా న్మాతఙ్గా న్రథినః సాదిన స్తథా,
తథా నరా నభిక్రుద్ధం నిఘ్నన్తం క్షత్రియర్షభాన్. 16

ద్రష్టా మాం త్వం చ లోకశ్చ వికర్షన్తం వరాన్ వరాన్,
న మే సీదన్తి మజ్జానో న మమోద్వేపతే మనః. 17

ఏనుగులు, రథికులు, గుఱ్ఱములవారు, కాల్బంటులు, క్షత్రియశ్రేష్ఠులు, వీరిలో గట్టిగట్టివారి నేరి యేరి లాగి చావగొట్టుచున్న నన్ను నీవును లోకమును చూడగలరు. అట్లు చేయుచున్న నా క్రొవ్వరుగదు, హృదయము బెదరదు.

సర్వేలోకా దభిక్రుద్ధా న్న భయం విద్యతే మమ,
కింతు సౌహృద మేవైతత్ కృపయా మధుసూదన,
సర్వాం స్తితిక్షే సంక్లేశాన్ మా స్మ నో భరతా నశన్. 18

లోకములన్నియు తీవ్రకోపముతో నెదుర్కొన్నను నాకు భయము లేదు. అయినను మంచితనముతో జాలితో మధుసూదనా! ఈ క్లేశము లన్నింటిని సహింతును. భరతవంశమువారు నశింపకుందురు గాక.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీమసేనవాక్యే షట్సప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీమసేనుని వాక్యముగల డెబ్బదియాఱవ అధ్యాయము.

—: o :—

# సప్తసప్తతితమోఽధ్యాయః
# డెబ్బదియేడవ అధ్యాయము

శ్రీకృష్ణేన స్వవాక్యస్య తేజఃసందీపనార్థత్వ
కథనపూర్వకం భీమస్యాశ్వాసనమ్.

శ్రీకృష్ణుడు తనమాట పౌరుషము రెచ్చ
గొట్టుటకే యని చెప్పుచు భీము నూరడించుట.

శ్రీ భగవానువాచ-శ్రీ భగవాను డిట్లు పలికెను.

భావం జిజ్ఞాసమానోఽహం ప్రణయాదిద మబ్రువమ్,
న చాక్షేపాన్న పాణ్డిత్యా న్న క్రోధాన్న వివక్షయా. 1

భీమా : నీ భావ మెరుగగోరి చనవుతో నిట్లంటిని. అంతేకాని, నిన్నాక్షేపించుటకో, నా తెలివి చూపుటకో, క్రోధమువలననో, నీ స్వరూప మెరుగగోరియో కాదు.

వేదాహం తవ మాహాత్మ్య ముత తే వేద యద్బలమ్,
ఉత తే వేద కర్మాణి న త్వాం పరిభవా మ్యహమ్. 2

నీ గొప్పతనము, నీ బలము, నీవు సాధించిన ఘనకార్యములు అన్నియు నే నెరుగుదును. నేను నిన్ను పరాభవింపను.

యథా చాత్మని కల్యాణం సంభావయసి పాణ్డవ,
సహస్రగుణ మప్యేత త్త్వయి సంభావయా మ్యహమ్. 3

నీయందు, నీవు భావించు మేలుగుణమునకు, పాండవుడా! వేయిరెట్లు నేను సంభావింతును.

యాదృశే చ కులే జన్మ సర్వరాజాభిపూజితే,
బన్ధుభిశ్చ సుహృద్భిశ్చ భీమ త్వమసి తాదృశః. 4

భీమా! రాజులందరు గొప్పగా మన్నించు కులమునకు, బంధువులకు, మిత్రులకు తగిన పుట్టుక నీయది.

జిజ్ఞాసన్తో హి ధర్మస్య సన్దిగ్ధస్య వృకోదర,
పర్యాయం నాధ్యవస్యన్తి దేవమానుషయో ర్జనాః. 5

వృకోదరా! దేవతలకు సంబంధించినదియు, మానవత్వమునకు సంబంధించినదియు నగు ధర్మము విషయమున సందేహ మేర్పడినపుడు దానిని నిశ్చయముగా తెలియగోరువారు సరియగు నిర్ణయమును పొందజాలరు.

స ఏవ హేతుర్భూత్వా హి పురుషస్యార్థసిద్ధిషు,
వినాశేఽపి స ఏవాస్య సన్దిగ్ధం కర్మ పౌరుషమ్. 6

మనుజుని కార్యములు సిద్ధించుటయందా ధర్మమెట్లు కారణమై పురుషకారమును సందేహరూపమున నుండునో, కార్యములు చెడుటయందును అట్లే సందేహరూపముననే యుంచును.

అన్యథా పరిదృష్టాని కవిభి ర్దోషదర్శిభిః,
అన్యథా పరివర్తన్తే వేగా ఇవ నభస్వతః. 7

---

5. సన్దిగ్ధస్య - సందేహముతో కూడిన, ధర్మస్య - ధర్మమును; జిజ్ఞాసన్తః - తెలియగోరు; జనాః - జనులు; న, అధ్యవస్యన్తి - నిశ్చయింపలేకున్నారు. ఇచట ధర్మము, దేవధర్మమనియు, మానుషధర్మమనియు రెండు విధములు. దేవధర్మ మనగా రాబోవు పుణ్యాపాపఫలమని భావము; పర్యాయమనగా - పర్యంతము తుదిఫలము - బుద్ధి కుశలత గల దైవజ్ఞులు నిర్ణయించిన విషయములు కూడ తారుమారగుచుండుట కన్పట్టుచున్నది. ఇక మానుషధర్మ మనగా పురుషుడు చేయు ప్రయత్నము మొదలగునది. దాని తుదిఫలము కూడ నిశ్చయించి చెప్పజాలము. ఎట్లన శూరుడును ఒక్కొక్కప్పుడు నీరుగారి పోవుచున్నాడు. దైవజ్ఞులు నిర్ణయించిరనియో, నేను పౌరుషము కలవాడననియో భావించి ఫలితమిట్లే యగునని నిర్ణయింపజాలమని తాత్పర్యము.
6. స ఏవ - ఆ ధర్మమే; సన్దిగ్ధమ్ - సందేహముతో కూడిన ఫలము కలదియగుచున్నది.
7. పరిదృష్టాని - చేయదగినవిగా యుక్తిపూర్వకముగా నిర్ణయించిన కార్యములు.

రాబోవు కీడులను ముందే పరికించు మేధావులు నిశ్చయించిన కార్యము లోకవిధముగా నుండగా అవి, గాలి వేగమువలె మరియొక తీరున మార్పులు చెందుట గానవచ్చుచున్నది.

సుమన్త్రితం సునీతం చ న్యాయత శ్చోపపాదితమ్,
కృతం మానుష్యకం కర్మ దైవేనాపి విరుధ్యతే. 8

చక్కగా ఆలోచించి చక్కగా న్యాయమార్గమున చేసిన మానుషకర్మమును కూడ దైవము నిష్ఫలము చేయుచున్నది.

దైవమ ప్యకృతం కర్మ పౌరుషేణ విహన్యతే,
శీతముష్ణం తథా వర్షం క్షుత్పిపాసే చ భారత! 9

ఒకప్పుడు చలి, ఎండ, వాన, ఆకలిదప్పులు మొదలగు తనంతతానుగా నగు దైవకర్మముకూడ పురుషప్రయత్నముతో చెడుచున్నది.

యదన్య ద్దిష్టభావస్య పురుషస్య స్వయంకృతమ్,
తస్మా దనుపరోధశ్చ విద్యతే తత్ర లక్షణమ్. 10

పురుషుడు ప్రారబ్ధకర్మముకంటె వేరైనదియు, స్వయముగా చేసినదియు నగు సంచితకర్మము కూడ మరుజన్మమున చెడుట కానవచ్చుచున్నది. ఆ విషయమున ప్రమాణము కూడ కలదు.

---

8. సునీతమ్ - చక్కగా అనుష్ఠింపబడినది; విరుధ్యతే - నిష్ఫలమగుచున్నది.
9. దైవమ్ - అదృష్టరూపమున వచ్చునది, అకృతమ్ - తానై చేయనిది - కాలస్వభావమునుబట్టి ఏర్పడునది; అట్టిదికూడ పౌరుషేణ - పురుష ప్రయత్నము చేత, విహన్యతే - చెడుచున్నది. చలి వేసినచో దుప్పటి కప్పుకొని మానవుడు దానిని పోగొట్టుకొనుట వంటిది.
లేదా :- తన సుఖముకొరకు చేయవలసిన పుణ్యకర్మము తాను చేయక పోయినను, భవిష్యత్తులో దుఃఖము కూర్చునని దైవజ్ఞులు నిర్ణయించి నప్పటికిని అది జరుగుట లేదు. అనగా పురుషకారము దైవమును త్రోసి వేయుట కానవచ్చుచున్నదని తాత్పర్యము.
10. దిష్టః - ఫలము ననుభవించుటకై దైవము ఆదేశించిన; భావః - ఉనికి కలది - అనగా ప్రారబ్ధకర్మము - అది భోగమువలననే నశించును -

లోకస్య నాన్యతో వృత్తిః పాణ్డవాన్యత్ర కర్మణః,
ఏవం బుద్ధిః ప్రవర్తేత ఫలం స్యాదుభయాన్వయే. 11

పాండుకుమారా! పురుషకారముకంటె విడిగా ఎందును లోకమునకు బ్రదుకులేదు. మానవు డిట్టి బుద్ధితో మెలగవలయును. ఫలము మాత్రము దైవమునుబట్టియు మానవప్రయత్నమును బట్టియు సిద్ధించును,

య ఏవం కృతబుద్ధిః స కర్మస్వేవ ప్రవర్తతే,
నాసిద్ధౌ వ్యథతే తస్య న సిద్ధౌ హర్ష మశ్నుతే. 12

---

దిష్టభావస్య అన్యత్ - ప్రారబ్ధముకంటె వేరైనది యగు సంచితకర్మము; పురుషస్య - పురుషునిచేత; సంచితమితి యత్ - సంచిత మనునది యేది కలదో; అట్టి స్వయంకృతం కర్మ - స్వయముగా చేసిన కర్మము; తస్మాత్ - అట్టి కర్మమువలన; అనుపరోధః - నిరోధము - ఆటంకము - లేకుండుట కానవచ్చుచున్నది. సంచితకర్మముకూడ మరు జన్మమున పురుషప్రయత్నముచేత చెడిపోవుచున్నదని తాత్పర్యము. అట్లు చెడుట జ్ఞానముచేతనో, ప్రాయశ్చిత్తాదికము చేతనో, తత్ర - ఆ విషయమున; లక్షణమ్ - శ్రుతిస్మృతులు చెప్పిన ప్రమాణము; విద్యతే - కలదు. "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే," "ధర్మేణ పాప మపనుదతి"వంటివి. అన్ని విషయములలో పురుషకారము తప్పక చేయవలయునని తాత్పర్యము.

11. కర్మణః అన్యత్ర - పౌరుషము కంటె భిన్నముగా; అన్యతః - మరి యొకదానివలన - అనగా కేవలము దైవమువలన - వృత్తిః - బ్రదుకు; న-లేదు; ఏవంబుద్ధిః - ఇట్టి జ్ఞానము గలవాడై, ప్రవర్తేత - మెలగవలయును; ఉభయాన్వయే - దైవపురుషకారముల సంబంధము నందు; ఫలం - ఫలము; స్యాత్ - కలుగును. కేవలము దైవమువలననే ఫలము కలుగునని పురుషకారము మానరాదని తాత్పర్యము.

12. రైతు వ్యవసాయము చేసి దైవ మనుకూలింపగా పంట పొంది పొంగిపోడు. ఏలయన ఫలము ఆకస్మికముగా గలిగినది కాదుకదా! దైవ మనుకూలింపని కారణముగా పంట రానిచో క్రుంగిపోడు. ఇట్లగుటయు సంభవించును గదా! అట్లే ఇందును భావింపవలయునని తాత్పర్యము.

ఇట్లు నిశ్చితబుద్ధిగం మనుజుడు కర్మములందు ప్రవర్తించుచునే యుండును. ఆ కర్మము ఫలింపకున్నచో వ్యథ చెందడు. ఫలించినచో పొంగి పోవడు.

తత్రేయ మనుమాత్రా మే భీమసేన వివక్షితా,
నైకాన్తసిద్ధి ర్వక్తవ్యా శత్రుభిః సహ సంయుగే. 13

భీమసేనా! ఇందు నిశ్చయమేదో నేను చెప్పగోరుచున్నాను. శత్రువులతో పోరు కలిగినపుడు తప్పక జయమే కలుగునని చెప్పజాలము.

నాతిప్రహీణరశ్మిః స్యాత్తథా భావవిపర్యయే,
విషాద మర్ఛేద్ గ్లానిం వాఽప్యేత మర్థం బ్రవీమి తే. 14

అనుకొన్నది తారుమారైనపుడు వెల తెల పోరాదు. విషాదమును పొంద రాదు. నీరుగారి పోరాదు. ఈ విషయమును నీకు చెప్పుచున్నాను.

శ్వోభూతే ధృతరాష్ట్రస్య సమీపం ప్రాప్య పాణ్డవ,
యతిష్యే ప్రశమం కర్తుం యుష్మదర్థ మహాపయన్. 15

రేపు ధృతరాష్ట్రుని కడ కరిగి, మీ పని చెడకుండ శాంతి గావించుటకు యత్నింతును.

శమం చేత్తే కరిష్యన్తి తతోఽనన్తం యశో మమ,
భవతాం చ కృతః కామ స్తేషాం చ శ్రేయ ఉత్తమమ్. 16

వారు శాంతి పొందుదురేని దానివలన నాకు అంతులేని కీర్తి కల్గును. మీ కోరికయు నెరవేరును. వారికి గొప్పమేలు చేకూరును.

---

13. పై విషయమును ప్రకృతార్థమున సమన్వయించుచున్నారు. అను మాత్రా - నిశ్చయము - 'మాత్రం కార్ త్స్న్యేఽవధారణే' అని కోశము. నపుంసకలింగశబ్దమును స్త్రీలింగముగా వాడుట ఆర్షము.
14. ప్రహీణరశ్మిః - ప్రభ తరిగిపోయినవాడు; న అర్ఛేత్ - పొందరాదు.
16. తే అను పదమును కురవః అని దానితో కలిపి అర్థము చెప్పుకొన వలయును. ఆ కౌరవులు.

తే చే దభినివేక్ష్య న్తే నాభ్యుపైష్య న్తి మే వచః,
కురవో యుద్ధమేవాత్ర ఘోరం కర్మ భవిష్యతి. 17

అట్లుకాక ఆ కౌరవులు మొండిపట్టు పట్టి నా మాట వినక యుద్ధమునకే సిద్ధపడినచో మహా ఘోరము సంభవించును.

అస్మిన్ యుద్ధే భీమసేన త్వయి భారః సమాహితః,
ధూ రర్జునేన ధార్యా స్యా ద్వోఢవ్య ఇతరో జనః. 18

భీమసేనా! ఈ యుద్ధమున భారమంతయు నీయందే నిలిపితిమి. అర్జును డొక కొమ్ము కాయును. తక్కిన బరువంతయు తక్కినవారు పూనుదురు.

అహం హి యన్తా బీభత్సో ర్భవితా సంయుగే సతి,
ధనఞ్జయస్యైష కామో నహి యుద్ధం న కామయే. 19

యుద్ధమే అయినచో నేను అర్జునునకు సారథి నగుదును. ఇది అర్జునుని కోరిక. నేను యుద్ధము చేయగోరనని కాదు.

తస్మా దాశఙ్కమానోఽహం వృకోదర మతిం తవ,
గదతః క్లీబయా వాచా తేజస్తే సముదీపితమ్. 20

ఆ కారణమున, వృకోదరా! నీవు మగతనము లేని పలుకు పలుకగా నీ బుద్ధి యేమో తెలియక దానిని ఎగసన ద్రోసితిని.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కృష్ణవాక్యే సప్తసప్తతితమోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణవాక్యము గల డెబ్బదియేడవ అధ్యాయము.

—: ౦ :—

---

17. అభినివేక్ష్యన్తే చేత్ - పట్టు పట్టుదురేని; న - అభ్యుపైష్యన్తి చేత్ - పట్టించుకొనరేని;
18. భీముడు రథమువంటివాడు, అర్జునుడు గుఱ్ఱమువంటివాడని తాత్పర్యము.
19. నహి యుద్ధం న కామయే - నేను యుద్ధము కోరనని కాదు. నిజమునకు నేనే యుద్ధము చేయగలను. చేయగోరుదును. కాని అర్జునుడు సారథ్యము చేయుమనియే యడిగెను. కావున ఆ పనినే చేయుదునని భావము.

# అష్టసప్తతితమోఽధ్యాయః
# డెబ్బదియెనిమిదవ అధ్యాయము

## అర్జునవాక్యమ్
## అర్జునుని పలుకు

అర్జున ఉవాచ-అర్జును డిట్లు పలికెను.

ఉక్తం యుధిష్ఠిరేణైవ యావద్వాచ్యం జనార్దన,
తవ వాక్యం తు మే శ్రుత్వా ప్రతిభాతి పరంతప. 1

జనార్దనా! చెప్పవలసిన దంతయు యుధిష్ఠిరుడే చెప్పెను. కాని నీ మాట విన్న నాకు ఇట్లనిపించుచున్నది.

నైవ ప్రశమ మత్ర త్వం మన్యసే సుకరం ప్రభో,
లోభా ద్వా ధృతరాష్ట్రస్య దైన్యాద్వా సముపస్థితాత్. 2

ధృతరాష్ట్రుని లోభమువలననో మనకు దైన్యము వచ్చిపడుననియో ఇచట శాంతి యగుట సుకరమే కాదని నీవు తలపోయుచున్నావు.

అఫలం మన్యసే వాఽపి పురుషస్య పరాక్రమమ్,
న చాన్తరేణ కర్మాణి పౌరుషేణ బలోదయః. 3

మానవు డందరను రక్షింప బూనుకొనుట నిష్ఫలమనియు నీ తలంపు. అంతయు పూర్వకర్మమును బట్టియే జరుగును కాని కేవలము పౌరుషము వలన బలము పెంపొందదనియు నీ భావన.

---

2. దైన్యాద్వా - మాదైన దైన్యమువలన.
3. పరాక్రమమ్ - ఇచట ఈ పదమునకు సందర్భమును బట్టి అందరను రక్షించు యత్నము అను నర్థము గ్రహింపవలయును.
కర్మాణి - జీవమునకు విత్తనముల వంటివగు పురాకృతకర్మములను, అన్తరేణ - వదలి, పౌరుషేణ - కేవలపౌరుషముచేత, బలోదయః - బలము పెరుగుట, నస్యాత్ - కలుగదు.

తదిదం భాషితం వాక్యం తథాచన తథైవ తత్,
న చైత దేవం ద్రష్టవ్య మసాధ్య మపి కిఞ్చన. 4

నీవు పలికిన మాటయు నది యట్టిదే. కాని శాంతిని సాధించుటయు నీకు అసాధ్యమైనదిగా నాకు కానరాదు.

కించైత న్మన్యసే కృచ్ఛ్రి మస్మాక మవసాదకమ్,
కుర్వన్తి తేషాం కర్మాణి యేషాం నాస్తి ఫలోదయః. 5

కృష్ణా! మేనుందరము నశించు ఈ యుద్ధ మను సంకటమును నీ వంగీకరింతువా? ఏ ఫలమును సాధింపని మనుజుల కర్మములు హింసించునవే యగును గదా!

---

4. తదిదం భాషితం వాక్యమ్ - 'నేను యుద్ధమును కాంక్షించుట లేదనను' అని నీవంటివే, తథైవ తత్ - ఆ మాట అట్టిదే, తథాచన - అయినప్పటికిని- నిజమునకు యుద్ధమగుట నా కిష్టము కానప్పటికిని నీ మాటను బట్టి యుద్ధమే యగు ననుకొందము' అని తాత్పర్యము. శాంతిని సాధించుటయు నీకు శక్యమే అనుచున్నాడు. ఏవమ్ - అదే విధముగా, ఏతత్ అపి - ఇదియును - శాంతిని సాధించుటయు; కిఞ్చన - ఏ మాత్రమును, అసాధ్యమ్ - సాధ్యము కానిదిగా; న ద్రష్టవ్యమ్ - చూడరానిది, నీవు తలచుకొన్నచో శాంతిని కూడ సాధింపగలవని తాత్పర్యము.

5. ఏతత్ కృచ్ఛ్రమ్ - ఈ యుద్ధ మనెడు సంకటమును; అస్మాకమ్ - మా కురుపాండవుల(ను); అవసాదకమ్ - నాశనము చేయుదానిని; మన్యసే- కిమ్ - అంగీకరింతువా యేమి? యేషాం - ఏ మనుజులయొక్క, ఫల- ఉదయః-ఫలము సిద్ధించుట; నాస్తి-లేదో; తేషామ్-ఆ నరుల; కర్మాణి- కర్మములు; కుర్వన్తి - హింసించును. ఈ కుర్వన్తి అనునది కృ హింసాయామ్ అను ధాతువునుండి యేర్పడిన రూపము. 'కృణ్వన్తి' అను దానికి ఆర్షరూపము. లేదా లేఖకప్రమాదమువలన ఏర్పడినవి.

ఫలము సాధింపని కర్మములు హింసించుటకే తప్ప మఱి దేనికిని కొరగావని తాత్పర్యము. దండముతో సాధింపదగిన శత్రువునందు సామము పనికిరాదని న్యాయము. దానిని బట్టి బ్రదుకు తెరువు కూడ కల్పింపగోరని కౌరవులయందు సామము దుష్కరమని తాత్పర్యము. అయినచో సామము నేల కోరుచున్నావు? అను ప్రశ్నకు సమాధానమును పై శ్లోకమున చెప్పుచున్నారు.

సంపాద్యమానం సమ్యక్ చ స్యాత్ కర్మ సఫలం ప్రభో,
స తథా కృష్ణ వర్తస్వ యథా శర్మ భవేత్పరైః. 6

ప్రభూ ! చేయుపని చక్కగా నెరవేరినచో సఫలము అగును. కృష్ణా ! పరులతో శాంతి యగు తీరున నీవు మెలగవలయును.

పాణ్డవానాం కురూణాం చ భవాన్నః ప్రథమః సుహృత్,
సురాణా మసురాణాం చ యథా వీర ప్రజాపతిః. 7

దేవతలకు రాక్షసులకు ప్రజాపతి యెట్లో యట్లే నీవు పాండవులకును, కౌరవులకును కావలసినవారిలో ముఖ్యుడవు.

కురూణాం పాణ్డవానాం చ ప్రతిపత్స్వ నిరామయమ్,
అస్మద్ధిత మనుష్ఠానం మన్యే తవ న దుష్కరమ్. 8

కౌరవులకు పాండవులకు కుశలమును సాధింపుము. మా అందరకు హిత మును కూర్చుట నీకు దుష్కరమని నే ననుకొనను.

ఏవం చ కార్యతా మేతి కార్యం తవ జనార్దన,
గమనా దేవమేవ త్వం కరిష్యసి జనార్దన. 9

ఇట్లయినచే నీ పని ఔచిత్యమును పొందును. ఇట్లు నీవేగుట వలననే ఆ పని సాధింపగలవు.

చికీర్షిత మథాన్యత్తే తస్మిన్ వీర దురాత్మని,
భవిష్యతి చ తత్సర్వం యథా తవ చికీర్షితమ్. 10

ఓయి వీరుడా! ఆ దురాత్మునియందు మఱేదేని నీవు చేయగోరుదువేని అది యంతయు నీ కోరికప్రకారమే కాగలదు.

---

6. మనము చేయు పని ఏ లోపము లేకుండ నిర్వహించినచో ఫలితము తప్పక లభించునని భావము. 'ప్రభో' అను సంబోధనలో నీవు తలంచు కొన్నచో అట్టి వారి నుండియు సామోపాయమున కార్యసాఫల్యము సిద్ధించుననుట వ్యంగ్యము.

8. నిరామయమ్ - కుశలమును.

9. కార్యతామ్ - ఔచిత్యమును.

శర్మ తైః సహ వా నోఽస్తు తవ వా యచ్చికీర్షితమ్,
విచార్యమాణో యః కామ స్తవ కృష్ణ స నో గురుః,
న సనార్హతి దుష్టాత్మా వధం ససుతబాన్ధవః. 11

కృష్ణా! మాకు వారితో శాంతియే యగుగాక! లేదా నీ వేది చేయగోరితివో యదియే యగుగాక! నీవు విచారించి నిర్ణయించిన నీ యిష్టమే మాకు గురువు. ఆ దుష్టాత్ముడు కొడుకులతో బందుగులతో వధమునకు తగినవాడు కాడని మా భావము కాదు.

యేన ధర్మసుతే దృష్టా న సా శ్రీ రుపమర్షితా,
యచ్చాప్యపశ్యతోపాయం ధర్మిష్ఠం మధుసూదన. 12
ఉపాయేన నృశంసేన హృతా దుర్ద్యూతదేవినా.

ఆ నీచునకు ధర్మరాజునందు కానవచ్చిన సంపదను చూచి కన్ను కుట్టెను. దానిని సాధించుటకై మిక్కిలి ధర్మమగు ఉపాయము వానికి తోచలేదు. అతిక్రూరమగు జూదమను ఉపాయముతో కపటమార్గమున దానిని కొల్ల గొట్టెను.

---

11. కృష్ణునితో తనకు వ్యవహారరీతిలో అభిప్రాయభేద మున్నట్లు పలికినను అర్జునుడు తత్త్వమును చెప్పుచున్నాడు. విచార్యమాణః కామః - నీవు చక్కగా విచారించి చేయదలచినది; నః - మాకు; గురుః - ఉపదేశించునది. మే మట్లు నడుచుకొందుమని భావము. 'ప్రాణమునకు ప్రాణము, కంటికి కన్ను, చెవికి చెవి, మనస్సునకు మనస్సుగా బ్రహ్మము నెరిగిన వారు నిశ్చయింతురు' అను శ్రుత్యర్థమువలన నా మనస్సునకు నీవే ప్రభుడవు. కావున నీ యిచ్ఛయే మమ్ము నడుపునది యగును. - అని అర్జునుని భావన. నిజమునకు నీ యిచ్ఛయే తగినదని 'న స నార్హతి' ఇత్యాదివాక్యముచే చెప్పుచున్నాడు. దుర్యోధనుడు దుష్టబుద్ధి కనుక పుత్రులతో బంధువులతో వధకే అర్హమైన వాడని నీవు తలచునదియే యుక్తమని తాత్పర్యము.

12. ధర్మిష్ఠమ్-యుద్ధము మొదలైన ధర్మమార్గమును.

కథం హి పురుషో జాతః క్షత్రియేషు ధనుర్ధరః,
సమాహూతో నివర్తేత ప్రాణత్యాగేఽప్యవస్థితే. 13

క్షత్రియకులమున పుట్టిన ధనుర్ధనుడు జూదమునకై పరుడు పిలువగా ప్రాణము పోయెడు పరిస్థితి దాపురించినను ఎట్లు మరలును?

అధర్మేణ జితాన్ దృష్ట్వా వనే ప్రవ్రాజితాం స్తథా,
వధ్యతాం మమ వార్ష్ణేయ నిర్గతోఽసౌ సుయోధనః. 14

ఆ దుర్యోధనుడు అధర్మముతో మమ్ములను గెలుచుటను, అడవులకు మమ్ము త్రోలుటను గాంచి, కృష్ణా! వాడు నాకు వధ్యుడని నీవు నిశ్చయించితివి.

నచైతదద్భుతం కృష్ణ మిత్రార్థే యచ్చికీర్షసి.

చెలిమిగల మాకై నీవు చేయగోరిన దానియందు అచ్చెరువు పడవలసిన దేమియు లేదు.

క్రియా కథం చ ముఖ్యా స్యా న్మృదునా చేతరేణ వా. 15
అథవా మన్యసే జ్యాయాన్ వధస్తేషా మనన్తరమ్,
తదేవ క్రియతా మాశు న విచార్యమతస్త్వయా. 16

సామముచేతనో, దానికంటె భిన్నమగు దండముచేతనో మన కార్యము ఎట్లయినను ఫలవంతము కావలయును. అట్లుకాక వారి వధయే మేలైనదిగా నీవు తలచినచో అట్లే కానిమ్ము. ఆ పిదప నీవు విచారింపరాదు.

జానాసి హి యథై తేన ద్రౌపదీ పాపబుద్ధినా,
పరిక్లిష్టా సభామధ్యే తచ్చ తస్యోవమర్షితమ్. 17

ఆ పాపబుద్ధి నిండు సభలో ద్రౌపది నెంత కష్టపెట్టెనో నీ వెరుగుదువు. ఆ నీచుని ఆ పాడు పనిని కూడ మేము సహించితిమి.

---

13. హృతా-సంపద కొల్లగొట్టబడినది.

14. సమాహూతః (ద్యూతమునకు) పిలువబడినవాడు.

15. నిర్గతః-నిశ్చయింపబడినవాడు; కథం చ-ఎట్లయినను, ముఖ్యా - ఫలము నిచ్చునది; మృదునా-సామముచేత, ఇతరేణ వా-యుద్ధము చేతనైనను.

స నామ సమ్యగ్వర్తేత పాణ్డవేష్వితి మాధవ,
న మే సంజాయతే బుద్ధి ర్బీజము ప్తమివోషరే. 18

మాధవా! వాడు పాండవులయందు తిన్నగా ప్రవర్తించునను బుద్ధి నాకు నిశ్చయముగా గలుగుట లేదు. మేము చేసినదంతయు వాని యెడ చవిటినేలలో విత్తిన విత్తనమువలె నైనది.

తస్మాద్యన్మన్యసే యుక్తం పాణ్డవానాం హితం చ యత్,
తథాశు కురు వార్ష్ణేయ యన్నః కార్యమనన్తరమ్. 19

కృష్ణా! కావున పాండవు లేది చేయవలయునో, వారి కేది మేలైనదియో, నీవు తలచినట్లు వెంటనే చేయుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
అర్జునవాక్యే అష్టసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
అర్జునవాక్యముగల డెబ్బదియెనిమిదవ అధ్యాయము.

—:o:—

---

18. నామ - నిశ్చితముగా; సః - ఆ దుర్యోధనుడు; పాణ్డవేషు - పాండవుల విషయమున; సమ్యక్ - తిన్నగా, వర్తేత - ప్రవర్తించును అను; బుద్ధిః - తలపు; మే - నాకు; న సంజాయతే - కలుగుట లేదు. వాడెన్నటికిని తన తప్పు తెలిసికొని బుద్ధి మార్చుకొనడని భావము.

# ఊనాశీతితమో౽ధ్యాయః
# డెబ్బదితొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణే నార్జునకథన స్యోత్తరదానమ్
## శ్రీకృష్ణుడు అర్జునుని మాటకు బదులు చెప్పుట.

శ్రీ భగవానువాచ-శ్రీభగవాను డిట్లు పలికెను.

ఏవమేత న్మహాబాహో యథా వదసి పాణ్డవ,
పాణ్డవానాం కురూణాం చ ప్రతిపత్స్యే నిరామయమ్. 1

పాండుకుమారా! మహాబాహూ! నీవు పలికిన మాట అట్టిదే. పాండవులకు కౌరవులకు కుశలము కూర్తును.

సర్వం త్విదం మమాయత్తం బీభత్సో కర్మణోర్ద్వయోః,
క్షేత్రం హి రసవచ్ఛుద్ధం కర్మణైవోపపాదితమ్. 2
ఋతే వర్షాన్న కౌన్తేయ జాతు నిర్వర్తయేత్ ఫలమ్.

ఓయి బీభత్సూ! ఈ రెండు పనులలో అందరకు కుశలము కూర్చుట యనునది నామీద నిలిచియున్నది. చక్కగా దున్నిననేల కలుపు మొక్కలు లేనిదై నీటితో తడిసియున్నది. కాని వర్షము లేనిచో ఎన్నటికిని పంట నొసగదు గదా!

---

2. ద్వయోః - రెంటిలో - శాంతి కూర్చుట, యుద్ధము అను రెంటిలో; సర్వమ్ - అంతయు; మమ - దూతనైన నాయొక్క; అధీనమ్ - వశమున నున్నది; కర్మణా - దున్నుట చేత, నూతినీరు పెట్టుట మొదలగు దానిచేత, శుద్ధమ్ - కలుపు లేకుండ చేసిన, రసవత్ - తడిసినదిగా; ఉపపాదితమ్ - చేసిన; క్షేత్రమ్ - పొలము.

బొత్తుగా వర్షము లేనిచో పంట పండని విధమున దైవానుకూల్యము లేనిచో పురుషప్రయత్నముకూడ కేవలముగా ఫలదాయకము కాదని భావము.

తత్ర వై పౌరుషం బ్రూయురాసేకం యత్ర కారితమ్. 3
తత్ర చాపి ధ్రువం పశ్యేచ్ఛోషణం దైవవారితమ్,
తదిదం నిశ్చితం బుద్ధ్యా పూర్వైరపి మహాత్మభిః. 4

తడుపుట వరకు చేసిన ఆ పనినంతటిని పురుషకార మందురు. అయినను బావి మొదలగునది యెండిపోవుటయు నిశ్చయముగా కానవచ్చుచున్నది. అది దైవము చేష్ట. ఇది యిట్లని మహాత్ములగు పూర్వులు నిశ్చయించిరి.

దైవే చ మానుషే చైవ సంయుక్తం లోకకారణమ్,
అహం హి తత్కరిష్యామి పరం పురుషకారతః. 5
దైవం తు న మయా శక్యం కర్మ కర్తుం కథంచన.

లోకమునకు హితము కూర్చు సాధనము దైవమునందు, మనుష్య యత్నమునందును కలిసి నెలకొనియున్నది. నేను మాత్రము పురుషప్రయత్నమును తుదిదాక చేయుదును. దైవమగు కర్మము మార్చుటకు నాకెన్నటికిని సాధ్యముకాదు.

స హి ధర్మం చ లోకం చ త్యక్త్వా చరతి దుర్మతిః,
నహి సంతప్యతే తేన తథారూపేణ కర్మణా. 6

ఆ దుర్మతి దుర్యోధనుడు ధర్మమును కైకొనక, లోకమును లెక్కగొనక తిరుగుచున్నాడు. అట్టి నీచకార్యమునకు ఏ మాత్రము బాధపడడు.

తథాఽపి బుద్ధిం పాపిష్ఠాం వర్ధయన్త్యస్య మన్త్రిణః,
శకునిః సూతపుత్రశ్చ భ్రాతా దుఃశాసనస్తథా. 7

మరియు అతనికి బుద్ధులు గరపు శకుని, కర్ణుడు, తమ్ముడు దుశ్శాసనుడు అతని పాపిష్ఠమగు బుద్ధిని పెంచుచునే యున్నారు.

స హి త్యాగేన రాజ్యస్య న శమం సముపైష్యతి,
అంతరేణ వధం పార్థ సానుబన్ధః సుయోధనః. 8

---

5. సంయుక్తమ్ - కూడియున్నది; లోకకారణమ్ - లోకహితసాధనము.
6. దైవమ్ - పూర్వకర్మఫలమైన, కర్మ - కర్మమును; కర్తుమ్ - అట్లు కాకుండ చేయుట; మయా న శక్యమ్ - నాకు సాధ్యము కాదు.

ఆ దుర్యోధనుడు తనవా రందరితోపాటు చావనైన చచ్చును గాని రాజ్యము నొసగి శాంతి నొందదు.

న చాపి ప్రణిపాతేన త్యక్తు మిచ్ఛతి ధర్మరాట్,
యాచ్యమానశ్చ రాజ్యం స న ప్రదాస్యతి దుర్మతిః. 9

ధర్మరాజు మ్రొక్కులు చెల్లించియైనను రాజ్యము వదలగోరడు. ఆ దుష్ట బుద్ధి ఎంత వేడినను రాజ్యము నొసగడు.

న తు మన్యే స తద్వాచ్యో యద్యుధిష్ఠిరశాసనమ్,
ఉక్తం ప్రయోజనం యత్తు ధర్మరాజేన భారత. 10

ధర్మరాజు పలికిన అయిదూళ్ళిమ్మన్న పలుకును ఆ దుర్యోధనునకు చెప్పరా దనియే నా భావన.

తథా పాపస్తు తత్సర్వం న కరిష్యతి కౌరవః,
తస్మిం శ్చాక్రియమాణేఽసౌ లోకే వధ్యో భవిష్యతి. 11

ఆ పాపాత్ముడగు దుర్యోధనుడు అది యెట్లును చేయడు. అట్లు చేయని కారణమున ఆతడు లోకమున వధ్యుడు కాగలడు.

మమ చాపి స వధ్యో హి జగత శ్చాపి భారత,
యేన కౌమారకే యూయం సర్వే విప్రకృతాః సదా. 12

వాడు నాకే కాదు. లోకమున కంతటికి వధ్యుడు. ఏలయన పిన్నతనమున మిమ్ముల నందర నెల్లవేళల పీడించెను.

విప్రలుప్తం చ వో రాజ్యం నృశంసేన దురాత్మనా,
న చోపశామ్యతే పాపః శ్రియం దృష్ట్వా యుధిష్ఠిరే. 13

ఆ క్రూరాత్ముడు పాపబుద్ధి మీ రాజ్యమును గొల్లగొట్టెను. ధర్మరాజు కడనున్న సంపదను గాంచి ఆ పాపికి గుండె కుదురుకొనలేదు.

---

10. యుధిష్ఠిరశాసనమ్ - యుధిష్ఠిరుడు నిర్దేశించిన అయిదూళ్ళిమ్మన్న మాటను, న వక్తవ్యః - చెప్పరాదు. దానివలన మనము దీనుల మను భావము తోచును అని భావము. మరియు ఫలితము కూడ సున్న అనియు భావము.

అసకృ చ్చాప్యహం తేన త్వత్కృతే పార్థ భేదితః,
న మయా తద్గృహీతం చ పాపం తస్య చికీర్షితమ్. 14

వాడు మీ కారణముగా నా తోడను ఎన్నో మారులు పగగొనెను. వాడు చేయదలచిన పాపపు పనిని నేను పట్టించుకొనలేదు.

జానాసి హి మహాబాహో త్వమప్యస్య పరం మతమ్,
ప్రియం చికీర్షమాణస్య ధర్మరాజస్య మామపి. 15

ఓయి మహాబాహూ! నీవును వాని తుదితలం పేమో యెరుగుదువు. ధర్మరాజునకు ప్రియము చేయగోరు నన్నును ఎరుగుదువు.

సజ్ఞానం స్తస్య చాత్మానం మమ చైవ పరం మతమ్,
అజానన్నివ మాం కస్మా దర్జునాద్యాభిశఙ్కసే. 16

వాని హృదయము, నా పరమాభిప్రాయమును చక్కగా ఎఱిగి యెఱిగి, అర్జునా! ఈనాడు ఏమియు నెరుగని వానివలె నన్నేల శంకింతువు?

యచ్చాపి పరమం దివ్యం తచ్చాప్యనుగతం త్వయా,
విధానం విహితం పార్థ కథం శర్మ భవేత్ పరైః. 17

మరియు నీవు దివ్యమగు విధానమును ఆచరించి దిగివచ్చితివి. పార్థా! ఆ శత్రువులతో శాంతి యెట్లగును?

యత్తు వాచా మయా శక్యం కర్మణా వాఽపి పాణ్డవ,
కరిష్యే తదహం పార్థ న త్వాశంసే శమం పరైః. 18

కుంతీతనయా! మాటతో, చేతతో చేయగలిగిన దెల్ల చేయుదును. కాని వారు శాంతి నొందుదురని నేను భావింపజాలను.

---

16. అభిశంకసే - నేను శాంతిని కోరుట లేదని శంకించుచున్నావు.
17. దివ్యం విధానమ్ - భూభారమును తొలగించుటకు స్వర్గమునుండి దేవత లవతరించుట అనుసది.

కథం గోహరణే హ్యుక్తో నైతచ్చర్మ తథా హితమ్,
యాచ్యమానో హి భీష్మేణ సంవత్సరగతేఽధ్వని. 19

గోగ్రహణసమయమున అజ్ఞాతకాలసంవత్సరము పూర్తికాగా తిరుగు దారిలో భీష్ముడు ఈ శాంతినే కోరి బ్రతిమాలి హితము చెప్పలేదా?

తదైవ తే పరాభూతా యదా సంకల్పితా స్త్వయా,
లవశః క్షణశ శ్చాపి న చ తుష్టః సుయోధనః. 20

ఆనాడే నీచేత చావవలసినవారు తప్పించుకొనిరి. ఏ కొంచెమో రాజ్యము మనము గైకొన్నను సుయోధనుడు తృప్తిపడడు.

సర్వథా తు మయా కార్యం ధర్మరాజస్య శాసనమ్,
విభావ్యం తస్య భూయశ్చ కర్మ పాపం దురాత్మనః. 21

కానిమ్ము. నేను ధర్మరాజు శాసనము నెట్లును చేయవలయును. ఆ దురాత్ముని పాపకర్మమును గూర్చి మరల విచారింతము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణవాక్యే ఊనాశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణవాక్యముగల డెబ్బదితొమ్మిదవ అధ్యాయము.

—:o:—

---

19. భీష్ముడు బుజ్జగించి హితము చెప్పినను ఆ దుష్టుడు దానిని పట్టించుకొనలేదని భావము.

20. సంకల్పితాః - వధ్యులుగా నిశ్చయింపబడినవారు
లవశః - కొంచెమైన రాజ్యముయొక్క
క్షణశః - స్వీకరించు విషయమున
న తుష్టః - తృప్తిపడడు.

21. విభావ్యమ్ - విచారణీయము.

# అశీతితమోఽధ్యాయః

# ఎనుబదియవ అధ్యాయము

## నకులస్య నివేదనమ్

## నకులుని పలుకులు

నకుల ఉవాచ-నకులు డిట్లు పలికెను.

ఉక్తం బహువిధం వాక్యం ధర్మరాజేన మాధవ,
ధర్మజ్ఞేన వదాన్యేన శ్రుతం చైవ హి తత్త్వయా. 1

మాధవా! ధర్మము చక్కగా ఎఱిగినవాడు, పలుకు పొందు తెలిసినవాడు అగు ధర్మరాజు ఎన్నో తీరులు గల పలుకు పలికెను. నీవును అదియంతయు వింటివి.

మతమాజ్ఞాయ రాజ్ఞశ్చ భీమసేనేన మాధవ,
సంశమో బాహువీర్యం చ ఖ్యాపితం మాధవాత్మనః. 2

మాధవా! రాజు భావమెరిగి భీమసేనుడు తనదైన చక్కని శాంత లక్షణమును వెల్లడించెను. తన భావము ననుసరించి భుజముల సత్తువను వ్యక్తపరచెను.

తథైవ ఫాల్గునేనాపి యదుక్తం తత్త్వయా శ్రుతమ్,
ఆత్మనశ్చ మతం వీర కథితం భవతాఽసకృత్. 3

---

2. రాజ్ఞః మతమ్ ఆదాయ - రాజైన ధర్మజుని అభిప్రాయము ననుసరించి; సంశమః - చక్కని శాంతి, ఖ్యాపితః - వక్కాణింపబడినది; ఆత్మనః, మతమాదాయ - తన అభిప్రాయము ననుసరించి-బాహువీర్యం, చ-భుజ బలమును, ఖ్యాపితమ్ - వక్కాణింపబడినది - అని అర్థము చెప్పుకొనవలయును. ఈ శ్లోకమున మాధవశబ్దమును రెండుమారులు ఉపయోగించిరి. మొదటిదానికి మధుదేశమున పుట్టినవాడనియు - రెండవదానికి మా-లక్ష్మి - ధవుడనియు నర్థములు గ్రహింపనగును.

అట్లే అర్జునుడు పలికినదియు నీవు వింటివి. విదురా : నీ అభిప్రాయమును పలుమారులు వక్కాణించితివి.

సర్వమేత దతిక్రమ్య శ్రుత్వా పరమతం భవాన్,
యత్ప్రాప్తకాలం మన్యేథా స్తత్కుర్యాః పురుషోత్తమ. 4

ఇతరుల భావమును విని యుంటివి. పురుషోత్తమా! దీని నంతటిని అటుంచి, కాలమున కేది తగునని నీకు తోచునో యది చేయుము.

తస్మిం స్తస్మిన్నిమిత్తే హి మతం భవతి కేశవ,
ప్రాప్తకాలం మనుష్యేణ క్షమం కార్యమరిన్దమ. 5

కేశవా : ఆయా కారణములను బట్టి మత భేదము లేర్పడును. కాని కాలమునకు తగిన దానిని మనుష్యుడు చేయుచుండవలయును.

అన్యథా చిన్తితో హ్యర్థః పునర్భవతి సోఽన్యథా,
అనిత్యమతయో లోకే నరాః పురుషసత్తమః. 6

పురుషోత్తమా! మనమొక తీరున తలచినది మరియొక విధముగా నగుచుండును. లోకమున నరుల బుద్ధులు నిలుకడగా నుండవు (ఒక తీరుననుండవు).

అన్యథా బుద్ధయో హ్యాస న్నస్మాసు వనవాసిషు,
అదృశ్యే ష్వన్యథా కృష్ణ దృశ్యేషు పునరన్యథా. 7

---

5. తస్మిన్, తస్మిన్, నిమిత్తే - ఆయా నిమిత్తములను బట్టి. కులశ్రేష్ఠుడగు ధర్మరాజు కులచ్ఛేదము చేయరాదని అభిప్రాయపడును. జుట్టుపట్టి తన్ను హింసించిన కారణమున ద్రౌపది పగవారిని నామరూపములు లేకుండ తుడిచివేయవలెనని భావించును. ఇట్లు అనేకభావములలో కాలమున కేది తగునో నీవది చేయవలయునని నకులుని తాత్పర్యము.

6. అనిత్యమతయః - క్షణక్షణము మారుచుండు బుద్ధిగలవారు.

7. కేవలము వ్యక్తిని బట్టియే మతభేదము లుండుననియు భావింపరాదు. ఒక వ్యక్తికే అవస్థాభేదములను బట్టియు అభిప్రాయభేదము లేర్పడ వచ్చునని చెప్పుచున్నారు. అదృశ్యేషు - అజ్ఞాతవాసకాలమున ఎవ్వరికి కానరాకుండ గడుపుట యెట్లా అనియే తపన. దృశ్యేషు - ఇప్పుడా కష్టములు గడిచి బయటపడినప్పుడు రాజ్యమెట్లు పొందుదుమా? అని తహతహ.

మేము అడవులలో నుండగా మా బుద్ధి లొకవిధముగా నున్నవి. అజ్ఞాత వాసమున వేరొక విధముగా నున్నవి. ఇప్పుడందరకు తానవచ్చునపుడు మరి యొక విధముగా నున్నవి.

అస్మాక మపి వార్ష్ణేయ వనే విచరతాం తదా,
న తథా ప్రణయో రాజ్యే యథా సంప్రతి వర్తతే. 8

అడవులలో తిరుగునాడు, కృష్ణా! మా కిప్పటివలె రాజ్యాశ లేదు.

నివృత్తవనవాసాన్నః శ్రుత్వా వీర సమాగతాః,
అక్షౌహిణ్యో హి సప్తేమా స్త్వత్ప్రసాదా జ్జనార్దన. 9

మేము వనవాసము ముగించుకొని వచ్చితిమని విని నీ దయవలన - ఇదిగో - ఏడక్షౌహిణులు వచ్చి మమ్ము చేరినవి.

ఇమాన్ హి పురుషవ్యాఘ్రా నచిన్త్యబలపౌరుషాన్,
ఆత్తశస్త్రాన్ రణే దృష్ట్వా న వ్యథేదిహ కః పుమాన్. 10

ఊహింపనలవికాని బలము, పౌరుషము కలిగి ఆయుధములు చేపట్టిన ఈ పురుషశ్రేష్ఠులను గాంచి ఏ మగవాడు కలత నొందడు ?

స భవాన్ కురుమధ్యే తం సాన్త్వపూర్వం భయోత్తరమ్,
బ్రూయా ద్వాక్యం యథా మన్దో న వ్యథేత సుయోధనః. 11

కావున కృష్ణా ! నీవు కౌరవుల నడుమ ఆ దుర్యోధనునితో ముందు మెత్తగా,పిదప భయము కలుగునట్లుగా, ఆ మూఢుడు కలత నొందని విధముగా పలుకవలయును.

యుధిష్ఠిరం భీమసేనం బీభత్సుం చాపరాజితమ్,
సహదేవం చ మాం చైవ త్వాం చ రామం చ కేశవ. 12

సాత్యకిం చ మహావీర్యం విరాటం చ సహాత్మజమ్,
ద్రుపదం చ సహామాత్యం ధృష్టద్యుమ్నం చ మాధవ. 13

కాశిరాజం చ విక్రాన్తం ధృష్టకేతుం చ చేదిపమ్,
మాంసశోణితభృన్మర్త్యః ప్రతియుధ్యేత కో యుధి. 14

---

8. ఇట్లు పై శ్లోకములు రెంటిలో ఒక వ్యక్తికే అవస్థనుబట్టి అభిప్రాయములు మారుచుండుటను నకులుడు నిరూపించెను.

10. న వ్యథేత్ - కలతనొందడు.

కృష్ణా! యుధిష్ఠిరుని, భీమసేనుని, ఎందును ఓటమి యెరుగని విజయుని, సహదేవుని, నన్ను, నిన్ను, బలరాముని, మహాశక్తిగల సాత్యకిని, కొడుకులతోపాటు విరాటుని, మంత్రులతో కూడిన ద్రుపదుని, ధృష్టద్యుమ్నుని, పైకి దూకివచ్చు కాశిరాజును, చేదిరాజగు ధృష్టకేతువును ఒడలియందు రక్తమాంసములున్న ఎవ్వడైనను యుద్ధమున నెదుర్కొనగలడా?

స భవాన్ గమనాదేవ సాధయిష్య త్యసంశయమ్,
ఇష్టమర్థం మహాబాహో ధర్మరాజస్య కేవలమ్. 15

కావున మహాబాహూ! నీవు అచటకు వెళ్ళుట మాత్రముననే ధర్మరాజు కోరు ప్రయోజనమును తప్పక సాధింపగలవు. ఇందు సంశయము లేదు.

విదురశ్చైవ భీష్మశ్చ ద్రోణశ్చ సహ బాహ్లికః,
శ్రేయః సమర్థా విజ్ఞాతు ముచ్యమానా స్త్వయాఽనఘ. 16

విదురుడు, భీష్ముడు, ద్రోణుడు, బాహ్లికుడును నీవు చెప్పుచుండగా శ్రేయ మేదియో తెలియజాలినవారే యగుదురు.

తే చైవ మనునేష్యన్తి ధృతరాష్ట్రం జనాధిపమ్,
తం చ పాపసమాచారం సహామాత్యం సుయోధనమ్. 17

వారు రాజైన ధృతరాష్ట్రుని, మంత్రులతో కూడిన పాపాచారుడగు సుయోధనుని చక్కదిద్దుదురు.

శ్రోతా చార్థస్య విదుర స్త్వం చ వక్తా జనార్దన,
కమి వార్థం నివర్తన్తం స్థాపయేతాం న వర్త్మని. 18

విషయమును ఆలకించువాడు విదురుడు. జనార్దనా! బోధించువాడవు నీవు. జారిపోవు ఏ ప్రయోజనమునైనను మీరిరువురు సరియగు మార్గమున నిలుపగలుగుదురు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
నకులవాక్యే అశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
నకులవాక్యము గల ఎనుబదియవ అధ్యాయము.

—: o :—

---

18. నివర్తన్తమ్ - జారిపోవుచున్న; అర్థమ్ - ప్రయోజనమును.

# ఏకాశీతితమోఽధ్యాయః

# ఎనుబదియొకటవ అధ్యాయము

**సమరోద్యోగార్థం సహదేవసాత్యక్యోః సమ్మతేః**
**సర్వయోద్ధృభిః సింహనాదైః సమర్థనమ్.**

**యుద్ధప్రయత్నమునకై సహదేవసాత్యకులు ఇష్టము చూపగా**
**యోధు లందరు సింహనాదములతో దానిని సమర్థించుట.**

సహదేవ ఉవాచ - సహదేవు డిట్లు పలికెను.

యదేతత్కథితం రాజ్ఞా ధర్మ ఏష సనాతనః,
యథా చ యుద్ధమేవ స్యాత్ తథా కార్య మరిన్దమ. 1

శత్రుసంహారకా! ఈ రాజు పలికిన దంతయు సనాతనమగు ధర్మమే. కాని యుద్ధ మెట్లగునో యట్లు ప్రయత్నింపవలయును.

యది ప్రశమ మిచ్ఛేయుః కురవః పాణ్డవైః సహ,
తథాఽపి యుద్ధం దాశార్హ యోజయేథాః సహైవ తైః. 2

కృష్ణా! ఒకవేళ కౌరవులు పాండవులతో శాంతినే కోరినను నీవు వారితో యుద్ధమే కూర్పుము.

కథం ను దృష్ట్వా పాఞ్చాలీం తథా కృష్ణ సభాగతామ్,
అవధేన ప్రశామ్యేత మమ మన్యుః సుయోధనే. 3

ఆ నిండు సభలో పాంచాలి నా విధముగా చూచిన నాకు దుర్యోధనుని చంపక కోప మెట్లు చల్లారును?

యది భీమార్జునౌ కృష్ణ ధర్మరాజశ్చ ధార్మికః,
ధర్మ ముత్సృజ్య తేనాహం యోద్ధు మిచ్ఛామి సంయుగే. 4

కృష్ణా! ఒకవేళ భీమార్జునులును ధర్మరాజును ధర్మమార్గముననే ప్రవర్తించినను నేను ఆ ధర్మమును విడనాడి వానితో యుద్ధరంగమున పోరుటకే కోరుదును.

---

4. భీమార్జునులు ధర్మమును పట్టి ప్రవేశినను నేను మాత్రము యుద్ధము చేయుటకే ఇష్టపడుదును.

సాత్యకి రువాచ - సాత్యకి పలికెను.

సత్యమాహ మహాబాహో సహదేవో మహామతిః,
దుర్యోధనవధే శా న్తి స్తస్య కోపస్య మే భవేత్. 5

దొడ్డబుద్ధి గల ఈ సహదేవుడు నిజమాడెను. దుర్యోధనుని వధించినపుడే అతని కోపము, నా కోపము చల్లారును.

న జానాసి యథా దృష్ట్వా చీరాజినధరాన్ వనే,
తవాపి మన్యు రుద్భూతో దుఃఖితాన్ ప్రేక్ష్య పాణ్డవాన్. 6

కృష్ణా ! అడవిలో నారచీరలు - చర్మములు కట్టుకొని దుఃఖించుచున్న పాండవులను గాంచి నీకును కోపము పెల్లుబికినది. అది యెరుగవా ?

తస్మా న్మాద్రీసుతః శూరో యదాహ రణకర్కశః,
వచనం సర్వయోధానాం తన్మతం పురుషోత్తమ! 7

పురుషోత్తమా ! యుద్ధమున రాటుదేలిన శూరుడు మాద్రికొడుకు పలికిన పలుకు యోధు లందరకు ఇష్టమైనది.

వైశంపాయన ఉవాచ-వైశంపాయనుడు చెప్పెను.

ఏవం వదతి వాక్యం తు యుయుధానే మహామతౌ,
సుభీమః సింహనాదోఽభూ ద్యోధానాం తత్ర సర్వశః. 8

దొడ్డబుద్ధి గల ఆ సాత్యకి ఇట్లు పలుకగా అం దన్నివైపుల మిక్కిలి భయము గొలుపు సింహనాదము చెలరేగెను

సర్వే హి సర్వశో వీరా స్తద్వచః ప్రత్యపూజయన్,
సాధు సాధ్వితి శైనేయం హర్షయన్తో యుయుత్సవః. 9

మేలు మేలని సాత్యకి నుప్పొంగ జేయుచు అచట నున్న వీరులందరు ఆ మాటను కొనియాడిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
సహదేవసాత్యకివాక్యే ఏకాశీతితమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
సహదేవసాత్యకుల పలుకు గల యెనుబదియొకటవ అధ్యాయము.

—: o :—

5. మహాబాహో - ఓ కృష్ణా.

# ద్వ్యశీతితమోఽధ్యాయః
## ఎనుబది రెండవ అధ్యాయము

ద్రౌపద్యాః శ్రీకృష్ణసన్నిధౌ స్వీయదుఃఖ
నివేదనమ్, శ్రీకృష్ణేన తస్యాః సమాశ్వాసనం చ.

ద్రౌపది శ్రీకృష్ణునకు తన దుఃఖము నెరిగించుట,
శ్రీకృష్ణు డామె నూరడించుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

రాజ్ఞస్తు వచనం శ్రుత్వా ధర్మార్థసహితం హితమ్,
కృష్ణా దాశార్హ మాసీన మబ్రవీ చ్ఛోకకర్శితా. 1

ధర్మము, అర్థములతో హితమైన రాజు మాట వినిన ద్రౌపది మాత్రము దుఃఖముతో కుమిలిపోయినదై కూర్చుండియున్న కృష్ణునితో నిట్లు పలికెను.

సుతా ద్రుపదరాజస్య స్వసితాయతమూర్ధజా,
సంపూజ్య సహదేవం చ సాత్యకిం చ మహారథమ్. 2

భీమసేనం చ సంశాన్తం దృష్ట్వా పరమదుర్మనాః,
అశ్రుపూర్ణేక్షణా వాక్య మువాచేదం మనస్వినీ. 3

పొడవైన కేశములు గల ద్రుపదరాజతనయ సహదేవుని, మహారథుడగు సాత్యకిని కొనియాడుచు, చప్పగా చల్లారిన భీముని గాంచి గుండెలో కుమిలి పోవుచు కన్నులనిండుగా నీరు పెట్టుకొని అభిమానవతియై యిట్లు పలికెను.

విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన,
యథా నికృతి మాస్థాయ భ్రంశితాః పాణ్డవాః సుఖాత్. 4
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన.

---

2. సు + అసిత + ఆయత, మూర్ధజా - మిక్కిలి నల్లని పొడవైన కురులు గలది.

మహాబాహూ! ధర్మ మెరిగినవాడా! మధుసూదనా! ఈ పాండుకుమారు లను ధృతరాష్ట్రుని కొడుకు, వాని మంత్రులు వంచనకు లోబరచి యెట్లు సుఖ మునకు దూరము చేసెనో నీకు తెలిసినదే.

యథా చ సఞ్జయో రాజ్ఞా మన్త్రం రహసి శ్రావితః, 5
యుధిష్ఠిరస్య దాశార్హ తచ్చాపి విదితం తవ,
యథోక్తః సఞ్జయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా. 6

ఆ రాజు సంజయునకు ఏకాంతమున ఏ మంత్రము ధర్మరాజు నుద్దేశించి వినిపించెనో, ఆ సంజయునకు మన మేమి చెప్పితిమో అది యంతయు నీ వెరుగుదువు.

పఞ్చ నస్తాత దీయన్తాం గ్రామా ఇతి మహాద్యుతే,
అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతమ్. 7

అవసానం మహాబాహో కఞ్చిదేకం చ పఞ్చమమ్,
ఇతి దుర్యోధనో వాచ్యః సుహృద శ్చాస్య కేశవ. 8

ఓయి మహాతేజస్వీ! కేశవా! "అయిదు గ్రామములు. అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారణావతము, కడ కయిదవది యేదియో యొకటి - మా కిందు" అని దుర్యోధనునకు వాని చెలికాండ్రకు చెప్పవలయును!

న చాపి హ్యకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః,
యుధిష్ఠిరస్య దాశార్హ శ్రీమతః సన్ధి మిచ్ఛతః. 9

ఈ శ్రీమంతుడు యుధిష్ఠిరుడు సంధిని కోరుచుండగా ఆతని మాట విని, కృష్ణా! దుర్యోధనుడు ఎప్పుడైన అట్లు చేసెనా?

అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః,
సన్ధి మిచ్ఛేన్న కర్తవ్యం తత్ర గత్వా కథంచన. 10

ఆ దుర్యోధనుడు రాజ్య మీక సంధి కొడంబడునేని కృష్ణా! అక్కడ కేగి నీవు చేయదగిన దేమియు లేదు.

శక్ష్యన్తి హి మహాబాహో పాణ్డవాః సృఞ్జయైః సహ,
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్. 11

ఓయి మహాబాహూ! ఘోరమైనదియు, కోపముతో ఉడికిపోవునదియునగు సుయోధనుని సేనను పాండవులు సృంజయులతోపాటు ఎదుర్కొనజాలుదురుగదా!

న హి సామ్నా న దానేన శక్యోఽర్థస్తేషు కశ్చన,
తస్మాత్తేషు న కర్తవ్యా కృపా తే మధుసూదన. 12

వారియందు సామముతో గాని, దానముతో గాని సాధించగల అర్థ మొక్కటియు లేదు. కావున, మధుసూదనా! వారియందు నీకు కృపతో పనిలేదు.

సామ్నా దానేన వా కృష్ణ యేన శామ్యన్తి శత్రవః,
మోక్తవ్య స్తేషు దణ్డః స్యా జ్జీవితం పరిరక్షతా. 13

సామముతోడనో దానముతోడనో శాంతి నొందని శత్రువుల యెడ, తన బ్రదుకు కాపాడుకొనువాడు, దండమునే ప్రయోగింపవలయును.

తస్మాత్తేషు మహాదణ్డః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాణ్డవైః సహ సృంజయైః. 14

కావున ఓ మహాబాహూ! నీవు, పాండవులు, సృంజయులు కలిసి వెనువెంటనే వారియందు గొప్ప దండమును ప్రయోగింపవలయును.

ఏతత్సమర్థం పార్థానాం తవ చైవ యశస్కరమ్,
క్రియమాణం భవేత్ కృష్ణ క్షత్రస్య చ సుఖావహమ్. 15

ఇట్లు చేయుట పాండవులకు తగిన పని. నీకు దీనివలన కీర్తి కలుగును. క్షత్రియజాతికి సుఖము సిద్ధించును.

క్షత్రియేణ హి హన్తవ్యః క్షత్రియో లోభమాస్థితః,
అక్షత్రియో వా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా. 16

---

11. ప్రతిసమాసితుమ్ - ఎదుర్కొని నిలుచుటకు.
12. కశ్చన అర్థః - శాంతి ఉపాయము.
14. సమర్థమ్ - యుక్తమైనది.
16. లోభమ్, ఆస్థితః - లోభమును పట్టి గట్టిగా నిలిచినవాడు.

కృష్ణా! లోభము పైకొన్న వాడు క్షత్రియుడైనను, క్షత్రియుడు కాకున్నను అట్టివానిని తన ధర్మము ననుష్ఠించు క్షత్రియుడు చంపనే వలయును.

అన్యత్ర బ్రాహ్మణా త్తాత సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్. 17

బ్రాహ్మణుడు ఎన్ని పాపములలో మునిగి తేలినను వానిని మాత్రము చంపరాదు. ఏలయన ఆతడు అన్నివర్ణములవారికి గురువు. అందరు కోరి యిచ్చిన గౌరవమును అనుభవించువాడు గదా!

యథాఽవధ్యే వధ్యమానే భవేద్దోషో జనార్దన,
స వధ్యస్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః. 18

జనార్దనా! చంపరానివానిని చంపునపు డే పాపము వాటిల్లునో చంపదగిన వానిని చంపకున్నను ఆ పాపమే కలుగునని ధర్మవేత్తలు గుర్తింతురు.

యథా త్వాం న స్పృశేదేష దోషః కృష్ణ తథా కురు,
పాణ్డవైః సహ దాశార్హైః సృఞ్జయైశ్చ ససైనికైః. 19

ఈ పాండవులతో, యాదవులతో, సృంజయులతో వారి వారి సైనికులతో పాటు నిన్నీ దోష మంటకుండు విధ మాచరింపుము.

పునరుక్తం చ వక్ష్యామి విశ్రమ్భేణ జనార్దన,
కా తు సీమన్తినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ. 20

ఓ జనార్దనా! కేశవా! నీ మీది నమ్మకముతో చెప్పిన మాటనే మరల చెప్పుచున్నాను. నా వంటి యింతి ఈ భూమియందుండునా?

సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యాత్ సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణ ప్రియా సఖీ. 21

ద్రుపదరాజు యజ్ఞవేదికనుండి వెలువడితిని. ధృష్టద్యుమ్నుని తోడబుట్టువను. కృష్ణా! నీకు ప్రియమైన చెలిని.

---

17. ప్రసృతాగ్రభుక్ - ఇచ్చిన మన్ననను అనుభవించువాడు.

అజమీఢకులం ప్రాప్తా స్నుషా పాణ్డో ర్మహాత్మనః,
మహిషీ పాణ్డుపుత్రాణాం పఞ్చేన్ద్రసమవర్చసామ్. 22

ఈ అజమీఢవంశము మెట్టితిని. మహాత్ముడగు పాండురాజు కోడలిని. అయిదుగు రింద్రులతో దీటైన తేజము గల పాండుకుమారుల పట్టమహిషిని.

సుతా మే పఞ్చభి ర్వీరైః పఞ్చ జాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః. 23

ఈ వీరు లైదుగురివలన నాకు మహారథులగు నైదుగురు కొడుకులు పుట్టిరి. కృష్ణా! నీ చెల్లెలికొడు కభిమన్యు డెట్లో వీరును ధర్మమునుబట్టి నీ కట్టివారే.

సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాణ్డుపుత్రాణాం తవ జీవతి కేశవ. 24

అట్టి నేను ఈ పాండుపుత్రులు చూచుచుండగా, నీవు బ్రతికియుండగా జుట్టుపట్టి ఈడ్వబడితిని. సభలో పడరాని పాట్లు పడితిని.

జీవత్సు పాణ్డుపుత్రేషు పఞ్చ తేష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా. 25

ఈ పాండుపుత్రులు, పాంచాలురు, యాదవులు అందరు బ్రదికియుండగా నిండుకొలువున నిలువబెట్టి నన్నా పాపాత్ములు దాసిని చేసిరి.

నిరమర్షే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషు పాణ్డుషు,
పాహి మామితి గోవిన్ద మనసా చిన్తితోఽసి మే. 26

ఈ పాండుకుమారులు సిగ్గు లేక చేష్టలుడిగి గ్రుడ్లప్పగించి చూచుచుండగా గోవింద! నన్ను పాలింపుమని నిన్ను మనసున వేడుకొంటిని.

యత్ర మాం భగవాన్ రాజా శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాఞ్చాలి వరార్హాసి మతా మమ. 27

అప్పుడా రాజు, నా మామ భగవంతుని వలె పాంచాలీ! వర మడుగుము. నీవు వరము పొందుటకు యోగ్యురాలవని పలికెను.

---

22. అజమీఢకులం - అజమీఢుడు కురుకులమున నొక రాజు. అతని పేరున వెలసిన కులము.

అదాసాః పాణ్డవాః సన్తు సరథాః సాయుధా ఇతి,
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ. 28

పాండవులు రథములతో, ఆయుధములతో దాస్యములేనివారు కావలయు నని నేను కోరగా ఆతడు వారిని అడవుల నుండుటకై తోలెను.

ఏవంవిధానాం దుఃఖానామభిజ్ఞోఽసి జనార్దన,
త్రాయస్వ పుణ్డరీకాక్ష సభర్తృజ్ఞాతిబాన్ధవాన్. 29

జనార్దనా! పాండవులు పడిన యీ పాట్లన్నియు పూర్తిగా నెరుగుదువు. వీరిని కులమువారితో, బంధువులతోపాటు రక్షింపుము.

నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః,
స్నుషా భవామి ధర్మేణ సాఽహం దాసీకృతా బలాత్. 30

కృష్ణా! నేనా భీష్మునకు ధృతరాష్ట్రునకు ఇరువురకు ధర్మము ననుసరించి కోడలను కానా? అట్టి నన్ను బలాత్కారముగా దాసిని చేసిరి.

ధిక్ పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్,
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్త మపి జీవతి. 31

కృష్ణా! ఇంకను ఆ దుర్యోధనుడు బ్రతికియే యున్నాడు. ఛీ! ఈ పార్థుని విలుకానితన మేలఁ ఆ భీమసేనుని బలమేలఁ

యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపా మయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః సర్వః కృష్ణ విధీయతామ్. 32

కృష్ణా! నాయందు నీ కనుగ్రహ మున్నచో, జాలి యున్నచో నీ కోప మంతయు ఆ ధృతరాష్ట్రుని కొడుకులపై క్రుమ్మరింపుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్,
సునీల మసితాపాఙ్గీ సర్వగన్ధాధివాసితమ్, 33

---

33. మృదుసంహారమ్ - జడగా నల్లుకొని పోయినను మెత్తగా నున్నదియు; వృజినాగ్రమ్ - వంపులు తిరిగిన చివుళ్ళు గలదియు - 'వృజినః కుటిలేఽన్యవత్' - అని విశ్వము; సుదర్శనమ్ - చూడ ముచ్చట అయినదియు.

సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్,
కేశపక్షం వరారోహా గృహ్య వామేన పాణినా, 34

పద్మాక్షీ పుణ్డరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచన మబ్రవీత్. 35

ద్రౌపది యిట్లు పలికి జడగట్టినను మెత్తగా నున్నదియు, వంపులు తిరిగిన చివళ్ళు గలదియు, చూడ ముచ్చట గొలుపునదియు, నల్లని వన్నెతో నిగనిగలాడుచున్నదియు, చక్కని వాసనతో అలరారుచున్నదియు, మంచి లక్షణములతో నొప్పుచున్నదియు, నల్లని త్రాచువంటి వన్నె గలదియు నగు కురుల సముదాయమును ఎడమచేత బట్టుకొని ఏనుగు నడక వంటి నడకతో, పద్మములవంటి కన్నులతో, కన్నీరు నిండిన చూపులతో కృష్ణుని దరి చేరి యిట్లు పలికెను.

అయం తే పుణ్డరీకాక్ష దుఃశాసనకరోద్ధృతః,
స్మర్తవ్యః సర్వకార్యేషు పరేషాం సన్ధి మిచ్ఛతా. 36

పుణ్డరీకాక్షా! ఇదిగో! ఇది దుస్ససేనుడు చేతబట్టి లాగిన జుట్టు. పగవారితో సంధి చేయగోరు నీ కిది అన్ని పనులలో స్మరింపదగినది.

యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సన్ధికాముకౌ,
పితా మే యోత్స్యతే వృద్ధః సహ పుత్రైర్మహారథైః. 37

కృష్ణా! ఒకవేళ ఈ భీమార్జునులు దీనులై సంధినే కోరుదురేని, పెద్దవాడగు మా నాయన మహారథులగు తన కొడుకులతో కూడి యుద్ధము చేయును.

పఞ్చ చైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యన్తే కురుభిః సహ. 38

మధుసూదనా! మహాశక్తిసంపన్నులగు నా కొడుకు లయిదుగురు అభిమన్యుని ముందిడుకొని కౌరవులతో పోరుదురు.

దుఃశాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుగుణ్ఠితమ్,
యద్యహం తు న పశ్యామి కా శాన్తిర్హృదయస్య మే. 39

తెగిపడి దుమ్ముగొట్టుకొన్న నల్లని దుశ్శాసనుని భుజమును చూడనైతినేని నా హృదయమునకు శాంతి యెక్కడిది?

త్రయోదశ హి వర్షాణి ప్రతీక్షన్త్యా గతాని మే,
విధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్. 40

చెలరేగుచున్న నిప్పువలె నున్న ఈ కోపమును గుండెలో నిడుకొని ఎదురుచూచుచున్న నాకు పదమూడేడులు గడచి పోయినవి.

విదీర్యతే మే హృదయం భీమవాక్శల్యపీడితమ్,
యోఽయమద్య మహాబాహూ ర్ధర్మ మేవానుపశ్యతి. 41

శత్రుభయంకరుడా! కృష్ణా! కారుకూతలు విని తూట్లు పడిన నా గుండె పగిలిపోవు చున్నది. నీ వేమో ధర్మమునే విడువక చూచుచున్నావు.

ఇత్యుక్త్వా బాష్పరుద్ధేన కణ్ఠేనాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కమ్పం సస్వరం బాష్పగద్గదమ్. 42

అని పలికి ద్రౌపది పెగలిరాని కంఠముతో వణకుచు పెద్దగా ఏడ్చెను.

స్తనౌ పీనాయతశ్రోణీ సహితా వభివర్షతే,
ద్రవీభూత మివాత్యుష్ణం ముఞ్చతీ వారి నేత్రజమ్. 43

బలసిన, విశాలమైన పిరుదులు గల ఆ యింతి స్తనములపై ద్రవముగా నైన అగ్నివంటి కన్నీటిని క్రుమ్మరించుచుండెను.

తామువాచ మహాబాహుః కేశవః పరిసాన్త్వయన్,
అచిరాద్ ద్రక్ష్యసే కృష్ణే రుదతీ ర్భరతస్త్రియః. 44

మహాబాహువగు కేశవుడు ఆమె నోదార్చుచు నిట్లు పలికెను. "కృష్ణా ! భరతవంశపుస్త్రీలు ఏడ్చుచుండగా త్వరలోనే చూచెదవు".

ఏవం తా భీరు రోత్స్యన్తి నిహతజ్ఞాతిబాన్ధవాః,
హతమిత్రా హతబలా యేషాం క్రుద్ధాసి భామిని. 45

---

41. భీమ - ఓయి భయంకరుడా! కృష్ణా! వాక్ శల్య పీడితమ్ - పలుకు లనెడి ములుకులతో నొచ్చి; మే హృదయం-నా గుండె; విదీర్యతే - చీలి పోవుచున్నది; యః, అయమ్ - అట్లన్నియు నెరిగిన నీవు; ధర్మమునే తలచుచున్నావు. అట్లయినచో నా పగ యణగుట యెట్లని భావము.

43. అత్యుష్ణమ్ - అగ్నిని.

45. రోత్స్యన్తి - ఏడ్తురు.

భామినీ! నీ వెవరిపై కోపించితివో ఆ కౌరవుల కాంతలు తమ బంధువులు, అన్నదమ్ములు, మిత్రులు, సైనికులు - అందరు చావగా నీవలెనే ఏడ్తురు.

అహం చ తత్కరిష్యామి భీమార్జునయమైః సహ,
యుధిష్ఠిరనియోగేన దైవాచ్చ విధినిర్మితాత్. 46

ఈ యుధిష్ఠిరుని ఆజ్ఞమేరకు, బ్రహ్మ కల్పించిన వ్రాతమేరకు ఈ భీముడు, అర్జునుడు, నకులసహదేవులు అను వారితో కూడి ఆ పని గావింతును.

ధార్తరాష్ట్రాః కాలపక్వాః న చేచ్ఛృణ్వన్తి మే వచః,
శేష్యన్తే నిహతా భూమౌ శ్వసృగాలాదనీకృతాః. 47

కాలము పండినవారై ఆ ధృతరాష్ట్రుని కొడుకులు నా మాట వినకుందురేని కుక్కలకు, నక్కలకు తిండిగా నై నేల వ్రాలుదురు.

చలేద్ధి హిమవాన్ శైలో మేదినీ శతధా ఫలేత్,
ద్యౌః పతేచ్చ సనక్షత్రా న మే మోఘం వచో భవేత్. 48

హిమవత్పర్వతము కదలాడినను, భూమి వందలకొలదిగా ముక్కలైనను, నక్షత్రములతో పాటు నింగి నేల గూలినను నామాట పొల్లుపోవదు.

సత్యం తే ప్రతిజానామి కృష్ణే బాష్పో నిగృహ్యతామ్,
హతామిత్రాన్ శ్రియా యుక్తా నచిరాద్ ద్రక్ష్యసే పతీన్. 49

ద్రౌపదీ! సత్యము వక్కాణించుచున్నాను. కన్నీ రదచికొనుము. త్వరలోనే శత్రువులను రూపుమాపి సంపదలందిన భర్తలను చూతువు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
ద్రౌపదీకృష్ణసంవాదే ద్వ్యశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
ద్రౌపదీకృష్ణసంవాదము గల ఎనుబదిరెండవ అధ్యాయము.

—:o:—

# త్ర్యశీతితమోఽధ్యాయః
## ఎనుబదిమూడవ అధ్యాయము

**శ్రీకృష్ణస్య హస్తినాపురం ప్రతి ప్రస్థానమ్, యుధిష్ఠిరస్య కున్తీం కురూం శ్చోద్దిశ్య సన్దేశః, మార్గే శ్రీకృష్ణకర్తృకం దివ్యమహర్షీణాం దర్శనమ్.**

**శ్రీకృష్ణుడు హస్తినకు బయలుదేరుట. ధర్మరాజు కుంతికి, కౌరవులకు సందేశ మొసగుట. మార్గమున శ్రీకృష్ణుడు దివ్యర్షులను గాంచుట.**

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

కురూణా మద్య సర్వేషాం భవాన్ సుహృదనుత్తమః,
సంబన్ధీ దయితో నిత్య ముభయోః పక్షయోరపి. 1

కృష్ణా! నేడు నీవు కౌరవులందరకు అందరకంటె మిన్నయగు చెలికాడవు. చుట్టమవు. రెండు వైపులవారికి ఎల్లవేళల ప్రియుడవు.

పాణ్డవై ర్ధార్తరాష్ట్రాణాం ప్రతిపాద్య మనామయమ్,
సమర్థః ప్రశమం చైవ కర్తు మర్హసి కేశవ. 2

కేశవా! నీవు ధృతరాష్ట్రుని కొడుకులకు పాండవులతో క్షేమమును సాధింపవలయును. శాంతిని సాధించుటకు నీవే సమర్థుడవు.

త్వమితః పుణ్డరీకాక్ష సుయోధన మమర్షణమ్,
శాన్త్యర్థం భ్రాతరం బ్రూయా యత్తద్వాచ్యమమిత్రహన్. 3

పుండరీకాక్షా! నీ విటనుండి యరిగి మొండిపట్టుగల ఆ దుర్యోధను డెట్లు పలికిన శాంతి నొందునో యట్లు పలుకుము.

---

1. అనుత్తమః - తనకంటె ఉత్తముడు లేనివాడు-అందరికంటె ఉత్తముడని భావము.
2. అనామయమ్ - కుశలము
ప్రతిపాద్యమ్ - సంపాదింపదగినది.

త్వయా ధర్మార్థయుక్తం చేదుక్తం శివ మనామయమ్,
హితం నాదాస్యతే బాలో దిష్టస్య వశ మేష్యతి. 4

ధర్మము, అర్థము కలసివచ్చు మంగళకరము, కుశలము హితము నగు నీ పలుకు ఆ పసివాడు పట్టించుకొనకున్నచో మృత్యువునకు వశమగును.

శ్రీ భగవా నువాచ - శ్రీ భగవాను డిట్లు పలికెను.

ధర్మ్య మస్మద్ధితం చైవ కురూణాం యదనామయమ్,
ఏష యాస్యామి రాజానం ధృతరాష్ట్ర మభీప్సయా. 5

ధర్మము వదలనిది, కౌరవులకు కుశలము గూర్చునది, మనకు హితమైనదియు నగు పని సాధించుటకై ఇదిగో ధృతరాష్ట్రునికడ కరుగుచున్నాను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో వ్యపేతతమసి సూర్యే విమలవద్గతే,
మైత్రే ముహూర్తే సంప్రాప్తే మృద్వర్చిషి దివాకరే. 6

పిదప చీకటి పోయి సూర్యుడు నిర్మలాకాశమున చిరువెలుగులతో ఉదయింపగా మైత్రతారతో గూడిన ముహూర్తమున—

కౌముదే మాసి రేవత్యాం శరదన్తే హిమాగమే,
స్ఫీతసస్యసుఖే కాలే కల్యః సత్త్వవతాం వరః. 7

శరత్తు చివర, శీతా కాలము వచ్చు సమయమున కార్తీక మాసమున పుష్టిగల పంటలతో, సుఖమైన కాలమున సత్త్వగుణము గల వారిలో శ్రేష్ఠుడగు కృష్ణుడు సన్నద్ధుడై

---

5. యాస్యామి - పోయెదను; 'నీవు చెప్పినది చేయుటకు' అని భావము; అభీప్సయా - పొందు కోరికతో.

6. విమలవద్గతే - నిర్మలమైన ఆకసమునకు రాగా; మైత్రీ - మిత్రతారయందు; జన్మనక్షత్రము మొదలుకొని ఎనిమిదవతారయందు దూకుత ప్రభువు బలముతోడనే బలము కలుగునని భావము.

7. కౌముదే - కార్తికమున; అర్జునుడు ఫల్గునీ నక్షత్రమున పుట్టెను కావున నతనికి రేవతి మైత్ర తార యగును.

మఙ్గల్యాః పుణ్యనిర్ఘోషా వాచః శృణ్వంశ్చ సూనృతాః,
బ్రాహ్మణానాం ప్రతీతానా మృషీణా మివ వాసవః. 8

మంగళకరములు, పవిత్రములు, యథార్థములగు పరిచితులగు బ్రాహ్మణుల వాక్కులను ఇంద్రుడు ఋషుల వాక్కులను వినుచున్న విధమున వినుచు......

కృత్వా పౌర్వాహ్ణికం కృత్యం స్నాతః శుచి రలంకృతః,
ఉపతస్థే వివస్వన్తం పావకం చ జనార్దనః. 9

జనార్దనుడు స్నానమాడి, శుచియై భూషణములు ధరించి ఉదయ కాల కృత్యములు గావించి సూర్యుని, అగ్నిని ఉపాసించెను.

ఋషభం పృష్ఠ ఆలభ్య బ్రాహ్మణా నభివాద్య చ,
అగ్నిం ప్రదక్షిణం కృత్వా పశ్యన్ కల్యాణ మగ్రతః. 10
తత్ప్రతిజ్ఞాయ వచనం పాణ్డవస్య జనార్దనః,
శినేర్నప్తార మాసీన మభ్యభాషత సాత్యకిమ్. 11

ఎద్దు వీపు స్పృశించి, బ్రాహ్మణులకు మ్రొక్కి, అగ్నికి ప్రదక్షిణము చేసి ముందు శుభశకునములను గాంచుచు జనార్దనుడు ధర్మరాజు పలుకును తలపోయుచు నెదురుగా కూర్చున్న శిని ముని మనుమడు సాత్యకితో ఇట్లు పలికెను.

రథ ఆరోప్యతాం శఙ్ఖశ్చక్రం చ గదయా సహ,
ఉపాసఙ్గాశ్చ శక్త్యశ్చ సర్వప్రహరణాని చ. 12

శంఖము, చక్రము, గద, అంపపొదులు, శక్తులు, తక్కిన అన్ని విధములగు ఆయుధములు రథమున గూర్చుము.

దుర్యోధనశ్చ దుష్టాత్మా కర్ణశ్చ సహసౌబలః,
న చ శత్రు రవజ్ఞేయో దుర్బలోఽపి బలీయసా. 13

ఆ దుర్యోధనుడు, కర్ణుడు, శకుని పాడుబుద్ధి కలవారు. ఎంత బలము గలవాడైనను ఎంతటి బలహీనునైనను శత్రువును తేలికగా భావింపరాదు.

---

11. నప్తారమ్ - మునిమనుమనిని; ప్రతిజ్ఞాయ - స్మరణకు తెచ్చుకొని.

తత స్తన్మత మాజ్ఞాయ కేశవస్య పురఃసరాః,
ప్రసస్రు ర్యోజయిష్యన్తో రథం చక్రగదాభృతః. 14

అంతనాతని భావమెరిగి చక్రమును, గదను పట్టుకొని రథమును గూర్చుచు సాత్యకి మొదలగువారు కేశవుని ముందు చరచర నడువసాగిరి.

తం దీప్త మివ కాలాగ్ని మాకాశగ మివాశుగమ్,
సూర్యచన్ద్రప్రకాశాభ్యాం చక్రాభ్యాం సమలఙ్కృతమ్. 15

కాలాగ్నివలె ధగదధలాడిపోవుచు, వేగముతోపోవు సూర్యునివలె నున్న దానిని, సూర్యచంద్రులవంటి వెలుగుగల చక్రములతో అలరారు దానిని...

అర్ధచన్ద్రైశ్చ చన్ద్రైశ్చ మత్స్యైః సమృగపక్షిభిః,
పుష్పైశ్చ వివిధై శ్చిత్రం మణిరత్నైశ్చ సర్వశః. 16

అర్ధచంద్రులు, చంద్రులు, చేపలు, మృగములు, పక్షులు, వివిధములగు మణులు, రత్నములు మున్నగువాని స్వరూపములతో అంతట చిత్రమైన దానిని...

తరుణాదిత్యసంకాశం బృహన్తం చారుదర్శనమ్,
మణిహేమవిచిత్రాఙ్గం సుధ్వజం సుపతాకినమ్. 17

లేత సూర్యునివలె నున్నదానిని, పెద్దదానిని, చూడముచ్చటయైనదానిని, మణులతో బంగారముతో చేసిన విచిత్రములగు అవయవములుగల దానిని, మంచి ధ్వజము, పతాకము గలదానిని...

సూపస్కర మనాధృష్యం వైయాఘ్ర పరివారణమ్,
యశోఘ్నం ప్రత్యమిత్రాణాం యదూనాం నన్దివర్ధనమ్. 18

---

14. ప్రసస్రుః - చర చర నడచిరి.
15. ఆకాశగమ్ - ఆకాశమున పోవు సూర్యునివలె నున్న దానిని;
ఆకాశమివ - అనియు పాఠము - అపుడు విశాలముగానుండి నక్షత్రముల వంటి అలంకారములతో కూడినది కనుక ఆకాశమువలె నున్నదానిని;
18. సూపస్కరమ్ - చక్కని సాధనములతో కూడిన దానిని;

చక్కని సాధనములతో కూడిన దానిని, ఎవ్వరికిని లొంగని దానిని, పులితోలు కప్పు కలదానిని, శత్రువుల కీర్తిని ధ్వంసము చేయు దానిని, యదు వంశమువారికి ఆనందము పెంపొందించుదానిని...

వాజిభిః శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకైః,
స్నాతైః సంపాదయామాసుః సంపన్నైః సర్వసంపదా. 19

చక్కగా స్నానమాదినవియు, అన్ని సంపదలతో నిండినవియునగు శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము - అను గుఱ్ఱములతో కూడిన దానిని రథమును సిద్ధపరచిరి.

మహిమానం తు కృష్ణస్య భూయ ఏవాభివర్ధయన్,
సఘోషః పతగేన్ద్రేణ ధ్వజేన యుయుజే రథః. 20

కృష్ణుని మహిమను మరింతగా పెంపొందించుచు గరుత్మంతుడు గల ధ్వజముతో రథము చెవి కింపైన నాదముతో సిద్ధమాయెను.

తం మేరుశిఖరప్రఖ్యం మేఘదున్దుభినిస్స్వనమ్,
ఆరురోహ రథం శౌరి ర్విమాన మివ కామగమ్. 21

మేరుపర్వతము శిఖరముపలె నున్నదియు, మేఘము, దుందుభి అను వాని నాదమువంటి నాదము గలదియు, ఇష్టమునుబట్టి పోవు విమానముపలె నున్నదియు నగు రథమును శ్రీకృష్ణు డధిరోహించెను.

తతః సాత్యకి మారోప్య ప్రయయౌ పురుషోత్తమః,
పృథివీం చాన్తరిక్షం చ రథఘోషేణ నాదయన్. 22

రథఘోషముతో నేలను నింగిని దద్దరిల్లజేయుచు సాత్యకిని రథ మెక్కించుకొని పురుషోత్తముడు బయలుదేరెను.

వ్యపోఢాభ్ర స్తతః కాలః క్షణేన సమపద్యత,
శివ శ్చానువవౌ వాయుః ప్రశాన్త మభవ ద్రజః. 23

ఆకాశమున మేఘములు తొలగిన సమయము క్షణములో నేర్పడెను. వాయువు శుభప్రదముగా అనుకూలముగా వీచెను. దుమ్ము అణగెను.

---

19. - సంపాదయామాసుః - సిద్ధము చేసిరి.

ప్రదక్షిణానులోమాశ్చ మఙ్గల్యా మృగపక్షిణః,
ప్రయాణే వాసుదేవస్య బభూవు రనుయాయినః. 24

మృగములు, పక్షులు వాసుదేవుని ప్రయాణమున శుభమును సూచించుచు ప్రదక్షిణముగా అనులోమముగా వెంటనంటి తిరిగినవి.

మఙ్గల్యార్థప్రదైః శబ్దై రన్వవర్తన్త సర్వశః,
సారసాః శతపత్రాశ్చ హంసాశ్చ మధుసూదనమ్. 25

విజయము కలుగునను నర్థమును సూచించు కూతలతో బెగ్గురు పక్షులు, నెమళ్ళు, హంసలు శ్రీకృష్ణుని వెంట ప్రయాణించినవి.

మన్త్రాహుతిమహాహోమై ర్హూయమానశ్చ పావకః,
ప్రదక్షిణముఖో భూత్వా విధూమః సమపద్యత. 26

అగ్నిదేవుడును పొగలేక ప్రదక్షిణముఖుడై మంత్రములతో వ్రేల్చిన హోమపదార్థములతో ప్రజ్వరిల్లుచు కన్పట్టెను.

వసిష్ఠో వామదేవశ్చ భూరిద్యుమ్నో గయః క్రథః,
శుక్రనారదవాల్మీకా మరుతః కుశికో భృగుః. 27

దేవబ్రహ్మర్షయశ్చైవ కృష్ణం యదుసుఖావహమ్,
ప్రదక్షిణ మవర్తన్త సహితా వాసవానుజమ్. 28

వసిష్ఠుడు, వామదేవుడు, భూరిద్యుమ్నుడు, గయుడు, క్రథుడు, శుక్రుడు, నారదుడు, వాల్మీకుడు, మరుత్తు, కుశికుడు, భృగువు - మరియు దేవర్షులు, బ్రహ్మర్షులు అందరు కలిసి యదువంశమువారికి సుఖకారకుడు, ఇంద్రుని తమ్ముడు నగు కృష్ణునికి ప్రదక్షిణము గావించిరి

ఏవమేతై ర్మహాభాగై ర్మహర్షిగణసాధుభిః,
పూజితః ప్రయయౌ కృష్ణః కురూణాం సదనం ప్రతి. 29

---

24. అనులోమాః - పైకి ఎక్కు ధోరణి కలవియై - ఆరోహణ క్రమమున.

25. మఙ్గల్యార్థప్రదైః - 'విజయీ భవ' వంటి-ధ్వనులను సూచించు, శతపత్రాః - నెమళ్ళు, రామచిలుకలు.

ఇట్టి మహానుభావులు, మహర్షులు, సాధువులు పూజించుచుండగా కృష్ణుడు కౌరవుల సభకు బయలు దేరెను.

తం ప్రయాన్త మనుప్రాయాత్ కున్తీపుత్రో యుధిష్ఠిరః,
భీమసేనార్జునౌ చోభౌ మాద్రీపుత్రౌ చ పాణ్డవౌ. 30

కుంతి కొడుకగు యుధిష్ఠిరుడు, భీమసేనుడు, అర్జునుడు, మాద్రి కొడుకులు - ఈ అయిదుగురు పాండవులు అట్లు బయలుదేరిన కృష్ణుని వెంటనంటి నడచిరి.

చేకితానశ్చ విక్రాన్తో ధృష్టకేతుశ్చ చేదిపః,
ద్రుపదః కాశిరాజశ్చ శిఖణ్డీ చ మహారథః, 31
ధృష్టద్యుమ్నః సపుత్రశ్చ విరాటః కేకయైః సహ,
సంసాదనార్థం ప్రయయుః క్షత్రియాః క్షత్రియర్షభమ్. 32

పరాక్రమవంతుడగు చేకితానుడు, చేదిరాజగు ధృష్టకేతువు, ద్రుపదుడు, కాశిరాజు, మహారథుడగు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, కొడుకుంతోపాటు విరాటుడు, కేకయులు, ఇతర క్షత్రియులు క్షత్రియశ్రేష్ఠుడగు కృష్ణుని వెంట నడచిరి.

తతోఽనువ్రజ్య గోవిన్దం ధర్మరాజో యుధిష్ఠిరః,
రాజ్ఞాం సకాశే ద్యుతిమా నువా చేదం వచస్తదా. 33

అంత కాంతితో వెలుగొందుచున్న ధర్మరాజు యుధిష్ఠిరుడు కృష్ణుని వెంటనంటి నడచుచు రాజులకడ కృష్ణునితో నిట్లు పలికెను.

యో నైవ కామా న్న భయా న్న లోభా న్నార్థకారణాత్,
అన్యాయ మనువర్తేత స్థిరబుద్ధి రలోలుపః. 34
ధర్మజ్ఞో ద్యుతిమాన్ ప్రాజ్ఞః సర్వభూతేషు కేశవః,
ఈశ్వరః సర్వభూతానాం దేవదేవః సనాతనః. 35

తం సర్వగుణసంపన్నం శ్రీవత్సకృతలక్షణమ్,
సంపరిష్వజ్య కౌన్తేయః సన్దేష్టు ముపచక్రమే. 36

---

32. సంసాదనార్థమ్ - కార్యము నెరవేరుటకు;

కామమువలననో, భయమువలననో, లోభమువలననో, ధనకారణము వలననో అన్యాయముగా ప్రవర్తింపనివాడు, చెదరని బుద్ధిగలవాడు, దేనియందు ఆసలు లేనివాడు, ధర్మ మెరిగినవాడు, తేజస్సుతో వెలుగొందువాడు, గొప్ప ప్రజ్ఞ కలవాడు, అన్ని భూతములయం దుండువాడు, సర్వభూతములకు ప్రభువు, దేవదేవుడు, సనాతనుడు, సర్వగుణములు సమృద్ధిగా గలవాడు, శ్రీవత్స మను పుట్టుమచ్చ గుర్తుగా గలవాడు నగు కృష్ణుని కౌగిలించుకొని కుంతీకుమారుడు సందేశము చెప్ప నారంభించెను.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లు పలికెను.

యా సా బాల్యా త్ప్రభృ త్యస్మాన్ పర్యవర్ధయ తాబలా,
ఉపవాసతపఃశీలా సదా స్వస్త్యయనే రతా. 37

ఆ మా అమ్మ పసితనమునుండి మమ్ములను కడుపు కట్టుకొని తపస్సు చేయుచు మా సుఖమునందే ప్రీతి కలదై పెంచినది.

దేవతాతిథిపూజాసు గురుశుశ్రూషణే రతా,
వత్సలా ప్రియపుత్రా చ ప్రియాఽస్మాకం జనార్దన. 38

ఎల్లవేళల దేవతలయు, అతిథులయు పూజలయందును, గురువుల సేవ యందును ప్రీతి కలది. బిడ్డలయందు నిండైన అనురాగము, ప్రేమ కలది. మా కామెయం దెంతో ప్రేమ.

సుయోధనభయాద్యా నోఽత్రాయతామిత్రకర్శన,
మహతో మృత్యుసంబాధా దుద్ధరే న్నౌరివార్ణవాత్. 39

శత్రుసంహారకా! ఆమె సుయోధనుడు మమ్మేమి చేయునో యని భయ పడుచు మమ్ము కాపాడినది. పెనుమిత్తి పట్టునుండి, సముద్రము నుండి నావ వలె, ఆమె మమ్ము పైకి తీసినది.

అస్మత్కృతే చ సతతం యయా దుఃఖాని మాధవ,
అనుభూతా న్యదుఃఖార్హా తాం స్మ పృచ్ఛే రనామయమ్. 40

మాధవా! మాకొరకై ఆమె పడరాని పాట్లు పడినది. నిజమున కామె ఏ దుఃఖము పొందరానిది. ఆమెను కుశల మడుగుము.

భృశ మాశ్వాసయే శ్చైనాం పుత్రశోకపరిప్లుతామ్,
అభివాద్య స్వజేథా స్త్వం పాణ్డవాన్ పరికీర్తయన్. 41

పుత్రులను గూర్చిన దుఃఖములో మునిగి తేలుచున్న ఆమెను పాండవులను గూర్చి నాలుగు మంచిమాటలు పలికి, మ్రొక్కి ఊరడింపుము.

ఊఢా ప్రభృతి దుఃఖాని శ్వశురాణా మరిన్దమ,
నికారా నతదర్హా చ పశ్యన్తీ దుఃఖ మశ్నుతే. 42

పెండ్లి అయినది మొదలుకొని అత్తమామల యింట ఈ యమ, పడరాని అవమానములు పడుచు, దుఃఖ మనుభవించుచున్నది.

అపి జాతు స కాలః స్యాత్ కృష్ణ దుఃఖవిపర్యయః,
య దహం మాతరం క్లిష్టాం సుఖం దద్యా మరిన్దమ. 43

కృష్ణా! ఈ చేటుకాలము మారి నలగిన మాయమ్మను సుఖపెట్టుకాలము ఎన్నటికైన వచ్చునా,

ప్రవ్రజన్తోఽనుధావన్తీం కృపణాం పుత్రగృద్ధినీమ్,
రుదతీ ముపహా యైనా మగచ్ఛామ వయం వనమ్. 44

మే మడవులకు పోవుచుండగా దీనురాలై పుత్రులను విడువజాలక ఏడ్చుచు వెంటబడి వచ్చుచున్న ఆ తల్లిని వదలి అడవుల కరిగితిమి.

న నూనం మ్రియతే దుఃఖైః సా చే జ్జీవతి కేశవ,
తథా పుత్రాధిభి ర్గాఢ మార్తా హ్యానర్త సత్కృత, 45
అభివాద్యాథ సా కృష్ణ త్వయా మద్వచనా ద్విభో.

ఆ కొడుకులను గూర్చిన బెంగలతో మిక్కిలిగా నొచ్చి ఆమె చావక బ్రదికియున్న యెడల, కృష్ణా! ప్రభూ! నా మాటగా ఆమెకు ముందు మ్రొక్కు చెల్లింపుము.

---

42. ఊఢాత్ - పెండ్లి మొదలుకొని, లేదా - ఊఢ మనగా బాల్యమనియు నర్థము. బాల్యము మొదలుకొని అని అర్థము. రెండర్థములలోను 'ఊఢ' శబ్దము భావార్థకము.

ధృతరాష్ట్రశ్చ కౌరవ్యో రాజానశ్చ వయోఽధికాః. 46

అట్లే కురువంశమున పెద్ద ధృతరాష్ట్రునకు, వయసున పెద్దవారగు రాజులకు నా నమస్కారములు తెలుపుము.

భీష్మం ద్రోణం కృపం చైవ మహారాజం చ బాహ్లికమ్,
ద్రౌణిం చ సోమదత్తం చ సర్వాంశ్చ భరతాన్ ప్రతి. 47

విదురం చ మహాప్రాజ్ఞం కురూణాం మన్త్రధారిణమ్,
అగాధబుద్ధిం మర్మజ్ఞం స్వజేథా మధుసూదన. 48

భీష్ముని, ద్రోణుని, కృపుని, మహారాజగు బాహ్లికుని, అశ్వత్థామను, సోమదత్తుని, తక్కిన భరతవంశరాజు లందరను, దొడ్డబుద్ధిగలవాడు, కురు వంశము వారికి మంచి మాటలు చెప్పువాడు, అతిగంభీరమగు హృదయము గలవాడు, ఎదుటివారి మర్మము నెరుగువాడు నగు విదురుని నా మాటగా కౌగి లింపుము.

ఇత్యుక్త్వా కేశవం తత్ర రాజమధ్యే యుధిష్ఠిరః,
అనుజ్ఞాతో నివవృతే కృష్ణం కృత్వా ప్రదక్షిణమ్. 49

యుధిష్ఠిరుడు రాజుల నడుమ కృష్ణునితో ఇట్లు పలికి ప్రదక్షిణమొనరించి అనుమతి గైకొని వెనుదిరిగెను.

వ్రజన్నేవ తు బీభత్సుః సఖాయం పురుషర్షభమ్,
అబ్రవీత్ పరవీరఘ్నం దాశార్హ మపరాజితమ్. 50

అర్జునుడు మరికొంత దూరము నడచుచు, శత్రువీరులను పరిమార్చు వాడు, ఎందును ఓటమి నెరుగనివాడు, తనకు ప్రాణమిత్రము, పురుషోత్తముడు నగు కృష్ణునితో ఇట్లనెను.

యదస్మాకం విభో వృత్తం పురా వై మన్త్రనిశ్చయే,
అర్ధరాజ్యస్య గోవిన్ద విదితం సర్వరాజసు. 51

"ప్రభూ! మునుపు మనము మంతనములాడి నిశ్చయించినపుడు అర్ధ రాజ్యమునకు సంబంధించిన మా సంగతి రాజులందరకు తెలిసినది."

తచ్చే ద్దద్యా దసజ్జేన సత్కృత్యానవమన్య చ,
ప్రియం మే స్యాన్మహాబాహో ముచ్యేర న్మహతో భయాత్. 52

"ఆ దుర్యోధనుడు మన్ననతో, అవమానింపక పట్టుదల వదలి దానిని ఇచ్చెనో, ఇది నాకు ప్రియమైన విషయము. వారందరు మహాభయమునుండి బయటపడుదురు."

అత శ్చే దన్యథా కర్తా ధార్తరాష్ట్రోఽనుపాయవిత్,
అన్తం నూనం కరిష్యామి క్షత్రియాణాం జనార్దన. 53

అట్లుగాక ఆ ధృతరాష్ట్రుని కొడుకు తెలివిమాలినవాడై మరొక విధముగా చేసెనేని అక్కడి క్షత్రియులందరి అంతు చూచెదను.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవము క్తే పాణ్డవేన సమహృష్యద్వృకోదరః,
ముహుర్ముహుః క్రోధవశాత్ ప్రావేపత చ పాణ్డవః. 54

అర్జును డిట్లు పలుకగా భీముడు పొంగిపోయెను. క్రోధవశమున మాటి మాటికి ఊగిపోవ జొచ్చెను.

వేపమాన శ్చ కౌన్తేయః ప్రాక్రోశ న్మహతో రవాన్,
ధనఞ్జయవచః శ్రుత్వా హర్షోత్సిక్తమనా భృశమ్. 55

అర్జునుని మాట విని ఆనందములో మునిగి తేలుచున్న మనస్సు గలవాడై భీముడు ఊగిపోవుచు పెద్దగా అరువసాగెను.

తస్య తం నినదం శ్రుత్వా సంప్రావేపన్త ధన్వినః,
వాహనాని చ సర్వాణి శకృన్మూత్రే ప్రసుస్రువుః. 56

అతని ఆ బొబ్బలు విని విలుకాండ్రందరు మిక్కిలిగా ఊగిపోవజొచ్చిరి. ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వాహనములన్నియు పేడవైచుచు, మూత్రము వదలుచు నుండెను.

ఇత్యుక్త్వా కేశవం తత్ర తథాచోక్త్వా వినిశ్చయమ్,
అనుజ్ఞాతో నివవృతే పరిష్వజ్య జనార్దనమ్. 57

అర్జును డిట్లు పలికి తన నిశ్చయ మెరిగించి. జనార్దనుని కౌగిలించి, అనుమతి గొని వెనుదిరిగెను.

తేషు రాజసు సర్వేషు నివృత్తేషు జనార్దనః,
తూర్ణ మభ్యగమ ద్ధృష్టః శైబ్యసుగ్రీవవాహనః. 58

ఆ రాజులందరు మరలగా జనార్దనుడు సంతోషముతో మెల్లగా శైబ్యము సుగ్రీవము మున్నగు గుఱ్ఱములు గల రథముతో బయలుదేరెను.

తే హయా వాసుదేవస్య దారుకేణ ప్రచోదితాః,
పన్థాన మాచేమురివ గ్రసమానా ఇవామ్బరమ్. 59

ఆ వాసుదేవుని గుఱ్ఱములు, దారుకుడు తోలుచుండగా, బాటను పీల్చివేయుచున్నవో యనునట్లు ఆకసమును మ్రింగుచున్నవో యన్నట్లు పరువెత్తినవి.

అథాపశ్య న్మహాబాహు రృషీ నధ్వని కేశవః,
బ్రాహ్మ్యా శ్రియా దీవ్యమానాన్ స్థితానుభయతః పథి. 60

అంత నా మహాబాహుడు మార్గమున బాట కిరువైపులను నిలిచి బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోవుచున్న ఋషులను గాంచెను.

సోఽవతీర్య రథాత్తూర్ణ మభివాద్య జనార్దనః,
యథావృత్తా నృషీన్ సర్వా నభ్యభాషత పూజయన్. 61

కృష్ణుడు రథమునుండి యొక్కపెట్టున దిగి ఆ విధముగా నున్న ఋషుల నందరను పూజించుచు నిట్లు పలికెను.

కచ్చిల్లోకేషు కుశలం కచ్చిద్ధర్మః స్వనుష్ఠితః,
బ్రాహ్మణానాం త్రయో వర్ణాః కచ్చిత్తిష్ఠతి శాసనే. 62

'లోకములకు క్షేమమా? అందరు ధర్మమును చక్కగా పాటించుచున్నారా? బ్రహ్మము నెరిగిన బ్రాహ్మణులు చెప్పు ధర్మమునందు తక్కిన మూడు వర్ణముల వారు నిలిచియున్నారా?

తేభ్యః ప్రయుజ్య తాం పూజాం ప్రోవాచ మధుసూదనః,
భగవన్తః క్వ సంసిద్ధాః కా వీథీ భవతా మిహ. 63

63. కా వీథీ-మీరు పోవు మార్గమేది? ఎచటకు పోవుచున్నారని తాత్పర్యము.

వారినట్లు కుశల ప్రశ్నలతో సత్కరించి కృష్ణుడు తిరిగి యిట్లడిగెను. అయ్యలారా ! మీ రెచటికి బయలు దేరితిరి? మీ మార్గమేది ?

కిం వా కార్యం భగవతా మహం కిం కరవాణి వః,
కేనార్థేనోపసంప్రాప్తా భగవన్తో మహీతలమ్. 64

"పూజ్యులారా! తమకిచట ఏమి పని గలదు? నేను తమకేమి చేయవలయును ? ఏ ప్రయోజనమునకై తాము భూతలమునకు విచ్చేసిరి?"

తమబ్రవీ జ్జామదగ్న్య ఉపేత్య మధుసూదనమ్,
పరిష్వజ్య చ గోవిన్దం సురాసురపతేః సఖా. 65

అప్పుడు జమదగ్ని కుమారుడు పరశురాముడు, సర్వలోకప్రభువునకు సఖుడు గోవిందుని సమీపించి కౌగిలించుకొని యిట్లు పలికెను.

దేవర్షయః పుణ్యకృతో బ్రాహ్మణాశ్చ బహుశ్రుతాః,
రాజర్షయశ్చ దాశార్హ మానయన్త స్తపస్వినః,
దేవాసురస్య ద్రష్టారః పురాణస్య మహామతే. 66

పుణ్యము చేసిన దేవర్షులు, గొప్ప పాండిత్యముగల బ్రాహ్మణులు, రాజర్షులు, మన్నన గల తపస్వులు ప్రాతకాలపు దేవదానవుల సముదాయమును చూడగోరుచున్నారు.

సమేతం పార్థివం క్షత్రం దిదృక్షన్తశ్చ సర్వతః,
సభాసదశ్చ రాజాన స్త్వాం చ సత్యం జనార్దనమ్. 67

వీరందరును, సభలోనున్న రాజులును అన్నివైపుల నుండి వచ్చి చేరు భూమిపతులను. సత్యస్వరూపుడవు జనార్దనుడవు అగు నిన్ను చూడగోరుచున్నారు.

ఏతన్మహ త్ప్రేక్షణీయం ద్రష్టుం గచ్ఛామ కేశవ,
ధర్మార్థసహితా వాచః శ్రోతు మిచ్ఛామ మాధవ. 68
త్వయోచ్యమానాః కురుషు రాజమధ్యే పరంతప.

"ఇది గొప్ప చూడదగిన విషయము. కేశవా! దీనిని చూచుటకై పోవుచున్నాము. మరియు మాధవా! రాజులందరి నడుమ కౌరవులను గూర్చి నీవు పలుకు ధర్మముతో, అర్థముతో గూడిన వాక్యములను వినగోరుచున్నాము".

---

66. దేవాసురస్య - దేవదానవులయొక్క సముదాయమును.

భీష్మద్రోణాదయ శ్చైవ విదురశ్చ మహామతిః. 69

త్వం చ యాదవశార్దూల సభాయాం వై సమేష్యథ,
తవ వాక్యాని దివ్యాని తథా తేషాం చ మాధవ, 70
శ్రోతుమిచ్ఛామ గోవింద సత్యాని చ హితాని చ.

"భీష్ముడు, ద్రోణుడు మొదలగువారు, దొడ్డ బుద్ధిగల విదురుడు, నీవును సభలో కలియుదురు. అప్పటి దివ్యములు, సత్యములు, హితములు నగు నీ వాక్యములను, వారి పలుకులను వినగోరుచున్నాము."

ఆపృష్టోఽసి మహాబాహో పునర్ద్రక్ష్యామహే వయమ్, 71
యాహ్యావిఘ్నేన వై వీర ద్రక్ష్యామస్త్వాం సభాగతమ్,
ఆసీన మాసనే దివ్యే బలతేజఃసమాహితమ్. 72

"ఓయి మహాబాహూ! సెలవు గైకొందుము. మరల నిన్ను చూతుము. వీరుడా! విఘ్నములు లేకుండ అరుగుము. సభలో దివ్యమగు ఆసనమున బలముతో తేజస్సుతో విరాజిల్లు నిన్ను చూడగలము".

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణప్రస్థానే త్ర్యశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణుడు బయలుదేరుట యను ఎనుబదిమూడవ అధ్యాయము.

—:o:—

# చతురశీతితమోఽధ్యాయః
## ఎనుబది నాలుగవ అధ్యాయము

**పథి శుభాశుభశకునవర్ణనమ్, మార్గే జనానాం సత్కారం ప్రాప్నువతః శ్రీకృష్ణస్య వృకస్థలం గత్వా తత్ర విశ్రమణం చ.**

**మార్గమున శ్రీకృష్ణునకు తోచిన శుభ, అశుభ శకునముల వర్ణనము, దారిలో జనుల సత్కారము పొందుచు శ్రీకృష్ణుడు వృకస్థలమున కరిగి అందు విశ్రమించుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ప్రయాన్తం దేవకీపుత్రం పరవీరరుజో దశ,
మహారథా మహాబాహు మన్వయుః శస్త్రపాణయః. 1

అట్లు బయలుదేరిన మహాబాహువగు దేవకీపుత్రుని వెంట శత్రువీరులను సంహరించువారు, శస్త్రములు చేత ధరించిన వారునగు మహారథులు పదిమంది యరిగిరి.

పదాతీనాం సహస్రం చ సాదినాం చ పరంతప,
భోజ్యం చ విపులం రాజన్ ప్రేష్యాశ్చ శతశోఽపరే. 2

వేయిమంది కాల్బంటులు, వేయిమంది గుఱ్ఱములవారు, పెద్దయెత్తున భోజనపదార్థములు గొని నూర్లకొలది సేవకులు బయలుదేరిరి.

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

కథం ప్రయాతో దాశార్హో మహాత్మా మధుసూదనః,
కాని వా వ్రజత స్తస్య నిమిత్తాని మహౌజసః. 3

మహాత్ముడు, దశార్హవంశమున బుట్టిన శ్రీమన్నారాయణుడు ప్రయాణము చేసిన విధమెట్టిది? గొప్ప శక్తిగల ఆ కృష్ణుడు పోవుచుండగా తోచిన శకునము లెట్టివి?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య ప్రయాణే యాన్యాస న్నిమిత్తాని మహాత్మనః,
తాని మే శృణు సర్వాణి దైవా న్యౌత్పాతికాని చ. 4

రాజా! ఆ మహాత్ముడు ప్రయాణము చేయుచుండగా కలిగిన శుభశకునములను, అశుభశకునములను అన్నింటిని చెప్పుదును. వినుము.

అనభ్రేఽశనినిర్ఘోషః సవిద్యు త్సమజాయత,
అన్వగేవ చ పర్జన్యః ప్రావర్ష ద్విఘనే భృశమ్. 5

మేఘము లేకయే మెరుపులతో పిడుగుల చప్పుడు ఉప్పతిల్లెను. వెనువెంటనే మబ్బులు లేకయే పెనువాన కురిసెను.

ప్రత్యగూహు ర్మహానద్యః ప్రాఙ్ముఖాః సిన్ధుస ప్తమాః,
విపరీతా దిశః సర్వా న ప్రాజ్ఞాయత కిఞ్చన. 6

తూర్పుగా ప్రవహించు ఏడు మహానదులు తూర్పునకు ప్రవహించునవి పడమటికి పారజొచ్చెను. దిక్కులు తారుమా రయ్యెను. ఏదియు ఏ కొంచెము తెలియరాకుండెను.

ప్రాజ్వల న్నగ్నయో రాజన్ పృథివీ సమకమ్పత,
ఉదపానా శ్చ కుమ్భాశ్చ ప్రాసిఞ్చన్ శతశో జలమ్. 7

అగ్నులు చెలరేగెను. భూమి కంపించెను. నూతులు, కుండలు నూర్లకొలది ధారలతో నీరు కురిపించెను.

తమఃసంవృత మప్యాసీత్ సర్వం జగదిదం తథా,
న దిశో నాదిశో రాజన్ ప్రజ్ఞాయ న్తే స్మ రేణునా. 8

లోకమెల్ల చీకట్లు క్రమ్మెను. దుమ్ముతో దిక్కు లేవో, దిక్కులు కాని వేవో తెలియరాకుండెను.

---

4. దైవాని - శకునములు; ఔత్పాతికాని - కీడు సూచించు అశుభ శకునములు;
6. ప్రత్యక్ - ఎదురుగా; ఊహుః - ప్రవహించినవి.

ప్రాదురాసీ న్మహాన్ శబ్దః ఖే శరీరం న దృశ్యతే,
సర్వేషు రాజన్ దేశేషు తదద్భుత మివాభవత్. 9

ఆకాశమున శరీరము కానరాకయే పెద్ద శబ్దమొకటి పుట్టెను. ఇది అన్ని దేశములందును అద్భుతమయ్యెను.

ప్రామథ్నా ద్ధాస్తినపురం వాతో దక్షిణపశ్చిమః,
ఆరుజన్ గణశో వృక్షాన్ పరుషోఽశనినిఃస్వనః. 10

నైరృతిమూలగా వీచిన పెనుగాలి పిడుగుల మ్రోతతో అతి తీవ్రమై రాసులు రాసులుగా చెట్లను విరగగొట్టుచు హస్తినాపురమును అల్లకల్లోలము చేసెను.

యత్ర యత్ర చ వార్ష్ణేయో వర్తతే పథి భారత,
తత్ర తత్ర సుఖో వాయుః సర్వం చాసీత్ ప్రదక్షిణమ్. 11

మార్గమున శ్రీకృష్ణుడున్న చోటులందెల్ల వాయువు సుఖముగా వీచెను. అంతయు అతనికి ప్రదక్షిణముగా తిరిగెను.

వవర్ష పుష్పవర్షం చ కమలాని చ భూరిశః,
సమశ్చ పన్థా నిర్దుఃఖో వ్యపేతకుశకణ్టకః. 12

పూలవాన కురిసెను. కమలములు పెల్లుగా వికసించెను. దారి యెగుడు దిగుళ్ళు, దర్భలు, ముళ్ళు లేనిదై సుఖముగా నుండెను.

సంస్తుతో బ్రాహ్మణై ర్గీర్భి స్తత్ర తత్ర సహస్రశః,
అర్చ్యతే మధుపర్కైశ్చ వసుభిశ్చ వసుప్రదః. 13

అందరకు అన్ని సంపదలనొసగు కృష్ణుని మార్గమున బ్రాహ్మణులు వేల సంఖ్యలో వచ్చి చక్కని వాక్కులలో స్తుతించిరి. మధుపర్కములతో, సొమ్ములతో అర్చించిరి.

---

9. ఖే - గగనమున; శరీరం - నీడవలె కన్పట్టు పురుషశరీరము.

10. దక్షిణపశ్చిమః - నైరృతిమూలగా వచ్చినది.

11. ఇంతవరకు కౌరవులకు కలుగబోవు అరిష్టములను సూచించు అశుభ శకునమును చెప్పి యిటుపై శ్రీకృష్ణుని ప్రయాణమునకైన శుభ శకునములను చెప్పుచున్నారు.

తం కిరన్తి మహాత్మానం వన్యైః పుష్పైః సుగన్ధిభిః,
స్త్రియః పథి సమాగమ్య సర్వభూతహితే రతమ్. 14

సర్వప్రాణులకు మేలు చేయుటయందు ప్రీతిగల ఆ మహాత్ముని దరికి వచ్చి కాంతలు చక్కని వాసనగల అడవిపూలను అతనిపై జల్లిరి.

స శాలిభవనం రమ్యం సర్వసస్యసమంచితమ్,
సుఖం పరమధర్మిష్ఠ మభ్యగా ద్భరతర్షభ. 15

పుష్కలమైన పంటతో చూడముచ్చట గొలుపుచు సుఖముతో గొప్ప ధర్మముతో నిండిన పంట పొలముల నాతడు చేరుకొనెను.

పశ్యన్ బహుపశూన్ గ్రామాన్ రమ్యాన్ హృదయతోషదాన్,
పురాణి చ వ్యతిక్రామన్ రాష్ట్రాణి వివిధాని చ. 16

మనోహరములై ఎదను పులకరింపజేయు పశుసంపద గల పల్లెలను చూచుచు, పట్టణములను, వివిధములగు రాష్ట్రములను దాటుచు నతడు పోవు చుండెను.

నిత్యం హృష్టాః సుమనసో భారతై రభిరక్షితాః,
నోద్విగ్నాః పరచక్రాణాం వ్యసనానా మకోవిదాః, 17

ఉపప్లావ్యా దథాగమ్య జనాః పురనివాసినః,
పథ్యతిష్ఠన్త సహితా విష్వక్సేనదిదృక్షయా. 18

భరతవంశపు రాజులు రక్షించుచుండగా ఎల్లవేళల సంతోషము కలిగిన వారు, మంచిమనసు గలవారు, పరుల దండయాత్రలవలన గుండె చెదరని వారు, వ్యసనము లన్నమాట యెరుగనివారు నగు పురజనులు ఉపప్లావ్యము నుండి గుంపులు గుంపులుగా వచ్చి శ్రీకృష్ణుని దర్శింపగోరినవారై మార్గమున నిలిచియుండిరి.

తే తు సర్వే సమాయాన్త మగ్ని మిద్ధమివ ప్రభుమ్,
అర్చయామాసు రర్చార్హం దేశాతిథి ముపస్థితమ్. 19

---

15. శాలిభవనమ్ - శాలి అనగా ధాన్యము; భవనమనగా 'పంటపుట్టుచోటు' అను నర్థమున పంటపొలము;

18. ఉపప్లావ్య మొక గ్రామము పేరు.

వారందరు ఆవిధముగా వచ్చుచున్నవాడు. వెలుగొందుచున్న అగ్నివలె నున్నవాడు, ప్రభువు. తమ దేశమున కతిథిగా వచ్చినవాడు పూజలకు యోగ్యుడు నగు శ్రీ కృష్ణుని అర్చించిరి.

వృకస్థలం సమాసాద్య కేశవః పరవీరహా,
ప్రకీర్ణరశ్మా వాదిత్యే వ్యోమ్ని వై లోహితాయతి. 20
అవతీర్య రథా త్తూర్ణం కృత్వా శౌచం యథావిధి,
రథమోచన మాదిశ్య సన్ధ్యాముపవివేశ హ. 21

పరవీరులను పరిమార్చు కేశవుడు వృకస్థలము చేరుకొని సూర్యుడు మింట ఎఱ్ఱబాఱుచు కిరణములను వెదజల్లుచుండగా రథము నుండి దిగి యథావిధిగ శుచికర్మము నాచరించి, రథము విడువ బంచి సంధ్యావందన మొనరించెను.

దారుకోఽపి హయా న్ముక్త్వా పరిచర్య చ శాస్త్రతః,
ముమోచ సర్వయోక్త్రాది ముక్త్వా చైతా నవాసృజత్. 22

దారుకుడును గుఱ్ఱముల మెడతాళ్ళు ఊడదీసి వానికి శాస్త్రము ప్రకారము సేదదీర్చి విశ్రాంతికై వదలెను.

అభ్యతీత్య తు తత్సర్వ మువాచ మధుసూదనః,
యుధిష్ఠిరస్య కార్యార్థమిహ వత్స్యామహే క్షపామ్. 23

కృత్యములన్నియు తీర్చుకొని శ్రీకృష్ణుడు, 'ధర్మరాజు పనికై పోవుచుంటిమి. ఈ రాత్రి ఇటు గడుపుదము' అని పలికెను.

తస్య తన్మత మాజ్ఞాయ చక్రు రావసథం నరాః,
క్షణేన చాన్నపానాది గుణవన్తి సమార్జయన్. 24

అతని అభిప్రాయ మెరిగి అచటి మనుష్యులందరు శీఘ్రముగా మేలైన అన్నపానాదులను సమకూర్చుచు విడిది ఏర్పరచిరి.

తస్మిన్ గ్రామే ప్రధానాస్తు య ఆసన్ బ్రాహ్మణా నృప,
ఆర్యాః కులీనా హ్రీమన్తో బ్రాహ్మీం వృత్తిమనుష్ఠితాః. 25
తేఽభిగమ్య మహాత్మానం హృషీకేశ మరిన్దమమ్,
పూజాం చక్రు ర్యథాన్యాయ మాశీర్మఙ్గలసంయుతమ్. 26

ఆ గ్రామమున పెద్దలు మంచి నడవడియు, కులమును, వినయశీలము గలవారు, బ్రహ్మమునందే ప్రవృత్తి గలవారు అగు బ్రాహ్మణులు మహాత్ముడగు శ్రీకృష్ణుని సమీపించి ధర్మము ననుసరించి ఆశీస్సులు, మంగళవాక్యములు పలుకుచు పూజ యొనర్చిరి.

తే పూజయిత్వా దాశార్హం సర్వలోకేషు పూజితమ్,
న్యవేదయన్త వేశ్మాని రత్నవన్తి మహాత్మనే. 27

సర్వలోకములకు పూజ్యుడగు శ్రీకృష్ణుని పూజించి వారు ఆ మహాత్మునకై రత్నములతో విలువగల భవనములను నివేదించుకొనిరి.

తాన్ ప్రభుః కృత మిత్యుక్త్వా సత్కృత్య చ యథార్హతః,
అభ్యేత్య చైషాం వేశ్మాని పునరాయాత్ సహైవ తైః. 28

ఆ ప్రభువు వారితో మన్నన అయినట్లే పలికి వారి యోగ్యతకు తగినట్లు సత్కరించి వారి భవనములు పావనము చేసి తిరిగి వారితో తిరిగి వచ్చెను.

సుమృష్టం భోజయిత్వా చ బ్రాహ్మణాం స్తత్ర కేశవః,
భుక్త్వా చ సహ తైః సర్వై రవసత్ తాం క్షపాం సుఖమ్. 29

తన విడిదిలో ఆ బ్రాహ్మణులందరికి తృప్తికరమగు భోజన యేర్పాటు చేయించి వారితో పాటు భుజించి ఆ రాత్రి అందు సుఖముగా నివసించెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణ ప్రయాణే చతురశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణప్రయాణము గల ఎనుబదినాల్గవ అధ్యాయము.

—: o :—

# పఞ్చాశీతితమోఽధ్యాయః
# ఎనుబదియైదవ అధ్యాయము

దుర్యోధనస్య ధృతరాష్ట్రప్రభృతీనా-మనుమత్యా
శ్రీకృష్ణస్య సత్కారార్థం మార్గే విశ్రామస్థాననిర్మాణమ్.
దుర్యోధనుడు ధృతరాష్ట్రుడు మున్నగువారి అనుమతితో
శ్రీకృష్ణుని సత్కరించుటకై మార్గమున విడిది పట్టుల నేర్పాటు చేయుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

తథా దూతైః సమాజ్ఞాయ ప్రయాన్తం మధుసూదనమ్,
ధృతరాష్ట్రోఽబ్రవీద్భీష్మ మర్చయిత్వా మహాభుజమ్. 1

అట్లు మధుసూదనుడు వచ్చుచున్నాడని దూతల వలన విని ధృతరాష్ట్రుడు మహావీరుడగు భీష్ముని గౌరవించి యిట్లు పలికెను.

ద్రోణం చ సఞ్జయం చైవ విదురం చ మహామతిమ్,
దుర్యోధనం సహామాత్యం హృష్టరోమాఽబ్రవీదిదమ్. 2

ద్రోణునితో, సంజయునితో, మహామతియగు విదురునితో, చెలికాండ్రతో గూడిన దుర్యోధనునితో ఒడలు పులకరించుచుండగా నిట్లు పలికెను.

అద్భుతం మహదాశ్చర్యం శ్రూయతే కురునన్దన,
స్త్రియో బాలాశ్చ వృద్ధాశ్చ కథయన్తి గృహే గృహే. 3

కురునందనా! అద్భుతము, ఆశ్చర్యమునగు వార్త వినవచ్చుచున్నది. ఇంటింట స్త్రీలు, పసివారు, వృద్ధులు అందరు చెప్పుకొనుచున్నారు.

సత్కృత్యాచక్షతే చాన్యే తథైవాన్యే సమాగతాః,
పృథగ్వాదాశ్చ వర్తన్తే చత్వరేషు సభాసు చ. 4

కొందరితరులను మన్నించి చెప్పుచున్నారు. కొందరు గుమిగూడి చెప్పుకొనుచున్నారు. కూడలులయందును, సభలయందు అనేకవిధములగు మాటలు సాగుచున్నవి.

ఉపాయాస్యతి దాశార్హః పాణ్డవార్థే పరాక్రమీ,
స నో మాన్యశ్చ పూజ్యశ్చ సర్వథా మధుసూదనః. 5

కృష్ణుడు పాండవుల పనిమీద వచ్చుచున్నాడు. గొప్ప పరాక్రమము గల ఆతడు మనకు మన్నింపదగినవాడు. మన మాతని నన్నివిధముల నర్చింపవలయును.

తస్మిన్ హి యాత్రా లోకస్య భూతానా మీశ్వరో హి సః,
తస్మిన్ ధృతిశ్చ వీర్యం చ ప్రజ్ఞా చౌజశ్చ మాధవే. 6

ఈ లోకమెల్ల అతనియందే నడచుచున్నది. ఆతడు సర్వభూతములకు ఈశ్వరుడు గదా! ఆ మాధవునియందు నిలకడ, మనోబలము, బుద్ధిబలము, దేహబలము నిండుగా గలవు.

స మాన్యతాం నరశ్రేష్ఠః స హి ధర్మః సనాతనః,
పూజితో హి సుఖాయ స్యాదసుఖః స్యాదపూజితః. 7

ఆ పురుషోత్తముని మనము సమ్మానింపవలయును. ఆతడు సనాతనమగు ధర్మము. ఆతనిని పూజించినచో సుఖము, పూజింపనిచో దుఃఖము కలుగును.

స చేత్తుష్యతి దాశార్హ ఉపచారై రరిందమః,
కృష్ణాత్ సర్వా నభిప్రాయాన్ ప్రాప్స్యామః సర్వరాజసు. 8

మనము చేసిన పూజలతో ఆ శత్రుమర్దనుడు కృష్ణుడు సంతసించెనా ఆతని దయవలన రాజులందరియందును మన కోరికలన్నియు నెరవేరును.

తస్య పూజార్థ మద్యైవ సంవిధత్స్వ పరంతప,
సభాః పథి విధీయన్తాం సర్వకామసమన్వితాః. 9

ఆతని పూజ కొరకు నేడే అన్ని ఏర్పాట్లు చేయుము. ఆతడు వచ్చు బాటలో అన్ని కోరికలు తీరునట్లు విడుదులేర్పరుపుము.

---

8. అభిప్రాయాన్ - కోరికలను.

యథా ప్రీతి ర్మహాబాహో త్వయి జాయేత తస్య వై,
తథా కురుష్వ గాన్ధారే కథం వా భీష్మ మన్యసే. 10

నాయనా! గాంధారిపుత్రా! ఆ మహాబాహువునకు నీపై ప్రీతి పుట్టునట్లంతయు సమకూర్పుము. భీష్మా! నీ అభిప్రాయ మేమి?

తతో భీష్మాదయః సర్వే ధృతరాష్ట్రం జనాధిపమ్,
ఊచుః పరమ మిత్యేవం పూజయన్తోఽస్య తద్వచః. 11

అంత భీష్ముడు మొదలగువా రందరు అతని ఆ మాటను మెచ్చుకొనుచు ఇది ఉత్తమమని ధృతరాష్ట్రమహారాజుతో పలికిరి.

తేషా మనుమతం జ్ఞాత్వా రాజా దుర్యోధనస్తదా,
సభావాస్తూని రమ్యాణి ప్రదేష్టు ముపచక్రమే. 12

దుర్యోధనుడంత వారి యొప్పుదల నెరిగి అందమైన శాలలు కట్టింప మొదలిడెను.

తతో దేశేషు దేశేషు రమణీయేషు భాగశః,
సర్వరత్నసమాకీర్ణాః సభా శ్చక్రు రనేకశః. 13

అంత ఆ యా దేశములలో ఇంపైన భాగములలో రత్నములన్నియు పరచి పెక్కు విడిదిపట్టుల నేర్పరచిరి.

ఆసనాని విచిత్రాణి యుతాని వివిధై ర్గుణైః,
స్త్రియో గన్ధా నలఙ్కారాన్ సూక్ష్మాణి వసనాని చ. 14

విచిత్రములగు ఆసనములను కొల్లలుగా కూర్చిరి. స్త్రీలు, గంధములు, అలంకారములు, మేలైన సన్నని వస్త్రములు మున్నగువాని నందుంచిరి.

గుణవన్త్యన్నపానాని భోజ్యాని వివిధాని చ,
మాల్యాని చ సుగన్ధీని తాని రాజా దదౌ తతః. 15

మేలైన అన్నపానములను, వివిధములగు పిండివంటలను చక్కని వాసనగల మాలలను రాజు వానియందు ఏర్పరచెను.

విశేషతశ్చ వాసార్థం సభాం గ్రామే వృకస్థలే,
విదధే కౌరవో రాజా బహురత్నాం మనోరమామ్. 16

ప్రత్యేకముగా వృకస్థలగ్రామమున కురురాజు పెక్కురత్నములతో హృదయము నలరించు విడిది కట్టించెను.

ఏతద్విధాయ వై సర్వం దేవార్హ మతిమానుషమ్,
ఆచఖ్యౌ ధృతరాష్ట్రాయ రాజా దుర్యోధన స్తదా. 17

నరుల కలవికాని దేవయోగ్యమగు నిట్టి ఏర్పాటంతయు గావించి దుర్యోధనుడు తండ్రికి ఎరిగించెను.

తాః సభాః కేశవః సర్వా రత్నాని వివిధాని చ,
అసమీక్ష్యైవ దాశార్హ ఉపాయాత్ కురుసద్మ తత్. 18

కృష్ణుడు ఆ విడిదిశాలలను వివిధములగు రత్నములను చూడనైన చూడకయే కురుదేశమునకు బయలుదేరెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మార్గే సభానిర్మాణే పఞ్చాశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మార్గమున విడిది నిర్మించుట యను ఎనుబదియైదవ అధ్యాయము.

—: o :—

# షడశీతితమోఽధ్యాయః

## ఎనుబదియారవ అధ్యాయః

శ్రీకృష్ణం ప్రత్యుద్గమ్య ధృతరాష్ట్రేణ వివిధోపహారసమర్పణమ్,
దుఃశాసనగృహే తదీయనివాసాయ విచారప్రకటనం చ.

శ్రీకృష్ణున కెదురేగి ధృతరాష్ట్రుడు పెక్కుకానుకలు సమర్పించుట,
దుశ్శాసను నింట ఆతనిని విడియుమని ప్రార్థించుట.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఉపప్లవ్యా దిహ క్షత్త రుపాయాతో జనార్దనః,
వృకస్థలే నివసతి చ స చ ప్రాతరిహైష్యతి. 1

నాయనా! విదురా! జనార్దనుడు ఉపప్లవ్యమునుంచి ఇచటకు బయలు దేరెనట. వృకస్థలమున ఉన్నాడట. రేపటకు వచ్చును.

ఆహుకానా మధిపతిః పురోగః సర్వసాత్త్వతామ్,
మహామనా మహావీర్యో మహాసత్త్వో జనార్దనః. 2

ఆ జనార్దనుడు ఆహుకవంశము వారికి ప్రభువు. సాత్వతు లందరకు నాయకుడు. ఆతని చేవ, బలము, బుద్ధియు మిక్కిలి గొప్పవి.

స్ఫీతస్య వృష్ణిరాజ్యస్య భర్తా గోప్తా చ మాధవః,
త్రయాణా మపి లోకానాం భగవాన్ ప్రపితామహః. 3

సర్వసంపదలు సమృద్ధిగా గల వృష్ణిరాజ్యము నా మాధవుడు పాలించు చున్నాడు. కాపాడుచున్నాడు. అదియే యననేల? మూడులోకములకు ఆతడు ప్రభువు. పితామహుడైన బ్రహ్మకును తండ్రి.

వృష్ణ్యన్ధకాః సుమనసో యస్య ప్రజ్ఞా ముపాసతే,
ఆదిత్యా వసవో రుద్రా యథాబుద్ధిం బృహస్పతేః. 4

ఆదిత్యులు, వసువులు, రుద్రులు, బృహస్పతిప్రజ్ఞను మన్నించునట్లు మంచి మనసుగల వృష్ణి, అంధక వంశములవారు శ్రీకృష్ణుని ప్రజ్ఞను మన్నింతురు.

తస్మై పూజాం ప్రయోక్ష్యామి దాశార్హాయ మహాత్మనే,
ప్రత్యక్షం తవ ధర్మజ్ఞ తాం మే కథయతః శృణు. 5

మహాత్ముడగు ఆ శ్రీకృష్ణునకు పూజ నొనరింతును. ఓయి ధర్మ మెరిగినవాడా! ఆ పూజను గూర్చి నీకు ఉన్నది యున్నట్లు చెప్పుచున్నాను. వినుము.

ఏకవర్ణైః సుకృష్ణాఙ్గై ర్బాహ్లిజాతై ర్హయోత్తమైః,
చతుర్యుక్తాన్ రథాం స్తస్మై రౌక్మాన్ దాస్యామి షోడశ. 6

చిక్కని అవయవములుగల బాహ్లిజాతి గుఱ్ఱములు ఒకే రంగు గలవి నాలుగేసి కట్టిన బంగారు రథములు పదునారింటిని అతనికి సమర్పింతును.

నిత్యప్రభిన్నాన్ మాతఙ్గా నీషాదన్తాన్ ప్రహారిణః,
అష్టానుచర మేకైక మష్టౌ దాస్యామి కౌరవ. 7

నాగలి యేడికోల వంటి దంతములు గలవియు, బాగుగా మదించినవియు, పోటునకు దూకునవియు నగు ఏనుగుల నెన్మిదింటిని ఒక్కొక్కదానికి ఎనిమిది మంది చొప్పున సేవకుల నేర్పరచి యిత్తును.

దాసీనా మప్రజాతానాం శుభానాం రుక్మవర్చసామ్,
శతమస్మై ప్రదాస్యామి దాసానామపి తావతామ్. 8

బిడ్డలను కనని, శుభలక్షణములు, బంగారువన్నెయు గల దాసీజనమును నూరుమందిని, దాసులను నూరుగురిని అతనికి సమర్పింతును.

ఆవికం చ సుఖస్పర్శం పార్వతీయై రుపాహృతమ్,
తదప్యస్మై ప్రదాస్యామి సహస్రాణి దశాష్ట చ. 9

కొండరాజులు తెచ్చియిచ్చిన సున్నితమైన పదునెనిమిదివేల ఉన్ని వస్త్రములున్నవే అవియు నతనికి ముట్టజెప్పుదును.

7. ఈషాదన్తాన్ - నాగటి - కొయ్యవలె గట్టివి, పొడవైనవి యగు దంతములు గల వానిని;

అజినానాం సహస్రాణి చీనదేశోద్భవాని చ,
తాన్యప్యస్మై ప్రదాస్యామి యావదర్హతి కేశవః. 10

చీనదేశమున పుట్టిన చర్మములు వేయింటి నా కృష్ణున కర్పింతును. ఆ కృష్ణుని కడనే యవి యుండదగినవి.

దివా రాత్రౌ చ భాత్యేష సుతేజా విమలో మణిః,
తమప్యస్మై ప్రదాస్యామి తమర్హతి హి కేశవః. 11

ఇదిగో ఈ మణి గొప్ప తేజస్సు గలది. స్వచ్ఛమైనది. రాత్రింబవళ్ళు ప్రకాశించునది. దీనిని కూడ ఆయన కిత్తును. దానిని పొందదగినవాడు కేశవుడే గదా!

ఏకే నాభిపతత్యహ్నా యోజనాని చతుర్దశ,
యాన మశ్వతరీ యుక్తం దాస్యే తస్మై తదప్యహమ్. 12

ఒక్కదినమున పదునాలుగామడలు పోగలదియు, కంచరగాడిదలు పూన్చ నదియునగు నీ బండిని కూడ నాతని కొసగెదను.

యావన్తి వాహనాన్యస్య యావన్తః పురుషాశ్చ తే,
తతోఽష్టగుణమప్యస్మై భోజ్యం దాస్యామ్యహం సదా. 13

అతని కెన్ని వాహనములు గలవో, యెందరు భటులు గలరో ఆ సంఖ్య కెనిమిదింతలుగా నిత్యానుభవమునకై యొసగుదును.

మమ పుత్రాశ్చ పౌత్రాశ్చ సర్వే దుర్యోధనా దృతే,
ప్రత్యుద్యాస్యన్తి దాశార్హం రథైర్మృష్టైః స్వలంకృతాః. 14

ఒక దుర్యోధనుని వదలి నాకొడుకులు మనుమలును చక్కగా అలంకరించుకొని సర్వ సంపదలతో తులతూగురథములతో కృష్ణున కెదురేగుదురు.

స్వలంకృతాశ్చ కల్యాణ్యః పాదైరేవ సహస్రశః,
వారముఖ్యా మహాభాగం ప్రత్యుద్యాస్యన్తి కేశవమ్. 15

చక్కగా అలంకరించుకొన్న శుభలక్షణములు గల వారకాంతలు వేల కొలదిగా మహాత్ముడగు శ్రీకృష్ణునకు నడకతో ఎదురుగా వెళ్ళుదురు.

నగరాదపి యాః కాశ్చి ద్గమిష్యన్తి జనార్దనమ్,
ద్రష్టుం కన్యాశ్చ కల్యాణ్యస్తాశ్చ యాస్యన్త్యనావృతాః. 16

శ్రీ కృష్ణుని దర్శించుటకై నగరము నుండియు కన్యలు, పుణ్యస్త్రీలు-మేలి ముసుగులు లేకయే వెళ్ళుదురు.

సస్త్రీపురుషబాలం చ నగరం మధుసూదనమ్,
ఉదీక్షతాం మహాత్మానం భానుమన్తమివ ప్రజాః. 17

నగరమునందలి స్త్రీలు, పురుషులు, బాలురు అందరును ప్రజలు సూర్యుని దర్శించునట్లు మహాత్ముడగు మధుసూదనుని చూతురు గాక।

మహాధ్వజపతాకాశ్చ క్రియన్తాం సర్వతో దిశః,
జలావసిక్తో విరజాః పన్థా స్తస్యేతి చాన్వశాత్. 18

అన్ని దిక్కులందును ఎత్తుగా ధ్వజములు, పతాకములు గట్టుడు. ఆతడు వచ్చు దారిని నీళ్ళుచల్లి దుమ్ము లేకుండ చేయుడు.

దుఃశాసనస్య గృహం దుర్యోధన గృహాద్వరమ్,
తదద్య క్రియతాం క్షిప్రం సుసంమృష్టమలంకృతమ్. 19

దుర్యోధనుని భవనము కంటె దుశ్శాసనుని నిలయము మేలైనది. దానిని చక్కగా అలంకరించి వలసిన పదార్థములు కొల్లలుగా నుండునట్లు త్వరగా చేయుడు.

ఏతద్ధి రుచిరాకారైః ప్రాసాదై రుపశోభితమ్,
శివం చ రమణీయం చ సర్వర్తు సుమహాధనమ్. 20

ఇది సుందరమైన ఆకారములు గల ప్రాసాదములతో చూడముచ్చట గొలుపుచుండును. శుభమైనది. రమణీయమైనది. అన్ని ఋతువుల శోభయు ఒక్కమారుగా నందు సాక్షాత్కరించును. గొప్ప విలువగలది.

సర్వ మస్మిన్ గృహే రత్నం మమ దుర్యోధనస్య చ,
యద్యదర్హతి వార్ష్ణేయ స్తత్తద్దేయ మసంశయమ్. 21

ఈ యింటను, నా యింటను, దుర్యోధనుని యింటను గల ఎట్టి రత్నమైనను కృష్ణునకు యోగ్యమైనది. ఆతనికి వెనుకాడక ఒసగుదుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
ధృతరాష్ట్రవాక్యే షడశీతితమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
ధృతరాష్ట్రుని వాక్యముగల యెనుబదియారవ అధ్యాయము

—: o :—

# సప్తాశీతితమోఽధ్యాయః
# ఎనుబదియేడవ అధ్యాయము

## విదురేణ శ్రీకృష్ణస్యాజ్ఞాం పాలయితుం ధృతరాష్ట్రస్య ప్రబోధనమ్
## విదురుడు శ్రీకృష్ణుని యాజ్ఞ పాలింపుమని ధృతరాష్ట్రునకు ప్రబోధించుట.

విదుర ఉవాచ-విదురు డిట్లు పలికెను.

రాజన్ బహుమత శ్చాసి త్రైలోక్యస్యాపి సత్తమః,
సంభావితశ్చ లోకస్య సంమత శ్చాసి భారత. 1

రాజా! మన్ననగలవాడవైతివి. మూడు లోకములలో ఉత్తముడవైతివి. లోకమెల్ల నిన్ను కొనియాడును. అందరు నిన్ను ఇష్టపడుదురు.

య త్త్వమేవంగతే బ్రూయాః పశ్చిమే వయసి స్థితః,
శాస్త్రాద్వా సుప్రతర్కాద్వా సుస్థిరః స్థవిరో హ్యసి. 2

ప్రాలెడు వయస్సున నున్న నీ విట్లు పలుకుచున్నా వనగా శాస్త్రమును బట్టి చూచినను, చక్కని తర్కమును బట్టి ఆలోచించినను నీవు చెక్కుచెదరని వృద్ధుడవని భావము.

లేఖా శశిని భాః సూర్యే, మహోర్మిరివ సాగరే,
ధర్మ స్త్వయి తథా రాజన్నితి వ్యవసితాః ప్రజాః.

చంద్రునియందు గీతయు, సూర్యునియందు కాంతియు, సముద్రమున పెద్ద అలయు నున్న తీరున నీయందు ధర్మము నెలకొన్నదని ప్రజలు నమ్మకము పెట్టుకొందురు.

సదైవ భావితో లోకో గుణౌఘైస్తవ పార్థివ,
గుణానాం రక్షణే నిత్యం ప్రయతస్వ సబాన్ధవః. 4

4. భావితః - సంతసించునది.

నీయిట్టి గుణముల ప్రోపులచేత, రాజా! లోకమెల్ల నెల్లవేళల సంతసించును. నీ బంధువులతోపాటు నిత్యము ఇట్టి గుణములు కాపాడుకొనుటకు ప్రయత్నింపుము.

ఆర్జవం ప్రతిపద్యస్వ మా బాల్యాద్బహు నీనశః,
రాజన్ పుత్రాంశ్చ పౌత్రాంశ్చ సుహృదశ్చైవ సుప్రియాన్. 5

రాజా! ఋజువర్తనము గట్టిగా అలవరచుకొనుము. చపలబుద్ధితో కొడుకులను, మనుమలను, మిక్కిలి ప్రియమైన మిత్రజనమును చంపుకొనకుము.

య త్త్వ మిచ్ఛసి కృష్ణాయ రాజన్నతిథయే బహు,
ఏత దన్య చ్చ దాశార్హః పృథివీ మపి చార్హతి. 6

మనకు అతిథిగా వచ్చుచున్న శ్రీకృష్ణునకు నీ వీగోరిన దెల్ల ఈవలసినదే. ఇది యేమి? ఆతనికి భూమి నంతటిని ఈదగును.

నతు త్వం ధర్మ ముద్దిశ్య తస్య వా ప్రియకారణాత్,
ఏతద్దిత్ససి కృష్ణాయ సత్యేనాత్మాన మాలభే. 7

నీవు ధర్మమును భావించియో, ఆతనికి ప్రియము చేయగోరియో కృష్ణునకిది యీగోరవు. సత్యముపై ఒట్టువేసి చెప్పుచున్నాను.

మా యైషా సత్యమేవైత చ్ఛద్మైత ద్భూరి దక్షిణ।
జానామి త్వన్మతం రాజన్ గూఢం బాహ్యేన కర్మణా. 8

ఇది మాయయో, సత్యమో, వంచనయో గొప్ప దక్షిణలిచ్చు ఓ రాజా! గూఢముగా నున్న నీ భావమును వెలికి కానవచ్చు నీ చేష్టద్వారా నేనెరుగుదును!

పఞ్చ పఞ్చైవ లిప్సన్తి గ్రామకాన్ పాణ్డవా నృప,
నచ దిత్ససి తేభ్య స్తాం స్తచ్ఛమం న కరిష్యసి. 9

పాండవులైదుగురు అయిదు చిన్న పల్లియలను పొందగోరుచున్నారు. నీవు వారి కవి ఒసగగోరవు. ఆ విధముగా శాంతిని సాధింప నిష్టపడవు.

---

5. ఆర్జవమ్ - కపట స్వభావము లేకుండుట; మానీనశః-చంపుకొనవలదు.
8. మాయా - ఇంద్రజాలము; ఛద్మ - వంచనము.

అర్థేన తు మహాత్మానం వార్ష్ణేయం త్వం జిహీర్షసి,
అనేన చాప్యుపాయేన పాణ్డవేభ్యో విభేత్స్యసి. 10

మహాత్ముడగు శ్రీ కృష్ణుని ధనముతో కొనివేయదలచుచున్నావు. ఈ ఉపాయముతో ఆతనిని పాండవులనుండి వేరు చేయదలచుచున్నావు.

నచ విత్తేన శక్యోఽసౌ నోద్యమేన న గర్హయా,
అన్యో ధనఞ్జయాత్ కర్తు మేతత్తత్త్వం బ్రవీమి తే. 11

ధనముతోగాని, ఎట్టి ప్రయత్నముతోగాని, దోషములు చూపిగాని శ్రీ కృష్ణుని అర్జునుని నుండి విడిపోవున ట్లెవ్వడు చేయజాలడు. ఉన్నదున్నట్లు చెప్పుచున్నాను.

వేద కృష్ణస్య మాహాత్మ్యం వేదాస్య దృఢభక్తితామ్,
అత్యాజ్య మస్య జానామి ప్రాణై స్తుల్యం ధనఞ్జయమ్. 12

నేను కృష్ణుని మహిమ నెరుగుదును. మరియు అర్జునుని చెదరని భక్తిని కూడ నెరుగుదును. ప్రాణములతో సమానుడగు అర్జును నా కృష్ణు డెన్నటికి విడువ డనియు నెరుగుదును.

అన్యత్ కుమ్భాదపాం పూర్ణా దన్యత్ పాదావసేచనాత్,
అన్యత్ కుశలసంప్రశ్నా న్నైవేక్ష్యతి జనార్దనః. 13

ఆ కృష్ణుడు నీవిచ్చు పూర్ణకుంభమునో, కాళ్ళు కడుగుకొను నీటినో, కుశల మడుగుటనో కాక తక్కిన దానిని కన్నెత్తి చూడడు.

యత్త్వస్య ప్రియ మాతిథ్యం మానార్హస్య మహాత్మనః,
తదస్మై క్రియతాం రాజన్ మానార్హోఽసౌ జనార్దనః. 14

ఆ మహాత్ముడు అన్నివిధముల మన్నింపదగినవాడు అతనికి ప్రియమైన అతిథిమర్యాద ఏదో అది చేయుము.

---

10. విభేత్స్యసి - శల్యునివలె వేరుచేయ గోరుచున్నావు.
11. గర్హయా - తిట్టుటచేత - తప్పులు చూపుట చేత అని భావము.
12. వేద - ఎరుగుదును.

ఆశంసమానః కల్యాణం కురూనభ్యేతి కేశవః,
యేనైవ రాజన్నర్థేన తదేవాస్మా ఉపాకురు. 15

అందరకు శుభమును కోరుచు, ఏ ప్రయోజనమునకై ఆ కృష్ణుడిటకు వచ్చుచున్నాడో దానినే అతనికి సమకూర్పుము.

శమమిచ్ఛతి దాశార్హ స్తవ దుర్యోధనస్య చ,
పాణ్డవానాం చ రాజేన్ద్ర తదస్య వచనం కురు. 16

రాజేంద్రా ! నీవును దుర్యోధనుడును పాండవులును శాంతించుటయే శ్రీకృష్ణుడు కోరునది. ఆమాట పాటింపుము.

పితాసి రాజన్ పుత్రాస్తే వృద్ధస్త్వం శిశవః పరే,
వర్తస్వ పితృవత్ తేషు వర్తన్తే తేహి పుత్రవత్. 17

రాజా ! నీవు తండ్రివి. వారు పుత్రులు. నీవు వృద్ధుడవు. వారు బాలురు. నీవు వారియందు తండ్రివలె మెలగుము. వారు నీయందు పుత్రులవలె మెలగుచున్నారు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదురవాక్యే సప్తాశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
విదురవాక్యముగల ఎనుబదియేడవ అధ్యాయము

—: ౦ :—

15. ఉపాకురు - అర్పింపుము

# అష్టాశీతితమోఽధ్యాయః

## ఎనుబదియెనిమిదవ అధ్యాయము

దుర్యోధనస్య శ్రీకృష్ణవిషయే స్వీయవిచార ప్రకటనం, తస్య కుమన్త్రేణ కుపితస్య భీష్మస్య సభాతః సముత్థానం చ.

దుర్యోధనుడు శ్రీకృష్ణుని విషయమున తన ఆలోచనను చెప్పుట, వాని చెడుతలపునకు కోపించిన భీష్ముడు సభనుండి వెడలిపోవుట.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను

యదాహ విదురః కృష్ణే సర్వం తత్ సత్య ముచ్యతే,
అనురక్తో హ్యసంహార్యః పార్థాన్ ప్రతి జనార్దనః. 1

విదురుడు కృష్ణుని విషయమున చెప్పిన దంతయు సత్యమే. అతడు పార్థులయందు మిక్కిలి అనురాగము గలవాడు. వారినుండి జనార్దనుని వేరు చేయ శక్యము కాదు.

యత్తత్సత్కారసంయుక్తం దేయం వసు జనార్దనే,
అనేకరూపం రాజేన్ద్ర న తద్దేయం కదాచన. 2

మన మిప్పుడు సత్కారపూర్వకముగా శ్రీకృష్ణుని కీయవలచిన అనేక విధమగు సొమ్ము ఎన్నటికిని ఈరాదు.

దేశః కాల స్తథాఽయుక్తో న హి నార్హతి కేశవః,
మంస్య త్యధోక్షజో రాజన్ భయా దర్చతి మామితి. 3

కృష్ణుడు సర్వవిధముల పూజించుట కర్హుడే కాని ఇచ్చుటకు ఈ తావు, ఈ వేళ తగినవి కావు. ఆ కృష్ణుడు నన్నీతడు భయపడి పూజించుచున్నాడని భావించును.

---

3. కృష్ణుడు పూజకు యోగ్యుడే అయినను ఈ దేశము, ఈ కాలము అందుకు తగినవి కావు. దానికి కారణము చెప్పుచున్నాడు. భయపడి అర్చించు చుండెనని కృష్ణుడు తలచునని.

అవమానశ్చ యత్ర స్యాత్ క్షత్రియస్య విశామ్పతే,
న తత్ కుర్యాద్ బుధః కార్యమితి మే నిశ్చితా మతిః. 4

రాజా! క్షత్రియు డైనవాడు అవమానము కలుగు కార్యమును తెలివి గలవా డైనచో ఎన్నటికి చేయరాదని నా నిశ్చయమైన తలపు.

స హి పూజ్యతమో లోకే కృష్ణః పృథులలోచనః,
త్రయాణా మపి లోకానాం విదితం మమ సర్వథా. 5

కృష్ణుడు లోకమున నందరకంటె మిక్కిలి పూజ్యుడు. ఈ లోకమునకే కాదు. మూడు లోకములకు మాన్యుడు. ఈ విషయము అన్నివిధముల నాకు తెలియును.

న తు తస్మై ప్రదేయం స్యాత్ తథా కార్యగతిః ప్రభో,
విగ్రహః సముపారబ్ధో న హి శామ్యత్యవిగ్రహాత్. 6

కాని అతని కేమియు నొసగరాదు. అది కార్యపద్ధతి. మున్ను మొదలైన ద్వేషము ఈనాటి మన్ననతో మర్యాదతో అణగిపోదు.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తద్వచనం శ్రుత్వా భీష్మః కురుపితామహః,
వైచిత్రవీర్యం రాజాన మిదం వచన మబ్రవీత్. 7

అతని ఆ మాట విని కౌరవుల తాత భీష్ముడు ధృతరాష్ట్రునితో నిట్లు పలికెను.

సత్కృతోఽసత్కృతో వాపి న క్రుద్ధ్యేత జనార్దనః,
నాల మేన మవజ్ఞాతుం నావజ్ఞేయో హి కేశవః. 8

నీవు సత్కరించినను సత్కరింపకున్నను కృష్ణుడు కోపగింపడు. నీ వాతని నవమానింపజాలవు ఆ కృష్ణు డెవరికి చిన్నచూపు చూడదగినవాడు కాడు.

యత్తు కార్యం మహాబాహో మనసా కార్యతాం గతమ్,
సర్వోపాయై ర్న తచ్ఛక్యం కేనచిత్ కర్తు మన్యథా. 9

---

౦ న - అలమ్ - చాలవు.

ఆతడు మనసున చేయ నిశ్చయించిన కార్యము నెట్టివాడును, ఎన్ని ఉపాయములతోడను మార్పజాలడు.

స యద్బ్రూయాన్మహాబాహు స్తత్కార్య మవిశఙ్కయా,
వాసుదేవేన తీర్థేన క్షిప్రం సంశామ్య పాణ్డవైః. 10

ఆ మహాబాహుడు చెప్పినది శంకవిడిచి చేయుట మనకు కర్తవ్యము. వాసుదేవు డను రేవును ఆశ్రయించి పాండవులతో వేగమే సంధి చేసికొనుము.

ధర్మ్య మర్థ్యం చ ధర్మాత్మా ధ్రువం వక్తా జనార్దనః,
తస్మిన్ వాచ్యాః ప్రియా వాచో భవతా బాన్ధవైః సహ. 11

ధర్మబుద్ధిగల జనార్దనుడు, ధర్మము, అర్థము తప్పని పలుకే తప్పక పలుకును. నీవును నీచుట్టములును ఆతని విషయమున ప్రియములగు పలుకులే పలుకవలయును.

దుర్యోధన ఉవాచ-దుర్యోధను డిట్లు పలికెను.

న పర్యాయోఽస్తి యద్రాజన్ శ్రియం నిష్కేవలా మహమ్,
తైః సహేమా ముపాశ్నీయాం యావజ్జీవం పితామహ. 12

తాతా! నేను బ్రదికియుండునంతకాలము మొత్తము సంపదను వారితో కలసి అనుభవించుపద్ధతికి మారువిధానము లేదు.

ఇదం తు సుమహత్ కార్యం శృణు మే యత్సమర్థితమ్,
పరాయణం పాణ్డవానాం నియచ్ఛామి జనార్దనమ్. 13

మరియు నేనొక దొడ్డపని సంకల్పించితిని. దానిని వినుము. పాండవులకు పెద్దదిక్కయిన శ్రీకృష్ణుని బంధింతును.

తస్మిన్ బద్ధే భవిష్యన్తి వృష్ణయః పృథివీ తథా,
పాణ్డవాశ్చ విధేయా మే స చ ప్రాత రిహైష్యతి. 14

---

10. తీర్థేన - స్నానఘట్టముతో; సంశామ్య - శాంతుడవగుము.

12. పర్యాయః - వేరు దారి, నిష్కేవలామ్ - మొత్తమును, వారిని దాసులుగనే యుంచుటకు ముందు చెప్పిన దారి కంటె మరియొకటి లేదని తాత్పర్యము.

అతడు నాకు చిక్కినచో వృష్ణివంశమువారు, ఈ భూమియు ఆ పాండవులును నాచేతి కీలుబొమ్మ లగుదురు. మరునాడు ప్రొద్దునే ఆత డిటకు వచ్చును.

అత్రోపాయాన్ యథా సమ్యఙ్న బుధ్యేత జనార్దనః,
న చాపాయో భవేత్కశ్చి త్తద్భవాన్ ప్రబ్రవీతు మే. 15

కావున నాతడు తప్పించుకొనుటకు ఉపాయములు చక్కగా భావింపలేదు మన కెట్టి అపాయము రానివిధమును మీరు చెప్పుడు.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తద్వచనం శ్రుత్వా ఘోరం కృష్ణాభిసంహితమ్,
ధృతరాష్ట్రః సహామాత్యో వ్యథితో విమనాఽభవత్. 16

కృష్ణుని మోసపుచ్చు ఆ ఘోరమగు అతని మాట విని ధృతరాష్ట్రుడును. అతని దగ్గరివారును కళవళపడిరి. వారికి మనను మనసులో లేకపోయెను.

తతో దుర్యోధన మిదం ధృతరాష్ట్రోఽబ్రవీ ద్వచః,
మైవం వోచః ప్రజాపాల నైష ధర్మః సనాతనః. 17

అంత ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో నిట్లు పలికెను. ప్రజల కేలిక వైన ఓ దుర్యోధనా! ఇట్లు పలుకరాదు. ఇది సనాతన మగు ధర్మము కాదు.

దూతశ్చ హి హృషీకేశః సంబన్ధీ చ ప్రియశ్చ నః,
అపాపః కౌరవేయేషు స కథం బన్ధ మర్హతి. 18

ఆ హృషీకేశుడు దూత కదా! మరియు మనకు చుట్టము. ప్రియుడు, అతనికి కౌరవులయందు పాడుబుద్ధి లేదు. అట్టివాని నెట్లు బంధింతువు?

భీష్మ ఉవాచ - భీష్మ డిట్లు పలికెను.

పరీత స్తవ పుత్రోఽయం ధృతరాష్ట్ర సుమన్దధీః,
వృణో త్యనర్థం నైవార్థం యాచ్యమానః సుహృజ్జనైః. 19

ధృతరాష్ట్ర! నీకొడుకు బుద్ధి పూర్తిగా మందగించినది. వీడు చావుతో చుట్టుకొని పోవుచున్నాడు. కోరి కోరి కీడే తెచ్చుకొనుచున్నాడు. మేలుకోరువా రెంత బ్రతిమాలినను మేలు పరికింపకున్నాడు.

---

19. పరీతః - చావుతో చుట్టుకొని పోవుచున్నాడు;

ఇమ ముత్పథి వర్తన్తం పాపం పాపానుబన్ధినమ్,
వాక్యాని సుహృదాం హిత్వా త్వమప్యస్యానువర్తసే. 20

మేలు కోరు హితుల మాటలు పట్టించుకొనక నీవును, వపలక పాపములే చేయు ఈ పాపాత్ముని వెంటబడి పోవుచున్నావు.

కృష్ణ మక్లిష్టకర్మాణ మాసాద్యాయం సుదుర్మతిః,
తవ పుత్రః సహామాత్యః క్షణేన న భవిష్యతి. 21

తేలికగా అన్ని పనులు చక్కబెట్టు శ్రీకృష్ణుని దరిజేరి యీ పరమనీచుడు తన మిత్రులతోపాటు ఒక్క క్షణమున నశించిపోవును.

పాపస్యాస్య నృశంసస్య త్యక్తధర్మస్య దుర్మతేః,
నోత్సహేఽనర్థసంయుక్తాః శ్రోతుం వాచః కథఞ్చన. 22

పాపాత్ముడు, క్రూరుడు, ధర్మమును విడనాడినవాడు, దుష్టబుద్ధియగు ఈ నీ కొడుకు పలుకులు ఎన్నటికిని విననొల్లను.

ఇత్యుక్త్వా భరతశ్రేష్ఠో వృద్ధః పరమమన్యుమాన్,
ఉత్థాయ తస్మాత్ ప్రాతిష్ఠ ద్భీష్మః సత్యపరాక్రమః. 23

భరతశ్రేష్ఠుడు, సత్యమగు పరాక్రమము గలవాడు, పెద్దవాడు అగు భీష్ముడు మిక్కిలి కోపముతో నిట్లు పలికి అటనుండి లేచిపోయెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
దుర్యోధనవాక్యే అష్టాశీతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
దుర్యోధనవాక్యము గల యెనుబదియెనిమిదవ అధ్యాయము.

—: o :—

# ఏకోననవతితమోఽధ్యాయః

# ఎనుబదితొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణస్య స్వాగతసమారోహః
## ధృతరాష్ట్రవిదురగృహయో స్తస్య సత్కారశ్చ.

## శ్రీకృష్ణునకు స్వాగతసన్నాహము
## ధృతరాష్ట్రవిదురభవనములలో ఆతనికి సత్కారము.

వైశంపాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ప్రాత రుత్థాయ కృష్ణస్తు కృతవాన్ సర్వ మాహ్నికమ్,
బ్రాహ్మణై రభ్యనుజ్ఞాతః ప్రయయౌ నగరం ప్రతి. 1

అటు కృష్ణుడును పెందలకడ లేచి పగటి కృత్యము లన్నియు నిర్వర్తించి బ్రాహ్మణు లనుమతింపగా నగరమునకు బయలుదేరెను.

తం ప్రయాన్తం మహాబాహు మనుజ్ఞాప్య మహాబలమ్,
పర్యవర్తన్త తే సర్వే వృకస్థలనివాసినః. 2

అట్లు ప్రయాణ మగుచున్న మహాబలుడైన ఆ శ్రీకృష్ణుని వృకస్థలము నందు నివసించు జను లందరు నలువైపుల చేరి సెలవు గైకొనిరి.

ధార్తరాష్ట్రా స్తమాయాన్తం ప్రత్యుజ్జగ్ముః స్వలంకృతాః,
దుర్యోధనా దృతే సర్వే భీష్మద్రోణకృపాదయః. 3

ఒక్క దుర్యోధనుని విడచి తక్కిన ధృతరాష్ట్రుని వారందరు - భీష్ముడు ద్రోణుడు కృపుడు మొదలగువారు - చక్కగా అలంకరించుకొని, వచ్చుచున్న కృష్ణున కెదురేగిరి.

పౌరాశ్చ బహులా రాజన్ హృషీకేశం దిదృక్షవః,
యానై ర్బహువిధై రన్యైః పద్భిరేవ తథాపరైః. 4

పురమువారును పెద్దసంఖ్యలో శ్రీకృష్ణుని చూడగోరి పలువిధములగు వాహనములతో కొందరు, కాలినడకతో కొందరు వచ్చి యుండిరి.

స వై పథి సమాగమ్య భీష్మేణాక్లిష్టకర్మణా,
ద్రోణేన ధార్తరాష్ట్రైశ్చ తైర్వృతో నగరం యయౌ. 5

ఆ కృష్ణుడును మార్గమున వారిని కలిసికొని సుఖమైన కార్యములు గల భీష్మునితో, ద్రోణునితో, ధృతరాష్ట్రుని కొడుకులతో గూడ నగరమున కరిగెను.

కృష్ణసంమానసార్థం చ నగరం సమలంకృతమ్,
బభూవ రాజమార్గశ్చ బహురత్నసమంచితః. 6

కృష్ణుని గౌరవించుటకై నగరమంతయు అలంకారములతో కళకళలాడి పోవుచుండెను. రాజమార్గము నిండ అనేకములగు రత్నములను వెదజల్లిరి.

న చ కశ్చి ద్గృహే రాజం స్తదాఽసీ ద్భరతర్షభ,
న స్త్రీ న వృద్ధో న శిశు ర్వాసుదేవదిదృక్షయా. 7

రాజా! స్త్రీలు, ముదుసలులు, పసివారు మొదలుకొని యందరు వాసుదేవుని చూచు కోరికతో ఇంట నిలువక వెలువడిరి

రాజమార్గే నరా స్తస్మిన్ సంస్తువ న్త్యవనిం గతాః,
తస్మిన్ కాలే మహారాజ హృషీకేశప్రవేశనే. 8

కృష్ణుడు నగరమున ప్రవేశించు నా సమయమున రాజమార్గమున జను లందరు క్రిందకు దిగి స్తోత్రములు చెసిరి.

ఆవృతాని వరస్త్రీభి ర్గృహాణి సుమహా న్త్యపి,
ప్రచల న్తీవ భారేణ దృశ్య న్తే స్మ మహీతలే 9

ఉత్తమజాతిస్త్రీలతో నిండిన గొప్పభవనములు బరువుతో నేలపై నూగులాడుచున్నవా? యన్నట్లు కానవచ్చెను.

తథా చ గతిమ న్త స్తే వాసుదేవస్య వాజినః,
ప్రణష్టగతయోఽభూవన్ రాజమార్గే నరై ర్వృతే. 10

మహావేగము గల శ్రీకృష్ణుని గుఱ్ఱములు జనులతో నిండిన రాజమార్గమున అడుగు ముందునకు వేయజాలకపోయినవి.

స గృహం ధృతరాష్ట్రస్య ప్రావిశ చ్ఛత్రుకర్శనః,
పాణ్డురం పుణ్డరీకాక్షః ప్రాసాదై రుపశోభితమ్. 11

అంత నా పుండరీకాక్షుడు, శత్రుసంహారకుడు పెక్కు భవనములతో రమణీయముగా నున్న తెల్లనిదగు ధృతరాష్ట్రుని దివాణము ప్రవేశించెను.

తిస్రః కక్ష్యా వ్యతిక్రమ్య కేశవో రాజవేశ్మనః,
వైచిత్రవీర్యం రాజాన మభ్యగచ్ఛ దరిన్దమః. 12

ఆ రాచనగరులో మూడు ప్రాకారములు దాటి శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని చేరుకొనెను.

అభ్యాగచ్ఛతి దాశార్హే ప్రజ్ఞాచక్షు ర్నరాధిపః,
సహైవ భీష్మద్రోణాభ్యా ముదతిష్ఠ న్మహాయశాః. 13

శ్రీకృష్ణుడు తనవైపు వచ్చుచుండగా గొప్పకీర్తిగల గ్రుడ్డిరాజు భీష్మద్రోణులతోపాటు లేచి నిలచెను.

కృపశ్చ సోమదత్తశ్చ మహారాజశ్చ బాహ్లికః,
ఆసనేభ్యోఽచలన్ సర్వే పూజయన్తో జనార్దనమ్. 14

కృపుడు, సోమదత్తుడు, మహారాజగు బాహ్లికుడు జనార్దనుని గౌరవించుచు ఆసనములనుండి లేచిరి.

తతో రాజాన మాసాద్య ధృతరాష్ట్రం యశస్వినమ్,
స భీష్మం పూజయామాస వార్ష్ణేయో వాగ్భి రఞ్జసా. 15

కీర్తిగల ధృతరాష్ట్రుని సమీపించి శ్రీకృష్ణుడు మంచిమాటలతో భీష్ముని పూజించెను.

తేషు ధర్మానుపూర్వీం తాం ప్రయుజ్య మధుసూదనః,
యథావయః సమీయాయ రాజభిః సహ మాధవః. 16

మిగిలినవారియందును ధర్మమును, వయస్సును బట్టి మధుసూదనుడు మన్నన నెరపి అటుపై తక్కిన రాజులను కలిసికొనెను.

అథ ద్రోణం సబాహ్లీకం సపుత్రం చ యశస్వినమ్,
కృపం చ సోమదత్తం చ సమీయాయ జనార్దనః. 17

పిదప బాహ్లికుని, ప్రసిద్ధిగన్న ద్రోణుని, అతని కొడుకును, కృపుని, సోమదత్తుని జనార్దనుడు దరి జేరి మన్నించెను.

తత్రాసీ దూర్జితం మృష్టం కాఞ్చనం మహదాసనమ్,
శాసనా ద్ధృతరాష్ట్రస్య తత్రోపావిశ దచ్యుతః. 18

అచట గొప్పది, చిత్రపరచినది పెద్దది యగు బంగారుపీట యొకటి యుండెను. ధృతరాష్ట్రుని కోరికపై శ్రీకృష్ణుడు దానిపై కూర్చుండెను.

అథ గాం మధుపర్కం చాప్యుదకం చ జనార్దనే,
ఉపజహ్రు ర్యథాన్యాయం ధృతరాష్ట్రపురోహితాః. 19

ధృతరాష్ట్రుని పురోహితులు శాస్త్రవిధానమును బట్టి శ్రీకృష్ణునకై గోవును, మధుపర్కమును, జలమును అందించిరి.

కృతాతిథ్యస్తు గోవిన్దః సర్వాన్ పరిహసన్ కురూన్,
ఆస్తే సాంబన్ధికం కుర్వన్ కురుభిః పరివారితః. 20

అట్లు అతిథిమర్యాద ముగిసిన పిదప శ్రీకృష్ణుడు అందరిని నవ్వించుచు చుట్టరికమునుబట్టి కౌరవులతో కూడియుండెను.

సోఽర్చితో ధృతరాష్ట్రేణ పూజితశ్చ మహాయశాః,
రాజానం సమనుజ్ఞాప్య నిరక్రామ దరిన్దమః. 21

ధృతరాష్ట్రుడు అతిథిపూజ గావించి స్తుతి చేసిన పిమ్మట రాజుకడ సెలవు దీసికొని ఘనకీర్తియగు శ్రీకృష్ణుడు అచటనుండి బయలుదేరెను.

తైః సమేత్య యథాన్యాయం కురుభిః కురుసంసది,
విదురావసథం రమ్య ముపాతిష్ఠత మాధవః. 22

వారి వారి యోగ్యతను బట్టి కురుసభలో నున్న కౌరవు లందరిని పలుకరించి మనోహరమగు విదురుని గృహము చేరుకొనెను.

విదురః సర్వకల్యాణై రభిగమ్య జనార్దనమ్,
అర్చయామాస దాశార్హం సర్వకామై రుపస్థితమ్. 23

---

18. మృష్టమ్ - శుద్ధి చేయబడినది, దోషములు లేకుండ చేయబడినది.

20. పరిహసన్ - వేళాకోళపు మాటలు పలుకుచు, చమత్కారములు పలుకుచు; సాంబన్ధికమ్ - చుట్టరికమునుబట్టి చేయు వ్యవహారమును.

తన కోరికలన్నియు పండి యింటికి వచ్చిన జనార్దనున కెదురేగి విదురుడు సమస్తమంగళవస్తువులతో కృష్ణునకు పూజచేసెను.

యా మే ప్రీతిః పుష్కరాక్ష త్వద్దర్శనసముద్భవా,
సా కిమాఖ్యాయతే తుభ్య మన్తరాత్మాఽసి దేహినామ్. 24

పుండరీకాక్షా! నిన్ను చూడగా నాకు గలిగిన ప్రీతి యెట్టిదో నేనేమి వర్ణింపగలను? నీవు ప్రాణు లందరకు అంతరాత్మవు గదా!

కృతాతిథ్యం తు గోవిన్దం విదురః సర్వధర్మవిత్,
కుశలం పాణ్డుపుత్రాణా మపృచ్ఛ న్మధుసూదనమ్. 25

సర్వధర్మము లెరిగిన విదురుడు గోవిందునకు అతిథిమర్యాద లన్నియు చక్కగా చేసి పిదప పాండుపుత్రుల కుశలమును గూర్చి యడిగెను.

ప్రీయమాణస్య సుహృదో విదురో బుద్ధిసత్తమః,
ధర్మార్థనిత్యస్య సతో గతరోషస్య ధీమతః, 26

తస్య సర్వం సవిస్తారం పాణ్డవానాం విచేష్టితమ్,
క్షత్తు రాచష్ట దాశార్హః సర్వం ప్రత్యక్షదర్శివాన్. 27

బుద్ధిమంతుడు విదురుడు మంచిహృదయముగల పాండవుల గూర్చి ప్రేమతో అట్లడిగెను. అంత శ్రీకృష్ణుడు ధర్మము, అర్థము విడనాడనివాడు, సత్పురుషుడు, రోషము లేనివాడు బుద్ధిమంతుడు నగు విదురునకు పాండవుల వృత్తాంతమంతయు కన్నులకు కట్టినట్లు వివరించెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
ధృతరాష్ట్రగృహప్రవేశపూర్వకం శ్రీకృష్ణస్య విదురగృహప్రవేశే
ఏకోననవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని భవనము చేరి పిదప విదురుని భవనమున
కరుగుట యను ఎనుబదితొమ్మిదవ అధ్యాయము.

—: o :—

24. అంతరాత్మవు గదా యనుటలో నేను ప్రత్యేకించి చెప్పకున్నను నా మనోభావములు నీకు తెలియును గదా? అని భావము.

# నవతితమోఽధ్యాయః
# తొంబదియవ అధ్యాయము

**శ్రీకృష్ణస్య కున్త్యాః సమీపే గమనమ్. యుధిష్ఠిరస్య కుశలవృత్తాన్త మాపృచ్ఛః స్వీయదుఃఖం స్మృత్వా విలపన్త్యాః కున్త్యాః సమాశ్వాసనం చ. శ్రీకృష్ణుడు కుంతియింటి కరుగుట. ధర్మరాజు కుశలవార్త నడిగి కుంతి తనపాట్లు తలపోసి యేడ్చుచుండగా శ్రీకృష్ణు డామె నోదార్చుట.**

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అథోపగమ్య విదుర మపరాహ్ణే జనార్దనః,
పితృష్వసారం స పృథా మభ్యగచ్ఛ దరిన్దమః. 1

అట్లు విదురునికడ కరిగిన శ్రీకృష్ణుడు మధ్యాహ్నము దాటిన పిమ్మట తన మేనత్తయగు కుంతీదేవిని చూడబోయెను.

సా దృష్ట్వా కృష్ణ మాయాన్తం ప్రసన్నాదిత్యవర్చసమ్,
కంఠే గృహీత్వా ప్రాక్రోశత్ స్మరన్తీ తనయాన్ పృథా. 2

ప్రసన్నముగా నున్న సూర్యునితో సమమగు దేహకాంతి గల శ్రీకృష్ణుడు వచ్చుచుండగా కుంతి కంఠమున కౌగిలించి కొడుకులను తలచి పెద్దగా ఏడ్చెను

తేషాం సత్త్వవతాం మధ్యే గోవిన్దం సహచారిణమ్,
చిరస్య దృష్ట్వా వార్ష్ణేయం బాష్పమాహారయత్ పృథా. 3

ఆ బలసంపన్నుల నడుమ తనకు మిక్కిలి దగ్గరవాడైన గోవిందుని బహుకాలమునకు చూచి కుంతి కంట తడిపెట్టెను.

సాऽబ్రవీత్ కృష్ణమాసీనం కృతాతిథ్యం యుధాం పతిమ్,
బాష్పగద్గదపూర్ణేన ముఖేన పరిశుష్యతా. 4

---

ఆతిథ్యము స్వీకరించి కృష్ణుడు కూర్చున్న పిదప శోకముతో వెగిలిరాని, ఎండిపోవుచున్న మోముతో ఆమె యిట్లు పలికెను.

యే తే బాల్యాత్ ప్రభృత్యేవ గురుశుశ్రూషణే రతాః,
పరస్పరస్య సుహృదః సమ్మతాః సమచేతసః,
నికృత్యా భ్రంశితా రాజ్యా జ్జనార్హా నిర్జనం గతాః. 5

నాయనా! ఆ నా కుమారులు పసితనమునుండియు పెద్దవారిని ప్రీతితో సేవించిరి. ఒకరిమీద నొకరికి చెదని చెలిమి కలదు. అందరకు నిష్టులు. ఒకే బుద్ధి గలవారు. అట్టి వారిని వారు వంచనతో రాజ్యమునుండి వెడలగొట్టిరి. ఎప్పుడు నలుపురిలో నుండవలసిన నా పుత్రులు జనములేని వనము పాలైరి.

వినీతక్రోధహర్షాశ్చ బ్రహ్మణ్యాః సత్యవాదినః,
త్యక్త్వా ప్రియసుఖే పార్థా రుదతీ మపహాయ మామ్, 6
అహార్షుశ్చ వనం యాన్తః సమూలం హృదయం మమ.

కోపమును సంతోషమును అదుపులో పెట్టుకొన్నవారు, బ్రహ్మమును చక్కగా నెరిగినవారు, సత్యము పలుకువారు నగు నా పుత్రులు ప్రియమును సుఖమును వదలి, ఏడ్చుచున్న నన్ను విడనాడి అడవుల కరుగుచు నా హృదయమును మొత్తముగా అపహరించుకొనిపోయిరి.

అతదర్హా మహాత్మానః కథం కేశవ పాణ్డవాః,
ఊషు ర్మహావనే తాత సింహవ్యాఘ్రగజాకులే, 7
బాలా విహీనాః పిత్రా తే మయా సతతలాలితాః. 8

కేశవా! ఆ కష్టము వారికి రావలసినది కాదు. తండ్రి లేని పిల్లలను నేను ఎల్లవేళల లాలించి పెంచితిని. అట్టి దొడ్డబుద్ధిగల పాండవులు - నాయనా! సింహములు, పులులు, ఏనుగులు విచ్చలవిడిగా తిరుగు కారడవిలో ఎట్లు నివసించిరి?

అపశ్యన్తశ్చ పితరౌ కథ మూషు ర్మహావనే.

తల్లిదండ్రులను చూడక వా రడవిలో ఎట్లు నిలువగలిగిరి?

శఙ్ఖదున్దుభినిర్ఘోషై ర్మృదఙ్గై ర్వేణునిఃస్వనైః,
పాణ్డవాః సమబోధ్యన్త బాల్యాత్ప్రభృతి కేశవ. 9

---

6. ప్రియసుఖే - ప్రియ మనగా రాజ్యము మొదలయినది. సుఖ మనగా భోగములవలన కలుగు ఆహ్లాదము.

నాయనా ! కృష్ణా ! పాండుకుమారులు చిన్నతనమునుండియు శంఖములయు. దుందుభులయు, మద్దెలలయు, వేణువులయు నాదములతో నిద్రనుండి మేల్కొనుచుండిరి.

యే స్మ వారణశబ్దేన హయానాం హేషితేన చ,
రథనేమినినాదైశ్చ వ్యబోధ్యన్త తదా గృహే. 10

వారింటనున్న దినములలో ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల హేషితములు, రథచక్రముల నాదములు వినుచు మేల్కాంచెడివారు.

శఙ్ఖభేరీనినాదేన వేణువీణానునాదినా,
పుణ్యాహఘోషమిశ్రేణ పూజ్యమానా ద్విజాతిభిః. 11

శంఖములయు భేరులయు నాదములకు వీణావేణువుల ధ్వనులు శ్రుతి కలుపుచుండగా పుణ్యాహమంత్రములు చదువుచు బ్రాహ్మణులు మన్నించుచుండగా మేల్కొనెడివారు.

వస్త్రై రత్నై రలఙ్కారైః పూజయన్తో ద్విజన్మనః,
గీర్భి ర్మఙ్గలయుక్తాభి ర్బ్రాహ్మణానాం మహాత్మనామ్. 12
అర్చితై రర్చనార్హైశ్చ స్తువద్భి రభినన్దితాః. 13

వస్త్రములతో, రత్నములతో, అలంకారములతో బ్రాహ్మణులను పూజించెడివారు. మహాత్ములగు బ్రాహ్మణులు మంగళముతో కూడిన వేదవాక్కులతో శ్రేష్ఠములగు స్తోత్రములతో వీరిని కొనియాడుచుండెడివారు.

ప్రాసాదాగ్రే ష్వబోధ్యన్త రాఙ్కవాజినశాయినః,
క్రూరం చ నినదం శ్రుత్వా శ్వాపదానాం మహావనే. 14

అట్టివారు గుడుల గోపురములపై జింకచర్మములపై పడియుండి క్రూరమృగముల ఘోరనాదములు వినుచు ఆ కారడవిలో మేల్కొనుచుండిరి.

న స్మోపయాన్తి నిద్రాన్తే న తదర్హా జనార్దన,
భేరీమృదఙ్గనినదైః శఙ్ఖవైణవనిఃస్వనైః. 15

స్త్రీణాం గీతనినాదైశ్చ మధురై ర్మధుసూదన,
వన్దిమాగధసూతైశ్చ స్తువద్భి ర్బోధితాః కథమ్, 16
మహావనే ష్వబోధ్యన్త శ్వాపదానాం రుతేన చ.

భేరీమృదంగనాదములతో శంఖముల వేణువుల ధ్వనులతో చెవి కింపైన స్త్రీల పాటలతో వందిమాగధసూతుల స్తోత్రపాఠములతో మేల్కొనెడివారు. పెద్ద అడవులలో క్రూరమృగముల కఠోరధ్వనులతో ఎట్లు మేల్కొనిరి? వారికీ పాటు రావలసినది కాదు గదా! నిద్ర లేచి వారు నాకడకు రాకున్నారు గదా!

హ్రీమాన్ సత్యధృతి ర్దాన్తో భూతానా మనుకమ్పితా,
కామద్వేషౌ వశే కృత్వా సతాం వర్త్మానువర్తతే. 17

నా పెద్దకొడుకు పాడు పనులకు సిగ్గుపడువాడు, సత్యమున పట్టుదల కలవాడు. ఇంద్రియములపై అదుపు గలవాడు. సర్వప్రాణులయందు జాలి కలవాడు. కామమును ద్వేషమును అదుపున నుంచుకొని సత్పురుషుల బాటలో ఎల్ల వేళల నడచుచున్నాడు.

అమ్బరీషస్య మాన్ధాతు ర్యయాతే ర్నహుషస్య చ,
భరతస్య దిలీపస్య శిబే రౌశీనరస్య చ, 18
రాజర్షీణాం పురాణానాం ధురం ధత్తే దురుద్వహామ్. 19

అంబరీషుడు, మాంధాత, యయాతి, నహుషుడు, భరతుడు, దిలీపుడు, ఉశీనరరాజు శిబి వంటి ప్రాతకాలపు రాజర్షుల భారమును - ఎవ్వరు మోయజాలనిదానిని మోయుచున్నాడు.

శీలవృత్తోపసంపన్నో ధర్మజ్ఞః సత్యసంగరః,
రాజా సర్వగుణోపేత స్త్రైలోక్యస్యాపి యో భవేత్. 20

చక్కని శీలము, నడవడియు నిండుగా గలవాడు. ధర్మతత్త్వ మెరిగినవాడు, సత్యమున నిష్ఠ గలవాడు. మంచి గుణములన్నియు కుదురుకొని మూడు లోకములకు ఏలిక కాదగినవాడు.

---

19. ధురమ్ - భారమును.

అజాతశత్రు ర్ధర్మాత్మా శుద్ధజామ్బూనదప్రభః,
శ్రేష్ఠః కురుషు సర్వేషు ధర్మతః శ్రుతవృత్తతః,
ప్రియదర్శో దీర్ఘభుజః కథం కృష్ణ యుధిష్ఠిరః. 21

అతనికి పగవాడన్న భావనయే ఉండదు. అతని నిలువెల్ల ధర్మమే. నిర్మలమైన బంగారు వన్నెతో వెలిగిపోవుచుండును. ధర్మమును పాండిత్యమును నడవడిని బట్టి చూచినచో కౌరవు లందరిలో శ్రేష్ఠుడు. చూడ ముచ్చట అయిన వాడు. పొడవైన భుజములతో నొప్పువాడు. కృష్ణయ్యా! ఆ యుధిష్ఠిరు డెట్లున్నాడు?

యః స నాగాయుతప్రాణో వాతరంహా మహాబలః,
సామర్షః పాణ్డవో నిత్యం ప్రియో భ్రాతుః ప్రియంకరః. 22

ఆ భీముడు పది వేల యేనుగుల సత్తువ. వాయువు వంటి గొప్ప బలము కలవాడు. ఎల్లప్పుడు కోపముతో చిరచిరలాడుచుండును. అయినను మనసులో మాలిన్యము లేనివాడు. అన్న యన్నచో ప్రేమ. ఆతని ప్రియమే తన ప్రియముగా చేయుచుండును.

కీచకస్య తు సజ్ఞాతే ర్యో హన్తా మధుసూదన,
శూరః క్రోధవశానాం చ హిడిమ్బస్య బకస్య చ. 23

జ్ఞాతు లందరితో పాటు కీచకుని మట్టుపెట్టెను. క్రోధముతో తీవ్రస్వభావము గల హిడింబుని, బకుని రూపుమాపిన శూరుడు.

పరాక్రమే శక్రసమో మాతరిశ్వసమో బలే,
మహేశ్వరసమః క్రోధే భీమః ప్రహరతాం వరః. 24

---

21. ప్రియదర్శః - ప్రియమైన దర్శము - దర్శనము గలవాడు లేదా దర్శమనగా శ్రాద్ధకర్మాదికము - వానియందు ప్రీతి కలవాడనియు చెప్పవచ్చును.
22. పాండవః - పాండువే పాండవుడు - శుద్ధమైనవాడని భావము - కోపము గలవాడయ్యు దోషము లేనివాడని తాత్పర్యము - లేదా పాండుని కొడుకని సామాన్యార్థము.

పరాక్రమమున ఇంద్రునికి, బలమున వాయుదేవునకు, క్రోధమున మహేశ్వరునకు దీటైనవాడు, పోటుగాండ్రలో మిన్న.

క్రోధం బల మమర్షం చ యో నిధాయ పరంతపః,
జితాత్మా పాణ్డవోఽమర్షీ భ్రాతు స్తిష్ఠతి శాసనే. 25

పరులను కాల్చివేయునట్టి కోపిష్ఠుడు భీముడు క్రోధమును, బలమును, అసహనమును ప్రక్కకు బెట్టి మనసు నదుపు చేసికొని అన్నమాటపై నిలబడి యుండెను.

తేజోరాశిం మహాత్మానం వరిష్ఠ మమితౌజసమ్,
భీమం ప్రదర్శనేనాపి భీమసేనం జనార్దన. 26
తం మమాచక్ష్వ వార్ష్ణేయ కథమద్య వృకోదరః,
ఆస్తే పరిఘబాహుః స మధ్యమః పాణ్డవో బలీ. 27

ముద్దకట్టిన తేజము, మహాత్ముడు, అందరికంటె మిన్న. ఇంత అని చెప్పరాని బలము గలవాడు. చూచిన మాత్రముననే భయము పుట్టును. అయ్యా! శ్రీకృష్ణా! ఆ వృకోదరుడు, ఆ పరిఘవంటి భుజము గలవాడు, ఆ బలశాలి, ఆ నా నడిమికొడు కెట్లున్నాడు?

అర్జునే నార్జునో యః స కృష్ణ బాహుసహస్రిణా,
ద్విబాహుః స్పర్ధతే నిత్య మతీతేనాపి కేశవ. 28

వేయిచేతులుగల ఆ కార్తవీర్యార్జునుడు చనిపోయిన పిమ్మటకూడ రెండు చేతులుగల యీ యర్జును డెప్పుడు ఆతనిని మించజూచుచుండును.

క్షిపత్యేకేన వేగేన పఞ్చబాణశతాని యః,
ఇష్వస్త్రే సదృశో రాజ్ఞః కార్తవీర్యస్య పాణ్డవః. 29

ఆ పాండుకుమారుడు ఒకే వేగముతో అయిదువందల బాణములను గుప్పించగలడు. ధనుర్విద్యలో ఆతనికి కార్తవీర్యార్జునుడే సాటి.

తేజసాఽఽదిత్యసదృశో మహర్షిసదృశో దమే,
క్షమయా పృథివీతుల్యో మహేన్ద్రసమవిక్రమః. 30

తేజస్సున సూర్యునకు, నిగ్రహమున మహర్షికి, ఓర్పున భూదేవికి, పరాక్రమమున మహేంద్రునకు అతడు సమానుడు.

ఆధిరాజ్యం మహద్దీప్తం ప్రథితం మధుసూదన,
ఆహృతం యేన వీర్యేణ కురూణాం సర్వరాజసు. 31

లోకములో ప్రసిద్ధి నంది మిక్కిలి వెలుగొందుచున్న మహాసామ్రాజ్యమును కౌరవులకై రాజులందరినుండి యొడిచి తెచ్చినది అతని శక్తియే కదా!

యస్య బాహుబలం సర్వే పాణ్డవాః పర్యుపాసతే,
స సర్వరథినాం శ్రేష్ఠః పాణ్డవః సత్యవిక్రమః. 32

పాండుకుమారు లందరకు అతని భుజబలమే అండ. రథికులలో శ్రేష్ఠ డగు ఆ అర్జునుడు సత్యమైన పరాక్రమము గలవాడు.

యం గత్వాఽభిముఖః సంఖ్యే న జీవన్ కశ్చిదావ్రజేత్,
యో జేతా సర్వభూతానా మజేయో జిష్ణు రచ్యుత. 33

జయము పొందుటయే లక్షణముగా గల ఆ అర్జునుని యుద్ధమున నెదుర్కొని బ్రదికి బయటపడువా డుండడు. వాడు సర్వభూతములకు జయింపరాని వాడు.

యోఽపాశ్రయః పాణ్డవానాం దేవానామివ వాసవః,
స తే భ్రాతా సఖా చైవ కథ మద్య ధనఞ్జయః. 34

దేవతల కింద్రునివలె పాండవుల కాతడు పెద్దదిక్కు. అట్టి నీ ముద్దు మరది ప్రాణమిత్రుడు అగు ధనంజయు డిప్పు డెట్లున్నాడు?

దయావాన్ సర్వభూతేషు హ్రీనిషేవో మహాస్త్రవిత్,
మృదుశ్చ సుకుమారశ్చ ధార్మికశ్చ ప్రియశ్చ మే. 35
సహదేవో మహేష్వాసః శూరః సమితిశోభనః
భ్రాతౄణాం కృష్ణ శుశ్రూషు ర్ధర్మార్థకుశలో యువా. 36

---

34. భ్రాతా - తెలుగునుడికారమునుబట్టి 'మరది' అను నర్థము గ్రహించుట యుక్తము.

కృష్ణయ్యా! ఆ సహదేవుడు, అన్నిప్రాణులయందు దయ గలవాడు. పాడుపనులకు సిగ్గుపడును. గొప్ప అస్త్రవేత్త. మెత్తనివాడు. సుకుమారస్వభావము గలవాడు. ధర్మమును పాటించువాడు. నాకు ప్రియమైనవాడు. గొప్ప విలుకాడు. శూరుడు. యుద్ధమున రాణించును. అన్నలకు సేవలు చేయుచుండును. ధర్మమునందును, అర్థమునందును ఆరితేరినవాడు. యువకుడు.

సదైవ సహదేవస్య భ్రాతరో మధుసూదన,
వృత్తం కళ్యాణవృత్తస్య పూజయన్తి మహాత్మనః. 37

దొడ్డబుద్ధియు, మంగళమగు నడవడియు గల సహదేవుని ప్రవర్తనను కృష్ణా! అన్నలు ఎల్లవేళల కొనియాడుదురు.

జ్యేష్ఠాపచాయినం వీరం సహదేవం యుధాంపతిమ్,
శుశ్రూషుం మమ వార్ష్ణేయ మాద్రీపుత్రం ప్రచక్ష్వ మే. 38

నాయనా! కృష్ణా! అన్నలను మన్నించువాడు, వీరుడు, యుద్ధములందు నాయకుడు, నన్ను సేవింపగోరువాడు నగు మా మాద్రికొడుకును గూర్చి నా కెరిగింపవయ్యా!

సుకుమారో యువా శూరో దర్శనీయశ్చ పాణ్డవః,
భ్రాతౄణాం చైవ సర్వేషాం ప్రియః ప్రాణో బహిశ్చరః. 39
చిత్రయోధీ చ నకులో మహేష్వాసో మహాబలః,
కచ్చిత్స కుశలీ కృష్ణ మమ వత్సో సుఖైధితః. 40

సుకుమారుడు. చిన్నవాడు, శూరుడు, అందగాడు, అన్నదమ్ముల కందరకు వెలుపలి ప్రాణమువలె మిక్కిలి యిష్టుడు, చిత్రయుద్ధములు చేయువాడు, గొప్ప ధనుర్ధరుడు, మహాబలుడు, నేను ముద్దుచేసి పెంచినవాడు అగు నకులుడు కృష్ణా! క్షేమముగా నున్నాడా?

సుఖోచిత మదుఃఖార్హం సుకుమారం మహారథమ్,
అపి జాతు మహాబాహో పశ్యేయం నకులం పునః. 41

సుఖములు కలవాటు పడినవాడు, దుఃఖ మెట్టిదో యెఱుగరానివాడు, సుకుమారుడు, మహారథుడు నగు నకులుని ఎన్నటికైన కాంతునా?

---

38. జ్యేష్ఠ + అపచాయినమ్-అన్నల అభివృద్ధికి పాటుపడువాడని తాత్పర్యము.

పక్ష్మసంపాతజే కాలే నకులేన వినాకృతా,
న లభామి ధృతిం వీర సాఽద్య జీవామి పశ్య మామ్. 42

తెప్పపాటు కాలమైనను నకులుని చూడక నిలువకుండెడిదానను. ఓయి వీరుడా! అట్టి నేను నేడు బ్రదికియే యున్నాను. చూడు.

సర్వైః పుత్రైః ప్రియతరా ద్రౌపదీ మే జనార్దన,
కులీనా రూపసంపన్నా సర్వైః సముదితా గుణైః. 43

జనార్దనా! ఆ ద్రౌపదమ్మ నా కొడుకుల కంటె ప్రియమైనది. మంచి కులమున బుట్టినది. నిండైన రూపసంపద గలది. మంచి గుణములన్నియు ఆమెలో నెలకొనియున్నవి.

పుత్రలోకాత్ పతిలోకం వృణ్వానా సత్యవాదినీ,
ప్రియాన్ పుత్రాన్ పరిత్యజ్య పాణ్డవా ననురుధ్యతే. 44

పుత్రుల సన్నిధికంటె పతుల సన్నిధానమే స్వయముగా కోరి ప్రియులగు పుత్రులను వదలి సత్యవాదిని యగు ఆ యిల్లాలు పాండవుల వెంట నంటినది.

మహాభిజనసంపన్నా సర్వకామైః సుపూజితా,
ఈశ్వరీ సర్వకల్యాణీ ద్రౌపదీ కథమచ్యుత. 45

గొప్పయింట పుట్టినది, కోరిన కోరికలన్నియు తీర్చుకొన్నది, సర్వ శుభములకు నెలవైనది, తనంత తానొక ప్రభువుగా బ్రదికినది. అచ్యుతా! ఆ ద్రౌపది యెట్లున్నది?

పతిభిః పఞ్చభిః శూరై రగ్నికల్పైః ప్రహారిభిః,
ఉపపన్నా మహేష్వాసై ర్ద్రౌపదీ దుఃఖభాగినీ. 46

నిప్పువంటి పోటుగాండ్రైదుగురు పెనువిల్లు పట్టిన పురుషశ్రేష్ఠులు భర్తలై యుండగా ఆ ద్రౌపదికి కాని దుఃఖము వచ్చి పడినది.

---

42. పక్ష్మసంపాతజే - కన్ను మూసి తెరచునంత కాలమునందు;

44. పుత్రలోకాత్ - పుత్రుల సన్నిధికంటెను, పతిలోకమ్ - పతులకడ నుండుటనే; వృణ్వానా - తనంత తాను కోరుచు.

చతుర్దశ మిదం వర్షం యన్నాపశ్య మరిన్దమ,
పుత్రాదిభిః పరిద్యూనాం ద్రౌపదీం సత్యవాదినీమ్. 47

నా కొడుకులతో పాటు పడరాని పాట్లు పడి నలిగిపోయిన సత్యవాదిని యగు ద్రౌపదిని ఈ పదునాలుగవయేట కూడ చూడకున్నాను.

న నూనం కర్మభిః పుణ్యై రశ్నుతే పురుషః సుఖమ్,
ద్రౌపదీ చేత్తథావృత్తా నాశ్నుతే సుఖ మవ్యయమ్. 48

అటువంటి మంచి ప్రవర్తన గల ద్రౌపది తరుగుపోని సుఖ మనుభవింపలేదనగా మానవుడు కేవలము పుణ్యకర్మములతో సుఖము పొందడు. ఇది నిక్కము.

న ప్రియో మమ కృష్ణాయా బీభత్సు ర్న యుధిష్ఠిరః,
భీమసేనో యమౌ వాఽపి యదపశ్యం సభాగతామ్. 49

సభలో అన్ని పాట్లుపడిన ద్రౌపదిని చూచిన నాకు గాని, ఆమెకు గాని ఆ బీభత్సుడు, ఆ యుధిష్ఠిరుడు, ఆ భీమసేనుడు, ఆ కవలలు ప్రియులు గారు.

న మే దుఃఖతరం కిఞ్చి ద్భూతపూర్వం తతోఽధికమ్,
స్త్రీధర్మిణీం ద్రౌపదీం యచ్ఛ్వశురాణాం సమీపగామ్. 50

ఆనాయితా మనార్యేణ క్రోధలోభానువర్తినా,
సర్వే ప్రైక్షన్త కురవ ఏకవస్త్రాం సభాగతామ్. 51

క్రోధము, లోభము త్రిప్పినట్లు తిరుగు క్షుద్రుడొకడు స్త్రీధర్మము గట్టిగా పాటించు ఆ ద్రౌపదిని మామలవద్దకు గుంజుకొని వచ్చెను. ఒంటిబట్టతో సభకు వచ్చిన ఆమెను కౌరవు లందరు గ్రుడ్లప్పగించి చూచిరి. ఇంత పెను దుఃఖము, దీనికంటె మించినది గాని నాకు మునుపెన్నడు దాపురింపలేదు.

---

47. పరిద్యూనామ్ - మిక్కిలి నలిగినదానిని;

49. నాకును, ద్రౌపదికిని ప్రియమైన కార్యమును - ఆ దుష్టులను శిక్షించుట అనుదానిని - ధర్మరాజాదులు చేయక నాకు అప్రియము గావించిరని తాత్పర్యము.

తత్రైవ ధృతరాష్ట్రశ్చ మహారాజశ్చ బాహ్లికః,
కృపశ్చ సోమదత్తశ్చ నిర్విణ్ణాః కురవ స్తదా. 52

ధృతరాష్ట్రుడు, మహారాజగు బాహ్లికుడు, కృపుడు, సోమదత్తుడు, తక్కిన కౌరవులును ఆ సభయందే చేష్టలుడిగి యుండిరి.

తస్యాం సంసది సర్వేషాం క్షత్తారం పూజయా మ్యహమ్,
వృత్తేన హి భవత్యార్యో న ధనేన న విద్యయా. 53

ఆసభలో అందరిలో ఆ విదురు నొక్కని గౌరవింతును. ధన మే... చదు వే... నడవడితో అతడు పూజ్యు డగుచున్నాడు.

తస్య కృష్ణ మహాబుద్ధే ర్గమ్భీరస్య మహాత్మనః,
క్షత్తుః శీల మలఙ్కారో లోకాన్విష్టభ్య తిష్ఠతి. 54

దొడ్డబుద్ధి గలవాడు, గంభీరుడు, మహాత్ముడు నగు ఆ విదురుని శీలము అలంకారమై లోకముల నన్నింటిని ఆవరించి నిలిచినది.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

సా శోకార్తా చ హృష్టా చ దృష్ట్వా గోవిన్ద మాగతమ్,
నానావిధాని దుఃఖాని సర్వాణ్యేవా న్వకీర్తయత్. 55

తనకడకు వచ్చిన కృష్ణుని చూచి పరమానందమును, కొడుకుం పాట్లు తలచి పరమదుఃఖమును బొందిన ఆ కుంతి పెక్కువిధములుగ పాత దుఃఖము లన్నింటిని చెప్పుకొన దొడగెను.

పూర్వైరాచరితం యత్త త్కురాజభి రరిన్దమ,
అక్షద్యూతం మృగవధః కచ్చిదేషాం సుఖావహమ్. 56

శత్రుమర్దనా! మునుపటి నీచులగు రాజులు ఆడిన జూదము, వేట యును నవి. అయ్యో! వీరికి సుఖము కూర్చున వయ్యెనా?

---

56. కచ్చిత్ - అను కాకువుచేత అది యేమి సుఖము అను అర్థము వ్యక్త మగును.

తన్మాం దహతి యత్కృష్ణా సభాయాం కురుసంనిధౌ,
ధార్తరాష్ట్రైః పరిక్లిష్టా యథా న కుశలం తథా. 57

కృష్ణా! నిండుసభలో కౌరవులందరు ఉన్నచోట, ఆ ధృతరాష్ట్రుని కొడుకులచేత ద్రౌపది అమంగళకరముగ అవమానింప బడినది. అది చిచ్చై నా హృదయమును దహించివేయుచున్నది.

నిర్వాసనం చ నగరాత్ ప్రవ్రజ్యా చ పరంతప,
నానావిధానాం దుఃఖానా మభిజ్ఞాస్మి జనార్దన. 58

ఊరినుండి వెడలఁగొట్టిరి. అడవులకు ద్రోలిరి. ఇట్టి నానావిధములగు దుఃఖములను ఎరిగినదాననయ్యా! జనార్దనా!

అజ్ఞాతచర్యా బాలానా మవరోధశ్చ మాధవ,
న మే క్లేశతమం తత్ స్యాత్ పుత్రైః సహ పరంతప. 59

పసివారు అజ్ఞాతవాసము చేయవలసి వచ్చినది. రాజ్యము లేకుండబోయినది. నాకు నా కొడుకులకు అదికాదు పెద్ద దుఃఖము!

దుర్యోధనేన నికృతా వర్ష మద్య చతుర్దశమ్,
దుఃఖాదపి సుఖం నః స్యా ద్యది పుణ్యఫలక్షయః. 60

మరేమనగా, ఇన్నినాళ్ళు దుర్యోధనునిచేత పడరాని పాట్లు పడితిని. ఇప్పుడిది పదునాలుగవ యేడు. మా పాపములు నశించి యిటుపై సుఖము గలుగవలయును. ఏలయన పుణ్యఫలము లేకయే గదా మేము దుఃఖ మనుభవించినది!

న మే విశేషో జాత్వాసీత్ ధార్తరాష్ట్రేషు పాణ్డవైః,
తేన సత్యేన కృష్ణ త్వాం హతామిత్రం శ్రియావృతమ్,
అస్మాద్విముక్తం సఙ్గ్రామాత్ పశ్యేయం పాణ్డవైః సహ. 61

57. న కుశలమ్ - అమంగళము.

59. అవరోధః-రాజ్య మీకుండుటవలన నేర్పడిన బ్రదుకుతెరువులేని స్థితి.

60. దుఃఖాత్ - పాపఫలము నశించుటవలన, నః - మాకు; సుఖం స్యాత్ - సుఖము కలుగవలయును. ఏలయన, పుణ్యఫలక్షయః - పుణ్యఫలము నశింపగా - దుఃఖము ఏర్పడినది కనుక.

61. అస్మాత్ సంగ్రామాత్ - రాబోవు యుద్ధమువలన - కులమున పుట్టిన ఈ కయ్యములో భేదబుద్ధికలవారికి వినాశము, సమబుద్ధిగలవారికి సుఖము కలుగుగాక అని భావము.

కృష్ణా! నేనెన్నడును ధృతరాష్ట్రుని కొడుకులను పాండుకుమారులకంటె వేరుగా చూడలేదు. ఆ సత్యమువలన శత్రువులను పరిమార్చి, సంపదతో గూడి రాబోవు యుద్ధమునుండి బయటపడు నిన్ను పాండవులతోపాటు నేను చూడవలయును.

నైవ శక్యాః పరాజేతుం సర్వం హ్యేషాం తథావిధమ్. 62

పాండవుల ఆవిధమైన సమవర్తనమును బట్టి వారిని ఓడించుట కెవ్వరికిని సాధ్యము కాదు.

పితరం త్వేవ గర్హేయం నాత్మానం న సుయోధనమ్,
యేనాహం కున్తిభోజాయ ధనం వృత్తై రివార్పితా. 63

కృష్ణా! ఇంతకు, నన్ను కాదు, దుర్యోధనుని కాదు, ఆ మా నాయన ననవలయును. దాతలుగా పేరొందినవారు ధన మిచ్చినట్లు నన్ను చెలిమిగం మహాత్ముడగు కుంతిభోజున కిచ్చివేసెను.

బాలాం మా మార్యక స్తుభ్యం క్రీడన్తీం కన్దుహస్తికామ్,
అదాత్తు కున్తిభోజాయ సఖా సఖ్యే మహాత్మనే. 64

మీ తాత ఆర్యకుడు బంతి చేతబట్టి ఆడుకొనుకున్న చిన్నదానను నన్ను చెలిమిగల మహాత్ముడగు కుంతిభోజున కిచ్చివేసెను.

సాహం పిత్రా చ నికృతా శ్వశురైశ్చ పరన్తప,
అత్యన్తదుఃఖితా కృష్ణ కిం జీవితఫలం మమ. 65

అట్లు నేను తండ్రికిని మామలకును కానిదాననై పడరాని పాట్లు పడితిని. ఇంత పెనుదుఃఖములు పొందిన నేను కృష్ణా! బ్రదుకువలన పొందిన ఫలమేమి?

---

62. ఏషామ్ - ఈ పాండవుల, తథావిధమ్ - భేదభావము లేని; సర్వమ్ - సమస్తమగు ప్రవర్తనను.

63. వృత్తైః - దాతలుగా పేరొందినవారిచేత 'వృత్తోఽతీతే దృఢే ఖ్యాతే' అని విశ్వనిఘంటువు. తుభ్యం - నీ; ఆర్యకః - తాత.

65. శ్వశురైః - భీష్ముడు మొదలగువారిచేత; భర్తకు అన్న కనుక ధృతరాష్ట్రుడును మామగా పరిగణింపదగినవాడు.

యన్మాం వాగ బ్రవీ న్నక్తం సూతకే సవ్యసాచినః,
పుత్రస్తే పృథివీం జేతా యశశ్చాస్య దివం స్పృశేత్. 66
హత్వా కురూన్ మహాజన్యే రాజ్యం ప్రాప్య ధనఞ్జయః,
భ్రాతృభిః సహ కౌన్తేయ స్త్రీన్ మేధా నాహరిష్యతి. 67

ఈ అర్జునుడు పుట్టిన పురిటిదినమున ఆకాశవాణి నాకిట్లు చెప్పినది. ఈ నీ కొడుకు భూమి నంతటిని జయించును. వీని కీర్తి స్వర్గము ముట్టును. మహాయుద్ధమున వీడు కౌరవుల నందరిని చంపి రాజ్యము పొంది అన్నదమ్ములతోపాటు మూడు అశ్వమేధములను సాధించును.

నాహం త్వా మభ్యసూయామి నమో ధర్మాయ వేధసే,
కృష్ణాయ మహతే నిత్యం ధర్మో ధారయతి ప్రజాః. 68

కృష్ణయ్యా! ఆ మాటను నేను తప్పు పట్టను. అన్నింటికి కర్తవు, ధర్మస్వరూపుడవు, గొప్పవాడవు నగు నీకు నిత్యము మ్రొక్కుదును. ధర్మమేగదా ప్రజలను పట్టి నిలుపునది!

ధర్మ శ్చేదస్తి వార్ష్ణేయ యథా వాగభ్యభాషత,
త్వం చాపి తత్తథా కృష్ణ సర్వం సంపాదయిష్యసి. 69

కృష్ణా! ధర్మ మనునది యున్నయెడల, ఆ గగనవాక్కు పలికిన రీతిని, నీ వది యంతయు సమకూర్పగలవు.

---

67. మహాజన్యే - ఘోరయుద్ధమున, మేధాన్ - అశ్వమేధములను.

68. న అభ్యసూయామి - నిందింపను; వేధసే - విశ్వమును సృజించిన వానికి; మహతే - మహాపురుషునకు - ఈ మాటలతో కృష్ణుని దెప్పి పొడుచుచున్నది; ధర్మో ధారయతి ప్రజాః - ధర్మమే ప్రజలను పట్టి నిలుపును. ధర్మమే అన్నింటికంటె ప్రబలము. ధర్మపదము అర్థము దానినే సూచించుచున్నది అను భావముతో ఈ వాక్యమును పలికినది. ధర్మమే చేయునది, చేయించునది. ఈశ్వరారాధనము వ్యర్థము - అని దుఃఖభారముతో విలపించుచున్న కుంతి హృదయభావన.

69 ధర్మముకూడ సంశయమునకు తావొసగినపుడు ఈశ్వరుడే సర్వము నిర్వహింపవలయునని భావము.

న మాం మాధవ వైధవ్యం నార్థనాశో న వైరతా,
తథా శోకాయ దహతి యథా పుత్రై ర్వినాభవః. 70

మాధవా! ఈ విధవతనముగాని, ఈ లేమిగాని, ఈ పగగాని కొడుకులకు దూరమగుట నన్ను దుఃఖపెట్టి కాల్చినట్లు కాల్చుట లేదు.

యాఽహం గాణ్డీవధన్వానం సర్వశస్త్రభృతాం వరమ్,
ధనఞ్జయం న పశ్యామి కా శాన్తి ర్హృదయస్య మే. 71

గాండీవము చేపట్టినవాడు, ఆయుధము ధరించినవా రందరిలో శ్రేష్ఠుడు అగు అర్జునుడు నాకు కానరాడు. నా ఎదకు శాంతి ఎక్కడిది ?

ఇతశ్చతుర్దశం వర్షం యన్నాపశ్యం యుధిష్ఠిరమ్,
ధనఞ్జయం చ గోవిన్ద యమౌ తం చ వృకోదరమ్. 72

గోవిందా ! ఆ ధర్మయ్యను, ఆ ధనంజయుని, ఆ కవలలను, తోడేలు పొట్టవంటి పొట్టగల ఆ భీమయ్యను చూచి యిప్పటికిది పదునాలుగవ యేడు.

జీవనాశం ప్రనష్టానాం శ్రాద్ధం కుర్వన్తి మానవాః,
అర్థత స్తే మమ మృతా స్తేషాం చాహం జనార్దన. 73

ప్రాణములు పోయి నశించినవారికి మనుష్యులు శ్రాద్ధము పెట్టుదురు. నిజమునకు నావారు నేను వారికి చచ్చినవారమే అయితిమి.

బ్రూయా మాధవ రాజానం ధర్మాత్మానం యుధిష్ఠిరమ్,
భూయాంస్తే హీయతే ధర్మో మా పుత్రక వృథా కృథాః. 74

మాధవా! ధర్మము ధర్మమనిపట్టి ప్రేలుచున్న ఆ ధర్మరాజుతో చెప్పుము. నాయనా! కుమారా! నీ ధర్మము పెద్దపెట్టున జారిపోయినది. వ్యర్థముగా దానిని పట్టి ప్రేలకుము.

పరాశ్రయా వాసుదేవ యా జీవతి ధిగస్తు తామ్,
వృత్తేః కార్పణ్యలబ్ధాయా అప్రతిష్ఠైవ జ్యాయసీ. 75

వాసుదేవా! పరులపై ఆధారపడి బ్రదుకుదాని బ్రతుకేల? దీనముగా వచ్చు బ్రదుకుతెరువుకంటె చచ్చుటయే మేలు.

అథో ధనఞ్జయం బ్రూయా నిత్యోద్యుక్తం వృకోదరమ్,
యదర్థం క్షత్రియా సూతే తస్య కాలోఽయమాగతః. 76

ఆ అర్జునునకు, ఎల్లవేళల ఎగిరిపడుచుండు భీమునకును క్షత్రియకాంత దేనికై కొడుకులను కనునో దానికి తగిన కాలము వచ్చినదని చెప్పుము.

అస్మింశ్చే దాగతే కాలే మిథ్యా చాతిక్రమిష్యతి,
లోకసంభావితాః సన్తః సునృశంసం కరిష్యథ. 77

అట్లు వచ్చిన సమయమును వృథగా జారవిడిచితిరేని లోకమెల్ల కొనియాడు సజ్జనులగు మీరు మిక్కిలి ఏవగొలుపు పని చేసినవా రగుదురు.

నృశంసేన చ వో యుక్తాం స్త్యజేయం శాశ్వతీః సమాః,
కాలే హి సమనుప్రాప్తే త్యక్తవ్య మపి జీవనమ్. 78

అట్లు నీచపు బ్రదుకు బ్రదుకు మిమ్ములను బ్రదుకు తుదిదాక వదలివేయవలసి వచ్చును. కాలము మూడినపుడు జీవనమునైన వదలివేయవలయును గదా!

మాద్రీపుత్రౌ చ వక్తవ్యౌ క్షత్రధర్మరతౌ సదా,
విక్రమే ణార్జితాన్ భోగాన్ వృణీతం జీవితాదపి. 79

నకులసహదేవులతో 'ఎల్లవేళల క్షత్రియధర్మమునందు మక్కువతో బ్రదుకుడు, పరాక్రమముతో సాధించిన సుఖమునే ప్రాణములు పోయినను కోరుకొనుడు' అని చెప్పుము.

విక్రమాధిగతా హ్యర్థాః క్షత్రధర్మేణ జీవతః,
మనో మనుష్యస్య సదా ప్రీణన్తి పురుషోత్తమ. 80

పురుషోత్తమా! క్షత్రియధర్మముతో బ్రదుకు నరుని హృదయమునకు పౌరుషముతో సాధించిన అర్థములే ఆనందము చేకూర్చును.

గత్వా బ్రూహి మహాబాహో సర్వశస్త్రభృతాం వరమ్,
అర్జునం పాణ్డవం వీరం ద్రౌపద్యాః పదవీం చర. 81

---

75 అతిక్రమిష్యతి - యుద్ధము లేకయే దాటి పోయినదైన.
76. సునృశంసమ్ - మిక్కిలి అసహ్యము గొలుపుపని.

ఓయి మహాబాహూ! అట కేగి ఆయుధధారులలో అగ్రేసరుడు, పాండుని కొడుకు, వీరుడు అగు అర్జునునితో ద్రౌపదిమార్గమున నడచుకొమ్మని చెప్పు.

విదితౌ హి తవాత్యన్తం క్రుద్ధౌ తౌ తు యథాన్తకౌ,
భీమార్జునౌ నయేతాం హి దేవానపి పరాం గతిమ్. 82
తయోశ్చైత దవజ్ఞానం యత్సా కృష్ణా సభాం గతా. 83

కృష్ణా! నీవు బాగుగానే ఎరుగుదువు. ఆ భీమార్జునులు క్రోధము పూనినచో యములవలె దేవతలనైనను రూపుమాపుదురు. అట్టివారికి ద్రౌపది నలుగురి ముందు నిలువవలసి వచ్చుట అవమానకరమైనది.

దుశ్శాసనశ్చ కర్ణశ్చ పరుషాణ్యభ్యభాషతామ్,
దుర్యోధనో భీమసేన మభ్యగచ్ఛ న్మనస్వినమ్. 84
పశ్యతాం కురుముఖ్యానాం తస్య ద్రక్ష్యతి యత్ఫలమ్.

దుశ్శాసనుడును, కర్ణుడును కాకులు కూసిరి. దుర్యోధనుడు కురువంశమున పెద్దవారందరు చూచుచుండగా అభిమానముగల భీమసేనుని పైకి లేచెను. ఆ దానికి ఫలము నాతడు తప్పక అనుభవించును.

న హి వైరం సమాసాద్య ప్రశామ్యతి వృకోదరః,
సుచిరాదపి భీమస్య నహి వైరం ప్రశామ్యతి,
యావద న్తం న నయతి శాత్రవాన్ శత్రుకర్శనః. 85

పగబట్టి భీముడు అణగియుండడు. ఎంతకాలము గడచినను భీముని పగ శత్రువులను సర్వనాశనము చేయక అణగిపోదు.

యత్తు సా బృహతీ శ్యామా ఏకవస్త్రా సభాం గతా,
అశృణోత్ పరుషా వాచః కిం ను దుఃఖతరం తతః. 86

రాజ్యము కొల్లగొట్టుట, జూదమున ఓడించుట, కొడుకులను దేశము నుండి వెడలగొట్టుట-ఇవి కావు నా ఏడుపునకు హేతువులు. మరియేమన ఆ దొడ్డ యిల్లాలు ఒంటి బట్టతో సభలోనికి వచ్చి కారుకూతలు వినెను. ఇంతకంటె మిక్కిలి దుఃఖ మేముండును?

స్త్రీధర్మిణీ వరారోహా క్షత్రధర్మరతా సదా,
నాభ్యగచ్ఛత్ తదా నాథం కృష్ణా నాథవతీ సతీ. 87

ఆ కృష్ణ స్త్రీధర్మమును చక్కగా పాటించునది. చక్కని రూపసంపద గలది. క్షత్రియధర్మమునందు మక్కువగలది. మగలుండియు ఆనాడు దిక్కు లేనిదైనది.

యస్యా మమ సపుత్రాయా స్త్వం నాథో మధుసూదన,
రామశ్చ బలినాం శ్రేష్ఠః ప్రద్యుమ్నశ్చ మహారథః. 88
సాహ మేవంవిధం దుఃఖం సహేయం పురుషోత్తమ,
భీమే జీవతి దుర్ధర్షే విజయే చాపలాయిని. 89

మధుసూదనా! నాకు నా కొడుకులకు, నీవు, బలవంతులలో శ్రేష్ఠుడు బలరాముడు, మహారథుడగు ప్రద్యుమ్నుడు దిక్కైయుండగా, ఎవ్వరికిని లొంగని భీముడు, యుద్ధమున వెన్ను చూపని అర్జునుడు బ్రదికియుండగా ఇట్టి దుఃఖము పొందవలసి వచ్చినది!

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.
తత ఆశ్వాసయామాస పుత్రాధిభి రభిప్లుతామ్,
పితృష్వసారం శోచన్తీం శౌరిః పార్థసఖః పృథామ్. 90

అట్లు కొడుకుల మనోబాధలతో మునిగిపోయి ఏడ్చుచున్న కుంతిని- తన మేనత్తను - పార్థులకు ప్రాణమిత్రమైన కృష్ణుడు ఓదార్చెను.

వాసుదేవ ఉవాచ-వాసుదేవు డిట్లు పలికెను.
కా తు సీమన్తినీ త్వాదృక్ లోకేష్వ స్తి పితృష్వసః,
శూరస్య రాజ్ఞో దుహితా ఆజమీఢకులం గతా. 91

అత్తా! శూరరాజు బిడ్డవు ఆజమీఢకులము మెట్టినదానవు. నీవంటి దొడ్డ యిల్లాలు లోకములందు గలదా?

మహాకులీనా భవతీ హ్రదా ద్ధ్రద మివాగతా,
ఈశ్వరీ సర్వకల్యాణీ భర్త్రా పరమపూజితా. 92

---

89. అపలాయిని - పారిపోనివాడు కాగా.
90. పితృష్వసారమ్ - తండ్రిసోదరిని, మేనత్తను.

గొప్పవంశమున పుట్టిన పుణ్యురాలవు. పెద్ద సరస్సునుండి మరియొక సరస్సునకు వచ్చినట్లు మరియొక గొప్పవంశమును జేరితివి. సర్వశుభములకు నెలవైనదానవు. రాణివి. భర్త మన్ననలు పుష్కలముగా పొందినదానవు.

వీరసూ ర్వీరపత్నీ త్వం సర్వై స్సముదితా గుణైః,
సుఖదుఃఖే మహాప్రాజ్ఞే త్వాదృశీ సోఢుమర్హతి. 93

వీరులను కన్నతల్లివి. వీరుడైన పతిని పొందితివి. సద్గుణము లన్నింటితో అలరారుచున్నదానవు. పండిన తెలివి గలదానా! నీవంటి యిల్లాలు సుఖదుఃఖము లను సహింపవలయును.

నిద్రాతన్ద్రీ క్రోధహర్షౌ క్షుత్పిపాసే హిమాతపౌ,
ఏతాని పార్థా నిర్జిత్య నిత్యం వీరసుఖే రతాః. 94

నిద్దుర, అలసట, క్రోధము, హర్షము, ఆకలి దప్పులు,చలియెండలు-అను వీనిని చెప్పుచేతలలో పెట్టుకొన్న నీకొడుకులు వీరులు పొందు సుఖమునందు ప్రీతిగలవారై యున్నారు.

త్యక్తగ్రామ్యసుఖాః పార్థా నిత్యం వీరసుఖే రతాః,
న తు స్వల్పేన తుష్యేయు ర్మహోత్సాహా మహాబలాః. 95

నీ కొడుకులు వీరుల సుఖమందు పరమాదరము గలవారు కనుక నీచ సుఖములను త్రోచివైచిరి. అల్పసుఖములతో తృప్తిపడు లేకివారు కాదు. గొప్ప ఉత్సాహము, గొప్పబలము గలవారు.

అన్తం ధీరా నిషేవన్తే మధ్యం గ్రామ్యసుఖప్రియాః,
ఉత్తమాం శ్చ పరిక్లేశాన్ భోగాం శ్చాతీవ మానుషాన్. 96

ఉత్తమబుద్ధిగలవారు తుదిఫలమునకై పాటుపడుదురు. అల్పసుఖము వలచువారు మధ్యవిధపు ఫలమునకై కృషిచేయుదురు ధీరులు హెచ్చుస్థాయి కష్టములను, మనుష్యుల కందని భోగములను పొందుదురు.

---

96. అన్తమ్ - రాజ్యమో, వనమో అయినది, మధ్యమ్ - అంతంతమాత్రమైన సంపద, రెండవపాదమున 'అంత' పదమును వ్యాఖ్యానించుచున్నారు. ఉత్తమాన్ - తీవ్రవైరాగ్యమువలన పుట్టిన పరమకష్టములను - అట్టి కష్టములు అనుభవించినవారు సాధారణమనుష్యుల కందని మహాభోగ ములు పొందుదు రని తాత్పర్యము.

అన్తేషు రేమిరే ధీరా న తే మధ్యేషు రేమిరే,
అన్తప్రాప్తిం సుఖామాహు ర్దుఃఖ మన్తర మేతయోః. 97

ధీరులు తుదిఫలములలో ఆసక్తి చూపుదురు. వారు నడిమిఫలములలో ఆసక్తి చూపరు. తుదిఫలము సుఖమే నిజమగు సుఖమందురు. ఈరెంటికి నడిమిది దుఃఖము.

అభివాదయన్తి భవతీం పాణ్డవాః సహ కృష్ణయా,
ఆత్మానం చ కుశలినం నివేద్యాహు రనామయమ్. 98

పాండు కుమారులు కృష్ణతోపాటు నీకు తమ క్షేమవార్త తెలిపి, నీ క్షేమ మడుగుచు మ్రొక్కులు చెల్లించుచున్నారు.

అరోగాన్ సర్వసిద్ధార్థాన్ క్షిప్రం ద్రక్ష్యసి పాణ్డవాన్,
ఈశ్వరాన్ సర్వలోకస్య హతామిత్రాన్ శ్రియా వృతాన్. 99

ఏ వ్యాధియు లేక, సర్వప్రయోజనములను నెరవేర్చుకొని, శత్రువులను పరిమార్చి, సంపదలు పొంది, లోకమున కంతటికి ప్రభువులైన పాండుకుమారులను త్వరలో చూతువు.

ఏవ మాశ్వాసితా కున్తీ ప్రత్యువాచ జనార్దనమ్,
పుత్రాధిభి రభిధ్వస్తా నిగృహ్యాబుద్ధిజం తమః. 100

జనార్దను డిట్లు ఓదార్పగా, పుత్రదుఃఖములతో మిక్కిలి క్రుంగిపోయిన కుంతి అజ్ఞానమువలన కలిగిన చీకటిని నిలువద్రొక్కి యిట్లు పలికెను,

97. అన్తేషు - చివరివగు బ్రహ్మానందము, లేక గాఢనిద్ర అనువానియందు. ఈ రెంటియందే ద్వైతభావము కానరాదు కాన అచ్చమగు సుఖము అనుభవమునకు వచ్చును. మధ్యేషు - ఈరెంటికి నడిమివగు మెలకువ, కల అను దశలందు; ఇవి దుఃఖమయములు - స్వయముగా ఆత్మ దుఃఖము లేనిదే అయ్యు మెలకువ, కల అను ఆధారముల సంబంధము చేత అందు దుఃఖము గోచరించును. అట్టిదుఃఖము వచ్చుచు పోవుచు నుండును గాన నీ కొడుకులు దానిని సహించుచున్నారు. నీవును ఓర్వ వలయునని భావము.

100. అబుద్ధిజమ్ - జ్ఞానము లేకపోవుటవలన పుట్టిన; తమః - చీకటి - విపరీత జ్ఞానము - ఆత్మము కాని దేహము మొదలగు దానియందు ఆత్మ యనుకొనుట.

కున్త్యువాచ - కుంతి ఇట్లు పలికెను.

యద్యత్తేషాం మహాబాహో పథ్యం స్యా న్మధుసూదన,
యథా యథా త్వం మన్యేథాః కుర్యాః కృష్ణ తథా తథా. 101

నాయనా! కృష్ణా! మహాబాహూ! ఆ పాండవులకేదేది మేలని నీకు తోచునో అది అది చేయుము.

అవిలోపేన ధర్మస్య అనికృత్యా పరంతప,
ప్రభావజ్ఞాఽస్మి తే కృష్ణ సత్యస్యాభిజనస్య చ. 102

ధర్మము చెడని కారణమునను, కపటము లేని కారణముచేతను సత్యము, కులము అనువానియొక్కయు నీయొక్కయు ప్రభావము నే నెరుగుదును.

అవస్థాయాం చ మిత్రేషు బుద్ధివిక్రమయో స్తథా,
త్వమేవ నః కులే ధర్మ స్త్వం సత్యం త్వం తపో మహత్. 103

ఈ దశయందును, నీ మిత్రులగు పాండవుల బుద్ధివిక్రమముల విషయమునను మా కులమున నీవే ధర్మము. నీవే సత్యము. నీవే గొప్ప తపస్సు.

త్వం త్రాతా త్వం మహద్బ్రహ్మ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్,
యథైవాత్థ తథైవైత త్త్వయి సత్యం భవిష్యతి. 104

నీవే రక్షకుడవు. నీవు మహాబ్రహ్మమువు. నీయందే యంతయు నిలిచి యున్నది. నీవు పలికిన దెల్ల నీ యందు సత్యమగును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తామామన్త్ర్య చ గోవిన్దః కృత్వా చాభిప్రదక్షిణమ్,
ప్రాతిష్ఠత మహాబాహు ర్దుర్యోధనగృహాన్ ప్రతి. 105

కృష్ణు డామె కడ సెలవు గైకొని ప్రదక్షిణము చేసి దుర్యోధనుని భవనమునకు బయలుదేరెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కృష్ణకున్తీసంవాదే నవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణకుంతీసంవాదము గల తొంబదవ అధ్యాయము.

—:o:—

102. అనికృత్యా - నెపము లేని;

103 త్వమేవ - 'నీవే' అని భగవంతుడే సర్వాత్మ, సర్వమునను నెంపు అను లక్షణమును వ్యక్తము చేయుచున్నది.

## ఏకనవతితమోఽధ్యాయః
## తొంబదియొకటవ అధ్యాయము

శ్రీకృష్ణస్య దుర్యోధనగృహే గమనం, తదీయం నిమన్త్రిణ
మనఙ్గీకృత్య తస్య విదురగృహే భోజనగ్రహణమ్.

శ్రీకృష్ణుడు దుర్యోధనుని గృహమున కరుగుట. అతని యింట
భోజనము చేయనొల్లక విదురునియింట భోజనము చేయుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు పలికెను.

పృథా మామన్త్ర్య గోవిన్దః కృత్వా చాభిప్రదక్షిణమ్,
దుర్యోధనగృహం శౌరి రభ్యగచ్ఛ దరిన్దమః. 1

కుంతిని వీడ్కొని, యామెకు ప్రదక్షిణము చేసి గోవిందుడు దుర్యోధనుని యింటి కరిగెను.

లక్ష్మ్యా పరమయా యుక్తం పురన్దరగృహోపమమ్,
విచిత్రై రాసనై ర్యుక్తం ప్రవివేశ జనార్దనః. 2

గొప్ప సంపదకు నెలవై దేవేంద్రుని భవనమువలె నున్నదియు, విచిత్రము లగు ఆసనములు గలదియు నగు ఆ భవనమును శ్రీకృష్ణుడు ప్రవేశించెను.

తస్య కక్ష్యా వ్యతిక్రమ్య తిస్రో ద్వాఃస్థై రవారితః,
తతోఽభ్రఘనసంకాశం గిరికూట మివోచ్ఛ్రితమ్. 3
శ్రియా జ్వలన్తం ప్రాసాద మారురోహ మహాయశాః,

---

1. వెనుకటి అధ్యాయము చివరి శ్లోకమున బయలుదేరుటను మాత్రము చెప్పి ఈ శ్లోకమున దుర్యోధను నింటికి వచ్చుటను చెప్పుటవలన పునరుక్తిలేదు.
3. అభ్రఘనః - నీటితో కూడిన మేఘము. అదియే గదా మెరపులతో గూడియుండును. అప్పుడు దాని పోలికతో ఇంద్రనీలమణులు, బంగారముల కలయిక తోచును ఇతరులు 'అభ్రఘన' మనగా ఆకాశమునందున్న మేఘము అని అర్థము చెప్పి శరత్కాల సంబంధమువలన ఆ పోలికతో ఆ భవనము తెల్లగా నున్నదని వ్యాఖ్యానించిరి.

ద్వారపాలకుల అడ్డగింపులు లేక శ్రీకృష్ణుడు మూడు రోగిళ్ళుదాటి నీరున్న మేఘమువలెను, ఎత్తైన కొండకొమ్మువలెను ఉండి సంపదతో వెలిగిపోవుచున్న ఆ ప్రాసాదమును ఎక్కెను.

తత్ర రాజసహస్రైశ్చ కురుభిశ్చాభిసంవృతమ్,
ధార్తరాష్ట్రం మహాబాహుం దదర్శాసీన మాసనే. 4

అందు వేలకొలది రాజులు, కౌరవులు చుట్టియుండగా ఆసనమున కూర్చున్న మహాబాహువగు దుర్యోధనుని గాంచెను.

దుఃశాసనం చ కర్ణం చ శకునిం చాపి సౌబలమ్,
దుర్యోధనసమీపే తానాసనస్థాన్ దదర్శ సః. 5

దుర్యోధనునియొద్ద ఆసనములందున్న దుశ్శాసనుని, కర్ణుని, సుబలరాజు శకునిని కూడ శ్రీకృష్ణుడు చూచెను.

అభ్యాగచ్ఛతి దాశార్హే ధార్తరాష్ట్రో మహాయశాః,
ఉదతిష్ఠత్ సహామాత్యః పూజయన్ మధుసూదనమ్. 6

అట్లు శ్రీకృష్ణుడు వచ్చుచుండగా మిక్కిలి ప్రసిద్ధిగల దుర్యోధనుడు తన సన్నిహితులతో పాటు శ్రీకృష్ణుని మన్నించుచు లేచి నిలుచుండెను.

సమేత్య ధార్తరాష్ట్రేణ సహామాత్యేన కేశవః,
రాజభి స్తత్ర వార్ష్ణేయం సమాగచ్ఛ ద్యథావయః. 7

సన్నిహితులతో కూడియున్న దుర్యోధనుని కలిసి పిదప శ్రీకృష్ణుడు వయస్సునుబట్టి తక్కిన వారినందరను కలిసికొనెను.

తత్ర జామ్బూనదమయం పర్యఙ్కం సుపరిష్కృతమ్,
వివిధాస్తరణాస్తీర్ణ మభ్యుపావిశ దచ్యుతః. 8

అందు చక్కగా తీర్చిదిద్దినదియు, వివిధములగు పరపులు పరచినదియు నగు బంగారుపాన్పుపై అచ్యుతుడు కూర్చుండెను.

తస్మిన్ గాం మధుపర్కం చాప్యుదకం చ జనార్దనే,
నివేదయామాస తదా గృహాన్ రాజ్యం చ కౌరవః. 9

కురురాజు కృష్ణునకు గోవును, మధుపర్కమును, ఉదకమును సమర్పించెను. తన భవనములను రాజ్యమును గూడ కృష్ణునకు నివేదించెను.

తత్ర గోవిన్ద మాసీనం ప్రసన్నాదిత్యవర్చసమ్,
ఉపాసాంచక్రిరే సర్వే కురవో రాజభిః సహ. 10

ప్రసన్నుడైన సూర్యుని కాంతివంటి కాంతితో వెలుగొందుచు ఆ పాన్పుపై కూర్చున్న శ్రీకృష్ణుని కౌరవులు, ఇతర రాజులు కొలిచియుండిరి.

తతో దుర్యోధనో రాజా వార్ష్ణేయం జయతాం వరమ్,
న్యమన్త్రయ ద్భోజనేన నాభ్యనన్దచ్చ కేశవః. 11

అంత దుర్యోధనమహారాజు జయశాలి యగు శ్రీకృష్ణుని భోజనము చేయుమని కోరెను. కేశవుడు దానిని మన్నింపడాయెను.

తతో దుర్యోధనః కృష్ణ మబ్రవీత్ కురుసంసది,
మృదుపూర్వం శఠోదర్కం కర్ణ మాభాష్య కౌరవః. 12

అంత కురురాజు కర్ణుని కలుపుకొని కురుసభలో కృష్ణునితో పైకి మెత్తగా, లోపల వెక్కిరింత తోచునట్లుగా నిట్లు పలికెను.

కస్మా దన్నాని పానాని వాసాంసి శయనాని చ,
త్వదర్థ ముపనీతాని నాగ్రహీస్త్వం జనార్దన. 13
ఉభయోశ్చ దదత్సాహ్య ముభయోశ్చ హితే రతః. 14

కృష్ణా! నీవు రెండు వైపుల వారికి సాయము కూర్చుచు ఇరువుర హితము కోరువాడవు గదా! నీకై కూర్చిన అన్నములు, పానములు, వస్త్రములు, ఏల కైకొనవు ?

---

9. నివేదించెను అనగా మర్యాదకొరకు 'ఇవన్నియు నీవే' అనిన విధమని తాత్పర్యము.

12. శఠోదర్కమ్ - తుదికి వంకరతనము తోచునట్లుగా, ఆభాష్య - పలుకరించి, సంబోధనతో తన వైపు త్రిప్పుకొని అని భావము.

సంబన్ధీ దయితశ్చాసి ధృతరాష్ట్రస్య మాధవ,
త్వం హి గోవిన్ద ధర్మార్థౌ వేత్థ తత్త్వేన సర్వశః,
తత్ర కారణ మిచ్ఛామి శ్రోతుం చక్రగదాధర. 15

మాధవా ! ధృతరాష్ట్రమహారాజునకు చుట్టమవు; ప్రియుడవు. ధర్మార్థములను అన్ని విధములు మూలముట్టుగా నెరిగినవాడవు. అన్నపానములొల్లని కారణమేమో వినగోరుచున్నానోయి చక్రగదాధరా !

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
స ఏవ ముక్తో గోవిన్దః ప్రత్యువాచ మహామనాః
ఉద్యన్మేఘస్వనః కాలే ప్రగృహ్య విపులం భుజమ్. 16

అత డిట్లు పలుకగా గోవిందుడు పట్టుదల గల మనస్సుతో దుర్యోధనుని చేతిని చేతబట్టి ఉరుమువంటి కంఠధ్వనితో ఇట్లు బదులు పలికెను.

అలఘూకృత మగ్రస్త మనిరస్త మసంకులమ్,
రాజీవనేత్రో రాజానం హేతుమ ద్వాక్య ముత్తమమ్. 17

తేల్చివేయని, అక్షరములు జారిపోని, తొట్రుపాటు లేని, స్పష్టత కొరవడని ఉత్తమమై యుక్తులతో నిండిన వాక్యమును పద్మములవలె ప్రకాశించు కన్నులుగల శ్రీకృష్ణుడు రాజుతో పలికెను.

కృతార్థా భుఞ్జతే దూతాః పూజాం గృహ్ణన్తి చైవ హ,
కృతార్థం మాం సహామాత్యం సమర్చిష్యసి భారత. 18

---

15. తత్ర - భోజనము వలదనుటలో.

16. మహామనాః - సందర్భమును బట్టి బిగువైన మనస్సు గలవాడు అను నర్థము చెప్పుకొనవలెను.

17. అలఘూకృతమ్ - ప్రయత్నములో ఈగిసలాట లేనిదానిని - 'ఒత్తి పలికిన' అని భావము; అగ్రస్తమ్ - అక్షరములు మ్రింగివేయని; అనిరస్తమ్ - 'మిక్కిలి స్పష్టత గల' అని భావము; అసంకులమ్ - అక్షరముల తడబాటులేని;

ఓయి భారతా! దూతలు వచ్చినపని నెరవేరిన పిదపనే భోజనము చేయుదురు. సత్కారము లందుదురు. నేను వచ్చినపని నెరవేరిన పిదప నన్ను, నా వారిని మన్నింతువులే.

ఏవ ముక్తః ప్రత్యువాచ ధార్తరాష్ట్రో జనార్దనమ్,
న యుక్తం భవతాస్మాసు ప్రతిపత్తు మసాంప్రతమ్. 19

జనార్దను డిట్లనగా దుర్యోధను డిట్లు బదులాడెను. 'నీవు మాయం దిట్లు మర్యాద తప్పి ప్రవర్తింపుట పనికిరాదు.'

కృతార్థం వాఽకృతార్థం చ త్వాం వయం మధుసూదన,
యతావహే పూజయితుం దాశార్హ న చ శక్నుమః. 20

'మధుసూదనా! నీ పని నెరవేరునో నెరవేరదో? మేము నిన్ను మన్నింప ప్రయత్నింతుము. ఫలమును గూర్చి చెప్పజాలము'.

న చ తత్కారణం విద్మో యస్మిన్నో మధుసూదన,
పూజాం కృతాం ప్రీయమాణై ర్నామంస్థాః పురుషోత్తమ. 21

మేము మనసుపడి చేసిన పూజను ఒల్లకున్నావు. అందు కారణమేమో మే మెరుగకున్నాము

వైరం నో నాస్తి భవతా గోవిన్ద న చ విగ్రహః,
స భవాన్ ప్రసమీక్ష్యైత న్నేదృశం వక్తు మర్హతి. 22

'మాకు నీయందు ద్వేషము లేదు. నీతో పోరునకు తలపడము. ఇది నీవు చక్కగా గుర్తించి యిట్లు పలుకరాదు.'

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తః ప్రత్యువాచ ధార్తరాష్ట్రం జనార్దనః,
అభివీక్ష్య సహామాత్యం దాశార్హః ప్రహసన్నివ. 23

దుర్యోధను డిట్లు పలుకగా జనార్దనుడు ఆతనిని, ఆతని సన్నిహితులను, నిలువెల్ల పరికించి నవ్వుమోముతో ఇట్లు బదులాడెను.

---

22. వైరమ్ - ద్వేషము, విగ్రహః - రాజ్యము మున్నగునది కారణముగా జరుగు యుద్ధము.

నాహం కామా న్న సంరంభా న్న ద్వేషా న్నార్థకారణాత్,
న హేతువాదా ల్లోభాద్వా ధర్మం జహ్యాం కథఞ్చన. 24

కామమువలననో, తొందరపడియో, పగబూనియో, ధనమాశించియో, కుంటి సాకులవలననో, పేరాసవలననో నేనెన్నటికిని ధర్మము తప్పను.

సంప్రీతిభోజ్యా న్యన్నాని ఆపద్భోజ్యాని వా పునః,
న చ సంప్రీయసే రాజ న్న చైవాపద్గతా వయమ్. 25

రాజా! అన్నములు ప్రీతితో తినదగినవియో లేక కీడు మూడినప్పుడు తినదగినవో యగుచున్నవి. నాయందు నీకు ప్రీతి లేదు. మాకు కీడేమియు మూడ లేదు.

అకస్మా ద్ద్వేష్టి వై రాజన్ జన్మప్రభృతి పాణ్డవాన్,
ప్రియానువర్తినో భ్రాతౄన్ సర్వైః సముదితాన్ గుణైః. 26

రాజా! పుట్టినది మొదలు ప్రేమతో మీ వెంటబడి తిరుగు అన్నదమ్ములను, మంచిగుణము లన్నింటితో పేరొందిన వారిని ఆ పాండు కుమారులను ఏ కారణమును లేకయే ద్వేషించుచున్నావు.

అకస్మా చ్చైవ పార్థానాం ద్వేషణం నోపపద్యతే,
ధర్మే స్థితాః పాణ్డవేయాః కస్తాన్ కిం వక్తు మర్హతి. 27

కుంతి కొడుకులకు మీ పై పగయున్ననో కారణము లేక కలిగినదికాదు. ఆ కుంతితనయులు ధర్మమున నిలబడినవారు. వారి నెవ డేమనగలడు?

య స్తాన్ ద్వేష్టి స మాం ద్వేష్టి యస్తా నను స మా మను,
ఐకాత్మ్యం మాం గతం విద్ధి పాణ్డవై ర్ధర్మచారిభిః. 28

వారి నెవడు ద్వేషించునో వాడు నన్ను ద్వేషించినవాడే యగును. వారిని మన్నించువాడు నన్ను మన్నించువాడే యగును. ధర్మమును తప్పక పాటించు పాండవులకును నాకును ఆత్మ యొక్కటియే. ఇది తెలుసుకో.

---

24. సంరంభాత్ - క్రోధమువలన లేక తొందరపాటు వలన; హేతువాదాత్ - కుంటిసాకువలన.

కామ|క్రోధానువర్తీ హి యో మోహా ద్విరుద్ధత్సతి,
గుణవన్తం చ యో ద్వేష్టి తమాహుః పురుషాధమమ్. 29

కామము, క్రోధము త్రిప్పినట్లు తిరుగుచు విపరీతబుద్ధితో విరోధమునే కోరుచు గుణవంతుని ద్వేషించువానిని పురుషాధముదందురు.

యః కళ్యాణగుణాన్ జ్ఞాతీన్ మోహా ల్లోభా ద్దిదృక్షతే,
సోఽజితాత్మాఽజిత|క్రోధో న చిరం తిష్ఠతి శ్రియమ్. 30

మేలైన గుణములు గల తన వంశము వారిని మోహముతో, దురాశతో చూచువాడు, మనసుపై, కోపముపై అదుపు తప్పినవాడు కల కాలము సంపదను కాపాడుకొనజాలడు.

అథ యో గుణసంపన్నాన్ హృదయస్యాప్రియానపి,
ప్రియేణ కురుతే వంశ్యాం శ్చిరం యశసి తిష్ఠతి. 31

మరియు తన హృదయమున కిష్టము కానివారినైనను, గుణసంపదతో అలరారు వంశము వారియందు ప్రేమతో వ్యవహరించువాడు కలకాలము కీర్తితో నిలుచును.

ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషన్తం నైవ భోజయేత్,
పాణ్డవాన్ ద్విషసే రాజన్ మమ ప్రాణా హి పాణ్డవాః.

పగవారి కూడు తినరాదు. పగవారికి అన్నము పెట్టరాదు. రాజా! పాండవులను ద్వేషింతువు. వారు నాకు ప్రాణములు గదా.

సర్వ మేత న్న భోక్తవ్య మన్నం దుష్టాభిసంహితమ్,
క్షత్తు రేకస్య భోక్తవ్య మితి మే ధీయతే మతిః. 32

చెడు భావములతో కూడిన యీ యన్నమంతయు తినరాదనియు ఒక్క విదురుడు పెట్టెడి యన్నము తినదగినదనియు నా బుద్ధి నిశ్చయించుచున్నది.

---

29. విరురుత్సతి - విరోధము పెట్టుకొనుటకు కోరుచున్నాడు.
30. మోహః - మంచిని చెడుగా భావించుట.
లోభః - ఇతరుల ధనము కొల్లగొట్టు బుద్ధి.

ఏవ ముక్త్వా మహాబాహు ర్దుర్యోధన మమర్షణమ్,
నిశ్చక్రామ తత శ్శుభ్రా ద్ధార్తరాష్ట్రనివేశనాత్. 33

ఆ మహాభుజుడు- క్రోధమూర్తి యగు దుర్యోధనునితో నిట్లు పలికి చక్కగా వెలుగొందు అతని భవనము నుండి బయలుదేరెను.

నిర్యాయ చ మహాబాహు ర్వాసుదేవో మహామనాః,
నివేశాయ యయౌ వేశ్మ విదురస్య మహాత్మనః. 34

దొడ్డబుద్ధి గల వాసుదేవు డా భవనము నుండి వెలువడి మహాత్ముడగు విదురునింట విడిది చేయుటకై యరిగెను.

తమభ్యగచ్ఛ ద్ద్రోణశ్చ కృపో భీష్మోఽథ బాహ్లికః,
కురవశ్చ మహాబాహుం విదురస్య గృహే స్థితమ్. 35

విదురునింట నున్న కృష్ణుని కడకు ద్రోణుడు, కృపుడు, భీష్ముడు, బాహ్లికుడు, తక్కిన కౌరవులు చేరుకొనిరి.

త ఊచు ర్మాధవం వీర కురవో మధుసూదనమ్,
నివేదయామో వార్ష్ణేయ సరత్నాం స్తే గృహాన్ వయమ్. 36

ఆ కౌరవు లందరు కృష్ణునితో, 'వృష్ణివంశమువాడా! రత్నములతో పాటు మా భవనముల నన్నింటిని నీకు సమర్పించుకొందుము' అని పలికిరి.

తానువాచ మహాతేజాః కౌరవాన్ మధుసూదనః,
సర్వే భవన్తో గచ్ఛన్తు సర్వా మేఽపచితిః కృతా. 37

మహాతేజస్వి యగు మధుసూదనుడు ఆ కౌరవులను గాంచి 'మీ పూజ యంతయు స్వీకరించితిని. మీరందరు మీ యిండ్ల కరుగుడు' అని పలికెను.

యాతేషు కురుషు క్షత్తా దాశార్హ మపరాజితమ్,
అభ్యర్చయామాస తదా సర్వకామైః ప్రయత్నవాన్. 38

---

33. శుభ్రాత్ - నానారత్నములతో నిండినది కనుక కాంతితో వెలిగిపోవు చున్న - 'శుభ్రం ప్రదీప్తే ధవళేఽభ్రకే చ' అని విశ్వనిఘంటువు.
37. అపచితిః - పూజ.

వారందరు వెడలినపిదప విదురుడు మిక్కిలి శ్రద్ధతో తన కోరికలన్నియు పండినట్లు ఎందును ఎదురులేని శ్రీకృష్ణుని అర్చించెను.

తతః క్షత్తాఽన్నపానాని శుచీని గుణవన్తి చ,
ఉపాహర దనేకాని కేశవాయ మహాత్మనే. 39

పరిశుభ్రములు, రుచికరములు అగు అన్నపానములు అనేకములు మహాత్ముడగు కేశవునకు విదురుడు సమకూర్చెను.

తై స్తర్పయిత్వా ప్రథమం బ్రాహ్మణాన్ మధుసూదనః,
వేదవిద్భ్యో దదౌ కృష్ణః ప్రథమం ద్రవిణాన్యపి. 40

కృష్ణుడు ముందుగా ఆ అన్నములను బ్రాహ్మణులకు తృప్తితీరగా పెట్టించెను. మరియు వేదములం దారితేరిన ఆ బ్రాహ్మణులకు దక్షిణ లొసగెను.

తతోఽనుయాయిభిః సార్ధం మరుద్భిరివ వాసవః,
విదురాన్నాని బుభుజే శుచీని గుణవన్తి చ. 41

పిదప తనవారితోపాటు, దేవతలతో కూడిన యింద్రునివలె శ్రీకృష్ణుడు విదురుడు వండి వడ్డించిన శుచి, రుచి, పుష్టిగల భోజనములను భుజించెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణదుర్యోధనసంవాదే ఏకనవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున శ్రీకృష్ణదుర్యోధనుల సంవాదము గల తొంబదియొకటవ అధ్యాయము.

—: o :—

# ద్వినవతితమోఽధ్యాయః

## తొంబదిరెండవ అధ్యాయము

**విదురేణ ధార్తరాష్ట్రాణాం దుర్భావనాం బోధయిత్వా కౌరవసభాయాం శ్రీకృష్ణగమన స్యానౌచిత్యప్రతిపాదనమ్.**

**విదురుడు ధృతరాష్ట్రుని కొడుకుల చెడుతల పెరిగించి కౌరవసభకు శ్రీకృష్ణు డరుగుట మంచిది కాదని తెలుపుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తం భుక్తవన్త మాశ్వస్తం నిశాయాం విదురోఽబ్రవీత్,
నేదం సమ్య గ్వ్యవసితం కేశవాగమనం తవ. 1

భోజనము చేసి విశ్రమించిన కృష్ణునితో ఆ రాత్రి విదురు డిట్లు పలికెను. కృష్ణా! నీ విటకు వచ్చుట మంచిపనిగా నేను భావింపను.

అర్థధర్మాతిగో మన్దః సంరంభీ చ జనార్దన,
మానఘ్నో మానకామశ్చ వృద్ధానాం శాసనాతిగః. 2

ఈ దుర్యోధనునకు అర్థము, ధర్మము కాబట్టవు. బుద్ధిహీనుడు కోప మెక్కువ. పరువు దక్కనీయడు. తన మానము కాపాడుకొనుటయే వాని కాంక్ష. పెద్దలమాట వినడు.

ధర్మశాస్త్రాతిగో మూఢో దురాత్మా ప్రగ్రహం గతః,
అనేయః శ్రేయసాం మన్దో ధార్తరాష్ట్రో జనార్దన. 3

జనార్దనా! దుర్యోధనుడు ధర్మశాస్త్రమును ధిక్కరించు మొద్దు. దురాత్ముడు మొండిపట్టుదల గలవాడు. శ్రేయములు వానికి తలకెక్కవు.

---

3. ప్రగ్రహం గతః - మొండిపట్టు పట్టువాడు.
అనేయః - తీర్చిదిద్దరానివాడు.

కామాత్మా ప్రాజ్ఞమానీ చ మిత్రధ్రుక్ సర్వశఙ్కితః,
అకర్తా చాకృతజ్ఞశ్చ త్యక్తధర్మా ప్రియానృతః. 4

వాని మనసంతయు కామమే. తన్ను గొప్ప ప్రజ్ఞగలవాడని తల పోయును. మిత్రులకును ద్రోహము చేయును. ఎందును నమ్మకము పెట్టడు. ఇతరులకు మేలు చేయడు. ఇతరులు చేసిన మేలు తలపడు. ధర్మమును విడనాడెను. కల్లలే వానికి ప్రియము.

మూఢ శ్చాకృతబుద్ధిశ్చ ఇన్ద్రియాణా మనీశ్వరః,
కామానుసారీ కృత్యేషు సర్వే ష్వకృతనిశ్చయః. 5

వివేకము లేనివాడు. బుద్ధి నిలుకడ లేదు. ఇంద్రియములు త్రిప్పినట్లే తిరుగును. పనులలో ఇచ్ఛ వచ్చినట్లు ప్రవర్తించును. దేనియందును నిశ్చయము పొందడు.

ఏతై శ్చాన్యైశ్చ బహుభి ర్దోషై రేవ సమన్వితః,
త్వయోచ్యమానః శ్రేయోఽపి సంరంభా న్న గ్రహీష్యతి. 6

ఇవియు మరియు నిట్టివి యగు నెన్నో దోషములు వానిలో కలవు. నీవు వానికి మేలైనదానినే చెప్పినను మూర్ఖతవలన దానిని పట్టించుకొనడు.

భీష్మే ద్రోణే కృపే కర్ణే ద్రోణపుత్రే జయద్రథే,
భూయసీం వర్తతే వృత్తిం న శమే కురుతే మనః. 7

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ, సైంధవుడు అను వారియందు తన బ్రదుకు పెద్దగా నిలుపుకొనెను. శాంతియందు మనసు పెట్టడు.

నిశ్చితం ధార్తరాష్ట్రాణాం సకర్ణానాం జనార్దన,
భీష్మద్రోణముఖాన్ పార్థా న శక్తాః ప్రతివీక్షితుమ్. 8

కర్ణునితోపాటు ధృతరాష్ట్రుని కొడుకు లందరు పాండవులు, భీష్ముడు, ద్రోణుడు మున్నగువారిని తేరపార జూడజాలరని నిశ్చయించిరి.

7. వృత్తిమ్ - బ్రదుకును - వీరు యుద్ధమున నాకు రాజ్యము తెచ్చిపెడుదు రన్న ఆశను.

సేనాసముదయం కృత్వా పార్థివం మధుసూదన,
కృతార్థం మన్యతే బాల ఆత్మాన మవిచక్షణః. 9

భూమియందున్న సేనల నన్నింటిని సమకూర్చుకొని, వివేకములేని ఆ కుర్రాడు తన్ను కృతార్థుడైనట్లు తలపోయుచున్నాడు.

ఏకః కర్ణః పరాన్ జేతుం సమర్థ ఇతి నిశ్చితమ్,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః స శమం నోపయాస్యతి. 10

మందబుద్ధి యగు ఆ దుర్యోధనుడు ఒక్క కర్ణుడే శత్రువులను గెలువ గలడని నమ్మియుండెను. వాడు శాంతి నొందుట జరుగదు.

సంవిచ్చ ధార్తరాష్ట్రాణాం సర్వేషా మేవ కేశవ.

ఆ ధృతరాష్ట్రుని కొడుకులందరి బుద్ధియు నిట్టిదే.

శమే ప్రయతమానస్య తవ సౌభ్రాత్రకాఙ్క్షిణః,
న పాణ్డవానా మస్మాభిః ప్రతిదేయం యథోచితమ్. 11
ఇతి వ్యవసితా స్తేషు వచనం స్యాన్నిరర్థకమ్. 12

పాండవులకు మనము తగుమాత్రముగా నైనను తిరిగి యిచ్చునది లేదని వారు బిగిసియున్నారు. నీవు శాంతికొఱకు ప్రయత్నించుచు, వారి అన్నదమ్ముల చక్కని నెయ్యమును నిలుపగోరుచు పలుకు పలుకు పనికిమాలినదే యగును.

యత్ర సూక్తం దురుక్తం చ సమం స్యా న్మధుసూదన,
న తత్ర ప్రలపేత్ ప్రాజ్ఞో బధిరేష్వివ గాయనః. 13

మంచి చెప్పినను చెడు చెప్పినను ఒకటే యయిన వారి విషయమున చెవిటివారియందు గాయకుడు వలె, తెలివిగలవాడు పలుకనే రాదు

అవిజానత్సు మూఢేషు నిర్మర్యాదేషు మాధవ!,
న త్వం వాక్యం బ్రువన్ యుక్త శ్చాణ్డాలేషు ద్విజో యథా. 14

---

9. పార్థివమ్ - పృథివీసంబంధమైనదానిని - అన్ని రాజ్యములలో నున్న దానిని అని భావము.

12. ప్రతిదేయమ్ - తిరిగి యీవలగినది; వ్యవసితాః - నిశ్చయముతోనున్న వారు.

చెప్పినను వినని మూఢులు, మర్యాద లేనివారు నగు కౌరవులకు, చండాలురకు ద్విజునివలె, నీవు హితమైనమాట చెప్పుచు ఏమియు సాధింపజాలవు.

సోఽయం బలస్థో మూఢశ్చ న కరిష్యతి తే వచః,
తస్మి న్నిరర్థకం వాక్య ముక్తం సంపత్స్యతే తవ. 15

వాడు తెగబలిసినవాడు. మూఢుడు, నీమాట వినడు. అట్టి వానికి నీవు చెప్పుమాట పనికిమాలిన దగును.

తేషాం సముపవిష్టానాం సర్వేషాం పాపచేతసామ్,
తవ మధ్యావతరణం మమ కృష్ణ న రోచతే. 16

ఒక్కచోట మూగిన ఆ పాపబుద్ధు లందరిమధ్య నీవు దిగుట కృష్ణయ్యా! నాకు రుచింపదు.

దుర్బుద్ధీనా మశిష్టానాం బహూనాం దుష్టచేతసామ్,
ప్రతీపం వచనం మధ్యే తవ కృష్ణ న రోచతే. 17

పాడుబుద్ధి, పాడుతలపులు గలిగి మంచితన మేకొంచెమును లేని పెక్కండ్రనడుమ నీవు పలుకు ఏటికెదురీతవంటి పలుకు నాకు ఇష్టము కాదు.

అనుపాసితవృద్ధత్వా చ్ఛ్రియో దర్పాచ్చ మోహతః,
వయోదర్పా దమర్షాచ్చ న తే శ్రేయో గ్రహీష్యతి. 18

పెద్దలను సేవింపని కారణమునను, సంపద ఉన్న కారణమునను, గర్వమువలనను, అజ్ఞానమువలనను, వయస్సు తెచ్చిన పొగరువలనను, పట్టుదల వలనను వాడు నీనుండి హితమును గ్రహింపడు.

బలం బలవద ప్యస్య 'యది వక్ష్యసి మాధవ,
త్వయ్యస్య మహతీ శఙ్కా న కరిష్యతి తే వచః. 19

ఆ ధర్మరాజు బలము గొప్పదని నీవు చెప్పినను, నీయందు వానికి పెద్ద అనుమానము కనుక నీమాటను పట్టించుకొనడు.

నేద మద్య యుధా శక్య మిన్ద్రేణాపి సహామరైః,
ఇతి వ్యవసితాః సర్వే ధార్తరాష్ట్రా జనార్దన. 20

'జనార్దనా! దేవత లందరితో గూడి యింద్రుడే పోరవచ్చినను నే దేమియు సాధింపజాలడని ఆ ధృతరాష్ట్రుని కొడుకు లందరి నిర్ణయము.

తేష్వేవ ముపపన్నేషు కామక్రోధానువర్తిషు,
సమర్థమపి తే వాక్య మసమర్థం భవిష్యతి. 21

కామక్రోధముల త్రిప్పులకు లోనై యీ విధముగా నున్నవారియందు నీవాక్య మెంత చేవగలదియైనను పనికిమాలినదే యగును.

మధ్యే తిష్ఠన్ హస్త్యనీకస్య మన్దో
రథాశ్వయుక్తస్య బలస్య మూఢః,
దుర్యోధనో మన్యతే వీతభీతిః
కృత్స్నా మమేయం పృథివీ జితేతి. 22

ఏనుగులు, రథములు, గుఱ్ఱములు నిండుగా నున్న సేననడుమ నిలబడి ఆ బుద్ధిహీనుడు చెప్పినను తెలియని దుర్యోధనుడు భయమింతయు లేక ఈ భూమి యంతయు తనకు దక్కినట్లే తలచుచున్నాడు.

ఆశంసతే వై ధృతరాష్ట్రస్య పుత్రో
మహారాజ్య మసపత్నం పృథివ్యామ్,
తస్మిన్ శమః కేవలో నోపలభ్యో
బద్ధం సన్తం మన్యతే లబ్ధమర్థమ్. 23

ఆ ధృతరాష్ట్రుని కొడుకు భూమిపై పగవాడు లేని మహారాజ్యమునకై లొట్టలు వేయుచున్నాడు. వాని విషయమున శాంతి బొత్తుగా పొందరానిది. చేత చిక్కిన సొమ్ము తనకు దక్కెననియే తలచుచున్నాడు.

పర్యస్తేయం పృథివీ కాలపక్వా
దుర్యోధనార్థే పాణ్డవాన్ యోద్ధుకామాః,
సమాగతాః సర్వయోధాః పృథివ్యాం
రాజానశ్చ క్షితిపాలైః సమేతాః. 24

ఈ నేలకు కాలము మూడినది. పెల్లగిల్లిపోవుచున్నది. కావుననే నేలపై గల నేలనేలువారితో పాటు పోటుగాండ్రైన రాజులందరు కట్టకట్టుకొని దుర్యోధనునికై పాండవులతో పోరాడగోరి వచ్చియున్నారు.

సర్వే చైతే కృతవైరాః పురస్తాత్
త్వయా రాజానో హృతసారాశ్చ కృష్ణ!
తవోద్వేగాత్ సంశ్రితా ధార్తరాష్ట్రాన్
సుసంహతాః సహ కర్ణేన వీరాః. 25

ఈ రాజులందరు మున్ను నీపై పగపెట్టుకొన్నవారు. నీవు ముందే వారి సారమంతయు లాగివైచితివి. అట్టి నీయందలి పగతో ఈ వీరులందరు కర్ణునితో పాటు ఒక్కటిగానై ధృతరాష్ట్రపుత్రులను ఆశ్రయించిరి.

త్యక్తాత్మానః సహ దుర్యోధనేన
హృష్టా యోద్ధుం పాణ్డవాన్ సర్వయోధాః,
తేషాం మధ్యే ప్రవిశేథా యది త్వం
న తన్మతం మమ దాశార్హ వీర. 26

దుర్యోధనునితోపాటు ఆ యోధులందరు జీవితాశలనుగూడ విడచి పాండవులతో పోరుటకై పొంగిపోవుచున్నారు. అట్టివారి మధ్య నీవు చొరబారుట, కృష్ణా! నా కిష్టము కాదు.

తేషాం సముపవిష్టానాం బహూనాం దుష్టచేతసామ్,
కథం మధ్యం ప్రపద్యేథాః శత్రూణాం శత్రుకర్శన. 27

కుళ్ళుబుద్ధితో ఒక్కచోటికి చేరిన పెక్కండ్రు శత్రువుల మధ్యకు, కృష్ణా! నీ వెట్లు చేరుదువు.

సర్వథా త్వం మహాబాహో దేవైరపి దురుత్సహః,
ప్రభావం పౌరుషం బుద్ధిం జానామి తవ శత్రుహన్. 28

ఓయి శత్రుసంహారకుడా! నిన్ను దేవతలు కూడ ఏ విధముగను ఏమియు చేయజాలరు. నీ మహిమను, నీ పౌరుషమును, నీ తెలివిని నే నెరుగుదును.

యా మే ప్రీతిః పాణ్డవేషు భూయః సా త్వయి మాధవ,
ప్రేమ్ణా చ బహుమానా చ్చ సౌహృదాచ్చ బ్రవీమ్యహమ్. 29

నాకు పాండవులన్న నెంత ప్రేమయో నీపై మరియు నంత ప్రేమ, కావున మాధవా! ప్రేమతో, మన్ననతో, మైత్రితో పలుకుచున్నాను.

యా మే ప్రీతిః పుష్కరాక్ష త్వద్దర్శనసముద్భవా,
సా కిమాఖ్యాయతే తుభ్య మన్తరాత్మాఽసి దేహినామ్. 30

నిన్ను చూడగా నాకు పుట్టిన ప్రీతి యెట్టిదో యేమని చెప్పగలను? నీవు ప్రాణులందరకు లోనున్న ఆత్మవు గదా!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణవిదురసంవాదే ద్వినవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణవిదురసంవాదముగల తొంబదిరెండవ అధ్యాయము.

—: o :—

# త్రినవతితమోఽధ్యాయః
# తొంబదిమూడవ అధ్యాయము

## శ్రీకృష్ణేన కౌరవపాణ్డవయోః సన్ధిస్థాపనప్రయత్న స్యౌచిత్యప్రతిపాదనమ్.

## శ్రీకృష్ణుడు కౌరవపాండవులకు సంధిగూర్చు ప్రయత్నమునందలి ఔచిత్యమును ప్రతిపాదించుట.

[వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

విదురస్య వచః శ్రుత్వా ప్రశ్రితం పురుషోత్తమః,
ఇదం హోవాచ వచనం భగవాన్ మధుసూదనః.

తీర్చి దిద్దినట్లున్న విదురుని మాట విని పురుషోత్తముడు భగవానుడు నగు మధుసూదను డిట్లు పలికెను.]

శ్రీ భగవా నువాచ-శ్రీ భగవంతు డిట్లు పలికెను.

యథా బ్రూయా న్మహాప్రాజ్ఞో యథా బ్రూయా ద్విచక్షణః,
యథా వాచ్య స్త్వద్విధేన భవతా మద్విధః సుహృత్. 1
ధర్మార్థయుక్తం తథ్యం చ యథా త్వయ్యుపపద్యతే,
తథా వచన ముక్తోఽస్మి త్వయైత త్పితృమాతృవత్. 2

గొప్ప ప్రజ్ఞ గలవాడు, వివేకమున్నవాడు ఎట్లు పలుకవలయునో, నా వంటి మిత్రుడు నీవంటి వానిచేత ఎట్లు ఉపదేశము పొందవలయునో ఆ విధముగా ధర్మముతో, అర్థముతో నిండిన సత్యమగుమాట పలికితివి. ఇది నీకే తగును. ఈ నీమాట తండ్రియు తల్లియు బుజ్జగించి చెప్పినట్లున్నది.

సత్యం ప్రాప్తం చ యుక్తం వాఽప్యేవమేవ యథాఽత్థ మామ్,
శృణు ష్వాగమనే హేతుం విదురావహితో భవ. 3

నీవు నాకు చెప్పినది నిజము కాలమునకు తగినట్లు వచ్చినది. తగినది విదురా! నా రాకయందలి కారణమును మెలకువతో వినుము.

దౌరాత్మ్యం ధృతరాష్ట్రస్య క్షత్రియాణాం చ వైరతామ్,
సర్వమేత దహం జానన్ క్షత్తః ప్రాప్తోఽద్య కౌరవాన్. 4

ఓయి విదురా! ధృతరాష్ట్రుని దుష్టబుద్ధిని, క్షత్రియుల వైరమును - దీని నంతటిని ఎరిగి ఎరిగి కౌరవులందరకు నేడు వచ్చితిని.

పర్యస్తాం పృథివీం సర్వాం సాశ్వాం సరథకుఞ్జరామ్,
యో మోచయే న్మృత్యుపాశాత్ ప్రాప్నుయాద్ ధర్మ
ముత్తమమ్. 5

గుఱ్ఱములతో ఏనుగులతోపాటుగ ఈనేల యంతయు తలక్రిందులగు చున్నది. దీనిని మృత్యుపాశము నుండి తప్పించగలవాడు ఉత్తమధర్మము చేసినవా డగును.

ధర్మకార్యం యతన్ శక్త్యా నో చేత్ ప్రాప్నోతి మానవః,
ప్రాప్తో భవతి తత్పుణ్య మత్ర మే నాస్తి సంశయః. 6

మనుజుడు శక్తిమేరకు ధర్మకార్యమునకై ప్రయత్నించుచు ఒకవేళ ఫలము పొందకున్నను ఆ పుణ్యమును పొందువా డగును. ఇందు నాకు సంశయము లేదు.

మనసా చిన్తయన్ పాపం కర్మణా నాతిరోచయన్,
న ప్రాప్నోతి ఫలం తస్యే త్యేవం ధర్మవిదో విదుః. 7

మనసుతో పాపమునే భావించుచు కార్యముతో పరులకు ప్రీతి కలిగింపని వాడు ఆ కర్మము ఫలమును పొందడని ధర్మమెరిగిన వారికి తెలియును

సోఽహం యతిష్యే ప్రశమం క్షత్తః కర్తు మమాయయా,
కురూణాం సృఞ్జయానాం చ సఙ్గ్రామే వినశిష్యతామ్. 8

క్షత్తా! అట్టి నేను పోరులో చావనున్న కౌరవులకు సృంజయులకు శాంతి కూర్చుటకై కల్లకపటములు లేని తీరులో ప్రయత్నము చేసెదను.

---

5. పర్యస్తామ్ - తలక్రిందులయిన దానిని - సర్వనాశనము పొందుచున్న దానిని అని భావము.

6. యతన్ - 'యతమానః' అనుదానికి ఆర్షరూపము.

సేయ మాప న్మహాఘోరా కురుష్వేవ సముత్థితా,
కర్ణదుర్యోధనకృతా సర్వే హ్యేతే తదన్వయాః. 9

కర్ణుడు, దుర్యోధనుడును కల్పించిన ఈ మహాఘోరమైన ఆపద కురు వంశమువారియందు తలసూపినది. ఏలయన ఈ అందరును ఆ వంశమువారే కదా!

వ్యసనే క్లిశ్యమానం హి యో మిత్రం నాభిపద్యతే,
అనర్థాయ యథాశక్తి తన్నృశంసం విదు ర్బుధాః. 10

ఆపదలో నలిగిపోవుచున్న మిత్రుని ఆదుకొనని క్రూరస్వభావము గల మిత్రుడు చేతనైన మేరకు కీడే కలిగించువా డగునని పెద్దలు చెప్పుదురు.

ఆకేశగ్రహణా న్మిత్ర మకార్యాత్ సంనివర్తయన్,
అవాచ్యః కస్యచి ద్భవతి కృతయత్నో యథా బలాత్. 11

ఉన్న శక్తినంతయు నుపయోగించి ప్రయత్నము చేసి జుట్టుపట్టి లాగుట మొదలగు పాడుపనినుండి మిత్రుని చక్కగా మరలించువా డెవనికైన నిందింప దగినవా డగునా?

తత్సమర్థం శుభం వాక్యం ధర్మార్థసహితం హితమ్,
ధార్తరాష్ట్రః సహామాత్యో గ్రహీతుం విదు రార్హతి. 12

కాబట్టి విదురా! తన సన్నిహితులతోపాటు ఆ దుర్యోధనుడు, ప్రయోజనము గలదియు, ధర్మముతో, అర్థముతో కూడినదియు తనకు మేలు కూర్చునదియు నగు శుభమైన పలుకు పట్టించుకొనవలయును.

---

9. చేసినవారు కర్ణదుర్యోధనులే అయినను అనుభవించువారు వంశమునందలి సర్వులును - అని తాత్పర్యము.

10. అనర్థాయ - అనునీయ - అనియు పాఠము - ప్రతిమాలి బాగుచేయవలయునని భావము. తత్ - నృశంసమ్ - ఆ క్రూర స్వభావము గల మిత్రుడు; అనర్థాయ - కీడునకే అని, బుధాః - పండితులు; విదుః - ఎరుగుదురు.

హితం హి ధార్తరాష్ట్రాణాం పాణ్డవానాం తథైవ చ,
పృథివ్యాం క్షత్రియాణాం చ యతిష్యేఽహ మమాయయా. 13

నేను ధృతరాష్ట్రుని కొడుకులకు, అట్లే పాండుకుమారులకు మరియు నేలపై గల రాజులందరకు హితము కూర్చుటకై కపటములేకుండ ప్రయత్నింతును.

హితే ప్రయతమానం మాం శఙ్కే ద్దుర్యోధనో యది,
హృదయస్య చ మే ప్రీతి రానృణ్యం చ భవిష్యతి. 14

మేలుచేయుటకై ప్రయత్నించు నన్ను దుర్యోధనుడు శంకించునేని అది నా ఎదకు ప్రీతినే కల్గించును. పాండవుల అప్పు తీర్చుకొన్నట్లగును.

జ్ఞాతీనాం హి మిథో భేదే యన్మిత్రం నాభిపద్యతే,
సర్వయత్నేన మాధ్యస్థ్యం న తన్మిత్రం విదు ర్బుధాః. 15

ఒక వంశమువారు తమలో తాము చీలిపోవుచున్నపుడు ఇద్దరకును కావలసినవాడై అన్ని ప్రయత్నములతో ఆదుకొననివాడు మిత్రుడు కాదని పండితుల భావన.

న మాం బ్రూయు రధర్మిష్ఠా మూఢా హ్యసుహృద స్తథా,
శక్తో నావారయత్ కృష్ణః సంరబ్ధాన్ కురుపాణ్డవాన్. 16

ధర్మ మేకొంచెము లేనివారు, చెప్పినను తెలియనివారు, మంచిమనసు లేనివారును నన్నుగూర్చి 'కృష్ణుడు సమర్థుడై యుండియు కౌరవపాండవులు కొట్టుకొనుచుండగా మరలింపలే' దని అనకుందురు గాక !

ఉభయోః సాధయ న్నర్థ మహ మాగత ఇత్యుత,
తత్ర యత్న మహం కృత్వా గచ్ఛేయం నృష్వవాచ్యతామ్. 17

రెండు పక్షముల వారి ప్రయోజనము సాధించుటకై నేనిటకు వచ్చితిని. అందు తగిన విధముగా ప్రయత్నము చేసి నేను మానవులలో నింద నొందకుందును.

మమ ధర్మార్థయుక్తం హి శ్రుత్వా వాక్య మనామయమ్,
న చే దాదాస్యతే బాలో దిష్టస్య వశమేష్యతి. 18

ధర్మార్థములతో కూడిన కుశలమును గూర్చు నామాట నా పిల్లగాడు పట్టించుకొనకున్నచో సర్వనాశనమగును.

---

13. హితం, యతిష్యే - హితము చేయుటకు ప్రయత్నింతును.
15. న అభిపద్యతే - ఉపకారము చేయడు.

అహాపయన్ పాణ్డవార్థం యథావ-
చ్ఛమం కురూణాం యది చాచరేయమ్,
పుణ్యం చ మే స్యాచ్చరితం మహాత్మన్
ముచ్యేరం శ్చ కురవో మృత్యుపాశాత్. 19

పాండవుల పని చెడకుండ చేతనైన మేరకు కౌరవులకు శాంతి కూర్ప కలిగినచో ఓయి మహాత్మా! నా చరితము పండినట్లే. మరియు కౌరవు లందరు మృత్యుపాశమునుండి బయట పడుదురు.

అపి వాచం భాషమాణస్య కావ్యాం
ధర్మారామా మర్థవతీ మహింస్రామ్,
అవేక్షేరన్ ధార్తరాష్ట్రాః శమార్థం
మాం చ ప్రాప్తం కురవః పూజయేయుః. 20

చక్కని నీతికి, ధర్మమునకు ప్రయోజనమునకు నెలవై ఎట్టి హింసకు తావులేని పలుకును శాంతికై పలుకుదును. ధృతరాష్ట్రుని కొడుకులు పట్టించు కొందురుగాక! వచ్చిన నన్ను కౌరవులు మన్నింతురు గాక!

న చాపి మమ పర్యాప్తాః సహితాః సర్వపార్థివాః,
క్రుద్ధస్య ప్రముఖే స్థాతుం సింహస్యే వేతరే మృగాః. 21

క్రోధముతో విజృంభించు నాముందు నేలపైగల రాజు లందరు కలిసి వచ్చియు, సింహముముందు తక్కిన మృగములవలె, నిలువ జాలరు.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యేవ ముక్త్వా వచనం వృష్ణీనా మృషభ స్తదా,
శయనే సుఖసంస్పర్శే శిశ్యే యదుసుఖావహః. 22

యదువులకు సుఖముగూర్చు వృష్ణివర్యు డిట్లు పలికి మెత్తని పాన్పుపై నిద్రించెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణవాక్యే త్రినవతితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణ వాక్యముగల తొంబదిమూడవ అధ్యాయము.

—:o:—

# చతుర్నవతితమోఽధ్యాయః
# తొంబదినాలుగవ అధ్యాయము

దుర్యోధనశకునిభ్యా మభ్యర్థితస్య శ్రీకృష్ణస్య రథేన ప్రస్థానం,
కౌరవసభాయాం ప్రవిశ్య కృతాదరస్య తస్య తత్రాసనగ్రహణమ్.

దుర్యోధనశకునులు ప్రార్థింపగా శ్రీకృష్ణుడు రథముతో బయలుదేరుట.
కౌరవసభలో ప్రవేశించి అందరి మన్ననలు గొని యాతడు
ఆసనమును స్వీకరించుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తథా కథయతో రేవ తయో ర్బుద్ధిమతో స్తదా,
శివా నక్షత్రసంపన్నా సా వ్యతీయాయ శర్వరీ. 1

అట్లు ఆ బుద్ధిమంతు లిరువురు మాటాడుకొనుచుండగా నక్షత్రములు పెల్లుగా వెలుగొందు శుభమైన రాత్రి అట్లే గడచిపోయెను.

ధర్మార్థకామయుక్తాశ్చ విచిత్రార్థపదాక్షరాః,
శృణ్వతో వివిధా వాచో విదురస్య మహాత్మనః. 2
కథాభి రనురూపాభిః కృష్ణ స్యామితతేజసః,
అకామ స్యేవ కృష్ణస్య సా వ్యతీయాయ శర్వరీ. 3

ధర్మము, అర్థము, కామము అనువానికి సంబంధించినవియు, విచిత్రము లగు అర్థములు గల పదములు, అక్షరములు గలవియు, నగు వివిధములగు వాక్కులు వినుచున్న మహాత్ముడు విదురునకు, పట్టశక్యముగాని తేజముగల కృష్ణుని అనురూపములగు కథలలో రాత్రి గడచెను. ఏ కోరికయు లేనట్లున్న కృష్ణునకును రాత్రి గడచెను.

---

1. నక్షత్రసంపన్నా - శరత్కాలమున మేఘములు లేని కారణమున నక్షత్రములు చక్కగా ప్రకాశించుచున్న రాత్రి యని భావము.

తతస్తు స్వరసంపన్నా బహవః సూతమాగధాః,
శఙ్ఖదున్దుభినిర్ఘోషైః కేశవం ప్రత్యబోధయన్. 4

మంచి కంఠస్వరముగల సూతమాగధులు శంఖములయు, భేరులయు నాదములతో శ్రీకృష్ణుని మేల్కొలిపిరి.

తత ఉత్థాయ దాశార్హ ఋషభః సర్వసాత్వతామ్,
సర్వ మావశ్యకం చక్రే ప్రాతఃకార్యం జనార్దనః. 5

అంత సాత్వతులలో శ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు నిద్ర లేచి ప్రాతఃకాలమున చేయదగిన పనులన్నియు నిర్వర్తించెను.

కృతోదకానుజప్యః స హుతాగ్నిః సమలంకృతః,
తతశ్చాదిత్య ముద్యన్త ముపాతిష్ఠత మాధవః. 6

స్నానసంధ్యలు ముగించి అగ్నిని ప్రేల్చి, చక్కగా అలంకరించుకొని మాధవుడు ఉదయించుచున్న సూర్యుని ఉపాసించెను.

అథ దుర్యోధనః కృష్ణం శకునిశ్చాపి సౌబలః,
సన్ధ్యాం తిష్ఠన్త మభ్యేత్య దాశార్హ మపరాజితమ్. 7
ఆచక్షేతాం తు కృష్ణస్య ధృతరాష్ట్రం సభాగతమ్,
కురూంశ్చ భీష్మప్రముఖాన్ రాజ్ఞః సర్వాంశ్చ పార్థివాన్. 8

అంత దుర్యోధనుడును, సుబలరాజు శకునియు సంధ్య వార్చుచున్న కృష్ణుని కడ కరిగి 'ధృతరాష్ట్రుడు, భీష్ముడు మొదలగు కురువంశమువారు, భూమిపాలురగు రాజులందరు కొలువుదీరి యున్నా'రని పలికిరి.

త్వా మర్థయన్తే గోవిన్ద దివి శక్ర మివామరాః,
తావభ్యనన్ద ద్గోవిన్దః సామ్నా పరమవల్గునా. 9

---

4. సూతమాగధాః - స్తోత్రపాఠములు చేయువారు.
6. కృతోదక - అనుజప్యః - ఉదక మనగా స్నానము, ఆచమనము మొదలగు పని; అనుజప్యమనగా సంధ్య నుపాసించుట మొదలగునది. ఈ రెండును చేసినవాడు.

'గోవిందా! స్వర్గమున ఇంద్రుని కొఱకు దేవతలవలె వారందరు నిన్ను చూడగోరుచున్నా'రని విన్నవించిరి. అంత గోవిందుడు మిక్కిలి చక్కని మంచి మాటతో వారి నాదరించెను.

తతో విమల ఆదిత్యే బ్రాహ్మణేభ్యో జనార్దనః,
దదౌ హిరణ్యం వాసాంసి గాశ్చాశ్వాంశ్చ పరంతపః. 10

అంత సూర్యుడు తెల్లని వెలుగులతో అలరారుచుండగా శత్రుసంహారకు డగు జనార్దనుడు బ్రాహ్మణులకు బంగారము, వస్త్రములను, గోవులను, గుఱ్ఱముల నొసగెను.

విసృజ్య బహురత్నాని దాశార్హ మపరాజితమ్,
తిష్ఠన్త ముపసఙ్గమ్య వవన్దే సారథి స్తదా. 11

రత్నములు పెక్కింటిని దాన మొసగి, ఎందును ఓటమి యెరుగని కృష్ణుడు కూర్చుండి యుండగా సారథి దరికి జేరి మ్రొక్కెను.

తతో రథేన శుభ్రేణ మహతా కిఙ్కిణీకినా,
హయోత్తమయుజా శీఘ్ర ముపాతిష్ఠత దారుకః. 12

పిదప శుభ్రమైనదియు, గొప్పదియు, చిరుమువ్వల గలగలలు గలదియు, ఉత్తమాశ్వములు పూన్చినదియు నగు రథముతో దారుకుడు సమీపించెను.

[తస్మై రథవరో యుక్తః శుశుభే లోకవిశ్రుతః,
వాజిభిః శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకైః.

శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము అను పేర్లుగల గుఱ్ఱములు పూన్చిన ప్రసిద్ధికెక్కిన శ్రేష్ఠమగు రథము అతనికి సన్నద్ధమై విరాజిల్లెను.

శైబ్యస్తు శుకపత్రాభః సుగ్రీవః కింశుకప్రభః,
మేఘపుష్పో మేఘవర్ణః పాణ్డురస్తు వలాహకః.

శైబ్యము చిలుకరెక్కల వన్నెతో నొప్పారెను. సుగ్రీవము మోదుగ పువ్వుకాంతితో నలరారెను. మేఘపుష్పము మబ్బువన్నెతో అందగించెను. వలాహకము తెల్లని కాంతితో విలసిల్లెను.

---

11. తిష్ఠన్తమ్ - ఆసీనుడై యున్న.

దక్షిణం చావహ చ్ఛైబ్యః సుగ్రీవః సవ్యతోఽవహత్,
పృష్ఠవాహౌ తయోరాస్తాం మేఘపుష్పవలాహకౌ.

శైబ్యము కుడివైపునను, సుగ్రీవమెడమవైపునను మోయుచుండెను. మేఘపుష్పవలాహకములు ఆ రెంటి వెనుకనుండి రథమును మోయుచుండెను.

వైనతేయః స్థిత స్తస్యాం ప్రభాకర మివ స్పృశన్,
తస్య సత్త్వవతః కేతౌ భుజగారి రశోభత.

సూర్యుని తాకుచున్నాడో యన్నట్లు గరుత్మంతుడు బలశాలి యగు కృష్ణుని రథము ధ్వజముపై అలరారెను.

తస్య కీర్తిమత స్తేన భాస్వరేణ విరాజతా,
శుశుభే స్యన్దనశ్రేష్ఠః పతగేన్ద్రేణ కేతునా.

కీర్తితో నలరారు ఆ శ్రీకృష్ణుని శ్రేష్ఠమగు రథము కాంతితో ధగధగ లాడు గరుడధ్వజముతో విరాజిల్లెను.

రుక్మజాలైః పతాకాభిః సౌవర్ణేన చ కేతునా,
బభూవ స రథశ్రేష్ఠః కాలసూర్య ఇవోదితః.

బంగారు తోరణములతో, పతాకలతో, బంగారుటెక్కెముతో కూడిన ఆరథము పైకివచ్చిన మధ్యాహ్న కాల సూర్యునివలె వెలుగొందెను.

పక్షిధ్వజవితానైశ్చ రుక్మజాలకృతాంతరైః,
దణ్డమార్గవిభాగైశ్చ సుకృతై ర్విశ్వకర్మణా.

విశ్వకర్మ దానియందు బంగారు జాలరులను, పక్షులను, ధ్వజములను, చాందినీలను, చక్కని అమరికగల స్తంభములను ఎంతో నేర్పుతో అమర్చెను.

ప్రవాళమణిహేమైశ్చ ముక్తావైడూర్యభూషితైః,
కిఙ్కిణీశతసంఘైశ్చ వాలజాలకృతాన్తరైః,

కార్తస్వరమయీభిశ్చ పద్మినీభి రలంకృతః,
శుశుభే స్యన్దనశ్రేష్ఠ స్తాపనీయైశ్చ పాదపైః.

పగడములతో, మణులతో, బంగారపు అలంకారములతో ముత్తెములతో గరుడపచ్చలతో గూడిన తొడవులతో నూర్లకొలది చిరుగంటలతో సరియగు

దూరములలో తీర్చిదిద్దిన ప్రేలాడు జాలరులతో బంగారుపద్మలతలతో, బంగారు చెట్లతో ఆ ఉత్తమరథము ప్రకాశించెను.

వ్యాఘ్రసింహవరాహైశ్చ గోవృషై ర్మృగపక్షిభిః,
తారాభి ర్భాస్కరై శ్చాపి వారణైశ్చ హిరణ్మయైః,
వజ్రాంకుశవిమానైశ్చ కూబరావృత్తసన్నిభః.

ఆ రథము నొగ, వంపులు, మూలలు మొదలగు వానియందు బంగారముతో పులులను, సింహములను, పందులను, ఎద్దులను, ఆవులను, మృగములను, పక్షులను, నక్షత్రములను, సూర్యబింబములను విశ్వకర్మ పరమ సుందరముగా చెక్కెను.]

తముపస్థిత మాజ్ఞాయ రథం దివ్యం మహామనాః,
మహాభ్రఘననిర్ఘోషం సర్వరత్నవిభూషితమ్. 13

దొడ్డబుద్ధి గల కృష్ణుడు, గొప్పమేఘ మురిమినట్లున్న ధ్వని గలదియు, అన్ని విధములగు రత్నములతో అలంకరింపబడినదియు నగు తన దివ్యరథము సిద్ధమై వచ్చెనని యెరిగి—

అగ్నిం ప్రదక్షిణం కృత్వా బ్రాహ్మణాంశ్చ జనార్దనః,
కౌస్తుభం మణి మాముచ్య శ్రియా పరమయా జ్వలన్. 14

అగ్నిని బ్రాహ్మణులకు వలగొని కౌస్తుభమణిని ధరించి పరమశోభతో ప్రకాశించుచు.........

కురుభిః సంవృతః కృష్ణో వృష్ణిభి శ్చాభిరక్షితః,
ఆతిష్ఠత రథం శౌరిః సర్వయాదవనన్దనః. 15

యాదవు లందర కానందము గూర్చు శౌరి కౌరవులు చుట్టి రాగా, వృష్ణి వంశమువా రన్నివైపుల అంగరక్షణ చేయుచుండగా రథము నధిరోహించెను.

అన్వారురోహ దాశార్హం విదురః సర్వధర్మవిత్,
సర్వప్రాణభృతాం శ్రేష్ఠం సర్వబుద్ధిమతాం వరమ్. 16

ధర్మము లన్నియు చక్కగా నెరిగిన విదురుడు ప్రాణు లందరిలో శ్రేష్ఠుడు బుద్ధిమంతు లందరిలో మిన్న యగు శ్రీకృష్ణుని వెనుక రథ మెక్కెను.

తతో దుర్యోధనః కృష్ణం శకుని శ్చాపి సౌబలః,
ద్వితీయేనైన రథేనైన మన్వయాతాం పరంతపమ్. 17

పిదప దుర్యోధనుడు, సుబలరాజు శకునియు మరొక రథము నెక్కి పరంతపుడగు శ్రీకృష్ణుని వెనుక బయలుదేరిరి.

సాత్యకిః కృతవర్మా చ వృష్ణీనాం చాపరే రథాః,
పృష్ఠతోఽనుయయుః కృష్ణం గజై రశ్వై రథైరపి. 18

సాత్యకియు, కృతవర్మయు, వృష్ణివంశము నందలి యితర వీరులును ఏనుగులతో, గుఱ్ఱములతో, రథములతో కూడి కృష్ణుని వెనుక నరుగసాగిరి.

తేషాం హేమపరిష్కారై ర్యుక్తాః పరమవాజిభిః,
గచ్ఛతాం ఘోషిణ శ్చిత్రరథా రాజన్ విరేజిరే. 19

బంగారుభూషణములతో నొప్పారు గొప్ప గుఱ్ఱములు పూన్చిన ఘోషతో కదలుచున్న వారి చిత్రములగు రథములు చూడముచ్చట గొలిపినవి.

సంమృష్టసంసిక్తరజః ప్రతిపేదే మహాపథమ్,
రాజర్షిచరితం కాలే కృష్ణో ధీమాన్ శ్రియా జ్వలన్. 20

చక్కగా ఊడ్చి నీరు చల్లుటచేత అణగిన దుమ్ముగలదియు, రాజర్షులు తిరిగినదియు నగు రాజమార్గమునకు ధీమంతుడు కృష్ణుడు, దివ్యశోభతో ప్రకాశించుచు, చేరుకొనెను.

తతః ప్రయాతే దాశార్హే ప్రావాద్యన్తైకపుష్కరాః,
శఙ్ఖాశ్చ దధ్మిరే తత్ర వాద్యా న్యన్యాని యాని చ. 21

శ్రీకృష్ణు డట్లు మార్గమున పోవుచుండగా కాహళలు, శంఖములు, తక్కిన వాద్యములు చక్కని నాదములు వెలార్చినవి.

ప్రవీరాః సర్వలోకస్య యువానః సింహవిక్రమాః,
పరివార్య రథం శౌరే రగచ్ఛన్త పరన్తపాః. 22

---

19. చిత్రరథాః - చిత్రములైన రథములు.
20. సంమృష్టసంసిక్తరజః - ఊడ్చి నీరు జల్లుట చేత అణగిన దుమ్ముగల.
21. ఏకపుష్కరాః - కాహళలు.

లోకమున వెల్లి గొప్పవీరులు, పయసువారు, సింహమువంటి పరాక్రమము గలవారు, శత్రువులను కాల్చి పారవేయువారు నగు వారు కృష్ణుని రథమునకు నలువైపుల నిలిచి నడువసాగిరి.

తతోఽన్యే బహుసాహస్రా విచిత్రాద్భుతవాససః,
అసిప్రాసాయుధధరాః కృష్ణ స్యాసన్ పురఃసరాః. 23

మరియు చిత్రచిత్రములగు వస్త్రములు ధరించి, కత్తి, ఈటె మున్నగు ఆయుధములు చేతబట్టిన పలువేలమంది వీరులు కృష్ణునకు ముందు నడచిరి.

గజాః పఞ్చశతా స్తత్ర రథాశ్చాసన్ సహస్రశః,
ప్రయాన్త మన్వయు ర్వీరం దాశార్హ మపరాజితమ్. 24

అయిదునూర్లు ఏనుగులు, వేలకొలది రథములు, ఎందును ఓటమి యెరుగని వీరుడు శ్రీకృష్ణుడు వెడలుచుండగా వెంట నంటెను.

పురం కురూణాం సంవృత్తం ద్రష్టుకామం జనార్దనమ్,
సబాలవృద్ధం సస్త్రీకం రథ్యాగత మరిన్దమ. 25

పసిపిల్లలతో, ముదుసలులతో స్త్రీలతోపాటు కౌరవుల ఊరుఊరెల్ల విరుగబడి శ్రీకృష్ణుని చూడగోరి బాటలలో నిలిచియుండెను.

వేదికామాశ్రితాభిశ్చ సమాక్రాన్తా న్యనేకశః,
ప్రచల న్తీవ భారేణ యోషిద్భి ర్భవనా న్యుత. 26

అరుగుల నెక్కి చూచుచున్న ఆడువారితో కిటకిట లాడుచున్న పలుతావులన్నియు బరువుతో ఊగులాడిపోవుచున్న ట్లుండెను.

స పూజ్యమానః కురుభిః సంశృణ్వన్ మధురాః కథాః,
యథార్హం ప్రతిసత్కుర్వన్ ప్రేక్షమాణం శనై ర్యయౌ. 27

కురువంశమువారు మన్ననతో ఆదరించుచుండగా తీయని పలుకు లాలకించుచు, తగినట్లు తిరిగి మన్ననలు చేయుచు అందరను చక్కగా చూచుచు శ్రీకృష్ణుడు మెల్లగా పోవసాగెను.

తతః సభాం సమాసాద్య కేశవ స్యానుయాయినః,
సశఙ్ఖై ర్వేణునిర్ఘోషై ర్దిశః సర్వా వ్యనాదయన్. 28

అంతట శ్రీకృష్ణుని వెంటనున్నవారు సభలోనికి ప్రవేశించి శంఖనాదములతో, వేణుగానమునతో దిక్కులు పిక్కటిల్ల జేసిరి.

తతః సా సమితిః సర్వా రాజ్ఞా మమితతేజసామ్,
సంప్రాకమ్పత హర్షేణ కృష్ణాగమనకాఙ్క్షయా. 29

గొప్ప ముఖకాంతిగల రాజులతో నిండిన ఆ సభ యెల్ల శ్రీకృష్ణుని రాకను గోరుచు ఆనందపు పొంగుతో ఊగిపోయెను.

తతోఽభ్యాశగతే కృష్ణే సమహృష్యన్ నరాధిపాః,
శ్రుత్వా తం రథనిర్ఘోషం పర్జన్యనినదోపమమ్. 30

ఉరుమువలె వెలువడు ఆతని రథము చప్పుడు విని కృష్ణుడు దగ్గరకు వచ్చెనని యెరిగి రాజులందరు పొంగిపోయిరి.

ఆసాద్య తు సభాద్వార మృషభః సర్వసాత్త్వతామ్,
అవతీర్య రథాచ్ఛౌరిః కైలాసశిఖరోపమాత్. 31

నవమేఘప్రతీకాశాం జ్వలన్తీ మివ తేజసా,
మహేన్ద్రసదనప్రఖ్యాం ప్రవివేశ సభాం తతః. 32

వృష్ణిభక్తులకు నాథుడైన శ్రీకృష్ణుడు సభాద్వారము దరి జేరి కైలాస శిఖరము వలె నున్న రథమునుండి దిగి, కాంతులతో, కనులు మిరుమిట్లు గొలుపు చున్నదియు క్రొత్త మేఘమువలె నొప్పారుచున్నదియు, దేవేంద్ర భవనమువలె అలరారు చున్నదియు నగు సభలోనికి ప్రవేశించెను.

పాణౌ గృహీత్వా విదురం సాత్యకిం చ మహాయశాః,
జ్యోతీం ష్యాదిత్యవ ద్రాజన్ కురూన్ ప్రాచ్ఛాదయన్ శ్రియా. 33

మహాయశస్వి శ్రీకృష్ణుడు విదురుని సాత్యకిని చేతులతో పట్టుకొని, సూర్యుడు నక్షత్రములను వలె, తన తేజస్సుతో కౌరవులను కప్పివేయుచు ప్రవేశించెను.

---

29. సమితిః - సభ
30. అభ్యాశగతే - దగ్గరకు రాగా
31. సర్వసాత్త్వతామ్ - సాత్వతులనగా విష్ణుభక్తులు. వారికి ఋషభః - ప్రభువు.

అగ్రతో వాసుదేవస్య కర్ణదుర్యోధనా వుభౌ,
వృష్ణయః కృతవర్మా చాప్యాసన్ కృష్ణస్య పృష్ఠతః. 34

కర్ణుడు దుర్యోధనుడును వాసుదేవునిముందు నడుచుచుండిరి. యాదవులును కృతవర్మయు వెనుకవైపు నిలిచియుండిరి.

ధృతరాష్ట్రం పురస్కృత్య భీష్మద్రోణాదయ స్తతః,
ఆసనేభ్యోఽచలన్ సర్వే పూజయన్తో జనార్దనమ్. 35

వచ్చుచున్న కృష్ణుని గౌరవించుచు ధృతరాష్ట్రుని ముందిడుకొని భీష్మద్రోణులందరు ఆసనములనుండి కదలి ఎదురేగిరి.

అభ్యాగచ్ఛతి దాశార్హే ప్రజ్ఞాచక్షు ర్నరేశ్వరః,
సహైవ ద్రోణభీష్మాభ్యా ముదతిష్ఠన్మహాయశాః. 36

కృష్ణుడు తనకడకు వచ్చుచుండగా గ్రుడ్డిరాజు ద్రోణభీష్ములతో లేచి నిలచెను.

ఉత్తిష్ఠతి మహారాజే ధృతరాష్ట్రే జనేశ్వరే,
తాని రాజసహస్రాణి సముత్తస్థుః సమన్తతః. 37

ప్రజల కేలికయగు మహారాజు ధృతరాష్ట్రుడు లేచి నిలువగా అచట అన్నివైపులనున్న వేలకొలది రాజులు లేచి నిలిచిరి.

ఆసనం సర్వతోభద్రం జామ్బూనదపరిష్కృతమ్,
కృష్ణార్థే కల్పితం తత్ర ధార్తరాష్ట్రస్య శాసనాత్. 38

దుర్యోధనుని ఆజ్ఞపై అచట కృష్ణుని కొరకు సర్వతోభద్రమైన బంగారు పీఠమును తెచ్చిపెట్టిరి.

స్మయమానస్తు రాజానం భీష్మద్రోణౌ చ మాధవః,
అభ్యభాషత ధర్మాత్మా రాజ్ఞ శ్చాన్యా న్యథావయః. 39

ధర్మబుద్ధిగల శ్రీకృష్ణుడు రాజును, భీష్మద్రోణులను, తక్కిన రాజులను వారి యశస్సునుబట్టి మన్నించుచు చిరునవ్వుతో పలుకరించెను.

---

38. సర్వతోభద్రమ్ - ఎందును ఏలోపములేని; జాంబూనదపరిష్కృతమ్ - బంగారపు శృంగారముగల.

తత్ర కేశవ మానర్చుః సమ్య గభ్యాగతం సభామ్,
రాజానః పార్థివాః సర్వే కురవశ్చ జనార్దనమ్. 40

అట్లు సభలోనికి వచ్చిన శ్రీకృష్ణుని దొరలు, ఏలికలు, కౌరవులు అందరు చక్కగా గౌరవించిరి.

తత్ర తిష్ఠన్ స దాశార్హో రాజమధ్యే పరంతపః,
అపశ్య ద న్తరిక్షస్థా నృషీన్ పరపురంజయః.

అట్లు రాజులనడుమ నిలిచిన శ్రీకృష్ణునకు ఆకసమున నిలిచియున్న ఋషులు కానవచ్చిరి.

తతస్తా నభిసంప్రేక్ష్య. నారదప్రముఖా నృషీన్,
అభ్యభాషత దాశార్హో భీష్మం శా న్తనవం శనైః. 41

అంత నారదుడు మొదలగు ఆ ఋషులనందరను చక్కగా పరికించి కృష్ణుడు శంతనుకుమారుడగు భీష్మునితో మెల్లగా నిట్లు పలికెను.

పార్థివీం సమితిం ద్రష్టు మృషయోఽభ్యాగతా నృప,
నిమ న్త్ర్యతా మాసనైశ్చ సత్కారేణ చ భూయసా. 42

రాజా! రాజులతో నిండిన యీ సభను చూచుటకు ఋషులు విచ్చేసిరి. వారికి ఆసనములు చూపి గొప్ప మన్ననతో స్వాగతము పలుకుము.

నైతే ష్వనుపవిష్టేషు శక్యం కేనచి దాసితుమ్,
పూజా ప్రయుజ్యతా మాశు మునీనాం భావితాత్మనామ్. 43

వీరు కూర్చుండక మన మెవ్వరము కూర్చుండరాదు. వేగమే మహానుభావులగు ఆ మునులకు పూజ గావింపుము.

ఋషీన్ శా న్తనవో దృష్ట్వా సభాద్వార ముపస్థితాన్,
త్వరమాణ స్తతో భృత్యా నాసనానీ త్యచోదయత్. 44

శాంతనవుడు సభ ద్వారము కడ నిలిచియున్న ఋషులను గాంచి త్వర త్వరగా పనివారలను "ఆసనములు" అని తోలెను.

ఆసనాన్యథ మృష్టాని మహా న్తి విపులాని చ,
మణికాఞ్చనచిత్రాణి సమాజహ్రు స్తత స్తతః. 45

చక్కగా శుభ్రపరచి తెచ్చిన విశాలములగు మహాసనములను మణులతో బంగారముతో చిత్రములైన వానిని భటులు అందందు తెచ్చి నిలిపిరి.

తేషు తత్రోపవిష్టేషు గృహీతార్ఘ్యేషు భారత,
నిషసా దాసనే కృష్ణో రాజానశ్చ యథాసనమ్. 46

ఆ ఋషులు పూజగొని తమ పీఠములయందు కూర్చున్న పిదప కృష్ణుడు ఆసనముపై కూర్చుండెను. పిదప దొరలెల్ల వారివారికై పెట్టిన పీఠములపై కూర్చుండిరి.

దుఃశాసనః సాత్యకయే దదా వాసన ముత్తమమ్,
వివింశతి ర్దదౌ పీఠం కాఞ్చనం కృతవర్మణే. 47

దుశ్శాసనుడు సాత్యకికి ఉత్తమమగు ఆసన మొసగెను. వివింశతి బంగారుపీటను కృతవర్మకు కూర్చెను.

అవిదూరే తు కృష్ణస్య కర్ణదుర్యోధనా వుభౌ,
ఏకాసనే మహాత్మానౌ నిషీదతు రమర్షణౌ. 48

కృష్ణుని కల్లంతదూరమున ఒక్క పీఠమున మహాత్ములు కర్ణదుర్యోధనులు బిగిమొగములతో కూర్చుండిరి.

గాన్ధారరాజః శకుని ర్గాన్ధారై రభిరక్షితః,
నిషసాదాసనే రాజా సహపుత్రో విశాంపతిః. 49

గాంధారు లందరు చుట్టియుండగా గాంధారరాజు శకుని కొడుకులతోపాటు ఆసనమున కూర్చుండియుండెను.

విదురో మణిపీఠే తు శుక్లస్పర్ధ్యాజినోత్తరే,
సంస్పృశ న్నాసనం శౌరే ర్మహామతి రుపావిశత్. 50

మహామతి విదురుడు శ్రీకృష్ణుడు కూర్చున్న ఆసనమును భక్తితో తాకుచు తెల్లనితోలు పరచిన మణిపీఠము నందు కూర్చుండెను.

చిరస్య దృష్ట్వా దాశార్హం రాజానః సర్వ ఏవ తే,
అమృతస్యేవ నాతృప్యన్ ప్రేక్షమాణా జనార్దనమ్. 51

ఎంతో కాలమునకు కానవచ్చిన జనార్దనుని అమృతమువలె చూచుచున్న రాజు లందరకు తృప్తి తీరకుండెను.

అతసీపుష్పసంకాశః పీతవాసా జనార్దనః,
వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీ వోపహితో మణిః. 53

నల్లని యవిసెపువ్వవలెనుండి పచ్చని వస్త్రము ధరించిన కృష్ణుడు సభామధ్యమున బంగారమున పొదిగిన ఇంద్రనీలమణివలె ప్రకాశించెను.

తత స్తూష్ణీం సర్వ మాసీ ద్గోవిన్దగతమానసమ్,
న తత్ర కశ్చిత్ కిఞ్చిద్వా వ్యాజహార పుమాన్ క్వచిత్. 54

అంత నా సభయంతయు కృష్ణునియందే మనసు పెట్టి మిన్నకుండెను. అచటి నరుడెవ్వడు ఏమాత్రము నోరు మెదపకుండెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణసభాప్రవేశే చతుర్నవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణుడు సభలో ప్రవేశించుట యను తొంబదినాలుగవ అధ్యాయము.

—: o :—

# పఞ్చనవతితమోఽధ్యాయః
# తొంబదియైదవ అధ్యాయము

## కౌరవసభాయాం శ్రీకృష్ణస్య ప్రభావశాలి భాషణమ్
## కౌరవసభలో శ్రీకృష్ణుడు ప్రభావము తోచునట్లు ప్రసంగము చేయుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

తేష్వాసీనేషు సర్వేషు తూష్ణీంభూతేషు రాజసు,
వాక్య మభ్యాదదే కృష్ణః సుదంష్ట్రో దున్దుభిస్వనః. 1

వారందరు కూర్చున్న పిదప రాజులందరు మిన్నకుండగా చక్కని పలువరుసయు, దుందుభినాదమువంటి కంఠధ్వనియు గల శ్రీకృష్ణుడు మాట నందుకొనెను.

జీమూత ఇవ ఘర్మాన్తే సర్వాం సంశ్రావయన్ సభామ్,
ధృతరాష్ట్ర మభిప్రేక్ష్య సమభాషత మాధవః. 2

గ్రీష్మము చివర తోచిన మేఘమువలె కృష్ణుడు సభ యంతటికి వినవచ్చునట్లు ధృతరాష్ట్రుని చక్కగా చూచుచు ఇట్లు పలికెను.

శ్రీభగవా నువాచ - శ్రీభగవంతు డిట్లాడెను.

కురూణాం పాణ్డవానాం చ శమః స్యాదితి భారత,
అప్రణాశేన వీరాణా మేత ద్యాచితు మాగతః. 3

భారతా! వీరుల సర్వనాశనము కాకుండ కౌరవులకు పాండవులకు పొందు కలుగునని దానిని వేడికొనుటకై నీకడకు వచ్చితిని.

రాజన్నన్యం ప్రవక్తవ్యం తవ నైఃశ్రేయసం వచః,
విదితం హ్యేవ తే సర్వం వేదితవ్య మరిందమ. 4

రాజా! శత్రుమర్దనుడా! నీకు మేలు కూర్చు ఒక్కమాట నొక్కి చెప్పవలయును. ఎరుగదగిన దెల్ల నీకు తెలిసినదే.

ఇదం హద్య కులం శ్రేష్ఠం సర్వరాజసు పార్థివ,
శ్రుతవృత్తోపసంపన్నం సర్వైః సముదితం గుణైః. 5

రాజా! ఈ నీ కులము ఇప్పటి రాజకులము లన్నింటిలో పరమోత్తమమైనది. చక్కని తెలివి, మంచి నడవడి యను సంపదలతో అలరారుచున్నది. మంచి గుణము లన్నింటితో ఒప్పారుచున్నది.

కృపానుకమ్పా కారుణ్య మానృశంస్యం చ భారత,
తథార్జవం క్షమా సత్యం కురుష్వేత ద్విశిష్యతే. 6

దయ, జాలి, కరుణ, మెత్తదనము, ఋజుస్వభావము, ఓర్పు, సత్యము, ఇవి కురువంశమువారియందు వన్నె కెక్కినవి.

తస్మి న్నేవంవిధే రాజన్ కులే మహతి తిష్ఠతి,
త్వన్నిమిత్తం విశేషేణ నేహ యుక్త మసామ్ప్రతమ్. 7

అట్టి యీ గొప్ప కులమునందు, ముఖ్యముగా నీవు కారణముగా తగని ధోరణి ఏర్పడుట తగదు.

త్వం హి ధారయితా శ్రేష్ఠః కురూణాం కురుసత్తమ,
మిథ్యా ప్రచరతాం తాత బాహ్యే ష్వాభ్యన్తరేషు చ. 8

---

6 కృపా- పరుల సుఖమునకై యత్నించుట, అనుకమ్పా - పరుల దుఃఖమును చూచి మదిలో కదలిపోవుట; కారుణ్యమ్ - ఇతరుల దుఃఖమును పోగొట్టుటకై ప్రయత్నించుట; అనృశంస్యమ్- పరులకు నొప్పి కలుగనీకుండుట; ఆర్జవమ్ - కల్లకపటములు లేని స్వభావము;

7\. అసామ్ప్రతమ్ - తగని ధోరణి-పైని చెప్పిన కృపాదులకు విరుద్ధమగు పద్ధతి - పరుల దుఃఖమునకై యత్నించుట, పరుల దుఃఖమును చూచి పరమానందమందుట, పరులకు దుఃఖమును గూర్చు మోసములు చేయుట వంటిది; ఇహ - ఈ కులమున; న యుక్తమ్ - తగదు.

8\. బాహ్యేషు - అందరకు వెల్లడియగునట్లు చేసిన జూదము మొదలగు దానియందు; ఆభ్యంతరేషు - గుట్టుగా కావించిన లక్కయిల్లు కాల్చుట మొదలగు వానియందు; మిథ్యా - కపటస్వభావమును; ప్రచరతామ్ - నడపునట్టి.

ఓయి కురుశ్రేష్ఠా! నాయనా! వెలుపల లోపల గోతులు త్రవ్వుచున్న కౌరవు లందరకు నీవే పట్టుగొమ్మ. పెద్దవాడవు.

తే పుత్రా స్తవ కౌరవ్య దుర్యోధనపురోగమాః,
ధర్మార్థౌ పృష్ఠతః కృత్వా ప్రచరన్తి నృశంసవత్. 9

కురువరా! దుర్యోధనుడు మున్నుగాగల నీ కొడుకులు ధర్మమును, అర్థమును వెనుకకు త్రోసిపైచి క్రూరులవలె తిరుగుచున్నారు.

అశిష్టా గతమర్యాదా లోభేన హృతచేతసః,
స్వేషు బన్ధుషు ముఖ్యేషు తద్వేత్థ పురుషర్షభ. 10

నీ వారైన దగ్గర చుట్టముల విషయమున వీరు మంచితనము లేనివారై, హద్దు మీరి, అత్యాశతో చచ్చిన హృదయము గలవారై ప్రవర్తించుచున్నారు. ఇది తెలిసికొనుము.

సేయ మాపన్మహాఘోరా కురుష్వేవ సముత్థితా,
ఉపేక్ష్యమాణా కౌరవ్య పృథివీం ఘాతయిష్యతి. 11

కురువంశమునందు పుట్టిన ఈ మహాఘోరమైన ఆపద ఉపేక్షించినచో భూమి నంతటిని నాశనము చేయును.

శక్యా చేయం శమయితుం న చేద్దిత్ససి భారత,
న దుష్కరో హ్యత్ర శమో మతో మే భరతర్షభ. 12

నీ వీ కులమును ముక్కలు చేయ గోరవేని ఈ ఆపదను రూపుమాపుట సులభమే. భరతశ్రేష్ఠా! ఇచట శాంతి చేకూర్చుట సాధ్యము కాదని నేను అనుకొనను.

---

11. కురుషు - ఏవ - కౌరవులని ప్రముఖముగా పేరొందిన మీయందే. పాండుకుమారులయందు కాదని తాత్పర్యము.

12. న చేత్ దిత్ససి - కులమును ముక్కలు చేయగోరనివాడ వగుదువేని; స్వం చేత్ ఇచ్ఛసి - అనియొక పాఠము. ఆ పక్షమున - నీవై నీవారిని అదుపున పెట్టిగోరుదువేని - శాంతి సాధించుట దుష్కరము కాదని భావము.

త్వయ్యధీనః శమో రాజన్ మయి చైవ విశాంపతే,
పుత్రాన్ స్థాపయ కౌరవ్య స్థాపయిష్యామ్యహం పరాన్. 13

రాజా! శాంతి నీచేతిలో నా చేతిలో నున్నది. నీవు నీ కొడుకులను అదుపులో నుంచుము. నేను నీకు పరులైన పాండవులను నుంచెదను.

ఆజ్ఞా తవ హి రాజేన్ద్ర కార్యా పుత్రైః సహాన్వయైః,
హితం బలవదప్యేషాం తిష్ఠతాం తవ శాసనే. 14

నీ కొడుకులు, వారివెంబడి తిరుగువారును రాజేంద్రా! నీమాటను పాటింపవలయును. నీమాటమీద నిలిచినచో వీరికే మిక్కిలి మేలు.

తవ చైవ హితం రాజన్ పాణ్డవానా మథో హితమ్,
శమే ప్రయతమానస్య మమ శాసనకాఙ్క్షిణః. 15

నీపుత్రులను శాసింపు మని కోరుచు శాంతికై ప్రయత్నించుచున్న నాకు, నీకు, పాండవులకు ఇది హితమైనది.

స్వయం నిష్ఫల మాలక్ష్య సంవిధత్స్వ విశామ్పతే,
సహాయభూతా భరతా స్తవైవ స్యు ర్జనేశ్వర. 16

రాజా! పగ పనికిమాలినదని నీవే గుర్తించి పొందుకూర్చుము. భరతవంశము వారందరు నీకే చేదోడువాదోడుగా నుందురు గదా!

ధర్మార్థయో స్తిష్ఠ రాజన్ పాణ్డవై రభిరక్షితః,
న హి శక్యా స్తథాభూతా యత్నాదపి నరాధిప. 17

రాజా! పాండవులు నిన్ను కాపాడుచుండగా ధర్మమునందును, అర్థమునందును నిలద్రొక్కుకొనుము. నరాధిపా! ఎంత యత్నించినను నీకట్టివారు లభింపరు గదా!

---

14. బలవత్ - మిక్కిలి; ఏషామ్ అపి - ఏషామేవ - వీరికే - ఇచట 'అపి' శబ్దమునకు 'ఏవ' అను నర్థము గ్రహింపవలయును.

15. శాసనకాఙ్క్షిణః - పుత్రులను శాసింపుమని కోరుచున్న;

16. నిష్ఫలమ్ - పగ పనికిమాలినదని భావము; సంవిధత్స్వ - పొందుకూర్చుము;

నహి త్వాం పాణ్డవై ర్జేతుం రక్ష్యమాణం మహాత్మభిః,
ఇన్ద్రోఽపి దేవైః సహితః ప్రసహేత కుతో నృపః 18

మహాత్ములగు పాండవులు రక్షించుచున్న నిన్ను దేవత లందరితో కూడిన ఇంద్రుడును గెలువజాలడు. ఇక నిన్ను ఎదుర్కొను రా జెవ్వడు ?

యత్ర భీష్మశ్చ ద్రోణశ్చ కృపః కర్ణో వివింశతిః,
అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తోఽథ బాహ్లికః. 19

సైన్ధవశ్చ కళిఙ్గశ్చ కామ్బోజశ్చ సుదక్షిణః,
యుధిష్ఠిరో భీమసేనః సవ్యసాచీ యమౌ తథా. 20

సాత్యకిశ్చ మహాతేజా యుయుత్సుశ్చ మహారథః,
కోను తాన్విపరీతాత్మా యుద్ధ్యేత భరతర్షభ. 21

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు వివింశతి, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, సింధురాజు, కలింగరాజు, కాంభోజరాజగు సుదక్షిణుడు, ధర్మరాజు, భీమసేనుడు, అర్జునుడు, నకుల సహదేవులు, గొప్పతేజస్సు గల సాత్యకి, మహారథుడగు యుయుత్సుడు అనువా రున్నచోట వారితో తలపడు మతిచెడినవా డెవ్వడు ?

లోకస్యేశ్వరతాం భూయః శత్రుభి శ్చాప్యధృష్యతామ్,
ప్రాప్స్యసి త్వ మమిత్రఘ్న సహితః కురుపాణ్డవైః. 22

నీవు కౌరవులతో పాండవులతో కూడి, పగవారిని పరిమార్చుచు, ఎల్ల లోకమునకు ప్రభువవు, శత్రువులకు తేరిపార జూడరానివాడవు అగుదువు.

తస్య తే పృథివీపాలా స్త్వత్సమాః పృథివీపతే,
శ్రేయాంసశ్చైవ రాజానః సన్ధాస్యన్తే పరంతప. 23

రాజా! అట్టి నీకు, నీతో సాటివచ్చు రాజులు, నిన్ను మించిన రాజులు - మిత్రము లగుదురు.

---

23. సన్ధాస్యన్తే - పాండవులతోపాటు అందరు నిన్ను కలసికొందురు.

స త్వం పుత్రైశ్చ పౌత్రైశ్చ పితృభి ర్భ్రాతృభి స్తథా,
సుహృద్భిః సర్వతో గుప్తః సుఖం శక్ష్యతి జీవితుమ్. 24

అట్టి నీవు కొడుకులు, మనుమలు, తండ్రి వరుసవారు, అన్నదమ్ములు, మిత్రులు అన్ని వైపుల రక్షించుచుండగా సుఖముగా బ్రదుకజాలుదువు.

ఏతానేవ పురోధాయ సత్కృత్య చ యథా పురా,
అఖిలాం భోక్ష్యసే సర్వాం పృథివీం పృథివీపతే. 25

రాజా! వీరిని, మునుపటివలె, ముందిడుకొని, మన్నించినచో పగవాడులేని భూమినంతటిని అనుభవింపగలవు.

ఏతై ర్హి సహితైః సర్వైః పాణ్డవైః స్వైశ్చ భారత!
అన్యా న్విజేష్యసే శత్రూనేష స్వార్థ స్తవాఖిలః. 26

పాండుకుమారు లందరితో నీవారితో కూడిన నీవు ఎట్టి శత్రువులనైన గెలువగలవు. ఇట్లిది యెల్ల నీ మంచికే యగును.

తై రేవోపార్జితాం భూమిం భోక్ష్యసే చ పరంతప,
యది సంపత్స్యసే పుత్రైః సహామాత్యై ర్నరాధిప. 27

నీవు నీ కొడుకులే యగు పాండవులతో వారి సన్నిహితులతో కూడి యుందువేని వారే సంపాదించి పెట్టిన భూమినంతటిని అనుభవింతువు.

సంయుగే వై మహారాజ దృశ్యతే సుమహాన్ క్షయః,
క్షయే చోభయతో రాజన్ కం ధర్మ మనుపశ్యసి. 28

అట్లుగాక యుద్ధమే కలిగినచో, మహారాజా! గొప్ప వినాశము కానవచ్చుచున్నది. రెండువైపుల నెవరికి వినాశము కలిగినను నీవు సాధించు ధర్మ మేమి?

పాణ్డవై ర్నిహతైః సఙ్ఖ్యే పుత్రైర్వాపి మహాబలైః,
యద్విన్దేథాః సుఖం రాజం స్తద్బ్రూహి భరతర్షభ. 29

యుద్ధమున గొప్పబలముగల పాండవులో నీ కొడుకులో చత్తురు. దాని వలన నీవు బొందుకొను సుఖమేదో చెప్పవయ్యా మహారాజా!

---

25. అఖిలామ్ - నిష్కంటకమైన - బాధించువాడు లేని;

శూరా శ్చ హి కృతాస్త్రాశ్చ సర్వే యుద్ధాభికాఙ్క్షిణః,
పాణ్డవా స్తావకాశ్చైవ తాన్రక్ష మహతో భయాత్. 30

అటు పాండవులును, ఇటు నీవారును శూరులు. అస్త్రవిద్యలో ఆరితేరిన వారు. కయ్యమునకై కాలుదువ్వుచున్నవారు. రానున్న మహాభయమునుండి వారిని కాపాడుము.

న పశ్యేమ కురూన్ సర్వాన్ పాణ్డవాంశ్చైవ సంయుగే,
క్షీణా నుభయతః శూరాన్ రథినో రథిభి ర్హతాన్. 31

యుద్ధమున రెండు వైపులనున్న రథికులు రథికులను పట్టుపెట్టగా నిటు కౌరవులనుగాని, అటు పాండవులనుగాని మొత్తముగా చూడము.

సమవేతాః పృథివ్యాం హి రాజానో రాజసత్తమ,
అమర్షవశమాపన్నా నాశయేయు రిమాః ప్రజాః. 32

రాజవరేణ్యా ! నేలపై గల రాజులందరు ఒక్కచోటున చేరి కోపమునకు వశులై ఈ ప్రజల నందరను చంపుదురు !

త్రాహి రాజన్నిమం లోకం న నశ్యేయు రిమాః ప్రజాః,
త్వయి ప్రకృతి మాపన్నే శేషః స్యాత్ కురునన్దన. 33

రాజా ! ఈ లోకమును కాపాడవయ్యా ! నీవు మంచితనము పొందినచో ఈ నీ బిడ్డలందరు చావకుందురు. లోకము మిగులును.

శుక్లా వదాన్యా హ్రీమన్త ఆర్యాః పుణ్యాభిజాతయః,
అన్యోన్యసచివా రాజం స్తాన్ పాహి మహతో భయాత్. 34

నీ పుత్రులు మచ్చలేనివారు. మాట పొందికతనము కలవారు. పాడు పనులకు సిగ్గుపడుదురు. శ్రేష్ఠమగు నడవడి కలవారు. పుణ్యము పండి పుట్టిన వారు. ఒకరికొకరు మేలు చేసికొందురు. రాజా ! వారి నందరిని ఈ పెను భయమునుండి కాపాడుము.

శివేనేమే భూమిపాలాః సమాగమ్య పరస్పరమ్,
సహ భుక్త్వా చ పీత్వా చ ప్రతియాన్తు యథాగృహమ్. 35

34. ఈ శ్లోకమున చెప్పిన లక్షణము లన్నియు పాండవులకు వర్తించును.

ఈ వచ్చిన రాజులంద రొకరి నొకరు కలిసికొని, సుఖ మంది, కలసి అన్నము తిని, పానీయములు త్రావి ఎవరి యిండ్లకు వా రరుగుదురు గాక!

సువాససః స్రగ్విణశ్చ సత్కృతా భరతర్షభ,
అమర్షం చ నిరాకృత్య వైరాణి చ పరంతప. 36

నీవు సత్కరింపగా చక్కని వస్త్రములు ధరించి పూలమాలలు పెట్టుకొని కోపము త్రోసివైచి, పగను రూపుమాపి యిండ్లకు తిరిగి పోవుదురుగాక!

హార్దం యత్ పాణ్డవేష్వాసీత్ ప్రాప్తేఽస్మి న్నాయుషః క్షయే,
తదేవ తే భవత్వద్య సంధత్స్వ భరతర్షభ. 37

నీ కీ పాండవులు పసివారుగా నున్నపు డెట్టి ప్రీతి యుండెడిదో యిప్పుడు చావుమూడిన కాలమున అదే ఏర్పడుగాక! కొడుకులను కొడుకులతో కలుపుము

బాలా విహీనాః పిత్రా తే త్వయైవ పరివర్ధితాః,
తాన్ పాలయ యథాన్యాయం పుత్రాంశ్చ భరతర్షభ. 38

పసివారు, తండ్రిలేనివారు, నీవే వారిని పెంచి పెద్ద చేసితివి. అట్టి ఆ కొడుకులను గూడ న్యాయము తప్పక పాలింపుము.

భవతైవ హి రక్ష్యా స్తే వ్యసనేషు విశేషతః,
మా తే ధర్మ స్తథైవార్థో నశ్యేత భరతర్షభ. 39

ముఖ్యముగా కష్టములలో నీవే వారి నాదుకొనవలయును. భరతశ్రేష్ఠా! నీయెడ ధర్మము, అర్థము చెడిపోకుండును గాక!

ఆహు స్త్వాం పాణ్డవా రాజ న్నభివాద్య ప్రసాద్య చ,
భవతః శాసనా ద్దుఃఖ మనుభూతం సహానుగైః. 40

పాండవులు నీకు మ్రొక్కి నీమదిలోని కలత దీర్చి యి ట్లనుచున్నారు: 'రాజా! నీమాటపై మేము మావారితోపాటు పడరాని పాట్లు పడితిమి'.

ద్వాదశేమాని వర్షాణి వనే నిర్వ్యుషితాని నః,
త్రయోదశం తథాజ్ఞాతైః సజనే పరివత్సరమ్. 41

'పండ్రెండేండ్లు మాకు అడవులలో గడచిపోయినవి. మిగిలిన పదుమూడవ యే డెవరికి తెలియరాకుండ జనులలో గడపితిమి'

స్థితా నః సమయే తస్మిన్ పితేతి కృతనిశ్చయాః,
నాహాస్మ సమయం తాత తచ్చ నో బ్రాహ్మణా విదుః. 42

'మాతండ్రి అన్నమాటపై నిలబడునని గట్టిగా నమ్మి మేము మాట తప్ప కుంటిమి. ఆ మా సంగతి బ్రహ్మవేత్త లెరుగుదురు'.

ధర్మజ్ఞేషు సభాసత్సు నేహ యుక్త మసాంప్రతమ్,
యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం హతా స్తత్ర సభాసదః. 48

ధర్మ మెరిగిన సభాసదు లుండగా ఇట్టి పాడుపని తగదు. ధర్మము అధర్మముచేతను, సత్యము అసత్యముచేతను చచ్చుచుండగా చూచుచు ఊరకున్న సభాసదులకే అది చేటు.

విద్ధో ధర్మో హ్యధర్మేణ సభాం యత్ర ప్రపద్యతే,
న చాస్య శల్యం కృన్తన్తి విద్ధా స్తత్ర సభాసదః. 49
ధర్మ ఏతా నారుజతి యథా నద్యనుకూలజాన్. 50

ధర్మము, అధర్మముతో దెబ్బ తిని సభలోనికి ప్రవేశించినపుడు దాని ముల్లు పెకలింపని సభాసదులే దెబ్బతిందురు. అట్టి వారిని ధర్మమే, ఒడ్డున పుట్టిన చెట్లను నది పెకలించివేసినట్లు పెకలించి వేయును.

యే ధర్మ మనుపశ్యన్త స్తూష్ణీం ధ్యాయన్త ఆసతే,
తే సత్య మాహు ర్ధర్మ్యం చ న్యాయ్యం చ భరతర్షభ. 51

ధర్మమునే వదలక పరికించుచు, దానినే ధ్యానించుచు కాలముగడుపు వారు సత్యమును, ధర్మబద్ధమైనదానిని, న్యాయము తప్పనిదానిని పలుకుదురు.

---

50. అస్య - ధర్మము యొక్క; శల్యమ్ - ముంటిని; న కృన్తన్తి - పెకలించరు (ఎవరు తీసివేయరో వారు అని భావము).

51. ఈ శ్లోకమునుండి మరల కృష్ణుని స్వవాక్యములు - 40 వ శ్లోకము మొదలుకొని 50 వ శ్లోకము వరకు పాండవుల వాక్యములను శ్రీకృష్ణు డనువదించెను. యే -ఏ పాండవులు - ధర్మమును నిలబెట్టదలచి; తూష్ణీ మాసన్ - మిన్నకున్నారో వారి మాట ధర్మబద్ధము, న్యాయ సహితము, సత్యము అని భావము.

శక్యం కిమన్య ద్వక్తుం తే దానా దన్య జ్జనేశ్వర,
బ్రువన్తు తే మహీపాలాః సభాయాం యే సమాసతే. 52

జనాధిపా! రాజ్య మిత్తు ననుటకన్న మరియొకటి నీవేమి పలుకగలవు? ఈ సభలో కూర్చున్న రాజులను చెప్పమనుము.

ధర్మార్థౌ సంప్రధార్యైవ యది సత్యం బ్రవీమ్యహమ్,
ప్రముఞ్చేమాన్ మృత్యుపాశాత్ క్షత్రియాన్ పురుషర్షభ. 53

నేను ధర్మార్థములను చక్కగా పట్టుకొని సత్యము పలుకుదునని నీవు నమ్మినచో ఆ క్షత్రియుల నందరను మృత్యుపాశమునుండి తప్పింపుము.

ప్రశామ్య భరతశ్రేష్ఠ మా మన్యువశ మన్వగాః,
పిత్ర్యం తేభ్యః ప్రదాయాంశం పాణ్డవేభ్యో యథోచితమ్. 54

భరతశ్రేష్ఠుడా! శాంతి నొందుము. పనికిమాలిన పట్టుదలను బట్టి పోకుము. ఆ పాండవులకు వారితండ్రి పాలు తగుమాత్రముగానైన నిమ్ము.

తతః సపుత్రః సిద్ధార్థో భుఙ్క్ష్వ భోగాన్ పరంతప.

అటుపై కొడుకులతోపాటు ప్రయోజనము నెరవేరినవాడవై సుఖము లనుభవింపుము.

అజాతశత్రుం జానీషే స్థితం ధర్మే సతాం సదా, 55
సపుత్రే త్వయి వృత్తిం చ వర్తతే యాం నరాధిప,
దాహితశ్చ నిరస్తశ్చ త్వామే వోపాశ్రితః పునః. 56

పగయేమో యెరుగని ఆ ధర్మరాజు, సజ్జనుల ధర్మమున నెల్లవేళల నెట్లు నిలిచియుండునో నీయందు నీ కొడుకులయందు ఎట్టి తీరున మెలగెనో నీవు బాగుగా నెరుగుదువు. కొంపకు నిప్పుపెట్టినను, నిలువనీడ లేకుండ చేసినను మరల ఆతడు నిన్నే ఆశ్రయించుకొని యున్నాడు.

ఇన్ద్రప్రస్థం త్వయై వాసౌ సపుత్రేణ వివాసితః,
స తత్ర నివసన్ సర్వాన్ వశమానీయ పార్థివాన్, 57
త్వన్ముఖా నకరో ద్రాజన్ న చ త్వా మత్యవర్తత.

---

56. దాహితః - కాల్చబడినవాడు - లక్కయింట,
నిరస్తః - త్రోసివేయబడినవాడు - ద్యూతమున,

కొడుకులతోపాటు నీవే యాతనిని ఇంద్రప్రస్థమునకు త్రోసివైచితివి. అత దందు నివసించుచు రాజుల నందరను వశము చేసికొని వారిని నీవైపు త్రిప్పెనే కాని నిన్ను కాదనలేదు.

తస్యైవం వర్తమానస్య సౌబలేన జిహీర్షతా,
రాష్ట్రాణి ధనధాన్యం చ ప్రయుక్తః పరమోపధిః. 58

అత డట్లు తన బ్రదుకు తాను బ్రదుకుచుండగా అతని రాష్ట్రములు ధన ధాన్యములు కొల్లగొట్టుటకై నీవు శకునితో గొప్ప వంచనను ప్రయోగించితివి.

స తామవస్థాం సంప్రాప్య కృష్ణాం ప్రేక్ష్య సభాగతామ్,
క్షత్రధర్మా దమేయాత్మా నాకమ్పత యుధిష్ఠిరః. 59

అంతటి అవస్థ పొందియు కృష్ణను నిండుసభలోనికి ఈడ్చుకొనిరాగా చూచియు, దొడ్డబుద్ధి గల ధర్మరాజు క్షత్రియధర్మమునుండి అవంతయు కదలలేదు.

అహం తు తవ తేషాం చ శ్రేయ ఇచ్ఛామి భారత,
ధర్మా దర్థాత్ సుఖాచ్చైవ మా రాజ న్నీనశః ప్రజాః. 60
అనర్థ మర్థం మన్వానోఽ ప్యర్థం చానర్థ మాత్మనః. 61

రాజా! నేను మాత్రము నీకు, వారికిని శ్రేయమే కోరుచున్నాను. నీకు కీడైనది మేలుగా, మేలైనది కీడుగా తలపోయుచు ధర్మమునుండియు, అర్థము నుండియు, సుఖము నుండియు ప్రజలను భ్రష్టులను చేయకుము.

లోభేఽ తిప్రసృతాన్ పుత్రా న్నిగృహ్ణీష్వ విశాంపతే,
స్థితాః శుశ్రూషితుం పార్థాః స్థితా యోద్ధు మరిన్దమాః,
యత్తే పథ్యతమం రాజం స్తస్మిం స్తిష్ఠ పరంతప. 62

లోభమున చాలదూరము పోయిన నీ కొడుకులకు కళ్ళెము వేయుము. ఆ కుంతి కొడుకులును నిన్ను సేవించుటకు సిద్ధముగా నున్నారు. యుద్ధము చేయుటకును పూనియున్నారు. నీకేది మిక్కిలి హితమో దానియందు నిలబడుము.

---

59. పరమోపధిః - పెద్ద వంచన.
60. అమేయా+ఆత్మా - ఊహింపనలవికాని ఓర్పుగలవాడని తాత్పర్యము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తద్వాక్యం పార్థివాః సర్వే హృదయైః సమపూజయన్,
న తత్ర కశ్చి ద్వక్తుం హి వాచం ప్రక్రామ దగ్రతః. 63

అట నున్న రాజు లందరు ఆ మాటను మనసులలో గొప్పగా మెచ్చుకొనిరి. అచట నోరు విప్పుటకు ఒక్కడును ముందుకు రాలేదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణవాక్యే పఞ్చనవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణవాక్యము గల తొంబదియైదవ అధ్యాయము.

—: o :—

# షణ్ణవతితమో௨ధ్యాయః
## తొంబదియారవ అధ్యాయము

పరశురామేణ దమ్భోద్భవకథాముఖేన నరనారాయణరూపయోః
కృష్ణయో ర్మాహాత్మ్యస్య వర్ణనమ్.

పరశురాముడు దంభోద్భవకథ ద్వారమున
నరనారాయణరూపులగు కృష్ణుల మహిమను వర్ణించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్మి న్నభిహితే వాక్యే కేశవేన మహాత్మనా,
స్తిమితా హృష్టరోమాణ శ్చాసన్ సర్వే సభాసదః. 1

మహాత్ముడగు కేశవుడట్లు పలుకగా సభలో నున్న వారందరు పులకరింతలు కలవారైరి.

కశ్చి దుత్తర మేతేషాం వక్తుం నోత్సహతే పుమాన్,
ఇతి సర్వే మనోభి స్తే చిన్తయన్తి స్మ పార్థివాః. 2

'వీరిలో ఒక్క మగవాడును బదులు పలుక నొల్లడు' అని ఆ రాజులందరు మనసులలో తలపోసిరి.

తథా తేషు చ సర్వేషు తూష్ణీంభూతేషు రాజసు.
జామదగ్న్య ఇదం వాక్య మబ్రవీత్ కురుసంసది. 3

ఇట్లు వారందరు నోరు మెదపకుండగా జమదగ్ని కుమారుడు పరశురాముడిట్లు కురుసభలో పలుకజొచ్చెను :

ఇమాం మే సోపమాం వాచం శృణు సత్యా మశఙ్కితః,
తాం శ్రుత్వా శ్రేయ ఆదత్స్వ యది సాధ్వీతి మన్యసే. 4

రాజా! నేను దృష్టాంతరూపముగా చెప్పు సత్యమగు వాక్కును, శంక వీడి యాలకింపుము. అది విని మంచిదని తలంతువేని మేలు పొందుము.

రాజా దమ్భోద్భవో నామ సార్వభౌమః పురాభవత్,
అఖిలాం బుభుజే సర్వాం పృథివీమితి నః శ్రుతమ్. 5

పూర్వము దంభోద్భవు డను సార్వభౌము డొక డుండెను. అతడు భూమినెల్ల నిష్కంటకముగా అనుభవించెనని వినియుంటిమి.

స స్మ నిత్యం నిశాపాయే ప్రాతరుత్థాయ వీర్యవాన్,
బ్రాహ్మణాన్ క్షత్రియాంశ్చైవ పృచ్ఛన్నాస్తే మహారథః. 6

ఆ మహారథుడు ప్రతిదినము ఉదయమున నిద్ర లేచి బ్రాహ్మణులను, క్షత్రియులను అడుగుచుండెడివాడట!

అస్తి కశ్చి ద్విశిష్టో వా మద్విధో వా భవేద్యుధి,
శూద్రో వైశ్యః క్షత్రియో వా బ్రాహ్మణో వాఽపి శస్త్రభృత్. 7

'యుద్ధమున నన్ను మించువాడు కాని, నావంటివాడు గాని శూద్రుడో, వైశ్యుడో, క్షత్రియుడో, బ్రాహ్మణుడో ఆయుధము పట్టినవాడు గలడా?

ఇతి బ్రువ న్నన్వచరత్ స రాజా పృథివీ మిమామ్,
దర్పేణ మహతా మత్తః కఞ్చి దన్య మచిన్తయన్. 8

పొగరెక్కిన ఆ రాజు మరియొక చింతనలేక ఇట్లడుగుచు పెనుగర్వమున భూమి యంతయు తిరుగుచుండెను.

తం చ వైద్యా అకృపణా బ్రాహ్మణాః సర్వతోఽభయాః,
ప్రత్యషేధ న్త రాజానం శ్లాఘమానం పునః పునః. 9

విద్యలలో ఆరితేరినవారు, దీనత యెరుగనివారు, ఎందును భయము లేనివారు నగు బ్రాహ్మణులు అట్లు తన్ను దాను పొగడుకొను అతనిని మాటిమాటికి ఇది తగదని వారించిరి.

నిషిధ్యమానోఽప్యసకృత్ పృచ్ఛత్యేవ స వై ద్విజాన్,
అతిమానం శ్రియా మత్తం తమూచు ర్బ్రాహ్మణా స్తదా. 10

9. వైద్యాః- విద్యలలో ఆరితేరినవారు; అకృపణాః- దీనభావము లేనివారు - తమ అభిప్రాయమును నిర్భయముగా చెప్పగలిగినవారని తాత్పర్యము.

తపస్వినో మహాత్మానో వేదప్రత్యయదర్శినః,
ఉదీర్యమాణం రాజానం క్రోధదీప్తా ద్విజాతయః. 11

ఎన్ని మారులు తగదని చెప్పినను ఆతడు బ్రాహ్మణుల నడుగుచునే యుండెను. అపుడు బ్రాహ్మణులు మితిమీరిన మిడిసిపాటు గలవాడును, సంపదతో ఒడలెరుగనివాడును, పెచ్చుపెరిగి పోవుచున్నవాడును అగు ఆ రాజుతో క్రోధముతో మండిపడినవారు, తాపసులు, మహాత్ములు, వేదము ప్రతిపాదించిన బ్రహ్మ మొక్కటే సత్యమను తత్త్వమునే చూచు స్వభావముగలవారును అగు బ్రాహ్మణులు ఇట్లు పలికిరి.

అనేకజయినౌ సంఖ్యే యౌ వై పురుషసత్తమౌ,
తయో స్త్వం న సమో రాజన్ భవితాసి కదాచన. 12

రాజా ! యుద్ధమున పెక్కుజయములు పొందిన పురుషోత్తము లిరువురు కలరు. వారితో నీ వెన్నటికి సాటి రావు.

ఏవ ముక్తః స రాజా తు పునః ప్రపచ్ఛ తాన్ ద్విజాన్,
క్వ తౌ వీరౌ క్వజన్మానౌ కింకర్మాణౌ చ కౌ చ తౌ. 13

వారట్లు పలుకగా ఊరకుండక ఆ రాజు మరల ఆ బ్రాహ్మణులను 'వా రెక్కడః ఎక్కడ పుట్టిరిః ఏమి చేయుదురుః వా రెవ్వరుః అని యడిగెను'.

బ్రాహ్మణా ఊచుః - బ్రాహ్మణు లిట్లు పలికిరి.

నరో నారాయణ శ్చైవ తాపసా వితి నః శ్రుతమ్,
ఆయాతౌ మానుషే లోకే తాభ్యాం యుధ్యస్వ పార్థివ. 14

వారు నరనారాయణులను తాపసులని మేము విని యుంటిమి. వారు నరలోకమునకు వచ్చియుండిరట. రాజా! వారితో పోరుము'

శ్రూయేతే తౌ మహాత్మానౌ నరనారాయణా వుభౌ,
తపో ఘోర మనిర్దేశ్యం తప్యేతే గన్ధమాదనే. 15

---

11. వేదప్రత్యయదర్శినః - వేదమువలన పుట్టిన జ్ఞానము - బ్రహ్మము. జీవాత్మ యొక్కటే అనునది- దానినే దర్శించుట శీలముగా గలవారు ఉదీర్యమాణమ్ - రెచ్చిపోవుచున్న;
15. తప్యతే - వారిచేత తపము చేయబడినది.

ఆ నరనారాయణులను మహాత్ము లిరువురును గంధమాదన పర్వతమున నిట్టిదని చెప్పరాని ఘోరమగు తపము చేయుచున్నా రని వినవచ్చుచున్నది.

స రాజా మహతీం సేనాం యోజయిత్వా షడఙ్గినీమ్,
అమృష్యమాణః సంప్రాయా ద్యత్ర తావపరాజితౌ. 16

అంత నా రాజు దానిని సహింపక ఆరు అంగములు గల గొప్పసేనను సమకూర్చుకొని, ఓటమి యెరుగని ఆ మహాత్ము లున్నచోటికి బయలుదేరెను.

స గత్వా విషమం ఘోరం పర్వతం గన్ధమాదనమ్,
మార్గమాణోఽన్వగచ్ఛ త్తౌ తాపసౌ వన మాశ్రితౌ. 17

అట్లతడు అడవి బట్టిన ఆ తాపసులను వెదకుచు ఎగుడు దిగుళ్ళతో ఘోరముగా నున్న గంధమాదనపర్వతము చేరుకొనెను.

తౌ దృష్ట్వా క్షుత్పిపాసాభ్యాం కృశౌ ధమనిస న్తతౌ,
శీతవాతాతపైశ్చైవ కర్శితౌ పురుషోత్తమౌ, 18
అభిగమ్యోపసంగృహ్య పర్యపృచ్ఛ దనామయమ్.

ఆకలిదప్పులతో చిక్కి శల్యమైనవారు; పెలి కుబికిన నరములు కలవారు, చలి, గాలి, ఎండలచేత ఎండిపోయిన వారు అగు ఆ పురుషోత్తములను చూచి మెల్లగా వారి దరిజేరి అడుగులంటి కుశల మడిగెను.

త మర్చిత్వా మూలఫలై రాసనే నోదకేన చ,
న్యమన్త్రయేతాం రాజానం కిం కార్యం క్రియతా మితి, 19
తతస్తా మానుపూర్వీం స పునరే వాన్వకీర్తయత్. 20

ఆ తాపసులు ఆతనికి దుంపలు, పండ్లు, ఆసనము, నీరు ఒసగి మన్నించి మేము నీకేమి చేయవలయునని యడిగిరి. అంత నాతడు తన పాతపాటనే మరల వల్లించెను.

---

16. షడఙ్గినీమ్ - ఆరు అంగములు గలదానిని - ఆ ఆరు :
1) రథములు 2) ఏనుగులు 3) గుఱ్ఱములు
4) కాల్బలము 5) బండ్లు 6) ఒంటెలు.

18. ఉపసంగృహ్య - అడుగు లంటి.

బాహుభ్యాం మే జితా భూమి ర్నిహతాః సర్వశత్రవః,
భవద్భ్యాం యుద్ధ మాకాంక్ష న్నుపయాతోఽస్మి పర్వతమ్. 21

నేను నా భుజబలముతో భూమి నంతటిని గెలిచితిని. పగవారి నందరిని పరిమార్చితిని. మీతో పోరాడగోరి యీ పర్వతము కడకు వచ్చితిని.

ఆతిథ్యం దీయతా మేతత్ కాంక్షితం మే చిరం ప్రతి.

'ఇది నా చిరకాలవాంఛ. నాకీ అతిథ్య మొసగుడు.'

నరనారాయణా వూచతుః - నరనారాయణు లిట్లనిరి.

అపేతక్రోధలోభోఽయ మాశ్రమో రాజసత్తమ,
న హ్యస్మి న్నాశ్రమే యుద్ధం కుతః శస్త్రం కుతోఽనృజుః. 22
అన్యత్ర యుద్ధ మాకాంక్ష బహవః క్షత్రియాః క్షితౌ. 23

ఓయి దొడ్డరేడా! ఈ ఆశ్రమము క్రోధము, లోభములేనిది. ఈ ఆశ్రమమున యుద్ధ మెక్కడ? ఆయుధ మెక్కడ? క్రూరస్వభావ మెక్కడ? మరియొక చోట పోరునకు పొమ్ము - భూమిపై క్షత్రియులు చాలమంది కలరు.

రామ ఉవాచ - పరశురాము డిట్లు చెప్పెను.

ఉచ్యమాన స్తథాఽపి స్మ భూయ ఏవాభ్యభాషత,
పునః పునః క్షమ్యమాణః సాన్త్వమానశ్చ భారత. 24

వారట్లు మరల మరల క్షమించుచు, బ్రతిమాలుచు పలుకుచున్నను మరల నత డదే యడుగజొచ్చెను.

దమ్భోద్భవో యుద్ధ మిచ్ఛ న్నాహ్వయత్యేవ తాపసౌ.

దంభోద్భవుడు పోరాడ గోరుచు తాపసులను కవ్వించుచునే యుండెను.

తతో నర స్త్విషీకాణాం ముష్టి మాదాయ భారత, 25
అబ్రవీ దేహి యుధ్యస్వ యుద్ధకాముక క్షత్రియ.
సర్వశస్త్రాణి చాదత్స్వ యోజయస్వ చ వాహినీమ్, 26
అహం హి తే వినేష్యామి యుద్ధశ్రద్ధా మితః పరమ్.

అంత నరుడు గడ్డిపరకలు పిడికెడు చేతగొని యిట్లు పలికెను; రా! పోరు! పోరుతీటగల ఓ క్షత్రియుడా! నీ ఆయుధము లన్నింటిని గొనిరా; సేనను సిద్ధము చేయుము. ఇటుపై నీకు పోరుతీట మాపివైచెదను.

దమ్భోద్భవ ఉవాచ - దంభోద్భవుడు ఇట్లు పలికెను.

యద్యేత దస్త్ర మస్మాసు యుక్తం తాపస మన్యసే, 27
ఏతేనాపి త్వయా యోత్స్యే యుద్ధార్థీ హ్యహ మాగతః.

తాపసా! ఈ అస్త్రమే మాయందు తగినదని నీవు తలచినచో దీనితోడనే నీతో పోరెదను. నేను యుద్ధము కోరికదా వచ్చితిని'

రామ ఉవాచ - రాము డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా శరవర్షేణ సర్వతః సమవాకిరత్, 28
దమ్భోద్భవ స్తాపసం తం జిఘాంసుం సహ సైనికః.

దంభోద్భవు డిట్లు పలికి ఆతాపసుని చంపగోరినవాడై తన సైనికులతో పాటు ఆతనిపై ఎల్లయెడల అమ్ములవాన కురిపించెను.

తస్య తా నస్యతో ఘోరా నిషూన్ వరతనుచ్ఛిదః, 29
కదర్థీకృత్య స ముని రిషీకాభిః సమార్పయత్.

పరుల యొడళ్ళు చీల్చివైచెడు వాడి ములుకులను వాడట్లు గుప్పించు చుండగా ఆముని వానిని సరకు సేయక గడ్డి పరకలతో రూపు మాపెను.

తతోఽస్మై ప్రాసృజ ద్ఘోర మైషీక మపరాజితః, 30
అస్త్ర మప్రతిసన్ధేయం తదద్భుత మివాభవత్.

అంత నా జయశాలి నరుడు వానిపై తిరుగులేని ఘోరమగు ఐషీకాస్త్రము విసరెను. అది అచ్చెరువు గొల్పెను.

తేషా మక్షీణి కర్ణాంశ్చ నాసికాశ్చైవ మాయయా, 31
నిమిత్తవేధీ స ముని రిషీకాభిః సమార్పయత్.

గురుచూసి కొట్టెడు ఆముని వారల కన్నులను, చెవులను, ముక్కులను మాయతో గడ్డిపరకలచేత రూపుమాపెను.

స దృష్ట్వా శ్వేత మాకాశ మిషీకాభిః సమాచితమ్, 32
పాదయో ర్న్యపత ద్రాజా స్వస్తి మేఽస్త్వితి చాబ్రవీత్.

ముంజగడ్డి పరకలు పరచుకొని తెల్లగానైన ఆకాశమును గాంచి ఆరాజు ఆమునికాళ్ళపై వ్రాలెను. నాకు శుభముగుగాక! యనియు పలికెను.

తమబ్రవీ న్నరో రాజన్ శరణ్యం శరణైషిణామ్, 33
బ్రహ్మణ్యో భవ ధర్మాత్మా మా చ స్మైవం పునః కృథాః.

శరణువేడువారికి శరణ మొసగెడు ఆ నరుడు అతనితో నిట్లు పలికెను: రాజా! బ్రహ్మమునందు నిష్ఠ గలవాడ వగుము. ధర్మబుద్ధి కలవాడ వగుము. మరియొకమా రిట్లు చేయకుము.'

నైతాదృక్ పురుషో రాజన్ క్షత్రధర్మ మనుస్మరన్, 34
మనసా నృపశార్దూల భవేత్ పరపురఞ్జయః.
మా చ దర్పసమావిష్టః క్షేప్సీః కాంశ్చిత్ కథఞ్చన. 35

ఇటువంటి మానవుడు క్షత్రియధర్మమును మనసున నెల్లవేళల స్మరించుచు ఇతరుల పురములను గెలువజూడరాదు. నిలువెల్ల పొగరు క్రమ్ముకొన్నవాడవై ఎప్పుడు ఎవ్వరిని చులకన చేయకుము.

అల్పీయాంసం విశిష్టం వా తత్తే రాజన్ సమాహితమ్,
కృతప్రజ్ఞో వీతలోభో నిరహంకార ఆత్మవాన్. 36
దాన్తః క్షాన్తో మృదుః సౌమ్యః ప్రజాః పాలయ పార్థివ,
మా స్మ భూయః క్షిపేః కఞ్చి దవిదిత్వా బలాబలమ్. 37

రాజా! అవలివాడు నీకంటె తక్కువవాడే కానిమ్ము. గొప్పవాడే కానిమ్ము. అది నీకు సమానమే యగుగాక: తెలివి గలిగి, లోభ ముడిగి, అహంకారము వదలి. బుద్ధి గలిగి నిగ్రహము, ఓర్పు కలవాడవై, మృదుస్వభావముతో ప్రసన్నుడవై ప్రజలను పాలింపుము. మరల ఎప్పుడును బలాబలములు తెలియక ఎవనిని చులకన చేయకుము.

అనుజ్ఞాతః స్వస్తి గచ్ఛ మైవం భూయః సమాచరేః,
కుశలం బ్రాహ్మణాన్ పృచ్ఛే రావయో ర్వచనాద్ భృశమ్. 39

అనుమతించితిమి. మేలు. పోయి రమ్ము. తిరిగి యిట్లు ప్రవర్తింపకుము. మా మాటగా బ్రహ్మజ్ఞానసంపన్నులను కుశల మడుగుము.

సుమహచ్చాపి తత్కర్మ యన్నరేణ కృతం పురా,
తతో గుణైః సుబహుభిః శ్రేష్ఠో నారాయణోఽభవత్. 40

మున్ను నరఋషి గావించిన ఆ పని మిక్కిలి ఘనమైనది. ఇక నారాయణు డంతకంటె ఎన్నో రెట్లు మిన్న.

తస్మా ద్యావ ద్ధనుః శ్రేష్ఠే గాణ్డీవేఽస్త్రం న యుజ్యతే,
తావ త్త్వం మాన ముత్సృజ్య గచ్ఛ రాజన్ ధనఞ్జయమ్. 41

కావున రాజా! మిక్కిలి గొప్పది యగు గాండీవమును వింటియందు అస్త్రము కూర్పకమున్నే నీవు బిగింపు వదలి ధనంజయుని చేరుకొనుము.

కాకుదీకం శుకం నాక మక్షిస న్తర్జనం తథా,
సన్తానం న ర్తకం ఘోర మాస్య మోదక మష్టమమ్. 42

కాకుదీకము, శుకము, నాకము, అక్షి సంతర్జనము, సంతానము, నర్తకము, ఘోరము, ఆస్యమోదకము అని అస్త్రజాతు లెనిమిది.

---

42. ఈ శ్లోకమున ఎనిమిది విధములగు అస్త్రముల జాతులను చెప్పుచున్నారు. 1. కాకుదీకము - దీనితో కొట్టినచో రథము నొగలలో, ఏనుగు మూపుపై వీరు లట్లే పడియుందురు - దీనిని ప్రస్వాపన మనియు నందురు; 2. శుకము - దీనిని ప్రయోగించినపుడు వీరులు భయము లేనిచోట భయము పొందుచు గుఱ్ఱముల ఏనుగుల కాళ్ళకు చుట్టుకొని పోవుదురు. దీనిని మోహన మందురు. 3. నాకము, దీని దెబ్బ తిని స్వర్గమును చూతురు. దీనిని ఉన్మాదకమని యందురు. 4. అక్షిసంతర్జనమ్ - దీనితో కొట్టిన వెంటనే దెబ్బతిన్న వారు పెనుభీతితో మలమూత్రవిసర్జనము చేయుదురు-దీనికి త్రాసన మని పేరు. 5 సంతానము - ఎడతెగకుండ బాణముల వర్షము కురిపించునది - ఇంద్రాది అస్త్రము - దీనిని దివ్య మందురు. 6. నర్తనము - ఇది ప్రయోగించినచో పరులు ఒడలెరుగక నాట్యమాడుదురు. పైశాచము దీనిపేరు 7. ఘోరము - తమలో తాము కొట్టుకొనునట్లు చేయును - ఇది రాక్షసము; 8. ఆస్యమోదకమ్ - దీని దెబ్బతిన్నవారు నోట రాలు గ్రుక్కుకొని చచ్చుటకు పరవు లెత్తుదురు. దీని పేరు యామ్యము.

ఏతైర్విద్ధాః సర్వ ఏవ మరణం యాన్తి మానవాః.
వీనితో దెబ్బ తిన్న మానవు లందరు తప్పక చత్తురు.
కామక్రోధౌ లోభమోహౌ మదమానౌ తథైవ చ,
మాత్సర్యాహంకృతీ చైవ క్రమా దేత ఉదాహృతాః. 43

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మానము, మాత్సర్యము, అహంకారము - అను నీ దోషములు క్రమముగా చెప్పబడినవి.

ఉన్మత్తాశ్చ విచేష్టన్తే నష్టసంజ్ఞా విచేతసః, 44
స్వపన్తి చ ప్లవన్తే చ ఛర్దయన్తి చ మానవాః,
మూత్రయన్తే చ సతతం రుదన్తి చ హసన్తి చ. 45

ఈ దోషములు పట్టిన మానవులు పిచ్చివారై తిక్కపనులు చేయుదురు. ఒడలు తెలియక పడియుందురు. నిద్రలో మునుగుదురు. గంతులు వేయుచుందురు. క్రక్కుచుందురు. మూత్రము చేయుదురు. ఏడ్తురు. నవ్వుదురు.

నిర్మాతా సర్వలోకానా మీశ్వరః సర్వకర్మవిత్,
యస్య నారాయణో బన్ధు రర్జునో దుస్సహో యుధి. 46

సకలలోకములను నిర్మించినవాడు, సకలభూతముల కేలిక, సర్వకార్యములు తెలిసినవా డగు నారాయణు డర్జునునికి చుట్టము. అట్టి యర్జునుని యుద్ధమున సహించుట చాల కష్టము.

కస్తముత్సహతే జేతుం త్రిషు లోకేషు భారత,
వీరం కపిధ్వజం జిష్ణుం యస్య నాస్తి సమో యుధి. 47

---

44-45 ఉన్మత్తాశ్చ - అనునది మొదలుకొని చెప్పిన ఈ ఎనిమిది దోషములను పైని చెప్పిన కాకుదీకము మొదలగు అస్త్రములు కలిగించు వికారములతో తగు విధముగా కలుపుకొనవలయును-

1. కాకుదీకము - నిద్రలో మునుగుట. 2. శుకము - ఒడ లెఱుగకుండుట. 3. నాకము - నవ్వుట. 4. అక్షిసంతర్జనము - మూత్రము చేయుట. 5. సంతానము - క్రక్కుకొనుట. 6. నర్తకము - గంతులు వైచుట; 7. ఘోరము - పిచ్చి పట్టుట. 8. ఆస్యమోదకము - ఏడ్చుట.

43-44 శ్లోకములలో చెప్పిన కామక్రోధాదిదోషములను గూడ వీనితో తగునట్లన్వయించుకొనదగును.

వీరుడు, కపిధ్వజము గలవాడు, జయశాలి, యుద్ధమున సాటిలేనివాడు నగు ఆ అర్జునుని గెలుచుటకు మూడులోకములందును ముందుకు వచ్చువా డెవ్వడు ?

అసంఖ్యేయా గుణాః పార్థే తద్విశిష్టో జనార్దనః,
త్వమేవ భూయో జానాసి కున్తీపుత్రం ధనఞ్జయమ్. 48

అర్జునుని గుణములు లెక్కింప నలవికానివి. శ్రీకృష్ణు డంతకంటె మిన్న. రాజా ! కుంతికొడుకు ధనంజయుని నీవును బాగుగా ఎరుగుదువు.

నరనారాయణౌ యౌ తౌ తావే వార్జునకేశవౌ,
విజానీహి మహారాజ ప్రవీరౌ పురుషోత్తమౌ. 49

నరనారాయణు లన్నవారే అర్జునకేశవులు. మహారాజా ! బాగుగా తెలిసి కొనుము. వారు మహావీరులు. పురుషోత్తములు.

యద్యేత దేవం జానాసి న చ మా మభిశంకసే,
ఆర్యాం మతిం సమాస్థాయ శామ్య భారత పాణ్డవైః. 50

ఇది నీవు తెలిసికొన్నచో నన్ను నీ వనుమానింపవు. పవిత్రమైన బుద్ధిని కుదుర్చుకొని పాండవులతో పొందు పొందుము.

అథ చే న్మన్యసే శ్రేయో న మే భేదో భవేదితి,
ప్రశామ్య భరతశ్రేష్ఠ మా చ యుద్ధే మనః కృథాః. 51

ఇది శ్రేయ మనియు, నాకు ముప్పు రాదనియు తలతువేని భరతవరేణ్యా! శాంతి పొందుము. యుద్ధమున మనసు పెట్టకుము.

భవతాం చ కురుశ్రేష్ఠ కులం బహుమతం భువి,
తత్తథైవాస్తు భద్రం తే స్వార్థ మేవోపచిన్తయ. 52

కురుశ్రేష్ఠా! మీ కులము కూడ భూమిపై ఎంతో మన్నన పొందినది. అది యట్లే యుండుగాక! నీకు మేలగుగాక! ఈ నీ స్వార్థమునైన ఎదలో భావింపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
దమ్భోద్భవోపాఖ్యానే షణ్ణవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున, భగవద్యానపర్వమున
దంభోద్భవోపాఖ్యానముగల తొంబదియారవ అధ్యాయము.

—: o :—

# సప్తనవతితమోఽధ్యాయః
# తొంబదియేడవ అధ్యాయము

**శమాయ దుర్యోధనం బోధయతా కణ్వేన మాతలే రుపాఖ్యాన స్యారమ్భః.**
**శాంతికై దుర్యోధనునకు బోధ చేయు కణ్వుడు మాతలికథను మొదలిడుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

జామదగ్న్యవచః శ్రుత్వా కణ్వోఽపి భగవా నృషిః,
దుర్యోధన మిదం వాక్య మబ్రవీత్ కురుసంసది. 1

పరశురాముని మాట విన్న పిదప భగవంతుడగు కణ్వు డను ఋషియు కౌరవసభలో దుర్యోధనునితో నిట్లు పలికెను.

కణ్వ ఉవాచ - కణ్వుడు పలికెను.

అక్షయ శ్చావ్యయశ్చైవ బ్రహ్మా లోకపితామహః,
తథైవ భగవన్తౌ తౌ నరనారాయణా వృషీ. 2

లోకముల కెల్ల తండ్రియగు బ్రహ్మ నాశము లేనివాడు. మార్పులు లేనివాడు. ఆ నరనారాయణఋషులును భగవంతులు, అట్టివారే.

ఆదిత్యానాం హి సర్వేషాం విష్ణు రేకః సనాతనః,
అక్షయ్య శ్చావ్యయ శ్చైవ శాశ్వతః ప్రభు రీశ్వరః. 3

దేవత లందరిలో విష్ణు డొక్కడు అందరకు మూలదైవము. క్షయము, వ్యయము లేనివాడు. శాశ్వతుడు. అందరి పుట్టుకకు కారణమైనవాడు. అందరను పాలించువాడు.

---

3 ప్రభుః - అందరి, అన్నింటి పుట్టుకకు కారణమైనవాడు అక్షయ్యః - అతని నెవ్వరు నశింపజేయలేరు. అవ్యయః - వ్యయ మనగా తరిగి పోవుట - అది లేనివాడు; ఆదిత్యులు - అదితి కొడుకులు.

నిమిత్తమరణా శ్చాన్యే చన్ద్రసూర్యౌ మహీ జలమ్,
వాయు రగ్ని స్తథాకాశం గ్రహా స్తారాగణా స్తథా. 4

చంద్రుడు, సూర్యుడు, భూమి, నీరు, గాలి, నిప్పు, నింగి, గ్రహములు, నక్షత్రగణములు - ఈ యన్నియు ఏదో కారణమున నశించునవియే.

తే చ క్షయాన్తే జగతో హిత్వా లోకత్రయం సదా,
క్షయం గచ్ఛన్తి వై సర్వే సృజ్యన్తే చ పునః పునః. 5

జగత్తు ప్రళయము పొందునపుడు వారందరు (ఆ యన్నియు) మూడు లోకములను వదలి నాశనము పొందుదురు. మరల వారందరిని మాటిమాటికి పరమాత్మ పుట్టించును.

ముహూర్తమరణా స్త్వన్యే మానుషా మృగపక్షిణః,
తైర్యగ్యోన్యశ్చ యే చాన్యే జీవలోకచరా స్తథా. 6

ఇక ప్రాణిలోకమునందు తిరుగు మనుష్యులు, మృగములు, పక్షులు, ఇంకను తక్కిన జంతుజాలము అతిస్వల్పకాలమున మరణించును.

భూయిష్ఠేన తు రాజానః శ్రియం భుక్త్వాఽఽయుషః క్షయే,
తరుణాః ప్రతిపద్యన్తే భోక్తుం సుకృతదుష్కృతే. 7

మంచి వయసున నున్న రాజు లెందరో సంపద ననుభవించి ఆయువు నిండుకాలమున పుణ్యపాపముల ఫలమును పొందుటకై సిద్ధ మగుదురు.

స భవాన్ ధర్మపుత్రేణ శమం కర్తు మిహార్హతి,
పాణ్డవాః కురవశ్చైవ పాలయన్తు వసున్ధరామ్. 8

కావున రాజా! నీవు ధర్మపుత్రునితో పొందు గావింపదగును. పాండవులు, కౌరవులు కలిసి భూమి నేలుదురు గాక!

---

4. నిమిత్తమరణాః - ఏదో కారణమున నశించువారు; నిమిత్తకారణాని అని ఒక పాఠము - అప్పుడు కూడ ఏర్పడుటకు కారణములైన సారె, దండము, కుమ్మరి మొదలగువాని వంటివని భావము.

7. తరుణాః - భోగము ననుభవింపదగిన కాలమున యుద్ధమాడి చావరాదని తాత్పర్యము.

బలవా నహ మిత్యేవ న మన్తవ్యం సుయోధన,
బలవన్తో బలిభ్యో హి దృశ్యన్తే పురుషర్షభ. 9

నాయనా! సుయోధనా! నేను బలవంతుడను. నాకేమి? యని తలపరాదు. తాడి దన్నువాని తలదన్నువా డున్నట్లు బలవంతులకంటె బలవంతులు గానవత్తురు.

న బలం బలినాం మధ్యే బలం భవతి కౌరవ!
బలవన్తో హి తే సర్వే పాణ్డవా దేవవిక్రమాః. 10

బలవంతుల నడుమ తన బలము బలము కాజాలదు. ఆ పాండవు లందరును దేవతలవలె గొప్ప పరాక్రమము కలిగిన బలవంతులే గదా!

అత్రాప్యుదాహరన్తీమ మితిహాసం పురాతనమ్,
మాతలే ర్దాతుకామస్య కన్యాం మృగయతో వరమ్. 11

ఈ విషయమున ప్రాతకాలపు చరిత్ర నొకదానిని తన కూతు నీయగోరి వరుని వెదకుచున్న మాతలి కథను ఉదాహరింతును.

మత స్త్రిలోకరాజస్య మాతలి ర్నామ సారథిః,
తస్యైకైవ కులే కన్యా రూపతో లోకవిశ్రుతా. 12

ముల్లోకముల నేలు దేవేంద్రున కిష్టుడైన సారథి మాతలి యనువాడు కలడు. అతనికులమున రూపవతి యని ఎల్లలోక మెఱిగిన కన్య యొకతె యుండెను.

గుణకేశీతి విఖ్యాతా నామ్నా సా దేవరూపిణీ,
శ్రియా చ వపుషా చైవ స్త్రియోఽన్యాః సాఽతిరిచ్యతే. 13

ఆమె పేరు గుణకేశి. దేవతాసౌందర్యము కలది. సంపదలో రూపసంపదలో తక్కిన యింతుల నందరను తలదన్నినట్టిది.

---

11. మాతలేః - మాతలి ఇతిహాసమని భావము.

13. వపుషా - దేహముతో. మిక్కిలి సుందరము, సుకుమారము నైన దేహమునే వపుశ్శబ్దముతో వ్యవహరింతురు.

తస్యాః ప్రదానసమయం మాతలిః సహ భార్యయా,
జ్ఞాత్వా విమమృశే రాజం స్తత్పరః పరిచిన్తయన్. 14

అమెకు పెండ్లియీడు వచ్చెనని యెరిగి మాతలి భార్యతోపాటు అదేపనిగ చింతించుచు నిట్లు భావింపదొడగెను.

ధి క్ఖల్వలఘుశీలానా ముచ్ఛ్రితానాం యశస్వినామ్,
నరాణాం మృదుసత్వానాం కులే కన్యాప్రరోహణమ్. 15

గొప్ప శీలము, మహిమ, యశస్సు మెత్తని స్వభావము గల వారియింట కన్య పుట్టె ననగా అది యెంత కష్టమో గదా!

మాతుః కులం పితృకులం యత్ర చైవ ప్రదీయతే,
కులత్రయం సంశయితం కురుతే కన్యకా సతామ్. 16

తల్లి వంశమును, తండ్రి వంశమును, మెట్టిన యింటిని, ఈ మూడింటిని సత్కులమున బుట్టిన కన్య సంశయావస్థలో పడవేయును.

దేవమానుషలోకౌ ద్వౌ మానుషేణైవ చక్షుషా,
అవగాహ్యైవ విచితౌ న చ మే రోచతే వరః. 17

మానవసంబంధమగు జ్ఞానముతో దేవలోకమును, మానవలోకమును గాలించివైచితిని. నాకు నచ్చిన వరుడు దొరకలేదు.

కణ్వ ఉవాచ-కణ్వు డిట్లు చెప్పెను.

న దేవా న్నైవ దితిజా న్న గన్ధర్వా న్న మానుషాన్,
అరోచయ ద్వరకృతే తథైవ బహులా నృషీన్. 18

ఆ మాతలి దేవతలను, రాక్షసులను, గంధర్వులను, మనుష్యులను, అట్లే ఎందరో ఋషులను పరికించెను. కాని ఆతని కే వరుడును నచ్చలేదు.

భార్యయాऽను స సంమన్త్ర్య సహ రాత్రౌ సుధర్మయా,
మాతలి ర్నాగలోకాయ చకార గమనే మతిమ్. 19

---

15. ఉచ్ఛ్రితానామ్ - గొప్పవారని పేరొందిన వారియొక్క.
17. చక్షుషా - కంటితో - జ్ఞానముతో అని భావము.

తన భార్యయగు సుధర్మతో ఒక రాత్రి బాగుగా ఆలోచించి నాగలోకమునకు వెళ్ళుటకై నిశ్చయము చేసెను.

న మే దేవమనుష్యేషు గుణకేశ్యాః సమో వరః,
రూపతో దృశ్యతే కశ్చి న్నాగేషు భవితా ధ్రువమ్. 20

గుణకేశికి రూపమున సాటియగు వరుడు నాకు దేవతలలో మానవులలో కానరాడు. నాగులలో తప్పక దొరుకును.

ఇత్యామన్త్ర్య సుధర్మాం స కృత్వా చాభిప్రదక్షిణమ్,
కన్యాం శిర స్యుపాఘ్రాయ ప్రవివేశ మహీతలమ్. 21

అని భార్య యగు సుధర్మకు చెప్పి, ప్రదక్షిణము చేసి కన్నెతల మూర్కొని భూలోకమునకు పోవ దొడగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే సప్తనవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలి వరుని వెదకుట యను తొంబదిఏడవ అధ్యాయము.

—:o:—

# అష్టనవతితమోఽధ్యాయః

# తొంబదియెనిమిదవ అధ్యాయము

పుత్ర్యాః కృతే పరమనుసంధధతో మాతలేర్నారదేన
సహ వరుణలోకే గమనం, తత్ర వివిధాశ్చర్యదర్శనం చ.
పుత్రికొరకు వరుని వెదకుచు మాతలి నారదునితో పాటు
వరుణలోకమున కరుగుట, అందు ఎన్నో వింతలు కనుట.

కణ్వ ఉవాచ-కణ్వు డిట్లు పలికెను.

మాతలిస్తు వ్రజన్ మార్గే నారదేన మహర్షిణా,
వరుణం గచ్ఛతా ద్రష్టుం సమాగచ్ఛ ద్యదృచ్ఛయా. 1

మాతలి బాటలో పోవుచు, వరుణుని చూడగోరి పోవుచున్న మహర్షి యగు నారదుని అనుకొనకుండ కలసికొనెను.

నారదోఽథాబ్రవీ దేనం క్వ భవాన్ గన్తు ముద్యతః,
స్వేన వా సూత కార్యేణ శాసనా ద్వా శతక్రతోః. 2

మాతలీ! ఎటకు బయలుదేరితివి? నీ పనిమీదనా? లేక దేవేంద్రుని ఆజ్ఞ మీదనా? అని నారదుడు మాతలి నడిగెను.

మాతలి ర్నారదే నైవం సంపృష్టః పథి గచ్ఛతా,
యథావత్సర్వ మాచష్ట స్వకార్యం నారదం ప్రతి. 3

దారిని పోవుచున్న నారదు డిట్లడుగగా మాతలి ఉన్నదున్నట్లు తనపని యంతయు నారదున కెరిగించెను.

త మువాచాథ స ముని ర్గచ్ఛావః సహితా విలి,
సలిలేశ దిదృక్షార్థ మహమ ప్యుద్యతో దివః. 4

అంత నా ముని - 'మన మిద్దరము కలసిపోవుదము. నేను జలాధిపతి వరుణుని దర్శనముకొరకై స్వర్గమునుండి బయలుదేరితిని'

అహం తే సర్వ మాఖ్యాస్యే దర్శయన్ వసుధాతలమ్,
దృష్ట్వా తత్ర వరం కఞ్చిద్ రోచయిష్యావ మాతలే. 5

మాతలీ! నేను భూమండల మంతయు చూపి యంతయు నీ కెరిగింతును. అందు చూచి ఒక మంచి పెండ్లికొడుకును ఎన్నుకొందము అని పలికెను.

అవగాహ్య తు తౌ భూమి ముభౌ మాతలినారదౌ,
దదృశాతే మహాత్మానౌ లోకపాల మపాంపతిమ్. 6

మహాత్ములగు మాతలినారదు లిరువురు భూమికి దిగి జలముల కధిపతి యగు లోకపాలుని గాంచిరి.

తత్ర దేవర్షిసదృశీం పూజాం స ప్రాప నారదః,
మహేన్ద్రసదృశీం చైవ మాతలిః ప్రత్యపద్యత. 7

అందు నారదుడు దేవర్షికి తగిన పూజను, మాతలి దేవేంద్రునికి యోగ్యమైన పూజను అందుకొనిరి.

తావుభౌ ప్రీతమనసౌ కార్యవన్తౌ నివేద్య హ,
వరుణే నాభ్యనుజ్ఞాతౌ నాగలోకం విచేరతుః. 8

వారిద్దరు మనసున ప్రీతి చెంది పనిగలవారు కనుక విన్నవించి వరుణుని అనుమతి పొంది నాగలోకమున సంచరించిరి.

నారదః సర్వభూతానా మన్తర్భూమినివాసినామ్,
జానం శ్చకార వ్యాఖ్యానం యన్తుః సర్వ మశేషతః. 9

నారదుడు భూమి క్రింద నున్న ప్రాణులందరి స్వభావ మెరిగినవాడు. కనుక సారథి కది యెల్ల వివరించి చెప్పెను.

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

దృష్టస్తే వరుణః సూత పుత్రపౌత్రసమన్వితః,
పశ్యోదకపతేః స్థానం సర్వతోభద్ర మృద్ధిమత్. 10

సూతా! కొడుకులతో, మనుమలతో కలసియున్న వరుణుని చూచితివి కదా! జలాధిపతి స్థానము ఎందును భద్రత కలిగి సంపదలతో నిండియున్నది. చూడుము.

ఏష పుత్రో మహాప్రజ్ఞో వరుణస్యేహ గోపతేః,
ఏష వై శీలవృత్తేన శౌచేన చ విశిష్యతే. 11

గొప్ప ప్రజ్ఞ గల ఇతడు జలపాలకుడగు వరుణుని కొడుకు. మంచి స్వభావము, చక్కని నడవడి, శుచిత్వము అనునవి యీతని విశేషగుణములు.

ఏషోఽస్య పుత్రోఽభిమతః పుష్కరః పుష్కరేక్షణః,
రూపవాన్ దర్శనీయశ్చ సోమపుత్ర్యా వృతః పతిః. 12

ఈత డితనికి మిక్కిలి ప్రియమైన తనయుడు. పుష్కరు డితని పేరు. కమలముల వంటి కన్నులు గలవాడు. చక్కని రూపము గలిగి చూడముచ్చట యైనవాడు. చంద్రుని కూతురు ఈతని భర్తగా వరించినది.

జ్యోత్స్నా కాలీతి యా మాహు ర్ద్వితీయాం రూపతః శ్రియమ్,
అదిత్యాశ్చైవ యః పుత్రో జ్యేష్ఠః శ్రేష్ఠః కృతః స్మృతః. 13

రూపమున లక్ష్మియే యనదగిన చంద్రుని రెండవ కూతురు, జ్యోత్స్నా కాళి యను పేర్లు గల యింతి అదితి కొడుకులలో పెద్దయు మిన్నయునగు సూర్యుని భర్తగా చేసికొనెను.

భవనం పశ్య వారుణ్యం యదేత త్సర్వకాఞ్చనమ్,
యత్ప్రాప్య సురతాం ప్రాప్తాః సురాః సురపతేః సఖే! 14

నిలువెల్ల బంగారమే యగు ఈ వారుణీభవనము చూడుము. సురాధిపతి మిత్రమా! దీనిని పొందియే దేవతలు 'సుర' నామము గలవారైరి.

ఏతాని హృతరాజ్యానాం దైతేయానాం స్మ మాతలే,
దీవ్యమానాని దృశ్యన్తే సర్వప్రహరణాన్యుత. 15

---

11. గోపతేః - గో వనగా జలమనియు నర్థము - 'భూ వాగ్ వారిషు గౌర్మతా' అని విశ్వకోశము - దానికి పతియగు వరుణునియొక్క.

13. ద్వితీయామ్ - (సోముని పుత్రికలలో) రెండవ దానిని; అదిత్యాః పుత్రః - అదితి కొడుకు సూర్యుడు; శ్రేష్ఠః కృతః - భర్తగా చేసికొనబడెను.

14. వారుణ్యామ్ - వారుణి యనగా మద్యము - దానికి సంబంధించినది. ఈ మద్యమునే 'సుర' అందురు. అది కలవారు కనుక దేవతలు 'సురలు.'

ఇవిగో ఈ వెలుగొందుచున్న ఆయుధము లన్నియు రాజ్యము పోగొట్టు కొన్న రాక్షసులవి.

అక్షయాణి కిలైతాని నివర్తన్తే స్మ మాతలే,
అనుభావప్రయుక్తాని సురై రవజితాని హ. 16

మాతలీ! ఇవి తరుగువోని వట! వీనిని శత్రువులపై విసరినను తిరిగి వెనుకకు వచ్చి చేరు మహిమ గలవి. దేవతలు వీని నాడిదికొనిరి.

అత్ర రాక్షసజాత్యశ్చ దైత్యజాత్యశ్చ మాతలే,
దివ్యప్రహరణా శ్చాసన్ పూర్వదైవతనిర్మితాః. 17

ఈ దివ్యములగు ఆయుధములు రాక్షసులు నిర్మించినవి. రాక్షసులవంటివి. దైత్యులవంటివి.

అగ్ని రేష మహార్చిష్మాన్ జాగర్తి వారుణే హ్రదే,
వైష్ణవం చక్ర మావిద్ధం విధూమేన హవిష్మతా. 18

ఈ పెద్దజ్వాలలు గల అగ్ని, వరుణసంబంధమైన పెద్దమడుగున మేల్కొనియే యుండును. పొగలేని యీ యగ్ని విష్ణుచక్రమును గూడ నిలువరించెను.

ఏష గాణ్డీమయ శ్చాపో లోకసంహారసంభృతః,
రక్ష్యతే దైవతై ర్నిత్యం యత స్తద్గాణ్డివం ధనుః. 19

---

17. రాక్షసజాత్యాః - రాక్షసజాతీయములు - రాక్షసులవంటి వని అర్థము; దైత్యు లనగా దితి కొడుకులు. రాక్షసులు, దైత్యులు, దానవులు-స్వభావముతో ఒక్కవిధమువారే కాని జాతితో భిన్నులు. పూర్వదైవతము లనగా రాక్షసులు - వారిచేత నిర్మింపబడినవి. సర్వదైవతనిర్మితాః అనియు పాఠము. ఆ పక్షమున దేవత లందరు ప్రయోగించినవని యర్థము.

18. హవిష్మతా - ఈ అగ్నిచేత; వైష్ణవం - విష్ణుసంబంధమైన; చక్రమ్ - చక్రము; ఆవిద్ధమ్ - అడ్డగింపబడినది - విష్ణుచక్రమువలన కూడ ఇందు భయము లేదని భావము.

19. గాణ్డీమయః - గాండి యనగా ఖడ్గమృగము. దానితో చేసినది గాండీమయము. దాని వెన్నెముకతో విల్లు చేయుదురట. గాండీమయము

ఇదిగో ఇది గాండితో నేర్పడిన విల్లు. లోకము లన్నింటిని రూపు మాపు శక్తి గలది. దీనిని దేవతలు అనుక్షణము కాపాడుదురు గాండీవ మను ధనుస్సు దీనినుండి యేర్పడినదే.

ఏష కృత్యే సముత్పన్నే తత్త్ర ద్ధారయతే బలమ్,
సహస్రశతసంఖ్యేన ప్రాణేన సతతం ధ్రువః. 20

ఈ విల్లు ఎంత పని పడినచో అంత బలము పొందుచుండును. లక్ష విండ్ల బలముతో ఎల్లపుడు స్థిరమై యుండును.

అశాస్యానపి శాస్త్యేవ రక్షోబన్ధుషు రాజసు,
సృష్టః ప్రథమత శ్చణ్డో బ్రహ్మణా బ్రహ్మవాదినా. 21

ఇది వేదము పఠించుచు బ్రహ్మ భయంకరముగా మొదట సృష్టి చేసినట్టిది. రక్కసులవంటి రాజులయందు ఏ ఆయుధమునకు లొంగనివారిని కూడ లొంగ దీయును.

ఏతచ్ఛస్త్రం నరేన్ద్రాణాం మహచ్చక్రేణ భాసితమ్,
పుత్రాః సలిలరాజస్య ధారయన్తి మహోదయమ్. 22

రాజులకడ ఈ ఆయుధము చక్రముకంటె గొప్పదయి విరాజిల్లినది. జలపాలకుడగు వరుణుని కొడుకులు గొప్పమహిమగల దీనిని పట్టి నిలుపుదురు.

---

కనుకనే అది గాండీవ మయినది. వికారార్థమున గాండీ శబ్దమునకు 'వ' ప్రత్యయము చేరినది. గాండి యనగా వజ్రపుముడి - దానివలన నేర్పడినది యని ఇతరులు.

20. కృత్యే సముత్పన్నే - పని పడినపుడు - ఎంత గొప్ప లక్ష్యమును భేదింపవలయునో అంత శక్తిగలది యగును అని 'తత్త్ర ద్ధారయతే బలమ్' అనుదాని కర్థము. సహస్రశతసంఖ్యేన-వేయినూర్లు-అనగా లక్ష విండ్ల; ప్రాణేన - బలముతో, సతతం - ఎల్లవేళల; ధ్రువః - స్థిరమై యుండును. ఎల్లపుడు లక్షధనువుల బలము గలదైనప్పటికి పని పడినచో అంతకు మించిన శక్తిని గూడ పొందునని భావము.

21. రక్షోబన్ధుషు - రక్కసులతో సాటియగు వారియందు.

22. చక్రేణ - చక్రముకంటెను.

ఏతత్ సలిలరాజస్య ఛత్రం ఛత్రగృహే స్థితమ్,
సర్వతః సలిలం శీతం జీమూత ఇవ వర్షతి. 23

ఇదిగో ఇది వరుణదేవుని గొడుగులశాలలో ఉన్న గొడుగు. ఇది అన్ని వైపుల మేఘమువలె చల్లనిజల్లు కురియుచుండును.

ఏతచ్ఛత్రాత్ పరిభ్రష్టం సలిలం సోమనిర్మలమ్,
తమసా మూర్ఛితం భాతి యేన నార్ఛతి దర్శనమ్. 24

ఈ గొడుగునుండి జారిన నీరు చంద్రునివలె నిర్మలమై యుండును. ఇది చీకటి క్రమ్మి యుండును. అందువలన జనులు దీనిని చూడజాలరు.

బహూ న్యద్భుతరూపాణి ద్రష్టవ్యానీహ మాతలే,
తవ కార్యావరోధ స్తు తస్మా ద్గచ్ఛావ మా చిరమ్. 25

మాతలీ : ఇచట ఇంకను చూడదగిన అద్భుత విషయములు పెక్కులు గలవు. కాని నీ పనికి అడ్డమగును. కాన త్వరగా పోదము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే అష్టనవతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలి వరుని వెదకుట యను తొంబదియెనిమిదవ అధ్యాయము.

—: o :—

---

24. తమసా - చీకటితో; మూర్ఛితమ్ - కప్పబడినదై; భాతి - ప్రకాశించును. ఈ గొడుగు అందరకు కానరాదని భావము; యేన - ఏ కారణముచేత - అనగా చీకటి క్రమ్మియున్న కారణమున; జనః - జనము; అస్య - దీనిని - (ఈ రెండు పదములను కలుపుకొనవలయును); దర్శనమ్ - చూచుట; న, అర్ఛతి - పొందదు. జనులు ఆ కారణమున దీనిని చూడ జాలరని భావము.

## ఊనశతతమోఽధ్యాయః
## తొంబదితొమ్మిదవ అధ్యాయము

### నారదేన మాతలేః పాతాలలోకదర్శనమ్.
### నారదుడు మాతలికి పాతాళలోకము జూపుట.

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

ఏతత్తు నాగలోకస్య నాభిస్థానే స్థితం పురమ్,
పాతాల మితి విఖ్యాతం దైత్యదానవసేవితమ్. 1

ఇదిగో ఇది నాగుల లోకమునకు మధ్యభాగమున నున్న పట్టణము. పాతాళమని పేరు గన్నది. దితికొడుకులు దనువు కొడుకులు నిందుందురు.

ఇద మద్భిః సమం ప్రాప్తా యే కేచి ద్భువి జంగమాః,
ప్రవిశన్తో మహానాదం నదన్తి భయపీడితాః. 2

భూలోకమున తిరుగువారు నీటితోపాటు ఇందు ప్రవేశించుచు భయము పీడింపగా గొంతెత్తి అరచెదరు.

అత్రాసురోఽగ్నిః సతతః దీవ్యతే వారిభోజనః,
వ్యాపారేణ ధృతాత్మానం నిబద్ధం సమబుధ్యత. 3

---

2. అద్భిః సమమ్ - నీటితో పాటు, నీటి ఉరవడికి కొట్టుకొని వచ్చినవారై - అని భావము; మహానాదం నదన్తి-పెద్దగా కేకలు వేయుదురని భావము:

3. వ్యాపారేణ - గట్టి ప్రయత్నముతో; దేవైః - దేవతలచేత - (ఇది అధ్యాహార్యము, ధృతః - హద్దులో తన్ను: సమబుధ్యత - (అగ్ని) తెలియుచున్నది.

అట్లు దేవతలు పట్టియుంచనిచో ఒడ్డ లెరుగక ఆ అగ్ని మొత్తము సముద్రమును, లోకములను కాల్చివేయునని తాత్పర్యము; ధృతః - ఆత్మానమ్ - ధృతాత్మానమ్ అనుచోట సంధి ఆర్షము.

ఇందు రాక్షసమైన అగ్ని ఎల్లవేళల నీరే ఇంధనముగా మండుచుండును. దేవతలెంతో ప్రయత్నముతో పట్టియుంచగా తన్ను దా నెరుగుచుండును.

అత్రామృతం సురైః పీత్వా నిహితం నిహతారిభిః,
అతః సోమస్య హానిశ్చ వృద్ధిశ్చైవ ప్రదృశ్యతే. 4

శత్రువులను మట్టుపెట్టు దేవతలిందే అమృతమును త్రాగి మిగిలినదానిని దాచియుంతురు. ఈ చోట చంద్రునకు తరుగుదలయు, పెరుగుదలయు గోచరింపవు.

---

4. చంద్రునియందలి అమృతమును దేవతలిచటనే త్రాగుదురు.

బంతివంటి భూగోళమును చంద్రుడు సూర్యుడు చుట్టివత్తురు. ఒక భూగోళప్రదేశము అడ్డుగా వచ్చుటచేత ఆ యిద్దరలో ఒకరు కానరాకుందురు. సూర్యుడు కానరానిచో రాత్రి. చంద్రుడు కనబడనిచో పగలు. గోళమునకు పైభాగమునను, క్రింది భాగమునను ఉన్నవారికి ఎప్పుడు సూర్యాదులు కానవత్తురు. అందు జలముతో నింగిన చంద్రమండలము తేజోరూపముగల సూర్యకిరణములతో వెలుగొందుచుండును.

ఆ సూర్యచంద్రులకు దూరము పెరుగుచున్నకొలది చంద్రబింబము ఎక్కువ ప్రమాణములో కనబడుచుండును. దగ్గరతనమును బట్టి సూర్యునకు ముందున్న అగ్ని మున్నగు దేవతలచేత కనబడకపోవును. దీనిని చక్కగా పరికించియే శాస్త్రము 'ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః' ఇత్యాదిగా చెప్పినది. చంద్రుని మొదటికళను అగ్ని, రెండవకళను సూర్యుడు త్రావుచున్నారు-అని దాని కర్థము. త్రాగుట యనగా నిచ్చట దగ్గరగా నుండుటవలన కలుగు స్పర్శ మాత్రమే. పాతాళమునకు నట్టనడుమ నున్నవారికి మేరుశిఖరమునం దున్నవారికి వలె ఎల్లవేళల నిండుచంద్రుడే కానవచ్చును; ఏలయన అది కానవచ్చు తావున అగ్ని మొదలగు ఆవరణములు లేవు గదా!; అతః-ఈ స్థానమునుండి చంద్రునకు హానివృద్ధులు. ప్రదృశ్యేతే-వ్యతిరేకలక్షణచేత కానరావని భావము; న దృశ్యేతే-కానరావు అను పాఠమే బహుశః లేఖక ప్రమాదము వలన 'ప్రదృశ్యేతే' అని మారియు నుండవచ్చును.

అత్రాదిత్యో హయశిరాః కాలే పర్వణి పర్వణి,
ఉత్తిష్ఠతి సువర్ణాఖ్యం వాగ్భి రాపూరయన్ జగత్. 5

ఇక్కడ అదితికుమారుడగు విష్ణువు గుఱ్ఱముతల గల రూపముతో ప్రతి పర్వమునందును వాక్కులతో సువర్ణమను పేరుగల జగత్తును నింపుచు పైకి వచ్చును.

యస్మాదలం సమస్తాస్తాః పతన్తి జలమూర్తయః,
తస్మాత్ పాతాల మిత్యేవ ఖ్యాయతే పుర ముత్తమమ్. 6

నీటి స్వరూపము లన్నియు ఇందు పడును గావున ఉత్తమమగు ఈ పురము పాతాలమని పేరు గాంచినది.

ఐరావణోఽస్మాత్ సలిలం గృహీత్వా జగతో హితః,
మేఘే ష్వాముఞ్చతే శీతం యన్మహేన్ద్రః ప్రవర్షతి. 7

లోకమునకు మేలుగోరిన ఐరావతము దీనినుండి నీటిని గ్రహించి మబ్బులలో చల్లగా నింపును. దానినే మహేంద్రుడు వర్షముగా కురిపించును.

అత్ర నానావిధాకారా స్తిమయో నైకరూపిణః,
అప్సు సోమప్రభాం పీత్వా వసన్తి జలచారిణః. 8

పెక్కు ఆకారములు పెక్కురూపములు గల తిములు ఇందు చంద్ర కాంతిని త్రావి నీటియందు తిరుగుచు ఇచట నివసించును.

---

5. ఆదిత్యః-అదితి పుత్రుడగు విష్ణువు; హయశిరాః-గుఱ్ఱము తలవంటి తల గలవాడై; సువర్ణ ఆఖ్యమ్-సువర్ణమను పేరుగల-వేద రూపమైన నామాత్మక ప్రపంచమును-'నామ వా ఋగ్వేదః' అని శ్రుతి. వాగ్భిః-వాక్కులతో; ఆపూరయన్-నింపుచు; ఉత్తిష్ఠతి-వేదము నధ్యయనము చేయువారి కంఠనాదమును పెంపొందించుచు వెలికి వచ్చును.

6. జలమూర్తయః-నీటి ఆకారములు; చంద్రుడు మొదలగునవి. చంద్ర కాంతమువంటి నీరిందు స్రవించును. ఆ విధముగా పతజ్జలము అను పదము పాతాల మయినది.

అత్ర సూర్యాంశుభి ర్భిన్నాః పాతాలతలమాశ్రితాః,
మృతా హి దివసే సూత పునర్జీవన్తి వై నిశి. 9

ఇచటి ప్రాణులు సూర్యకిరణముల తాకిడికి చీలిపోయి పాతాళము అట్టడుగునకు చేరుకొని పగలు చనిపోయిన వారై తిరిగి రాత్రి బ్రదుకుచుందురు.

ఉదయ న్నిత్యశ శ్చాత్ర చన్ద్రమా రశ్మిబాహుభిః,
అమృతం స్పృశ్య సంస్పర్శాత్ సంజీవయతి దేహినః. 10

ఇచట ప్రతిదినము ఉదయించు చంద్రుడు తన కిరణము లనెడు చేతులతో అమృతమును తాకి ఆ స్పర్శవలన ప్రాణులను బ్రదికించు చుండును.

అత్ర తేऽధర్మనిరతా బద్ధాః కాలేన పీడితాః,
దైతేయా నివసన్తి స్మ వాసవేన హృతశ్రియః. 11

ఇదిగో ఆ రాక్షసులు అధర్మమునందే తగులుకొని ఇంద్రుడు సంపదలను లాగివేసి కట్టి పడవేయగా బహుకాలము బాధ ననుభవించుచు నివసించుచున్నారు.

అత్ర భూతపతి ర్నామ సర్వభూతమహేశ్వరః,
భూతయే సర్వభూతానా మాచర త్తప ఉత్తమమ్. 12

సర్వభూతములకు అధిపతి యగు భూతనాథుడు ప్రాణు లన్నింటి సుఖమును గోరి యిందు గొప్పతప మాచరించెను.

అత్ర గోవ్రతినో విప్రాః స్వాధ్యాయామ్నాయకర్శితాః,
త్యక్తప్రాణా జితస్వర్గా నివసన్తి మహర్షయః. 13

ఇందు గోవ్రతము చేసినవారు, వేదపాఠము చేసి చేసి చిక్కి శల్యమైనవారు, స్వర్గమును సాధించినవారు, విజ్ఞానసంపన్నులగు మహర్షులు ప్రాణములు వదలి నివసింతురు.

---

9. మఱియొక ప్రదేశమును చూపుచున్నారు. దివసే - మానవులకు రాత్రి భాగమునందు; నిశి - మానవులకు పగటి భాగమునందు.

13. స్వాధ్యాయామ్నాయః - వేదమును శ్రద్ధాసక్తులతో నియమపూర్వకముగా పఠించుట.

యత్రతత్రశయో నిత్యం యేనకేనచి దాశితః,
యేనకేనచి దాచ్ఛన్నః స గోవ్రత ఇహోచ్యతే. 14

ఎచటనో యొకచోట నిద్రించుచు, ఏదో యొకటి తినుచు, ఏది దొరకినచో దానిని వస్త్రముగా ధరించుచుండువాడు గోవ్రతుడని యిట చెప్పుదురు.

ఐరావణో నాగరాజో వామనః కుముదోఽఞ్జనః,
ప్రసూతాః సుప్రతీకస్య వంశేవారణసత్తమాః. 15

ఏనుగులలో ప్రసిద్ధి కెక్కిన ఐరావణము, వామనము, కుముదము, అంజనము అనునవి, సుప్రతీకము అను ఏనుగువంశమున నిందు పుట్టినవి.

పశ్య యద్యత్ర తే కశ్చి ద్రోచతే గుణతో వరః,
వరయిష్యామి తం గత్వా యత్న మాస్థాయ మాతలే. 16

మాతలీ! నీ కిచట నచ్చిన గుణవంతుడగు వరుడు కలడేమో చూడు. నేను పనిబూని అతనికడ కరిగి యొప్పించెదను.

అణ్డమేత జ్జలే న్యస్తం దీప్యమాన మివ శ్రియా,
ఆ ప్రజానాం నిసర్గాద్వై నోద్భిద్యతి న సర్పతి. 17

ఇదిగో ఈ గ్రుడ్డు శోభతో వెలిగిపోవుచున్నది. దీనిని నీట నిక్షేపించిరి. సృష్టి మొదలైన నాటినుండియు పగులదు. కదలదు.

నాస్య జాతిం నిసర్గం వా కథ్యమానం శృణోమి వై,
పితరం మాతరం చాపి నాస్య జానాతి కశ్చన. 18

దీని పుట్టుక యెట్టిదో, స్వభావ మెట్టిదో, ఎవరును చెప్పికొనగా నేను వినలేదు. దీని తల్లిదండ్రు లెవ్వరో యెవ్వరు నెరుగరు.

---

14. గోవ్రత మననేమో యీ శ్లోకమున వ్యాఖ్యానించిరి.

17. ఆ ప్రజానాం నిసర్గాత్ - ప్రజల ఉత్పత్తి మొదలుకొని.

18. జాతిమ్ - జన్మమునుగూర్చి; నిసర్గమ్ - స్వభావమునుగూర్చి - ఎవ్వరు ఎరుగరు. దానికి ముందు పుట్టినవా రెవ్వరు లేరు కనుక.

అతః కిల మహానగ్ని ర న్తకాలే సముత్థితః,
ధక్ష్యతే మాతలే సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 19

మాతలీ! దీనినుండియే ప్రళయకాలమున గొప్ప అగ్ని పెనుమంటతో లేచి స్థావరములతో జంగమములతో కూడిన మూడు లోకములను గాల్చి వేయునట!

మాతలి స్త్వబ్రవీ చ్ఛ్రుత్వా నారద స్యాథ భాషితమ్,
న మేఽత్ర రోచతే కశ్చి దన్యతో వ్రజ మాచిరమ్. 20

నారదుని మాట విన్న పిదప మాతలి - 'ఇచట నా కొక్కడును నచ్చ లేదు. మరియొకచోటికి త్వరగా పద' - అని పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే ఊనశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలి వరుని వెదకుట యను తొంబదితొమ్మిదవ అధ్యాయము.

—: o :—

# శతతమోఽధ్యాయః

# నూరవ అధ్యాయము

## హిరణ్యపురస్య దిగ్దర్శనం వర్ణనమ్

## హిరణ్యపురమును సంగ్రహముగా వర్ణించుట.

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

హిరణ్యపుర మిత్యేతత్ ఖ్యాతం పురవరం మహత్,
దైత్యానాం దానవానాం చ మాయాశతవిచారిణామ్. 1

దితి, దనువు అను కాంతల కొడుకులు, వందలకొలది మాయలతో తిరుగుచుండువారు నగు రక్కసుల పుర మియ్యది. దీనిని హిరణ్యపుర మందురు. చాల పెద్దది.

అనల్పేన ప్రయత్నేన నిర్మితం విశ్వకర్మణా,
మయేన మనసా సృష్టం పాతాలతల మాశ్రితమ్. 2

మయు డను విశ్వకర్మ మనసుతో గొప్ప ప్రయత్నముతో దీనిని నిర్మించెను. ఇది పాతాళము అడుగున ఉన్నది.

అత్ర మాయాసహస్రాణి వికుర్వాణా మహౌజసః,
దానవా నివసన్తి స్మ శూరా దత్తవరాః పురా. 3

ఇందు వేలకొలది మాయలు చేయుచుండు గొప్పశక్తిగల శూరులగు దానవులు నివసింతురు. వారు మునుపు వరములు పొందినవారు.

నైతే శక్రేణ నాన్యేన యమేన వరుణేన వా,
శక్యన్తే వశ మానేతుం తథైవ ధనదేన వా. 4

వీరు ఇంద్రునకు గాని, యమునికి గాని, వరుణునకు గాని కుబేరునకు గాని మరియెవనికి గాని లొంగనివారు.

అసురాః కాలఖఞ్జాశ్చ తథా విష్ణుపదోద్భవాః,
నైరృతా యాతుధానాశ్చ బ్రహ్మపాదోద్భవాశ్చ యే. 5
దంష్ట్రిణో భీమవేగాశ్చ వాతవేగపరాక్రమాః,
మాయావీర్యోపసంపన్నా నివసన్త్యత్ర మాతలే. 6

కాలఖంజులను అసురులు, విష్ణుపాదమునుండి పుట్టిన నైరృతులు, బ్రహ్మ పాదమునుండి పుట్టిన యాతుధానులు అను రక్కసులు, పెద్ద కోరలతో, భయము పుట్టించు వేగముతో, వాయువేగమువంటి పరాక్రమముతో, మాయాశక్తితో కూడినవారై యిందు నివసింతురు.

నివాతకవచా నామ దానవా యుద్ధదుర్మదాః,
జానాసి చ యథా శక్రో నైతాన్ శక్నోతి బాధితుమ్. 7

యుద్ధమున చెడు పొగరు గల నివాతకవచులను రాక్షసులును ఇందు గలరు. నీ వెరుగుదువు కదా. ఇంద్రుడును వారిని బాధింపజాలడు.

బహుశో మాతలే త్వం చ తవ పుత్రశ్చ గోముఖః,
నిర్భగ్నో దేవరాజశ్చ సహపుత్రః శచీపతిః. 8

మాతలీ! నీవు నీకొడుకు గోముఖుడు, ఇంద్రుడు, అతని కొడుకు పలుమారులు వీరిచేత విరిగి పారిరి.

పశ్య వేశ్మాని రౌక్మాణి మాతలే రాజతాని చ,
కర్మణా విధియుక్తేన యుక్తాన్యుపగతాని చ. 9

ఆ బంగారు భవనములు, వెండి భవనములు చూడు. బ్రహ్మమాటపై విశ్వకర్మ వీనిని నిర్మించెను. వీరు వానిని ఆక్రమించుకొనిరి.

వైదూర్యమణిచిత్రాణి ప్రవాలరుచిరాణి చ,
అర్కస్ఫటికశుభ్రాణి వజ్రసారోజ్జ్వలాని చ. 10
పార్థివానీవ చాభాన్తి పద్మరాగమయాని చ,
శైలానీవ చ దృశ్యన్తే దారవాణీవ చాప్యుత. 11

---

11. శైలాని - శిలలతో నేర్పడినవి.

ఈ భవనము లన్నియు పైకి మట్టితో, రాలతో, కొయ్యతో కట్టినట్లు కన్పట్టుచున్నవి. కాని నిజమునకు గరుడపచ్చలతో చిత్రము లయినవి. పగడము లతో అందమైనవి. సూర్యకాంతమణులతో తెల్లగా వెలుగొందునట్టివి. వజ్రము లతో గట్టివై ప్రకాశించునట్టివి. కెంపులు కూర్చినట్టివి.

సూర్యరూపాణి చాభా న్తి దీప్తాగ్నిసదృశాని చ,
మణిజాలవిచిత్రాణి ప్రాంశూని నిబిడాని చ. 12

మండుచున్న అగ్నితో సమానములై సూర్యుని వంటి రూపములతో ప్రకాశించుచున్నవి. మణుల సముదాయముతో విచిత్రములైనవి. ఎత్తైనవి. నిండైనవి.

నైతాని శక్యం నిర్దేష్టుం రూపతో ద్రవ్యత స్తథా,
గుణత శ్చైవ సిద్ధాని ప్రమాణగుణవ న్తి చ. 13

వీని రూప మిట్టిది, వెల యింత, గుణము లిట్టివి యని నిరూపించి యెవ్వరు చెప్పజాలరు. గొప్ప ప్రమాణములతో, గుణములతో రూపొందినవి.

ఆక్రీడాన్ పశ్య దైత్యానాం తథైవ శయనా న్యుత,
రత్నవ న్తి మహార్హాణి భాజనా న్యాసనాని చ. 14

ఈ రాక్షసుల ఆటల తావులు చూడు. ఆ పాన్పులు, ఆ పాత్రలు, ఆ ఆసనములు అన్నియు నిలువెల్ల రత్నములతో గొప్ప విలువ గలిగియున్నవి.

జలదాభాం స్తథా శైలాం స్తోయప్రస్రవణాని చ,
కామపుష్పఫలాం శ్చాపి పాదపాన్ కామచారిణః. 15

మేఘముల వంటి పర్వతములను, సెలయేళ్ళను, కోరిన పూవులను ఫలములను ఇచ్చుచు ఇచ్చవచ్చినట్లు కదలాడు వృక్షములను చూడుము.

మాతలే కశ్చి దత్రాపి రుచిర స్తే వరో భవేత్,
అథ వాన్యాం దిశం భూమే ర్గచ్ఛావ యది మన్యసే. 16

మాతలీ! ఇందైనను నీకు నచ్చెడు అందమైన పెండ్లికొడుకు దొరక వచ్చును. లేదా ఇట కాదని నీ వనుకొన్నచో భూమికి మరియొక దెసకు పోవుదము.

---

14. ఆక్రీడాన్ - క్రీడాస్థానములను.

మాతలి స్త్వబ్రవీ దేనం భాషమాణం తథావిధమ్,
దేవర్షే నైవ మే కార్యం విప్రియం త్రిదివౌకసామ్. 17

అట్లు పలుకుచున్న నారదునితో మాతలి యిట్లనెను. దేవర్షీ! స్వర్గమున నుండువారికి ప్రియము కాని పని నాకు వలదు.

నిత్యానుషక్తవైరా హి భ్రాతరో దేవదానవాః,
పరపక్షేణ సంబన్ధం రోచయిష్యా మ్యహం కథమ్. 18

దేవతలును దానవులును అన్నదమ్ములు. కాని ఎప్పుడు తెగని పగ కలవారు. అట్టి శత్రుపక్షముతో వియ్యము నే నెట్లు ఇష్టపడుదును ?

అన్యత్ర సాధు గచ్ఛావ ద్రష్టుం నార్హామి దానవాన్,
జానామి తవ చాత్మానం హింసాత్మకమనం తథా. 19

మేలు ! మరియొక చోటికి పోదము. దానవులను చూడజాలను. నేను నీ ఆత్మ యెట్టిదో హింసయే స్వభావముగా గల ఆ రాక్షసుల కోరిక ఎట్టిదో యెఱుగుదును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే శతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలి వరు నన్వేషించుట యను నూరవ యధ్యాయము.

—: o :—

---

19. తవ - నీయొక్క; ఆత్మానమ్ - ఆత్మను - (అహింసయే తత్త్వము కలదానిని); తథా = అట్లే; హింసాత్మకమనమ్ - హింసయే స్వభావముగా గల రాక్షసుల కోరికలను; జానామి - ఎరుగుదును.

# ఏకశతతమో௦ధ్యాయః

# నూటయొకటవ అధ్యాయము

## గరుడలోకస్య, గరుడసన్తతీనాం చ వర్ణనమ్.

## గరుడలోకమున గరుడసంతానములను వర్ణించుట.

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

అయం లోకః సుపర్ణానాం పక్షిణాం పన్నగాశినామ్,
విక్రమే గమనే భారే నైషామస్తి పరిశ్రమః. 1

మాతలీ! ఇది గట్టి రెక్కలు కలిగి, పాములను తినెడు గరుడుల లోకము. విక్రమించునపుడు, పోవునపుడు, బరువులు మోయునపుడు వీరికి అలసత లేదు.

వైనతేయసుతైః సూత షడ్భిస్తత మిదం కులమ్,
సుముఖేన సునామ్నా చ సునేత్రేణ సువర్చసా. 2
సురుచా పక్షిరాజేన సుబలేన చ మాతలే,
వర్ధితాని ప్రసృత్యా వై వినతాకులకర్తృభిః. 3

గరుత్మంతుని కొడుకు లారుగురితో ఈ కులము పెంపొందియున్నది. వారు సుముఖుడు, సునాముడు, సునేత్రుడు, సువర్చసుడు, సురుచుడు, సుబలుడు అనువారు. వినతకులమునకు మూలకర్తలగు వీరు మిక్కిలి వేగముతో ఈ కులములను పెంపొందించిరి.

పక్షిరాజాభిజాత్యానాం సహస్రాణి శతాని చ,
కశ్యపస్య తతో వంశే జాతై ర్భూతివివర్ధనైః. 4

పక్షిరాజుకొడుకుల సంతానము వేలువందలుగా విస్తరిల్లినది. వీరందరు కశ్యపుని వంశమున పుట్టి సంపదలను పెంపొందించినవారు.

---

3. ప్రసృత్యా - శీఘ్రమగు గతితో, వేగముతో - వర్ధితాని - పెరిగినవి;

సర్వే హ్యేతే శ్రియా యుక్తాః సర్వే శ్రీవత్సలక్షణాః,
సర్వే శ్రియ మభీప్సన్తో ధారయన్తి బలాన్యుత. 5

వీరందరు సంపదలు పుష్కలముగా గలవారు. వీరందరకు శ్రీవత్సమను గుర్తు గలదు. వీరందరును మఱియు సంపదలు పెంచుకొనగోరుచు సేనలను పోషించుచున్నారు.

కర్మణా క్షత్రియా శ్చైతే నిర్ఘృణా భోగిభోజనాః,
జ్ఞాతిసంక్షయకర్తృత్వా ద్బ్రాహ్మణ్యం న లభన్తి వై. 6

వీరు వృత్తిచేత క్షత్రియులు. దయ లేనివారు. పాములే వీరికి తిండి. తమకులమువారిని చంపుకొనువారు గావున వీరికి బ్రాహ్మణత్వము సిద్ధింపకున్నది.

నామాని చైషాం వక్ష్యామి యథా ప్రాధాన్యతః శృణు,
మాతలే శ్లాఘ్య మేతద్ధి కులం విష్ణుపరిగ్రహమ్. 7

పెద్దతనమునుబట్టి వీరి పేర్లను చెప్పెదను. వినుము. మాతలీ! విష్ణువు వీరిని చేపట్టుటచేత ఈ కులము కొనియాడదగినది గదా!

దైవతం విష్ణు రేతేషాం విష్ణురేవ పరాయణమ్,
హృది చైషాం సదా విష్ణుర్విష్ణు రేవ సదా గతిః. 8

వీరికి విష్ణువు దైవము. విష్ణువు తప్ప మరియొకని నెరుగరు. వీరి హృదయమున నెల్లవేళల విష్ణువు నిలిచియుండును. విష్ణువే వీరికి దిక్కు.

సువర్ణచూడో నాగాశీ దారుణ శ్చణ్డతుణ్డకః,
అనిల శ్చానల శ్చైవ విశాలాక్షోఽథ కుణ్డలీ. 9

సువర్ణచూడుడు, నాగాశి, దారుణుడు, చండతుండకుడు, అనిలుడు, అనలుడు, విశాలాక్షుడు, కుండలి.........

పఙ్కజి ద్వజ్రవిష్కమ్భో వైనతేయోఽథ వామనః,
వాతవేగో దిశాచక్షు ర్నిమేషోఽనిమిష స్తథా. 10

పంకజిత్తు, వజ్రవిష్కంభుడు, వైనతేయుడు, వామనుడు, వాతవేగుడు, దిశాచక్షువు, నిమేషుడు, అనిమిషుడు.........

త్రిరావః సప్తరావశ్చ వాల్మీకి ర్ద్వీపక స్తథా,
దైత్యద్వీపః సరిద్ద్వీపః సారసః పద్మకేతనః. 11

---

6. నిర్ఘృణాః - దయ లేనివారు;

త్రిరావుడు, సప్తరావుడు, వాల్మీకి, ద్వీపకుడు, దైత్యద్వీపుడు, సరిద్ద్వీపుడు, సారసుడు, పద్మకేతనుడు.........

సుముఖ శ్చిత్రకేతుశ్చ చిత్రబర్హ స్తథాఽనఘః,
మేఘహృత్ కుముదో దక్షః సర్వాన్తః సహభోజనః. 12

సుముఖుడు, చిత్రకేతనుడు, చిత్రబర్హుడు, అనఘుడు, మేఘహృత్తు, కుముదుడు, దక్షుడు, సర్వాంతుడు, సహభోజనుడు...

గురుభారః కపోతశ్చ సూర్యనేత్ర శ్చిరాన్తకః,
విష్ణుధర్మా కుమారశ్చ పరిబర్హో హరి స్తథా. 13

గురుభారుడు, కపోతుడు, సూర్యనేత్రుడు, చిరాంతకుడు, విష్ణుధర్ముడు, కుమారుడు, పరిబర్హుడు, హరి......

సుస్వరో మధుపర్కశ్చ హేమవర్ణ స్తథైవ చ,
మాలయో మాతరిశ్వా చ నిశాకరదివాకరౌ. 14

సుస్వరుడు, మధుపర్కుడు, హేమవర్ణుడు, మాలయుడు, మాతరిశ్వుడు, నిశాకరుడు, దివాకరుడు...

ఏతే ప్రదేశమాత్రేణ మయోక్తా గరుడాత్మజాః,
ప్రాధాన్యత స్తే యశసా కీర్తితాః ప్రాణినశ్చ యే. 15

అను నీ గరుడుని కొడుకులను గూర్చి నీకు సంగ్రహముగా చెప్పితిని. పెద్దతనము, కీర్తి, బలము అనువానిని బట్టి గొప్పవారిని మాత్రమే చెప్పితిని.

యద్యత్ర న రుచిః కాచి దేహి గచ్ఛావ మాతలే,
తం నయిష్యామి దేశం త్వాం వరం యత్రోపలప్స్యసే. 16

మాతలీ! నీకిందు నచ్చినవాడు లేకున్నచో పద. మంచి వరుడు దొరకు మరియొకచోటికి తీసికొని పోదును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే ఏకాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలివరాన్వేషణమున నూటయొకటవ అధ్యాయము.

—: o :—

15. ప్రాణినః - గొప్పబలము గలవారు;

# ద్వ్యధికశతతమోఽధ్యాయః

# నూటరెండవ అధ్యాయము

### సురభిణా తత్సంతతిభిశ్చ సహ రసాతలసుఖస్య వర్ణనమ్.

### సురభిని, దాని సంతానమునుగూర్చియు రసాతలసుఖమునుగూర్చియు వర్ణించుట.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ఇదం రసాతలం నామ సప్తమం పృథివీతలమ్,
యత్రాస్తే సురభి ర్మాతా గవా మమృతసమ్భవా. 1

మాతలీ ! ఇది భూమికి ఏడవ పొర. దీనిని రసాతల మందురు. ఇందు అమృతమున బుట్టినదియు గోవుతల్లియు నగు సురభి నివసించును.

క్షరన్తీ సతతం క్షీరం పృథివీసారసంభవమ్,
షణ్ణాం రసానాం సారేణ రసమేక మనుత్తమమ్. 2

ఆ తల్లి నేలలోని సారమువలన ఏర్పడినదియు, ఆరు రుచుల సారముతో రూపొందినదియు, మిక్కిలి శ్రేష్ఠమైనదియు నగు క్షీరమును ఎల్లవేళల కురియు చుండును.

అమృతే నాభితృప్తస్య సార ముద్గిరతః పురా,
పితామహస్య వదనా దుదతిష్ఠ దనిన్దితా. 3

అమృతముతో నిండుగా తృప్తి పొంది సారమును వెలిగ్రక్కుచున్న బ్రహ్మనోటినుండి ఏ దోషములేని ఈ గోమాత పుట్టినది.

---

3. సురభి బ్రహ్మముఖమునుండి వెలువడెను. కావుననే విరాట్పురుషుని ముఖమునుండి పుట్టిన బ్రాహ్మణులతో దానికి సమానకులత్వము 'బ్రాహ్మణాశ్చైవ గావశ్చ కుల మేకం ద్విధా కృతమ్' — బ్రాహ్మణులును గోవులును ఒక్క కులము వారే. రెండుగా నయిరి. అని చెప్పుట.

యస్యాః క్షీరస్య ధారాయా నిపతన్త్యా మహీతలే,
హ్రదః కృతః క్షీరనిధిః పవిత్రం పర ముచ్యతే. 4

భూమిపై పడుచున్న ఈ తల్లి పాలధారలతో ఒక పెద్ద మడు గేర్పడి పాలసముద్రమైనది. అది మిక్కిలి పవిత్రమైనదని పేరొందినది.

పుష్పిత స్యేవ ఫేనేన పర్యన్త మనువేష్టితమ్,
పిబన్తో నివస న్త్యత్ర ఫేనపా మునిస త్తమాః. 5

విరగబూచినట్లు దీని నురుగు ఒడ్డంతయు చుట్టుకొనియుండగా దానిని ప్రీతితో తిలకించుచు ఫేనపులను మునివరు లిందు నివసింతురు.

ఫేనపా నామ తే ఖ్యాతాః ఫేనాహారాశ్చ మాతలే,
ఉగ్రే తపసి వర్తన్తే యేషాం బిభ్యతి దేవతాః. 6

ఫేనపులను పేరుగల నురుగును భుజించువారు ప్రసిద్ధముగా నాకరు కలరు. మిక్కిలి తీవ్రమైన తపస్సుచేయు వారికి దేవతలును భయపడుదురు.

అస్యా శ్చతస్రో ధేన్వోఽన్యా దిక్షు సర్వాసు మాతలే,
నివస న్తి దిశాం పాల్యో ధారయన్త్యో దిశః స్మ తాః. 7

ఈ సురభి బిడ్డలు నాలుగు నాలుగు దిక్కులను పాలించుచు దిక్కులను పట్టి యుంచుచున్నవి.

పూర్వాం దిశం ధారయతే సురూపా నామ సౌరభీ,
దక్షిణాం హంసికా నామ ధారయత్యపరాం దిశమ్. 8

తూర్పుదిక్కును సురూప, దక్షిణదిక్కును హంసిక యను సురభి కూతుండ్రు మోయుచున్నారు.

---

5. పుష్పితస్య - తెల్లగానున్న అని భావము; పర్యన్తమ్ - ఒడ్డు ప్రదేశమును; అనువేష్టితమ్-నురుగుతో చుట్టియున్న; పిబన్తః - త్రావుచున్న - ఆదరముతో చూచుచున్న అని భావము.

6. ఇందు చెప్పిన ఫేనపులు వేరని యెరుగదగును.

పశ్చిమా వారుణీ దిక్చ ధార్యతే వై సుభద్రయా,
మహానుభావయా నిత్యం మాతలే విశ్వరూపయా. 9

వరుణుని దగు పడమటిదిక్కును మహానుభావురాలు, మంగళస్వరూపిణి యగు విశ్వరూప యను గోవు మోయుచున్నది.

సర్వకామదుఘా నామ ధేను ర్ధారయతే దిశమ్,
ఉత్తరాం మాతలే ధర్మ్యాం తథైలబిలసంజ్ఞితామ్. 10

కుబేరుని దైన ఉత్తరదిక్కును ధర్మముతో కూడినదానిని సర్వకామదుఘ అను గోవు ధరించుచున్నది.

ఆసాం తు పయసా మిశ్రం పయో నిర్మథ్య సాగరే,
మన్థానం మన్దరం కృత్వా దేవై రసురసంహితైః, 11
ఉద్ధృతా వారుణీ లక్ష్మీ రమృతం చాపి మాతలే,
ఉచ్చైఃశ్రవా శ్చాశ్వరాజో మణిరత్నం చ కౌస్తుభమ్. 12

వీని పాలు కలిసిన పాలసముద్రమును దేవతలు, రాక్షసులు కలసి మందరమును కవ్వముగా చేసికొని చిలికి, సుర, లక్ష్మి, అమృతము, ఉచ్చైశ్శ్రవ మను శ్రేష్ఠమగు గుఱ్ఱమును, మణులలో గొప్పదియగు కౌస్తుభమును వెలికిదీసిరి.

సుధాహారేషు చ సుధాం స్వధాభోజిషు చ స్వధామ్,
అమృతం చామృతాశేషు సురభీ క్షరతే పయః. 13

సుధను భుజించువారికి సుధను, స్వధను ఆహారముగా గొనువారికి స్వధను, అమృతము తినువారికి అమృతమును ఈ సురభి పాలరూపమున కురియును.

అత్ర గాథా పురా గీతా రసాతలనివాసిభిః,
పౌరాణీ శ్రూయతే లోకే గీయతే యా మనీషిభిః. 14

---

10. ఐలబిలసంజ్ఞితామ్ - 'ఇలబిల' కుబేరుని తల్లి. కావున కుబేరుని ఐలబిలు డందురు. అతనికి సంబంధించినది - ఉత్తర దిక్కు.

11. అసురసంహితైః - రాక్షసులతో కూడిన.

ఈ లోకము విషయమున రసాతలమున నివసించువారు పాడుకొను గాథ యొకటి కలదు. అది పురాణరూపమున భూలోకమున పండితులు పాడుకొనగా వినవచ్చుచున్నది.

న నాగలోకే న స్వర్గే న విమానే త్రివిష్టపే,
పరివాసః సుఖ స్తాదృక్ రసాతలతలే యథా. 15

ఈ రసాతలముపై నివసించు సుఖము వంటిది నాగలోకమున గాని, స్వర్గమున గాని, దేవతల విమానమున గాని లేదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే ద్వ్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలి వరుని వెదకు కథయందు నూటరెండవ అధ్యాయము.

—: o :—

# త్ర్యధికశతతమోఽధ్యాయః

# నూటమూడవ అధ్యాయము

**నాగలోకస్థనాగానాం వర్ణనం, నాగకుమారేణ సుముఖేన సహ స్వకన్యాయాః పరిణయం కర్తుం మాతలేర్నిశ్చయః.**

**నారదుడు నాగలోకమునందలి నాగులను వర్ణించుట, నాగకుమారుడగు సుముఖునితో తనబిడ్డకు పెండ్లి చేయుటకు మాతలి నిశ్చయించుట.**

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

ఇదం భోగవతీ నామ పురీ వాసుకిపాలితా,
యాదృశీ దేవరాజస్య పురీవర్యాఽమరావతీ. 1

ఇది భోగవతి యను పట్టణము. వాసుకి దీని యేలిక. దేవతల ప్రభువు ఇంద్రుని శ్రేష్ఠమగు పురము అమరావతి వంటిది.

ఏష శేషః స్థితో నాగో యేనేయం ధార్యతే సదా,
తపసా లోకముఖ్యేన ప్రభావసహితా మహీ. 2

లోకమెల్ల కొనియాడు తపస్సుతో మహిమలతో కూడిన ఈ భూమి నంతటిని అన్నివేళల మోయుచున్న నాగుడు శేష డిదిగో యిందున్నాడు.

శ్వేతాచలనిభాకారో దివ్యాభరణభూషితః,
సహస్రం ధారయన్ మూర్ధ్నాం జ్వాలాజిహ్వో మహాబలః. 3

ఈయన వెండికొండవంటి ఆకారము గలవాడు. దివ్యములగు భూషణములు ధరించినవాడు. వేయితలలు గలవాడు. జ్వాలలవంటి నాలుకలు గలవాడు. గొప్పబలము కలవాడు.

---

3. శ్వేతాచలః — కైలాస పర్వతము.

ఇహ నానావిధాకారా నానావిధవిభూషణాః,
సురసాయాః సుతా నాగా నివసన్తి గతవ్యథాః. 4

ఇందు అనేకవిధములగు రూపములతో పెక్కుతీరులగు ఆభరణములను ధరించి, ఏ బాధయు లేని, నాగులు సురస యను నామె కొడుకులు నివసింతురు.

మణిస్వస్తికచక్రాఙ్కాః కమణ్డలుకలక్షణాః,
సహస్రసంఖ్యా బలినః సర్వే రౌద్రాః స్వభావతః. 5

మణులు, స్వస్తికములు, చక్రములు కమండలువు గుర్తులుగా గలవారు, గొప్పబలము గలవారు, స్వభావమునుబట్టి భీతి పుట్టించువారు నగు వేలకొలది నాగు లిందు గలరు.

సహస్రశిరసః కేచిత్ కేచిత్ పఞ్చశతాననాః,
శతశీర్షా స్తథా కేచిత్ కేచి త్త్రిశిరసోఽపి చ. 6

వేయితలలవారు కొందరు, అయిదువందల నోళ్ళవారు కొందరు, నూరు తలలవారు కొందరు, మూడుతలలవారు మఱికొందరు.

ద్విపఞ్చశిరసః కేచిత్ కేచిత్ సప్తముఖా స్తథా,
మహాభోగా మహాకాయాః పర్వతాభోగభోగినః. 7

పదితలలవారు కొందరు, ఏడుముఖములవారు కొందరు, పెద్దపడగలు, పెద్దదేహములు కలవారు ఇందు గలరు. కొండకొమ్ములవంటి పడగలుగల వారును గలరు.

బహూనీహ సహస్రాణి ప్రయుతా న్యర్బుదాని చ,
నాగానా మేకవంశానాం యథాశ్రేష్ఠం తు మే శృణు. 8

ఒకే వంశమున పుట్టిన నాగులు ఎన్నో వేలసంఖ్యలో పదిలక్షల, వంద లక్షల సఖ్యలో ఉన్నారు. వారిలో ముఖ్యులను జెప్పెదను. వినుము.

వాసుకి స్తక్షక శ్చైవ కర్కోటకధనఞ్జయౌ,
కాలీయో నహుష శ్చైవ కమ్బలాశ్వతరా వుభౌ. 9

వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాళీయుడు, నహుషుడు, కంబలుడు, అశ్వతరుడు......

7. పర్వతాభోగభోగినః - కొండకొమ్మువంటి పడగ గలవారు.

బాహ్యకుణ్డో మణి ర్నాగ స్తథైవాపూరణః ఖగః,
వామన శ్చైలపత్రశ్చ కుకురః కుకుణ స్తథా. 10

బాహ్యకుండుడు, మణినాగుడు, అపూరణుడు, ఖగుడు, వామనుడు, ఏల పత్రుడు, కుకురుడు, కుకుణుడు...

ఆర్యకో నన్దక శ్చైవ తథా కలశపోతకౌ,
కైలాసకః పిఞ్జరకో నాగ శ్చైరావత స్తథా. 11

ఆర్యకుడు, నందకుడు, కలశుడు, పోతకుడు, కైలాసకుడు, పింజరకుడు, ఐరావతుడు...

సుమనోముఖో దధిముఖః శఙ్ఖో నన్దోపనన్దకౌ,
ఆప్తః కోటరక శ్చైవ శిఖీ నిష్ఠూరిక స్తథా. 12

సుమనోముఖుడు, దధిముఖుడు, శంఖుడు, నందుడు, ఉపనందకుడు, ఆప్తుడు, కోటరకుడు, శిఖి, నిష్ఠూరికుడు...

తిత్తిరి ర్హస్తిభద్రశ్చ కుముదో మాల్యపిణ్డకః,
ద్వౌ పద్మౌ పుణ్డరీకశ్చ పుష్పో ముద్గరపర్ణకః. 13

తిత్తిరి, హస్తిభద్రుడు, కుముదుడు, మాల్యపిండకుడు, పద్మ లిద్దరు, పుండరీకుడు, పుష్పుడు, ముద్గరపర్ణకుడు...

కరవీరః పీఠరకః సంవృత్తో వృత్త ఏవ చ,
పిణ్డారో బిల్వపత్రశ్చ మూషికాదః శిరీషకః. 14

కరవీరుడు, పీఠరకుడు, సంవృత్తుడు, వృత్తుడు, పిండారుడు, బిల్వ పత్రుడు, మూషికాదుడు, శిరీషకుడు......

దిలీపః శఙ్ఖశీర్షశ్చ జ్యోతిష్కోఽథాపరాజితః,
కౌరవ్యో ధృతరాష్ట్రశ్చ కుమారః కుశక స్తథా. 15

దిలీపుడు, శంఖశీర్షుడు, జ్యోతిష్కుడు, అపరాజితుడు, కౌరవ్యుడు, ధృత రాష్ట్రుడు, కుమారుడు, కుశకుడు...

విరజా ధారణ శ్చైవ సుబాహు ర్ముఖరో జయః,
బధిరాన్ధౌ విశుణ్డిశ్చ విరసః సురస స్తథా. 16

విరజుడు, ధారణుడు, సుబాహువు, ముఖరుడు, జయుడు, బధిరుడు, అంధుడు, విశుండి, విరసుడు, సురసుడు......

ఏతే చాన్యే చ బహవః కశ్యప స్యాత్మజాః స్మృతాః,
మాతలే పశ్య యద్యత్ర కశ్చి త్తే రోచతే వరః. 17

వీరును మరియు చాలమంది కశ్యపుని కుమారులగు నాగులు గలరు. మాతలీ! వీరిలో నీకు నచ్చిన వరు డున్నచో చూచికొనుము.

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

మాతలి స్త్వేక మవ్యగ్రః సతతం సంనిరీక్ష్య వై,
పప్రచ్ఛ నారదం తత్ర ప్రీతిమానివ చాభవత్. 18

మాతలియు ఒకనివైపు చాలసేపు దృష్టి నిలిపి చూచి, ప్రీతి పొందినట్లయి నారదు నిట్లడిగెను.

మాతలి రువాచ - మాతలి యిట్లనెను.

స్థితో య ఏష పురతః కౌరవ్య స్యార్యకస్య తు,
ద్యుతిమాన్ దర్శనీయశ్చ కస్యైష కులనన్దనః. 19

ఇదిగో నాముందు నిలిచియుండెనే, యాతడు చక్కని తేజస్సుతో చూడ ముచ్చట గొలుపుచున్నాడు. ఇతడు కౌరవ్యుని కులమువాడా ? ఆర్యకుని కులము వాడా ?

కః పితా జననీ చాస్య కతమస్యైవ భోగినః,
వంశస్య కస్యైష మహాన్ కేతుభూత ఇవ స్థితః. 20

"ఇతని తలిదండ్రు లెవరు ? ఏ నాగకులమువాడు ? ఏ వంశమునకు వీడు గొప్ప పతాకవలె ఒప్పియున్నవాడు ?

ప్రణిధానేన ధైర్యేణ రూపేణ వయసా చ మే,
మనః ప్రవిష్టో దేవర్షే గుణకేశ్యాః పతి ర్వరః. 21

శ్రద్ధ, ధైర్యము, రూపము, ప్రాయము అనువానితో వీడు నా మనస్సు చొచ్చెను దేవర్షీ! ఈతడు గుణకేశికి తగిన భర్త.

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

మాతలిం ప్రీతమనసం దృష్ట్వా సుముఖదర్శనాత్,
నివేదయామాస తదా మాహాత్మ్యం జన్మ కర్మ చ. 22

మొగమును చూచియే మాతలి ప్రీతి నిండిన మనసుతో నున్నాడని యెరిగి నారదు డంత నా కుమారుని మహిమను, పుట్టుకను, వృత్తిని గూర్చి వివరించెను.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ఐరావతకులే జాతః సుముఖో నామ నాగరాట్,
ఆర్యకస్య మతః పౌత్రో దౌహిత్రో వామనస్య చ. 23

వీడు ఐరావతకులమున పుట్టినవాడు. సుముఖు డను పేరు గల నాగరాజు. ఆర్యకుని కొడుకు కొడుకు. వామనుని కూతు కొడుకు.

ఏతస్య హి పితా నాగ శ్చికురో నామ మాతలే,
న చిరా ద్వైనతేయేన పఞ్చత్వ ముపపాదితః. 24

వీని తండ్రి చికురు డను నాగుని ఇటీవల గరుత్మంతుడు చంపెను.

తతోఽబ్రవీత్ ప్రీతమనా మాతలి ర్నారదం వచః,
ఏష మే రుచిత స్తాత జామాతా భుజగోత్తమః. 25

ప్రీతి చెందిన మనస్సుగల మాతలి నారదునితో నిట్లు పలికెను: 'తాతా! ఈ నాగరాజు నాకు బాగుగా నచ్చిన అల్లుడు'.

క్రియతా మత్ర యత్నో హి వై ప్రీతిమా నస్మ్యనేన వై,
అస్మై నాగాయ వై దాతుం ప్రియాం దుహితరం మునే. 26

ఓ మునీ! ఇందు ప్రయత్నము చేయదగును. ఈ నాగునకు నా బిడ్డ నిచ్చుటకు నేను మిక్కిలి ప్రీతితో ఉన్నాను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే త్ర్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున మాతలి వరుని వెదకుట యను కథయందు నూటమూడవ అధ్యాయము.

—:0:—

# చతురధికశతతమోఽధ్యాయః

# నూటనాలుగవ అధ్యాయము

నాగరాజార్యకస్య సమ్ముఖే సుముఖేన సహ మాతలికన్యాయాః
పరిణయార్థం నారదస్య ప్రస్తావః; మాతలిప్రభృతిభి రిన్ద్రేణ సుముఖాయ
దీర్ఘాయుష్ట్వప్రదాపనం, గుణకేశీసుముఖయో ర్వివాహశ్చ.

నాగరాజగు ఆర్యకునియొద్ద సుముఖునితో మాతలికన్యకు వివాహము చేయుమని నారదుడు ప్రస్తావన చేయుట; మాతలి మున్నగువారు ఇంద్రునితో సుముఖునకు దీర్ఘాయుర్దాయ మిప్పించుట; గుణకేశీసుముఖుల వివాహము.

[కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

మాతలే ర్వచనం శ్రుత్వా నారదో మునిసత్తమః,
అబ్రవీ న్నాగరాజాన మార్యకం కురునన్దన.

కురునందనా! మాతలిమాట విని మునిశ్రేష్ఠుడగు నారదుడు నాగరాజగు ఆర్యకునితో ఇట్లు పలికెను]

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

సూతోఽయం మాతలి ర్నామ శక్రస్య దయితః సుహృత్,
శుచిః శీలగుణోపేత స్తేజస్వీ వీర్యవాన్ బలీ. 1

ఈయన మాతలి. ఇంద్రునకు ప్రియుడు, మిత్రమునైన సారథి. పరిశుద్ధుడు. మంచి స్వభావము, గుణములు కలవాడు. తేజము, వీర్యము, బలము గలవాడు.

శక్ర స్యాయం సఖా చైవ మన్త్రీ సారథి రేవ చ,
అల్పాన్తరప్రభావశ్చ వాసవేన రణే రణే. 2

దేవేంద్రున కీతడన్న ప్రాణము. ఇత డాతనికి మంత్రి, సారథియు. యుద్ధము లన్నింటను కొంచె మటునిటుగా ఇంద్రు నంతటివాడు;

అయం హరిసహస్రేణ యుక్తం జైత్రం రథోత్తమమ్,
దేవాసురేషు యుద్ధేషు మనసైవ నియచ్ఛతి. 3

'దేవదానవుల యుద్ధములలో నీతడు వేయి గుఱ్ఱములు పూన్చిన, జయము పొందు శ్రేష్ఠమగు రథమును మనసుతోనే అదుపులో నుంచుకొనును'.

అనేన విజితా నశ్వై ర్దోర్భ్యాం జయతి వాసవః,
అనేన బలభిత్ పూర్వం ప్రహృతే ప్రహరత్యుత. 4

'ముం దీతడు గుఱ్ఱములతో గెలిచినవారిని ఇంద్రుడు చేతులతో గెలుచును. ముం దీతడు కొట్టినవానిని బలారి చావగొట్టును'.

అస్య కన్యా వరారోహా రూపే ణాసదృశీ భువి,
సత్యశీలగుణోపేతా గుణకేశీతి విశ్రుతా. 5

ఈయనకు చక్కని కూతురు గలదు. రూపములో ఆమె కీడైనవారు భూమిలో లేరు. సత్యము, శీలము, గుణము కలిగిన ఆయమను గుణకేశి యందురు'.

తస్యాస్య యత్నా చ్చరత స్త్రైలోక్య మమరద్యుతే,
సుముఖో భవతః పౌత్రో రోచతే దుహితుః పతిః. 6

పని బూని మూడులోకములు తిరుగుచున్న అట్టి యీయనకు నీ మనుమడు సుముఖుడు, ఓ అమరద్యుతీ! తన కూతునకు వరుడుగా నచ్చెను.

యది తే రోచతే సమ్యగ్ భుజగోత్తమ మా చిరమ్,
క్రియతా మార్యక క్షిప్రం బుద్ధిః కన్యావరిగ్రహే. 7

ఓ భుజగరాజా! ఆర్యకా! నీ కిది బాగుగా నచ్చినచో వెనువెంటనే కన్యను గ్రహించుటలో మనసు పెట్టుము. ఆలసింపవలదు

యథా విష్ణుకులే లక్ష్మీ ర్యథా స్వాహా విభావసోః,
కులే తవ తథైవాస్తు గుణకేశీ సుమధ్యమా. 8

విష్ణునింట లక్ష్మివలె, అగ్నియింట స్వాహాదేవి వలె నీయింట చక్కని చుక్క గుణకేశి నిలుచుగాక!

పౌత్రస్యార్థే భవాం స్తస్మాద్ గుణకేశీం ప్రతీచ్ఛతు,
సదృశీం ప్రతిరూపస్య వాసవస్య శచీమివ. 9

'అపురూపుడైన నీ మనుమనికి దేవేంద్రునకు శచీదేవివలె గుణకేశిని భార్యగా నీవును ఇష్టపడుము.'

పితృహీనమపి హ్యేనం గుణతో వరయామహే,
బహుమానాచ్చ భవత స్తథై వైరావతస్య చ. 10

'నీయందు, ఐరావతునియందు ఉన్న మన్ననను బట్టి తండ్రిలేనివాడైనను ఈ బాలుని వరించుచున్నాము'.

సుముఖశ్చ గుణై శ్చైవ శీలశౌచదమాదిభిః,
అభిగమ్య స్వయం కన్యా మయం దాతుం సముద్యతః. 11
మాతలి స్తస్య సంమానం కర్తు మర్హో భవానపి.

'సుముఖుడును శీలము, శుద్ధి, నిగ్రహము, మున్నగు గుణములతో అలరారుచున్నాడు. కావుననే ఈ మాతలి తనకు దానై వచ్చి తన కన్య నిచ్చుటకు సిద్ధముగా నున్నాడు. నీ వాతనిని మన్నింపదగును.'

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

స తు దీనః ప్రహృష్టశ్చ ప్రాహ నారద మార్యకః. 12
మ్రియమాణే తథా పౌత్రే పుత్రే చ నిధనం గతే,
కథ మిచ్ఛామి దేవర్షే గుణకేశీం స్నుషాం ప్రతి. 13

అంత నా ఆర్యకుడు తన మనుమని వరించుటకు వచ్చిరని ఒక ప్రక్క పొంగిపోవుచునే, కొడుకు మరణించెనని విచారించుచు 'దేవర్షీ ! గుణకేశిని కోడలుగా నెట్లు కోరుదును?' అనెను.

ఆర్యక ఉవాచ - ఆర్యకు డిట్లు పలికెను.

న మే నైత ద్బహుమతం మహర్షే వచనం తవ,
సఖా శక్రస్య సంయుక్తః కస్యాయం నేప్సితో భవేత్. 14

మహర్షీ! ఈ నీ మాట నాకు మన్నింపరానిది కానే కాదు. దేవేంద్రుని ప్రాణమిత్రము చుట్టము అగుట నెవడు వాంఛింపడు?

కారణస్య తు దౌర్బల్యా చ్చిన్తయామి మహామునే,
అస్య దేహకర స్తాత మమ పుత్రో మహాద్యుతే, 15
భక్షితో వైనతేయేన దుఃఖార్తా స్తేన వై వయమ్.

'ఒక కారణమునుబట్టి బలము చెడినవాడనైన మహామునీ! చింతించు చున్నాను. ఈ సుముఖునికి దేహమిచ్చిన నా కొడుకును గరుత్మంతుడు తిని వైచెను. ఆ కారణమున మేము దుఃఖపడుచున్నాము.

పునరేవ చ తేనోక్తం వైనతేయేన గచ్ఛతా,
మాసే నాన్యేన సుముఖం భక్షయిష్య ఇతి ప్రభో. 16

ప్రభూ! ఆ వినత కొడుకు వెళ్ళుచు ఒక్కనెలలో సుముఖుని తిందుననియు పలికెను.

ధ్రువం తథా తద్భవితా జానీమ స్తస్య నిశ్చయమ్,
తేన హర్షః ప్రణష్టో మే సుపర్ణవచనేన వై. 17

ఆ మాట యట్లే యగును. మే మాతని నిశ్చయ మెరుగుదుము. ఆ సుపర్ణుని మాటతో మా ఉల్లాస మంతయు చచ్చిపోయినది.

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

మాతలి స్త్వబ్రవీ దేనం బుద్ధి రత్ర కృతా మయా,
జామాతృభావేన వృతః సుముఖ స్తవ పుత్రజః. 18

'అంత మాతలి యిట్లు పలికెను - 'నా బుద్ధి యిచట నిలిచినది. నేను నీ కొడుకు కొడుకగు సుముఖుని అల్లునిగా వరించితిని'.

సోఽయం మయా చ సహితో నారదేన చ పన్నగః,
త్రిలోకేశం సురపతిం గత్వా పశ్యతు వాసవమ్. 19

'అట్టి యీ నాగకుమారుడు నాతో నారదునితో కలిసి మూడు లోకములకు ప్రభువు, దేవతలకు నాథుడు అగు ఇంద్రునికడ కరిగి ఆతని చూడవలయును'.

శేషేణైవాస్య కార్యేణ ప్రజ్ఞాస్యా మ్యహ మాయుషః,
సుపర్ణస్య విఘాతే చ ప్రయతిష్యామి సత్తమ. 20

వీని ఆయు వెంత మిగిలెనో నేను తెలిసికొందును. సుపర్ణుని దెబ్బకొట్టుట కును ప్రయత్నింతును.

సుముఖశ్చ మయా సార్ధం దేవేశ మభిగచ్ఛతు,
కార్యసంసాధనార్థాయ స్వస్తి తేఽస్తు భుజంగమ! 21

'సుముఖుడు ఈ కార్యము సాధించుటకై నాతోపాటు దేవేంద్రుని కడకు రావలయును. నాగరాజా! నీకు శుభ మగుగాక!'

తత స్తే సుముఖం గృహ్య సర్వ ఏవ మహౌజసః,
దదృశుః శక్రమాసీనం దేవరాజం మహాద్యుతిమ్. 22

అంత ఆ గొప్పబలము గల వారందరు సుముఖుని తీసికొని గొప్ప తేజస్సుతో కూర్చున్న దేవరాజు దర్శనము చేసికొనిరి.

సఙ్గత్యా తత్ర భగవాన్ విష్ణు రాసీ చ్చతుర్భుజః,
తత స్తత్ సర్వ మాచఖ్యౌ నారదో మాతలిం ప్రతి. 23

అప్పు డచట నాలుగు భుజముల వాడగు విష్ణువు కూడ ఉండుట తటస్థించెను. అంత నారదుడు మాతలిని గూర్చి యంతయు చెప్పెను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః పురన్దరం విష్ణు రువాచ భువనేశ్వరమ్,
అమృతం దీయతా మస్మై క్రియతా మమరైః సమః. 24

అంత విష్ణువు లోకముల కధిపతి యగు దేవేంద్రుని చూచి యిట్లు పలికెను. దేవేంద్రా! ఈ బాలున కమృత మొసగుము. వీనిని దేవతలతో సమానముగా చేయుము

మాతలి ర్నారద శ్చైవ సుముఖ శ్చైవ వాసవ,
లభన్తాం భవతః కామాత్ కామమేతం యథేప్సితమ్. 25

వాసవా! మాతలియు నారదుడును, సుముఖుడును నీ యిచ్ఛ వచ్చినట్లే కోరిన కోరికలు పొందుదురు గాక!

పురన్దరోఽథ సఞ్చిన్త్య వైనతేయపరాక్రమమ్,
విష్ణుమే వాబ్రవీ దేనం భవానేవ దదాత్వితి. 26

అంత నా యింద్రుడు గరుత్మంతుని పరాక్రమమును మనసున తలపోసి వారి కోరికల నీవే తీర్పుము అని విష్ణువుతో పలికెను.

విష్ణు రువాచ - విష్ణు విట్లనెను.

ఈశ స్త్వం సర్వలోకానాం చరాణా మచరాశ్చ యే,
త్వయా దత్త మదత్తం కః కర్తు ముత్సహతే విభో. 27

ప్రభూ! నీవు జంగమములు, స్థావరములు నగు సర్వలోకములకు ఈశ్వరుడవు. నీ విచ్చినది కాదనదలచువా డెవ్వడు?

ప్రాదా చ్ఛక్ర స్తత స్తస్మై పన్నగా యాయు రుత్తమమ్,
న త్వేవ మమృతప్రాశం చకార బలవృత్రహా. 28

అంత దేవేంద్రుడు వానికి ఉత్తమమగు ఆయువు నొసగెను. కాని అమృతమును మాత్ర మొసగలేదు.

లబ్ధ్వా వరం తు సుముఖః సుముఖః సంబభూవ హ,
కృతదారో యథాకామం జగామ చ గృహాన్ ప్రతి. 29

సుముఖుడు, వరము పొంది చక్కని మోముతో అలరారెను. తన యిచ్ఛ మేరకు వివాహమాడి యింటికేగెను.

నారద స్త్వార్యక శ్చైవ కృతకార్యౌ ముదా యుతౌ,
అభిజగ్మతు రభ్యర్చ్య దేవరాజం మహాద్యుతిమ్. 30

పనులు దీరిన నారదుడును, ఆర్యకుడును, సంతసించి గొప్ప తేజస్సుగల దేవరాజును పూజించి తమతావుల కరిగిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే చతురధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున మాతలి పెండ్లికొడుకును వెదకుట యను కథగల నూటనాలుగవ అధ్యాయము.

—:o:—

# పఞ్చాధికశతతమోఽధ్యాయః

# నూటఅయిదవ అధ్యాయము

## శ్రీవిష్ణునా గరుడగర్వస్య భఞ్జనం
## దుర్యోధనేన కణ్వమునే రుపదేశస్యావహేలనమ్.

## శ్రీవిష్ణువు గరుడుని గర్వము త్రుంచుట.
## దుర్యోధనుడు కణ్వముని ఉపదేశమును వెక్కిరించుట.

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

గరుడ స్తత్ర శుశ్రావ యథావృత్తం మహాబలః,
ఆయుఃప్రదానం శక్రేణ కృతం నాగస్య భారత. 1

ఇంద్రుడు నాగకుమారున కాయువు నొసగిన వృత్తాంత మున్నదున్నట్లు గొప్ప బలముగల గరుడుడు వినెను.

పక్షవాతేన మహతా రుద్ధ్వా త్రిభువనం ఖగః,
సువర్ణః పరమక్రుద్ధో వాసవం సముపాద్రవత్. 2

అంత నా పక్షిరాజు గొప్పదియగు రెక్కల గాలితో మూడు లోకములను బిగించి పరమకోపముతో ఇంద్రుని కదకు పరువెత్తెను.

గరుడ ఉవాచ - గరుడు డిట్లు పలికెను.

భగవన్ కిమవజ్ఞానా ద్వృత్తిః ప్రతిహతా మమ,
కామకారవరం దత్త్వా పునశ్చలితవా నసి. 3

'ఏమయ్యా! భగవానుడా! నన్నీసడించి నా నోటిముందు కూటిని ఏల లాగివైచితివి? ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపుమని వరమిచ్చి మరల కదిలిపోతివేల'?

---

3. కామకారవరం - ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపవచ్చు నను వరమును.

నిసర్గాత్ సర్వభూతానాం సర్వభూతేశ్వరేణ మే,
ఆహారో విహితో ధాత్రా కిమర్థం వార్యతే త్వయా. 4

ప్రాణులన్నింటికి సహజమైన తీరున సర్వభూతములకు ప్రభువగు బ్రహ్మ నాకీ తిండి ఏర్పరచెను. దానిని నీవేల అడ్డుకొందువు?

వృత శ్చైవ మహానాగః స్థాపితః సమయశ్చ మే,
అనేన చ మయా దేవ భర్తవ్యః ప్రసవో మహాన్. 5

నేనీ పెనుబాము నెన్నుకొంటిని. కట్టుబాటుకూడ చేసికొంటిని. దీనితో గదా నేను పెద్దదియగు నా సంతానమును పోషించుకొనవలయును.

ఏతస్మింస్తు తథాభూతే నాన్యం హింసితు ముత్సహే,
క్రీడసే కామకారేణ దేవరాజ యథేచ్ఛకమ్. 6

వీ డిట్లయినచో మరియొకని చంపనొల్లను. దేవరాజా! యిష్టము వచ్చినట్లు కామకారునితో ఆటలాడెదవా?

సోఽహం ప్రాణాన్ విమోక్ష్యామి తథా పరిజనో మమ,
యే చ భృత్యా మమ గృహే ప్రీతిమాన్ భవ వాసవ. 7

అట్టి నేను, నా కుటుంబము, నా యింట గల పరిచారకులు అందరము ప్రాణములు వదలెదము. వాసవా! నీవు సంతోషింపుము.

ఏత చ్చైవాహ మర్హామి భూయశ్చ బలవృత్రహన్,
త్రైలోక్య స్యేశ్వరో యోఽహం పరభృత్యత్వ మాగతః. 8

బలవృత్రాసురులను చంపిన యింద్రా! ఇదియును నాకు తగినదే లెమ్ము. మూడు లోకములకు ప్రభువునైన నేను మరియొకనికి దాసుడనైతిని.

త్వయి తిష్ఠతి దేవేశ న విష్ణుః కారణం మమ,
త్రైలోక్యరాజ రాజ్యం హి త్వయి వాసవ శాశ్వతమ్. 9

దేవరాజా! నీ వుండగా నాకు విష్ణువుతో పనియేమి? ఏలయన ముల్లోకముల నేలువాడా! శాశ్వతమగు రాజ్యము నీయందు గదా నిలిచియున్నది.

---

6. కామకారేణ - ఇష్టమువచ్చినట్లు ప్రవర్తింపకలవానితో,

మమాపి దక్షస్య సుతా జననీ కశ్యపః పితా,
అహమ ప్యుత్సహే లోకాన్ సమన్తా ద్వోఢు మంజసా. 10

నా తల్లియు దక్షుని కుతురే. తండ్రి కశ్యపుడే. నా శక్తితో నేనును లోకముల మోయ నుంకింతును.

అసహ్యం సర్వభూతానాం మమాపి విపులం బలమ్,
మయాఽపి సుమహత్ కర్మ కృతం దైతేయనిగ్రహే. 11

భూతములన్నియు తట్టుకొనలేని గొప్ప బలము నాకును గలదు. దితి కొడుకుల నణచునాడు నేనును ఘనకార్య మాచరించితిని.

శ్రుతశ్రీః శ్రుతసేనశ్చ వివస్వా న్రోచనాముఖః,
ప్రసృతః కాలకాక్షశ్చ మయాపి దితిజా హతాః. 12

శ్రుతశ్రీ, శ్రుతసేనుడు, వివస్వంతుడు, రోచనాముఖుడు, ప్రసృతుడు, కాలకాక్షుడు అను రక్కసులను నేనును చంపితిని.

యత్తు ధ్వజస్థానగతో యత్నాత్ పరిచరామ్యహమ్,
వహామి చైవానుజం తే తేన మా మవమన్యసే. 13

నేను ధ్వజముననుండి నీ తమ్ముని శ్రద్ధతో సేవించుచున్నాడ ననియు, వాహనముగా మోయుచున్నాడననియు తలచి నన్ను అవమానించుచున్నావేమో!

కోఽన్యో భారసహో హ్యస్తి కోఽన్యోఽస్తి బలవత్తరః,
మయా యోఽహం విశిష్టః సన్ వహామీమం సబాన్ధవమ్. 14

నాకంటె బరువుమోయువాడు, మిక్కిలి బలము కలవాడు మఱియొకడు కలడా? కావుననే నేను మిన్ననై యీ నీ తమ్ముని బంధువులతో పాటు మోయుచున్నాను.

అవజ్ఞాయ తు య త్తేఽహం భోజనా ద్వ్యవరోపితః,
తేన మే గౌరవం నష్టం త్వత్త శ్చాస్మాచ్చ వాసవ. 15

నన్ను చులకన చేసి నా నోటిముందు కూడు లాగివైచితివి. దానితో నీ వలనను నీతమ్మునివలనను నా పరువు పాడై పోయినది.

అదిత్యాం య ఇమే జాతా బలవిక్రమశాలినః,
త్వమేషాం కిల సర్వేషాం బలేన బలవత్తరః. 16

అదితికి పుట్టిన వీరందరు బలము, పరాక్రమము గలిగినవారే. ఈ యందరకు నీవు బలమున మిన్నవు కాబోలు!

సోఽహం పక్షైకదేశేన వహామి త్వాం గతక్లమః,
విమృశ త్వం శనైః స్తాత కో న్వత్ర బలవానితి. 17

ఆ నేను అలుపు సొలుపు లెరుగక రెక్కలోని ఒక ముక్కతో నిన్ను మోయుదును. బాబూ! ఇందు బలవంతు డెవడో మెల్లగా నీవే ఆలోచించు.

కణ్వ ఉవాచ - కణ్వు డిట్లు చెప్పెను.

స తస్య వచనం శ్రుత్వా ఖగ స్యోదర్కదారుణమ్,
అక్షోభ్యం క్షోభయం స్తార్క్ష్య మువాచ రథచక్రభృత్. 18

అట్లా పక్షి పలికిన ఉమ్మెత్తముంటివలె దారుణమైన పలుకు విని, ఎందును క్షోభ నెరుగని ఆ గరుడుని క్షోభపెట్టుచు, చక్రపాణి యగు విష్ణు విట్లు పలికెను.

గరుత్మన్ మన్యసేఽత్మానం బలవన్తం సుదుర్బలమ్,
అల మస్మత్సమక్షం తే స్తోతు మాత్మాన మణ్డజ. 19

పక్షీ! మిక్కిలిగా బలము చచ్చిన నీవు గొప్పబలమున్న వాడవని తలచుచున్నావా? అందును నా ముందు గొప్పలు చెప్పుకొనుచున్నావు. చాలు చాలు.

త్రైలోక్యమపి మే కృత్స్న మశక్తం దేహధారణే,
అహ మేవాత్మనాత్మానం వహామి త్వాం చ ధారయే. 20

'మూడు లోకములు కట్టకట్టుకొని వచ్చినను నా దేహమును మోయజాలవు. నన్ను నేనే మోసికొనుచున్నాను. నిన్నును మోయుచున్నాను.

ఇమం తావన్మమైకం త్వం బాహుం సవ్యేతరం వహ,
యద్యేనం ధారయస్యేకం సఫలం తే వికత్థితమ్. 21

ఏదీ? ఈ నా ఎడమచేతి నొక్కదానిని మోయుము. దీనిని మోసినచో నీవు నిన్ను పొగడుకొనుట సఫలమగును.

---

17. ఉదర్కదారుణమ్-ఉమ్మెత్తముల్లువలె దారుణమైన: తార్క్ష్యమ్-గరుడుని.
19. మన్యసేఽత్మానమ్-అనుచోప సంధి ఆర్షము.

తతః స భగవాం స్తస్య స్కన్ధే బాహుం సమాసజత్,
నిపపాత స భారార్తో విహ్వలో నష్టచేతనః. 22

అంత నా భగవంతుడు వాని మెడమీద తన చేతిని నిలిపెను. వాడును బరువునకు తాళలేక గిలగిల లాడుచు ఒడ లెరుగక నేలగూలెను.

యావాన్ హి భారః కృత్స్నాయాః పృథివ్యాః పర్వతైః సహ,
ఏకస్యా దేహశాఖాయా స్తావద్భార మమన్యత. 23

కొండలతో పాటు మొత్తము భూమి బరువంతయు ఆ యొక్క దేహ భాగమునందే యున్నట్లు వాని కనిపించెను.

న త్వేనం పీడయామాస బలేన బలవత్తరః,
తతో హి జీవితం తస్య న వ్యనీనశ దచ్యుతః. 24

నిజమునకు ఆ బలశాలి తన బలమంతయు నుపయోగించి వానిని నొక్కలేదు. ఆ విధముగా అచ్యుతుడు వాని ప్రాణములు తీయలేదు.

వ్యాత్తాస్యః స్రస్తకాయశ్చ విచేతా విహ్వలః ఖగః,
ముమోచ పత్రాణి తదా గురుభారప్రపీడితః. 25

ఆ పెనుభారమునకు మిక్కిలి నలిగిన ఆ పక్షి నోరు వెళ్ళబెట్టి క్రుంగిపోయిన దేహముతో, చేష్ట లుడిగి గిలగిల కొట్టుకొనుచు రెక్కలు రాల్చెను.

స విష్ణుం శిరసా పక్షీ ప్రణమ్య వినతాసుతః,
విచేతా విహ్వలో దీనః కిఞ్చి ద్వచన మబ్రవీత్. 26

అంత నా వినతకొడుకు విష్ణువునకు తలతో ప్రణమిల్లి, చేష్ట లుడిగి దీనుడై కొంచెముగా నిట్లు పలికెను.

భగవన్ లోకసారస్య సదృశేన వపుష్మతా,
భుజేన స్వైరముక్తేన నిష్పిష్టోఽస్మి మహీతలే. 27

భగవంతుడా! లోకముల సారమునకు తగిన దేహముగల నీచేయి నాపై నుంచగా నేలపై బండతో నూరినట్లయితిని.

క్షన్తు మర్హసి మే దేవ విహ్వలస్యాల్పచేతసః,
బలదాహవిదగ్ధస్య పక్షిణో ధ్వజవాసినః. 28

బుద్ధి లేనివాడను. బలగర్వము నన్ను కాల్చివైచినది. విర్రవీగితిని. నీ పతాకపై నుండు పక్షిని. దేవా! నన్ను మన్నింపవలయును.

న హి జ్ఞాతం బలం దేవ మయా తే పరమం విభో,
తేన మన్యే హ్యహం వీర్య మాత్మనో న సమం పరైః. 29

ప్రభూ! దేవా! నీ గొప్ప బలమెరుగ నైతిని. దానితో నా శక్తి కితరులు సాటికా రని తలచితిని.

తతశ్చక్రే స భగవాన్ ప్రసాదం వై గరుత్మతః,
మైవం భూయ ఇతి స్నేహా త్తదా చైనముపాచ హ. 30

అంత నా దేవుడు గరుత్మంతుని యెడ ననుగ్రహము చూపెను. స్నేహముతో 'మరల నిట్లెన్నడు ప్రవర్తింపకు'మని పలికెను.

పాదాఙ్గుష్ఠేన చిక్షేప సుముఖం గరుడోరసి,
తతఃప్రభృతి రాజేన్ద్ర సహ సర్పేణ వర్తతే. 31

కాలిబొటనవ్రేలితో ఆ సుముఖుని గరుడుని రొమ్ముపై విసరెను. రాజేంద్రా! అదిమొదలు గరుడుడు వానితో కలసి తిరుగుచుండెను.

ఏవం విష్ణుబలాక్రాన్తో గర్వనాశ ముపాగతః,
గరుడో బలవా న్రాజన్ వైనతేయో మహాయశాః. 32

అట్లు మహాకీర్తిగల గరుత్మంతుడే విష్ణుబలమునకు లొంగి గర్వభంగము పొందెను.

కణ్వ ఉవాచ-కణ్వుడు మరియు నిట్లనెను.

తథా త్వమపి గాన్ధారే యావత్పాణ్డుసుతాన్రణే,
నాసాదయసి తాన్ వీరాం స్తావజ్జీవసి పుత్రక: 33

నాయనా! సుయోధనా! నీవును మహావీరులగు పాండుసుతులను యుద్ధమున తాకనంతవరకే బ్రదుకుదువు.

భీమః ప్రహరతాం శ్రేష్ఠో వాయుపుత్రో మహాబలః,
ధనఞ్జయ శ్చేన్ద్రసుతో న హన్యాతాం తు కం రణే. 34

గొప్ప బలముగల భీముడు వాయుదేవుని కుమారుడు. యుద్ధవీరులలో శ్రేష్ఠుడు. అర్జునుడు ఇంద్రుని కుమారుడు. యుద్ధమున వారెవ్వనిని చంపకుందురు?

విష్ణు ర్వాయుశ్చ శక్రశ్చ ధర్మస్తౌ చాశ్వినా వుభౌ,
ఏతే దేవా స్త్వయా కేన హేతునా వీక్షితుం క్షమాః. 35

విష్ణువు, వాయువు, ఇంద్రుడు, ధర్ముడు, అశ్వను లిరువురు - ఈ దేవతలను నీవు ఏమి చూచుకొని చూడజాలుదువు?

తదలం తే విరోధేన శమం గచ్ఛ నృపాత్మజ,
వాసుదేవేన తీర్థేన కులం రక్షితు మర్హసి. 36

కావున నాయనా! విరోధము చాలింపుము. రాజకుమారా! శాంతి పొందుము. వాసుదేవుడను తీర్థము నాశ్రయించి కులమును రక్షించుకొనుము.

ప్రత్యక్షదర్శీ సర్వస్య నారదోఽయం మహాతపాః,
మాహాత్మ్యస్య తదా విష్ణోః సోఽయం చక్రగదాధరః. 37

నే నిప్పుడు చెప్పిన ఈ విష్ణుమహిమ సంతతిని మహాతపస్వి ఈ నారదుడు స్వయముగా కనులార చూచెను. చక్రమును, గదను చేపట్టిన విష్ణు వట్టివాడు.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

దుర్యోధనస్తు తచ్ఛ్రుత్వా నిఃశ్వసన్ భ్రుకుటీముఖః,
రాధేయ మభిసంప్రేక్ష్య జహాస స్వనవ త్తదా. 38

దుర్యోధనుడు మాత్రము అదియంతయు విని బుసకొట్టుచు బొమలు ముడిచి కర్ణుని వంక చూచి, బిగ్గరగా నవ్వెను.

కదర్థీకృత్య తద్వాక్య మృషేః కణ్వస్య దుర్మతిః,
ఊరుం గజకరాకారం తాడయ న్నిద మబ్రవీత్. 39

ఆ దుష్టబుద్ధి కణ్వర్షి మాటను చులకనచేసి ఏనుగు తొండమువంటి తొడ చరచుచు, నిట్లు పలికెను.

యథైవేశ్వరసృష్టోఽస్మి యద్భావీ యా చ మే గతిః,
తథా మహర్షే వర్తామి కిం ప్రలాపః కరిష్యతి. 40

మహర్షీ! నన్నీశ్వరుడు సృజించినట్లు ప్రవర్తింతును. భవిష్య త్తేమగునో, నాగతి యేమో యట్లే నడతును. నీ వాగుడు నన్నేమి చేయును?

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
మాతలివరాన్వేషణే పఞ్చాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
మాతలివరాన్వేషణకథ గల నూటఐదవ అధ్యాయము.

—: o :—

36. తీర్థేన - తరింపజేయువాని చేత; రేవుచేత.

# షడధికశతతమోఽధ్యాయః

# నూటఆరవ అధ్యాయము

ధర్మరాజకృతా విశ్వామిత్రపరీక్షా, గురుం విశ్వామిత్రం ప్రతి
దక్షిణా మర్థయితుం గాలవస్య హఠశ్చ.

యముడు విశ్వామిత్రుని పరీక్షించుట, గాలవుడు గురుదక్షిణ కోరుమని
విశ్వామిత్రుని బలవంతము చేయుట.

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

అనర్థే జాతనిర్బన్ధం పరార్థే లోభమోహితమ్,
అనార్యకే ష్వభిరతం మరణే కృతనిశ్చయమ్. 1

జ్ఞాతీనాం దుఃఖకర్తారం బన్ధూనాం శోకవర్ధనమ్,
సుహృదాం క్లేశదాతారం ద్విషతాం హర్షవర్ధనమ్. 2

కథం నైనం విమార్గస్థం వారయన్తీహ బాన్ధవాః,
సౌహృదాద్వా సుహృత్ స్నిగ్ధో భగవాన్ వా పితామహః. 3

అనర్థమున మొందిపట్టు గలవాడు, ఇతరుల సొమ్మునందు అత్యాశతో ఒడ లెరుగనివాడు, నీచులయందు ప్రేమ గలవాడు, చావునందు నిశ్చయము

---

1. పరార్థే- ఇతరుల సొమ్మునందు; మరణే కృతనిశ్చయమ్-చావు మూడునని యిందరు చెప్పుచుండగా యుద్ధమే చేయుదు ననుటచేత చావు మూడిన వాడని తాత్పర్యము.

3. పితామహః - తాత - ఇచట భీష్ముడు కాదు. వ్యాసుడు. ఏలయన తరువాతి శ్లోకమున భీష్ముని విడిగా పేర్కొనుచున్నారు, ఉక్తమ్, ఉక్తమ్ అని పదము రెండుమారులు గ్రహింపబడినది. కావున మొదటిది వ్యాసునకు రెండవది భీష్మునకు వర్తించును.

పొందినవాడు, కులమువారికి దుఃఖము, బంధువులకు శోకము, మిత్రులకు క్లేశము, పగవారికి హర్షము పెంపొందించుచున్నవాడు, తప్పుదారిని పట్టినవాడు నగు వీనిని బంధువులు ఏల వారింపరు? వీరిపై మక్కువగల వ్యాసభగవానుడైనను ప్రేమతో నేల వీనిని చక్కదిద్దడు ?

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఉక్తం భగవతా వాక్యముక్తం భీష్మేణ యత్ క్షమమ్,
ఉక్తం బహువిధం చైవ నారదేనాపి తచ్ఛృణు. 4

రాజా ! వ్యాసభగవానుడు చెప్పవలసిన దంతయు చెప్పెను. భీష్ముడును తగిన విధమున బోధించెను. నారదుడు ఎన్నో విధముల ఉపదేశించెను. దానిని వినుము.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

దుర్లభో వై సుహృచ్ఛ్రోతా దుర్లభ శ్చ హితః సుహృత్,
తిష్ఠతే హి సుహృద్యత్ర న బన్ధు స్తత్ర తిష్ఠతే. 5

లోకమున సుహృత్తు చెప్పిన మాట వినువాడు దొరకుట కష్టము. మేలు కోరు సుహృత్తును దొరకుట కష్టము. గొప్ప ఆపదల యందు మిత్రము అండగా చెదరక నిలబడునట్లు బంధువు నిలువడు.

శ్రోతవ్య మపి పశ్యామి సుహృదాం కురునన్దన,
న కర్తవ్యశ్చ నిర్బన్ధో నిర్బన్ధో హి సుదారుణః. 6

5. సుహృచ్ఛ్రోతా - ఎదుటివాని నుండి తిరిగి ఉపకారమును కోరక మేలు చేయువాడు సుహృత్తు - వాని మాట వినువాడు సుహృచ్ఛ్రోత. ఈ మూఢుడు దుర్యోధనుడు హితము చెప్పినను వినడని భావము. యత్ర- ఏ ఘోరమగు ఆపదయందు, సుహృత్ - మిత్రము; తిష్ఠతే - స్థిరముగా అండగా నిలబడునో; తత్ర - అట్టిదానియందు; బంధుః - చుట్టము; న తిష్ఠతే - నిలబడడు - ఉపకారమునుకోరి మేలు చేయువాడు - కర్ణుని వంటివాడు - ఉత్తముడు కాడని తాత్పర్యము. చుట్టరికముకంటె చెలికాని మాట మిక్కిలి మేలు చేయునని భావము.

6. శ్రోతవ్యమ్ - వినవలసినది. నిర్బన్ధః - బాధించుదానియందే వదలని పట్టుపల; సుదారుణః - నాశన మొనర్చునది.

సుహృదులు చెప్పిన మాట వినుటయే తగునని నా భావన ఓయి కురునన్దనా! మొండిపట్టు పనికిరాదు. అది మహాభయంకరమైనది.

అత్రా ప్యుదాహర న్తీమ మితిహాసం పురాతనమ్,
యథా నిర్బన్ధతః ప్రాప్తో గాలవేన పరాజయః. 7

ఈ విషయమున మొండిపట్టు పట్టి గాలవుడు చెడిన ప్రాతకాలపు ఇతిహాసమును ఉదాహరింతురు.

విశ్వామిత్రం తపస్య న్తం ధర్మో జిజ్ఞాసయా పురా,
అభ్యాగచ్ఛత్ స్వయం భూత్వా వసిష్ఠో భగవా నృషిః. 8

తపస్సు చేయుచున్న విశ్వామిత్రుని దీక్ష ఎట్టిదో యెరుగగోరి మును పొకమారు ధర్ముడు వసిష్ఠభగవానుని రూపమును తానై తాల్చి వచ్చెను.

స ప్తర్షీణా మన్యతమం వేష మాస్థాయ భారత,
బుభుక్షుః క్షుధితో రాజ న్నాశ్రమం కౌశికస్య తు. 9

ఆ ధర్ముడు సప్తర్షులలో నొకడగు వసిష్ఠుని రూపము ధరించి ఆకలితో నకనకలాడుచు విశ్వామిత్రుని ఆశ్రమమునకు వచ్చెను.

విశ్వామిత్రో௨థ సంభ్రా న్తః శ్రపయామాస వై చరుమ్,
పరమాన్నస్య యత్నేన న చ తం ప్రత్యపాలయత్. 10

విశ్వామిత్రుడు తొందరపడుచు పరమాన్నము వండు ప్రయత్నముతో ముంతను ప్రొయ్యిమీద పెట్టెను. కాని వసిష్ఠుడు అంతవరకు నిలువలేదు.

అన్నం తేన యదా భుక్త మన్యై ర్దత్తం తపస్విభిః,
అథ గృహ్యాన్న మత్యుష్ణం విశ్వామిత్రో௨ప్యుపాగమత్. 11

---

8. స్వయం వసిష్ఠః భూత్వా - తానై ధర్మరాజగు యముడు వసిష్ఠరూపుడై, అభ్యాగచ్ఛత్ - వచ్చెను.

10. శ్రపయామాస - వండెను; చరుమ్ - అగ్నిలో వ్రేల్చు వంటకమును - లేదా వండెడు పాత్రను - పాత్రను ప్రొయ్యి నెక్కించెను. లేదా వండ నారంభించెను అని భావము. న, ప్రత్యపాలయత్-వండువరకు ఆగలేదని భావము.

11. తేన - ఆ వసిష్ఠునిచేత.

అంత నితరతాపసులు పెట్టిన యన్నము నా వసిష్ఠుదు భుజించెను. అప్పుడు వేడివేడి అన్నమును గైకొని విశ్వామిత్రు దతనికడకు వచ్చెను.

భుక్తం మే తిష్ఠ తావ త్త్వ మిత్యుక్త్వా భగవాన్ యయౌ,
విశ్వామిత్ర స్తతో రాజన్ స్థిత ఏవ మహాద్యుతిః. 12

నేను తింటిని. నీవు నిలుపుమని పలికి ఆ వసిష్ఠభగవానుడు వెడలి పోయెను గొప్ప తేజస్సు గల విశ్వామిత్రుడట్లు నిలిచియే యుండెను.

భక్తం ప్రగృహ్య మూర్ధ్నా వై బాహుభ్యాం సంశితవ్రతః,
స్థితః స్థాణు రివాభ్యాశే నిశ్చేష్టో మారుతాశనః. 13

అన్నము తలపై నిడుకొని చేతులతో పట్టుకొని చెడని వ్రతము గలవాడై ఆశ్రమముకడ చేష్టలుడిగి ఊపిరి మాత్రము పీల్చుకొనుచు మొద్దువలె నిలిచి యుండెను.

తస్య శుశ్రూషణే యత్న మకరో ద్గాలవో మునిః,
గౌరవాద్ బహుమానాచ్చ హార్దేన ప్రియకామ్యయా. 14

ఆవిధముగా నున్న విశ్వామిత్రునియందలి గురుభావమువలనను, గొప్ప వాడను మన్ననవలనను, ప్రీతిచేతను, ప్రియము చేయవలయునను కోరికచేతను గాలవుడను ముని ఆతని సేవించుటకు పూనుకొనెను.

అథ వర్షశతే పూర్ణే ధర్మః పున రుపాగమత్,
వాసిష్ఠం వేష మాస్థాయ కౌశికం భోజనేప్సయా. 15

అంత నూరేండ్లు నిండగా ధర్ముడు మరల భుజించుకోరికతో వసిష్ఠ రూపము ధరించి విశ్వామిత్రునికడ కరుదెంచెను.

---

12. మే భుక్తమ్-నా చేత తినబడినది-నేను తింటిని అని తాత్పర్యము.

13. మూర్ధ్నా, బాహుభ్యాం చ-తలతో చేతులతో-తలపై నిడుకొని చేతులతో పట్టుకొని అని భావము. భక్తమ్-అన్నమును; సంశితవ్రతః-పట్టువీడని వ్రతము గలవాడై.

14. గౌరవాద్-గురువగుటవలన; బహుమానాత్ - లోకపూజ్యు డగుటవలన; హార్దేన - ప్రీతితో; ప్రియకామ్యయా - ప్రియ మొనరించు కోరికతో.

స దృష్ట్వా శిరసా భక్తం ధ్రియమాణం మహర్షిణా,
తిష్ఠతా వాయుభక్షేణ విశ్వామిత్రేణ ధీమతా. 16

ప్రతిగృహ్య తతో ధర్మ స్తథైవోష్ణం తథా నవమ్,
భుక్త్వా ప్రీతోఽస్మి విప్రర్షే తముక్త్వా స మునిర్గతః. 17

ఆతడు విశ్వామిత్రమహర్షి గాలిని మాత్రము భుజించుచు ధీరుడై తలపై నిడుకొని యన్నమును మోయుచుండుట గాంచి మునుపటివలె వేడిగా క్రొత్తగా ఉన్న అన్నమును గ్రహించి విప్రర్షీ! ప్రీతినొందితి నని పలికి వెడలిపోయెను.

క్షత్రభావా దపగతో బ్రాహ్మణత్వ ముపాగతః,
ధర్మస్య వచనాత్ ప్రీతో విశ్వామిత్ర స్తథాఽభవత్. 18

అట్లు ధర్ముని మాటవలన విశ్వామిత్రుడు క్షత్రియభావమును వదలి బ్రాహ్మణత్వము పొంది ప్రీతి నందెను.

విశ్వామిత్రస్తు శిష్యస్య గాలవస్య తపస్వినః,
శుశ్రూషయా చ భక్త్యా చ ప్రీతిమా నిత్యువాచ హ. 19

విశ్వామిత్రుడును శిష్యుడగు గాలవతాపసి చేసిన సేవకు, తనయందలి భక్తికి ప్రీతి నొంది యతనితో నిట్లనెను.

అనుజ్ఞాతో మయా వత్స యథేష్టం గచ్ఛ గాలవ,
ఇత్యుక్తః ప్రత్యువాచేదం గాలవో మునిసత్తమమ్ 20

నాయనా! నే ననుమతించితిని. గాలవా! నీ యిచ్చవచ్చినచోటికి పొమ్ము. అనగా గాలవు డామునివర్యునితో నిట్లు బదులుపలికెను

ప్రీతో మధురయా వాచా విశ్వామిత్రం మహాద్యుతిమ్,
దక్షిణాః కాః ప్రయచ్ఛామి భవతే గురుకర్మణి. 21

ప్రీతితో తీయని పలుకులతో మహాతేజస్వియగు విశ్వామిత్రునితో నాత డిట్లు పలికెను; 'బ్రహ్మచర్యవ్రతము ముగించు ఈ సందర్భమున తమకేమి దక్షిణల నొసగుదును?

---

19. శుశ్రూషయా - సేవచేత; భక్త్యా - ఆరాధ్యుడన్న జ్ఞానముచేత;
21. గురుకర్మణి - బ్రహ్మచర్యవ్రతము ముగించునపుడు.

దక్షిణాభి రుపేతం హి కర్మ సిద్ధ్యతి మానద,
దక్షిణానాం హి దాతా వై అపవర్గేణ యుజ్యతే. 22

ఏ సత్కార్యమైనను దక్షిణలతో కూడినదై ఫలవంత మగును. దక్షిణ లొసగువాడు ఫలము పొందువా డగును.

స్వర్గే క్రతుఫలం తద్ధి దక్షిణా శాన్తి రుచ్యతే,
కి మాహరామి గుర్వర్థం బ్రవీతు భగవానితి. 23

స్వర్గమున సిద్ధించు యజ్ఞఫల మదియే గదా: దక్షిణను శాంతి యందురు. పూజ్యులగు భగవంతులు తమరు నేనేమి గురుదక్షిణ తేవలయునో సెల వొసగుదురు గాక!

జానాన స్తేన భగవాన్ జితః శ్రుశూషణేన వై,
విశ్వామిత్ర స్తమసకృద్ గచ్ఛ గచ్ఛే త్యచోదయత్. 24

భగవంతుడగు విశ్వామిత్రుడు సేవచేతనే వశమైతినని భావించుచున్నవాడై యాతనిని పలుమారులు 'పద పద' అని పంపజూచెను.

అసకృద్గచ్ఛ గచ్ఛేతి విశ్వామిత్రేణ భాషితః,
కిం దదానీతి బహుశో గాలవః ప్రత్యభాషత. 25

---

22. 'మానద' అనుటకు బదులు 'మానవమ్' - అని యొక పాఠము. అప్పుడు మానవుని, సిద్ధ్యతి - నెరవేరిన ప్రయోజనము కలవానినిగా చేయును - అని అర్థము. అపవర్గేణ - ఫలము పొందుటతో;

23. క్రతుఫలమ్-యజ్ఞము ఫలమును దక్షిణ నిచ్చినవాడే పొందునని భావము- 'హతో యజ్ఞ స్త్వదక్షిణః'- దక్షిణలేని యజ్ఞము పాడయిపోవును. అను స్మృతివలన దక్షిణలేని యజ్ఞము ఫలము నొసగదని తాత్పర్యము. శాన్తిః - ఉపద్రవముల నన్నింటిని పోగొట్టునది.

24. జానానః-తెలిసినవాడై - సేవచేతనే దక్షిణ ఇచ్చినట్లాయెనని ఎరిగినవాడై అని భావము. స జానంస్తేన-అనియు పాఠము. అపుడు ఆ గాలవుడు చేసిన సేవచేతనే జితః + అస్మి-వశీకృతుడ నైతిని; అని తెలిసినవాడై అని అన్వయము.

విశ్వామిత్రుడు పలుమారులు పొమ్ము, పద అనుచుండగా గాలవుడు పెద్ద సారులు ఏమిమ్మందురు? అని పలుకుచుండెను.

నిర్బన్ధతస్తు బహుశో గాలవస్య తపస్వినః,
కిఞ్చి దాగతసంరంభో విశ్వామిత్రోఽబ్రవీ దిదమ్. 26

గాలవముని పలుమారులు పట్టు పట్టగా విశ్వామిత్రునకు కొంచెము కోపము పుట్టెను. ఇట్లు పలికెను:

ఏకతః శ్యామకర్ణానాం హయానాం చన్ద్రవర్చసామ్,
అష్టౌ శతాని మే దేహి గచ్ఛ గాలవ మా చిరమ్. 27

గాలవా! ఒకవైపు ఆకుపచ్చవన్నెగల చెవులు గలవియు, చంద్రుని వంటి కాంతి గలవియునగు గుఱ్ఱము లెనిమిదివందలు నాకిమ్ము! ఆలసింపక పొమ్ము'.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే షడధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూట ఆరవ అధ్యాయము.

—:o:—

27. ఏకతః శ్యామ కర్ణానామ్-చెవికి ఒకవైపే-బయటివైపే-పచ్చదనమున్న.

# సప్తాధికశతతమోఽధ్యాయః
# నూటయేడవ అధ్యాయము

**గాలవస్య చిన్తా, తస్మై గరుడస్యాశ్వాసనమ్.**

**గాలవుడు చింతించుట, గరుడు డాతని నూరడించుట.**

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ఏవముక్త స్తదా తేన విశ్వామిత్రేణ ధీమతా,
నాస్తే న శేతే నాహారం కురుతే గాలవ స్తదా. 1

ధీమంతుడగు విశ్వామిత్రు డట్లు పలుకగా గాలవుడు చలించిపోయెను. నిద్ర పోకుండెను. అన్నము తినకుండెను.

త్వగస్థిభూతో హరిణ శ్చిన్తాశోకపరాయణః,
శోచమానోఽతిమాత్రం స దహ్యమానశ్చ మన్యునా. 2

సుయోధనా! చర్మము, ఎముకలుగా మిగిలిపోయెను. పాలిపోయెను. అదే చింతతో కుమిలి పోవుచుండెను దీనుడై లోలోపల కాలిపోవుచుండెను. దుఃఖముతో ఏడ్వ దొడగెను.

కుతః పుష్టాని మిత్రాణి కుతోఽర్థాః సంచయః కుతః,
హయానాం చన్ద్రశుభ్రాణాం శతాన్యష్టౌ కుతో మమ. 3

అయ్యో! నాకు పుష్టిగల మిత్రు లెక్కడ? ధనము లెక్కడ? ముల్లె యెక్కడిది? చంద్రునివలె తెల్లని గుఱ్ఱము లెనిమిదివందలను నే నెక్కడనుండి తెత్తును?

కుతో మే భోజనశ్రద్ధా సుఖశ్రద్ధా కుతశ్చ మే,
శ్రద్ధా మే జీవితస్యాపి ఛిన్నా కిం జీవితేన మే. 4

---

2. హరిణః-రక్తము లేక పాలిపోయినవాడై : మన్యునా-దైన్యముతో.

నా కిక అన్నముపై చూపేది? సుఖముమీద శ్రద్ధ యెక్కడిది? బ్రదుకుపై శ్రద్ధయే పగిలిపోయినది. ఇక నాకు బ్రదుకుతో పని యేమి?

అహం పారే సముద్రస్య పృథివ్యా వా వరంవరాత్,
గత్వాఽఽత్మానం విముఞ్చామి కిం ఫలం జీవితేన మే. 5

సముద్రము ఒడ్డునకో, భూమి తుదిఅంచులకో పోయి దేహమును విడిచెదను. నాకీ బ్రదుకుతో పని యేమి?

అధన స్యాకృతార్థస్య త్యక్తస్య వివిధైః ఫలైః,
ఋణం ధారయమాణస్య కుతః సుఖ మనీహయా. 6

ధనము లేనివానికి, కోరిక నెరవేరనివానికి, ఆ యా ప్రయోజనములు దూరముగా తొలగిపోయినవానికి, అప్పు పడినవానికి ప్రయత్నింపక సుఖ మెట్లు లభించును?

సుహృదాం హి ధనం భుక్త్వా కృత్వా ప్రణయ మీప్సితమ్,
ప్రతికర్తు మశక్తస్య జీవితా న్మరణం వరమ్. 7

మిత్రుల సొమ్ము తిని, కోరిన దిత్తునని నమ్మకము పుట్టించి, తిరిగి ఉపకారము చేయజాలనివానికి బ్రదుకుటకంటె చావు మేలు.

ప్రతిశ్రుత్య కరిష్యేతి కర్తవ్యం తదకుర్వతః,
మిథ్యావచనదగ్ధస్య ఇష్టాపూర్తం ప్రణశ్యతి. 8

---

5. పారే సముద్రస్య - సముద్రపు ఒడ్డున; పరంపరాత్-దవ్వులకు దవ్వుల - మిక్కిలి దూరమున అని భావము.

6 అనీహయా - ప్రయత్నము లేక;

7. ఈప్సితం ప్రణయం కృత్వా - కోరిన దిత్తునని నమ్మకము పుట్టించి - ప్రణయం ప్రేమ్ణి విస్రంభే' అని విశ్వకోశము. ప్రణయశబ్దమునకు ప్రేమ, నమ్మకము అను నర్థములు కలవు

8. కరిష్యే + ఇతి అనుచోట సంధివలన కరిష్య ఇతి అని కావలయును. 'కరిష్యేతి' అనుసంధి ఆర్షము. ఇష్ట మనగా యజ్ఞకర్మము. పూర్త మనగా నూతిని, బావిని, చెరువును త్రవ్వించుట, గుడి గట్టించుట, తోట పెట్టించుట, అన్నము పెట్టుట. అను పుణ్యకార్యము.

'ఇది చేయుదును' అని మాట యిచ్చి చేయవలసినదానిని చేయనివాడై; పొల్లుమాటతో కాలిపోయినవాని ఇష్టము, పూర్తము రూపు మాసిపోవును.

న రూప మనృత స్యాస్తి నానృత స్యాస్తి సన్తతిః,
నానృత స్యాధిపత్యం చ కుత ఏవ గతిః శుభా. 9

అబద్ధము లాడువానికి స్వరూపమే లేదు. బిడ్డలు కలుగరు.ఎందును వానికి ఏలుబడి లభింపదు. ఇక శుభమగు గతి యెక్కడిది?

కుతః కృతఘ్నస్య యశః కుతః స్థానం కుతః సుఖమ్,
అశ్రద్ధేయః కృతఘ్నో హి కృతఘ్నే నాస్తి నిష్కృతిః. 10

కృతఘ్ననకు కీర్తి యెక్కడ? నిలుకడ యెక్కడ? చోటెక్కడ? సుఖ మెక్కడ? వాడెల్లరకు నమ్మదగనివా డగును. కృతఘ్నుని విషయమున పాపము నకు పరిహారము లేదు.

న జీవ త్యధనః పాపః కుతః పాపస్య తన్త్రిణమ్,
పాపో ధ్రువ మవాప్నోతి వినాశం నాశయన్ కృతమ్. 11

దరిద్రుడగు పాపాత్మునకు బ్రదుకే లేదు. ఇక వాడు కుటుంబమును పోషించుట యెక్కడ? అట్లా పాపి మున్ను చేసిన పుణ్యమును గూడ రూపు మాపి నిశ్చయముగా వినాశము పొందును.

సోఽహం పాపః కృతఘ్నశ్చ కృపణ శ్చానృతోఽపి చ,
గురోర్యః కృతకార్యః సం స్తత్కరోమి న భాషితమ్. 12

అట్టి నేను పాపుడను, కృతఘ్నుడను, దీనుడను, కల్లరిని. గురువువలన పచ్చము గడపుకొని ఆయన మాటను పాటింపకున్నాను.

---

9. అనృతస్య - సత్యము పాటింపనివానికి; రూపమ్, న - అస్తి-స్వరూపమే లేదు. అనగా వాడు బ్రతికియు చచ్చినవానితో సమానుడని భావము.

11. తన్త్రిణమ్ - కుటుంబ పోషణము - మంత్రణమను పాఠమున ఇష్టులతో సుఖప్రసంగములు చేయుట అని అర్థము.

సోఽహం ప్రాణాన్ విమోక్ష్యామి కృత్వా యత్న మనుత్తమమ్,
అర్థితా న మయా కాచిత్ కృతపూర్వా దివౌకసామ్. 13

గట్టి ప్రయత్నము చేసి ప్రాణములు వదలెదను. మునుపెన్నడు దేవతలను నేను ఏదియు కోరుటగాని వారు చేయుటగాని మున్నెన్నడును జరుగ లేదు.

మానయన్తి చ మాం సర్వే త్రిదశా యజ్ఞసంస్తరే,
అహం తు విబుధశ్రేష్ఠం దేవం త్రిభువనేశ్వరమ్,
విష్ణుం గచ్ఛా మ్యహం కృష్ణం గతిం గతిమతాం వరమ్. 14

దేవతలందరు యజ్ఞవేదిపై నన్ను మిక్కిలి మన్నింతురు. అయినను నేను ముల్లోకములకు ప్రభువు, దేవతలలో శ్రేష్ఠుడు, గతిగలవారికి ఉత్తమగతి విష్ణువనగు శ్రీకృష్ణదేవుని శరణు పొందుదును.

భోగా యస్మాత్ ప్రతిష్ఠన్తే వ్యాప్య సర్వాన్ సురాసురాన్,
ప్రణతో ద్రష్టు మిచ్ఛామి కృష్ణం యోగిన మవ్యయమ్. 15

సర్వభోగ్యవస్తువులను దేవదానవుల నందరను వ్యాపించి వెలువరించు దైవము, యోగి, అవ్యయుడు నగు శ్రీకృష్ణునకు మ్రొక్కి యాతనిని దర్శింప గోరుచున్నాడను.

ఏవముక్తే సఖా తస్య గరుడో వినతాత్మజః,
దర్శయామాస తం ప్రాహ సంహృష్టః ప్రియకామ్యయా. 16

---

13 అనుత్తమమ్ - మంచిది కాని యని నీలకంఠులు. విషము త్రావుట, ఉరివేసికొనుట మొదలైన; యత్నమ్ - ప్రయత్నమును; కృత్వా - చేసి. అర్థితా - యాచన.

14. ఈ శ్లోకమున నేను అను అర్థము గల 'అహమ్' శబ్దము రెండు మారు లుండుట దీనత్వమువలన వచ్చినదగుటచే దోషము కాదని యెరుగ దగును.

15. భోగాః - మానవుని అనుభవమునకు ఏర్పడిన ఆకాశాదిభూతములు; యస్మాత్-ఎవనివలన; ప్రతిష్ఠన్తే-వెలువడుచున్నవో-విత్తనమునుండి చెట్ల వలె-అని భావము.

14, 15 శ్లోకములలోని కృష్ణశబ్దము పరమాత్మవాచకము.

16. సఖా - గాలవుడును తనవలె విష్ణుభక్తుడు కావున సఖుడు. అంతేకాని పూర్వము ఉపకారము చేయుట మొదలగు దానివలన సఖుడు కాడు.

ఇట్లాత డనుకొనుచుండగా అతని సఖుడగు వినతకొడుకు గరుడుడు కానవచ్చి ప్రియమొనర్చు కోరికతో ఆ గాలవునితో నిట్లు పలికెను.

సుహృద్భవాన్ మమ మతః సుహృదాం చ మతః సుహృత్,
ఈప్సితే నాభిలాషేణ యోక్తవ్యో విభవే సతి. 17

నీవు నాకు మిక్కిలి ప్రియమైన మిత్రుడవు. మిత్రు లందరకు ఇష్టమైన చెలికాడవు. నీవు కోరెడు కోరిక, తీర్పగలవాడు, తీర్పవలయును.

విభవశ్చాస్తి మే విప్ర వాసవావరజో ద్విజ,
పూర్వ ముక్త స్త్వదర్థం చ కృతః కామశ్చ తేన మే. 18

విప్రవరేణ్యా! నాకా సామర్థ్యము కలదు. మున్నే నీపనిని గూర్చి విష్ణునితో మాటాడి యుంటిని. ఆతడు నా కోరికను మన్నించియు నుండెను.

స భవా నేతు గచ్ఛావ నయిష్యే త్వాం యథాసుఖమ్,
దేశం పారం పృథివ్యా వా గచ్ఛ గాలవ మా చిరమ్. 19

కావున రా! పోదము! నిన్ను సుఖముగా ఎక్కడికైనను భూమి తుది మంచునకైనను తీసికొని పోవుదును. పద-గాలవా! ఆలసింపకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే సప్తాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటయేడవ అధ్యాయము

—: ० :—

18. వాసవ-అవరజః-దేవేంద్రుని తమ్ముడు; త్వదర్థమ్-నీపనిని గూర్చి; మే-నాచేత; ఉక్తః-ప్రార్థింపబడినవాడు. నేను గాలవునకు సాయము చేయుదునని విష్ణువును ప్రార్థించియుంటినని తాత్పర్యము; తేన-ఆ విష్ణునిచేత; మే-నా; కామః-కోరిక; కృతః-చేయబడినది-అనగా అట్లే కానిమ్మని భగవంతుడు అనుమతించెనని భావము;

19. దేశమ్-భూమియందలి భాగము; పృథివ్యాః పారం-భూమి యొక్క ఒడ్డు-అనగా సముద్రమని భావము. నేలలోగాని నీటియందుగాని ఎక్కడికైనను నిన్ను కొనిపోవుదునని తాత్పర్యము.

# అష్టాధికశతతమోఽధ్యాయః
# నూటయెనిమిదవ అధ్యాయము

## గరుడేన గాలవం ప్రతి పూర్వదిశాయా వర్ణనమ్.
## గరుడుడు గాలవునకు తూర్పుదిక్కును గూర్చి వర్ణించి చెప్పుట.

సుపర్ణ ఉవాచ - సుపర్ణుడిట్లు చెప్పెను.

అనుశిష్టోఽస్మి దేవేన గాలవ జ్ఞానయోనినా,
బ్రూహి కామం తు కాం యామి ద్రష్టుం ప్రథమతో దిశమ్. 1

జ్ఞానయోని యగు పరమేశ్వరుడు నా కానతిచ్చెను. గాలవా! నీవు ముందే దిక్కు చూతువో చెప్పుము. అందు నిన్ను కొనిపోవుదును.

పూర్వాం వా దక్షిణాం వాఽహ మథవా పశ్చిమాం దిశమ్,
ఉత్తరాం వా ద్విజశ్రేష్ఠ కుతో గచ్ఛామి గాలవ. 2

తూర్పుదిక్కునకా? లేక దక్షిణమునకా? కాక పడమటి వైపునకా? లేక ఉత్తరదిక్కునకా? బ్రాహ్మణవరేణ్యా! గాలవా! ఎటు పోదును?

యస్యా ముదయతే పూర్వం సర్వలోకప్రభావనః,
సవితా యత్ర సంధ్యాయాం సాధ్యానాం వర్తతే తపః. 3

---

1. అనుశిష్టః - ఆజ్ఞాపింపబడినవాడను గాలవుని కార్యము నిర్వర్తింపు మని విష్ణువు నన్నాదేశించెనని భావము; జ్ఞానయోనినా - సర్వప్రాణుల బుద్ధులను ప్రవర్తింపజేయు వానిచేత; అజ్ఞాతయోనినా - అనియు పాఠము - ఆ పక్షమున - అందరకు ఆదియైన వాడని భావము - తెలియని పుట్టుక గలవాడు - అజ్ఞాతః - రూపాదులు లేని కారణమున తెలియరానివాడు; యోనిః - జగత్తు ఉత్పత్తికి ప్రళయమునకు స్థానమైన వాడు - అగు విష్ణువుచేత; కామమ్ - ఇష్టమును; బ్రూహి - చెప్పుము.
3. సాధ్యానామ్ - సాధ్యులను దేవతలయొక్క; తపః - ఆలోచనము, వర్తతే - సాగుచుండును. సాధ్యులీప్రదేశమున ధ్యానము చేయుచు సత్యకాము లగుచుందురని భావము.

ఇదిగో ఈ దిక్కు చూడు. ఇందు లోకము లన్నింటికి వెలుగు నిచ్చు సూర్యుడు మొట్టమొదట ఉదయించును. ఇందు సంధ్యాకాలమున సాధ్యుల తపస్సు సాగుచుండును.

యస్యాం పూర్వం మతి ర్యాతా యయా వ్యాప్త మిదం జగత్,
చక్షుషీ యత్ర ధర్మస్య యత్రైవై సుప్రతిష్ఠితే. 4

మొట్టమొదట ఈ దిక్కునందే బుద్ధి కదలాడినది. తరువాత అది జగత్తు నంతటిని వ్యాపించినది. రెండు కన్నులు ఇందు యజ్ఞము ప్రవర్తించుటకై నెలకొని యున్నవి.

కృతం యతో హుతం హవ్యం సర్పతే సర్వతోదిశమ్,
ఏతద్ద్వారం ద్విజశ్రేష్ఠ దివసస్య తథాఽధ్వనః. 5

వీని మధ్య సంస్కరించి వ్రేల్చిన హోమపదార్థము అన్ని దిక్కులకు పోవుచున్నది. బ్రాహ్మణవరేణ్యా! ఇది దినమునకు ద్వారము. అట్లే దేవమార్గము, పితృమార్గము అనువానికిని ఇది ద్వారము.

---

4. మతిః - బుద్ధి - యాతా - లభించినది - ప్రాతఃకాలమున చేయు సంధ్యోపాసనలో సూర్యుని దయవలన తూర్పుదిక్కునుండియే ప్రాణికోటికి బుద్ధి సిద్ధించునని భావము; గాయత్రీమంత్రమున సూర్యుడు బుద్ధి వృత్తులను ప్రబోధన చేయుచున్నట్లు కానవచ్చుచున్నది గదా ? చక్షుషీ - అగ్నిసోముడు దేవతలుగా గల ఆజ్యభాగములు; ధర్మస్య - యజ్ఞము యొక్క; యత్రైవై - ప్రవృత్తికొరకు. ఇది వైదికరూపము - సుప్రతిష్ఠితే - నెలకొనియున్నవి.

5. కృతమ్ - సంస్కరింపబడిన; హవ్యమ్ - హోమ పదార్థము; యతః - ఏరెంటి మధ్య; హుతమ్ - వ్రేల్వబడి, సర్వతోదిశమ్ - అన్నిదిక్కులకు; సర్పతే - వ్యాపించునో; యజ్ఞములతో మంత్రములతో సంస్కారము పొందిన హవ్యము అగ్నిషోము లనెడు ఆజ్యభాగముల నడుమనే వేయవలయునని శ్రుతి. దాని వలననే యజ్ఞము రక్షణ పొందును. వేరు చోటుల వేసినచో అది ధర్మమును నశింపజేయునని భావము. అధ్వనః- దేవయానము, పితృయాణము అని రెండు మార్గములు వానికి; ద్వారమ్- ద్వారము.

అత్ర పూర్వం ప్రసూతా వై దాక్షాయణ్యః ప్రజాః స్త్రియః,
యస్యాం దిశి ప్రవృద్ధాశ్చ కశ్యప స్యాత్మసంభవాః. 6

ఇందు తొల్లి దక్షప్రజాపతి కూతుండ్రు అదితి, దితి, దనువు, కాష్ఠ మొదలగువారు సంతానమును బొందిరి. అట్లే కశ్యపుని కొడుకు లిందే పెరిగి పెద్దవారైరి.

అతో మూలం సురాణాం శ్రీ ర్యత్ర శక్రోఽభ్యషిచ్యత,
సురరాజ్యేన విప్రర్షే దేవై శ్చాత్ర తపశ్చితమ్. 7

విప్రర్షీ ! ఇది దేవతల సంపదలకు కుదురు. ఇందే దేవేంద్రుని దేవ రాజ్యమున అభిషేకించిరి. దేవతలును ఇందు తపస్సును కూడబెట్టిరి.

ఏతస్మాత్ కారణాద్ బ్రహ్మన్ పూర్వేత్యేషా దిగుచ్యతే,
యస్మాత్ పూర్వతరే కాలే పూర్వమేవావృతా సురైః. 8

చాల ప్రాతకాలము కంటె ముందే ఇది దేవతలతో నిండియున్నది. ఆ కారణముననే దీనికి 'పూర్వదిక్కు' అను పేరు కలిగినది.

అత ఏవ చ సర్వేషాం పూర్వా మాశాం ప్రచక్షతే,
పూర్వం సర్వాణి కార్యాణి దైవాని సుఖ మీప్సతా. 9

కావుననే అన్ని కార్యములకు తూర్పుదిక్కునే శ్రేష్ఠమైనదిగా చెప్పుదురు. సుఖము కోరువాడు దైవసంబంధములగు పనులన్నింటిని తూర్పు దిక్కునందే ఆచరించును.

అత్ర వేదాన్ జగౌ పూర్వం భగవాన్ లోకభావనః,
అత్రైవోక్తా సవిత్రాఽసీత్ సావిత్రీ బ్రహ్మవాదిషు. 10

లోకముల సృష్టిని భావించు భగవంతుడు ప్రారంభమున వేదముల నిచటనే గానము చేసెను. సూర్యభగవాను డిందే సావిత్రిని వేదపాఠములకు ఉపదేశించెను.

---

6. దాక్షాయణ్యః - దక్షప్రజాపతి కూతుండ్రు; ప్రజాః - సంతానమును, ప్రసూతాః - ప్రసవించిరి.

9. పూర్వమ్ - ముందు నెలకొనియున్న; సుఖమ్, ఈప్సతా - సుఖము మున్నగు వానిని కోరువానిచేత;

అత్ర దత్తాని సూర్యేణ యజూంషి ద్విజసత్తమ,
అత్ర లబ్ధవరః సోమః సురైః క్రతుషు పీయతే. 11

ఇందే సూర్యుడు యజుర్వేద మంత్రములను లోకములకు ప్రసాదించెను. సోమరసము ఇందే వరములు పొంది యజ్ఞములందు దేవతలకు పానీయ మగుచున్నది.

అత్ర తృప్తా హుతవహాః స్వాం యోని ముపభుఞ్జతే,
అత్ర పాతాల మాశ్రిత్య వరుణః శ్రియ మాప చ. 12

ఇందు తృప్తిపడిన అగ్నులు తమ జన్మకారణమగు జలములను భుజించు చున్నవి. ఇటనుండియే పాతాళము నాశ్రయించి వరుణుడు సంపద లందెను.

అత్ర పూర్వం వసిష్ఠస్య పౌరాణస్య ద్విజర్షభ,
సూతిశ్చైవ ప్రతిష్ఠా చ నిధనం చ ప్రకాశతే. 13

ప్రాతకాలము నాడు వసిష్ఠమహర్షి పుట్టుట, ప్రతిష్ఠ నొందుట, తనువు చాలించుటయు నిందే జరిగెను.

ఓఙ్కార స్యాత్ర జాయన్తే సృతయో దశతీర్దశ,
పిబన్తి మునయో యత్ర హవిర్ధూమం స్మ ధూమపాః. 14

ఓంకారమునకు సంబంధించిన పదివేల మార్గము లిందే వెలువడినవి. ధూమపు లనెడు మునులు హవిస్సుల ధూమము నిందే త్రావుచుందురు.

---

11. యజూంషి దత్తాని - యాజ్ఞవల్క్యమహర్షికి యజుర్మంత్రముల నొసగె నని భావము.

12. స్వాం యోనిమ్ - తమపుట్టుక స్థానమగు జలమును - సోమరసము, నెయ్యి, పాలు మున్నగు రూపమున నున్నదానిని.

13. పూర్వమ్ - మునుపు - అనగా తొల్లి మిత్రావరుణులు చేసిన యజ్ఞము నందు; పౌరాణస్య - పురాణుడైన - పురాణశబ్దమునకు స్వార్థమున తద్ధితప్రత్యయము రాగా 'పౌరాణ' అయినది. సూతిః - కుంభమునందు పుట్టుట; నిధనమ్ - నిమిశాపమువలన స్థూలదేహమును విడచుట.

14. దశతీః - 'దశశతీ' అను శబ్దమున పృషోదరాది గణమును బట్టి మధ్య నున్న శకారము లోపింపగా 'దశతీః' అనురూపమేర్పడినది. అనగా వేయి, అట్టివి దశ - పది - అనగా పదివేలు. సృతయః - మార్గములు - శాఖలు 'ఓంకారో వై సర్వా వాక్' ఓంకారమే గదా సమస్తమైన వాక్కు అను

ప్రోక్షితా యత్ర బహవో వరాహాద్యా మృగా వనే,
శక్రేణ యజ్ఞభాగార్థే దైవతేషు ప్రకల్పితాః. 15

ఈ దిక్కునందే అడవిలోని పంది మున్నగు మృగములను పెక్కింటిని ఇంద్రుడు మంత్రజలము చల్లి దేవతలకొరకు యజ్ఞభాగములుగా ఏర్పరచెను.

అత్రాహితాః కృతఘ్నాశ్చ మానుషా శ్చాసురాశ్చ యే,
ఉదయం స్తాన్ హి సర్వాన్ వై క్రోధాద్ధన్తి విభావసుః. 16

లోకములకు కీడు చేయునట్టివారును, ఉపకారము చేసినవారిని హింసించు నట్టివారును అగు మానవులను, రాక్షసులను, ఈ దిక్కున నుదయించుచు సూర్యుడు క్రోధముతో పరిమార్చును.

ఏతద్ద్వారం త్రిలోకస్య స్వర్గస్య చ సుఖస్య చ,
ఏష పూర్వో దిశాం భాగో విశావోఽత్ర యదీచ్ఛసి. 17

మూడు లోకములకు, స్వర్గమునకు, సుఖమునకు ఇది ద్వారము. దిక్కులలో మొదటి భాగము. నీవు కోరినచో ఇందు ప్రవేశింతము.

ప్రియం కార్యం హి మే తస్య యస్యాస్మి వచనే స్థితః,
బ్రూహి గాలవ యాస్యామి శృణు చాప్యపరాం దిశమ్. 18

నే నెవని మాటపై నిలిచియుందునో వాని పని నాకు ప్రియమైనది. గాలవా! చెప్పుము. పోదును. లేదా మరియొక దిక్కును గూర్చి వినుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే అష్టాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటయెనిమిదవ అధ్యాయము.

—: o :—

వేదవాక్యమును బట్టి శాఖలు, ఉపశాఖలతో కూడిన వేదజాలమంతయు ఈ దిక్కునందే యుచ్చరించినదని తాత్పర్యము

16. మానవులలో అహితులను, కృతఘ్నులను, రాక్షసులను సూర్యుడు క్రోధముతో చంపునని భావము - చంపుట అనగా ఆయువును తగ్గించుట;

17. విశావః - ప్రవేశింతము.

# నవాధికశతతమోఽధ్యాయః

# నూటతొమ్మిదవ అధ్యాయము

## దక్షిణదిశావర్ణనమ్.

## దక్షిణదిక్కు వర్ణనము.

సుపర్ణ ఉవాచ - గరుత్మంతు డిట్లు చెప్పెను.

ఇమం వివస్వతా పూర్వం శ్రౌతేన విధినా కిల,
గురవే దక్షిణా దత్తా దక్షిణే త్యుచ్యతే చ దిక్. 1

దీనిని మునుపు సూర్యుడు మంత్రపూర్వకముగా గురువునకు దక్షిణగా నిచ్చెను. అందువలన దీనిని దక్షిణదిక్కు అందురు.

అత్ర లోకత్రయ స్యాస్య పితృపక్షః ప్రతిష్ఠితః,
యత్రోష్మపాణాం దేవానాం నివాసః శ్రూయతే ద్విజ. 2

ఈ దిక్కునందు మూడులోకములకు సంబంధించిన పితృదేవతల సముదాయము నెలకొనియున్నది. ఇది వేడియన్నము తిను దేవతల నివాసభూమి యని వినవచ్చుచున్నది.

అత్ర విశ్వే సదా దేవాః పితృభిః సార్ధ మాసతే,
ఇజ్యమానాః స్మ లోకేషు సంప్రాప్తా స్తుల్యభాగతామ్. 3

---

1. శ్రౌతేన-శ్రుతి యనగా వేదము-దానికి సంబంధించినది శ్రౌతము-మంత్రములతో కూడిన విధానముతో నని భావము. స్రౌవేణ-అనియు పాఠము-స్రౌవమైన విధి యనగా యజ్ఞము-యజ్ఞమునందు, గురవే-తన గురువగు కశ్యపునకు;

2. ఊష్మపాణామ్-వేడియన్నము తినునట్టి. 'యావదుష్ణం భవత్యన్నం పితర స్తావ దశ్నన్తి'-అన్నము వేడిగా నున్నపుడు పితృదేవతలు తిందురని స్మృతి.

3. విశ్వే - విశ్వేదేవత లనువారు పదుముగ్గురు ఒక గణము.

ఇందు విశ్వులను దేవులు పితృదేవతలతో పాటు ఎల్లవేళల కలిసియుందురు. లోకములందు పితృదేవతల నారాధించువారు వీరిని కూడ పూజించి, వారితో సమానమగు భాగమును వీరికిని ఒసగుదురు.

ఏతద్ద్వితీయం వేదస్య ద్వార మాచక్షతే ద్విజ,
త్రుటిశో లవశశ్చాపి గణ్యతే కాలనిశ్చయః. 4

దీనిని వేదమునకు రెండవద్వారమని చెప్పుదురు. ఇందు కాలము లెక్క త్రుటి - లవము అను స్వరూపముతో కూడ జరుగును.

అత్ర దేవర్షయో నిత్యం పితృలోకర్షయ స్తథా,
తథా రాజర్షయః సర్వే నివసన్తి గతవ్యథాః. 5

ఇందు దేవర్షులు, పితృలోకర్షులు, రాజర్షులు ఏ దుఃఖమును లేనివారై ఎల్లప్పుడు నివసింతురు.

అత్ర ధర్మశ్చ సత్యం చ కర్మ చాత్ర నిగద్యతే,
గతిరేషా ద్విజశ్రేష్ఠ కర్మణా మవసాయినామ్. 6

ద్విజవరా ! ఇందు లోకుల ధర్మము, సత్యము, కర్మము అనువానిని చిత్రగుప్తాదులు వెల్లడింతురు. మరణించినవారి కర్మముల కిదే గతి.

---

4. ద్వితీయమ్ - దేవధర్మము మార్గము తూర్పుదిక్కు మొదటిది. దాని దృష్టితో, పితృదేవతారూపమైన ధర్మమార్గ మిది, రెండవది. 'ప్రాక్ సంస్థాని దైవాని కర్మాణి దక్షిణసంస్థాని పిత్ర్యాణి' - దైవకార్యములు తూర్పు దిక్కునను, పితృకర్మములు దక్షిణదిక్కునను చేయవలయును అని స్మృతి. త్రుటిశః - త్రుటి యనునది లెక్కగా, లవశః - లవమను లెక్కతో, త్రుటి - ఒక లఘువగు అక్షరము - 'అ' వంటిదాని నాలుగవ భాగము నుచ్చరించుటకు పట్టుకాలము - లవ మనగా అత్యల్పమైనది.

6. కర్మ - పుణ్యరూపము. పాపరూపము నగు కర్మము; నిగద్యతే - వెల్లడి చేయబడును. చిత్రగుప్తుడు మున్నగువారు జీవుల పుణ్యపాపకర్మములను వెల్లడి చేయుదురని భావము; అవసాయినామ్-చనిపోయినవారు,కర్మణామ్- పొందవలసిన సుఖ, దుఃఖ అనుభవములకు; ఏషా-ఈ దిక్కు; గతిః-గతి.

ఏషా దిక్ సా ద్విజశ్రేష్ఠ యాం సర్వః ప్రతిపద్యతే,
వృతా త్వనవబోధేన సుఖం తేన న గమ్యతే. 7

మరణించిన యెల్లవారును ఈ దిక్కునే చేరుదురు. చీకటి క్రమ్మిన దీనిని సుఖముగా పొందజాలరు.

నైరృతానాం సహస్రాణి బహూన్యత్ర ద్విజర్షభ,
సృష్టాని ప్రతికూలాని ద్రష్టవ్యా న్యకృతాత్మభిః. 8

ఇందు వేలకొలది రక్కసులు విపరీతమైన నడవడితో సృజింపబడి యున్నారు. వారు పుణ్యము చేయనివారికి కానవత్తురు.

అత్ర మన్దరకుఞ్జేషు విప్రర్షిసదనేషు చ,
గాయన్తి గాథా గన్ధర్వా శ్చిత్తబుద్ధిహరా ద్విజ. 9

ఇందు మందరపర్వతపు పొదలలో, విప్రర్షుల భవనములలో గంధర్వులు చిత్తమును, బుద్ధిని రూపుమాపుచు గాథలు పాడుదురు.

అత్ర సామాని గాథాభిః శ్రుత్వా గీతాని రైవతః,
గతదారో గతామాత్యో గతరాజ్యో వనం గతః. 10

---

7. సర్వః-మరణించిన జీవు లందరు; అనవబోధేన - తెలియరాని - చీకటితో, వృతా - కప్పబడినదై - పుణ్యవంతుడుగాని, పాపాత్ముడుగాని మరణకాలమున ఒడలెరుగనివాడు గావున దుఃఖమున మునిగి యిందు ప్రవేశించునని తాత్పర్యము. కృత్వా తు అవరోధేన - అనియు పాఠము. అనవః - పూర్వము ప్రోవుచేసికొన్న కర్మముతో కూడిన, రోధః - మోహము-ఏదియు తెలియరాకుండుట-అట్టిదానితో - కృత్వా - కర్తయై, సర్వః-ఎల్లవాడును. ఇచట 'కృత్వా' అనునది కర్త్రర్థకరూపము.

9. చిత్తబుద్ధిహరాః - చిత్తమును, బుద్ధిని హరించువారు యోగుల తత్త్వజ్ఞానమును, ప్రపంచము మిథ్య అను నిశ్చయమును పోగొట్టుదురని భావము. ఆ గానమహిమ అట్టివారినికూడ మోహపెట్టునని తాత్పర్యము.

10. గాథాః - వర్ణములతో నిండిన మంత్రములు. సామాని గీతాని- సామవేద సంబంధములగు పాటలు; రైవతు డను రాజు వీనిని వినుచు ఎంతకాలము గడచెనో యెరుగక భూలోకమునకు వచ్చి భార్యలు మొదలగువారు నశించిరని యెరిగి అడవికి పోయెనని పురాణగాథ.

ఇందు రైవతుడను రాజు గాథలతో కూడిన సామగీతములను విని భార్యను, మంత్రులను, రాజ్యమును పోగొట్టుకొని యడవులు పట్టెను.

అత్ర సావర్ణినా చైవ యవక్రీతాత్మజేన చ,
మర్యాదా స్థాపితా బ్రహ్మన్ యాం సూర్యో నాతివర్తతే. 11

ఇందు యవక్రీతుని కొడుకు సావర్ణి యను మనువు సూర్యుడు కూడ దాటజాలని కట్టడి ఏర్పాటు చేసెను.

అత్ర రాక్షసరాజేన పౌలస్త్యేన మహాత్మనా,
రావణేన తపశ్చీర్త్వా సురేభ్యోఽమరతా వృతా. 12

పులస్త్యుని మనుమడు, గొప్ప గుండెబలము గలవాడు అగు రాక్షసరాజు రావణు డిందు తప మొనరించి దేవతలవలన అమరత్వమును కోరెను.

అత్ర వృత్తేన వృత్రోఽపి శక్రశత్రుత్వ మీయివాన్,
అత్ర సర్వాసవః ప్రాప్తాః పునర్గచ్ఛన్తి పఞ్చధా. 13

ఇక్కడ జరిగిన దానివలననే వృత్రుడు ఇంద్రునితో విరోధము పొందెను. జీవు లన్నింటి ప్రాణములు ఇక్కడకు వచ్చి మరల అయిదు విధములుగానై దేహములకు చేరుచుండును.

అత్ర దుష్కృతకర్మాణో నరాః పచ్యన్తి గాలవ,
అత్ర వైతరణీ నామ నదీ వితరణై ర్వృతా. 14

పాపకర్మములు చేసిన నరు లిందు దాని ఫలము ననుభవింతురు. ఇందు వైతరణి యను నది గలదు. దాని చుట్టు వైతరణి యను నరకమునకు పోవు జనులు మూగియుందురు.

---

11. మర్యాదా - సూర్యరథము పోవుదారులు, మోయు వాహనములు, దాని దేవతలు అనువాని నియమమును సావర్ణిమనువు ఏర్పాటు చేసెనని తాత్పర్యము. సూర్యుడుకూడ ఆ కట్టడిని కాదనజాలఁడు.

13. వితరణైః - వైతరణి అను పేరుగల నరకమునకు పోవువారితో.

అత్ర గత్వా సుఖ స్యాన్తం దుఃఖస్యాన్తం ప్రపద్యతే,
అత్ర వృత్తో దినకరః సురసః క్షరతే పయః. 15

జీవుడు ఇటకు పోయి నరకమును స్వర్గమును పొందుచుండును. ఇటు వైపు మరల సూర్యుడు చక్కని రసముగల నీటిని కురిపించును.

కష్ఠాం చాసాద్య వాసిష్ఠీం హిమ ముత్సృజతే పునః,
మరియు ఉత్తరదిక్కును జేరి మంచు పుట్టించును.

అత్రాహం గాలవ పురా క్షుధార్తః పరిచిన్తయన్. 16
లబ్ధవాన్ యుధ్యమానౌ ద్వౌ బృహన్తౌ గజకచ్ఛపౌ.

గాలవా! మున్నొకమారు నేను ఆకలితో నున్నవాడనై తిరుగుచు పెద్ద దేహములతో పోరాడు ఏనుగును మొసలిని గాంచితిని.

అత్ర చక్రధను ర్నామ సూర్యాజ్జాతో మహానృషిః, 17
విదు ర్యం కపిలం దేవం యేనార్తాః సగరాత్మజాః.

ఈ దిక్కున సూర్యునివలన చక్రధను వను పేరుగల గొప్ప ఋషి పుట్టెను. ఆయననే కపిలు డందురు. ఆయనచేత సగరుని పుత్రులు నాశనమైరి.

అత్ర సిద్ధాః శివా నామ బ్రాహ్మణా వేదపారగాః, 18
అధీత్య సకలాన్ వేదాన్ లేభిరే మోక్ష మక్షయమ్.

---

15. సుఖస్య - అన్తమ్ - నరకమును; దుఃఖస్య - అన్తమ్ - స్వర్గమును - అత్ర వృత్తః - ఈ వైపునకు తిరిగిన - అనగా దక్షిణాయనమున ప్రవేశించిన సూర్యుడని తాత్పర్యము. సురసం క్షరతే పయః-సూర్యుడు కర్కాటక రాశియందు ప్రవేశించిన కాలము వర్షర్తువు ప్రారంభమని ప్రసిద్ధి.

16 వాసిష్ఠీం కాష్ఠామ్ - వసిష్ఠ సంబంధమైన దిక్కు- ఇచ్చట వసిష్ఠ దనగా వసిష్ఠుడు మొదలుగా గల సప్తర్షులను గ్రహింపవలయును. వారుగల దిక్కు - ఉత్తరము. 'ధానిష్ఠీమ్' అనియు పాఠము. ఆ పక్షమున ధన మధికముగా గలవాడు ధనిష్ఠుపు - కుబేరుడు. అతనికి సంబంధించిన దిక్కు - ధానిష్ఠీ. ఉత్సృజతే - వదలును కురియును.

ఇందు వేదములు కడదాక నేర్చినవారు, శివు లనబడు బ్రాహ్మణులు వేదము లన్నింటి తత్త్వ మెరిగి సిద్ధులై చెడని దగు మోక్షమును పొందిరి.

అత్ర భోగవతీ నామ పురీ వాసుకిపాలితా, 19
తక్షకేణ చ నాగేన తథై వైరావతేన చ.

వాసుకి, తక్షకుడు, ఐరావతుడు అను నాగరాజు లేలెడు భోగవతి యను పుర మిందు గలదు.

అత్ర నిర్యాణకాలేఽపి తమః సంప్రాప్యతే మహత్, 20
అభేద్యం భాస్కరేణాపి స్వయం వా కృష్ణవర్త్మనా.

ఇందు మరణకాలమున పెనుచీకటి ఆవరించును. దానిని సూర్యుడు గాని అగ్నిగాని చీల్చివేయలేరు.

ఏష తస్యాపి తే మార్గః పరిచార్యస్య గాలవ,
బ్రూహి మే యది గన్తవ్యం ప్రతీచీం శృణు చావరామ్. 21

గాలవా! యిదిగో నేను సేవించుచున్న నీ మార్గము. పోవలయునా? చెప్పుము. లేదా వేరు దిక్కును-పడమరను-గూర్చి చెప్పెదను.

ఇతి శ్రీమహాభారతే - ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే నవాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవ చరితమున నూటతొమ్మిదవ అధ్యాయము.

—:o:—

20. నిర్యాణకాలే-మరణ కాలమున, తమః-చీకటి-గ్రుడ్డితనము.

21. తస్య-ఆ నీయొక్క; పరిచార్యస్య-సేవ్యుడగువాని-నీవు నాకిపుడు స్వామివని తాత్పర్యము.

# దశాధికశతతమోఽధ్యాయః
# నూటపదియవ అధ్యాయము

## పశ్చిమదిశావర్ణనమ్.
## పడమటిదిక్కు వర్ణనము

ఇయం దిగ్దయితా రాజ్ఞో వరుణస్య తు గోపతేః,
సదా సలిలరాజస్య ప్రతిష్ఠా చాది రేవ చ. 1

ఇది జలములకు అధిపతి యగు వరుణరాజునకు ఎల్లవేళల ప్రియమైన దిక్కు. సూర్యునకు మొదటి నెలవు.

అత్ర పశ్చా దహః సూర్యో విసర్జయతి గాః స్వయమ్,
పశ్చిమే త్యభివిఖ్యాతా దిగియం ద్విజసత్తమ. 2

దినము ముగిసిన కాలమున సూర్యుడు తనకు తానై యిందు తన కిరణములను వదలును. ఆ కారణమున ఈ దిక్కునకు వెనుకటిది అను నర్థమున 'పశ్చిమ' నామము గలిగినది.

యాదసా మత్ర రాజ్యేన సలిలస్య తు గుప్తయే,
కశ్యపో భగవాన్ దేవో వరుణం స్మాభ్యషేచయత్. 3

ఇది నీటి జంతువుల రాజ్య మగుటచే జలమును కాపాడుటకై భగవంతు డగు కశ్యపదేవు డిందు వరుణుని అభిషేకించెను.

---

1. గోపతేః-కిరణములను పాలించువాడగు సూర్యునియొక్క; ఆదిః-మొదటి ప్రతిష్ఠా-నెలవు.
2. పై విషయమునే ఈ శ్లోకమున వివరించుచున్నారు. అహః-పగటి, పశ్చాత్-తుదిభాగమున-సాయంకాలమున అని అర్థము; గాః-తన కిరణము లను; విసర్జయతి - వదలుచున్నాడు; అందువలననే-పశ్చిమా - చివరిది. అను నర్థము గలదిగా; విఖ్యాతా-ప్రసిద్ధి కెక్కినది.

అత్ర పీత్వా సమస్తాన్ వై వరుణస్య రసాంస్తు షట్,
జాయతే తరుణః సోమః శుక్లస్యాదౌ తమిస్రహా. 4

మునుపు పరిశుద్ధుడగు వరుణునికి సంబంధించిన ఆరు రసములను మొత్తముగా పీల్చి చంద్రుడు పయసుకాడై చీకటులను చీల్చువాడయ్యెను.

అత్ర పశ్చాత్కృతా దైత్యా వాయునా సంయుతా స్తదా,
నిఃశ్వసన్తో మహావాతై రర్దితాః సుషుపు ర్ద్విజ. 5

ఇందు వాయువు వెనుకకు తిప్పి కట్టి పడవేయగా పెనుగాలులతో పీడ నొందిన రక్కసులు రొజుకొనుచు నిద్రించిరి.

అత్ర సూర్యం ప్రణయినం ప్రతిగృహ్ణాతి పర్వతః,
అస్తో నామ యతః సన్ధ్యా పశ్చిమా ప్రతిసర్పతి. 6

ఇందు తనకు ప్రియుడైన సూర్యుని అస్త మను పర్వతము చేతులలోనికి తీసికొనును. పశ్చిమసంధ్య దీనినుండియే సాగివచ్చును.

అతో రాత్రిశ్చ నిద్రా చ నిర్గతా దివసక్షయే,
జాయతే జీవలోకస్య హర్తు మర్ధ మివాయుషః. 7

పగలు గడువగా దీనినుండి రాత్రి, నిద్ర యనునవి ప్రాణిలోకము సగము ఆయువును దోచివేయును నేర్పడుచున్నవి.

అత్ర దేవీం దితిం సుప్తా మాత్మప్రసవధారిణీమ్,
విగర్భా మకరో చ్ఛక్రో యత్ర జాతో మరుద్గణః. 8

కడుపులో పిండము ధరించిన దితి నిద్రించుచుండగా ఇందే యింద్రుడు గర్భము పాడుచేసెను. దానివలననే మరుత్తుల గణము ఏర్పడెను.

అత్ర మూలం హిమవతో మన్దరం యాతి శాశ్వతమ్,
అపి వర్షసహస్రేణ న చాస్యాన్తోఽధిగమ్యతే. 9

---

5. పశ్చాత్ కృతాః - వెనుకకు త్రిప్పబడినవారై;
సంయతాః - కట్టబడినవారై.

7. రాత్రిపూట నిద్రలో ప్రాణుల ఆయువు సగము వ్యయమై పోవునని తాత్పర్యము.

ఇందు మందరపర్వతము హిమవంతుని శాశ్వతమైన మూలమును చూడబోయెను. వేయేండ్లకును దాని అంతము దానికి దొరకలేదు.

అత్ర కాఞ్చనశైలస్య కాఞ్చనామ్బురుహస్య చ,
ఉదధే క్షీర మాసాద్య సురభిః క్షరతే పయః 10

ఇందు బంగారుకొండ కడ బంగరుపద్మములుగల సముద్రముఒడ్డున నుండి కామధేనువు పాలు కురిపించును

అత్ర మధ్యే సముద్రస్య కబన్ధః ప్రతిదృశ్యతే,
స్వర్భానోః సూర్యకల్పస్య సోమసూర్యౌ జిఘాంసతః. 11

ఇదిగో చూడు ! సముద్రమునడుమ ఒక మొండెము కానవచ్చుచున్నది. ఇది సూర్యునంతటివాడు, చంద్రసూర్యులను మ్రింగచూచువాడు నగు రాహువు మొండెము.

సువర్ణశిరసోఽప్యత్ర హరిరోమ్ణః ప్రగాయతః,
అదృశ్య స్యాప్రమేయస్య శ్రూయతే విపులో ధ్వనిః. 12

నరయని రోమములు గల సువర్ణశిరస్కుడగు ముని యిందు గలడు. అత డెవ్వనికి గానరాడు. ఇట్టివాడని ఊహించుటకును సాధ్యము కానివాడు. ఆయన పెద్దగా పాడుచుండగా గొప్పనాదము వినవచ్చుచుండును.

---

9. మన్దరమ్ - సముద్రమున మునిగిన మందరపర్వతము; దీనివలన సముద్రజలము, హిమవంతుని మూలము ఊహింప నలవికాని ప్రమాణము గలవి యని భావము.

10. కాంచన + అంబురుహస్య - బంగారుపద్మములు గల; ఉదధేః - సముద్రము వంటి సరస్సుయొక్క.

12. సువర్ణశిరసః - సువర్ణ శిరస్కుడను పేరు గల మునియొక్క; హరిరోమ్ణః - నరయని కేశములు గలవాని; అనగా ఆతడు ఎల్లవేళల తరుణ వయస్సునందే ఉండునని భావము; అదృశ్యస్య - ఎవ్వరు నాతని చూడ జాలరని భావము.

యత్ర ధ్వజవతీ నామ కుమారీ హరిమేధసః,
ఆకాశే తిష్ఠ తిష్ఠేతి తస్థౌ సూర్యస్య శాసనాత్. 13

హరిమేధసు డను ముని కూతురు ధ్వజవతి యనునది, సూర్యుడు నిలువు మని శాసింపగా ఆకసమున ఈ దిక్కున నిలిచియుండెను.

అత్ర వాయు స్తథా వహ్ని రాపః ఖం చాపి గాలవ,
ఆహ్నికం చైవ నైశం చ దుఃఖం స్పర్శం విముఞ్చతి. 14

ఇందు వాయువు, అగ్ని, నీరు, ఆకాశము పగటియందును, రాత్రియందును బాధించు స్పర్శను వీడియుండును.

అతఃప్రభృతి సూర్యస్య తిర్య గావర్తతే గతిః,
అత్ర జ్యోతీంషి సర్వాణి విశ న్త్యాదిత్యమణ్డలమ్. 15

---

13 హరిమేధసః - హరిమేధసుడను మునియొక్క; కుమారీ - పుత్రిక; తిష్ఠ తిష్ఠ-నిలు నిలు అను; సూర్యస్య శాసనాత్-సూర్యుని శాసనమువలన.

14. ఈ దిక్కునందలి గాలి, నిప్పు, నీరు, ఆకాశము అనునవి యెల్లవేళల సుఖస్పర్శ కలిగి యుండును గాని బాధించు స్పర్శ వానికెప్పుడు కల్గదని భావము; దుఃఖమ్ - దుఃఖమును కూర్చెడు; స్పర్శం - స్పర్శను; విముఞ్చన్తి - వదలును.

15. అతఃప్రభృతి... మేరువును చుట్టివచ్చు సూర్యుడుఎప్పుడుఅడ్డముననే తిరుగుచుండును. కాని లోకముల చూపునకు పై భాగమును, క్రింది భాగమునను తిరుగుచున్నట్లు కానవచ్చును. ఈ పడమటిదిక్కు అంచులలో లోకదృష్టి ఉండదు, కనుక అడ్డముగా తిరుగుటయే యుండునని భావము.

'ఆదిత్యో వా అస్తం యన్నగ్ని మనుప్రవిశతి - ఆదిత్యుడు అస్తమించుచు అగ్నిని ప్రవేశించును-అను శ్రుతినిబట్టి సూర్యుడు అగ్ని మున్నగు వెలుగులను చేరును. నక్షత్రములు కూడ అట్టి వెలుగులే. అవి యన్నియు కలసి ఆదిత్యమండలము నేర్పరచును. నక్షత్రములు మున్నగునవి కూడ జలమయములే కావున వానికి స్వయముగా ప్రకాశించు లక్షణము లేదు. సూర్యకాంతి తోడనే రాత్రులయందు అవి ప్రకాశించుచుండును. పగలు ఆకాంతి వానియందు ప్రసరించకపోవుటవలన ప్రకాశింపకుండును.

ఇది మొదలుగా సూర్యుని గతి అడ్డముగా సాగును. ఇందు నక్షత్రము లన్నియు సూర్యమండలము చేరుకొనుచుండును.

అష్టావింశతిరాత్రం చ చంక్రమ్య సహ భానునా,
నిష్పతన్తి పునః సూర్యాత్ సోమసంయోగయోగతః. 16

ఇరువదియెనిమిది రాత్రులు నక్షత్రములు సూర్యునితోకూడ చంద్రునితో కలిసిన రీతిని కలసి తిరుగుచు మరల సూర్యునివలన వెలికి వచ్చుచున్నవి.

అత్ర నిత్యం స్రవన్తీనాం ప్రభవః సాగరోదయః,
అత్ర లోకత్రయస్యాప స్తిష్ఠన్తి వరుణాలయే. 17

ఇందు ఎల్లవేళల సముద్రముల నింపెడు నదుల పుట్టుక జరుగుచుండును. ఈ వరుణుని ఆలయమున మూడు లోకములకు చాలు జలము లుండును.

అత్ర పన్నగరాజస్యా ప్యనన్తస్య నివేశనమ్,
అనాదినిధన స్యాత్ర విష్ణోః స్థాన మనుత్తమమ్. 18

పాములరేడగు అనంతుని నివాసము కూడ ఇందే కలదు. పుట్టుక మరణములేని విష్ణువుదైన గొప్పతావు కూడ ఇందే కలదు.

---

16. ఒక్కొక్క నక్షత్రము ఒక్కొక్క దినమున చంద్రునితో కూడియుండును. అట్లు ఇరువది యెనిమిది దినములు గడచిన పిదప ఇరువది తొమ్మిదవ దినమున; నిష్పతతి-చంద్రునినుండి బయటకు వచ్చును. అట్లే ఆ నక్షత్రములు; సోమసంయోగయోగతః - చంద్రునితో కలసిన విధముగా భానునా సహ - సూర్యునితో కూడ; సంక్రమ్య-కలసియుండి, నిష్పతన్తి సూర్యునినుండి బయటకు వచ్చుచుండును. ఇట్లు నక్షత్రములకు చంద్రునితోవలె అన్ని గ్రహములతో సంక్రాంతి సమానమని భావము.

17. స్రవన్తీనామ్-నదులయొక్క; సాగరోదయః - సముద్రమును నింపెడు; ప్రభవః - పుట్టుక - సముద్రములను నింపెడు నదులన్నియు నిందే పుట్టునని భావము.

అత్రానలసఖ స్యాపి పవనస్య నివేశనమ్,
మహర్షేః కశ్యపస్యాత్ర మారీచస్య నివేశనమ్. 19

అగ్ని చెలిమికాడైన వాయువు నివాసము, మరీచతనయుడగు కశ్యప మహర్షి నివాసమును ఇందే కలవు.

ఏష తే పశ్చిమో మార్గో దిగ్ద్వారేణ ప్రకీర్తితః,
బ్రూహి గాలవ గచ్ఛావో బుద్ధిః కా ద్విజసత్తమ. 20

ఈ పడమటి దారిని గూర్చి నీకు చూచాయగా చెప్పితిని. గాలవా! చెప్పు పోదమా! నీ అభిప్రాయమేమి ?

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే దశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవకథయందు నూటపదియవ అధ్యాయము.

—: o :—

20. దిగ్ద్వారేణ - సంక్షేపముగా; తే - నీకు.

# ఏకాదశాధికశతతమోఽధ్యాయః
# నూటపదునొకండవ అధ్యాయము

## ఉత్తరదిశావర్ణనమ్
## ఉత్తరదిక్కు వర్ణనము

సుపర్ణ ఉవాచ - సుపర్ణు డిట్లు చెప్పెను.

యస్మా దుత్తార్యతే పాపా ద్యస్మాన్నిః శ్రేయసోఽశ్నుతే,
అస్మా దుత్తారణబలా దుత్తరే త్యుచ్యతే ద్విజ. 1

జీవులు దీనివలన పాపమునుండి దాటుదురు, ముక్తి పొందుదురు. అట్లు దాటించునది కనుక దీనిని ఉత్తరదిక్కు అందురు.

ఉత్తరస్య హిరణ్యస్య పరివాపశ్చ గాలవ!
మార్గః పశ్చిమపూర్వాభ్యాం దిగ్భ్యాం వై మధ్యమః స్మృతః. 2

గాలవా! ఈ దిక్కు గొప్ప బంగారునిధులకును స్థావరము పడమర తూర్పుదిక్కుల నడిమిమార్గము కనుక మధ్యమ మనియు దీనికి పేరు.

అస్యాం దిశి వరిష్ఠాయా ముత్తరాయాం ద్విజర్షభ,
నాసౌమ్యో నావిధేయాత్మా నాధర్మో వసతే జనః. 3

మిక్కిలి శ్రేష్ఠమగు ఈ ఉత్తరదిక్కునందు మంచితనము, ఇంద్రియ నిగ్రహము, ధర్మము లేని జనుడు ఉండడు.

---

1. ఉత్తరాయణమున పోవువారికి పాపము నశించి, స్వర్గము - మోక్షము-సిద్ధించును. అను అర్థమును బట్టి ఈ దిక్కు-ఉత్తరా - మిక్కిలి గొప్పది అని భావము.

2. హిరణ్యస్య-ధనముయొక్క, నవనిధులయొక్క; పరివాపః - స్థానము. అట్లు నిధిస్థానము కనుక స్వర్గమార్గము; తూర్పుపడమరల దృష్టితో దీనిని మధ్యమ మనియు అందురు.

3. అవిధేయ + ఆత్మా-చిత్తముపై అదుపులేనివాడు.

అత్ర నారాయణః కృష్ణో జిష్ణుశ్చైవ నరోత్తమః,
బదర్యా మాశ్రమపదే తథా బ్రహ్మా చ శాశ్వతః. 4

ఇందు నారాయణుడైన కృష్ణుడు, జయశీలుడగు నరవరుడు బదరికాశ్రమములో నివసింతురు. అట్లే శాశ్వతుడగు బ్రహ్మయు నిందు నివసించును.

అత్ర వై హిమవత్పృష్ఠే నిత్యమాస్తే మహేశ్వరః,
ప్రకృత్యా పురుషః సార్థం యుగాన్తాగ్నిసమప్రభః. 5

ఇందు హిమవత్పర్వతశిఖరమున పురుషస్వరూపుడగు మహేశ్వరుడు ప్రకృతిస్వరూపిణియగు ఉమతో కూడి ప్రళయకాలమునందలి అగ్నివంటి కాంతితో విరాజల్లుచు నిత్యము నివసించును.

న స దృశ్యో మునిగణై స్తథా దేవైః సవాసవైః,
గన్ధర్వయక్షసిద్ధైర్వా నరనారాయణా దృతే. 6

ఆతడు మునులకుగాని, ఇంద్రునితోపాటు దేవతలకుగాని, గంధర్వులు, యక్షులు, సిద్ధులు మున్నగువారికిగాని కానరాడు. నరనారాయణులకు మాత్రము కానవచ్చును.

అత్ర విష్ణుః సహస్రాక్షః సహస్రచరణోఽవ్యయః,
సహస్రశిరసః శ్రీమా నేకః పశ్యతి మాయయా. 7

---

5. ప్రకృత్యా-ఉమతో.

6. సః-మాయ పైకొన్నవాడయ్యు; న దృష్టః - కానరాడు - చూడరానివాడని భావము; శుద్ధజ్ఞానస్వరూపుడై మాయను వదలినచో ఇక చెప్పనేల? అని భావము.

7. సహస్రశిరసః - ఇది అకారాంత శబ్దము; అవ్యయః - హెచ్చుతగ్గులు లేక ఏకాకారముగా నుండువాడు; మాయయా - ప్రకృతిస్వరూపిణియగు మాయతో కూడిన మహేశ్వరుని అని భావము - పరమేశ్వరుడు ప్రస్తుతః అన్ని జీవులలో నిండియుండు ప్రత్యగాత్మస్వరూపుడు కావున అతని విషయమున చూచువాడు, చూడబడుట మున్నగు లక్షణము లుండవు. కాని మాయతో కూడినపుడు - ఏదో ఒక స్వరూపమును పొంది

వేయి కన్నులు, వేయి పాదములు, వేయి శిరస్సులు గల నిత్యుడు, శ్రీమంతుడు, అగు విష్ణువొక్కడు ఈ దిక్కున మాయతో గూడిన మహేశ్వరుని దర్శనము పొందును.

అత్ర రాజ్యేన విప్రాణాం చన్ద్రమా శ్చాభిషిచ్యత,
అత్ర గఙ్గాం మహాదేవః పతన్తీం గగనా చ్చ్యుతామ్, 8
ప్రతిగృహ్య దదౌ లోకే మానుషే బ్రహ్మవిత్తమ.

తొల్లి ఈ దిక్కునందు చంద్రుడు విప్రుల రాజ్యమునం దభిషేకము పొందెను. ఆకసమునుండి జారిపడుచున్న గంగను మహాదేవు డిందే పట్టుకొని మనుష్యలోకమున వదలెను.

అత్ర దేవ్యా తప స్తప్తం మహేశ్వరపరీప్సయా. 9

ఇందు పార్వతీదేవి పరమేశ్వరుని పతిగా పొందగోరి తప మాచరించెను.

అత్ర కామశ్చ రోషశ్చ శైల శ్చోమా చ సంబభుః.

ఈ దిక్కునందే కామము, రోషము, పర్వతము, ఉమాదేవియు పుట్టిరి.

అత్ర రాక్షసయక్షాణాం గన్ధర్వాణాం చ గాలవ,
ఆధిపత్యేన కైలాసే ధనదోఽవ్యభిషేచితః. 10

ఈ దిక్కున కైలాసమున రాక్షసులు, యక్షులు, గంధర్వులు అనువారిపై ప్రభుత్వము నెరపుటకు కుబేరుని అభిషేకించిరి.

---

ఉపాధి సహితుడైనపుడు - అతనిని చూడ శక్యమగును. అనగా సగుణ బ్రహ్మభావననుండియే నిర్గుణబ్రహ్మజ్ఞానము కలుగునని తాత్పర్యము- "సోపాధి ర్నిరుపాధిశ్చ ద్వేధా బ్రహ్మవి దుచ్యతే, సోపాధికః స్యాత్ సర్వాత్మా నిరుపాఖ్యోఽనుపాధికః" - అని శాస్త్రములు చెప్పుచున్నవి. బ్రహ్మము నెరిగినవాడు రెండు విధములుగా నుండును. ఒకడు సోపాధికుడు. రెండవవాడు నిరుపాధికుడు. సోపాధికుడు సర్వాత్మ డగును. నిరుపాధికునకు నామరూపాదు లేవియు నుండవు. ఈ అంశ మంతటికి శ్రీ నీలకంఠుం వేదాంతశతకమను గ్రంథమున విస్పష్టమగు వివరణ కలదు.

అత్ర చైత్రరథం రమ్య మత్ర వైఖానసాశ్రమః. 11

ఇందు అందమగు చైత్రరథమను ఉద్యానవనము గలదు. మరియు వైఖానసుల ఆశ్రమమును గలదు

అత్ర మన్దాకినీ చైవ మన్దరశ్చ ద్విజర్షభ,
అత్ర సౌగన్ధికవనం నైరృతై రభిరక్ష్యతే. 12

ఇందు మందాకినియు, మందరపర్వతమును గలవు. ఈ దిక్కునందే సౌగంధికపద్మముల తోటను రాక్షసులు కాపాడుచుందురు.

శాద్వలం కదలీస్కన్ధ మత్ర సన్తానకా నగాః.

ఇందు శాద్వలము కదళి యను పతాకకొమ్మయు కల్పవృక్షము మొదలగు చెట్టును గలవు.

అత్ర సంయమనిత్యానాం సిద్ధానాం స్వైరచారిణామ్,
విమానా న్యనురూపాణి కామభోజ్యాని గాలవ. 13

ఇందు గొప్ప నిగ్రహము, కామగమనము గల సిద్ధుల విమానములు వారి వారికి తగిన విధముగా కోరిన భోగములను కూర్చుచుండును.

అత్ర తే ఋషయః సప్త దేవీ చారున్ధతీ తథా. 14

ఇందు ప్రసిద్ధులగు సప్తర్షులు అరుంధతీదేవియు నివసించుచుందురు.

అత్ర తిష్ఠతి వై స్వాతి రత్రాస్యా ఉదయః స్మృతః,
అత్ర యజ్ఞం సమాసాద్య ధ్రువం స్థాతా పితామహః. 15

---

13. శాద్వలమ్ - జంబాల మను పేరుగల ఒక దేవతాస్వరూపము; కదలీస్కన్ధమ్ - వైజయంతి యను పేరుగల పతాక. స్కంధమనగా కొమ్మ వలె పైకి ఎత్తబడిన పతాకయని భావము - 'అథ కదలీ పతాకా మృగభేదయోః' - అని మేదినీ నిఘంటువు. కదలి అను శబ్దము పతాక, ఒక విధమగు మృగము అను నర్థములం దుండును. నగాః - చెట్లు-కల్పవృక్షము మొదలగునవి; సంయమనిత్యానామ్- ధ్యానము, ధారణము అను యోగలక్షణముల నెప్పుడు వదలనివారని భావము.

ఇందు స్వాతినక్షత్రము నెలకొని యుండును. అవి ఉదయించు చోటిదియే. ఇందు బ్రహ్మ యజ్ఞ మాచరించి నిలుకడతో నుండును.

జ్యోతీంషి చన్ద్రసూర్యౌ చ పరివర్తన్తి నిత్యశః,
అత్ర గంగామహాద్వారం రక్షన్తి ద్విజసత్తమ. 16

నక్షత్రములు, చంద్రుడు, సూర్యుడు ఇం దెల్లవేళల తిరుగుచు గంగ మహాద్వారమును రక్షించుచుందురు.

ధామా నామ మహాత్మానో మునయః సత్యవాదినః,
న తేషాం జ్ఞాయతే మూర్తి ర్నాకృతి ర్న తపశ్చితమ్. 17

మహాత్ములు, సత్యమునే పలుకువారు నగు ధాములను పేరు గల మును లిందుందురు. వారి స్వరూప మెట్టిదో, వారి అవయవముల తీరెట్టిదో వారు సాధించిన తప మెట్టిదో యెవ్వరికిని తెలియరాదు.

పరివర్తః సహస్రాణి కామభోజ్యాని గాలవ.

ఇం దిచ్చవచ్చినట్లు తినదగిన అన్నపరివేషణపాత్రములు వచ్చుచు పోవుచు నుండును.

యథా యథా ప్రవిశతి తస్మాత్ పరతరం నరః,
తథా తథా ద్విజశ్రేష్ఠ ప్రవిలీయతి గాలవ. 18

ఈ మంచు నిండిన తావునుండి లోనికి పోయిన కొలది నరుడు దానిలో కరగి పోవును.

నైతత్ కేనచి దన్యేన గతపూర్వం ద్విజర్షభ,
ఋతే నారాయణం దేవం నరం వా జిష్ణు మవ్యయమ్. 19

---

16. గంగామహాద్వార మనుచోట గాయంతికాద్వార మనియు పాఠము గలదు. అప్పుడు 'గాయంతిక' అనునది ఒక గుహ.

17. మూర్తి అనగా స్థూలరూపము; ఆకృతి యనగా అవయవములు తోచు స్వరూపము.

18. పరివర్తః - వచ్చుచు పోవుచుండుట; సహస్రాణి-వేలకొలది అన్న పాత్రములు; కామభోజ్యాని - ఇచ్చవచ్చినట్లు తినుటకు యోగ్యము లయినవి - అవి స్థూలదృష్టికట్లు కానవచ్చునని భావము. తస్మాత్ - ఆ మంచుగల చోటునుండి; పరతరం - మిక్కిలి లోపలికి; ప్రవిలీయతి - మంచుతో కరిగి నశించిపోవునని తాత్పర్యము.

నారాయణదేవుడు, జయశీలి, నాశనము లేనివాడు నగు నరుడు కాక మరి యెవ్వరు దీనిని ప్రవేశింపలేరు.

అత్ర కైలాస మిత్యుక్తం స్థాన మైలబిలస్య తత్. 20

దీనిని కైలాస మందురు. ఇది కుబేరునకు నెలవు.

అత్ర విద్యుత్ప్రభా నామ జజ్ఞిరేఽప్సరసో దశ,
అత్ర విష్ణుపదం నామ క్రమతా విష్ణునా కృతమ్,
త్రిలోకవిషయే బ్రహ్మ న్నుత్తరాం దిశ మాశ్రితమ్. 21

ఓ బ్రాహ్మణా! ఇచటనే విద్యుత్ప్రభ లను పేరుగల అచ్చరలు పదుగురు పుట్టిరి. విష్ణువు మున్ను (వామనావతారమున) మూడులోకములు ఆక్రమించి నపుడు ఉత్తరదిక్కు నం దిచటనే పాదము మోపుటచే ఈ ప్రదేశము విష్ణుపద మను పేరుతో ప్రసిద్ధమైనది.

అత్ర రాజ్ఞా మరుత్తేన యజ్ఞేనేష్టం ద్విజోత్తమ,
ఉశీరబీజే విప్రర్షే యత్ర జామ్బూనదం సరః. 22

ఇందు ఉశీరబీజ మనుచోట బంగారు సరస్సు గల తావున మరుత్తుడను రాజు గొప్ప యజ్ఞము చేసెను.

జీమూతస్యాత్ర విప్రర్షే రుపతస్థే మహాత్మనః,
సాక్షాద్ధైమవతః పుణ్యో విమలః కనకాకరః. 23

బ్రహ్మర్షి యగు జీమూతు డను మహాత్మునకు హిమవత్పర్వతము దిచటనే స్వచ్ఛము, దీప్తమును బంగారుగని యగపడినది.

బ్రాహ్మణేషు చ యత్ కృత్స్నం స్వ న్తం కృత్వా ధనం మహత్,
వవ్రే ధనం మహర్షిః స జైమూతం తద్ధనం తతః. 24

---

20. ఐలబిలస్య-కుబేరుని యొక్క.

23. ఉశీరబీజే-ఉశీరబీజ మను పేరుగల స్థానమున; కనకాకరః-బంగారుగని. జీమూతస్య-జీమూతుని, ఉప-సమీపమున, తస్థే-ప్రకాశమును పొందినది. ఇచట 'స్థా' ధాతువు ప్రకాశము పొందుట అను నర్థమున ఆత్మనేపద ప్రత్యయమును పొందినది.

24. వవ్రే-బ్రాహ్మణులను ఈ ధనము నాపేరు మీద ప్రసిద్ధిచెందుగాక యని వరము వేడెనని భావము. స్వన్తమ్-పవిత్రము.

ఆ బ్రహ్మర్షి ఆ సువర్ణనిధిని సంపూర్ణముగ బ్రాహ్మణుల కొసగి, ఈ ధనము నా పేరుతో ప్రసిద్ధమగునట్లు అనుగ్రహించుడని కోరెను. అప్పటి నుండియు ఆ ధనమునకు జైమూతమను పేరు గలిగెను.

అత్ర నిత్యం దిశాం పాలాః సాయం ప్రాతర్ద్విజర్షభ,
కస్య కార్యం కిమితి వై పరిక్రోశ న్తి గాలవ. 25

ఇందు ప్రతిదినము దిక్పాలకులు సాయంసమయములలో ప్రాతఃకాలము లలో ఇది యేమి? ఎవరి పని? అని పెద్దగా కేకలు పెట్టుచుందురు.

ఏవ మేషా ద్విజశ్రేష్ఠ గుణై రన్యై ర్దిగుత్తరా,
ఉత్తరేతి పరిఖ్యాతా సర్వకర్మసు చోత్తరా. 26

ద్విజశ్రేష్ఠా! ఇట్టి దిక్కు మరియు ఇతరగుణములతో శ్రేష్ఠమైనది. కావుననే 'ఉత్తర' అని పేరొందినది. అన్ని కార్యములకు మేలైనది.

ఏతా విస్తరశ స్తాత తవ సంకీర్తితా దిశః,
చతస్రః క్రమయోగేన కామాశాం గన్తుమిచ్ఛసి? 27

బాబూ! నీకు ఈ నాలుగు దిక్కులను గూర్చి క్రమముగా వివరించి చెప్పితిని. ఏ దిక్కునకు పోవగోరుదువు?

ఉద్యతోఽహం ద్విజశ్రేష్ఠ తవ దర్శయితుం దిశః,
పృథివీం చాఖిలాం బ్రహ్మం స్తస్మా దారోహ మాం ద్విజ. 28

బ్రాహ్మణవరేణ్యా! నీకు దిక్కు లన్నింటిని, భూమి యంతటిని చూపుటకు సిద్ధముగా నున్నాను. నాపై కూర్చుండుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే ఏకాదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునొకండవ అధ్యాయము.

—:o:—

25. పరిక్రోశన్తి-మీ మీ కార్యములను చేసిపెట్టుటకు మే మిందున్నాము. ఆదేశింపుడని భావము.

26. ఉత్తరా-మిక్కిలి శ్రేష్ఠమైనది.

# ద్వాదశాధిక శతతమోఽధ్యాయః

# నూటపండ్రెండవ అధ్యాయము

**గరుడ మారుహ్య పూర్వాం దిశం గచ్ఛతో**
**గాలవస్య తద్వేగేన వ్యాకులత్వమ్.**

**గరుడు నెక్కి తూర్పుదిక్కున కరుగుచున్న**
**గాలవు డాతని వేగమునకు బెగడుట.**

గాలవ ఉవాచ - గాలవు డిట్లు చెప్పెను.

గరుత్మన్ భుజగేంద్రారే సుపర్ణ వినతాత్మజ,
నయ మాం తార్క్ష్య పూర్వేణ యత్ర ధర్మస్య చక్షుషీ. 1

గరుత్మంతుడా! సర్పరాజుల పగవాడా! సుపర్ణా! వినతకుమారుడా! తార్క్ష్యుడా! ధర్మపు కన్నులుగల తూర్పుదిక్కునకు నన్ను గొనిపొమ్ము.

పూర్వమేతాం దిశం గచ్ఛ యా పూర్వం పరికీర్తితా,
దేవతానాం హి సాన్నిధ్య మత్ర కీర్తితవా నసి. 2

నీవు ముందు వర్ణించి చెప్పిన తూర్పుదిక్కునకు పద. ఇందు దేవతలు సన్నిధిచేసి యుందురని కొనియాడితివి గదా!

అత్ర సత్యం చ ధర్మశ్చ త్వయా సమ్యక్ ప్రకీర్తితః,
ఇచ్ఛేయం తు సమాగన్తుం సమస్తై ర్దైవతై రహమ్,
భూయశ్చ తాన్ సురాన్ ద్రష్టు మిచ్ఛేయ మరుణానుజ. 3

ఇందు సత్యము, ధర్మము చక్కగా నున్నవని నీవు కొనియాడితివి. నేనా దేవత లందరిని కలియుటకు ఇష్టపడుచున్నాను. అనూరుని తమ్ముడా! ఆ దేవతల నందరిని చూడగోరుదును.

---

1. పూర్వేణ - తూర్పుదిక్కునందు; చక్షుషీ - కన్నులు - అగ్ని, చంద్రుడు.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

తమాహ వినతాసూను రారోహస్వేతి వై ద్విజమ్,
ఆరురోహాథ స ముని ర్గరుడం గాలవ స్తదా. 4

అంత వినతకొడుకు ఆ బ్రాహ్మణునితో 'నాపై నెక్కు'మని పలికెను. అంత నా ముని గాలవుడు గరుత్మంతునిపై నెక్కెను.

గాలవ ఉవాచ - గాలవు డిట్లు పలికెను.

క్రమమాణస్య తే రూపం దృశ్యతే పన్నగాశన,
భాస్కరస్యేవ పూర్వాహ్ణే సహస్రాంశో ర్వివస్వతః. 5

ఓయి గరుడా! వేయి కిరణములు గలవాడు, తనకాంతితో సర్వమును కప్పువాడు నగు ఉదయభాస్కరుని రూపమువలె పైకెగురుచున్న నీరూపము గానవచ్చుచున్నది.

పక్షవాతప్రణున్నానాం వృక్షాణా మనుగామినామ్,
ప్రస్థితానా మివ సమం పశ్యామీహ గతిం ఖగ. 6

నీ రెక్కలగాలికి నుగ్గునుగ్గయి నీవెంటనంటి వచ్చుచున్న చెట్లు నీతోపాటు బయలుదేరి వచ్చుచున్నట్లు నాకు కానవచ్చుచున్నవి.

స సాగరవనా ముర్వీం సశైలవనకాననామ్,
ఆకర్షన్నివ చాభాసి పక్షవాతేన ఖేచర. 7

---

5. సహస్రాంశువు- వివస్వంతుడు అని రెండు విశేషణములిచట సూర్యునకు చెప్పబడినవి. తరువాతి శ్లోకమున గరుత్మంతుని రెక్కల గాలికి లేచిన చెట్లు అతని కిరణములవలె తోచుచున్నవి. అట్లే ఆచ్ఛాదనలేనితనము కూడ చెప్పినట్లయినది. వః - అనగా కప్పునది-వస్త్రము మొదలగునది. అది కలవాడు. వస్వాన్ - ఆచ్ఛాదన కలవాడని భావము. వి-వస్వాన్- అనగా ఆచ్ఛాదనలేనివాడు - అనగా తాను తన కాంతితో సర్వమును క్రమ్మివైచును గాని తన్ను క్రమ్మివైచునది లేనివాడని భావము. స్వయముగా ప్రకాశించువాడని తాత్పర్యము. ప్రస్తుతము గరుత్మంతు డట్లుండె నని భావము.

గగనచారీ! సముద్రములతో, తోటలతో, పర్వతములతో, అడవులతో కూడిన భూమి సంతతిని నీ రెక్కల గాలితో గుంజుకొని పోవుచున్నట్లు నాకు తోచుచున్నావు.

సమీననాగనక్రం చ ఖమివారోప్యతే జలమ్,
వాయునా చైవ మహతా పక్షవాతేన చానిశమ్. 8

చేపలు, నీటి యేనుగులు, మొసళ్ళు గల సముద్రజల మంతయు రెక్కల పెనుగాలికి రాత్రింబవళ్ళు నింగికి చిమ్మబడినట్లు కానవచ్చుచున్నది.

తుల్యరూపాననా న్మత్స్యాం స్తథా తిమితిమింగిలాన్,
నాగాశ్వనరవక్త్రాంశ్చ పశ్యామ్యున్మథితా నివ. 9

సమానమగు రూపము మొగములు గల పెనుచేపలు, తిములు, తిమింగిలములు, ఏనుగుల, గుఱ్ఱముల నరుల మొగములవంటి మొగములు గల జలజంతువులు నలిగిపోయినట్లు కానవచ్చుచున్నవి.

మహార్ణవస్య చ రవైః శ్రోత్రే చ బధిరే కృతే,
న శృణోమి న పశ్యామి నాత్మనో వేద్మి కారణమ్. 10

మహాసముద్రము రొదలతో నా చెవులు చెవుడుపడి నట్లయినవి. నా కేదియు వినవచ్చుట లేదు. ఏదియు కానవచ్చుట లేదు నా పని యేమో కూడ తోచుటలేదు.

శనైః స తు భవాన్ యాతు బ్రహ్మవధ్యా మనుస్మరన్,
న దృశ్యతే రవి స్తాత న దిశో న చ ఖం ఖగ. 11

మహానుభావా! కొంచెము మెల్లగా పొమ్ము. లేనిచో నీకు బ్రహ్మహత్యా పాతకము రావచ్చును. సూర్యుడు, దిక్కులు, ఆకసము నాకు కానరాకున్నవి.

---

8. ఖమ్, ఇవ, ఆరోప్యతే-ఆకాశమున నిలిపినట్లున్నది.
10. రవైః - శబ్దములతో; కారణమ్-నేను ఏ పనిమీద బయలుదేరితినో ఆ ప్రయోజనము కూడ, న వేద్మి-తెలియకున్నాను.
11. బ్రహ్మవధ్యామ్-బ్రాహ్మణహత్యను; అనుస్మరన్ - తలపోయుచు. నీవు వేగము తగ్గింపకున్నచో నేను చనిపోవుట నిశ్చయ మని భావము.

తమ ఏవ తు పశ్యామి శరీరం తే న లక్షయే,
మణీవ జాత్యౌ పశ్యామి చక్షుషీ తేఽహ మణ్డజ. 12

అంతయు చీకటి క్రమ్మినదైనది. నీ దేహము కూడ కానరాకున్నది. నీ కన్నులు మాత్రము మంచి జాతికి చెందిన రెండు మణులవలె కన్పట్టుచున్నవి.

శరీరం తు న పశ్యామి తవ చైవాత్మనశ్చ హ,
పదే పదే తు పశ్యామి శరీరా దగ్ని ముత్థితమ్. 13

నాకు నీ దేహమును, నా దేహమును కనబడుటలేదు. అడుగడుగున నీ దేహమునుండి లేచి పడుచున్న నిప్పురవ్వలు మాత్రము కానవచ్చుచున్నవి.

స మే నిర్వాప్య సహసా చక్షుషీ శామ్యతే పునః,
తన్నియచ్ఛ మహావేగం గమనే వినతాత్మజ. 14

ఆ అగ్ని నాకన్నుల నొక్కమారు మిరుమిట్లు గొలిపి ఆరిపోవుచున్నది. అయ్యో! వినతాకుమారా! నీ మహావేగమును కొంచెము తగ్గింపుము.

న మే ప్రయోజనం కిఞ్చి ద్గమనే పన్నగాశన,
సంనివర్త మహాభాగ న వేగం విషహామి తే. 15

గరుత్మంతా! ఇంత వేగముగా పోయి నేను సాధించున దేమియు లేదు, మహాభాగా! మరలుము. నీ వేగమును తాళజాలను.

గురవే సంశ్రుతా నీహ శతా న్యష్టౌ హి వాజినామ్,
ఏకతః శ్యామకర్ణానాం శుభ్రాణాం చన్ద్రవర్చసామ్. 16

చెవి కొకవైపు పచ్చనిరంగు చంద్రుని వన్నెయు గల తెల్లని గుఱ్ఱము లెనిమిదివందలను తెత్తునని గురువునకు మాట యిచ్చితిని.

తేషాం చైవాపవర్గాయ మార్గం పశ్యామి నాణ్డజ,
తతోఽయం జీవితత్యాగే దృష్టో మార్గో మయాఽఽత్మనః. 17

పక్షిరాజా! వాని నిచ్చు దారి కానరాకున్నది. అందువలన ఇదిగో నా బ్రదుకు ముగియుదారి మాత్రము కానవచ్చుచున్నది.

నైవ మేఽస్తి ధనం కిఞ్చి న్న ధనే నాన్వితః సుహృత్,
న చార్థేనాఽపి మహతా శక్య మేత ద్వ్యపోహితుమ్. 18

---

12. మణీ-రెండు మణులు, వ-వలె. ఇది 'ఇవ' అను నర్థము గల శబ్దము.

14. నిర్వాప్య - మూసివైచి - కానరాకుండ చేసి అని భావము.

15. సంనివర్త - మరలుము.

నాకు ధనము లేదు. ధనమున్న చెలికాడు లేడు. పెద్దఎత్తున ధనమున్నను ఇది తీర్చుట సాధ్యము కాదు.

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

ఏవం బహు చ దీనం చ బ్రువాణం గాలవం తదా,
ప్రత్యువాచ వ్రజన్నేవ ప్రహస న్వినతాత్మజః. 19

ఇట్లు దీనముగా పలుమాట లాడుచున్న గాలవుని చూచి వినతకొడుకు పోవుచునే నవ్వుచు నిట్లు పలికెను.

నాతిప్రజ్ఞోఽసి విప్రర్షే యోఽఽత్మానం త్యక్తు మిచ్ఛసి,
న చాపి కృత్రిమః కాలః కాలో హి పరమేశ్వరః. 20

విప్రఋషీ! నీవు చావగోరుచున్నావు. తెలివితక్కువవాడవువలె నున్నావు. యముడు నీ యిష్టమును బట్టి రాడు. కాలు డనగా పరమేశ్వరుడే కదా!

కిమహం పూర్వమేవేహ భవతా నాభిచోదితః,
ఉపాయోఽత్ర మహానస్తి యేనైత దుపపద్యతే. 21

నన్ను మున్నే ప్రేరణచేసి యుండవలసినది. ఒక గొప్ప ఉపాయము కలదు. దానితో నీ కార్యము నెరవేరును.

తదేష ఋషభో నామ పర్వతః సాగరాన్తికే,
అత్ర విశ్రమ్య భుక్త్వా చ నివర్తిష్యావ గాలవ. 22

ఇదిగో ఋషభ మను పర్వతము సముద్రము నొడ్డున గలదు. ఇందు విశ్రమించి భుజించి మరలుదము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే ద్వాదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపన్నెండవ అధ్యాయము.

—:o:—

20. యః ఆత్మానమ్ - య ఆత్మానమ్ అని కావలయును యోఽఽత్మానమ్. అను సంధి ఆర్షము; కృత్రిమః - తన యిచ్ఛవచ్చినట్లు సాధింపదగినది; కాలః - మృత్యువు.

22. నివర్తిష్యావ - ఇది ఆర్షప్రయోగము - నివర్తిష్యావహే - అనునది సరియగు రూపము

# త్రయోదశాధికశతతమోఽధ్యాయః
# నూటపదుమూడవ అధ్యాయము

**ఋషభశిఖరే స్థితయోర్గరుడగాలవయోస్తపస్విన్యా శాణ్డిల్యా సహ సాక్షాత్కారః. గురుదక్షిణావిషయే విచారశ్చ.**

**ఋషభపర్వతము కొమ్మున నున్న గరుడగాలవులు శాండిలి యను తపస్వినిని గాంచుట. గురుదక్షిణకై విచారించుట.**

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

ఋషభస్య తతః శృఙ్గం నిపత్య ద్విజపక్షిణౌ,
శాణ్డిలీం బ్రాహ్మణీం తత్ర దదృశాతే తపోఽన్వితామ్. 1

అంత నా పక్షిరాజును బ్రాహ్మణుడును ఋషభ మను కొండకొమ్ముపై దిగి అందు శాండిలి యను నొక బ్రహ్మజ్ఞానసంపన్నురాలు తపస్సు చేసికొను చుండగా గాంచిరి.

అభివాద్య సుపర్ణస్తు గాలవశ్చాభిపూజ్య తామ్,
తయా చ స్వాగతే నోక్తౌ విష్టరే సన్నిషీదతుః. 2

సుపర్ణుడును గాలవుడును ఆమెకు నమస్కరించి, గౌరవించి ఆమె స్వాగత మని పలుకగా ఆసనమునందు కూర్చుండిరి.

సిద్ధ మన్నం తయా దత్తం బలిమన్త్రోపబృంహితమ్,
భుక్త్వా తృప్తౌ పుభౌ భూమౌ సుప్తౌ తా వనుమోహితౌ. 3

బలిమంత్రములతో శక్తిపొందిన సిద్ధమగు అన్నమును వారి కామె పెట్టెను. అది భుజించి వారిరువురు తృప్తిపడి ఒడలెరుగనివారై నేలపై నిద్రించిరి.

ముహూర్తాత్ ప్రతిబుద్ధస్తు సువర్ణో గమనేప్సయా,
అథ భ్రష్టతనూజాఙ్గ మాత్మానం దదృశే ఖగః. 4

4. భ్రష్టతనూజ + అఙ్గమ్ - రాలిపోయిన ఈకలుగల దేహముగలవానిని.

ఒక్క ముహూర్తమునకు మేల్కానిన సుపర్ణుడు పోవుద మనుకొనుచు తన దేహమునుండి రాలిన రెక్కలను చూచుకొనెను.

మాంసపిణ్డోపమో౽భూత్స ముఖపాదాన్వితో ఖగః,
గాలవస్తం తథా దృష్ట్వా విమనాః పర్యపృచ్ఛత. 5

మొగము, కాళ్ళు గల మాంసపు ముద్దయో యన్నట్లున్న ఆ గరుడుని గాంచి గాలవుడు మనసు చెదరి యిట్లడిగెను.

కిమిదం భవతా ప్రాప్త మిహాగమనజం ఫలమ్,
వాసో౽య మిహ కాలం తు కియన్తం నౌ భవిష్యతి. 6

ఇక్కడకు వచ్చి నీవు పొందిన ఫల మేమి? మన మిక్కడ ఎంత కాల ముండవలయునో? యేమో?

కిం ను తే మనసా ధ్యాత మశుభం ధర్మదూషణమ్,
న హ్యయం భవతః స్వల్పో వ్యభిచారో భవిష్యతి. 7

నీ వేదైన ధర్మమును చెరచు పాడుతలపు పెట్టుకొంటివా యేమి? ధర్మము తప్పిన నీ యీ దోషము చిన్నదై యుండదు.

సుపర్ణో౽థాబ్రవీ ద్విప్రం ప్రధ్యాతం వై మయా ద్విజ,
ఇమాం సిద్ధా మితో నేతుం తత్ర యత్ర ప్రజాపతిః. 8

అంత సుపర్ణు డిట్లు చెప్పెను. 'అయ్యా! బ్రాహ్మణా! ఈ సిద్ధురాలిని ప్రజాపతికడకు కొనిపోవలయునని గట్టిగా భావించితిని'.

యత్ర దేవో మహాదేవో యత్ర విష్ణుః సనాతనః,
యత్ర ధర్మశ్చ యజ్ఞశ్చ తత్రేయం నివసేదితి. 9

'మహాదేవుడగు పరమేశ్వరుడు, సనాతనుడగు విష్ణువు, ధర్మము, యజ్ఞము ఉండుచోట నీమె నివసింపవలయునని నేను భావించితిని'.

---

7. ధర్మదూషణమ్ - ధర్మమును చెరచునట్టి; అశుభమ్ - పాడుతలపు; ధ్యాతం కిమ్ - ధ్యానము చేయబడినదా యేమి? వ్యభిచారః - ధర్మము తప్పుట.

సోఽహం భగవతీం యాచే ప్రణతః ప్రియకామ్యయా,
మయైత న్నామ ప్రధ్యాతం మనసా శోచతా కిల. 10

ఈ పూజ్యురాలికి ప్రియము చేయగోరి మ్రొక్కుచు ప్రార్థింతును. ఈమె పాప మిచట ఎట్లుండునా? అన్న భావనతో అట్లు తలపోసితిని.

తదేవం బహుమానా త్తే మయేహానీప్సితం కృతమ్,
సుకృతం దుష్కృతం వా త్వం మాహాత్మ్యాత్ క్షన్తు మర్హసి. 11

'అమ్మా! నీమీది గౌరవముతో నీ కిష్టముకాని పని చేసితిని. పుణ్యమో పాపమో నీవు నీ మహిమతో నన్ను మన్నింపవలయును'.

సా తౌ తదాబ్రవీత్తుష్టా పతగేన్ద్రద్విజర్షభౌ,
న భేతవ్యం సువర్ణోఽసి సుపర్ణ త్యజ సంభ్రమమ్. 12

అంత నామె సంతోషపడి, ఆ గరుడగాలవులతో నిట్లు పలికెను. 'సుపర్ణా! భయపడకుము. దిగులు విడనాడుము. నీవు సువర్ణుడవు గదా!'

నిన్దితాఽస్మి త్వయా వత్స న చ నిన్దాం క్షమా మ్యహమ్,
లోకేభ్యః సపది భ్రశ్యే ద్యో మాం నిన్దేత పాపకృత్. 13

నాయనా! నీవు నన్ను నిందించితివి. నేను నిందను తాళజాలను. నన్ను నిందించు పాపకర్ముడు అక్కడి కక్కడ లోకములనుండి భ్రష్టుడగును.

హీనయాఽలక్షణైః సర్వై స్తథాఽనిన్దితయా మయా,
ఆచారం ప్రతిగృహ్ణన్త్యా సిద్ధిః ప్రాప్తేయ ముత్తమా. 14

'ఏ పాడులక్షణములు లేని, దోషమెరుగని నేను ఆచారమును పట్టుకొని ఈ ఉత్తమసిద్ధిని పొందితిని.'

---

10. శోచతా - ఈమె ఒంటరిగా నిచట ఎట్లు నివసించునా? అని విచారించుచున్న.
11. మయా + ఇహ + అనీప్సితమ్ - అని పదవిభాగము;
12. సువర్ణోఽసి-చాల గట్టి రెక్కలుగలవాడు. ఇంద్రుని వజ్రమునకు కూడ చెదరని రెక్కలుగలవాడు-గరుత్మంతుడు.
14. అలక్షణైః - పాపములచేత.

ఆచారః ఫలతే ధర్మ మాచారః ఫలతే ధనమ్,
ఆచారా చ్ఛ్రియ మాప్నోతి ఆచారో హ న్త్యలక్షణమ్. 15

'ఆచారము ధర్మమును పండించును. ఆచారము ధనమును పండించును. నరుడు ఆచారమువలన సంపదలు పొందును.ఆచారము పాపమును పరిమార్చును.'

తదాయుష్మన్ ఖగపతే యథేష్టం గమ్యతా మితః,
న చ తే గర్హణీయాఽహం గర్హితవ్యాః స్త్రియః క్వచిత్. 16

'చిరంజీవీ! పక్షిరాజా! ఇటనుండి నీ యిచ్చవచ్చినచోటికి పొమ్ము. నన్ను నీవు నిందింపరాదు. స్త్రీల నెందైన నిందింపవచ్చునా?'

భవితాఽసి యథాపూర్వం బలవీర్యసమన్వితః,
బభూవతు స్తత స్తస్య పక్షౌ ద్రవిణవ త్తరౌ. 17

'నీవు మునుపటివలె బలము, వీర్యము గలవాడ వగుదువు' అని పలుకగా అంత అతనిరెక్కలు మునుపటికంటె మిక్కిలి బలము గల వాయెను.

అనుజ్ఞాతస్తు శాణ్డిల్యా యథాగత ముపాగమత్,
నైవ చాసాదయామాస తథారూపాం స్తురఙ్గమాన్. 18

శాండిలి అనుమతింపగా, గరుత్మంతుడు తన మునుపటి రూపమును పొందెను. కాని తనకు కావలసిన ఆ వన్నెగల గుఱ్ఱములను మాత్రము పొంద లేదు.

విశ్వామిత్రోఽథ తం దృష్ట్వా గాలవం చాధ్వని స్థితః,
ఉవాచ వదతాం శ్రేష్ఠో వైనతేయస్య సన్నిధౌ. 19

అంత మంచిమాట నేర్పుగల విశ్వామిత్రుడు దారిలోనున్న గాలవుని గాంచి గరుడునికడ ఇట్లు పలికెను.

---

16. గర్హితవ్యాః స్త్రియః క్వచిత్-కాకువుచేత-స్త్రీలు నిందింపరాని వా రను నర్థము గ్రహింపవలయును.

17. బలవీర్యసమన్వితః - బల మనగా దేహశక్తి, వీర్యమనగా ఉత్సాహము-వానితోకూడినవాడు; ద్రవిణవ త్తరౌ-మిక్కిలి బలము గలవి;

యస్త్వయా స్వయ మేవార్థః ప్రతిజ్ఞాతో మమ ద్విజ,
తస్య కాలోఽపవర్గస్య యథా వా మన్యతే భవాన్. 20

'బాపడా! నీ అంత నీవు ఆ కోరిన సొమ్మిత్తునని మాట యిచ్చితివి. ఆ ఫల మందుటకు ఇది తగిన కాలము. నీ వేమనుకొనుచున్నావు?'

ప్రతీక్షిష్యా మ్యహం కాల మేతావన్తం తథా పరమ్,
యథా సంసిధ్యతే విప్ర సమార్గ స్తు నిశమ్యతామ్. 21

'ఇంతకాలము వేచియుంటిని. ఇంకను వేచియుందును. విప్రుడా! నీ ప్రయత్నము సిద్ధి పొందు మార్గ మేదో విచారింపుము

సువర్ణోఽథాబ్రవీ ద్దీనం గాలవం భృశదుఃఖితమ్,
ప్రత్యక్షం ఖల్విదానీం మే విశ్వామిత్రో యదుక్తవాన్. 22

అంత పెద్దగా దుఃఖించుచున్న గాలవునితో గరుడు డిట్లు పలికెను. 'నా యెదుట విశ్వామిత్రుడు ఇప్పు డిట్లు పలికెను.'

తదాగచ్ఛ ద్విజశ్రేష్ఠ మన్త్రయిష్యావ గాలవ,
నాదత్త్వా గురవే శక్యం కృత్స్న మర్థం త్వయాఽఽసితుమ్. 23

ఓయి బ్రాహ్మణశ్రేష్ఠా! కావున రమ్ము. ఆలోచింతము. గురువునకు మొత్తము సొమ్మొసగక నీవు నిలువజాలవు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే త్రయోదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదుమూడవ అధ్యాయము.

—: o :—

---

20. అపవర్గస్య - ఫలము పొందుటకు.
21. నిశమ్యతామ్ - విచారింపబడుగాక
23. ఆసితుమ్ - నిలుచుటకు

# చతుర్దశాధికశతతమోఽధ్యాయః
# నూటపదునాలుగవ అధ్యాయము

గరుడగాలవాభ్యాం యయాతేర్గృహం గత్వా
గురుదక్షిణార్థం తతః శ్యామకర్ణాశ్వానాం యాచనమ్.
గరుడగాలవులు యయాతిభవనమున కరిగి గురుదక్షిణకై
ఆతనిని శ్యామకర్ణములగు గుఱ్ఱము లిమ్మని వేడుట.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

అథాహ గాలవం దీనం సుపర్ణః పతతాం వరః,
నిర్మితం వహ్నినా భూమౌ వాయునా శోధితం తథా,
యస్మా ద్ధిరణ్మయం సర్వం హిరణ్యం తేన చోచ్యతే. 1

బెంబేలుపడిన గాలవునితో పక్షిరాజగు గరుడు డిట్లు పలికెను. 'ఇదిగో! దీనిని భూమిలోపల అగ్నిదేవుడు నిర్మించెను. వాయుదేవుడు శుద్ధిచేసెను. నిలువెల్ల బంగారమే యగుటచే దీనిని హిరణ్యమందురు.

ధత్తే ధారయతే చేద మేతస్మాత్ కారణా ద్ధనమ్,
తదేత త్త్రిషు లోకేషు ధనం తిష్ఠతి శాశ్వతమ్. 2

---

1. వహ్నినా నిర్మితం భూమౌ - భూగర్భమునందలి మట్టిరేణువులను అగ్ని గట్టిగా చెదరగొట్టగా ఇది వెలుపలికి తోచెనని భావము. వాయునా శోధితమ్ - అగ్నిని ప్రజ్వలింపజేయుచున్న వాయుదేవునితో ఇది శుద్ధి పొందెనని భావము; 'వాయునా వర్ధిత' మ్మనియు పాఠము - వాయువు దీనిని పెంపొందించెనని అర్థము; సర్వమ్ - సర్వమైన జగత్తు; హిరణ్మయమ్ - బంగారముతో నిండినది. ఆవిధముగా భూమియొక్క సారమగుటవలనను, శుద్ధమైనదగుట వలనను లోకము నంతటిని మోహపెట్టునదగుట వలనను 'హిరణ్య'మని దీని నందురని తాత్పర్యము.
2. ధత్తే - పోషించును. ధారయతే - బ్రదుకునట్లు చేయును.

ఈ బంగారము అన్నింటిని పట్టియుంచును అందరు దీనితో బ్రదుకుదురు. ఆ కారణమున దీనిని 'ధనము' అందురు. మూడు లోకములయందును ఇది చెరుగని ధనమై నిలిచియున్నది.

నిత్యం ప్రోష్ఠపదాభ్యాం చ శుక్రే ధనపతౌ తథా,
మనుష్యేభ్యః సమాదత్తే శుక్రశ్చిత్తార్జితం ధనమ్. 3

పూర్వాభాద్రా, ఉత్తరాభాద్రా నక్షత్రములు కలిగిన శుక్రవారమున కుబేరుని వృద్ధి కొరకు మనస్సుతో సాధించిన ధనమును అగ్నిదేవుడు మానవులకు అనుగ్రహించును.

అజైకపా దహిర్బుధ్న్యై రక్ష్యతే ధనదేన చ,
ఏవం న శక్యతే లబ్ధు మలబ్ధవ్యం ద్విజర్షభ,
ఋతే చ ధన మశ్వానాం నావాప్తి ర్విద్యతే తవ. 4

---

3. ప్రోష్ఠపదాభ్యామ్ - పూర్వాభాద్రా ఉత్తరాభాద్రా నక్షత్రముల చేత - ఇచట తృతీయకు సప్తమి అర్థము. కావున ఆ నక్షత్రములయందు అని యర్థము; శుక్రే - శుక్రవారమున - 'ఆ నక్షత్రములు కలిసిన శుక్రవారమున' అని తాత్పర్యము. శుక్రః - అగ్నిదేవుడు; ధనపతౌ - కుబేరుని వృద్ధికొరకు - మనుష్యేభ్యః - మనుష్యులకొరకు; ధనమ్ - ధనమును; సమాదత్తే - ఇచ్చును; చిత్తార్జితమ్ - చిత్తమున సాధించిన దానిని - ఈ మాటనుబట్టి ధనము అగ్నికి రేతస్సువంటి దని తెలియవచ్చును. 'శుక్రః కావ్యేఽనలే జ్యేష్ఠే' అని విశ్వకోశము. శుక్రశబ్దమునకు శుక్రాచార్యుడు, అగ్ని, జ్యేష్ఠుడు అను నర్థములందు వ్యవహారము. ధనము కోరువాడు పూర్వోత్తరాభాద్రానక్షత్రములున్న శుక్రవారమున అగ్నిదేవుని ప్రార్థింపవలయును. ధనపతౌ - అనుటవలన అట్లు మానవుడు సాధించిన ధనము యజ్ఞములు చేయుటవలననో, భూమిలో పాతిపెట్టుటవలననో మరల కుబేరునియొద్దకే చేరునని తాత్పర్యము.

4. అజ ఏకపాత్ - పూర్వాభాద్రానక్షత్ర అధిదేవత; అహిర్బుధ్న్యః - ఉత్తరాభాద్రానక్షత్ర దేవత; ధనదేన, చ-ఆపైని చెప్పిన దేవతలచేతను, కుబేరునిచేతను ; ధనము ; రక్ష్యతే - రక్షింపబడుచున్నది. కావున నరులు ధనమును పొందజాలరని భావము. వారిని కొలుచువారి కీ ధనము లభించును గాని యితరులకు కాదని తాత్పర్యము.

పూర్వాభాద్రానక్షత్రదేవత అజైకపాత్తు, ఉత్తరాభాద్రానక్షత్రదేవత అహిర్బుధ్న్యుడు, కుబేరుడును ధనమును రక్షింపుచుందురు. కావున ధనము అందరకు పొందరానిది. వారిని ప్రార్థింపక నీవు గుర్వర్థముల ధనము పొందజాలవు.

స త్వం యాచాత్ర రాజానం కఞ్చి ద్రాజర్షివంశజమ్,
అపీడ్య రాజా పౌరాన్ హి యో నౌ కుర్యాత్ కృతార్థినౌ. 5

కావున నీవు జనులను పీడింపక మన కోరిక తీర్చువాడును, గొప్ప రాజర్షి వంశమున పుట్టినవాడును అగు రాజు నొకనిని యాచింపుము.

అస్తి సోమాన్వవాయో మే జాతః కశ్చి న్నృపః సఖా,
అభిగచ్ఛావహే తం వై తస్యాస్తి విభవో భువి. 6

చంద్రవంశమున పుట్టిన రాజొకడు నాకు మిత్రమయ్యెను. ఆతనికడ కరుగుదము. ఆతనికి భూమిపై గొప్ప సంపద గలదు.

యయాతి ర్నామ రాజర్షి ర్నాహుషః సత్యవిక్రమః,
స దాస్యతి మయా చోక్తో భవతా చార్థితః స్వయమ్. 7

ఆ రాజర్షి పేరు యయాతి. నహుషుని కుమారుడు. సత్యమగు పరాక్రమము గలవాడు. నేను చెప్పగా, నీవె ప్రార్థింపగా నాతడు మనకు సొమ్మిచ్చును.

విభవ శ్చాస్య సుమహా నాసీ ద్ధనపతే రివ,
ఏవం గురుధనం విద్వన్ దానేనైవ విశోధయ. 8

ఆ రాజునకు కుబేరునకు వలె దొడ్డసంపద గలదు. విద్వాంసుడా! నీ గురువు సొమ్మును దానముతోడనే సాధింపుము.

తథా తౌ కథయన్తౌ చ చిన్తయన్తౌ చ యత్ క్షమమ్,
ప్రతిష్ఠానే నరపతిం యయాతిం ప్రత్యుపస్థితౌ. 9

---

5. యః - ఏ రాజు, పౌరాన్ - పురజనులను : అపీడ్య - పీడింపక ; నౌ - మనలను ; కృతార్థినౌ - నెరవేరిన ప్రయోజనము గలవారినిగా, కుర్యాత్ - చేయునో, తం - అట్టి ; రాజానం - రాజును, యాచ - యాచింపుము. ప్రజలను పీడించి తెచ్చిన ధనము మనకు పనికిరాదని భావము.

8. గురుధనమ్ - గురువు సొమ్మును, దానేనైవ - దానము పుచ్చుకొనియే, విశోధయ - తీర్చుకొనుము.

వారట్లు మాటాడుకొనుచు, చేయవలసిన దానినిగూర్చి ఆలోచించుచు ప్రతిష్ఠానపురమున యయాతిమహారాజును చేరుకొనిరి.

ప్రతిగృహ్య చ సత్కారై రర్ఘ్యపాద్యాదికం వరమ్,
పృష్ట శ్చాగమనే హేతు మువాచ వినతాసుతః. 10

సత్కారముతో కూడిన అర్ఘ్యమును, పాద్యమును గ్రహించిన వినత కొడుకు గరుడుడు, రాజడుగగా వచ్చిన కారణమును గూర్చి యిట్లు చెప్పెను.

అయం మే నాహుష సఖా గాలవ స్తపసో నిధిః,
విశ్వామిత్రస్య శిష్యోఽభూ ద్వర్షా ణ్యయుతశో ద్విజః. 11

'నహుషపుత్రా! యయాతీ! ఈతడు నాకు సఖుడు, గాలవుడను పేరివాడు. తపస్సునకు నిధి. వేలకొలది యేండ్లు విశ్వామిత్రునకు శిష్యుడైన బ్రాహ్మణుడు.

సోఽయం తేనాభ్యనుజ్ఞాత ఉపకారేప్సయా ద్విజః,
తమాహ భగవన్ కాలే దదాని గురుదక్షిణామ్. 12

ఆ మహర్షి యింటి కరుగుటకు అనుమతింపగా ఈ బాపడు ఆతని కుపకారము చేయగోరి 'మహానుభావా! ఈ సమయమున తమకు నేను గురుదక్షిణ నొసగవలయు' నని పలికెను.

అసకృత్తేన చోక్తేన కిఞ్చిదాగతమన్యునా,
అయముక్తః ప్రయచ్ఛేతి జానతా విభవం లఘు. 13

ఈతడు పలుమారు లట్లు పలుకగా నాతనికి కొంచెము కోపము వచ్చెను. ఈతనికి ఉన్న సంపద స్వల్పమని యెఱిగియు నాతడు 'ఇమ్ము' అని పలికెను.

ఏకతః శ్యామకర్ణానాం శుభ్రాణాం శుద్ధజన్మనామ్,
అష్టౌ శతాని మే దేహి హయానాం చన్ద్రవర్చసామ్. 14

'ఒకవైపు నీలవర్ణముగల చెవులు, చంద్రునివంటి వన్నెయు శుద్ధమగు జన్మముగల తెల్లని గుఱ్ఱములు ఎనిమిదివందలు నాకిమ్ము'.

గుర్వర్థో దీయతా మేష యది గాలవ మన్యసే,
ఇత్యేవమాహ సక్రోధో విశ్వామిత్ర స్తపోధనః. 15

'గాలవా! ఈయదలచినచో ఈ గురుదక్షిణ నొసగుము' - అని క్రోధముగల తపోధనుడు విశ్వామిత్రుడు పలికెను.

---

10. అర్ఘ్యమ్ - పూజాద్రవ్యము; పాద్యమ్ - కాళ్ళు కడుగుకొను నీరు.

సోఽయం శోకేన మహతా తప్యమానో ద్విజర్షభః,
అశక్తః ప్రతికర్తుం తద్భవన్తం శరణం గతః. 16

అట్టి యీ బ్రాహ్మణశ్రేష్ఠుడు పెనుదుఃఖమున కాలిపోవుచు ఏమియు చేయజాలక నిన్ను శరణు పొందెను.

ప్రతిగృహ్య నరవ్యాఘ్ర త్వత్తో భిక్షాం గతవ్యథః,
కృత్వాఽపవర్గం గురవే చరిష్యతి మహత్తపః. 17

'రాజవరేణ్యా! నీవలన భిక్షను స్వీకరించి మనసున దుఃఖము పోగొట్టుకొని గురువు ఋణము తీర్చుకొని గొప్పతప మాచరించును.'

తపసః సంవిభాగేన భవన్తమపి యోక్ష్యతే,
స్వేన రాజర్షితపసా పూర్ణం త్వాం పూరయిష్యతి. 18

తపస్సు ఫలములో నిన్నుకూడ భాగస్వామిని గావించును. నీదైన రాజర్షి తపస్సుతో నిండిన నిన్నింకను నిండుదనము గలవానిని గావించును.

యావన్తి రోమాణి హయే భవన్తీహ నరేశ్వర,
తావన్తో వాజినో లోకాన్ ప్రాప్నువన్తి మహీపతే. 19

మహారాజా! గుఱ్ఱమున కెన్ని రోమము లుండునో అన్ని పుణ్యలోకములు నిన్ను పొందును.

పాత్రం ప్రతిగ్రహస్యాయం దాతుం పాత్రం తథా భవాన్,
శఙ్ఖే క్షీర మివాసిక్తం భవత్వేత త్తథోపమమ్. 20

ఇతడు పుచ్చుకొనుటకు తగినవాడు. నీవు ఇచ్చుటకు తగినవాడవు. శంఖములో నింపిన పాలవలె ఇది యిట్లు చక్కగా అమరును గాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే చతుర్దశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునాలుగవ అధ్యాయము.

—: ౦ :—

20. ఆసిక్తమ్ - నింపబడిన;

## పఞ్చదశాధికశతతమోఽధ్యాయః

## నూటపదునైదవ అధ్యాయము.

**యయాతినా గాలవాయ స్వకన్యాయాః సమర్పణమ్,**
**తమాదాయ గాలవస్యాయోధ్యాపతేః సమీపే గమనమ్.**

**యయాతి గాలవునకు తన కన్య నొసగుట, ఆమెను గ్రహించి**
**గాలవుడు అయోధ్యాపతి కడ కరుగుట.**

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తః సుపర్ణేన తథ్యం వచన ముత్తమమ్,
విమృశ్యావహితో రాజా నిశ్చిత్య చ పునః పునః. 1

సుపర్ణు డిట్లు సత్యము తప్పని మంచిమాట పలుకగా, రాజు శ్రద్ధతో దానిని మరల మరల విచారించి యొక నిశ్చయమునకు వచ్చెను.

యష్టా క్రతుసహస్రాణాం దాతా దానపతిః ప్రభుః,
యయాతిః సర్వకాశీశ ఇదం వచన మబ్రవీత్. 2

వేలకొలది యజ్ఞములు చేసినవాడు, దాత, దానముల కెల్ల పాలకుడు, సమర్థుడు, అన్నింట వెలుగొందు ప్రభువు అగు యయాతి యిట్లు పలికెను.

దృష్ట్వా ప్రియసఖం తార్క్ష్యం గాలవం చ ద్విజర్షభమ్,
నిదర్శనం చ తపసో భిక్షాం శ్లాఘ్యాం చ కీర్తితామ్. 3

అతీత్య చ నృపానన్యా నాదిత్యకులసంభవాన్,
మత్సకాశ మనుప్రాప్తా వేతాం బుద్ధి మవేక్ష్య చ. 4

తన ప్రియసఖుడగు తార్క్ష్యుని, విప్రశ్రేష్ఠుడగు గాలవుని, ఆతని తపస్సునకు నిదర్శనముగ ప్రశంసకు యోగ్యము, కీర్తి నొసగునది యగు భిక్షను పరికించి, ఈ మహానుభావులు సూర్యవంశమున పుట్టిన గొప్పరాజు లందరను కాదని నాదగ్గరకు వచ్చిరి' అను మన్ననను గుర్తించి - యిట్లు పలికెను.

అద్య మే సఫలం జన్మ తారితం చాద్య మే కులమ్,
అద్యాయం తారితో దేశో మమ తార్క్ష్య త్వయాఽనఘ. 5

'పుణ్యాత్మా ! తార్క్ష్యా! ఈనాడు నాజన్మము సఫలమైనది. నీవలన నాకులమును, నా యీ దేశమును తరించినవి.'

వక్తు మిచ్ఛామి తు సఖే యథా జానాసి మాం పురా,
న తథా విత్తవానస్మి క్షీణం విత్తం చ మే సఖే. 6

సఖుడా! ఒక్కమాట చెప్పగోరుచున్నాను. నే నెట్టివాడనో నీ వెరుగుదువు. కాని నాకు మునుపటి వలె ధనము లేదు. నా ధనము తరిగిపోయినది.'

న చ శక్తోఽస్మి తే కర్తుం మోఘ మాగమనం ఖగ,
న చాశా మస్య విప్రర్షే ర్వితథీకర్తు ముత్సహే. 7

'నీ పని చేయజాలకున్నాను. నీ రాక వ్యర్థమైనది. అయినను విప్రర్షి ఆశను భంగము చేయజాలను.'

తత్తు దాస్యామి యత్ కార్య మిదం సంపాదయిష్యతి,
అభిగమ్య హతాశో హి నివృత్తో దహతే కులమ్. 8

'ఈ పని సాధించు దాన మొకటి చేయుదును. చేర వచ్చి, ఆశ చచ్చిన అతిథికులము నంతటిని కాల్చివేయును'.

నాతః పరం వైనతేయ కిఞ్చిత్ పాపిష్ఠ ముచ్యతే,
యథాఽఽశానాశనా ల్లోకే దేహి నాస్తీతి వా వచః. 9

దాన మిమ్మని వచ్చినవానికి లేదని పలికి ఆతని ఆశను వమ్ముచేయుట కంటె మించిన ఘోరపాతకము లోకమున మరియొకటి లేదు.

హతాశో హ్యకృతార్థః సన్ హతః సంభావితో నరః,
హినస్తి తస్య పుత్త్రాంశ్చ పౌత్త్రాం శ్చాకుర్వతో హితమ్. 10

కోరిక నెరవేరక చచ్చిన ఆశగల నరుడు చంపబడినవాడే యని లోకము భావించును అట్టివాడు హితము చేకూర్చనివాని కొడుకులను, మనుమలను కూడ నాశనము చేయును.

---

8. హతాశః - అతిథి అను పదము కలుపుకొనవలయును. ఆశ నెరవేరని అతిథి అని భావము.

తస్మా చ్చతుర్ణాం వంశానాం స్థాపయిత్రీ సుతా మమ,
ఇయం సురసుతప్రఖ్యా సర్వధర్మోపచాయినీ. 11

సదా దేవమనుష్యాణా మసురాణాం చ గాలవ,
కాఙ్క్షితా రూపతో బాలా సుతా మే ప్రతిగృహ్యతామ్. 12

'అందువలన, నాలుగు వంశములను నిలుపునట్టిది, దేవకన్యవంటిది, అన్ని ధర్మములను కూడబెట్టునదియు, రూపమువలన దేవతలు మనుష్యులు, రాక్షసులును కోరునట్టిదియు నగు నాకన్యను స్వీకరింపుము'

అస్యాః శుల్కం ప్రదాస్యన్తి నృపా రాజ్యమపి ధ్రువమ్,
కిం పునః శ్యామకర్ణానాం హయానాం ద్వే చతుఃశతే. 13

రాజు లీమెకు శుల్కముగా రాజ్యమునైన ఇత్తురు. ఇది నిక్కము. ఇంక చెవులయందు నీలిమగల గుఱ్ఱముల మాట చెప్పనేల?

స భవాన్ ప్రతిగృహ్ణాతు మమైతాం మాధవీం సుతామ్,
అహం దౌహిత్రవాన్ స్యాం వై వర ఏష మమ ప్రభో. 14

'స్వామీ! నాకూతురు మాధవిని కైకొనుము. నేను దౌహిత్రులు గలవాడ నగుదును. ఇదియే నాకు గొప్పవరము'.

ప్రతిగృహ్య చ తాం కన్యాం గాలవః సహ పక్షిణా,
పునర్ద్రక్ష్యావ ఇత్యుక్త్వా ప్రతస్థే సహ కన్యయా. 15

గాలవుడు గరుడునితోపాటు ఆ కన్యను గ్రహించి మరల చూతుమని పలికి కన్యతోపాటు బయలుదేరెను.

ఉపలబ్ధ మిదం ద్వార మశ్వానా మితి చాణ్డజః,
ఉక్త్వా గాలవ మాపృచ్ఛ్య జగామ భవనం స్వకమ్. 16

పక్షిరాజు గుఱ్ఱముల కొకదారి ఇదిగో దొరకెనని పలికి గాలవుని వీడ్కొని తన భవనమున కరిగెను.

---

11. చతుర్ణాం వంశానామ్ - తండ్రివంశము, తల్లివంశము, వరునివంశము, ప్రస్తుతము పుచ్చుకొని కన్యాదానము చేయు గాలవుని వంశము - అను నాలుగువంశములను (లేదా వరుని తల్లివంశమును, తండ్రివంశమును)
14. దౌహిత్రః - కూతురు కొడుకు;

గతే పతగరాజే తు గాలవః సహ కన్యయా,
చిన్తయానః క్షమం దానే రాజ్ఞాం వై శుల్కతోఽగమత్. 17

పక్షిరాజు జరుగగా గాలవుడు కన్యకు తగిన శుల్కము నొసగు సమర్థత గల రాజులనుగూర్చి తలపోయుచు కన్యతోపాటు బయలుదేరెను.

సోఽగచ్ఛ న్మనసేక్ష్వాకుం హర్యశ్వం రాజసత్తమమ్,
అయోధ్యాయాం మహావీర్యం చతురఙ్గబలాన్వితమ్. 18
కోశధాన్యబలోపేతం ప్రియపౌరం ద్విజప్రియమ్,
ప్రజాభికామం శామ్యన్తం కుర్వాణం తప ఉత్తమమ్. 19

అతని మనసునకు ఇక్ష్వాకురాజు తట్టెను. ఆతడు రాజులలో శ్రేష్ఠుడు. గొప్పవీర్యము గలవాడు. చతురంగబలములు గలవాడు. కోశము, ధాన్యము, బలము సమృద్ధిగా గలవాడు. పురజను లందరియెడ ప్రియము, బ్రాహ్మణుల యెడ ప్రీతి, ప్రజలయందు ప్రేమ గలవాడు. శాంతితో గొప్ప తపము చేయుచున్న వాడు. హర్యశ్వ డనువాడు.

తముపాగమ్య విప్రః స హర్యశ్వం గాలవోఽబ్రవీత్,
కన్యేయం మమ రాజేన్ద్ర ప్రసవైః కులవర్ధినీ. 20
ఇయం శుల్కేన భార్యార్థం హర్యశ్వ ప్రతిగృహ్యతామ్,
శుల్కం తే కీర్తయిష్యామి తచ్ఛ్రుత్వా సంప్రధార్యతామ్. 21

గాలవు డా హర్యశ్వమహారాజునొద్ద కరిగి యిట్లు పలికెను 'రాజేంద్రా! ఈమె నాబిడ్డ. సంతానంతో కులమును వృద్ధిపరచును. ఒక శుల్కముతో నీ భార్యగా స్వీకరింపుము. ఆ శుల్కమునుగూర్చి నీకు చెప్పెదను. అది విని నిశ్చయమునకు రమ్ము'.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే పఞ్చదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునైదవ అధ్యాయము.

—: o :—

# షోడశాధికశతతమోఽధ్యాయః

## నూటపదునారవ అధ్యాయము.

దత్తద్విశతశ్యామకర్ణాశ్వేన హర్యశ్వేన యయాతికన్యాయాం
వసుమనస ఉత్పాదనం, కన్యయా సహ గాలవస్యాన్యతః ప్రస్థానం చ.

పచ్చని వన్నెచెవిగల గుఱ్ఱములను రెండువందల నొసగి హర్యశ్వుడు
యయాతికన్యయందు వసుమనసు డను కుమారుని పొందుట.
గాలవు డా కన్యను గొని మరియొకచోటి కరుగుట.

నారద ఉవాచ - నారదు డిట్లు పలికెను.

హర్యశ్వ స్త్వబ్రవీ ద్రాజా విచిన్త్య బహుధా తతః,
దీర్ఘ ముష్ణం చ నిఃశ్వస్య ప్రజాహేతో ర్నృపోత్తమః. 1

అంత హర్యశ్వమహారాజు సంతానమునుగూర్చి పరిపరివిధముల తల పోసి దీర్ఘముగా వేడిగా నిట్టూర్చి యిట్లు పలికెను.

ఉన్నతే షున్నతా షట్సు సూక్ష్మా సూక్ష్మేషు సప్తసు,
గమ్భీరా త్రిషు గమ్భీరే ష్వియం రక్తా చ పఞ్చసు. 2

---

2. షట్సు - ఆరింటియందు - చేతుల వెనుక భాగములు రెండు, పాదముల పై భాగములు రెండు- స్తనములు రెండు ఈ ఆరింట ఎత్తైనది. స్తనములు, పిరుదులు, కన్నులు ఈ ఆరింటియందని ప్రాచీనులు చెప్పుదురు. 'వక్షః కుక్ష్యలకస్కన్ధ కరవక్త్రం షడున్నతమ్' - అని కాశీఖండమున గలదు. 'రొమ్ము,పొట్ట, ముంగురులు, మూపు, చేతులు, ముఖము-అనునవి ఎత్తుగా నుండవలయునని పై శ్లోకపాదమున కర్థము; సప్తసు - ఏడింటియందు, సూక్ష్మా - సన్ననైనది - చర్మము, కేశములు, పలువరుస, చేతివ్రేళ్లు, కాలివ్రేళ్లు, కాలివ్రేళ్ళ, చేతివ్రేళ్ళ కణుపులు - అను వానియందు; త్రిషు- మూడింటియందు, గంభీరా - లోతు లేక నిండుదనము గలది. కంఠస్వరము, దేహపుష్టి, లేదా స్వభావము, బొడ్డు అనువానియందు - పఞ్చసు- అయిదింటియందు - అరచేతులయందు, కంటి తుదలయందు, దౌడ యందు, నాలుకయందు, క్రింది పెదవియందు, రక్తా - అరుణిమ గలది.

ఈ కన్య ఎత్తుగా నుండవలసిన ఆరింట ఎత్తుగా నున్నది. సన్నగా నుండవలసిన ఏడింట సన్నగా నున్నది. గంభీరముగా నుండవలసిన మూడింట గంభీరత కలది. అయిదింట ఎఱ్ఱదనము కలిగియున్నది.

[*శ్రోణ్యౌ లలాట మూరూ చ ఘ్రాణం చేతి షడున్నతమ్,
సూక్ష్మాణ్యఙ్గుళిపర్వాణి కేశరోమనఖత్వచః,
స్వరః సత్త్వం చ నాభిశ్చ త్రిగమ్భీరం ప్రచక్షతే,
పాణిపాదతలే రక్తే నేత్రాన్తౌ చ నఖాని చ.

పిరుదులు, నుదురు, తొడలు, ముక్కు అను నారును ఎత్తుగా నుండవలయును. వ్రేళ్ళ కణుపులు, కేశములు, రోమములు, గోళ్ళు, చర్మము అనునవి సన్నగా నుండవలయును. కంఠస్వరము, దేహపుష్టి (మనోభావము), బొడ్డు అను మూడును గంభీరముగా నుండవలయును. అరచేతులు, అరకాళ్ళు. కంటితుదలు, గోళ్ళు ఎఱ్ఱగా నుండవలయును.]

బహుదేవాసురాలోకా బహుగన్ధర్వదర్శనా,
బహులక్షణసంపన్నా బహుప్రసవధారిణీ. 3

పెక్కండ్రు దేవతలు, రాక్షసులు ప్రీతితో చూడదగినది. పెక్కు గంధర్వ శాస్త్రములు అభ్యసించినది, పెక్కు మంచి లక్షణములు నిండుగా గలది. ఇట్టి యీ కన్య పెక్కు బిడ్డలకు తల్లి కాగలదు.

సమర్థేయం జనయితుం చక్రవర్తిన మాత్మజమ్,
బ్రూహి శుల్కం ద్విజశ్రేష్ఠ సమీక్ష్య విభవం మమ. 4

---

* పై కుండలమునందలి శ్లోకములకు అనుగుణముగా రెండవ శ్లోకమున, గీతా ప్రెస్‌వారి గ్రంథములో 'సూక్ష్మా సూక్ష్మేషు పఞ్చసు' అను పాఠము కానవచ్చుచున్నది. షడున్నతా - అనుచోట ఆరు ఏవి యను విషయమున పైని వివరించిన రీతిగా మూడు పద్ధతులు కానవచ్చుచున్నవి.

3. బహుదేవాసుర - ఆలోకా - పెక్కండ్రు దేవతలకు, రాక్షసులకు ప్రీతితో చూచుటకు యోగ్యమైనది; బహు, గన్ధర్వ, దర్శనా - అనేకములగు గంధర్వుల, దర్శనము లనగా శాస్త్రములు, సంగీతము, నాట్యము మొదలగునవి-వానిలో నైపుణ్యము కలది.

4. శుల్కము - కట్నము.

ఈమె చక్రవర్తి యగు కొడుకును కనజాలును. బ్రాహ్మణశ్రేష్ఠా! నా సంపదను పరికించి శుల్కమేమో చెప్పుము.

గాలవ ఉవాచ-గాలవు డిట్లు చెప్పెను.

ఏకతః శ్యామకర్ణానాం శతా న్యష్టౌ ప్రయచ్ఛ మే,
హయానాం చన్ద్రశుభ్రాణాం దేశజానాం వపుష్మతామ్. 5

రాజా! చెవికి ఒకవైపు పచ్చని వన్నె కలవియు, చంద్రునివలె తెల్లనివియు, మంచిదేశమున పుట్టినవియు, దేహపుష్టిగలవియు నగు ఎనిమిదివందల గుఱ్ఱములను నా కిమ్ము.

తత స్తవ భవిత్రీయం పుత్రాణాం జననీ శుభా,
అరణీవ హుతాశానాం యోని రాయతలోచనా. 6

అంత నీ వెడదకన్నులు గల శుభాంగి అగ్నులకు అరణివలె నీ కొడుకులకు తల్లి కాగలదు.

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

ఏతచ్ఛ్రుత్వా వచో రాజా హర్యశ్వః కామమోహితః,
ఉవాచ గాలవం దీనో రాజర్షి ర్ఋషిసత్తమమ్. 7

కోరికకు లోబడిన రాజర్షి హర్యశ్వు డా మాట విని దీనుడై ఋషిశ్రేష్ఠుడగు గాలవునితో నిట్లు పలికెను.

ద్వే మే శతే సంనిహితే హయానాం యద్విధా స్తవ,
ఏష్టవ్యాః శతశ స్త్వన్యే చరన్తి మమ వాజినః. 8

నీవు చెప్పిన లక్షణములుగల గుఱ్ఱములు నాకడ రెండువందలు మాత్రమే కలవు. తక్కినవి వందలకొలది కలవు. వానిని నీవు కోరదగును

---

5. దేశజానామ్ - గుఱ్ఱముల గొప్పతనమునకు ప్రసిద్ధికెక్కిన 'సింధుదేశము' మున్నగు వానియందు పుట్టిన, వపుష్మతామ్ - నిగనిగలాడు పుష్టిగల దేహముగల.

6. అరణి - నిప్పు పుట్టించుటకు ఉపయోగపడు కొయ్య.

సో౽హ మేక మపత్యం వై జనయిష్యామి గాలవ,
అస్యా మేతం భవాన్ కామం సంపాదయతు మే వరమ్. 9

గాలవా! అట్టి నేను ఈమెయందు ఒక్క పుత్రుని పొందుదును. ఈ నా కోర్కను నీవు తీర్పవలయును.

ఏతచ్ఛ్రుత్వా తు సా కన్యా గాలవం వాక్య మబ్రవీత్,
మమ దత్తో వరః కశ్చిత్ కేనచి ద్బ్రహ్మవాదినా, 10
ప్రసూత్యన్తే ప్రసూత్యన్తే కన్యైవ త్వం భవిష్యసి.

ఈ మాట విన్న ఆ కన్య గాలవునితో ఇట్లు పలికెను; నాకొక వేదవిద్యలో ఆరితేరిన ఋషి కానుపులైన పిదప నీవు కన్యవే యగుదువని యొక వర మొసగెను.

స త్వం దదస్వ మాం రాజ్ఞే ప్రతిగృహ్య హయోత్తమాన్. 11

కావున నీవు గుఱ్ఱములను గైకొని ఈ రాజునకు నన్నిమ్ము.

నృపేభ్యో హి చతుర్భ్యస్తే పూర్ణా న్యష్టౌ శతాని మే,
భవిష్యన్తి తథా పుత్రా మమ చత్వార ఏవ చ. 12

ఈ విధముగా నావలన నలుగురు రాజులనుండి నీవు ఎనిమిదివందల గుఱ్ఱములను సంపాదింపవచ్చును. నాకును నలుగురు కొడుకులు పుట్టుదురు.

క్రియతా ముపసంహారో గుర్వర్థం ద్విజసత్తమ,
ఏషా తావ న్మమ ప్రజ్ఞా యథా వా మన్యసే ద్విజ. 13

బ్రాహ్మణోత్తమా! ఈ విధముగా నీ గురుకార్యమును ముగింపుము. ఇది నాకు తోచిన పద్ధతి. నీ తల పెట్టినవో!

ఏవ ముక్తస్తు స మునిః కన్యయా గాలవ స్తదా,
హర్యశ్వం పృథివీపాల మిదం వచన మబ్రవీత్. 14

ఆ కన్య యట్లు పలుకగా గాలవముని హర్యశ్వనరపతితో నిట్లు పలికెను.

ఇయం కన్యా నరశ్రేష్ఠ హర్యశ్వ ప్రతిగృహ్యతామ్,
చతుర్భాగేన శుల్కస్య జనయ స్వ్యేక మాత్మజమ్. 15

రాజా ! హర్యశ్వా ! శుల్కము నాలుగవభాగ మిచ్చు నియమముతో ఈ కన్యను గ్రహింపుము. ఒక కొడుకును పొందుము.

ప్రతిగృహ్య స తాం కన్యాం గాలవం ప్రతినన్ద్య చ,
సమయే దేశకాలే చ లబ్ధవాన్ సుత మీప్సితమ్. 16

ఆ రాజా కన్యను గ్రహించి గాలవుని కొనియాడి కట్టుబాటునకు లోబడిన యోగ్యమగు సమయమున మంచి ప్రదేశమున కోరిన కొడుకును పొందెను.

తతో వసుమనా నామ వసుభ్యో వసుమత్తరః,
వసుప్రఖ్యో నరపతిః స బభూవ వసుప్రదః. 17

ఆ కుమారుడు వసుమనసు దను పేరుగలవా డయ్యెను. వసువులకంటె గొప్పధనము కలవా డయ్యెను. సూర్యునివంటి తేజముకలవాడై యజ్ఞయాగాదులలో గొప్ప దక్షిణ లిచ్చువాడని పేరొందెను.

అథ కాలే పునర్ధీమాన్ గాలవః ప్రత్యుపస్థితః,
ఉపసఙ్గమ్య చోవాచ హర్యశ్వం ప్రీతమానసమ్. 18

పిమ్మట కొంతకాలము గడచిన వెనుక బుద్ధిశాలియగు గాలవుడు రాజుకడకు వచ్చి ఉల్లాసముతో నున్న హర్యశ్వునితో నిట్లు పలికెను.

జాతో నృప సుత స్తేఽయం బాలో భాస్కరసంనిభః,
కాలో గన్తుం నరశ్రేష్ఠ భిక్షార్థ మపరం నృపమ్. 19

రాజా! ఇదిగో నీకు సూర్యునివలె వెలుగొందు పుత్రు డుదయించెను. నేను భిక్షకొరకు మరియొక రాజుకడ కరుగు కాల మాసన్నమైనది.

హర్యశ్వః సత్యవచనే స్థితః స్థిత్వా చ పౌరుషే,
దుర్లభత్వా ద్ధయానాం చ ప్రదదౌ మాధవీం పునః. 20

హర్యశ్వుడు ఆడినమాటపై నిలబడి, పౌరుషమును పాటించి, అట్టి గుఱ్ఱములు పొందజాలని కారణమున మాధవిని తిరిగి యిచ్చివేసెను.

మాధవీ చ పునర్దీప్తాం పరిత్యజ్య నృపశ్రియమ్,
కుమారీ కామతో భూత్వా గాలవం పృష్ఠతోఽన్వయాత్. 21

మాధవి కన్నులకు మిరుమిట్లు గొలుపు రాజసంపదను వదలివైచి తన యిష్టము ననుసరించి మరల కన్యయై గాలవుని వెనుక అరిగెను.

త్వయ్యేవ తావత్తిష్ఠన్తు హయా ఇత్యుక్తవాన్ ద్విజః,
ప్రయయౌ కన్యయా సార్ధం దివోదాసం ప్రజేశ్వరమ్. 22

'రాజా! గుఱ్ఱములు ప్రస్తుతమునకు నీకడనే యుండనిమ్ము' అని పలికి గాలవుడు కన్యతోపాటు దివోదాసుడను రాజుకడ కరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే షోడశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునారవ అధ్యాయము.

—: o :—

21. కామతః - ఇష్టానుసారము; యోగబలముచేత; కుమారీ భూత్వా-పుత్రుని గన్న వనిత యయ్యు కన్యాత్వమును పొంది.

# సప్తాధికశతతమోఽధ్యాయః
# నూటపదునేడవ అధ్యాయము

**దివోదాసేన యయాతికన్యాయాం ప్రతర్దన స్యోత్పాదనమ్.**

**దివోదాసుడు యయాతికన్యయందు ప్రతర్దనుడను కుమారుని పొందుట**

గాలవ ఉవాచ-గాలవు డిట్లు పలికెను.

మహావీర్యో మహీపాలః కాశీనా మీశ్వరః ప్రభుః,
దివోదాస ఇతి ఖ్యాతో భైమసేని ర్నరాధిపః. 1

గొప్పశక్తి గలవాడు, భీమసేనుడను వాని కుమారుడు, కాశిదేశములకు పాలకుడు, సమర్థుడు నగు దివోదాసను రాజు కలడు.

తత్ర గచ్ఛావహే భద్రే శనై రాగచ్ఛ మా శుచః,
ధార్మికః సంయమే యుక్తః సత్యే చైవ జనేశ్వరః. 2

అమ్మా! అందు పోదము. మెల్లగా రమ్ము. దుఃఖపడకు. ఆరాజు ధర్మమును పాటించువాడు. నిగ్రహమునందు, సత్యమునందు నిష్ఠ కలవాడు.

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

తముపాగమ్య స ముని ర్న్యాయత స్తేన సత్కృతః,
గాలవః ప్రసవ స్యార్థే తం నృపం ప్రత్యచోదయత్. 3

తన దరిచేరిన ఆ ముని నారాజు విధానము ననుసరించి సత్కరించెను. గాలవుడు సంతానమును గూర్చి ఆ రాజును ప్రేరణ చేసెను.

దివోదాస ఉవాచ-దివోదాసు డిట్లు పలికెను.

శ్రుత మేత న్మయా పూర్వం కిముక్త్వా విస్తరం ద్విజ,
కాఙ్క్షితో హి మయైషోఽర్థః శ్రుత్వైవ ద్విజసత్తమ. 4

బ్రాహ్మణా! నేనిది ముందే వినియుంటిని వివరించి చెప్పనేల? విన్నంతనే నాకీ విషయముపై కోరిక కలిగినది.

ఏతచ్చ మే బహుమతం యదుత్సృజ్య నరాధిపమ్,
మామేవ ముపయాతో౽సి భావి చైత దసంశయమ్. 5

ఆ రాజును వదలి నాకడకే వచ్చితివి. ఇది నాకు మిక్కిలి ప్రియము గూర్చినది. ఇది జరుగును. సందియము లేదు.

స ఏవ విభవో౽స్మాక మశ్వానా మపి గాలవ,
అహ మప్యేకమేవాస్యాం జనయిష్యామి పార్థివమ్. 6

మాకును గుఱ్ఱముల సంపద అదియే కలదు. నేనును ఈమెయం దొక కొడుకునే కందును.

తథేత్యుక్త్వా ద్విజశ్రేష్ఠః ప్రాదాత్ కన్యాం మహీపతేః,
విధిపూర్వాం చ తాం రాజా కన్యాం ప్రతిగృహీతవాన్. 7

బ్రాహ్మణప్రవరు డట్లే యని ఆ కన్య నా రాజున కొసగెను. రాజును శాస్త్రము ప్రకార మా కన్యను భార్యగా స్వీకరించెను.

రేమే స తస్యాం రాజర్షిః ప్రభావత్యాం యథా రవిః,
స్వాహాయాం చ యథా వహ్ని ర్యథా శచ్యాం చ వాసవః. 8

ఆ రాజర్షి సూర్యుడు సంజ్ఞాదేవియందును, అగ్ని స్వాహాదేవియందును, ఇంద్రుడు శచీదేవియందును వలె ఆమెయందు కామసుఖము పొందెను.

యథే చన్ద్రశ్చ రోహిణ్యాం యథా ధూమోర్ణయా యమః,
వరుణశ్చ యథా గౌర్యాం యథా చర్ధ్యాం ధనేశ్వరః. 9

చంద్రుడు రోహిణియందు, యముడు ధూమోర్ణయందును, వరుణుడు గౌరియందును, కుబేరుడు ఋద్ధియందునువలె నాత డామెయం దిష్టసుఖములు పొందెను.

యథా నారాయణో లక్ష్మ్యాం జాహ్నవ్యాం చ యథోదధిః,
యథా రుద్రశ్చ రుద్రాణ్యాం యథా వేద్యాం పితామహః. 10

నారాయణుడు లక్ష్మియందును, సముద్రుడు గంగయందును, రుద్రుడు పార్వతియందును, బ్రహ్మ వేదియందును వలె అత డామెయందు సుఖము పొందెను.

---

9. ఋద్ధిః - కుబేరుని భార్యగా ప్రసిద్ధి కెక్కినది. ఋద్ధి యనగా సంపద.
10. వేద్యామ్ - యజ్ఞవేదికయందు; బ్రహ్మకు యజ్ఞవేది మిక్కిలి ప్రియమైనదని దీనినిబట్టి సంభావింపనగును.

అదృశ్యన్త్యాం చ వాసిష్ఠో వసిష్ఠ శ్చాక్షమాలయా,
చ్యవనశ్చ సుకన్యాయాం పులస్త్యః సన్ధ్యయా యథా. 11

వసిష్ఠుని కొడుకు శక్తి అదృశ్యన్తితో, వసిష్ఠుడు అక్షమాలతో, చ్యవనుడు సుకన్యతో, పులస్త్యుడు సంధ్యతో విహరించిన ట్లాత డామెతో విహరించెను.

అగస్త్యశ్చాపి వైదర్భ్యాం సావిత్ర్యాం సత్యవాన్ యథా,
యథా భృగుః పులోమాయా మదిత్యాం కశ్యపో యథా. 12

అగస్త్యుడు లోపాముద్రయందును, సత్యవంతుడు సావిత్రియందును, భృగువు పులోమయందును, కశ్యపుడు అదితియందును వలె నాత డామెయందు సుఖించెను.

రేణుకాయాం యథార్చీకో హైమవత్యాం చ కౌశికః,
బృహస్పతి శ్చ తారాయాం శుక్రశ్చ శతపర్వణా. 13

ఋచీకుని కొడుకు జమదగ్ని రేణుకయందును, విశ్వామిత్రుడు హైమవతి యందును, బృహస్పతి తారయందును, శుక్రుడు శతపర్వయందును వలె నాత డామెయందు సుఖము పొందెను.

యథా భూమ్యాం భూమిపతి రుర్వశ్యాం పురూరవాః,
ఋచీకః సత్యవత్యాం చ సరస్వత్యాం యథా మనుః. 14

భూమియందు భూమిపతివలె, ఊర్వశియందు పురూరవునివలె, సత్యవతి యందు ఋచీకునివలె, సరస్వతియందు మనువువలె నామెయం దాతడు రమించెను.

శకున్తలాయాం దుష్యన్తో ధృత్యాం చ ధర్మశ్చ శాశ్వతః,
దమయన్త్యాం నలశ్చైవ సత్యవత్యాం చ నారదః. 15

శకుంతలయందు దుష్యంతుడు, ధృతియందు శాశ్వతమగు ధర్మము, దమయంతియందు నలుడు, సత్యవతియందు నారదుడు వలె నామెయం దాతడు క్రీడించెను.

జరత్కారు ర్జరత్కార్వాం పులస్త్యశ్చ ప్రతీచ్యయా,
మేనకాయాం యథోర్ణాయు స్తుమ్బురుశ్చైవ రమ్యయా. 16

జరత్కారువు జరత్కారువునందును, పులస్త్యుడు ప్రతీచియందును, ఊర్ణాయువు మేనకయందును, తుంబురుడు రమ్యయందునువలె నత డామె యందు సుఖము ననుభవించెను.

వాసుకిః శతశీర్షాయాం కుమార్యాం చ ధనఞ్జయః,
వైదేహ్యాం చ యథా రామో రుక్మిణ్యాం చ జనార్దనః. 17

వాసుకి శతశీర్షయందును, ధనంజయుడు కుమారి యను వనితయందును, రాముడు సీతయందును, శ్రీకృష్ణుడు రుక్మిణియందును వలె నాత డామెయందు మనస్తృప్తి పొందెను.

తథా తు రమమాణస్య దివోదాసస్య భూపతేః,
మాధవీ జనయామాస పుత్రమేకం ప్రతర్దనమ్. 18

అట్లు ఆమెతో దాంపత్యసుఖ మనుభవించు దివోదాసునకు మాధవి యొక పుత్రుని ప్రతర్దను డనువానిని కనెను.

అథాజగామ భగవాన్ దివోదాసం స గాలవః,
సమయే సమనుప్రాప్తే వచనం చేద మబ్రవీత్. 19

అనుకొన్న సమయము రాగా గాలవముని దివోదాసునికడకు వచ్చి యిట్లు పలికెను.

నిర్యాతయతు మే కన్యాం భవాం స్తిష్ఠన్తు వాజినః,
యావదన్యత్ర గచ్ఛామి శుల్కార్థం పృథివీపతే. 20

రాజా ! నా కన్యను పంపుము. గుఱ్ఱములు నీకడనే యుండుగాక ! నేను శుల్కము కొరకు మరియొక రాజుకడకు పోవుదును.

దివోదాసోఽథ ధర్మాత్మా సమయే గాలవస్య తామ్,
కన్యాం నిర్యాతయామాస స్థితః సత్యే మహీపతిః. 21

ధర్మాత్ముడగు దివోదాసుడు మాటపై నిలబడి గాలవమునితో ఆ కన్యను పంపెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే సప్తదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునేడవ అధ్యాయము.

—: o :—

# అష్టాదశాధికశతతమోఽధ్యాయః
# నూటపదునెనిమిదవ అధ్యాయము

ఉశీనరేణ మాధవ్యాం శిబే రుత్పాదనమ్, కన్యయా
సహ గచ్ఛతా గాలవేన మార్గే గరుడస్య దర్శనమ్.

ఉశీనరమహారాజు మాధవియందు శిబిని పొందుట, కన్యతో
నరుగుచున్న గాలవుడు మార్గమున గరుడుని గాంచుట.

నారద ఉవాచ-నారదు డిట్లు చెప్పెను.

తథైవ తాం శ్రియం త్యక్త్వా కన్యా భూత్వా యశస్వినీ,
మాధవీ గాలవం విప్ర మభ్యయాత్ సత్యసఙ్గరా. 1

మునుపటివలె అదితప్పని వ్రతముగల కీర్తిశాలిని మాధవి కన్య అయి ఆ సంపద నంతటిని వదలివైచి విప్రునివెంట నరిగెను.

గాలవో విమృశన్నేవ స్వకార్యగతమానసః,
జగామ భోజనగరం ద్రష్టు మౌశీనరం నృపమ్. 2

గాలవు డిది యంతయు విమర్శించుకొనుచునే తన పనియందు తగులు కొన్న మనస్సుగలవాడై ఉశీనరదేశరాజును గాంచుటకై భోజనగరమున కరిగెను.

తమువాచాథ గత్వా స నృపతిం సత్యవిక్రమమ్,
ఇయం కన్యా సుతౌ ద్వౌ తే జనయిష్యతి పార్థివౌ. 3

అతడు సత్యమగు పరాక్రమముగల ఆ రాజుకడ కరిగి యిట్లనెను. "ఈ కన్య నీకిద్దరు రాజులు కాగల పుత్రులను కనును."

అస్యాం భవా నవాప్తార్థో భవితా ప్రేత్య చేహ చ,
సోమార్కప్రతిసంకాశౌ జనయిత్వా సుతౌ నృప. 4

రాజా! సూర్యచంద్రులవంటి యిద్దరు పుత్రులను ఈమెయందు నీవు పొంది యీ లోకమునను పరలోకమునను కోరిన కోర్కెలను బడయుదువు.

శుల్కం తు సర్వధర్మజ్ఞ హయానాం చన్ద్రవర్చసామ్,
ఏకతః శ్యామకర్ణానాం దేయం మహ్యం చతుఃశతమ్. 5

సర్వధర్మముల నెరిగిన ఓ రాజా! దీనికి శుల్కముగా చంద్రునివంటి వన్నె గలవియు, ఒకవైపు ఆకుపచ్చవన్నెగల చెవులు గలవియు నగు గుఱ్ఱములు నాలుగువందల నొసగవలయును.

గుర్వర్థోఽయం సమారంభో న హయైః కృత్య మస్తి మే,
యది శక్యం మహారాజ క్రియతా మవిచారితమ్. 6

అయ్యా! ఈ పాటంతయు గురువుపనికొరకు. నాకు గుఱ్ఱములతో నగు పని యేమియు లేదు. మహారాజా! నీకు శక్యమైనచో ఆలోచింపక ఆ పని చేయుము.

అనపత్యోఽసి రాజర్షే పుత్రౌ జనయ పార్థివ,
పితౄన్ పుత్రప్లవేన త్వమాత్మానం చైవ తారయ. 7

రాజర్షీ! కొడుకులు లేనివాడవు గదా! పుత్రులను కనుము. కొడుకు లను తెప్పతో పితృదేవతలను, నిన్ను తరింపజేసికొనుము.

న పుత్రఫలభోక్తా హి రాజర్షే పాత్యతే దివః,
న యాతి నరకం ఘోరం యథా గచ్ఛన్త్యనాత్మజాః. 8

పుత్రరూపమగు ఫల మనుభవించువానిని ఓ రాజర్షీ! స్వర్గమునుండి త్రోసివేయరు. కొడుకులు లేనివాడు పొందు ఘోరమైన నరకమున కాతడరుగడు.

ఏత చ్చాన్యచ్చ వివిధం శ్రుత్వా గాలవభాషితమ్,
ఉశీనరః ప్రతివచో దదౌ తస్య నరాధిపః. 9

ఇట్లు మరియు పలికిన గాలవుని మాటలను విని ఉశీనరరాజు ఆతని కిట్లు బదులు చెప్పెను.

శ్రుతవానస్మి తే వాక్యం యథా వదసి గాలవ,
విధిస్తు బలవాన్ బ్రహ్మన్ ప్రవణం హి మనో మమ. 10

గాలవా! నీవాడిన మాట వింటిని. కాని బ్రాహ్మణా! విధి బలవంత మయినది. నా మనస్సు కొడుకులకై ఆరాటపడుచున్నది.

శతే ద్వే తు మమాశ్వానా మీదృశానాం ద్విజోత్తమ,
ఇతరేషాం సహస్రాణి సుబహూని చరన్తి మే. 11

కానీ! ద్విజవరా! నీవు చెప్పినట్టి గుఱ్ఱములు నాకడ రెండువందలే కలవు. తక్కినవి వేలకొలందిగా నున్నవి.

అహ మప్యేక మేవాస్యాం జనయిష్యామి గాలవ,
పుత్రం ద్విజ గతం మార్గం గమిష్యామి పరైరహమ్. 12

గాలవా! ఈమెయందు నేనును ఒక్క కొడుకునే కందును. ఇతరులు నడచిన మార్గముననే నేనును నడతును.

మూల్యేనాపి సమం కుర్యాం తవాహం ద్విజసత్తమ,
పౌరజానపదార్థం తు మమార్థో నాత్మభోగతః. 13

నేనును నీకు వారితో సమానముగ మూల్య మిత్తును. ఇవి యంతయు నా యేలుబడిలోని పౌరులకొరకు, గ్రామవాసుల కొరకే కాని నా భోగముకొరకు కాదు.

కామతో హి ధనం రాజా పారక్యం యః ప్రయచ్ఛతి,
న స ధర్మేణ ధర్మాత్మన్ యుజ్యతే యశసా న చ. 14

ధర్మాత్మా! తన కోర్కె తీరుటకై పరుల సొమ్మిచ్చు రాజు ధర్మముతో కీర్తితో కలిసియుండడు.

సోఽహం ప్రతిగ్రహీష్యామి దదా త్వేతాం భవాన్ మమ,
కుమారీం దేవగర్భాభా మేకపుత్రభవాయ మే. 15

అట్టి నేను దేవకన్యవంటి యీ కన్యను ఒక్క కొడుకు పుట్టుటకై స్వీకరింతును. నీవు దయతో నా కొసగుము.

తథా తు బహుధా కన్యా ముక్తవన్తం నరాధిపమ్,
ఉశీనరం ద్విజశ్రేష్ఠో గాలవః ప్రత్యపూజయత్. 16

---

14. పారక్యమ్ - పరులకు సంబంధించినది - రాజు ధనము ప్రజలది అని తాత్పర్యము. ధర్మమునుండియు, కీర్తినుండియు భ్రష్టుడగునని భావము.

అట్లు పెక్కుభంగుల పలుకుచున్న ఉశీనరమహారాజును శ్రేష్ఠుడగు గాలవుడు కొనియాడెను.

ఉశీనరం ప్రతిగ్రాహ్య గాలవః ప్రయయౌ వనమ్,
రేమే స తాం సమాసాద్య కృతపుణ్య ఇవ శ్రియమ్. 17

గాలవు డా కన్యను ఉశీనరున కప్పగించి వనమున కరిగెను. ఆతడును ఆమెను గ్రహించి, పుణ్యము చేసినవాడు సంపద ననుభవించినట్లు, ఆమెతో సుఖమందెను.

కన్దరేషు చ శైలానాం నదీనాం నిర్ఝరేషు చ,
ఉద్యానేషు విచిత్రేషు వనేషూపవనేషు చ. 18

కొండగుహలలో, నదుల సెలయేళ్ళలో, వింతగొలుపు తోటలలో, అడవులలో, చిట్టడవులలో విహరించెను.

హర్మ్యేషు రమణీయేషు ప్రాసాదశిఖరేషు చ,
వాతాయనవిమానేషు తథా గర్భగృహేషు చ. 19

అందమైన మందిరములలో, మేడలపై కిటికీలతో నొప్పు విమానములలో, అంతఃపురభవనములలో విహరించెను.

తతోఽస్య సమయే జజ్ఞే పుత్రో బాలరవిప్రభః,
శిబి ర్నామ్నాఽతివిఖ్యాతో యః స పార్థివసత్తమః. 20

అంత కొంత కాలమునకు బాలసూర్యుని వంటి దీప్తి గలవాడు, రాజులలో మిక్కిలి ప్రసిద్ధి నొందినవాడు శిబి యను పేరున కీర్తికెక్కినవాడు నగు పుత్రుడు పుట్టెను.

ఉపస్థాయ స తం విప్రో గాలవః ప్రతిగృహ్య చ,
కన్యాం ప్రయాత స్తాం రాజన్ దృష్టవాన్ వినతాత్మజమ్. 21

ఆ రాజును సేవించి గాలవుడు కన్యను గైకొని పోవుచు, దారిలో గరుత్మంతుని గాంచెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే అష్టాదశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటపదునెనిమిదవ అధ్యాయము.

—:o:—

# ఏకోనవింశత్యధికశతతమోఽధ్యాయః
# నూటపందొమ్మిదవ అధ్యాయము

గాలవేన షడ్భి రశ్వశతైః సహ మాధవ్యా విశ్వామిత్రాయ సమర్పణం,
మునినా తస్యా మష్టక స్యోత్పాదనం, తదను గాలవకర్తృకం
తస్యాః పితుర్గృహే నయనమ్.

గాలవుడు ఆరునూర్ల గుఱ్ఱములతోపాటు మాధవిని విశ్వామిత్రున కర్పించుట,
ముని ఆమెయందు అష్టకు డను పుత్రుని పొందుట,
పిదప గాలవు డామెను తండ్రియింటికి చేర్చుట.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

గాలవం వైనతేయోఽథ ప్రహస న్నిద మబ్రవీత్,
దిష్ట్యా కృతార్థం పశ్యామి భవన్త మిహ వై ద్విజ. 1

వినతకొడుకు గాలవుని చూచి నవ్వుచు 'అదృష్టవశమున కోరిక నెరవేరిన నిన్ను చూచుచున్నాను' అని పలికెను.

గాలవస్తు వచః శ్రుత్వా వైనతేయేన భాషితమ్,
చతుర్భాగావశిష్టం తదాచఖ్యౌ కార్య మస్య హి. 2

గాలవుడు గరుడు డాడిన మాట విని తనపని యింకను నాలుగవవంతు మిగిలియున్న దని చెప్పెను.

సుపర్ణ స్త్వబ్రవీ దేనం గాలవం వదతాం వరః,
ప్రయత్న స్తేన కర్తవ్యో నైష సంపత్స్యతే తవ. 3

అంత చక్కని పలుకు పొందిక గల గరుత్మంతుడు ఇట్లనెను; ప్రయత్నము చేయవలసినదే. కాని నీపని మాత్రము నెరవేరదు.

పురా హి కాన్యకుబ్జే వై గాధేః సత్యవతీం సుతామ్,
భార్యార్థే వరయత్ కన్యా మృచీక స్తేన భాషితః. 4

మునుపు కాన్యకుబ్జనగరమున గాధిబిడ్డ సత్యవతిని ఋచీకుడు భార్యగా నిమ్మని అడిగెను. అప్పుడు గాధి యిట్లు పలికెను.

ఏకతః శ్యామకర్ణానాం హయానాం చన్ద్రవర్చసామ్,
భగవన్ దీయతాం మహ్యం సహస్ర మితి గాలవ. 5

'అయ్యా! ఒకవైపు ఆకుపచ్చ వన్నెగల చెవిగల చంద్రుని వన్నె గుఱ్ఱములను వేయింటిని నా కొసగుము'.

ఋచీకస్తు తథేత్యుక్త్వా వరుణస్యాలయం గతః,
అశ్వతీర్థే హయాన్ లబ్ధ్వా దత్తవాన్ పార్థివాయ వై. 6

ఋచీకుడు 'అట్లే' అని పలికి వరుణుని భవనమున కరిగి అశ్వతీర్థమున ఆ గుఱ్ఱములను సంపాదించి గాధిరాజున కొసగెను.

ఇష్ట్వా తే పుణ్డరీకేణ దత్తా రాజ్ఞా ద్విజాతిషు,
తేభ్యో ద్వే ద్వే శతే క్రీత్వా ప్రాప్తే తైః పార్థివై స్తదా. 7

ఆ రాజు పుండరీకయాగ మొనర్చి ఆ గుఱ్ఱములను బ్రాహ్మణులకు దాన మొసగెను. వారినుండి ఆ రాజులు ముప్వురు రెండేసివందల చొప్పున కొనిరి.

అపరాణ్యపి చత్వారి శతాని ద్విజసత్తమ,
నీయమానాని సంతారే హృతాన్యాసన్ వితస్తయా. 8

మిగిలిన నాలుగువందల గుఱ్ఱములు తీసికొని వచ్చుచున్నపుడు మార్గమున వితస్తానదిలో కొట్టుకొనిపోయినవి.

ఏవం న శక్యమప్రాప్యం ప్రాప్తుం గాలవ కర్హిచిత్,
ఇమా మశ్వశతాభ్యాం వై ద్వాభ్యాం తస్మై నివేదయ. 9
విశ్వామిత్రాయ ధర్మాత్మన్ షడ్భిరశ్వశతైః సహ.

ఇట్లు దొరకని ఆ గుఱ్ఱములను సాధింపశక్యముగాదు. కావున ఉన్న ఆరు వందల గుఱ్ఱములతో పాటు ఆ రెండువందల గుఱ్ఱములకు బదులుగా ఈ మాధవిని విశ్వామిత్రునకు సమర్పించుకొనుము.

---

8. సంతారే - నదిలో దాటు మార్గమున;

తతోఽసి గతసంమోహః కృతకృత్యో ద్విజోత్తమ. 10

అంత గుండెదిగులు దీరి కార్యము నెరవేరినవాడ వగుదువు.

గాలవ స్తం తథేత్యుక్త్వా సుపర్ణసహిత స్తతః,

ఆదాయాశ్వాంశ్చ కన్యాం చ విశ్వామిత్ర ముపాగమత్. 11

గాలవు డట్లే యని గరుడునితో కలసి గుఱ్ఱములను, కన్యను గైకొని విశ్వామిత్రుని కడ కరిగెను.

అశ్వానాం కాంక్షితార్థానాం షడిమాని శతాని వై,

శతద్వయేన కన్యేయం భవతా ప్రతిగృహ్యతామ్. 12

ఇవిగో మీరు కోరిన గుఱ్ఱము లారునూరులు. తక్కిన రెండు నూర్లకు ఈ కన్యను తమరు గ్రహించవలయును.

అస్యాం రాజర్షిభిః పుత్రా జాతా వై ధార్మికా స్త్రయః,

చతుర్థం జనయ త్వేకం భవానపి నరోత్తమమ్. 13

ఈమెయందు ముప్వురు రాజర్షులు ధార్మికులైన ముగ్గురు కొడుకులను పొందిరి. నాలుగవ పుత్రుని - నరులలో ఉత్తముని - తమరు పొందుడు.

పూర్ణాన్యేవం శతా న్యష్టౌ తురగాణాం భవన్తు తే,

భవతో హ్యనృణో భూత్వా తపః కుర్యాం యథాసుఖమ్. 14

ఇట్లు ఎనిమిదివందల గుఱ్ఱములు పూర్తియగు గాక! నేనా విధముగా అప్పు తీర్చుకొని సుఖముగా తపస్సు చేసికొందును.

విశ్వామిత్రస్తు తం దృష్ట్వా గాలవం సహ పక్షిణా,

కన్యాం చ తాం వరారోహా మిదమిత్యబ్రవీ ద్వచః. 15

విశ్వామిత్రుడును గరుత్మంతునితోపాటు గాలవుని, చక్కని చుక్కయగు ఆ కన్యను గాంచి యిట్లు పలికెను.

కిమియం పూర్వమేవేహ న దత్తా మమ గాలవ,

పుత్రా మమైవ చత్వారో భవేయుః కులభావనాః. 16

గాలవా! ఈ కన్యను ముందే నా కేల ఒసగలేదు. నా కులము పండించు కొడుకులు నలుగురు నాకే పుట్టియుండెడివారు గదా!

ప్రతిగృహ్ణామి తే కన్యా మేకపుత్రఫలాయ వై,
అశ్వా శ్చాశ్రమ మాసాద్య చరన్తు మమ సర్వశః. 17

సరే! ఒక్క పుత్రునికొరకే నే నీమెను స్వీకరింతును. గుఱ్ఱములు నా ఆశ్రమమునకు చేరి తిరుగుచుండుగాక!

స తయా రమమాణోఽథ విశ్వామిత్రో మహాద్యుతిః,
ఆత్మజం జనయామాస మాధవీపుత్ర మష్టకమ్. 18

గొప్ప తేజస్సు గల విశ్వామిత్రుడు ఆమెతో సుఖముందుచుండగా మాధవి అష్టకుడను పుత్రుని గనెను.

జాతమాత్రం సుతం తం చ విశ్వామిత్రో మహామునిః,
సంయోజ్యార్థై స్తథా ధర్మై రశ్వై స్తైః సమయోజయత్. 19

పుట్టిన వెంటనే, మహాముని యగు విశ్వామిత్రుడు ఆ బాలునకు సంపదలను, రాజధర్మములను, గుఱ్ఱములను అప్పగించెను.

అథాష్టకః పురం ప్రాయా త్తదా సోమపురప్రభమ్,
నిర్యాత్య కన్యాం శిష్యాయ కౌశికోఽపి వనం యయౌ. 20

పిమ్మట అష్టకుడు చంద్రుని పురమువంటి వెలుగుగల తన పురమున కరిగెను. విశ్వామిత్రుడును తన శిష్యుడగు గాలవునకు కన్య నప్పగించి వనమున కరిగెను.

గాలవోఽపి సుపర్ణేన సహ నిర్యాత్య దక్షిణామ్,
మనసాఽతిప్రతీతేన కన్యా మిద మువాచ హ. 21

గాలవుడును సుపర్ణునితో కలిసి గురుదక్షిణ చెల్లించుకొని పొంగిపొరలు సంతోషముగల మనస్సుతో ఆ కన్యక కిట్లు పలికెను.

జాతో దానపతిః పుత్ర స్త్వయా శూర స్తథాఽపరః,
సత్యధర్మరతశ్చాన్యో యజ్వా చాపి తథాపరః. 22

---

20. నిర్యాత్య - తిరిగి యిచ్చి; శిష్యాయ - శిష్యుడగు గాలవునకు;

అమ్మా! నీ కొడుకొకడు దానపతి. మరియొకడు శూరుడు. వేరొకడు సత్యమునందును ధర్మమునందును ప్రీతి గలవాడు. ఇంకొకడు యజ్ఞములు చేయువాడు.

తదాగచ్ఛ వరారోహే తారితస్తే పితా సుతైః,
చత్వారశ్చైవ రాజాన స్తథా చాహం సుమధ్యమే. 23

చక్కని తల్లీ! రా. నీ తండ్రిని నీ కొడుకులతో గట్టెక్కించితివి. నలుగురు కొడుకులు రాజులైరి. నన్నును తరింపజేసితివి.

గాలవ స్త్వభ్యనుజ్ఞాయ సుపర్ణం పన్నగాశనమ్,
పితుర్నిర్యాత్య తాం కన్యాం ప్రయయౌ వనమేవ హ. 24

గాలవుడు పాములను భుజించు సుపర్ణునికడ సెలవుగైకొని ఆ కన్యను ఆమె తండ్రి కప్పగించి అడవిదారినే పట్టి పోయెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే ఏకోనవింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితముగల నూటపందొమ్మిదవ అధ్యాయము.

—: o :—

# వింశత్యధికశతతమోఽధ్యాయః

# నూటయిరువదియవ అధ్యాయము

**మాధవ్యా వనే తపశ్చర్యా, స్వర్గసుఖ మనుభూయ యయాతే ర్మోహా న్నిస్తేజ స్త్వమ్.**

**మాధవి వనమున తప మొనర్చుట, యయాతి స్వర్గసుఖమును పొంది అజ్ఞానమువలన తేజస్సు కోల్పోవుట.**

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

స తు రాజా పున స్తస్యాః కర్తుకామః స్వయంవరమ్,
ఉపగమ్యాశ్రమపదం గఙ్గాయమునసఙ్గమే. 1

గృహీతమాల్యదామాం తాం రథమారోప్య మాధవీమ్,
పూరు ర్యదుశ్చ భగినీ మాశ్రమే పర్యధావతామ్. 2

ఆ రాజు తిరిగి ఆమెకు స్వయంవరము చేయగోరి గంగాయమునలు కలియుచోట నున్న ఆశ్రమమును చేరుకొని పూలమాలలు ధరించిన ఆమెను రథ మెక్కించుకొని వచ్చెను. ఆశ్రమమునందు పూరుడును యదుడును చెల్లెలికి వరుని వెదకుచు తిరుగజొచ్చిరి.

నాగయక్షమనుష్యాణాం గన్ధర్వమృగపక్షిణామ్,
శైలద్రుమవనౌకానా మాసీత్తత్ర సమాగమః. 3

నాగులు, యక్షులు, నరులు, గంధర్వులు, మృగములు, పక్షులు, కొండలు, చెట్లు, వానరములు అనువాని సమాగమ మచట ఏర్పడెను.

---

1. స, తు, రాజా - ఆ రాజు ; ఆశ్రమపదమ్ - ఆశ్రమస్థానమును ; ఉపగమ్య - చేరి ; తస్యాః - ఆ కన్యకు; స్వయంవరమ్-స్వయంవరమును, కర్తుకామః - చేయగోరినవా డాయెను.

2. పర్యధావతామ్ - అన్నివైపులకు (వరునికొరకు) తిరిగిరి ;

నానాపురుషదేశ్యానా మీశ్వరైశ్చ సమాకులమ్,
ఋషిభి ర్బ్రహ్మకల్పైశ్చ సమన్తాదావృతం వనమ్. 4

చాలమంది భటులు గల ఆ యా దేశముల ప్రభువులతో బ్రహ్మవంటి ఋషులతో ఆ వనమంతయు నిండియుండెను.

నిర్దిశ్యమానేషు తు సా వరేషు వరవర్ణినీ,
వరా నుత్క్రమ్య సర్వాంస్తాన్ వరం వృతవతీ వనమ్. 5

చక్కని దేహసౌందర్యము గల ఆ కాంత తనకు చూపబడుచున్న వరుల నందరను దాటి వనవాసమే మేలైనదని వరించెను.

అవతీర్య రథాత్ కన్యా నమస్కృత్య చ బన్ధుషు,
ఉపగమ్య వనం పుణ్యం తపస్తేపే యయాతిజా. 6

యయాతిబిడ్డ యగు ఆ కన్య రథమును దిగి బంధువు లందరకు మ్రొక్కి పుణ్యమగు వనమును జేరి తపస్సు చేయసాగెను.

ఉపవాసైశ్చ వివిధై ర్దీక్షాభి ర్నియమై స్తథా,
ఆత్మనో లఘుతాం కృత్వా బభూవ మృగచారిణీ. 7

పెక్కు తీరులగు ఉపవాసములు - దీక్షలు నియమములు అనువానితో చిత్తమును తేలికపరచుకొని మృగమువలె తిరుగాడజొచ్చెను.

వైడూర్యాంకురకల్పాని మృదూని హరితాని చ,
చరన్తీ శ్లక్ష్ణశష్పాణి తిక్తాని మధురాణి చ. 8

ఆకుపచ్చవన్నె గల రత్నముల మొలకలో యనునట్టివి, మెత్తనివి, పచ్చగా నున్నవి, ఒగరుగా తీయగా నున్నవి యగు వాడిగానున్న గడ్డిపరకలను తినసాగెను.

స్రవన్తీనాం చ పుణ్యానాం సురసాని శుచీని చ,
పిబన్తీ వారిముఖ్యాని శీతాని విమలాని చ. 9

పుణ్యములగు నదుల నీటిని రుచి, శుచి, చల్లదనము, నిర్మలత్వము గలవానిని త్రావుచు తప మొనర్చెను.

---

7. ఆత్మనః - చిత్తముయొక్క; లఘుతామ్ - రాగద్వేషాది మలములు లేకుండుటవలన సూక్ష్మమగు ఆత్మతత్త్వమును పరికించు నేర్పును మృగచారిణీ- మృగమువలె లజ్జాది వికారములు లేకుండ సంచరించునది. లేదా మృగమువలె ఆకులు గడ్డిపరకలు తినునది;

వనేషు మృగరాజేషు వ్యాఘ్రవిప్రోషితేషు చ,
దావాగ్నివిప్రయుక్తేషు శూన్యేషు గహనేషు చ. 10

సింహములు, పులులు విచ్చలవిడిగా తిరుగునట్టియు, దావాగ్నులు చెలరేగు నట్టియు, మనుష్యులు లేనట్టియు చొరరానట్టియు వనములయందు తిరుగజొచ్చెను.

చరన్తీ హరిణైః సార్ధం మృగీవ వనచారిణీ,
చచార విపులం ధర్మం బ్రహ్మచర్యేణ సంవృతమ్. 11

వనమున తిరుగు ఆడులేడివలె లేళ్ళతో కలసి బ్రదుకుచు బ్రహ్మచర్యము కాపాడుచున్న ధర్మమును పెద్దగా సాధించెను.

యయాతిరపి పూర్వేషాం రాజ్ఞాం వృత్తమనుష్ఠితః,
బహువర్షసహస్రాయు ర్యయుజే కాలధర్మణా. 12

యయాతియు మునుపటి రాజుల నడవడిని నిష్ఠతో నడపి పెక్కువేలేండ్ల ఆయువు గలవాడై తుదికి కాలధర్మము పొందెను.

పూరు ర్యదుశ్చ ద్వౌ వంశే వర్ధమానే నరోత్తమౌ,
తాభ్యాం ప్రతిష్ఠితో లోకే పరలోకే చ నాహుషః. 13

అతని కొడుకులు పూరుడు, యదువు అను నిద్దరు ఉత్తములై వంశమున వృద్ధిపొందుచుండిరి. వారివలన యయాతికి ఈ లోకమునను పరలోకమునను ప్రతిష్ఠ కలిగెను.

మహీపతే నరపతి ర్యయాతిః స్వర్గ మాస్థితః,
మహర్షికల్పో నృపతిః స్వర్గాగ్ర్యఫలభు గ్విభుః. 14

రాజా, నరపతి, మహర్షివంటి వాడు నగు యయాతి స్వర్గము చేరుకొనెను. సర్వసమర్థుడై స్వర్గమునందలి శ్రేష్ఠములగు ఫలము ననుభవించువా డాయెను.

బహువర్షసహస్రాఖ్యే కాలే బహుగుణే గతే,
రాజర్షిషు నిషణ్ణేషు మహీయస్సు మహర్షిషు. 15
అవమేనే నరాన్ సర్వాన్ దేవా నృషిగణాం స్తథా,
యయాతి ర్మూఢవిజ్ఞానో విస్మయావిష్టచేతనః. 16

పెక్కువేల యేండ్ల కాలము గడువగా రాజర్షులు, గొప్పవారగు మహర్షులు కూర్చుండి యుండగా, తెలివికి పొరలు క్రమ్మి గర్వము కైపెక్కిన చిత్తముగల యయాతి నరులను, దేవతలను, ఋషుల సముదాయములను అందరను అవమానించెను.

---

10. వ్యాఘ్రవిప్రోషితేషు - పులుల సంచారముగల;
12. కాలధర్మణా - మృత్యువుతో; యయుజే - యోగము పొందెను.

తత స్తం బుబుధే దేవః శక్రో బలనిషూదనః,
తే చ రాజర్షయః సర్వే ధిగ్ధిగిత్యేవ మబ్రువన్. 17

అంత దేవేంద్రు డది యెరిగెను. ఆ రాజర్షు లందరు ఛీ ఛీ యని నిందించిరి.

విచారశ్చ సముత్పన్నో నిరీక్ష్య నహుషాత్మజమ్,
కో న్వయం కస్య వా రాజ్ఞః కథం వా స్వర్గమాగతః. 18

ఏ దెవ్వడు? ఏరాజు కొడుకు? స్వర్గమున కెట్లు వచ్చెను? అని నహుషుని కొడుకుని గాంచిన వారందరి ఎదలలో విచారణ పుట్టెను.

కర్మణా కేన సిద్ధోఽయం క్వ వాఽనేన తపశ్చితమ్,
కథం వా జ్ఞాయతే స్వర్గే కేన వా జ్ఞాయతేఽప్యుత. 19

వీడు ఏ కర్మముతో సిద్ధి పొందెను? ఎట్టి తపము సాధించెను? స్వర్గమున వీని కెట్లు గుర్తింపు కలిగినది? వీని నెరిగిన వా డెవ్వడు?

ఏవం విచారయన్త స్తే రాజానం స్వర్గవాసినః,
దృష్ట్వా పప్రచ్ఛు రన్యోన్యం యయాతిం నృపతిం ప్రతి. 20

ఇట్లు తమలో విచారించుకొనుచు స్వర్గవాసు లందరు యయాతిరాజును గూర్చి తమలో తాము ప్రశ్నించుకొనజొచ్చిరి.

విమానపాలాః శతశః స్వర్గద్వారాభిరక్షిణః,
పృష్టా ఆసనపాలాశ్చ న జానీమేత్యథాబ్రువన్. 21

వందలకొలదిగా విమానపాలకులను, స్వర్గము దారులను కాపాడువారిని, ఆసనములను పరిరక్షించువారిని అడుగగా వారు మే మెరుగమనిరి.

సర్వే తే హ్యావృతజ్ఞానా నాభ్యజానన్త తం నృపమ్,
స ముహూర్తా దథ నృపో హతౌజాశ్చాభవత్తదా. 22

తెలివికి తెరపడగా వారందరు నతని నెరుగకుండిరి. అంత నొక్క ముహూర్తములో ఆ రాజు శక్తియుక్తు లన్నియు ఉడిగిపోయినవా డయ్యెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే యయాతిమోహే వింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున యయాతిమోహముగల నూటయిరువదవ అధ్యాయము.

—:o:—

# ఏకవింశత్యధికశతతమోఽధ్యాయః

# నూటయిరువదియొకటవ అధ్యాయము

**యయాతేః స్వర్గాద్ భ్రంశః, తస్య దౌహిత్రాణాం దుహితు**
**ర్గాలవస్య చ తస్మై పుణ్యం ప్రదాతు ముద్యమః.**

**యయాతి స్వర్గమునుండి భ్రష్టు డగుట, ఆతని మనుమలు, కూతురు,**
**గాలవుడు ఆతనికి తమ పుణ్యము నొసగుటకు సిద్ధపడుట.**

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

అథ ప్రచలితః స్థానా దాసనాచ్చ పరిచ్యుతః,
కమ్పితానేవ మనసా ధర్షితః శోకవహ్నినా. 1

మ్లానస్రగ్ భ్రష్టవిజ్ఞానః ప్రభ్రష్టముకుటాఙ్గదః,
విఘూర్ణన్ స్రస్తసర్వాఙ్గః ప్రభ్రష్టాభరణామ్బరః. 2

అంత యయాతి తనచోటు నుండి ఊగులాడెను. ఆసనమునుండి జారి పడెను. వణకిపోవుచున్న గుండెతో శోక మను అగ్నితో బెదరిపోయెను. తాల్చిన పూలమాలలు వాడిపోయెను. తెలివి జారిపోయెను. కిరీటము, అంగదములు ఊడి క్రిందబడెను. పట్టుతప్పిన దేహముతో గుడుసుడ్డు పడెను. తాల్చిన ఆభరణములు, వస్త్రములు జారిపోయెను.

అదృశ్యమాన స్తాన్ పశ్యన్నపశ్యంశ్చ పునః పునః,
శూన్యః శూన్యేన మనసా ప్రపతిష్యన్ మహీతలమ్. 3

ఎంత చూచినను ఆతనికి దేవతలు కానరాకుండిరి. వారి కీతడు కానరాకుండెను. వట్టిపోయిన మనస్సుతో కట్టెవలెనై భూతలమునకు పడిపోవుచుండెను.

కిం మయా మనసా ధ్యాత మశుభం ధర్మదూషణమ్,
యేనాహం చలితః స్థానా దితి రాజా వ్యచిన్తయత్. 4

---

4. ధర్మదూషణమ్-పుణ్యమును నశింపజేయుదానిని;

'ఇది ఏమి? నేను మనసులో ధర్మమును పాడుచేయు పాపమును ధ్యానించితినా? నా తావునందు నిలద్రొక్కుకొనలేకున్నాను' అని రాజు చింతించెను.

తే తు తత్రైవ రాజానః సిద్ధా శ్చాప్సరస స్తథా,
అపశ్యన్త నిరాలమ్బం తం యయాతిం పరిచ్యుతమ్. 5

అయున్న రాజులు సిద్ధులు, అప్సరసలు అందరు పట్టు లేక జారిపడి పోవుచున్న యయాతిని చూచిరి.

అథైత్య పురుషః కశ్చిత్ క్షీణపుణ్యనిపాతకః,
యయాతి మబ్రవీ ద్రాజన్ దేవరాజస్య శాసనాత్. 6

పుణ్యము తరిగిపోయినవారిని క్రిందకు త్రోసివేయు పురుష డొకడు దేవరాజు ఆజ్ఞమేరకు అక్కడకు వచ్చి యయాతితో ఇట్లు పలికెను.

అతీవ మదమత్త స్త్వం న కఞ్చి న్నావమన్యసే,
మానేన భ్రష్టః స్వర్గ స్తే నార్హ స్త్వం పార్థివాత్మజ. 7

రాజకుమారా! నీవు మేర మీరిన పొగరుతో ఒడలెరుగకున్నావు. నీవు అవమానింపనివా డిచట నొక్కడును లేడు. ఆ గర్వమువలన నీకు స్వర్గము జారిపోయినది. నీ విం దుండదగవు.

న చ ప్రజ్ఞాయసే గచ్ఛ పత స్వేతి తమబ్రవీత్,
పతేయం సత్స్వితి వచ స్త్రిరుక్త్వా నహుషాత్మజః, 8
పతిష్యం శ్చిన్తయామాస గతిం గతిమతాం వరః.

'నిన్నెవ్వరు గుర్తింపరు. పో! పడు!' అని పలికెను. మంచిగతి గలవారిలో శ్రేష్ఠుడగు నహుషునికొడుకు క్రిందికి పడుచు మంచివారియందు పడుదును గాక! అని ముమ్మారు పలికి తనగతినిగూర్చి చింతింప దొడగెను.

ఏతస్మిన్నేవ కాలే తు నైమిషే పార్థివర్షభాన్,
చతురోఽపశ్యత నృప స్తేషాం మధ్యే పపాత హ. 9

---

6. క్షీణపుణ్యనిపాతకః-తరిగిపోయిన పుణ్యము గలవారిని పడద్రోయువాడు;
8. న ప్రజ్ఞాయసే - ఎవ్వరికిని ఎరుక పడవు. తేజస్సు నశించిన కారణమున అని భావము.

అదే సమయమున నైమిశారణ్యమున నలుగురు రాజశ్రేష్ఠులను గాంచెను వారినడుమ పడెను.

ప్రతర్దనో వసుమనాః శిబి రౌశీనరోఽష్టకః,
వాజపేయేన యజ్ఞేన తర్పయన్తి సురేశ్వరమ్. 10

ప్రతర్దనుడు, వసుమనుడు, ఉశీనరుని కొడుకు శిబి, అష్టకుడు అచట వాజపేయయాగముతో దేవేంద్రుని తృప్తిపరచుచుండిరి.

తేషా మధ్వరజం ధూమం స్వర్గద్వార ముపస్థితమ్,
యయాతి రుపజిఘ్రన్ వై నిపపాత మహీం ప్రతి. 11

భూమౌ స్వర్గే చ సంబద్ధాం నదీం ధూమమయీమివ,
గంగాం గామివ గచ్ఛన్తీ మాలమ్బ్య జగతీపతిః. 12

వారి యజ్ఞమున బుట్టిన పొగ స్వర్గద్వారమువరకు చేరుకొనెను. అది భూమికి స్వర్గమునకు ముడిగల పొగతో నిండిన నదివలె నుండెను. భూమికి దిగి వచ్చుచున్న గంగానదివలె నున్న దానిని పట్టుకొని యయాతి వాసన చూచుచు భూమిపై పడెను.

శ్రీమత్స్వవభృథాగ్ర్యేషు చతుర్షు ప్రతిబన్ధుషు,
మధ్యే నిపతితో రాజా లోకపాలోపమేషు సః. 13

దివ్యసంపదతో అలరారుచున్నవారు, యజ్ఞము ముగించి అవభృథ స్నానము చేసియున్నవారు, తనకు చుట్టములు, లోకపాలురను పోలియున్నవారు నగు ఆ నలుగురి నడుమ రాజు పడెను.

చతుర్షు హుతకల్పేషు రాజసింహమహాగ్నిషు,
పపాత మధ్యే రాజర్షి ర్యయాతిః పుణ్యసంక్షయే. 14

---

10. శిబిః ఔశీనరః - ఉశీనరుని కొడుకు శిబి - ఇతడు నలుగురిలో ఒకడు.
12. ధూమమయీ మివ - ఆ పొగ నింగికి నేలకు ముడిపెట్టినట్లు ఒక నదివలె నుండెనని భావము - దానిని పట్టుకొని వ్రేలాడుచు రాజు క్రిందపడెనని భావము.

రాజసింహము లనెడు మహాగ్నులయందు హోమము చేయబడినట్లున్న ఆ సల్పురినడుమ రాజర్షియగు యయాతి పుణ్యము నశింపగా వచ్చి పడెను.

తమూహుః పార్థివాః సర్వే దీప్యమాన మివ శ్రియా,
కో భవాన్ కస్య వా బన్ధు ర్దేశస్య నగరస్య వా. 15

అప్పు డా రాజు లందరు గొప్ప శోభతో నిరాజిల్లుచున్న ఆతనితో ఇట్లు పలికిరి - "తా మెవ్వరు? ఏ దేశమునకు, లేక ఏ నగరమునకు పాలకులు?"

యక్షో వాఽప్యథవా దేవో గన్ధర్వో రాక్షసోఽపి వా,
న హి మానుషరూపోఽసి కో వాఽర్థః కాఙ్క్షితే త్వయా. 16

యక్షుడవా? లేక దేవుడవా? కాక గంధర్వుడవా? రాక్షసుడవా? మనుష్యుడవు మాత్రము కావు. నీవు కోరెడి విషయ మేమి?

యయాతి రువాచ - యయాతి యిట్లు పలికెను.

యయాతి రస్మి రాజర్షిః క్షీణపుణ్య శ్చ్యుతో దివః,
పతేయం సత్స్వితి ధ్యాయన్ భవత్సు పతిత స్తతః. 17

"నేను యయాతి అను రాజర్షిని. పుణ్యము తరిగిపోగా స్వర్గమునుండి జారిపడితిని. మంచివారి నడుమ పడవలయునని ధ్యానించుచు మీమధ్య పడితిని.

రాజాన ఊచుః - రాజు లిట్లు పలికిరి.

సత్య మేత ద్భవతు తే కాంక్షితం పురుషర్షభ,
సర్వేషాం నః క్రతుఫలం ధర్మశ్చ ప్రతిగృహ్యతామ్. 18

'నీ కోరిక సత్యమగుగాక! పురుషవరేణ్యా! మాయందలి యజ్ఞము ఫలమును, ధర్మమును దయతో గ్రహింపుము".

యయాతి రువాచ - యయాతి యిట్లు పలికెను.

నాఽహం ప్రతిగ్రహధనో బ్రాహ్మణః క్షత్రియో హ్యహమ్,
న చ మే ప్రవణా బుద్ధిః పరపుణ్యవినాశనే. 19

---

15. బన్ధుః-పాలకుడు.

"నేను ఇతరు లిచ్చిన సొమ్మే ధనముగా గల బ్రాహ్మణుడను గాను. క్షత్రియుడను గదా! ఇతరుల పుణ్యమును పాడుచేయుటలో ఉత్సాహపడు బుద్ధి నాకు లేదు".

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ఏతస్మిన్నేవ కాలే తు మృగచర్యాక్రమాగతామ్,
మాధవీం ప్రేక్ష్య రాజాన స్తేఽభివాద్యేద మబ్రువన్. 20

ఇంతలో మృగమువలె తిరుగుచు అక్కడకు వచ్చిన మాధవిని గాంచి ఆ రాజులు అభివాదనము చేసి యిట్లు పలికిరి.

కిమాగమనకృత్యం తే కిం కుర్మః శాసనం తవ,
ఆజ్ఞాప్యా హి వయం సర్వే తవ పుత్రా స్తపోధనే. 21

"నీవచ్చిన పనియేమి? మేము పాటింపవలసిన నీ ఆజ్ఞ యేమి? తపోధనా! మే మందరము నీ ఆజ్ఞను పాలింపవలసినవారము. నీ పుత్రులము".

తేషాం తద్భాషితం శ్రుత్వా మాధవీ పరయా ముదా,
పితరం సముపాగచ్ఛ ద్యయాతిం సా వవన్ద చ. 22

వారి ఆ మాట విని మాధవి పరమానందము నంది తండ్రి యగు యయాతి కడకు వచ్చి నమస్కరించెను.

స్పృష్ట్వా మూర్ధని తాన్ పుత్రాం స్తాపసీ వాక్య మబ్రవీత్,
దౌహిత్రా స్తవ రాజేన్ద్ర మమ పుత్రా న తే పరాః. 23

ఆ కొడుకుల శిరస్సులను తాకి ఆ తాపసి యిట్లనెను. "రాజేంద్రా! వీరు నీ మనుమలు. నా కుమారులు. నీకు పరులు కారు".

ఇమే త్వాం తారయిష్యన్తి దృష్ట మేతత్ పురాతనే,
అహం తే దుహితా రాజన్ మాధవీ మృగచారిణీ. 24

"వీరు నిన్ను తరింపజేయుదురు. ఇది వేదమునందే కానవచ్చు విషయము. రాజా! నేను నీ కూతురను. మాధవిని. మృగమువలె తిరుగు వ్రతమును న్నదానను".

---

24. పురాతనే - ఆది యెరుగరాని కాలమునుండి బయలుదేరిన వేదమునందు.

మయా ప్యుపచితో ధర్మ స్తతోఽర్ధం ప్రతిగృహ్యతామ్,
యస్మా ద్రాజ న్నరాః సర్వే అపత్యఫలభాగినః. 25

"నేను కూడ ధర్మమును కొంత కూడబెట్టితిని. అందు సగము స్వీకరింపుము. లోకమున మానవులు సంతానము సాధించిన ఫలమున భాగము కలవారే కదా !".

తస్మా దిచ్ఛన్తి దౌహిత్రాన్ యథా త్వం వసుధాధిప.

"అందువలననే, నీవలెనే మానవులు కూతుంద్రకు కొడుకులు పుట్టవలయునని వాంఛింతురు".

తత స్తే పార్థివాః సర్వే శిరసా జననీం తదా,
అభివాద్య నమస్కృత్య మాతామహ మథాబ్రువన్. 26

అంత నా రాజులందరు తల్లికి తల వంచి నమస్కరించి ఆమె మాటలను మెచ్చుకొని తాత కిట్లనిరి.

ఉచ్చై రనుపమైః స్నిగ్ధైః స్వరై రాపూర్య మేదినీమ్,
మాతామహం నృపతయ స్తారయన్తో దివశ్చ్యుతమ్. 27

సాటిలేని, నిండైన, పెద్ద స్వరములతో భూమి నంతటిని నింపి ఆ రాజులు స్వర్గమునుండి జారిన తాతను తరింపజేయుచున్నవా రైరి.

అథ తస్మా దుపగతో గాలవోఽప్యాహ పార్థివమ్,
తపసో మేఽష్టభాగేన స్వర్గ మారోహతాం భవాన్. 28

అంత ఆ సమయమున కచటకు వచ్చిన గాలవుడు రాజుతో 'నా తపస్సులో ఎనిమిదవ వంతు గైకొని నీవు స్వర్గము నెక్కుము' అని పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే యయాతిత్రిభంశే ఏకవింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున యయాతి జారిన వృత్తాంతముగల
నూటయిరువదియొకటవ అధ్యాయము.

—:०:—

28. అష్టభాగేన - ఎనిమిదవ భాగముతో.

# ద్వావింశత్యధికశతతమోఽధ్యాయః
# నూటయిరువదిరెండవ అధ్యాయము

**సత్సఙ్గాద్ దౌహిత్రకర్తృకపుణ్యదానాచ్చ**
**యయాతేః పునః స్వర్గారోహణమ్.**

**సజ్జనుల కలయికవలనను మనుమ లొసగిన**
**పుణ్యమువలనను యయాతి మరల స్వర్గమున కరుగుట.**

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ప్రత్యభిజ్ఞాతమాత్రోఽథ సద్భి స్తై ర్నరపుఙ్గవః,
సమారురోహ నృపతి రస్పృశన్ వసుధాతలమ్,
యయాతి ర్దివ్యసంస్థానో బభూవ విగతజ్వరః. 1

అట్లు సజ్జనులు తన్ను గుర్తించిన మాత్రమున యయాతి మహారాజు నేలను తాకకుండ మనస్సు దిగులు దీరి దివ్యమగు దేహము ధరించి స్వర్గ మెక్క దొడగెను.

దివ్యమాల్యామ్బరధరో దివ్యాభరణభూషితః,
దివ్యగన్ధగుణోపేతో న పృథ్వీ మస్పృశత్ పదా. 2

దేవలోకపు మాల్యములు, వస్త్రములు ధరించి, ఆభరణములు దాల్చి దేవలోకపు వాసనలు గుణములు కలవాడై నేలను కాలితో తాకకుండెను.

తతో వసుమనాః పూర్వ ముచ్చై రుచ్చారయన్ వచః,
ఖ్యాతో దానపతి ర్లోకే వ్యాజహార నృపం తదా. 3

లోకమున దానపతి యని పేరు పడసిన వసుమనుడు పెద్దగా పలుకుచు రాజుతో ఇట్లనెను.

ప్రాప్తవానస్మి యల్లోకే సర్వవర్ణే ష్వగర్హయా,
తదప్యథ చ దాస్యామి తేన సంయుజ్యతాం భవాన్. 4

"అన్ని పర్వములయందును నిందలేని ప్రశంస లోకమున నే నేది పొందితినో అదియు నీ కిత్తును. నీవు ఆ పుణ్యమును నీలో కలుపుకొనుము."

యత్ఫలం దానశీలస్య క్షమాశీలస్య యత్ఫలమ్,
యచ్చ మే ఫలమాధానే తేన సంయుజ్యతాం భవాన్. 5

దాన మిచ్చుటయే శీలమైనవాడు, సహనమే శీలమైనవాడు ఏ ఫలమును పొందునో, అగ్నిని నిరంతరము పూజించుటవంటి శ్రుతి చెప్పిన ధర్మము నాచరించుటవలన ఏ ఫలమును నరుడు పొందునో యది యంతయు నిన్ను చేరును గాక!

తతః ప్రతర్దనోఽప్యాహ వాక్యం క్షత్రియపుఙ్గవః,
యథా ధర్మరతి ర్నిత్యం నిత్యం యుద్ధపరాయణః, 6
ప్రాప్తవానస్మి యల్లోకే క్షత్రవంశోద్భవం యశః,
వీరశబ్దఫలం చైవ తేన సంయుజ్యతాం భవాన్. 7

క్షత్రియులలో గొప్పవాడగు ప్రతర్దను డంత ఇట్లు పలికెను. 'నిత్యము ధర్మమున ప్రీతి గలవాడనై యుద్ధమున శ్రద్ధ గలవాడనై, క్షత్రవంశమున పుట్టి నేను పొందిన కీర్తినంతటిని, వీరుడను శబ్దముయొక్క ఫలమును నీ కిత్తును. అది నిన్ను చేరుగాక!

శిబి రౌశీనరో ధీమా నువాచ మధురాం గిరమ్,
తథా బాలేషు నారీషు వైహార్యేషు తథైవ చ, 8
సఙ్గరేషు నిపాతేషు తథా తద్వ్యసనేషు చ,
అనృతం నోక్తపూర్వం మే తేన సత్యేన ఖం వ్రజ. 9

అంత ఉశీనరకుమారుడు బుద్ధిమంతుడు శిబి తీయని మాట యిట్లు పలికెను. పిల్లల విషయమునను, స్త్రీల విషయమునను, బంధువులకు సంబంధించిన పరిహాసప్రసంగములయందును, యుద్ధములయందును. ఆపదలయందును, వ్యసనములయందును, నేను అబద్ధమాడి యెరుగను. ఆ సత్యముతో నీవు స్వర్గమున కరుగుము.

---

8. వైహార్యేషు-బంధువులతోడి చేయు పరిహాసప్రసంగములయందు.
9. నిపాతేషు-ఆపదలయందు; వ్యసనేషు-కష్టదశలయందు లేక ద్యూతము మొదలగువానియందు; సఙ్గరేషు-ప్రతిజ్ఞయందు అనియు అర్థము.

యథా ప్రాణాంశ్చ రాజ్యం చ రాజన్ కామసుఖాని చ,
త్యజేయం న పునః సత్యం తేన సత్యేన ఖం వ్రజ. 10

ప్రాణములను, రాజ్యమును, కామసుఖములను గూడ త్రోసివేయగలను గాని సత్యమును మాత్రము వదలజాలను. నీ వా సత్యబలముతో స్వర్గమున కరుగుము.

యథా సత్యేన మే ధర్మో యథా సత్యేన పావకః,
ప్రీతః శతక్రతు శ్చైవ తేన సత్యేన ఖం వ్రజ. 11

నా సత్యముతో ధర్మదేవతయు, అగ్నిదేవుడును ప్రీతి నందిన విధమున దేవేంద్రుడును ప్రీతి నొందెను. ఆ సత్యముతో కూడి స్వర్గమున కేగుము.

అష్టక స్త్వథ రాజర్షిః కౌశికో మాధవీసుతః,
అనేకశతయజ్వానం నాహుషం ప్రాప్య ధర్మవిత్. 12

పిమ్మట మాధవికి విశ్వామిత్రునివలన జనించిన అష్టకుడు ధర్మమెరిగిన వాడు, నూర్లకొలది యజ్ఞములు చేసిన నహుషుని కొడుకును సమీపించి యిట్లు పలికెను.

శతశః పుణ్డరీకా మే గోసవాశ్చరితాః ప్రభో,
క్రతవో వాజపేయాశ్చ తేషాం ఫల మవాప్నుహి. 13

'ప్రభూ! నేను నూరుల కొలది పుండరీకయాగములు, గోమేధములు, వాజపేయములు చేసితిని. వాని ఫలము నీవు పొందుము.'

న మే రత్నాని న ధనం న తథాఽన్యే పరిచ్ఛదాః,
క్రతు ష్వనుపయుక్తాని తేన సత్యేన ఖం వ్రజ. 14

నేను యజ్ఞమున ఉపయోగింపని రత్నములు లేవు. ధనము లేదు. అట్లే తక్కిన వస్త్రములు మొదలగునవియు లేవు. నీ వా సత్యముతో స్వర్గమున కరుగుము.

యథా యథా హి జల్పన్తి దౌహిత్రాస్తం నరాధిపమ్,
తథా తథా వసుమతీం త్యక్త్వా రాజా దివం యయౌ. 15

---

10. ఖమ్-స్వర్గమును.

14. పరిచ్ఛదాః - వస్త్రములు.

ఆ మనుమలు అట్లు పలుకుచున్న కొలదిని బట్టి ఆ రాజు భూమిని వదలుచు స్వర్గమును చేరుకొనెను.

ఏవం సర్వే సమస్తైస్తే రాజానః సుకృతైస్తదా,
యయాతిం స్వర్గతో భ్రష్టం తారయామాసు రఞ్జసా. 16

ఇట్లా రాజు లందరు తమ పుణ్యము లన్నింటితో స్వర్గమునుండి జారిన యయాతిని వెనువెంటనే తరింపజేసిరి.

దౌహిత్రాః స్వేన ధర్మేణ యజ్ఞదానకృతేన వై,
చతుర్షు రాజవంశేషు సంభూతాః కులవర్ధనాః,
మాతామహం మహాప్రాజ్ఞం దివ మారోపయన్త తే. 17

నాలుగు రాజవంశములలో పుట్టిన కులము వృద్ధి పొందించు ఆ కూతు కొడుకులు తమదైన యజ్ఞములతో దానములతో నేర్పడిన పుణ్యముతో గొప్ప బుద్ధివిశేషముగల తాతను స్వర్గమున నిలిపిరి.

రాజాన ఊచుః - రాజు లిట్లు పలికిరి.

రాజధర్మగుణోపేతాః సర్వధర్మగుణాన్వితాః,
దౌహిత్రాస్తే వయం రాజన్ దివ మారోహ పార్థివ. 18

"రాజా! మేము రాజధర్మమునందలి ఉత్తమ గుణములు గలవారము. ధర్మములన్నింటి గుణములు మాయందు గలవు. నీకుమార్తె కొడుకులము. స్వర్గము నధిరోహింపుము."

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి గాలవచరితే
యయాతిస్వర్గారోహణే ద్వావింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున యయాతి స్వర్గము నెక్కుట యను
నూటయిరువదిరెండవ అధ్యాయము.

—:o:—

# త్రయోవింశత్యధికశతతమోఽధ్యాయః

# నూటయిరువదిమూడవ అధ్యాయము

స్వర్గే యయాతేః స్వాగతం, యయాతినా పృష్టేన
బ్రహ్మణాభిమానమేవ పతనహేతురితి ప్రతిపాదనమ్,
నారదకర్తృకం దుర్యోధనప్రబోధనమ్.

స్వర్గమున యయాతికి స్వాగతము, యయాతి అడుగగా
బ్రహ్మ అభిమానమే పడుటకు కారణమని నిరూపించుట,
నారదుడు దుర్యోధనునకు హితము చెప్పుట.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

సద్భిరారోపితః స్వర్గం పార్థివై ర్భూరిదక్షిణైః,
అభ్యనుజ్ఞాయ దౌహిత్రాన్ యయాతి ర్దివ మాస్థితః. 1

గొప్ప దక్షిణ లిచ్చి యజ్ఞములు చేసిన సజ్జనులగు రాజులచేత స్వర్గమును పొందిన యయాతి మనుమల అనుమతితో స్వర్గమున నెలకొనెను.

అభివృష్టశ్చ వర్షేణ నానాపుష్పసుగన్ధినా,
పరిష్వక్తశ్చ పుణ్యేన వాయునా పుణ్యగన్ధినా. 2

పెక్కుపూవుల తావిగల వాన అతనిపై కురిసెను. హాయి గొలుపు సువాసనగల వాయు వాతనిని నిలువెల్ల నిమిరెను.

అచలం స్థాన మాసాద్య దౌహిత్రఫలనిర్జితమ్,
కర్మభిః స్వై రుపచితో జజ్వాల వరయా శ్రియా. 3

కుమార్తె కొడుకులు సాధించి పెట్టిన చెదరని స్థానము పొంది యయాతి తన పుణ్యకర్మములతో కూడి మహాసంపదతో వెలుగొందెను.

ఉపగీతోపనృత్తశ్చ గన్ధర్వాప్సరసాం గణైః,
ప్రీత్యా ప్రతిగృహీతశ్చ స్వర్గే దున్దుభినిఃస్వనైః. 4

గంధర్వులు పాడిరి. అప్సరస లాడిరి. స్వర్గమున దుందుభినాదములతో ప్రీతితో నాతని కెదురువచ్చి కొనిపోయిరి.

అభిష్టుతశ్చ వివిధై ర్దేవరాజర్షిచారణైః,
అర్చిత శ్చోత్తమార్ఘ్యేణ దైవతై రభినన్దితః. 5

దేవర్షులు, రాజర్షులు, చారణులు పెక్కువిధముల కొనియాడిరి. ఉత్తమ పూజాద్రవ్యములతో దేవత లాతనిని కొనియాడుచు పూజించిరి.

ప్రాప్తః స్వర్గఫలం చైవ తమువాచ పితామహః,
నిర్వృతం శాన్తమనసం వచోభి స్తర్పయన్నివ. 6

స్వర్గఫల మతని కందివచ్చెను. అట్లు సుఖముతో శాంతమగు మనస్సుతో నున్న యయాతిని తన పలుకులతో తృప్తిపరచుచు బ్రహ్మ యిట్లు పలికెను.

చతుష్పాద స్త్వయా ధర్మ శ్చితో లోక్యేన కర్మణా,
అక్షయ స్తవ లోకోఽయం కీర్తి శ్చై వాక్షయా దివి. 7

"నీవు నాలుగు పాదములుగల ధర్మమును లోకమునకు సంబంధించిన కర్మముతో సాధించితివి. నీ కింక ఈ లోకము చెడదు. నీ కీర్తియు తరుగువోనిదై స్వర్గమున స్థిరముగా నిలుచును."

పున స్త్వయైవ రాజర్షే సుకృతేన విఘాతితమ్,
ఆవృతం తమసా చేతః సర్వేషాం స్వర్గవాసినామ్. 8

"రాజర్షీ! నీవు స్వయముగా నీ పుణ్యమును పాడు చేసికొంటివి. దానివలన స్వర్గవాసు లందరి చిత్తము చీకటి క్రమ్మినది."

యేన త్వాం నాభిజానన్తి తతోఽజ్ఞాతోఽసి పాతితః,
ప్రీత్యైవ చాసి దౌహిత్రై స్తారిత స్త్వమిహాగతః. 9

---

7. చతుష్పాదః - తపస్సు, యజ్ఞము, జ్ఞానము, దానము అను నాలుగు ధర్మము పాదములు - మరియొక విధముగా అహింస, సత్యము దొంగ తనము లేకుండుట, ఋణము తీర్చుకొనుట అనునవి.

8. సుకృతేన - చక్కగా సాధించిన పుణ్యకర్మముచేత; తమసా - క్రోధము చేత.

9. న అభిజానన్తి - ఇతడు ఉత్తముడు అని గుర్తింపనివారైరి. ఆ కారణ మున - అజ్ఞాతః - అపకీర్తితో గుర్తింపబడనివాడు.

"దానితో నీవు గుర్తింపరానివాడవైతివి. దేవతలు నిన్ను గుర్తింపరైరి. క్రింద పడిపోయితివి. నీ కుమార్తె కొడుకులు ప్రీతితో నిన్ను లేవనెత్తిరి. అట్లు నీవిక్కడకు వచ్చితివి."

స్థానం చ ప్రతిపన్నోఽసి కర్మణా స్వేన నిర్జితమ్,
అచలం శాశ్వతం పుణ్య ముత్తమం ధ్రువ మవ్యయమ్. 10

'మరల నీవు స్వయముగా సాధించిన పుణ్యకర్మముతో స్థిరము, శాశ్వతము, పుణ్యము, శ్రేష్ఠము, హెచ్చుతగ్గులు లేనిది, కదలిక లేనిది యగు స్థానమును పొందితివి".

యయాతి రువాచ - యయాతి యిట్లు పలికెను.

భగవన్ సంశయో మేఽస్తి కశ్చిత్తం ఛేత్తు మర్హసి,
న హ్యన్య మహ మర్హామి ప్రష్టుం లోకపితామహ. 11

లోకములకెల్ల తండ్రివగు మహానుభావా! నాకొక సంశయము కలదు. దానిని తొలగింపుము. నిన్నుకాక మరియొకని నడుగజాలను".

బహువర్షసహస్రాన్తం ప్రజాపాలనవర్ధితమ్,
అనేకక్రతుదానౌఘై రర్జితం మే మహత్ఫలమ్. 12

"పెక్కువేల యేండ్లు ప్రజలను చక్కగా పాలించి పెంపొందించు కొన్నదియు, పెక్కుయజ్ఞములు, దానములు చేసి సంపాదించినదియు నగు పుణ్యఫలము నాకు పెద్దగా గలదు."

కథం తదల్పకాలేన క్షీణం యేనాస్మి పాతితః,
భగవన్ వేత్థ లోకాంశ్చ శాశ్వతాన్ మమ నిర్మితాన్, 13
కథం ను మమ తత్సర్వం విప్రణష్టం మహాద్యుతే.

అదియంతయు కొలదిసేపటిలో ఎట్లు తరిగిపోయినది? దానివలననే కదా నేను స్వర్గమునుండి జారిపోయితిని? నేను నిర్మించుకొన్న శాశ్వతములగు లోకములు నీవెరుగుదువు. దేవా! అదియంతయు నెట్లు చెడిపోయినది?

పితామహ ఉవాచ - బ్రహ్మ యిట్లు పలికెను.

బహువర్షసహస్రాన్తం ప్రజాపాలనవర్ధితమ్,
అనేకక్రతుదానౌఘై ర్యత్త్వయోపార్జితం ఫలమ్. 14

తదనేనైవ దోషేణ క్షీణం యేనాసి పాతితః,
అభిమానేన రాజేన్ద్ర ధిక్కృతః స్వర్గవాసిభిః. 15

రాజేంద్రా! పెక్కువేలేండ్లు ప్రజలను చక్కగా పాలించి పెంచుకొన్న పుణ్యము, పెక్కు యజ్ఞములు దానములు చేసి నీవు సాధించిన ఫలము ఈ దోషము తోడనే నశించినది. దానివలననే నిన్నిచటనుండి త్రోసివైచిరి. నే నింతవాడ నన్న అభిమానమే ఆ తప్పు. దానితో స్వర్గవాసులు నిన్ను చీకొట్టిరి.

నాయం మానేన రాజర్షే న బలేన న హింసయా,
న శాఠ్యేన న మాయాభి ర్లోకో భవతి శాశ్వతః. 16

"మిడిసిపాటు, బలము, హింస, నమ్మకమును చంపుట, ఇతరులను మోసగించుట అను వానితో శాశ్వతమగు ఈ లోకము సిద్ధింపదు".

నావమాన్యా స్త్వయా రాజన్నధమోత్కృష్టమధ్యమాః,
న హి మానప్రదగ్ధానాం కశ్చి దస్తి శమః క్వచిత్. 17

"రాజా! నీకంటె తక్కువవారిని గాని, ఎక్కువవారిని గాని, నీతోడి వారినిగాని నీవెన్నడు అవమానింపరాదు. దురహంకార పీడితుల కెన్నటికిని ఏ విధమగు శాంతియు లభింపదు".

పతనారోహణ మిదం కథయిష్యన్తి యే నరాః,
విషమాణ్యపి తే ప్రాప్తా స్తరిష్యన్తి న సంశయః. 18

'యయాతిపాటు, మరల స్వర్గము చేరుట అను నీకథను చెప్పుకొను నరులు, మహాకష్టములు పొందినవారైనను, వానినుండి బయటపడుదురు. సందియము లేదు."

---

16. మానేన - నేనింతవాడ నను మిడిసిపాటుచేత; శాఠ్యేన - నమ్మకమునకు ద్రోహము చేయుటచేత; మాయాభిః - అద్భుతములను చూపి జనుల నాకట్టుకొని వంచనలు చేయుటచేత.
17. మానప్రదగ్ధానామ్ - తన మిడిసిపాటే తన్ను కాల్చివేయునని భావము.
18. పతనారోహణమ్-పడుట, ఎక్కుటగల; విషమాణి- ఘోరమగు కష్టములు.

నారద ఉవాచ - నారదు డిట్లు చెప్పెను.

ఏష దోషోఽభిమానేన పురా ప్రాప్తో యయాతినా,
నిర్బన్ధతాతిమాత్రం చ గాలవేన మహీపతే. 19

రాజా! దుర్యోధనా! నేనింతవాడనని మిడిసిపడి యయాతి అట్టి పాటు పడెను. హద్దుమీరిన మొండిపట్టుదలతో గాలవుడు పడరానిపాట్లు పడెను.

శ్రోతవ్యం హితకామానాం సుహృదాం హిత మిచ్ఛతామ్,
న కర్తవ్యో హి నిర్బన్ధో నిర్బన్ధో హి క్షయోదయః. 20

తన మేలుకోరు మిత్రుల మాట వినవలయును. పట్టుదల పనికిరాదు. అది నాశనమునకు మొదటిమెట్టు.

తస్మాత్త్వమపి గాన్ధారే మానం క్రోధం చ వర్జయ,
సన్ధత్స్వ పాణ్డవై ర్వీర సంరంభం త్యజ పార్థివ. 21

కావున గాంధారీకుమారా! నీవును మిడిసిపాటును, క్రోధమును తొలగించుకొనుము. పాండవులతో కలసి బ్రదుకుము. మొండిపట్టు విడనాడుము.

[స భవాన్ సుహృదాం పథ్యం వచో గృహ్ణాతు మానృతమ్,
సమర్థై ర్విగ్రహం కృత్వా విషమస్థో భవిష్యసి.

అట్టి నీవు మంచిమనసుగలవారి హితమగు మాటనే పట్టుకొనవలయును. ఇచ్చకములను కాదు. సమర్థులతో కయ్యము పెట్టుకొని ప్రమాదముం పాలగుదువు.]

దదాతి యత్ పార్థివ యత్ కరోతి
యద్వా తప స్తప్యతి యజ్జుహోతి,
న తస్య నాశోఽస్తి న చాపకర్షో
నాన్య స్తదశ్నాతి స ఏవ కర్తా. 22

22. దదాతి... పాపిష్ఠుడవై నీవు చేయు పాపముల ఫలమంతటిని నీవే యనుభవింపవలయును. దానిని పంచుకొనుటకు నీకు ప్రస్తుతము వంతపాట పాడుచున్న తమ్ములు గాని, ఎగద్రోయుచున్న కర్ణాదులు కాని రారు. కావున బాగుగా ఆలోచించి ఒక నిర్ణయమునకు రమ్మని హెచ్చరిక చేయు దృష్టితో నారదుండా రీ శ్లోకము చెప్పుచున్నారు.

రాజా! నరుడు ఏది ఇచ్చునో, ఏది చేయునో, ఏ తప మాచరించునో, ఏ హోమము చేయునో దానికి బావులేదు. అవి తరిగియు పోదు మరియు దాని ఫలమును చేసినవాడే అనుభవించును, మరియొకడు కాదు.

ఇదం మహాఖ్యాన మనుత్తమం హితం
బహుశ్రుతానాం గతరోషరాగిణామ్,
సమీక్ష్య లోకే బహుధా ప్రధారితం
త్రివర్గదృష్టిః పృథివీ ముపాశ్నుతే. 23

ఈ గొప్పకథ మిక్కిలి శ్రేష్ఠమైనది. మేలు కూర్చునది. గొప్పశాస్త్రజ్ఞానము వివేకము కలవారికి సంబంధించినది. లోకమునందలి పెక్కుశాస్త్రప్రమాణములు మున్నగువానితో నిగ్గు తేలినది. దీనితో ధర్మ, అర్థ, కామముల స్వరూపమును దర్శించువానికి భూమియంతయు అనుభవమునకు వచ్చును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాలవచరితే త్రయోవింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాలవచరితమున నూటయిరువదిమూడవ అధ్యాయము.

—: ౦ :—

23. బహుధా - అనేకశాస్త్రముల ఉపపత్తులతో; ప్రధారితమ్ - నిశ్చయింప బడినది; గతరోషరాగిణామ్ - రోషము, రాగము నశించినవారి; బహుశ్రుతానామ్ - పెక్కువిద్యలు నేర్చినవారి;

# చతుర్వింశత్యధికశతతమోఽధ్యాయః
# నూటయిరువదినాలుగవ అధ్యాయము

**ధృతరాష్ట్రానురోధేన భగవతా శ్రీకృష్ణేన దుర్యోధనస్య ప్రబోధనమ్.**
**ధృతరాష్ట్రుని మాటపై శ్రీకృష్ణభగవానుడు దుర్యోధనునకు బోధచేయుట.**

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

భగవన్నేవమేవైత ద్యథా వదసి నారద,
ఇచ్ఛామి చాహమప్యేవం నత్వీశో భగవన్నహమ్. 1

భగవానుడా! నారదా! నీవు పలికిన దంతయు సత్యము. నేనును దానినే కోరుదును. కాని నేను సమర్థుడను కాను.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవముక్త్వా తతః కృష్ణ మభ్యభాషత కౌరవః,
స్వర్గ్యం లోక్యం చ మామాత్థ ధర్మ్యం న్యాయ్యం చ కేశవ. 2

కురురా జిట్లు పలికి పిమ్మట కృష్ణునితో ఇట్లాడెను. "కేశవా! స్వర్గమును, లోకమును, ధర్మమును, న్యాయమును సాధించు పలుకు నన్నుగూర్చి పలికితివి.

[న మంస్యన్తే దురాత్మానః పుత్రా మమ జనార్దన.
జనార్దనా! పాడుబుద్ధిగల నా కొడుకులు నన్ను మన్నింపరు]

న త్వహం స్వవశస్తాత క్రియమాణం న మే ప్రియమ్,
అఙ్గ దుర్యోధనం కృష్ణ మన్దం శాస్త్రాతిగం మమ, 3
అనునేతుం మహాబాహో యతస్వ పురుషోత్తమ.

నేను అదుపులో లేకున్నాను. జరుగుచున్న పనులు నాకు రుచింపవు. 'కృష్ణా! పురుషోత్తమా! మహాబాహూ! ఈ దుర్యోధనుడు తెలివిలేనివాడు. నా మాటను ధిక్కరించును. వీనిని చక్కదిద్దుటకు నీవు ప్రయత్నింపుము".

న శృణోతి మహాబాహో వచనం సాధుభాషితమ్, 4
గాన్ధార్యాశ్చ హృషీకేశ విదురస్య చ ధీమతః,
అన్యేషాం చైవ సుహృదాం భీష్మాదీనాం హితైషిణామ్. 5

"తల్లి గాంధారియు, బుద్ధిమంతుడు విదురుడును, మేలుకోరు మంచిమనసు గల భీష్ముడు మొదలగువారును బోధించు చక్కని మాటను వీడు వినకున్నాడు."

స త్వం పాపమతిం క్రూరం పాపచిత్త మచేతనమ్,
అనుశాధి దురాత్మానం స్వయం దుర్యోధనం నృపమ్. 6

"పాపబుద్ధి, క్రూరుడు, కుమ్మబోతు, మొండిపట్టుగలవాడు, చెడ్డ తలపులు గలవాడు, రాజునగు ఈ దుర్యోధనుని నీవే శాసింపుము.

తతోఽభ్యావృత్య వార్ష్ణేయో దుర్యోధన మమర్షణమ్,
అబ్రవీ న్మధురాం వాచం సర్వధర్మార్థతత్త్వవిత్. 7

అంత సర్వధర్మముల తత్త్వ మెరిగిన శ్రీకృష్ణుడు సహన మింతయు లేని దుర్యోధనుని చూచి మరల మరల తీయనిపలుకులతో ఇట్లాడెను.

దుర్యోధన నిబోధేదం మద్వాక్యం కురుసత్తమ,
శర్మార్థం తే విశేషేణ సానుబన్ధస్య భారత. 8

దుర్యోధనా! కురుసత్తమా! భారతా! ముఖ్యముగా నీకును నీవారికిని సుఖము కూర్చు ఈ నా మాటను చక్కగా తెలిసికొనుము.

మహాప్రజ్ఞ కులే జాతః సాధ్వేతత్ కర్తు మర్హసి,
శ్రుతవృత్తోపసంపన్నః సర్వైః సముదితో గుణైః. 9

"గొప్ప తెలివిగలవాడా! గొప్ప కులమున పుట్టితివి. చదువు, నడవడి నిండుగా గలవాడవు. మంచి గుణము లన్నియు సంపాదించితివి."

దౌష్కులేయా దురాత్మానో నృశంసా నిరపత్రపాః,
త ఏతదీదృశం కుర్యు ర్యథా త్వం తాత మన్యసే. 10

"పాడుకులమున పుట్టినవారు, దుష్టబుద్ధులు, క్రూరులు, పాడుపనులకు సిగ్గుపడనివారు నీవు భావించు నిట్టి చెడ్డపనులు చేయుదురు."

---

7. అభ్యావృత్య - మరల మరల.
10. దౌష్కులేయాః - చెడుకులమున పుట్టినవారు; నిరపత్రపాః - చెడ్డపనులు చేయుటకు సిగ్గుపడనివారు.

ధర్మార్థయుక్తా లోకేఽస్మిన్ ప్రవృత్తి ర్లక్ష్యతే సతామ్,
అసతాం విపరీతా తు లక్ష్యతే భరతర్షభ. 11

భరతశ్రేష్ఠుడా! ఈ లోకమున సజ్జనులయందు ధర్మమును, అర్థమును పండించు నడవడి కానవచ్చుచున్నది. దుష్టులలో దానికి విరుద్ధమగు వర్తనము తోచుచున్నది.

విపరీతా త్వియం వృత్తి రసకృ ల్లక్ష్యతే త్వయి. 12

ఇట్టి విపరీతధోరణి నీయందు మాటిమాటికి కానవచ్చుచున్నది.

అధర్మ శ్చానుబన్ధోఽత్ర ఘోరః ప్రాణహరో మహాన్,
అనిష్ట శ్చానిమిత్తశ్చ న చ శక్యశ్చ భారత. 13

‘ఇట్టి ధోరణి వెంటిపెట్టుకొని మహాఘోరము, ప్రాణములు తీయునది యగు అధర్మము నీకు సిద్ధించును అది కోరరానిది. కారణము లేనిది. వచ్చిన పిదప నీవేమియు చేయజాలనిది.”

తమనర్థం పరిహర న్నాత్మశ్రేయః కరిష్యసి,
భ్రాతౄణా మథ భృత్యానాం మిత్రాణాం చ పరంతప, 14
అధర్మ్యా దయశస్యాచ్చ కర్మణ స్త్వం ప్రమోక్ష్యసే.

“ఆ కీడు తొలగించుకొని నీవు, నీ తమ్ములకు, నీ బంటులకు మిత్రులకు మేలు చేయుదువేని, అధర్మమును, అపకీర్తిని కూర్చు చేష్టనుండి బయట పడుదువు.”

ప్రాజ్ఞైః శూరై ర్మహోత్సాహై రాత్మవద్భి ర్బహుశ్రుతైః,
సంధత్స్వ పురుషవ్యాఘ్ర పాణ్డవై ర్భరతర్షభ. 15

‘పాండుకుమారులు దొడ్డబుద్ధి గలవారు, శూరులు, మిన్నుముట్టిన ఉత్సాహము గలవారు, గొప్ప దేహబలము, మనోబలము గలవారు, చక్కని శాస్త్రజ్ఞానము గలవారు. వారితో సంధి చేసికొనుము.

తద్ధితం చ ప్రియం చైవ ధృతరాష్ట్రస్య ధీమతః,
పితామహస్య ద్రోణస్య విదురస్య మహామతేః. 16

కృపస్య సోమదత్తస్య బాహ్లీకస్య చ ధీమతః,
అశ్వత్థామ్నో వికర్ణస్య సంజయస్య వివింశతేః. 17
జ్ఞాతీనాం చైవ భూయిష్ఠం మిత్రాణాం చ పరంతప. 18

అని బుద్ధిశాలియగు ధృతరాష్ట్రునకు, తాతకు, ద్రోణునకు, దొడ్డబుద్ధిగల విదురునకు, కృపునకు, సోమదత్తునకు, బాహ్లీకునకు, అశ్వత్థామకు, వికర్ణునకు, సంజయునకు, వివింశతికి మరియు నీ కులమువారికి మిత్రులకు మేలైనది. ప్రియమైనది.

శమే శర్మ భవేత్తాత సర్వస్య జగత స్తథా,
హ్రీమానసి కులే జాతః శ్రుతవా ననృశంసవాన్,
తిష్ఠ తాత పితుః శాస్త్రే మాతుశ్చ భరతర్షభ. 19

"నాయనా! శాంతి పొందినచో మొత్తము జగత్తునకు సుఖము చేకూరును. పాడుపనులకు సిగ్గు పడవలసినవాడవు. మంచికులమున పుట్టినవాడవు. చదువుకొన్నవాడవు. మెత్తనివాడవు. నాయనా! తలిదండ్రుల శాసనమున నిలువుము".

ఏతచ్ఛ్రేయో హి మన్యన్తే పితా యచ్ఛాస్తి భారత,
ఉత్తమాపద్గతః సర్వః పితుః స్మరతి శాసనమ్. 20

"తండ్రి చెప్పిన దానిని వినుట మేలు కూర్చునని లోకులు భావింతురు. పెద్ద ఆపద నొందిన ఎల్లవాడును తండ్రి శాసనమును స్మరించును".

రోచతే తే పితుస్తాత పాణ్డవైః సహ సఙ్గమః,
సామాత్యస్య కురుశ్రేష్ఠ తత్తుభ్యం తాత రోచతామ్. 21

బాబూ! మంత్రులతోపాటు మీ నాయనకు పాండుకుమారులతో సంధి పొందుట రుచించుచున్నది. కురుశ్రేష్ఠా! అది నీకును రుచించుగాక!

శ్రుత్వా యః సుహృదాం శాస్త్రం మర్త్యో న ప్రతిపద్యతే,
విపాకాన్తే దహత్యేనం కింపాక మివ భక్షితమ్. 22

---

19. శాస్త్రే - శాసనమునందు;
22. కింపాకమ్ - చేదుదొండ, విపాకాన్తే - కడుపున జీర్ణమైన పిదప- 'కిమ్పాకః స్యాన్మహాకాలః ఓష్ఠీ బిమ్బీ చ తుణ్డికా' అని హలాయుధనిఘంటువు. మహాకాలఫలము.

మిత్రులు ఉపదేశించినదానిని విని పట్టించుకొనని వానిని, ఆ శాస్త్రోపదేశమే తిన్న మహాకాలసర్పము జీర్ణమైన పిడప కాల్చినట్లు కాల్చివేయును.

యస్తు నిఃశ్రేయసం వాక్యం మోహాన్న ప్రతిపద్యతే,
స దీర్ఘసూత్రో హీనార్థః పశ్చాత్తాపేన యుజ్యతే. 23

శుభమైన మాట వినియు, అజ్ఞానమువలన దానిని పాటింపనివాడు, త్వరగా ఒక నిశ్చయమునకు రాజాలనివాడు ప్రయోజనము చెడినవాడై పశ్చాత్తాపము నొందును.

యస్తు నిఃశ్రేయసం శ్రుత్వా ప్రాక్ తదేవాభిపద్యతే,
ఆత్మనో మత ముత్సృజ్య స లోకే సుఖ మేధతే. 24

"శుభమైన మాట విని తన పట్టుదల వదలి ముందే దానిని పాటించువాడు లోకమున సుఖమును పెంపొందించుకొనును".

యోఽర్థకామస్య వచనం ప్రాతికూల్యా న్న మృష్యతే,
శృణోతి ప్రతికూలాని ద్విషతాం వశమేతి సః. 25

"తన పని సాధించువాని మాటను పెడసరితనముతో సహింపక విరుద్ధములను వినువాడు శత్రువులకు వశమై పోవును.

సతాం మత మతిక్రమ్య యోఽసతాం వర్తతే మతే,
శోచన్తే వ్యసనే తస్య సుహృదో నచిరాదివ. 26

మంచివారి భావము మన్నింపక చెడ్డవారి యిష్టమును బట్టి మెలగువాడు, త్వరలోనే ఆపదలో చిక్కుకొనును. అప్పుడు వాని సఖు లందరు దుఃఖింతురు.

ముఖ్యా నమాత్యా నుత్సృజ్య యో నిహీనా న్నిషేవతే,
స ఘోర మాపదం ప్రాప్య నోత్తార మధిగచ్ఛతి. 27

---

23. నిఃశ్రేయసమ్ - శుభము కూర్చుదానిని; దీర్ఘసూత్రః - త్వరగా ఒక నిశ్చయమునకు రాజాలక ఆలోచించుచు నుండువాడు; హీనార్థః - చెడిన ప్రయోజనము కలవాడు.

25. అర్థకామస్య - కోరిన పని సాధించువాని;

26. ఉత్తారమ్ - దాటించు వానిని;

ముఖ్యులైన దగ్గర బంధువులను విడచి నీచులను చేపట్టువాడు ఘోరమగు ఆపదను పొంది బయటపడు దారి కానడు.

యోఽసత్సేవీ వృథాచారో న శ్రోతా సుహృదాం సతామ్,
వరాన్ వృణీతే స్వాన్ ద్వేష్టి తం గౌస్త్యజతి భారత. 28

"నీచులను సేవించువాడు, వ్యర్థమగు పనులు చేయువాడు, మంచిస్వభావము గల హితుల మాట విననివాడు, పరులను దరిజేర్చుకొని తనవారిని ద్వేషించువాడు అగు నరుని భూమి త్రోసిపారవేయును."

స త్వం విరుధ్య తై ర్వీరై రన్యేభ్య స్త్రాణ మిచ్ఛసి,
అశిష్టేభ్యోఽసమర్థేభ్యో మూఢేభ్యో భరతర్షభ. 29

అట్టి నీవు వీరులగు పాండవులతో పగగొని నీచులు, చేతకానివారు, మూఢులు నగు ఇతరులతో రక్షణము పొందగోరుచున్నావు.

కో హి శక్రసమాన్ జ్ఞాతీ నతిక్రమ్య మహారథాన్,
అన్యేభ్య స్త్రాణ మాశంసే త్త్వదన్యో భువి మానవః. 30

ఇంద్రునికి ఈడైనవారు, మహారథులు అగు తన కులమువారిని వదలి నీవు కాక మరి యెవ్వడైన మానవుడు ఇతరులవలన రక్షణము సంభావించునా ?

జన్మప్రభృతి కౌన్తేయా నిత్యం వినికృతా స్త్వయా,
న చ తే జాతు కుప్యన్తి ధర్మాత్మానో హి పాణ్డవాః. 31

పుట్టినది మొదలుకొని ప్రతిదినము నీవు కుంతికొడుకులకు కీడు చేసితివి. అయినను వారు నీయందలుగరు. పాండవులు ధర్మాత్ములు గదా !

మిథ్యోపచరితా స్తాత జన్మప్రభృతి బాన్ధవాః,
త్వయి సమ్య జ్మహాబాహో ప్రతిపన్నా యశస్వినః. 32

"పుట్టినది మొదలు చుట్టములయిన వారిని నీచపు పనులతో మోసగించితివి. అయినను కీర్తికాములగు ఆ పాండవులు నీయందు మంచితనమునే నిలుపగోరుచున్నారు".

---

32. మిథ్యా ఉపచరితాః - మోసగింపబడిరి;

త్వయాఽపి ప్రతిపత్తవ్యం తథైవ భరతర్షభ,
స్వేషు బన్ధుషు ముఖ్యేషు మా మన్యువశ మన్వగాః. 33

"భరతశ్రేష్ఠా! నీవును అట్లే వారితో సఖ్యము పొందవలయును. వారు నీవారు, దగ్గర చుట్టములు. వారి విషయమున కోపమునకు వశము గాకుము.

త్రివర్గయుక్తః ప్రాజ్ఞానా మారంభో భరతర్షభ,
ధర్మార్థా వనురుధ్యన్తే త్రివర్గాసంభవే నరాః. 34

చక్కని తెలివిగలవారి ప్రయత్నము ధర్మము, అర్థము, కామము అను మూడింటి సముదాయముతో కలసియుండును. ఒకవేళ మూడును కలసిరానిచో నరులు ధర్మమును, అర్థమును, అయిన అనుసరింతురు.

పృథక్చ వినివిష్టానాం ధర్మం ధీరోఽనురుధ్యతే,
మధ్యమోఽర్థం కలిం బాలః కామమే వానురుధ్యతే. 35

ఆ మూడింటిని వేరువేరుగా గ్రహించువారిలో ధీరుడు ధర్మమును, మధ్యముడు కలహమునకు కారణమైన అర్థమును, బాలుడు కామమును అనుసరింతురు.

ఇన్ద్రియైః ప్రాకృతో లోభా ద్ధర్మం విప్రజహాతి యః,
కామార్థా వనుపాయేన లిప్సమానో వినశ్యతి. 36

ఇంద్రియములకు లోబడిన సంస్కారము లేని మానవుడు లోభమువలన ధర్మమును వదలివైచి నీచమగు ఉపాయములతో కామమును, అర్థమును పొంద గోరుచున్నవాడై నశించుచున్నాడు.

కామార్థౌ లిప్సమానస్తు ధర్మమే వాదిత శ్చరేత్,
న హి ధర్మా దపైత్యర్థః కామో వాఽపి కదాచన. 37

కామమును, అర్థమును పొందగోరువాడు మొట్టమొదట ధర్మమునే సాధింపవలయును. అర్థము, కామము ఎన్నటికిని ధర్మమును వదలి యుండ జాలవు.

---

35. అర్థం కలిమ్ - కలహమునకు కారణమగు అర్థమును.
36. లిప్సమానః - పొందగోరుచు; అనుపాయేన - నీచమగు ఉపాయముచేత;

ఉపాయం ధర్మమే వాహు స్త్రివర్గస్య విశామ్పతే,
లిప్యమానో హి తేనాశు కక్షేఽగ్ని రివ వర్ధతే. 38

ధర్మార్థకామముల సముదాయమునకు సరియగు ఉపాయము ధర్మమే అని పెద్దలు చెప్పుదురు. అది అంటినవాడు వెనువెంటనే, పొదలో రగుల్కొను అగ్నివలె, వృద్ధిపొందును.

స త్వం తాతానుపాయేన లిప్ససే భరతర్షభ,
అధిరాజ్యం మహద్దీప్తం ప్రథితం సర్వరాజసు. 39

నాయనా! గొప్పది, ప్రకాశించుచున్నది, రాజులందరు గొప్పగా చెప్పుకొను నట్టిది యగు సామ్రాజ్యమును నీవు నీచమగు ఉపాయముతో పొందగోరుచున్నావు.

ఆత్మానం తక్షతి హ్యేష వనం పరశునా యథా,
యః సమ్యగ్ వర్తమానేషు మిథ్యా రాజన్ ప్రవర్తతే. 40

వారి మానమున వారు చక్కగా బ్రదుకుచున్న వారియందు మోసముతో ప్రవర్తించువాడు, గొడ్డలి అడవిని నరికిన విధముగా, తన్ను తానే నరకు కొనును.

న తస్య హి మతిం ఛిన్ద్యా ద్యస్య నేచ్ఛేత్ పరాభవమ్,
అవిచ్ఛిన్నమతే రస్య కల్యాణే ధీయతే మతిః.

పరాభవము చేయరానివాని బుద్ధిని పాడు చేయరాదు. ముక్కలుగాని హృదయము గలవాని బుద్ధి శుభమైన దానియందే నిలిచియుండును.

ఆత్మవా న్నావమన్యేత త్రిషు లోకేషు భారత,
అప్యన్యం ప్రాకృతం కిఞ్చిత్ కిము తాన్ పాణ్డవర్షభాన్. 41

బుద్ధిగలవాడు మూడు లోకములందలి మిక్కిలి సాధారణమైన దానిని కూడ తేలికగా చూడరాదు. ఇక శ్రేష్ఠులగు ఆ పాండవులను గూర్చి చెప్పనేల?

---

40. ఛిన్ద్యాత్ - లోభము మొదలగు నీచ గుణములతో పాడు చేయరాదు.

అమర్షవశ మాపన్నో న కిఞ్చి ద్బుధ్యతే జనః,
ఛిద్యతే హ్యాతతం సర్వం ప్రమాణం పశ్య భారత. 42

అసూయకు లోబడిన జనుడు ఏమియు తెలిసికొనడు. అందరు ఎంతో ఆదరించిన శాస్త్రాదుల ప్రమాణమును వాడు కొట్టి పారవేయును, చూడు!

శ్రేయస్తే దుర్జనా త్తాత పాణ్డవైః సహ సఙ్గతమ్,
తైర్హి సంప్రీయమాణ స్త్వం సర్వాన్ కామా నవాప్స్యసి. 43

బాబూ! దుర్జనులను వదలి పాండవులతో కలిసి బ్రతుకుట నీకు మేలైనది. వారితోకూడి మిక్కిలి తృప్తినందు నీవు కోరిన కోర్కెల నన్నింటిని పొందుదువు.

పాణ్డవై ర్నిర్మితాం భూమిం భుఞ్జానో రాజసత్తమ,
పాణ్డవాన్ పృష్ఠతః కృత్వా త్రాణ మాశంససేఽన్యతః. 44

పాండవులు కష్టపడి సంపాదించిన భూమిని అనుభవించుచు, వారిని వెనుకకు నెట్టి ఇతరులవలన రక్షణ కోరుచున్నావు.

దుశ్శాసనే దుర్విషహే కర్ణే చాపి ససౌబలే,
ఏతే ష్వైశ్వర్య మాధాయ భూతి మిచ్ఛసి భారత. 45

దుశ్శాసనుడు, దుర్విషహుడు, కర్ణుడు, శకుని - వీరియందు నీ సంపద నంతయు నిలిపి నీవు మేలొందగోరుచున్నావు.

న చైతే తవ పర్యాప్తా జ్ఞానే ధర్మార్థయో స్తథా,
విక్రమే చాప్యపర్యాప్తాః పాణ్డవాన్ ప్రతి భారత. 46

నీకు మంచి చెప్పుటకు గాని, ధర్మమును, అర్థమును సాధించుటకు గాని వీరు సమర్థులు కారు. పాండవుల నెదుర్కొని లావు చూపుటకును వీరు చాలరు.

న హీమే సర్వరాజానః పర్యాప్తాః సహితా స్త్వయా,
క్రుద్ధస్య భీమసేనస్య ప్రేక్షితుం ముఖ మాహవే. 47

---

42. ఆతతమ్ - అంతట వ్యాపించిన - అందరు మన్నించిన అని భావము. ప్రమాణమ్ - లోకమున వేదమున ప్రసిద్ధమైన జ్ఞానసాధనము; ఛిద్యతే- ముక్కలు చేయబడును. ప్రమాణ మార్గమునుండి వాడు సర్వవిధముల జారి పోవునని భావము.

43. దుర్జనాత్-నిన్నంటియున్న దుర్జనవర్గమును వదలి; పాణ్డవైః-పాండవులతో; సంగతమ్-కూడియుండుట; శ్రేయః-మేలైనది.

44. నిర్మితామ్ - రాజుల నందరను గెలిచి వశపరచుకొన్నదానిని.

నీతో కలసివచ్చిన ఈ రాజులందరు యుద్ధమున క్రోధము తాల్చిన భీమసేనుని ముఖమును చూచుటకైన సమర్థులు కారు.

ఇదం సంనిహితం తాత సమగ్రం పార్థివం బలమ్, 48
అయం భీష్మ స్తథా ద్రోణః కర్ణశ్చాయం తథా కృపః,
భూరిశ్రవాః సౌమదత్తి రశ్వత్థామా జయద్రథః. 49

నాయనా! ఇదిగో రాజు లందరి బలము నిండుగా నిచటనే కూడియున్నది. ఇదిగో భీష్ముడు. అదిగో ద్రోణుడు. ఈయన కర్ణుడు. ఆయన కృపుడు. అట్లే భూరిశ్రవుడు. బాహ్లికుడు, అశ్వత్థామ, సైంధవుడు - అందరు ఇక్కడనే యున్నారు.

అశక్తాః సర్వ ఏవైతే ప్రతియోద్ధుం ధనఞ్జయమ్,
అజేయో హ్యర్జునః సంఖ్యే సర్వైరపి సురాసురైః,
మానుషైరపి గన్ధర్వై ర్మా యుద్ధే చేత అధిథాః. 50

వీరందరు అర్జును నెదుర్కొనుటకు సమర్థులు కారు. యుద్ధమున, సర్వ దేవతలకు, దానవులకు, మనుష్యులకు, గంధర్వులకు-గెలువరానివాడు. కావున యుద్ధమున మనస్సు నిలుపకుము.

దృశ్యతాం వా పుమాన్ కశ్చిత్ సమగ్రే పార్థివే బలే,
యోఽర్జునం సమరే ప్రాప్య స్వస్తిమా న్వ్రజేద్ గృహాన్. 51

ఈ నిండైన రాజుల బలములో అర్జునుని యుద్ధమున నెదుర్కొని సుఖముగా ఇంటికి తిరిగి రాగల మగవాని నొక్కని చూపుము.

కిం తే జనక్షయేణేహ కృతేన భరతర్షభ,
యస్మిఞ్జితే జితం తత్ స్యాత్ పుమానేకః స దృశ్యతామ్. 52

భరతశ్రేష్ఠా! నీవు ఊరక ఇంత జనమును చంపుకొననేల? ఎవనిని గెలిచిన నీకు జయము కలుగునో అట్టి అర్జునుని గెలుచు మగవాని నొక్కనిని చూపు.

52. యస్మిన్-ఏ అర్జునుడు; జితే-గెలువబడగా; తే-నీకు; జితమ్-జయము; స్యాత్-ఆగునో-సః-అట్లు అర్జునుని గెలుచు; పుమాన్-పురుషుడు; ఏకః-ఒక్కడు; దృశ్యతామ్-కానవచ్చుగాక.

యః స దేవాన్ సగన్ధర్వాన్ సయక్షాసురపన్నగాన్,
అజయత్ ఖాణ్డవప్రస్థే కస్తం యుధ్యేత మానవః. 53

ఆ అర్జునుడు ఖాండవము దాడిలో దేవతలను, గంధర్వులను, యక్షులను, రక్షస్సులను, నాగులను అందరను గెలిచెను. వానితో పోరు మానవు డెవ్వడు?

తథా విరాటనగరే శ్రూయతే మహదద్భుతమ్,
ఏకస్య చ బహూనాం చ పర్యాప్తం తన్నిదర్శనమ్. 54

అట్లే విరాటనగరమున ఆ ఒక్కనితో చాలమందికి గొప్ప అబ్బురము జరిగెనని వినవచ్చుచున్నది. ఆ నిదర్శనము చాలును.

యుద్ధే యేన మహాదేవః సాక్షాత్ సంతోషితః శివః,
తమజేయ మనాధృష్యం విజేతుం జిష్ణు మచ్యుతమ్,
ఆశంససీహ సమరే వీరమర్జున మార్జితమ్. 55

ఎవడు యుద్ధమున సాక్షాత్తు మహాదేవుడగు శివునే సంతోషపెట్టెనో అట్టి ఎవ్వరికిని గెలువరాని, లొంగదీసికొనరాని జయశీలిని, జారుపాటులేనివానిని మహాబలవంతుని వీరుని అర్జునుని పోరున గెలువ నుంకించుచున్నావు.

మద్ద్వితీయం పునః పార్థం కః ప్రార్థయితు మర్హతి,
యుద్ధే ప్రతీప మాయాన్త మపి సాక్షాత్ పురన్దరః. 56

నేను తోడై యుద్ధమున నెదురుగా వచ్చుచున్న అర్జునునితో సాక్షాత్తు దేవేంద్రుడే అయినను, పోరగోరునా?

బాహుభ్యా ముద్వహే ద్భూమిం దహేత్ క్రుద్ధ ఇమాః ప్రజాః,
పాతయే త్త్రిదివా ద్దేవాన్ యోఽర్జునం సమరే జయేత్. 57

యుద్ధమున అర్జునుని గెలుచువాడు చేతులతో భూమిని పెల్లగించును. కోపించి ప్రజల సంహరను మాన్చివేయును. స్వర్గమునుండి దేవతల నందరను పడద్రోయును.

పశ్య పుత్రాం స్తథా భ్రాతౄన్ జ్ఞాతీన్ సంబన్ధిన స్తథా,
త్వత్కృతే న వినశ్యేయు రిమే భరతసత్తమాః. 58

చూడు. ఇటనున్న వారందరు నీకు సహోదరులు, తమ్ములు, దగ్గరచుట్టములు మరియు నీతో ఏదో సంబంధము గలవారు భరతవంశమున పుట్టిన ఈ గొప్ప వారందరు నీకై చావకుందురు గాక!

అస్తు శేషం కౌరవాణాం మా పరాభూ దిదం కులమ్,
కులఘ్న ఇతి నోచ్యేథా నష్టకీర్తి ర్నరాధిప. 59

కౌరవులు మిగిలియుందురు గాక ! కులము రూపుమాసి పోకుండుగాక ! నిన్ను కులనాశకుడని అనకుందురు గాక : నీ కీర్తి నశింపకుండుచు గాక !

త్వామేవ స్థాపయిష్యన్తి యౌవరాజ్యే మహారథాః,
మహారాజ్యేఽపి పితరం ధృతరాష్ట్రం జనేశ్వరమ్. 60

మహారథులైన పాండవులు నిన్నే యువరాజపదమున నెలకొల్పుదురు. అట్లే నీ తండ్రియగు ధృతరాష్ట్రునే మహారాజ్యమున ప్రభువుగా నిల్పుదురు.

మా తాత శ్రియ మాయాన్తీ మవమంస్థాః సముద్యతామ్,
అర్ధం ప్రదాయ పార్థేభ్యో మహతీం శ్రియ మాప్నుహి. 61

బాబూ ! ప్రీతితో లేచి నీవైపు వచ్చుచున్న సిరిని చీదరింపకుము. కుంతి కొడుకులకు సగము రాజ్య మిమ్ము. నీవు మహాసంపద ననుభవింపుము.

పాణ్డవైః సంశమం కృత్వా కృత్వా చ సుహృదాం వచః,
సంప్రీయమాణో మిత్రైశ్చ చిరం భద్రా ణ్యవాప్స్యసి.

పాండవులతో శాంతి పొంది, మంచి మనసుగల వారిమాట మన్నించి, మిత్రులతో సుఖ మనుభవించుచు చిరకాలము భద్రములు పొందగలవు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భగవద్వాక్యే చతుర్వింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భగవద్వాక్యముగల నూటయిరువదినాలుగవ అధ్యాయము.

—: o :—

## పఞ్చవింశత్యధికశతతమోఽధ్యాయః
## నూటయిరువదియైదవ అధ్యాయము

### భీష్మద్రోణవిదుర ధృతరాష్ట్రికర్తృకం దుర్యోధనప్రబోధనమ్.
### భీష్మద్రోణవిదురధృతరాష్ట్రులు దుర్యోధనునకు చేసిన బోధ.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః శాన్తనవో భీష్మో దుర్యోధన మమర్షణమ్,
కేశవస్య వచః శ్రుత్వా ప్రోవాచ భరతర్షభ. 1

అంత శంతనుకుమారుడు భీష్ముడు శ్రీకృష్ణుని మాట విని చిరాకు పడు చున్న దుర్యోధనునితో ఇట్లు నొక్కి చెప్పెను.

కృష్ణేన వాక్య ముక్తోఽసి సుహృదాం శమ మిచ్ఛతా,
అన్వపద్యస్వ తత్తాత మా మన్యువశ మన్వగాః. 2

నాయనా! తన నెచ్చెలులకందరకు శాంతి కూర్పగోరి శ్రీకృష్ణుడు నీకు ఉపదేశము చేసెను. కోపింపకుము.

అకృత్వా వచనం తాత కేశవస్య మహాత్మనః,
శ్రేయో న జాతు న సుఖం న కల్యాణ మవాప్స్యసి. 3

మహాత్ముడగు కేశవుడు చెప్పినది చేయవేని ఎన్నటికిని శ్రేయమును, సుఖమును, శుభమును పొందజాలవు.

ధర్మ్య మర్థ్యం మహాబాహు రాహ త్వాం తాత కేశవః,
తదర్థ మభిపద్యస్వ మా రాజ న్నీనశః ప్రజాః. 4

ఆ మహాబాహుడు కేశవుడు ధర్మమును, అర్థమును సాధించు మాట నీకు బోధించెను. ఆ విషయమును గ్రహింపుము. ఊరక ప్రజలను చంపు కొనకుము.

---

4. మా నీనశః - నాశనము చేయవలదు.

జ్వలితాం త్వ మిమాం లక్ష్మీం భారతీం సర్వరాజసు,
జీవతో ధృతరాష్ట్రస్య దౌరాత్మ్యా ద్భ్రంశయిష్యసి. 5

రాజులందరిలో మిక్కలి వెలుగొందుచున్న యీ భరతవంశము వారి మహాభాగ్యమును ధృతరాష్ట్రుడు బ్రదికియుండగనే దుష్టబుద్ధివై పాడుచేయు చున్నావు.

ఆత్మానం చ సహామాత్యం స పుత్రభ్రాతృబాన్ధవమ్,
అహ మిత్యనయా బుద్ధ్యా జీవితా ద్భ్రంశయిష్యసి. 6

నిన్ను, నీవారిని, నీ కొడుకులను, తమ్ములను, తక్కిన బంధువులను 'నేను మొనగాడ' నను బుద్ధితో జీవితము నుండి తొలగింపబోవుచున్నావు.

అతిక్రామన్ కేశవస్య తథ్యం వచన మర్థవత్,
పితుశ్చ భరతశ్రేష్ఠ విదురస్య చ ధీమతః, 7
మా కులఘ్నః కుపురుషో దుర్మతిః కాపథం గమః,
మాతరం పితరం చైవ మా మజ్జీః శోకసాగరే. 8

భరత శ్రేష్ఠుడా! కేశవుడు ఉన్నదున్నట్లు ప్రయోజనము కలుగునట్లుగా చెప్పిన మాటను, తండ్రిమాటను, బుద్ధిశాలియగు విదురుని పలుకును పాటింపక దుష్టబుద్ధివి నీచుడవునై, కులనాశకుడవు కాకుము. చెడుత్రోవ పట్టకుము. తల్లిని, తండ్రిని శోకమనెడు సముద్రములో ముంచివేయకుము.

అథ ద్రోణోఽబ్రవీత్తత్ర దుర్యోధన మిదం వచః,
అమర్షవశ మాపన్నం నిఃశ్వసన్తం పునః పునః. 9

తీవ్రమగు కోపముతో కుతకుతలాడిపోవుచు మాటిమాటికి బుసకొట్టు చున్నట్లు నిట్టూర్పులు పుచ్చుచున్న దుర్యోధనునితో ద్రోణాచార్యు డిట్లు పలికెను.

ధర్మార్థయుక్తం వచన మాహ త్వాం తాత కేశవః.
తథా భీష్మః శాన్తనవ స్తజ్జుషస్వ నరాధిప. 10

---

8. మా - మా భూః - కావలదు.
10. జుషస్వ - సంతోషముతో మన్నింపుము.

రాజా! శ్రీకృష్ణుడు నీకు ధర్మమును, అర్థమును కూర్చెడు మాట చెప్పెను. అట్లే శంతనుపుత్రుడు భీష్ముడును పలికెను. దానిని మన్నింపుము.

ప్రాజ్ఞౌ మేధావినౌ దాన్తౌ వర్థకామౌ బహుశ్రుతౌ,
ఆహతు స్త్వాం హితం వాక్యం తజ్జుషస్వ నరాధిప. 11

గొప్ప భావుకులు, ప్రతిభ కలవారు, నిగ్రహశక్తి కలవారు, నీ ప్రయోజనము కోరుచున్నవారు, గొప్ప శాస్త్రజ్ఞానము గలవారు, అట్టి ఆ యిరువురు నీకు హితమైన మాట చెప్పిరి. దానిని మన్నింపుము.

అనుతిష్ఠ మహాప్రాజ్ఞ కృష్ణభీష్మౌ యదూచతుః,
మా వచో లఘుబుద్ధీనాం సమాస్థా స్త్వం పరంతప,
మాధవం బుద్ధిమోహేన మాఽవమంస్థాః పరంతప. 12

కృష్ణభీష్ములు చెప్పినదానిని చేయుము. అల్పబుద్ధులమాటపై నీవు నిలువవలదు. బుద్ధితక్కువతనముతో మాధవుని అవమానింపకుము.

యే త్వాం ప్రోత్సాహయన్త్యేతే నైతే కృత్యాయ కర్హిచిత్,
వైరం పరేషాం గ్రీవాయాం ప్రతిమోక్ష్యన్తి సంయుగే. 13

నిన్నిపుడు ఎగసన్న ద్రోయుచున్న వీరందరు ఎల్లవేళల పనికిమాలినవారు. యుద్ధమున పగతీర్చుపనిని మావంటివారి మెడకు చుట్టి తప్పుకొందురు.

మా జీఘనః ప్రజాః సర్వాః పుత్రాన్ భ్రాతౄం స్తథైవ చ,
వాసుదేవార్జునౌ యత్ర విద్ధ్యజేయా నలం హి తాన్. 14

ప్రజల నందరను చంపుకొనకుము. అట్లే కొడుకులను, తమ్ములను చంపకుము. వాసుదేవుడు అర్జునుడు గల పాండవులు గెలువరానివారని ఎరుగుము.

ఏతచ్చైవ మతం సత్యం సుహృదోః కృష్ణభీష్మయోః,
యది నాదాస్యసే తాత పశ్చాత్తప్స్యసి భారత. 15

---

13. ఏతే - ఈ కర్ణాదులు; పరేషామ్-ఇతరులగు మావంటివారి, గ్రీవాయామ్ - మెడయందు; ప్రతిమోక్ష్యన్తే - చుట్టబెట్టుదురు.

14. మా జీఘనః - చంపకుము; యత్ర - ఎందుండిరో; తాన్ - వారిని; అజేయాన్ - జయింపరానివారినిగా; విద్ధి - ఎరుగుము; అలమ్-చాలును.

ఈ కృష్ణభీష్మలు నీకు కావలసినవారు వారు చెప్పునది సత్యము. దానిని పట్టించుకొనవేని తుదికి పశ్చాత్తాప పడుదువు.

యథోక్తం జామదగ్న్యేన భూయానేష తతోఽర్జునః,
కృష్ణో హి దేవకీపుత్రో దేవైరపి సుదుఃసహః
కిం తే సుఖప్రియేణేహ ప్రోక్తేన భరతర్షభ. 16

పరశురాముడు చెప్పినట్లు అర్జునుడు చాల గొప్పవాడు. దేవకీపుత్రుడగు శ్రీకృష్ణుని దేవతలందరు కూడియు గెలువజాలరు. ఇట్టియెడ నీకు హితము, ప్రియము చెప్పి యేమి లాభము ?

ఏతత్తే సర్వ మాఖ్యాతం యథేచ్ఛసి తథా కురు,
న హి త్వా ముత్సహే వక్తుం భూయో భరతసత్తమ. 17

రాజా! నీకు చెప్పవలసిన దంతయు చెప్పితిని నీ యిష్టము వచ్చినట్లు చేయుము. తిరిగి నీకు ఉపదేశము చేయజాలను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్మిన్ వాక్యాన్తరే వాక్యం క్షత్తాపి విదురోఽబ్రవీత్,
దుర్యోధన మభిప్రేక్ష్య ధార్తరాష్ట్ర మమర్షణమ్. 18

ద్రోణుడు పలికిన తర్వాత కోపముతో చిరచిరలాడుచున్న ధృతరాష్ట్రుని కొడుకు దుర్యోధనుని గాంచి విదురుడును ఇట్లు పలికెను.

దుర్యోధన న శోచామి త్వామహం భరతర్షభ,
ఇమౌ తు వృద్ధౌ శోచామి గాన్ధారీం పితరం చ తే. 19

దుర్యోధనా! నిన్ను గూర్చి కాదయ్యా. ఈ ముదుసలులు గాంధారిని నీ తండ్రిని గూర్చి ఏడ్తును.

యా వనాథౌ చరిష్యేథే త్వయా నాథేన దుర్హృదా,
హతమిత్రౌ హతామాత్యౌ లూనపక్షా విహాణ్డజౌ. 20

---

16. సుఖప్రియేణ - సుఖమ్ - హితమును కూర్చునది; ప్రియమ్ - న్యాయముతో కూడినది కనుక ప్రియమైనది; అట్టి ప్రోక్తేన - మాటచేత; తే - మూఢుడవగు నీకు; కిమ్ - ప్రయోజన మేమి? నీవంటివానికి హితము ప్రియము బోధించుట వ్యర్థమని తాత్పర్యము.

వీరిద్దరు దుష్టులవగు నీవు రక్షింపవలసినవాడవు కాగా మిత్రులు, ఆత్మీయులు చావగా రెక్కలు తెగిన పక్షులవలె భిక్షమెత్తి తిరుగుదురు.

భిక్షుకౌ విచరిష్యేతే శోచన్తౌ పృథివీ మిమామ్,
కులఘ్న మీదృశం పాపం జనయిత్వా కుపూరుషమ్. 21

కులమునకు చిచ్చుపెట్టు నిట్టి పాపాత్ముని నీవని కన్న కారణమున గుండెలు బాదుకొనుచు, బిచ్చమెత్తుకొనుచు భూమిపై తిరుగుదురు.

అథ దుర్యోధనం రాజా ధృతరాష్ట్రోఽభ్యభాషత,
ఆసీనం భ్రాతృభిః సార్ధం రాజభిః పరివారితమ్. 22

పిమ్మట సోదరులతో పాటు తనకిష్టులగు రాజులు చుట్టును కొలిచియున్న దుర్యోధనునితో ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

దుర్యోధన నిబోధేదం శౌరిణోక్తం మహాత్మనా,
ఆదత్స్వ శివమత్యన్తం యోగక్షేమవ దవ్యయమ్. 23

దుర్యోధనా! మహాత్ముడగు శౌరి పలికినదానిని పాటింపుము. అది శుభమును కూర్చునది. మనకు యోగక్షేమములను కూర్చునది. శాశ్వతముగా సుఖమును గూర్చునది.

అనేన హి సహాయేన కృష్ణే నాక్లిష్టకర్మణా,
ఇష్టాన్ సర్వానభిప్రాయాన్ ప్రాప్స్యామః సర్వరాజసు. 24

సుఖముగా సర్వకార్యములు తీర్చు శ్రీకృష్ణుడు తోడైయుండగా కోరిన కోర్కె లన్నింటిని రాజు లందరినుండి పొందగలము.

సుసంహతః కేశవేన తాత గచ్ఛ యుధిష్ఠిరమ్,
చర స్వస్త్యయనం కృత్స్నం భరతానా మనామయమ్. 25

కేశవునితో చక్కగా కలసి యుధిష్ఠిరుని కడ కరుగుము. భరతవంశము వారికి క్షేమము నొసగు సుఖమైన మార్గమును ప్రవర్తింపుము.

---

25. సుసంహతః - గట్టిగా ఒక్కడుగా నై.

వాసుదేవేన తీర్థేన తాత గచ్ఛస్వ సంశమమ్,
కాలప్రాప్త మిదం మన్యే మాం త్వం దుర్యోధనాతిగాః. 26

వాసుదేవునను ఉపాయముతో నాయనా! శాంతి పొందుము. ఇది యీ కాలమునకు తగినదని నా భావము. దుర్యోధనా! దీనిని మీరవలదు.

శమం చేద్యాచమానం త్వం ప్రత్యాఖ్యాస్యసి కేశవమ్,
త్వదర్థ మభిజల్పన్తం న తవాస్త్యపరాభవః. 27

శాంతిని బుజ్జగించి యడుగుచు నీకై మాటిమాటికి పెక్కుపలుకులు పలుకుచున్న శ్రీకృష్ణుని కాదందువేని నీకు జయ మనుమాట కలుగదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీష్మాదివాక్యే పంచవింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీష్మాదులవాక్యము గల నూటయిరువదియైదవ అధ్యాయము.

—: o :—

26. తీర్థేన - దాటించు నుపాయముతో.
27. అపరాభవః - జయము.

# షడ్వింశత్యధికశతతమోఽధ్యాయః

# నూటయిరువదియారవ అధ్యాయము

## భీష్మద్రోణాభ్యాం పునర్దుర్యోధనస్య ప్రబోధనమ్.

## భీష్మద్రోణులు మఱల దుర్యోధనునకు హితము చెప్పుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ధృతరాష్ట్రవచః శ్రుత్వా భీష్మద్రోణౌ సమవ్యథౌ,
దుర్యోధన మిదం వాక్య మూచతుః శాసనాతిగమ్. 1

ధృతరాష్ట్రుని మాట విని భీష్మద్రోణులు ఒక్కవిధముగా మనసున దుఃఖము పొందుచు మాట వినని దుర్యోధనునితో నిట్లు పలికిరి.

యావత్ కృష్ణావసన్నద్ధౌ యావ త్తిష్ఠతి గాణ్డివమ్,
యావద్ధౌమ్యో న మేధాగ్నౌ జుహోతీహ ద్విషద్బలమ్. 2
యావన్న ప్రేక్షతే క్రుద్ధః సేనాం తవ యుధిష్ఠిరః,
హ్రీనిషేవో మహేష్వాస స్తావ చ్ఛామ్యతు వైశసమ్. 3

కృష్ణులు యుద్ధమునకు సిద్ధము కాకమున్నే, గాండీవము నిలిచియున్నపుడే, ధౌమ్యుడు యుద్ధమను అగ్నిలో శత్రువుల సేనను వ్రేల్వక ముందే, సహజముగా మెత్తనివాడు గొప్పధనుఃపండితుడు అగు యుధిష్ఠిరుడు క్రోధము వహించి నీ సేనను చూడక ముందే యీ వైరము అణగుగాక!

---

2. మేధాగ్నౌ - మేధ మనగా యజ్ఞము; యుద్ధము పేర్లన్నియు యజ్ఞము నకును వర్తించునని యాస్కాచార్యులు - 'యాన్యేవ సంగ్రామనామాని తాని యజ్ఞనామాని' - కావున మేధాగ్ని యనగా యుద్ధమనెడు అగ్ని-దానియందు.

3. వైశసమ్ - వైరము.

యావ న్న దృశ్యతే పార్థః స్వేఽప్యనీకే వ్యవస్థితః,
భీమసేనో మహేష్వాస స్తావచ్ఛామ్యతు వైశసమ్. 4

తనసేనయందే నిలద్రొక్కుకొని గొప్ప ధనువుగల భీమసేనుడు కానరాక ముందే ఈ పగ చల్లారుగాక!

యావన్న చరతే మార్గాన్ పృతనా మభిధర్షయన్,
భీమసేనో గదాపాణి స్తావత్ సంశామ్య పాండవైః. 5

మనసేనను తల్లడిల్లజేయుచు గద చేత బట్టిన భీమసేనుడు సేనదారులలో విచ్చలవిడిగా తిరుగక ముందే పాండవులతో శాంతి పొందుము.

యావన్న శాతయ త్యాజౌ శిరాంసి గజయోధినామ్,
గదయా వీరఘాతిన్యా ఫలానీవ వనస్పతేః. 6

యుద్ధమున ఏనుగులపైనుండి పోరు యోధుల తలలను వీరులను పరిమార్చు గదతో, పంటకాలములో చక్కగా పండిన చెట్లనుండి పండ్లను వలె, రాలగొట్టకముందే యీ పగ అణగుగాక!

నకులః సహదేవశ్చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
విరాటశ్చ శిఖండీ చ శైశుపాలిశ్చ దంశితాః. 7

యావ న్న ప్రవిశ న్త్యేతే నక్రా ఇవ మహార్ణవమ్,
కృతాస్త్రాః క్షిప్ర మస్యన్త స్తావచ్ఛామ్యతు వైశసమ్. 8

అస్త్రవిద్యలో ఆరితేరినవారగు నకులుడు, సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, విరాటుడు, శిఖండి, శిశుపాలుని కొడుకగు సహదేవుడు చక్కగా అలంకరించుకొని బాణములు కుప్పలు తెప్పలుగా గుప్పించుచు మొసళ్ళు మహాసముద్రమును చొరబారినట్లు మన సేనలోనికి ప్రవేశింపక ముందే యీ పగ అణగుగాక.

యావన్న సుకుమారేషు శరీరేషు మహీక్షితామ్,
గార్ధ్రపత్రాః పతన్త్యుగ్రా స్తావ చ్ఛామ్యతు వైశసమ్. 9

రాజుల సుకుమారశరీరములయందు మిక్కిలి వాడిగల గ్రద్దరెక్కల బాణములు పడకమున్నే ఈ పగ తీరును గాక!

నోరస్సు యావ ద్యోధానాం మహేష్వాసై ర్మహేషవః,
కృతాస్త్రైః క్షిప్ర మస్యద్భి ర్దూరపాతిభి రాయసాః, 10
అభిలక్ష్యై ర్నిపాత్య న్తే తావచ్ఛామ్యతు వైశసమ్. 11

గొప్ప ధనువులు గలవారు, అస్త్రవిద్యలో ఆరితేరినవారు, వెంట వెంట బాణములను విరజిమ్ముచున్నవారు, చాలదూరమున నున్న గురిని కూడ కొట్టగలవారు నగు వీరులు మన యోధుల రొమ్ములపై ఉక్కుబాణములు గుప్పింపకముందే యీ పగ చల్లారునుగాక!

అభివాదయమానం త్వాం శిరసా రాజకుఞ్జరః,
పాణిభ్యాం ప్రతిగృహ్ణాతు ధర్మరాజో యుధిష్ఠిరః. 12

రాజులలో శ్రేష్ఠుడు, ధర్మరాజు అగు యుధిష్ఠిరుడు శిరస్సుతో మ్రొక్కుచున్న నిన్ను రెండు చేతులతో పట్టి ఎదకు హత్తుకొనుగాక!

ధ్వజాఙ్కుశపతాకాఙ్కం దక్షిణం తే సుదక్షిణః,
స్కన్ధే నిక్షిపతాం బాహుం శాన్తయే భరతర్షభ. 13

మిక్కిలి సమభావము, సామర్థ్యము గల ఆ ధర్మరాజు ధ్వజము, అంకుశము, పతాక అను రేఖలుగల తన కుడిచేతిని, శాంతికొరకు నీ భుజముపై ప్రేమతో నిలుపుగాక!

రత్నౌషధిసమేతేన రత్నాఙ్గులితలేన చ,
ఉపవిష్టస్య పృష్ఠం తే పాణినా పరిమార్జతు. 14

ధర్మరాజు రత్నములు పొదిగిన ఉంగరములు గలదియు, రత్నములవలె ఎఱ్ఱని పైభాగము గలదియు అగు చేతితో కూర్చున్న నీవీపు నిమురుగాక!

---

14. రత్నౌషధిసమేతేన - రత్నములు పొదిగిన ఓషధి లతలవలె వ్రేళ్ళకు చుట్టుకొనును గావున రత్నౌషధి యనగా ఉంగరము. అదిగల, 'రత్నాబన్ధసమేతేన' అను పాఠము మేలైనది. "ఆబన్ధో దృఢబన్ధే స్యాత్ ప్రేమాలంకారయో రపి" అని విశ్వకోశము. ఆబంధ మనగా అలంకారము-రత్నాలంకారములు గల, లేక రత్నములతో ప్రేమతో కూడిన అని అర్థము. రత్నాంగుళితలేన - రత్నమువలె ఎఱ్ఱనైన వ్రేళ్ళ పైభాగములుగల దానిచేత;

శాలస్కన్ధో మహాబాహు స్త్వాం స్వజానో వృకోదరః,
సామ్నాఽభివాదతాం చాపి శాన్తయే భరతర్షభ. 15

సాలవృక్షమువంటి దేహము, పొడవైన బలముగల చేతులు గల వృకోదరుడు నిన్ను కౌగిలించుకొనుచు నీతో ప్రియవాక్యములు పలుకుగాక!

అర్జునేన యమాభ్యాం చ త్రిభి స్తై రభివాదితః,
మూర్ధ్ని తాన్ సముపాఘ్రాయ ప్రేమ్ణాభివద పార్థివ. 16

అర్జునుడు, కవలలు నిన్ను కొనియాడుచుండగా వారి తలలను మూర్కొని ప్రేమతో మంచి మాట లాడుము.

దృష్ట్వా త్వాం పాణ్డవై ర్వీరై ర్భ్రాతృభిః సహ సంగతమ్,
యావదానన్దజాశ్రూణి ప్రముఞ్చన్తు నరాధిపాః. 17

వీరులు, సోదరులు అగు పాండవులతో కలసిపోయిన నిన్ను జూచి రాజు లందరు ఆనందబాష్పములు కురియుదురు గాక!

ఘుష్యతాం రాజధానీషు సర్వసంపన్మహీక్షితామ్,
పృథివీ భ్రాతృభావేన భుజ్యతాం విజ్వరో భవ. 18

రాజులందరి రాజధానులలో పాండవకౌరవుల ప్రీతి ఘోషింపబడుగాక! అన్నదమ్ముల స్నేహముతో ఈ భూమిని మీరు అనుభవింపుడు. నీకు మనోవ్యాధి లేకుండు గాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీష్మద్రోణవాక్యే షడ్వింశత్యధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీష్మద్రోణవాక్యము గల నూటయిరువదియారవ అధ్యాయము.

—: o :—

15. స్వజానః - కౌగిలించుకొనుచున్నవాడై.
18. సర్వసంపత్ - ఒకరియం దొకరికి గల ప్రీతి.

## సప్తవింశత్యధికశతతమోఽధ్యాయః

## నూటయిరువదియేడవ అధ్యాయము

**శ్రీకృష్ణం ప్రతి దుర్యోధనస్యోత్తరం, పాణ్డవేభ్యో రాజ్యం న దదామీతి నిశ్చయప్రకటనమ్.**

**శ్రీకృష్ణునకు దుర్యోధనుడు బదులు చెప్పుట, పాండవులకు రాజ్య మీనని తెగవేసి చెప్పుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

శ్రుత్వా దుర్యోధనో వాక్య మప్రియం కురుసంసది,
ప్రత్యువాచ మహాబాహుం వాసుదేవం యశస్వినమ్. 1

కురుసభలో ప్రియముకాని మాట విని దుర్యోధనుడు కీర్తిశాలియు, మహాబాహువు నగు శ్రీకృష్ణున కిట్లు బదులు పలికెను.

ప్రసమీక్ష్య భవా నేత ద్వక్తు మర్హతి కేశవ,
మామేవ హి విశేషేణ విభాష్య పరిగర్హసే. 2

కేశవా! నీవు అన్నియు బాగుగా పరిశీలించి పలుకవలయును. పెద్దగా నన్నే చెడ్డమాటలు పలికి నిందించుచున్నావు

భక్తివాదేన పార్థానా మకస్మా న్మధుసూదన.
భవాన్ గర్హయతే నిత్యం కిం సమీక్ష్య బలాబలమ్. 3

కుంతి కొడుకుల భక్తిమాటలు పట్టుకొని కారణములేకయే వాదమునందలి బలాబలములు చూడకయే నిత్యము నన్ను నిందింతువు.

భవాన్ క్షత్తా చ రాజా వాఽప్యాచార్యో వా పితామహః,
మామేవ పరిగర్హన్తే నాన్యం కఞ్చన పార్థివమ్. 4

---

2. ప్రసమీక్ష్య - విచారించి; విభాష్య - కఠినముగా పలికి.

నీవు, విదురుడు, రాజు, ద్రోణాచార్యుడు, తాత - మీరందరు, మరి యెవ్వరిని పట్టించుకొనక నన్నే తిట్టుదురు.

న చాహం లక్షయే కఞ్చి ద్వ్యభిచార మిహాత్మనః,
అథ సర్వే భవన్తో మాం విద్విషన్తి సరాజకాః. 5

నేను న్యాయము తప్పిన దేమియు నాయందు నాకు కానవచ్చుట లేదు. కాని మీ రందరురాజులతోపాటు నన్ను కక్కసించుకొనుచున్నారు.

న చాహం కఞ్చి దత్యర్థ మపరాధ మరిన్దమ,
విచిన్తయన్ ప్రపశ్యామి సుసూక్ష్మమపి కేశవ. 6

కేశవా! ఎంత ఆలోచించినను నేను చేసిన తప్పు ఇసుమంతయు నాకు కానరాకున్నది.

ప్రియాభ్యుపగతే ద్యూతే పాణ్డవా మధుసూదన,
జితాః శకునినా రాజ్యం తత్ర కిం మమ దుష్కృతమ్. 7

ప్రీతితో కైకొన్న జూదమున పాండవులు శకునితో రాజ్యమును కోల్పోయిరి. అందు నా పాపమేమి:

యత్పున ర్ద్రవిణం కిఞ్చి త్తత్రాజీయన్త పాణ్డవాః,
తేభ్య ఏవాభ్యనుజ్ఞాతం తత్తదా మధుసూదన. 8

ఇక పాండవులనుండి మేము గెలిచిన ధన మంతయు అప్పుడే అక్కడనే వారి కిచ్చివైచితిమి.

అపరాధో న చాస్మాకం యత్తే హ్యక్షైః పరాజితాః,
అజేయా జయతాం శ్రేష్ఠ పార్థాః ప్రవ్రాజితా వనమ్. 9

వారు పాచికలలో ఓడిపోయిరి. అందు మా తప్పేమియు లేదు. జయశీలురలో శ్రేష్ఠుడవగు కృష్ణా! వారు ఎవ్వరికిని గెలువరానివారు గదా! కావున వనములకు తోలితిమి.

---

5. వ్యభిచారమ్ - న్యాయము తప్పినదానిని;
7. ప్రియ - అభ్యుపగతే - ప్రీతితో ఇష్టపడి గ్రహించిన; ద్యూతే - జూదమున;

కేన వాప్యపవాదేన విరుద్ధ్య న్త్యరిభిః సహ,
అశక్తాః పాణ్డవాః కృష్ణ ప్రహృష్టాః ప్రత్యమిత్రవత్. 10

ఏదో నెపముతో శక్తిలేని ఆ పాండవులు మాపగవారితో గూడి మాతో వైరము పెట్టుకొనుచున్నారు. పగవారివలె పొంగిపోవుచున్నారు.

కి మస్మాభిః కృతం తేషాం కస్మిన్ వా పునరాగసి,
ధార్తరాష్ట్రాన్ జిఘాంస న్తి పాణ్డవాః సృఞ్జయైః సహ. 11

మేము వారికి చేసిన దేమి? ఏ పాపము చూపి పాండవులు సృంజయులతో కలసి ధృతరాష్ట్రుని కొడుకులను చంపగోరుచున్నారు?

న చాపి వయ ముగ్రేణ కర్మణా వచనేన వా,
ప్రభ్రష్టాః ప్రణమా మేహ భయా దపి శతక్రతుమ్. 12

ఏదో ఘోరమగు కార్యముతోడనో, మాటతోడనో మేము నీరుకారిపోయి భయము వలన దేవేంద్రునకైనను మ్రొక్కము.

న చ తం కృష్ణ పశ్యామి క్షత్రధర్మ మనుష్ఠితమ్,
ఉత్సహేత యుధా జేతుం యో నః శత్రునిబర్హణ. 13

మనలో క్షత్రియధర్మమును పాటించువా డెవడైన యుద్ధమున పరులను గెలువ నుత్సహింపనివాడు నాకు కానరాడు. నీవును శత్రువులను పరిమార్చువాడవే గదా!

న హి భీష్మకృపద్రోణాః సకర్ణా మధుసూదన,
దేవైరపి యుధా జేతుం శక్యాః కిముత పాణ్డవైః. 14

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు అనువారిని దేవతలు కూడ యుద్ధమున గెలువజాలరు. పాండవులమాట చెప్పనేల?

స్వధర్మ మనుపశ్యన్తో యది మాధవ సంయుగే,
అస్త్రేణ నిధనం కాలే ప్రాప్స్యామః స్వర్గ్యమేవ తత్. 15

ఒకవేళ మా ధర్మమును పాటించి యుద్ధమున ఆయుధముతో తగు కాలమున మరణమే పొందెద మనుకొనుము. అది స్వర్గమును కూర్చునదియే గదా!

ముఖ్య శ్చైవైష నో ధర్మః క్షత్రియాణాం జనార్దన,
యచ్ఛయీమహి సంగ్రామే శరతల్పగతా వయమ్. 16

మేము యుద్ధమున బాణముల పాన్పుపై నిద్రింతుమేని అది క్షత్రియుల మగు మాకు ప్రధానమగు ధర్మమే కదా!

తే వయం వీరశయనం ప్రాప్స్యామో యది సంయుగే,
అప్రణమ్యైవ శత్రూణాం న నస్తప్స్యన్తి మాధవ. 17

పగవారి కాళ్ళకు మ్రొక్కక మేము పోరిలో వీరశయనము పొందుదుమేని మమ్ముగూర్చి ఎవ్వరును దుఃఖపడరు.

కశ్చ జాతు కులే జాతః క్షత్రధర్మేణ వర్తయన్,
భయాద్ వృత్తిం సమీక్ష్యైవం ప్రణమే దిహ కర్హిచిత్. 18

ఉత్తమకులమున పుట్టి క్షత్రియధర్మమును పాటించుచున్నవా డెవ్వడైన ఎన్నడైన బ్రదుకుతెరువును చూచుకొని భయమువలన పరునకు ప్రణమిల్లునా?

ఉద్యచ్ఛేదేవ న నమే దుద్యమో హ్యేవ పౌరుషమ్,
అప్యపర్వణి భజ్యేత న నమేదిహ కర్హిచిత్. 19

"మానవుడు ప్రయత్నము చేయనే వలయును. ఉద్యమమే పౌరుషము. సందర్భము కాకున్నను తెగ్రతెంపులు చేసికొనవలయును. కాని యెన్నడును పరులకు మ్రొక్కరాదు".

ఇతి మాతఙ్గవచనం పరీప్సన్తి హితేప్సవః,
ధర్మాయ చైవ ప్రణమేద్ బ్రాహ్మణేభ్యశ్చ మద్విధః. 20

అను మాతంగముని వచనమును హితము కోరువారు పట్టుదురు. ధర్మము కొరకైనచో నావంటివాడు బ్రహ్మజ్ఞానము గలవానికి మ్రొక్కును

అచిన్తయన్ కఞ్చి దన్యం యావజ్జీవం తథాచరేత్,
ఏష ధర్మః క్షత్రియాణాం మత మేతచ్చ మే సదా. 21

---

19. ఉద్, యచ్ఛేద్. ఏవ - మానవుడు ప్రయత్నము చేయుచునే యుండవలయును. పౌరుషమ్ - అదియే మగతనము; అపర్వణి - సందర్భము కాకున్నను 'పర్వ స్యాదుత్సవే గ్రంథౌ ప్రస్తావే లక్షణాన్తరే' అని విశ్వకోశము. పర్వశబ్దము పండుగ, ముడి, సందర్భము, మరియొక లక్షణము అను నర్థములం గుండును.

20. మాతఙ్గః - ఒక ముని.

బ్రొక్కుటలో మరియొకని నెవ్వనిని తలపనేరాదు. బ్రదుకంతయు నిట్లే నడపవలయును. ఇది క్షత్రియుల ధర్మము. నాకెల్లప్పుడు ఇదియే యిష్టము.

రాజ్యాంశ శ్చాభ్యనుజ్ఞాతో యో మే పిత్రా పురాభవత్,
న స లభ్యః పునర్జాతు మయి జీవతి కేశవ. 22

మునుపెన్నడో నా తండ్రి వారికి రాజ్యభాగమును అనుమతించెను. నేను బ్రదికి యుండగా అది వారికి మరల లభింపదు.

యావచ్చ రాజా ధ్రియతే ధృతరాష్ట్రో జనార్దన,
న్యస్తశస్త్రా వయం తే వాఽప్యుపజీవామ మాధవ.

జనార్దనా! ధృతరాష్ట్రమహారాజు బ్రదికి యుండగనే మేముగాని వారుగాని ఆయుధములు పారవైచి బిచ్చమెత్తి బ్రదుకుదుమా?

అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ, 23
అజ్ఞానాద్వా భయాద్వాపి మయి బాలే జనార్దన, 24
న తదద్య పునర్లభ్యం పాణ్డవై ర్వృష్ణినన్దన.

మునుపు నేను స్వతంత్రుడను కాని దినములలో చిన్నవాడనై యున్నపుడు తెలివితక్కువతనమువలననో, భయమువలననో పాండవుల కొసగరాని రాజ్యము నిచ్చితిమి. మరల నేడది వారికి లభింపదు.

ధ్రియమాణే మహాబాహో మయి సంప్రతి కేశవ!
యావద్ధి తీక్ష్ణయా సూచ్యా విధ్యేదగ్రేణ కేశవ!
తావ దప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాణ్డవాన్ ప్రతి. 25

గొప్ప భుజములుగల నేను బ్రదికియుండగా ఇప్పుడు వాడి సూదిమొన కొంచెము తాకినంత మేరయు భూమి పాండవులకై వదలునది లేదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
దుర్యోధనవాక్యే సప్తవింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
దుర్యోధనవాక్యముగల నూటయిరువదియేడవ అధ్యాయము.

—: o :—

24 న్యస్తశస్త్రాః - క్షత్రియధర్మము వదలినవారమై; ఉపజీవామ-బిచ్చగాండ్రవలె సుఖముగా దొరికిన అన్నము తిని బ్రదుకుదుమా?

# అష్టావింశత్యధికశతతమోఽధ్యాయః
# నూటయిరువదియెనిమిదవ అధ్యాయము

**శ్రీకృష్ణేన దుర్యోధనస్య భర్త్సనం, సకోపం సభాతో నిష్క్రమితు ముద్యతం తం నిగ్రహితుం పరామర్శదానం చ.**

**శ్రీకృష్ణుడు దుర్యోధనుని గట్టిగా మందలించుట, కోపముతో సభనుండి బయటకు పోవుచున్న వానిని అదుపులో పెట్టుడని సూచించుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః ప్రశమ్య దాశార్హః క్రోధపర్యాకులేక్షణః,
దుర్యోధన మిదం వాక్య మబ్రవీత్ కురుసంసది. 1

అంత శ్రీకృష్ణుడు నొచ్చుకొని కోపముతో, కలతనొందిన కన్నులతో కురుసభలో దుర్యోధనునితో ఇట్లు పలికెను.

లప్స్యసే వీరశయనం కామ మేత దవాప్స్యసి,
స్థిరో భవ సహామాత్యో విమర్దో భవితా మహాన్. 2

వీరశయనము పొందెదవు. నీ యీ కోరిక నెరవేరును. సన్నిహితులతో పాటు స్థిరముగా నిలువుము. గొప్పపోరు రానున్నది.

యచ్చైవం మన్యసే మూఢ న మే కశ్చి ద్వ్యతిక్రమః,
పాణ్డవేష్వితి తత్సర్వం నిబోధత నరాధిపాః. 3

తెలివిమాలినవాడా! పాండవుల యెడ నా తప్పేమియు లేదని నీవు తలచుచున్నావు. రాజులారా! అది యంతయు మీరు చక్కగా తెలిసికొనుడు.

శ్రియా సంతప్యమానేన పాణ్డవానాం మహాత్మనామ్,
త్వయా దుర్మన్త్రితం ద్యూతం సౌబలేన చ భారత. 4

---

1. ప్రశమ్య-నొచ్చుకొని.

మహాత్ములగు పాండవుల సంపదను గాంచి ఉడికిపోయిన నీవు, శకునియు మాయజూదమును పన్నిరి.

కథం చ జ్ఞాతయ స్తాత శ్రేయాంసః సాధు సమతాః,
అథాన్యాయ్య ముపస్థాతుం జిహ్మే నాజిహ్మచారిణః. 5

ఆ పాండవులు నీకు దగ్గరి చుట్టములు. గొప్పవారు. మంచివారికి మన్నింపదగినవారు. కల్లకపటము లేక బ్రదుకువారు. అట్టి వారిని మోసముతో లోగొనుట న్యాయము తప్పని విధ మెట్లగును?

అక్షద్యూతం మహాప్రాజ్ఞ సతాం మతివినాశనమ్,
అసతాం తత్ర జాయన్తే భేదాశ్చ వ్యసనాని చ. 6

పాచికలాట, గొప్పతెలివి గలవాడా! మంచివారికిని బుద్ధిని పాడుజేయును. దుష్టులకు దానియందు భేదములు, కష్టములు పుట్టును.

తదిదం వ్యసనం ఘోరం త్వయా ద్యూతముఖం కృతమ్,
అసమీక్ష్య సదాచారైః సార్ధం పాపానుబన్ధనైః. 7

సదాచారములను మన్నింపక పాపములనంటి తిరుగువారితోకూడి నీ వీ జూదముద్వారమున మహాఘోరమగు ఆపదను కల్పించితివి.

కశ్చాన్యో భ్రాతృభార్యాం వై విప్రకర్తుం తథాఽర్హతి,
ఆనీయ చ సభాం వ్యక్తం యథోక్తా ద్రౌపదీ త్వయా. 8

సోదరుల భార్యను నిండుసభలోనికి తెచ్చి బహిరంగముగా నీవు కారులు కూసినట్లు లోకమున నెవ్వడైన అట్టి నీచపుపని చేయగలడా?

కులీనా శీలసంపన్నా ప్రాణేభ్యోఽపి గరీయసీ,
మహిషీ పాణ్డుపుత్రాణాం తథా వినికృతా త్వయా. 9

ఉత్తమ కులమున పుట్టినది, ఉత్తమమగు శీలసంపదతో ఒప్పినది పాండవుల పట్టపురాణి. వారికామె ప్రాణములకన్న మిన్నయైనది. అట్టి ద్రౌపదిని నీ వావిధముగా హింసించితివి.

జానన్తి కురవః సర్వే యథోక్తాః కురుసంసది,
దుశ్శాసనేన కౌన్తేయాః ప్రవ్రజన్తః పరన్తపాః. 10

కుంతికొడుకులు పరులను కాల్చివేయగలవారయ్యు వనముల కరుగుచుండగా కురుసభలో వారిని దుశ్శాసను డెంత నీచముగా పలికెనో కౌరవు లందరెరుగుదురు.

సమ్యగ్వృత్తే ష్వలుబ్ధేషు సతతం ధర్మచారిషు,
స్వేషు బన్ధుషు కః సాధు శ్చరే దేవ మసామ్ప్రతమ్. 11

చక్కనినడవడి గలవారు, ఆశాపాశములు లేనివారు, ఎల్లపుడు ధర్మమున ప్రవర్తించువారు, తమ చుట్టములు అయినవారిపట్ల ఇంత కానిపనిని మంచివాడెవ్వడైన చేయునా?

నృశంసానా మనార్యాణాం పురుషాణాం చ భాషణమ్,
కర్ణదుఃశాసనాభ్యాం చ త్వయా చ బహుశః కృతమ్. 12

దయలేని నీచమానవులు పలుకు మాటలు కర్ణదుశ్శాసనులు, నీవును మెండుగా పలికితిరి.

సహ మాత్రా ప్రదగ్ధుం తాన్ బాలకాన్ వారణావతే,
ఆస్థితః పరమం యత్నం న సమృద్ధం చ తత్తవ. 13

వారణావతమున పసివారగువారిని తల్లితోపాటు బూదిచేయుటకు గొప్ప ప్రయత్నము చేసితివి. ఆ నీ ప్రయత్నము పండలేదు.

ఊషుశ్చ సుచిరం కాలం ప్రచ్ఛన్నాః పాణ్డవా స్తదా,
మాత్రా సహైకచక్రాయాం బ్రాహ్మణస్య నివేశనే. 14

అపుడు పాండవులు తల్లితోపాటు ఏకచక్రపురమున బ్రాహ్మణునింట పెద్దకాలము ఎవ్వరికి తెలియరాకుండ నివసించిరి.

విషేణ సర్పబన్ధైశ్చ యతితాః పాణ్డవా స్త్వయా,
సర్వోపాయై ర్వినాశాయ న సమృద్ధం చ తత్తవ. 15

విషము పెట్టుట, పాములతో కరపించుట మున్నగు ఉపాయము లన్నింటితో పాండవులను రూపుమాపుటకు నీవు యత్నము చేసితివి. కాని ఆ నీ పని పంటకు రాలేదు.

ఏవంబుద్ధిః పాణ్డవేషు మిథ్యావృత్తిః సదా భవాన్,
కథం తే నాపరాధోఽస్తి పాణ్డవేషు మహాత్మసు. 16

పాండవులయెడ ఇట్టి పాడుబుద్ధితో, కపటవృత్తితో ఉన్న నీవు మహాత్ము లగు పాండవులకు చేయని అపరాధ మేమి గలదు?

యచ్చైభ్యో యాచమానేభ్యః పిత్ర్య మంశం న దిత్ససి,
తచ్చ పాపప్రవదాతాఽసి భ్రష్టైశ్వర్యో నిపాతితః. 17

ఇప్పు డడుగుకొనుచున్న వీరికి తండ్రిపాలిగోరవు. పాపాత్ముడా! యుద్ధమున వీరు నిన్ను కూల్చివేయగా సంపద నశించినవాడవై అప్పు డిత్తువు.

కృత్వా బహూ న్యకార్యాణి పాణ్డవేషు నృశంసవత్,
మిథ్యావృత్తి రనార్యః సన్నద్య విప్రతిపద్యసే. 18

పాండవుల యెడ దయలేక పెక్కు పాడుపనులు చేసిన మోసగాడవు, నీచుడవు. నేడు బుకాయించుచున్నావు.

మాతాపితృభ్యాం భీష్మేణ ద్రోణేన విదురేణ చ,
శామ్యేతి ముహురుక్తోఽసి న చ శామ్యసి పార్థివ. 19

తల్లి, తండ్రి, భీష్ముడు, ద్రోణుడు, విదురుడు శాంతి పొందుమని మాటి మాటికి చెప్పుచున్నను శాంతి పొందకున్నావు.

శమే హి సుమహాన్ లాభ స్తవ పార్థస్య చోభయోః,
న చ రోచయసే రాజన్ కిమన్యద్ బుద్ధిలాఘవాత్. 20

శాంతి పొందినచో నీకును, ధర్మరాజునకు ఇరువురకు దొడ్డ లాభము సిద్ధించును. కాని బుద్ధితక్కువతనమువలన నీ కది రుచించుట లేదు. ఇంక చెప్పున దేమి?

న శర్మ ప్రాప్స్యసే రాజ న్నుత్క్రమ్య సుహృదాం వచః,
అధర్మ్య మయశస్యం చ క్రియతే పార్థివ త్వయా. 21

18. విప్రతిపద్యసే - తల్లి మొదలగువారితో నే నేమియు నెరుగనని వివాదము చేయుచున్నావు.

నీమేలు కోరువారిమాటను కొట్టివైచి, రాజా : నీవు సుఖమును పొందవు. ధర్మమును కీర్తిని రూపుమాపు పాడుపని చేయుచున్నావు.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం బ్రువతి దాశార్హే దుర్యోధన మమర్షణమ్,
దుశ్శాసన ఇదం వాక్య మబ్రవీత్ కురుసంసది. 22

కృష్ణు డిట్లు చిరచిరలాడుచున్న దుర్యోధనుని మందలించుచుండగా కురుసభలో దుశ్శాసను డిట్లు పలికెను.

న చేత్ సంధాస్యసే రాజన్ స్వేన కామేన పాణ్డవైః,
బద్ధ్వా కిల త్వాం దాస్యన్తి కున్తీపుత్రాయ కౌరవాః. 23

రాజా! నీవు ఇష్టపూర్వకముగా పాండవులతో సంధి చేసికొనవేని, ఈ కౌరవులు నిన్ను బంధించి ధర్మరాజున కప్పగింతురట.

వైకర్తనం త్వాం చ మాం చ త్రీ నేతాన్ మనుజర్షభ,
పాణ్డవేభ్యః ప్రదాస్యన్తి భీష్మో ద్రోణః పితా చ తే. 24

కర్ణుని, నిన్ను, నన్ను-ఈ మువ్వురను భీష్ముడు, ద్రోణుడు ఇదిగో ఈ నీ తండ్రియు పాండవుల కప్పగింతురు.

భ్రాతు రేతద్వచః శ్రుత్వా ధార్తరాష్ట్రః సుయోధనః,
క్రుద్ధః ప్రాతిష్ఠ తోత్థాయ మహానాగ ఇవ శ్వసన్. 25

తమ్ముని యీ మాట విని సుయోధనుడు మిక్కలి కోపము గలవాడై పెద్దపామువలె బుసకొట్టుచు లేచి పోవ నుంకించెను.

విదురం ధృతరాష్ట్రం చ మహారాజం చ బాహ్లికమ్,
కృపం చ సోమదత్తం చ భీష్మం ద్రోణం జనార్దనమ్. 26
సర్వా నేతా ననాదృత్య దుర్మతి ర్నిరపత్రపః,
అశిష్టవ దమర్యాదో మానీ మాన్యావమానితా. 27

---

24. తే పితా-ధృతరాష్ట్రుని కొడుకే అయిన దుశ్శాసనుడు 'నీ తండ్రి' అనుట కోపావేశముతో అధిక్షేపణగా అన్నమాట.

విదురుని, మహారాజగు ధృతరాష్ట్రుని, బాహ్లికుని, కృపుని, సోమదత్తుని, భీష్ముని, ద్రోణుని, జనార్దనుని వీరందరిని సరకుసేయక దుష్టబుద్ధియు, సిగ్గు మాలినవాడును, నీచునివలె మర్యాదతప్పినవాడును, దురభిమానియు మాన్యుల నవమానము చేయువాడును అగు దుర్యోధనుడు సభనుండి బయటకు పోవ నుంకించెను.

తం ప్రస్థిత మభిప్రేక్ష్య భ్రాతరో మనుజర్షభమ్,
అనుజగ్ముః సహామాత్యా రాజానశ్చాపి సర్వశః. 28

అట్లు బయలుదేరిన వాని వెనుక తమ్ములు, మంత్రులు, అతనియెడ ప్రీతి గల దొరలును పోవజొచ్చిరి.

సభాయా ముత్థితం క్రుద్ధం ప్రస్థితం భ్రాతృభిః సహ,
దుర్యోధన మభిప్రేక్ష్య భీష్మః శాన్తనవోఽబ్రవీత్. 29

సభనుండి లేచి కోపముతో తమ్ములతోపాటు బయలుదేరిన దుర్యోధనుని గాంచి భీష్ము డిట్లు పలికెను.

ధర్మార్థా వభిసంత్యజ్య సంరంభం యోఽనుమన్యతే,
హసన్తి వ్యసనే తస్య దుర్హృదో నచిరాదివ. 30

ధర్మార్థములను మూలముట్టుగ త్రోసివైచి పట్టుదలనే మన్నించువానికి త్వరలోనే కీడు మూడగా పగవారు వెక్కిరింతురు.

దురాత్మా రాజపుత్రోఽయం ధార్తరాష్ట్రోఽనుపాయకృత్,
మిథ్యాభిమానీ రాజ్యస్య క్రోధలోభవశానుగః. 31

ఈ రాజకుమారుడు ధృతరాష్ట్రతనయుడు దుష్టబుద్ధి, ఉపాయ మెరుగని వాడు, రాజ్యమునెడ వెఱ్ఱి అభిమానము గలవాడు - క్రోధము, లోభము త్రిప్పి నట్లు తిరుగుచున్నాడు.

కాలపక్వ మిదం మన్యే సర్వం క్షత్రం జనార్దన,
సర్వే హ్యనుసృతా మోహాత్ పార్థివాః సహ మన్త్రిభిః. 32

కృష్ణా! క్షత్రియకుల మంతటికిని కాలము పండిన దని తలతును. ఈ రాజులు, వారి మంత్రులు బుద్ధి లేక వీని వెంటబడి పోవుచున్నారు.

భీష్మస్యాథ వచః శ్రుత్వా దాశార్హః పుష్కరేక్షణః,
భీష్మద్రోణముఖాన్ సర్వా నభ్యభాషత వీర్యవాన్. 33

భీష్ముని మాట విని కృష్ణుడు కన్నులు పద్మముల వలె వెలుగొందు చుండగా మహాశక్తిసంపన్నుడై భీష్మద్రోణాదులతో నిట్లు పలికెను.

సర్వేషాం కురువృద్ధానాం మహా నయ మతిక్రమః,
ప్రసహ్య మన్ద మైశ్వర్యే న నియచ్ఛత యన్నృపమ్. 34

ఈ పెద్ద తప్పు కురువృద్ధు లందరికి సంబంధించినది. బుద్ధిలేని ఈ రాజును బలాత్కారముగ ప్రభుత్వ ముపయోగించి అదుపులో పెట్టకున్నారు.

తత్ర కార్య మహం మన్యే కాలప్రాప్త మరిన్దమాః,
క్రియమాణే భవే చ్ఛ్రేయ స్తత్ సర్వం శృణుతానఘాః. 35

ఈ సమయమునకు తగినదని నాకు తోచిన కార్య మొకటి కలదు. దానిని చేసినచో మీకందరకు మేలగును. పుణ్యాత్ములారా, దానిని వినుడు. మీరు శత్రువుల నణపగలవారు.

ప్రత్యక్ష మేత ద్భవతాం యద్వక్ష్యామి హితం వచః,
భవతా మానుకూల్యేన యది రోచేత భారతాః. 36

మీ కొక హితమైన మాట చెప్పెదను. మీకు తెలిసినదే. అది మీరు రుచించునేని ఆ మార్గమున ప్రవర్తింపుడు.

భోజరాజస్య వృద్ధస్య దురాచారో హ్యనాత్మవాన్,
జీవతః పితు రైశ్వర్యం హృత్వా మృత్యువశం గతః. 37

ముదుసలియగు భోజరాజు కొడుకు దురాచారుడు, జ్ఞానము లేనివాడు. తండ్రి బ్రతికియుండగా సంపదను చేజిక్కించుకొని మృత్యువుచేత చిక్కెను.

ఉగ్రసేనసుతః కంసః పరిత్యక్తః సబాన్ధవైః,
జ్ఞాతీనాం హితకామేన మయా శస్తో మహామృధే. 38

అట్టి ఉగ్రసేనుని కొడుకు కంసుని బంధువు లందరు వదలివేసిరి. చుట్టములకు మేలు చేయుటకై నే నాతనిని పెనుయుద్ధమున మట్టుపెట్టితిని.

ఆహుకః పున రస్మాభి ర్జ్ఞాతిభి శ్చాపి సత్కృతః,
ఉగ్రసేనః కృతో రాజా భోజరాజన్యవర్ధనః. 39

ఆ ఆహుకుని మరల జ్ఞాతులు, ఇతరబంధువులు సత్కరించిరి. భోజరాజ కుమారులకు పెంపు కలిగించు ఆ ఉగ్రసేనుని మరల రాజుగా చేసికొనిరి.

కంస మేకం పరిత్యజ్య కులార్థే సర్వయాదవాః,
సంభూయ సుఖ మేధన్తే భారతాన్ధకవృష్ణయః. 40

భారతా! కులమును రక్షించుటకై యాదవు లందరు, అంధక వృష్ణి వంశములవారును కలసి కంసు నొక్కని పార ద్రోలి సుఖముగా వెలసిల్లుచున్నారు.

అపి చాప్యవద ద్రాజన్ పరమేష్ఠీ ప్రజాపతిః,
వ్యూఢే దేవాసురే యుద్ధేఽభ్యుద్యతే ష్వాయుధేషు చ. 41

దేవతలకు దానవులకు యుద్ధము వచ్చినపుడు ఆయుధములు బాగుగా పైకి లేచినపుడు ప్రజాపతి యగు బ్రహ్మ మరల మరల చెప్పెను.

ద్వైధీభూతేషు లోకేషు వినశ్యత్సు చ భారత,
అబ్రవీత్ సృష్టిమాన్ దేవో భగవాన్ లోకభావనః. 42

లోకము లన్నియు రెండు పక్షములుగా నయి నశించిపోవుచుండగా సృష్టికర్త, లోకములయందు ప్రేమగలవాడు నగు బ్రహ్మదేవు డిట్లు చెప్పెను.

వరాభవిష్య న్త్యసురా దైతేయా దానవైః సహ,
ఆదిత్యా వసవో రుద్రా భవిష్య న్తి దివౌకసః. 43

"అసురులు, దితి కొడుకులు, దనువు తనయులు ఓడిపోవుదురు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, స్వర్గవాసులు గెలుతురు".

దేవాసురమనుష్యాశ్చ గన్ధర్వోరగరాక్షసాః,
అస్మిన్ యుద్ధే సుసంక్రుద్ధా హనిష్య న్తి పరస్పరమ్. 44

"దేవతలు, అసురులు, మనుష్యులు, గంధర్వులు, నాగులు, రాక్షసులు ఈ యుద్ధమున మహాక్రోధమున చెలరేగి ఒకరి నొకరు చంపుకొందురు".

ఇతి మత్వాఽబ్రవీ ద్ధర్మం పరమేష్ఠీ ప్రజాపతిః,
వరుణాయ ప్రయచ్ఛైతాన్ బద్ధ్వా దైతేయదానవాన్. 45

---

43. అసురులు, దైతేయులు, దానవులు - సుర - అమృతము లేనివారు, దితి, దనువు అనువారికి పుట్టినవారు అని భేదము; భవిష్య న్తి - గెలుతురు.

ఇట్లు తలచి బ్రహ్మ యమునితో 'ఈ దితిదనువుల పుత్రులను బంధించి వరుణున కర్పింపుము' అని పలికెను.

ఏవ ముక్త స్తతో ధర్మో నియోగాత్ పరమేష్ఠినః,
వరుణాయ దదౌ సర్వాన్ బద్ధ్వా దైతేయదానవాన్. 46

బ్రహ్మ యిట్లు పలుకగా, ధర్మరాజు బ్రహ్మశాసనమువలన దైత్యులను, దానవులను కట్టి పడవైచి వరుణున కప్పగించెను.

తాన్ బద్ధ్వా ధర్మపాశైశ్చ స్వైశ్చ పాశై ర్జలేశ్వరః,
వరుణః సాగరే యత్తో నిత్యం రక్షతి దానవాన్. 47

ధర్ముని పాశములతోడను, తన పాశములతోడను వారిని కట్టి పడవైచి, జలముల ప్రభువు వరుణుడు సముద్రమున వారిని నిత్యము మెలకువతో రక్షించు చున్నాడు.

తథా దుర్యోధనం కర్ణం శకునిం చాపి సౌబలమ్,
బద్ధ్వా దుశ్శాసనం చాపి పాణ్డవేభ్యః ప్రయచ్ఛథ. 48

మీరును అట్లే దుర్యోధనుని, కర్ణుని, సుబలరాజు శకునిని, దుశ్శాసనుని బంధించి పాండవుల కప్పగింపుడు.

త్యజేత్ కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్. 49

కులమును రక్షించుటకై ఒక పురుషుని విడువదగును. గ్రామమునకై కులమును విడువవలయును. దేశముకొరకు గ్రామమును విడువవలయును. ఆత్మపదార్థము నందుకొనుటకై భూమి నంతటిని వదలవలయును.

రాజన్ దుర్యోధనం బద్ధ్వా తతః సంశామ్య పాణ్డవైః,
త్వత్కృతే న వినశ్యేయుః క్షత్రియాః క్షత్రియర్షభ. 50

రాజా! ఉత్తమక్షత్రియుడా! దుర్యోధనుని బంధించి పాండవులతో చెలిమి చేసికొనుము. నీకొరకుగా క్షత్రియు లందరు నశింపకుందురుగాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కృష్ణవాక్యే అష్టావింశత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణవాక్యముగల నూటయిరువదియెనిమిదవ అధ్యాయము.

—:o:—

# ఊనత్రింశాధికశతతమోఽధ్యాయః

# నూటయిరువదితొమ్మిదవ అధ్యాయము

**ధృతరాష్ట్రేణ గాన్ధార్యా ఆవాహనం, తయా దుర్యోధనస్య బోధనం చ.**

**ధృతరాష్ట్రుడు గాంధారిని పిలుచుట, ఆమె దుర్యోధనునకు హితము చెప్పుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

కృష్ణస్య తు వచః శ్రుత్వా ధృతరాష్ట్రో జనేశ్వరః,
విదురం సర్వధర్మజ్ఞం త్వరమాణోఽభ్యభాషత. 1

కృష్ణుని మాట విని ధృతరాష్ట్రమహారాజు సర్వధర్మములు చక్కగా ఎరిగిన విదురునితో త్వరపడుచు నిట్లు పలికెను.

గచ్ఛ తాత మహాప్రాజ్ఞాం గాన్ధారీం దీర్ఘదర్శినీమ్,
ఆనయేహ తయా సార్ధ మనునేష్యామి దుర్మతిమ్. 2

వెళ్ళు నాయనా! గొప్ప ప్రజ్ఞ కలదియు, చక్కని దూరాలోచన గలదియు నగు గాంధారి నిటకు తెమ్ము. ఆమెతోపాటు ఈ చెడిపెను మందలింతును.

యది సాపి దురాత్మానం శమయే ద్దుష్టచేతసమ్,
అపి కృష్ణస్య సుహృద స్తిష్ఠేమ వచనే వయమ్. 3

ఆమెయైనను ఈ దుష్టబుద్ధిని, చక్కదిద్దగలదేమో! మనకు మేలు గోరు కృష్ణుని మాటపై నిలువగలుగుదుమేమో!

అపి లోభాభిభూతస్య పన్థాన మనుదర్శయేత్,
దుర్బుద్ధే ర్దుఃసహాయస్య శమార్థం బ్రువతీ వచః. 4

దుష్టమైన బుద్ధియు దుష్టులగు చెలికాండ్రు గల వీనికి, లోభము పైకొన్న వీనికి శాంతికొరకు మంచి మాటలు చెప్పి మంచి దారి చూపగలదేమో!

అపి నో వ్యసనం ఘోరం దుర్యోధనకృతం మహత్,
శమయే చ్చిరరాత్రాయ యోగక్షేమవ దవ్యయమ్. 5

మనకు దుర్యోధనునివలన వచ్చిపడిన ఈ మహాఘోరమగు కష్టమును అణచి బహుకాలము చెడని యోగక్షేమమును గూర్పగలుగుదునేమో!

రాజ్ఞస్తు వచనం శ్రుత్వా విదురో దీర్ఘదర్శినీమ్,
ఆనయామాస గాన్ధారీం ధృతరాష్ట్రస్య శాసనాత్. 6

రాజుమాట విని విదురుడు చక్కని వివేకము, ముందుచూపు గల గాంధారిని, ధృతరాష్ట్రుని మాటపై, తీసికొని వచ్చెను.

ధృతరాష్ట్ర ఉవాచ – ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఏష గాన్ధారి పుత్రస్తే దురాత్మా శాసనాతిగః,
ఐశ్వర్యలోభా దైశ్వర్యం జీవితం చ ప్రహాస్యతి. 7

గాంధారీ! ఇదిగో నీ కొడుకు దురాత్ముడు నా మాట ధిక్కరించి ఐశ్వర్యమునందలి లోభముతో సంపదను బ్రదుకును గూడ పాడుచేసికొనుచున్నాడు.

అశిష్టవ దమర్యాదః పాపైః సహ దురాత్మవాన్,
సభాయా నిర్గతో మూఢో వ్యతిక్రమ్య సుహృద్వచః. 8

అదుపాజ్ఞలు లేని నీచునివంటి ఆ మూఢుడు పాపులతో కలసి దుష్టబుద్ధియై మంచి చెప్పువారి మాటను త్రోసివైచి సభనుండి వెడలిపోయెను.

వైశమ్పాయన ఉవాచ – వైశంపాయను డిట్లు చెప్పెను.

సా భర్తృవచనం శ్రుత్వా రాజపుత్రీ యశస్వినీ,
అన్విచ్ఛన్తీ మహచ్ఛ్రేయో గాన్ధారీ వాక్య మబ్రవీత్. 9

మగనిమాట విని మంచికీర్తి గల ఆ రాజపుత్రి గాంధారి గొప్ప మేలు సాధింపగోరుచు నిట్లు పలికెను.

---

5. చిరరాత్రాయ - బహుకాలము; యోగక్షేమవత్ - పూర్వము తనకు లేనిది లభించుట యోగము. లభించినదానిని కాపాడుకొనుట క్షేమము. యోగక్షేమములు కలుగు విధముగా; అవ్యయమ్ - ఏ విధముననను చెడనట్టి.

7. ప్రహాస్యతి - వదలివైచుచున్నాడు.

గాన్ధా ర్యువాచ - గాంధారి యిట్లు పలికెను.

అనాయయ సుతం క్షిప్రం రాజ్యకాముక మాతురమ్,
న హి రాజ్య మశిష్టేన శక్యం ధర్మార్థలోపినా,
ఆప్తు మాప్తం తథాపీద మవినీతేన సర్వథా. 10

కొడుకును త్వరగా పిలిపించు. వానికి రాజ్యలోభ మను రోగము పట్టినది. ధర్మార్థములు కొరవడిన దుష్టుడు. నీతి మాలినవాడు. రాజ్యమును పొందజాలడు. పొందినను సర్వవిధముల నిలుపుకొనజాలడు.

త్వం హ్యేవాత్ర భృశం గర్హ్యో ధృతరాష్ట్ర సుతప్రియః,
యో జానన్ పాపతా మస్య తత్ప్రజ్ఞా మనువర్తసే. 11

అయినను కొడుకు అన్న పిచ్చిప్రేమ గల ధృతరాష్ట్రా! ఈ విషయమున నిన్నే మిక్కిలిగా నిందింపవలయును. వాని పాపప్రభావ మెరిగి యెరిగి వాని తెలివివెంట బడి తిరుగుచుందువు.

స ఏష కామమన్యుభ్యాం ప్రలుబ్ధో లోభ మాస్థితః,
అశక్యోఽద్య త్వయా రాజ న్వినివర్తయితుం బలాత్. 12

లోభము తలకెక్కిన వీడు కామక్రోధములతో పట్ట శక్యము గాకున్నాడు. ఈనాడు నీవు బలముతో వానిని మరలింపజాలవు.

రాష్ట్రప్రదానే మూఢస్య బాలిశస్య దురాత్మనః,
దుస్సహాయస్య లుబ్ధస్య ధృతరాష్ట్రోఽశ్నుతే ఫలమ్. 13

వానికి తెలియదు. చెప్పినను వినడు. వివేకము లేనివాడు. దుష్టబుద్ధి. చెడుసహవాసములు పట్టినవాడు. 'ఆశపోతు'. అట్టివానికి రాజ్య మప్పగించి ధృతరాష్ట్రుడు ఫల మనుభవించుచున్నాడు.

కథం హి స్వజనే భేద ముపేక్షేత మహీపతిః,
భిన్నం హి స్వజనేన త్వాం ప్రహసిష్య న్తి శత్రవః. 14

రాజైనవాడు తనవారు చీలిపోవుచుండగా ఎట్లు మిన్నకుండును? తనవారితో తెగత్రెంపులు చేసికొన్న నిన్ను చూచి పగవారు పసలబడి నవ్వుదురు.

యా హి శక్యా మహారాజ సామ్నా భేదేన వా పునః,
నిస్తర్తు మాపదః స్వేషు దణ్డం క స్తత్ర పాతయేత్. 15

మంచిమాటలతోడనో, బెదరించియో చక్కజేయనగు ఆపదను దాటుటకై తనవారిపై దండము నెవడు ప్రయోగించును?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

శాసనాద్ ధృతరాష్ట్రస్య దుర్యోధన మమర్షణమ్,
మాతు శ్చ వచనాత్ క్షత్తా సభాం ప్రావేశయత్ పునః. 16

ధృతరాష్ట్రుని ఆజ్ఞమేరకు తల్లిమాటమీద కోపిష్ఠియైన దుర్యోధనుని విదురుడు మరల సభలోనికి తెచ్చెను.

స మాతు ర్వచనాకాంక్షీ ప్రవివేశ పునః సభామ్,
అభితామ్రేక్షణః క్రోధా న్నిఃశ్వసన్నివ పన్నగః. 17

ఆ దుర్యోధనుడు తల్లి మాట వినగోరి తిరిగి సభలోనికి ప్రవేశించెను. క్రోధముతో అతని కనులు బాగుగా ఎరుపెక్కియుండెను. అతడు బుసకొట్టుచున్న పామువలె నుండెను.

తం ప్రవిష్ట మభిప్రేక్ష్య పుత్ర ముత్పథ మాస్థితమ్,
విగర్హమాణా గాన్ధారీ శమార్థం వాక్య మబ్రవీత్. 18

చెడుదారి బట్టిన కొడుకు సభకు వచ్చిన విషయ మెరిగి గాంధారి వానిని మందలించుచు శాంతికై యిట్లు పలికెను.

దుర్యోధన నిబోధేదం వచనం మమ పుత్రక,
హితం తే సానుబన్ధస్య తథాఽఽయత్యాం సుఖోదయమ్. 19

కొడుకా! సుయోధనా! నీకు, నీతోడివారికి మేలైనది, భవిష్యత్తున సుఖము కలిగించునదియు, హితమైనదియు నగు నామాట వినుము.

దుర్యోధన యదాహ త్వాం పితా భరతసత్తమ,
భీష్మో ద్రోణః కృపః క్షత్తా సుహృదాం కురు తద్వచః. 20

దుర్యోధనా! నీ తండ్రియు, భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, విదురుడు-నీ మేలు కోరువారు. వారు చెప్పినట్లు చేయుము.

---

19. ఆయత్యామ్-చివరకు, భవిష్యత్తునందు, కాలము పక్వమైనపుడు

భీష్మస్య తు పితు శ్చైవ మమ చాపచితిః కృతా,
భవే ద్ద్రోణముఖానాం చ సుహృదాం శామ్యతా త్వయా. 21

భీష్ముడు, తండ్రి, నేను, ద్రోణుడు మొదలగువారు నీ మేలు కోరి చెప్పిన విధముగా నీవు శాంతి పొందినచో అదియే మాయెడల పూజ యగును.

న హి రాజ్యం మహాప్రాజ్ఞ స్వేన కామేన శక్యతే,
అవాప్తుం రక్షితుం వాऽపి భోక్తుం భరతసత్తమ. 22

గొప్ప తెలివిగలవాడా! తన యిష్టమునుబట్టి ప్రవర్తించువానికి రాజ్యము పొందుటకు, దానిని రక్షించుటకు, అనుభవించుటకు సాధ్యము కాదు.

న హ్యవశ్యేన్ద్రియో రాజ్య మశ్నీయా ద్దీర్ఘ మన్తరమ్,
విజితాత్మా తు మేధావీ స రాజ్య మభిపాలయేత్. 23

అదుపు తప్పిన యింద్రియములు గలవాడు పెద్దకాలము రాజ్యము ననుభవింపజాలడు. నిగ్రహము, బుద్ధివిశేషము గలవాడే రాజ్యమును పాలింప వలయును.

కామక్రోధౌ హి పురుష మర్థేభ్యో వ్యపకర్షతః,
తౌ తు శత్రూ వినిర్జిత్య రాజా విజయతే మహీమ్. 24

కామము, క్రోధము మానవుని సంపదలనుండి లాగిపారవేయును. ఆ శత్రువులను గెలిచిన రాజే భూమిని దక్కించుకొనగలడు.

లోకేశ్వరప్రభుత్వం హి మహ దేత ద్దురాత్మభిః,
రాజ్యం నామేప్సితం స్థానం న శక్య మభిరక్షితుమ్. 25

లోకపాలకుల అధికారము గల గొప్ప రాజ్యమును బుద్ధి చెడినవారును పొందగోరుదురు. కాని దానిని రక్షింపజాలరు.

---

21. అపచితిః - పూజ.

23. దీర్ఘ మన్తరమ్ - చిరకాలము.

ఇన్ద్రియాణి మహత్ ప్రేప్సు ర్నియచ్ఛే దర్థధర్మయోః,
ఇన్ద్రియై ర్నియతై ర్బుద్ధి ర్వర్ధతేఽగ్ని రివేన్ధనైః. 26

రాజ్యమును పొందగోరువాడు అర్థధర్మములయందు ఇంద్రియములను పట్టి యుంచవలయును. అట్లు నిగ్రహము గల యింద్రియములతో, కట్టెలతో నిప్పు వలె, బుద్ధి వృద్ధి పొందును.

అవిధేయాని హీమాని వ్యాపాదయితు మప్యలమ్,
అవిధేయా ఇవాదాన్తా హయా ఇవ కుసారథిమ్. 27

తన అదుపులేని పొగరుబోతు గుఱ్ఱములు చేతకాని సారథిని కూలద్రోసి నట్లు, తనకు లొంగని యింద్రియములు చంపుటకును సమర్థము లగును.

అవిజిత్య య ఆత్మాన మమాత్యాన్ విజిగీషతే,
అమిత్రాన్ వాఽజితామాత్యః సోఽవశః పరిహీయతే. 28

తన మనస్సును గెలువక దగ్గరవారినో శత్రువులనో గెలువగోరువాడు వారిని గెలువలేకపోవుటయే కాదు-పట్టు తప్పి భ్రష్టు డగును.

ఆత్మాన మేవ ప్రథమం ద్వేష్యరూపేణ యోజయేత్,
తతోఽమాత్యా నమిత్రాంశ్చ న మోఘం విజిగీషతే. 29

మొట్టమొదట తన మనస్సే ద్వేషింపదగినదిగా భావింపవలయును. అటుపై తనవారిని, పగవారిని గెలువగోరినచో అది వ్యర్థము కాదు.

వశ్యేన్ద్రియం జితామాత్యం ధృతదణ్డం వికారిషు,
పరీక్ష్యకారిణం ధీర మత్యర్థం శ్రీ ర్నిషేవతే. 30

---

26. మహత్ - రాజ్యమును; 'మహద్రాజ్యవిశాలయోః' అని విశ్వకోశము. మహత్ అను శబ్దము రాజ్యము, విశాలమైనది అను నర్థములం దుండును.

27. అవిధేయాని - వశము చేసికొబడనివి; వ్యాపాదయితుమ్ - చంపుటకు; అలమ్ - సమర్థము లైనవి.

29. ద్వేష్యరూపేణ - యోజయేత్. శత్రువుగా భావింపవలయునని తాత్పర్యము. మనస్సుపై అధికారము పొందినవాడే తక్కినవారిని గెలువ గలడని భావము.

ఇంద్రియముల నదుపున పెట్టుకొనినవాడు, తనకంటె మెంగువారిపై అధికారము నిలుపుకొనువాడు, తప్పుచేసినవారిని శిక్షింపగలవాడు, చక్కగా ఆలోచించి కార్యములను నిర్వహించువాడు, బుద్ధివిశేషము గలవాడు అగు పురుషుని రాజ్యలక్ష్మి మిక్కిలిగా ఆదరించును.

క్షుద్రాక్షేణేవ జాలేన ఝషా వపిహితా వుభౌ,
కామక్రోధౌ శరీరస్థౌ ప్రజ్ఞానం తౌ విలుమ్పతః. 31

సన్నని రంధ్రములు గల వలలో కప్పబడిన రెండు చేపలవలె శరీరము నందున్న కామక్రోధములు రెండును వివేకమును జార్చివేయుచుండును.

యాభ్యాం హి దేవాః స్వర్యాతుః స్వర్గస్య పిదధు ర్ముఖమ్,
బిభ్యతోఽనుపరాగస్య కామక్రోధౌ స్మ వర్ధితౌ. 32

కామక్రోధము లన్న భయము కలిగి, అనాసక్తుడైన వానిలో కూడ అవి వర్ధిల్లును. ఆ కామక్రోధములతో స్వర్గమునకు పోవువాని స్వర్గద్వారమును దేవతలు మూసివేసిరట.

కామం క్రోధం చ లోభం చ దమ్భం దర్పం చ భూమిపః,
సమ్య గ్విజేతుం యో వేద స మహీ మభిజాయతే. 33

కామము, క్రోధము, అత్యాశ, పరవంచన, గర్వము అనువానిని చక్కగా గెలువనేర్చిన రాజు భూమి నేలును.

సతతం నిగ్రహే యుక్త ఇన్ద్రియాణాం భవే న్నృపః,
ఈప్స న్నర్థం చ ధర్మం చ ద్విషతాం చ పరాభవమ్. 34

అర్థమును, ధర్మమును, శత్రువుల ఓటమిని కాంక్షించు రాజు ఎల్లవేళల ఇంద్రియములపై అదుపుగలవాడు కావలయును.

---

31. క్షుద్రాక్షేణ-సన్నని రంధ్రములు గల; జాలేన- వలతో; ఝషౌ-రెండు చేపలు; అపిహితౌ - కప్పబడినవి.

33. దమ్భః - ఇతరులను మోసగించుట; అభిజాయతే - శాసించును.

కామాభిభూతః క్రోధా ద్వా యో మిథ్యా ప్రతిపద్యతే,
స్వేషు చాన్యేషు వా తస్య న సహాయా భవన్త్యుత. 35

కామము, క్రోధము, కపటము పైకొన్న రాజు కోరినదానిని పొందినను, అట్టి వానికి తనవారిలో గాని పరులలోగాని సహాయులు ఏర్పడరు.

ఏకీభూతై ర్మహాప్రాజ్ఞైః శూరై రరినిబర్హణైః,
పాణ్డవైః పృథివీం తాత భోక్ష్యసే సహితః సుఖీ. 36

ఆ పాండవులు గొప్ప జ్ఞానసంపద కలవారు. శూరులు. పగవారిని పరిమార్చువారు. నీవు వారితో ఒక్కటిగానై కూడి బ్రదికినచో భూమి నంతటిని సుఖముగా అనుభవింపగలవు.

యథా భీష్మః శాన్తనవో ద్రోణ శ్చాపి మహారథః,
ఆహతు స్తాత తత్సత్య మజేయౌ కృష్ణపాణ్డవౌ. 37

శంతనుకుమారుడు భీష్ముడును, మహారథుడగు ద్రోణుడును చెప్పిన దంతయు సత్యము. కృష్ణార్జునులు గెలువరానివారు.

ప్రపద్యస్వ మహాబాహుం కృష్ణ మక్లిష్టకారిణమ్,
ప్రసన్నో హి సుఖాయ స్యా దుభయో రేవ కేశవః. 38

సులభముగా సర్వకార్యములు నిర్వహింపగల మహాబాహువు కృష్ణుని చేపట్టుము. ఆ కేశవుడు ప్రసన్నుడై రెండు పక్షములవారికి సుఖము చేకూర్చును.

సుహృదా మర్థకామానాం యో న తిష్ఠతి శాసనే,
ప్రాజ్ఞానాం కృతవిద్యానాం స నరః శత్రునన్దనః. 39

మన ప్రయోజనము కాంక్షించువారు, మిత్రములు, గొప్పవివేకము కలవారు, ఆ యా విద్యలలో ఆరితేరినవారు చెప్పెడు మాటపై నిలబడనివాడు పగవారికి పరమానందము కూర్చువా డగును.

---

35. కామ - అభిభూతః - కామముచేత తిరస్కరింపబడినవాడు - కామము త్రిప్పినట్లు తిరుగువాడని భావము; క్రోధాత్ - క్రోధము త్రిప్పినట్లు తిరుగువాడు; మిథ్యా - కపటముగా ప్రవర్తించువాడు; ప్రతిపద్యతే - కోరిన కోర్కెలను పొందినను; అట్టివానికి తోడుపడువా రుండరని తాత్పర్యము.

న యుద్ధే తాత కల్యాణం న ధర్మార్థౌ కుతః సుఖమ్,
న చాపి విజయో నిత్యం మా యుద్ధే చేత ఆధిథాః. 40

కొడుకా! యుద్ధమువలన వచ్చు శుభ మేమియు లేదు. ధర్మమును అర్థమును అది సాధింపదు. ఇక సుఖముమాట చెప్పనేల? అంతేకాదు. విజయముకూడ తప్పక కలుగునని చెప్పజాలము. అట్టి యుద్ధమునందు మనసు పెట్టకుము.

భీష్మేణ హి మహాప్రాజ్ఞ పిత్రా తే బాహ్లికేన చ,
దత్తోఽంశః పాణ్డుపుత్రాణాం భేదా ద్భీతై రరిందమ. 41

ఓయి తెలివిగలవాడా! శత్రుసంహారకా! భీష్ముడు, నీ తండ్రియు, బాహ్లికుడును తమవారిలో చీలికలు వచ్చునని భయపడి పాండుకుమారులకు రాజ్యభాగ మొసగిరి.

తస్య చైతత్ప్రదానస్య ఫల మద్యానుపశ్యసి,
యద్భుఙ్క్షే పృథివీం కృత్స్నాం శూరై ర్నిహతకణ్టకామ్. 42

అట్లొసగుటలోని ఫలమును నేడు చూచుచునే యున్నావు కదా. ఆ శూరులు భూమి నంతటిని శత్రువులు లేనిదిగా చేసిపెట్టగా నీవు సుఖముగా అనుభవించు చున్నావు.

ప్రయచ్ఛ పాణ్డుపుత్రాణాం యథోచిత మరిందమ,
యదీచ్ఛసి సహామాత్యో భోక్తుమర్ధం ప్రదీయతామ్. 43

నీవు నీ సన్నిహితులతో రాజ్యము ననుభవింపగోరుదువేని పాండవులకు తగినవిధముగా సగము పాలిమ్ము.

అలమర్ధం పృథివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్,
సుహృదాం వచనే తిష్ఠన్ యశః ప్రాప్స్యసి భారత. 44

నీవు, నీదగ్గరి చుట్టములు బ్రదుకుటకు భూమిలో సగము చాలును. మేలు కోరువారిమాటను పాటించి కీర్తి పొందెదవు.

---

40. యుద్ధే - యుద్ధమున; చేతః - మనస్సును;
మా ఆధిథాః - నిలుపకుము;

41. అంశః - రాజ్యభాగము.

శ్రీమద్భి రాత్మవద్భి స్తై ర్బుద్ధిమద్భి ర్జితేన్ద్రియైః,
పాణ్డవై ర్విగ్రహ స్తాత భ్రంశయే న్మహతః సుఖాత్. 45

పాండవులు గొప్ప పుణ్యసంపద గలవారు. ధైర్యసంపద గలవారు. బుద్ధిసంపద గలవారు. ఇంద్రియములను జయించినవారు. నాయనా! వారితోడి విరోధము గొప్ప సుఖమునుండి నిన్ను త్రోసివేయును.

నిగృహ్య సుహృదాం మన్యుం శాధి రాజ్యం యథోచితమ్,
స్వ మంశం పాణ్డుపుత్రేభ్యః ప్రదాయ భరతర్షభ. 46

మేలు కోరువారియెడ కోపము నరికట్టుకొని పాండుకుమారులకు వారి పాలు సమర్పించి రాజ్యమును తగువిధముగా పాలింపుము.

అల మజ్గ నికారోఽయం త్రయోదశ సమాః కృతః,
శమయైనం మహాప్రాజ్ఞ కామక్రోధసమేధితమ్. 47

పదుమూడేండ్లు సాధించిన యీ అపకారము చాలునయ్యా! కామక్రోధములతో రగుల్కొనుచున్న దానిని చల్లార్పుము.

న చైష శక్తః పార్థానాం య స్త్వమర్థ మభీప్ససి,
సూతపుత్రో దృఢక్రోధో భ్రాతా దుఃశాసనశ్చ తే. 48

పాండవుల సొమ్మున కాసపడుచున్న నీవు గాని, వారియెడ పాతుకొనిపోయిన కోపము గల సూతపుత్రుడు కర్ణుడు గాని, నీ తమ్ముడు దుశ్శాసనుడు గాని ఆ పనికి చాలరు.

భీష్మే ద్రోణే కృపే కర్ణే భీమసేనే ధనఞ్జయే,
ధృష్టద్యుమ్నే చ సంక్రుద్ధే న స్యుః సర్వాః ప్రజా ధ్రువమ్. 49

---

47. నికారః - అపకారము; త్రయోదశ సమాః - పదుమూడు ఏండ్లు; ఏనమ్ - ఈ అపకార మనెడు అగ్నిని.

48. యః, త్వమ్ - ఏ నీవు; పార్థానామ్ - పాండవుల, అర్థమ్ - సొమ్మును; అభీప్ససి - పొందగోరుచున్నావో; సః, త్వమ్-ఆ నీవును; న శక్తః-వారి సొమ్ము నపహరించుటకు సమర్థుడవు గావని తాత్పర్యము. అట్లే కర్ణాదులును.

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, భీమసేనుడు, అర్జునుడు ధృష్టద్యుమ్నుడును తీవ్రకోపము లాల్చినచో ప్రజ లెవ్వరు మిగులరు. ఇది నిక్కము.

అమర్షవశ మాపన్నో మా కురూం స్తాత జీఘనః,
ఏషా హి పృథివీ కృత్స్నా మా గమ త్త్వత్కృతే వధమ్. 50

ఓర్వలేనితనమునకు లోబడినవాడవై నాయనా! కౌరవుల నందరిని చంపు కొనకుము. ఈ భూమి యంతయు నీకొరకై నాశము పొందకుండుగాక !

యచ్చ త్వం మన్యసే మూఢ భీష్మద్రోణకృపాదయః,
యోత్స్యన్తే సర్వశ క్త్యేతి నైత దద్యోపపద్యతే. 51

మూఢా! నీవు భీష్ముడు, ద్రోణుడు, కృపుడు మున్నగువారు తమ మొత్తము శక్తిని ధారపోసి పోరుదురని తలపోయుచున్నావు. నే డది కుదురదు.

సమం హి రాజ్యం ప్రీతిశ్చ స్థానం హి విదితాత్మనామ్,
పాణ్డవే ష్వథ యుష్మాసు ధర్మ స్త్వభ్యధిక స్తతః. 52

వారల హృదయము లందరకు తెలిసినవే. వారికి పాండవులయందును మీయందును రాజ్యము ప్రీతి చుట్టరికము సమానములే. అంతకంటె పాండవులలో ధర్మము మిన్నగా నున్నది.

రాజపిణ్డభయా దేతే యది హాస్యన్తి జీవితమ్,
న హి శక్ష్యన్తి రాజానం యుధిష్ఠిర ముదీక్షితుమ్. 53

రాజు పెట్టినకూడు తినుచున్నా మన్న భయముతో వీరు ప్రాణములనైన వదలుదురు గాని యుధిష్ఠిరమహారాజును కన్నెత్తియు చూడజాలరు.

న లోభా దర్థసంపత్తి ర్నరాణా మిహ దృశ్యతే,
తదలం తాత లోభేన ప్రశామ్య భరతర్షభ. 54

మానవులకు లోభమువలన ధనము లభించుట యెందును కానరాదు. కావున నాయనా! భరతవరేణ్యా! శాంతి పొందుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
గాన్ధారీవాక్యే ఊనత్రింశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
గాంధారి వాక్యము గల నూటయిరువదితొమ్మిదవ అధ్యాయము.

—: o :—

50. మా గమత్ - మా గచ్ఛతు - పొందకుండుగాక!

# త్రింశదధికశతతమోఽధ్యాయః
# నూటముప్పదియవ అధ్యాయము

**సాత్యకికర్తృకం దుర్యోధనదుర్మన్త్రితాయాః ప్రకాశనం, శ్రీకృష్ణస్య సింహవద్ గర్జనం, ధృతరాష్ట్రవిదురాభ్యాం పునర్దుర్యోధనస్య బోధనమ్.**

**సాత్యకి దుర్యోధనదురాలోచనను బయటపెట్టుట, శ్రీకృష్ణుడు సింహము వలె గర్జించుట, ధృతరాష్ట్రుడు, విదురుడును మరల దుర్యోధనునకు మంచి మాటలు చెప్పుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తత్తు వాక్య మనాదృత్య సోఽర్థవ న్మాతృభాషితమ్,
పునః ప్రతస్థే సంరమ్భాత్ సకాశ మకృతాత్మనామ్. 1

గొప్ప ప్రయోజనము కూర్చునట్లు తల్లి పలికిన మాటను త్రోసిపుచ్చి దుర్యోధనుడు చిరచిరలాడుచు మరల నీచబుద్ధు లున్న చోటికి పోయెను.

తతః సభాయా నిర్గమ్య మన్త్రయామాస కౌరవః,
సౌబలేన మతాక్షేణ రాజ్ఞా శకునినా సహ. 2

కురురాజు సభనుండి వెలికివచ్చి పాచికలలో ప్రవీణుడగు శకునితో మంతనము లాడజొచ్చెను.

దుర్యోధనస్య కర్ణస్య శకునేః సౌబలస్య చ,
దుఃశాసనచతుర్థానా మిద మాసీ ద్విచేష్టితమ్. 3

దుర్యోధనుడు, కర్ణుడు, శకుని నాలుగవవాడగు దుశ్శాసనుడు ఈ నలుగురి పిచ్చిచేష్ట యిటు లుండెను.

పురాఽయ మస్మాన్ గృహ్ణాతి క్షిప్రకారీ జనార్దనః,
సహితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా శాన్తనవేన చ. 4

ఈ కృష్ణుడు తలచిన పని వెంటనే చేసివైచును. రాజైన ధృతరాష్ట్రునితో భీష్మునితో కలిసి ముందే మనలను పట్టివేయును.

వయ మేవ హృషీకేశం నిగృహ్ణీమ బలాదివ,
ప్రసహ్య పురుషవ్యాఘ్ర మిన్ద్రో వైరోచనిం యథా. 5

మనమే బలమంతయు కూడగట్టుకొని ఒక్కపెట్టున గొప్ప మగవాడగు శ్రీకృష్ణుని, ఇంద్రుడు బలిని బంధించినట్లు బంధింతము.

శ్రుత్వా గృహీతం వార్ష్ణేయం పాణ్డవా హతచేతసః,
నిరుత్సాహా భవిష్యన్తి భగ్నదంష్ట్రా ఇవోరగాః. 6

కృష్ణుని మనము పట్టుకొన్నమాట విన్న పాండవులు గుండెలు జారి, కోరలు విరిగిన పాములవలె, చచ్చుబడి పోవుదురు.

అయం హ్యేషాం మహాబాహుః సర్వేషాం శర్మ వర్మ చ,
అస్మిన్ గృహీతే వరదే ఋషభే సర్వసాత్వతామ్, 7
నిరుద్యమా భవిష్యన్తి పాణ్డవాః సోమకైః సహ.

ఈతడు పాండవుల కందరకు సుఖమును గూర్చు కవచము. సాత్వతు లందరిలో గొప్పవాడును, వలసినపుడెల్ల వరము లొసగువాడును అగు ఈతడు పట్టువడినచో పాండవులు సోమకులతోపాటు చేష్ట లుడిగినవా రగుదురు.

తస్మా ద్వయ మిహైవైనం కేశవం క్షిప్రకారిణమ్,
క్రోశతో ధృతరాష్ట్రస్య బద్ధ్వా యోత్స్యామహే రిపూన్. 8

కావున మన మిచ్చటనే వడిగా కార్యములు నిర్వహించు కృష్ణుని, ధృతరాష్ట్రుడు మొత్తుకొనుచుండగా, కట్టి పడవైచి శత్రువులతో పోరుదము.

తేషాం పాప మభిప్రాయం పాపానాం దుష్టచేతసామ్,
ఇఙ్గితజ్ఞః కవిః క్షిప్ర మన్వబుధ్యత సాత్యకిః. 9

పాడుబుద్ధిగల ఆ పాపుల పాపభావమును బుద్ధికుశలుడు, ఇతరుల భావములను గుర్తింపగలవాడు నగు సాత్యకి పసిగట్టెను.

---

5. వైరోచనిమ్ - విరోచనుని కుమారుడగు బలిని;
9. ఇంగితజ్ఞః - ఇంగిత మనగా మనసులోని భావన - అది ఎరుగగలవాడు; కవిః - మేధావి.

తదర్థ మభినిష్క్రమ్య హార్దిక్యేన సహాస్థితః,
అబ్రవీత్ కృతవర్మాణం క్షిప్రం యోజయ వాహినీమ్. 10

ఆ పనిమీద వెలుపలికివచ్చి కృతవర్మను కలిసికొని 'త్వరగా సేనను సిద్ధము చేయు'మని పలికెను.

వ్యూఢానీకః సభాద్వార ముపాతిష్ఠస్వ దంశితః,
యావదాఖ్యా మ్యహం చైతత్ కృష్ణా యాక్లిష్టకర్మణే. 11

చక్కగా అంతయు స్థిరపరచుకొని సేనను తీర్చుకొని సభాద్వారము కడ నిలువుము. ఈ లోపల నేను అన్నిపనులు సుఖముగా నిర్వహించు కృష్ణునకు దీనిని చెప్పుదును.

స ప్రవిశ్య సభాం వీరః సింహో గిరిగుహామివ,
ఆచష్ట తమభిప్రాయం కేశవాయ మహాత్మనే. 12

అంత నా వీరుడు సింహము కొండగుహలో చొరబారినట్లు సభలోనికి ప్రవేశించి వారి ఆ అభిప్రాయమును మహాత్ముడగు శ్రీకృష్ణునకు తెలియజేసెను.

ధృతరాష్ట్రం తతశ్చైవ విదురం చాన్వభాషత,
తేషా మేత మభిప్రాయ మాచచక్షే స్మయన్నివ. 13

పిదప ధృతరాష్ట్రుని, విదురుని పలుకరించెను. నవ్వుచు దుర్యోధనాదుల అభిప్రాయమును వారి కెరింగించెను.

ధర్మా దర్థాచ్చ కామాచ్చ కర్మ సాధువిగర్హితమ్,
మన్దాః కర్తు మిహేచ్ఛన్తి న చావాప్య కథఞ్చన. 14

ఎంత చెప్పినను హితమును పట్టించుకొనక ధర్మమునకు, అర్థమునకు, కామమునకు వెలియైనది, సజ్జనులు ఏవగించునదియు నగు పనిని బుద్ధిహీనులు చేయగోరుచున్నారు.

---

14. కర్మ-దూతను బంధించుట అనుదానిని;

పురా వికుర్వతే మూఢాః పాపాత్మానః సమాగతాః,
ధర్షితాః కామమన్యుభ్యాం క్రోధలోభవశానుగాః. 15

మూఢులు పాపాత్ములు నగు వీరందరు ఏకమై, కామక్రోధములకు లొంగి, క్రోధలోభముల త్రిప్పులకు లోబడి ముందుగా పాడుపని చేయుచున్నారు.

ఇమం హి పుణ్డరీకాక్షం జిఘృక్ష న్త్యల్పచేతసః,
పటేనాగ్నిం ప్రజ్వలితం యథా బాలా యథా జడాః. 16

పసివారు, వివేకము లేనివారును మండుచున్న నిప్పును బట్టలో పట్టదలచి నట్లు ఈ లఘుబుద్ధులు ఈ పుండరీకాక్షుని పట్టగోరుచున్నారు.

సాత్యకే స్తద్వచః శ్రుత్వా విదురో దీర్ఘదర్శివాన్,
ధృతరాష్ట్రం మహాబాహు మబ్రవీత్ కురుసంసది. 17

సాత్యకి పలికిన ఆ మాట విని ముందుచూపు గల విదురుడు కురుసభలో ధృతరాష్ట్రునితో నిట్లు పలికెను.

రాజన్ పరీతకాలాస్తే పుత్రాః సర్వే పరంతప,
అశక్య మయశస్యం చ కర్తుం కర్మ సముద్యతాః. 18

రాజా! కాలము మూడిన నీ కొడుకు లందరు చేతకానిది, అపకీర్తిని పుట్టించునదియు నగు పనిచేయ నుంకించుచున్నారు.

ఇమం హి పుణ్డరీకాక్ష మభిభూయ ప్రసహ్యా చ,
నిగ్రహీతుం కిలేచ్ఛన్తి సహితా వాసవానుజమ్. 19

ఉపేంద్రుడగు ఈ పుండరీకాక్షుని లెక్కగొనక బలాత్కారముగా అందరు కూడి పట్టుకొనగోరుచున్నారట.

---

15. వికుర్వతే - వికారమగు పనిని - కయ్యమును - చేయుచున్నారు.

18. అశక్యమ్ - చేయశక్యము కానిది.

19. వాసవానుజమ్ - ఇంద్రుని తమ్ముడగు విష్ణువును; త్రివిక్రముని అని భావము.

ఇమం పురుషశార్దూల మప్రధృష్యం దురాసదమ్,
ఆసాద్య న భవిష్యన్తి పతఙ్గా ఇవ పావకమ్. 20

మిడుతలు అగ్నిని తాకిన విధమున, ఎవ్వరికిని లొంగనివాడు, సమీపింప రానివాడు నగు ఈ పురుషసింహము దరి చేరి వీరు బ్రదుకరు.

అయ మిచ్ఛన్ హి తాన్ సర్వాన్ యుధ్యమానాన్ జనార్దనః,
సింహో నాగానివ క్రుద్ధో గమయే ద్యమసాదనమ్. 21

ఈ జనార్దనుడు తలచుకొన్నచో పోరవచ్చు వీరి నందరిని, కోపించిన సింహము ఏనుగులను వలె, యమలోకమునకు చేర్చును.

న త్వయం నిన్దితం కర్మ కుర్యాత్ పాపం కథంచన,
న చ ధర్మా దపక్రామే దచ్యుతః పురుషోత్తమః. 22

కాని యీతడు జనులు నిందించు పాపపుపని నెన్నటికిని చేయడు. అచ్యుతుడు, పురుషోత్తముడు అగు శ్రీకృష్ణుడు ధర్మమునుండి తొలగడు గదా!

[యథా వారాణసీ దగ్ధా సాశ్వా సరథకుంజరా,
సానుబన్ధస్తు కృష్ణేన కాశీనా మృషభో హతః.
తథా నాగపురం దగ్ధ్వా శఙ్ఖచక్రగదాధరః,
స్వయం కాలేశ్వరో భూత్వా నాశయిష్యతి కౌరవాన్.

శ్రీకృష్ణుడు మునుపు గుఱ్ఱములతో ఏనుగులతో కాశీనగరమును గాల్చివైచెను. కాశీరాజును బంధువులతోపాటు చంపివైచెను. అట్లే శంఖము, చక్రము, గద చేపట్టిన ఆతడు స్వయముగా కాలపురుషుడై హస్తినాపురమును బూదిచేసి కౌరవులను రూపుమాపును.

పారిజాతహరం హ్యేన మేకం యదుసుఖావహమ్,
నాభ్యవర్తత సంరబ్ధో వృత్రహా వసుభిః సహ.

యాదవుల కానందము కలిగించు నీతడు ఒక్కడై పారిజాతమును పెల్లగించుకొని పోవుచుండగా వసువులతోపాటు దేవేంద్రుడు త్రొక్కిసలాడుచు నీతనిని మరలింపలేకపోయెను.

ప్రాప్య నిర్మోచనే పాశాన్ షట్సహస్రాం స్తరస్వినః,
హృతాస్తే వాసుదేవేన హ్యువసంక్రమ్య మౌరవాన్.

నిర్మోచన మను ప్రదేశమున మిక్కిలి వడిగల ఆరు వేలమంది పాశులను ఈ వాసుదేవుడు నాశనము చేసెను. అట్లే పౌరవుల నాక్రమించెను.

ద్వార మాసాద్య సౌంభస్య విధూయ గదయా గిరిమ్,
ద్యుమత్సేనః సహామాత్యః కృష్ణేన వినిపాతితః.

ఈ కృష్ణుడు సౌంభకపురము ద్వారము కడ కరిగి గదతో కొండను పిండిగొట్టి ద్యుమత్సేనుని, వాని మంత్రులను కూలద్రోసెను.

శేషవత్త్వాత్ కురూణాం తు ధర్మాపేక్షీ తథాచ్యుతః,
క్షమతే పుణ్డరీకాక్షః శక్తః సన్ పాపకర్మణః.

ఈ కౌరవుల కింకను కాలము మిగిలియున్నది. కావునను ఆతడు ధర్మమును నిలవబెట్ట గోరుచున్నవాడు కావునను పుండరీకాక్షుడు సమర్థుడయ్యు ఈ పాపకర్ములను క్షమించుచున్నాడు.

ఏతే హి యది గోవిన్ద మిచ్ఛన్తి సహ రాజభిః,
అద్యైవాతిథయః సర్వే భవిష్యన్తి యమస్య తే.

వీరు ఈ గోవిందుని తక్కిన రాజులతో సాటిగా భావింతురేని నేడే వీరందరు యమునికి అతిథులు కాగలరు.

యథా వాయో స్తృణాగ్రాణి వశం యాన్తి బలీయసః,
తథా చక్రభృతః సర్వే వశ మేష్యన్తి కౌరవాః.

మహాబలముగల వాయువునకు గడ్డిపరకలు వశమైనట్లు ఈ చక్రధారికి కౌరవులందరు వశమై పోవుదురు.]

విదురేణైవ ముక్తే తు కేశవో వాక్య మబ్రవీత్,
ధృతరాష్ట్ర మభిప్రేక్ష్య సుహృదాం శృణ్వతాం మిథః. 23

విదురు డిట్లు పలుకగా శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని చూచి, మిత్రు లందరు గుమిగూడి వినుచుండగా ఇట్లు పలికెను.

రాజన్నేతే యది క్రుద్ధా మాం నిగృహ్ణీయు రోజసా,
ఏతే వా మా మహం వైతా ననుజానీహి పార్థివ. 24

రాజా! వీరు క్రోధము లార్చి బలముతో నన్ను పట్టుకొందురట! నన్ను వీరో, నేను వీరినో పట్టుట నీవే యెరుగుదువు.

ఏతాన్ హి సర్వాన్ సంరబ్ధా న్నియన్తు మహ ముత్సహే,
న త్వహం నిన్దితం కర్మ కుర్యాం పాపం కథఞ్చన. 25

కోపములో ఊగిపోవుచున్న వీరి నందరిని నేను చక్కజేయగలను. కాని అందరు నిందించు పాపకర్మమును ఎన్నటికిని చేయజాలను.

పాణ్డవార్థే హి లుభ్యన్తః స్వార్థాన్ హాస్యన్తి తే సుతాః,
ఏతే చే దేవ మిచ్ఛన్తి కృతకార్యో యుధిష్ఠిరః. 26

పాండవుల సొమ్మున కాసపడి యీ నీ కొడుకులు తమ ప్రయోజనములనే వదలివేయుచున్నారు. వారి కోరిక అదియే యైనచో ధర్మరాజు పని నెరవేరినట్లే.

అద్యైవ హ్యహ మేనాంశ్చ యే చైనా నను భారత,
నిగృహ్య రాజన్ పార్థేభ్యో దద్యాం కిం దుష్కృతం భవేత్. 27

నేడే నేను వీరిని, వీరి వెంటబడి తిరుగువారిని పట్టుకొని కుంతికొడుకుల కప్పగింతును. అది యేమి తప్పుడుపని యగునా?

ఇదం తు న ప్రవర్తేయం నిన్దితం కర్మ భారత,
సన్నిధౌ తే మహారాజ క్రోధజం పాపబుద్ధిజమ్. 28

కాని క్రోధమువలన, పాపబుద్ధివలన పుట్టెడు ఆ నిందితమైన కర్మమును, మహారాజా! నీ సన్నిధిలో నేను చేయను.

ఏష దుర్యోధనో రాజన్ యథేచ్ఛతి తథాఽస్తు తత్,
అహం తు సర్వాం స్తనయా ననుజానామి తే నృప. 29

రాజా! ఈ దుర్యోధనుడు కోరినట్లే యగుగాక! నేను మాత్రము నీ కొడుకుల నందరను క్షమించుచున్నాను.

ఏతచ్ఛ్రుత్వా తు విదురం ధృతరాష్ట్రోఽభ్యభాషత,
క్షిప్ర మానయ తం పాపం రాజ్యలుబ్ధం సుయోధనమ్. 30

28. ఇదం కర్మ-ఈ పనిని-చేయుటకు అనుదానిని కలుపుకొనవలయును.

ధృతరాష్ట్రు డా మాట విని విదురునితో నిట్లు పలికెను-రాజ్యమున పెను లోభము గల ఆ పాపాత్ముని సుయోధనుని వెంటనే తీసికొనిరమ్ము.

సహమిత్రం సహామాత్యం ససోదర్యం సహానుగమ్,
శక్నుయాం యది పన్థాన మవతారయితుం పునః. 31

మిత్రులతో, మంత్రులతో, తమ్ములతో, వెంటబడి తిరుగు వారితోపాటు వానిని సరియగుదారికి తేగలనేమో మరల ప్రయత్నించెదను.

తతో దుర్యోధనం క్షత్తా పునః ప్రావేశయత్ సభామ్,
అకామం భ్రాతృభిః సార్ధం రాజభిః పరివారితమ్. 32

అంత విదురుడు తమ్ములతో, ఇతరరాజులతో కూడియున్న దుర్యోధనుని వచ్చుట కిష్టపడనివానిని - మరల సభలోనికి తెచ్చెను.

అథ దుర్యోధనం రాజా ధృతరాష్ట్రోఽభ్యభాషత,
కర్ణదుఃశాసనాభ్యాం చ రాజభి శ్చాపి సంవృతమ్. 33

కర్ణుడు, దుశ్శాసనుడు ఇతరరాజులు చుట్టియున్న దుర్యోధనునితో ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

నృశంస పాపభూయిష్ఠ క్షుద్రకర్మసహాయవాన్,
పాపైః సహాయైః సంహత్య పాపం కర్మ చికీర్షసి. 34

క్రూరుడా! నిలువెల్ల పాపములు నిండినవాడా! నీచపు పనులు చేయు వారిని పాపులను తోడుగా గొని వారితో కలిసి పాపకర్మము చేయగోరుచున్నావు.

అశక్య మయశస్యం చ సద్భిశ్చాపి విగర్హితమ్,
యథా త్వాదృశకో మూఢో వ్యవస్యేత్ కులపాంసనః. 35

చేతకానిది, కీర్తిని చంపునది, సజ్జనులు ఏవగించుకొనునది యగు పనిని తలపెట్టితివి. నీవంటి మూఢుడు కులదూషకు డిట్లే ప్రవర్తించును.

త్వమిమం పుణ్డరీకాక్ష మప్రధృష్యం దురాసదమ్,
పాపైః సహాయైః సంహత్య నిగ్రహీతుం కిలేచ్ఛసి. 36

నీవు పాపులగు సహాయులతో కూడుకొని ఎవ్వరికిని లొంగనివాడు, దరిజేరరానివాడు అగు శ్రీకృష్ణుని పట్ట నెంచుచున్నావట!

---

31. పన్థాన మవతారయితుమ్-మంచిదారికి తెచ్చుటకు.

యో న శక్యో బలాత్కర్తుం దేవైరపి సవాసవైః,
తం త్వం ప్రార్థయసే మన్ద బాల శ్చన్ద్రమసం యథా. 37

దేవేంద్రునితోపాటు దేవత లందరు బలాత్కరింపజాలని శ్రీకృష్ణుని బుద్ధి లేని నీవు, పసివాడు చంద్రబింబమును పట్టజూచినట్లు పట్టగోరుచున్నావు.

దేవై ర్మనుష్యై ర్గన్ధర్వై రసురై రురగైశ్చ యః,
న సోఢుం సమరే శక్య స్తం న బుధ్యసి కేశవమ్. 38

దేవతలకు, మనుజులకు, గంధర్వులకు, రాక్షసులకు, సర్పములకు యుద్ధమున సహింప నలవిగాని శ్రీకృష్ణుని తెలియజాలకున్నావు.

దుర్గ్రాహ్యః పాణినా వాయు ర్దుస్స్పర్శః పాణినా శశీ,
దుర్ధరా పృథివీ మూర్ధ్నా దుర్గ్రాహ్యః కేశవో బలాత్. 39

గాలి చేతికి పట్టుపడదు. చంద్రుని చేతితో తాకజాలము. భూమిని నెత్తిపై మోయజాలము. బలముతో శ్రీకృష్ణుని పట్టజాలము.

ఇత్యుక్తే ధృతరాష్ట్రేణ క్షత్తాఽపి విదురోఽబ్రవీత్,
దుర్యోధన మభిప్రేత్య ధార్తరాష్ట్ర మమర్షణమ్. 40

ధృతరాష్ట్రు డిట్లు పలికిన పిదప విదురుడును కోపముతో చురచురలాడు చున్న దుర్యోధనుని చూచి యిట్లు పలికెను.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

దుర్యోధన నిబోధేదం వచనం మమ సాంప్రతమ్,
సౌభద్వారే వానరేన్ద్రో ద్వివిదో నామ నామతః,
శిలావర్షేణ మహతా ఛాదయామాస కేశవమ్. 41

దుర్యోధనా! ఇప్పటికైనను నామాట విను. సౌభద్వార మనుచోట ద్వివిదు డను కోతిరాజు పెద్ద రాలవానతో శ్రీకృష్ణుని కప్పివైచెను.

గ్రహీతుకామో విక్రమ్య సర్వయత్నేన మాధవమ్,
గ్రహీతుం నాశక చ్చైనం తం త్వం ప్రార్థయసే బలాత్. 42

పరాక్రమముతో వాడు ప్రయత్న మంతయు చేసి మాధవుని పట్టగోరెను. కాని వాని కది చేతకాలేదు. అట్టివానిని నీవు బలముతో పట్టగోరుచున్నావు.

ప్రాగ్జ్యోతిషగతం శౌరిం నరకః సహ దానవైః,
గ్రహీతుం నాశక త్తత్ర తం త్వం ప్రార్థయసే బలాత్. 43

ప్రాగ్జ్యోతిషమున కరిగిన యీతనిని నరకుడు రాక్షసు లందరితో కలిసి పట్టగోరెను. పట్టలేకపోయెను. నీవు బలముతో పట్ట నుంకించుచున్నావు.

అనేకయుగవర్షాయు ర్నిహత్య నరకం మృధే,
నీత్వా కన్యాసహస్రాణి ఉపయేమే యథావిధి. 44

పెక్కు యుగముల ఆయువు గల ఈ కృష్ణుడు యుద్ధమున నరకుని చంపి వేలకొలది కన్యలను తెచ్చి శాస్త్రము చెప్పిన తీరున పెండ్లియాడెను.

నిర్మోచనే షట్సహస్రాః పాశైర్బద్ధా మహాసురాః,
గ్రహీతుం నాశకం శ్చైనం తం త్వం ప్రార్థయసే బలాత్. 45

నిర్మోచన మను చోట ఆరువేలమంది పెనురక్కసులు - పాశముల బంధము కలవారు - ఈతనిని పట్టజాలరైరి. నీ వాతనిని బలముతో లొంగదీయ నెంచుచున్నావు.

అనేన హి హతా బాల్యే పూతనా శకునీ తథా,
గోవర్ధనో ధారితశ్చ గవార్థే భరతర్షభ. 46

పిన్ననాటనే యీతడు పూతనను మట్టుపెట్టెను. అట్లే బకుడను రాక్షసుని కూడ చంపెను. గోవులను రక్షించుటకై గోవర్ధనపర్వతము నెత్తిపట్టెను.

అరిష్టో ధేనుక శ్చైవ చాణూరశ్చ మహాబలః,
అశ్వరాజశ్చ నిహతః కంస శ్చారిష్ట మాచరన్. 47

అతనికి కీడు చేయగోరుచు అరిష్టాసురుడు, ధేనుకాసురుడు, గొప్ప బలము గల చాణూరుడు, అశ్వరాజు, కంసుడు చచ్చిరి.

జరాసన్ధశ్చ వక్త్రశ్చ శిశుపాలశ్చ వీర్యవాన్,
బాణశ్చ నిహతః సంఖ్యే రాజానశ్చ నిషూదితాః. 48

జరాసంధుడు, దంతవక్త్రుడు, గొప్ప బలముగల శిశుపాలుడు బాణాసురుడును ఈతనిచేత యుద్ధమున మడిసిరి. మరియు పెక్కండ్రు రాజుల నీతడు చంపెను.

వరుణో నిర్జితో రాజా పావక శ్చామితౌజసా,
పారిజాతం చ హరతా జితః సాక్షా చ్ఛచీపతిః. 49

మితిలేని దేహబలము గల ఈ శ్రీకృష్ణునకు వరుణుడు, అగ్నియు నోడిపోయిరి. పారిజాతమును తెచ్చునపుడు సాక్షాత్తు దేవేంద్రుడే ఓడిపోయెను.

ఏకార్ణవే చ స్వపతా నిహతౌ మధుకైటభౌ,
జన్మాన్తర ముపాగమ్య హయగ్రీవ స్తథా హతః. 50

ప్రళయకాలమున అంతయు జలమయ మైనపుడు యోగనిద్రలో నున్న యీతడు మధుకైటభులను సంహరించెను. మరియొక జన్మమున హయగ్రీవుడను రాక్షసుని చంపెను.

అయం కర్తా న క్రియతే కారణం చాపి పౌరుషే,
యద్య దిచ్ఛేదయం శౌరి స్తత్తత్ కుర్యా దయత్నతః. 51

ఈత దన్నింటికి కర్త. ఈతనికి కర్త లేడు. పౌరుషమున కీతడే కారణము. ఈ శౌరి యేదేది చేయగోరిన దాని నెల్ల ప్రయత్నము లేకయే చేయును.

తం న బుధ్యసి గోవిన్దం ఘోరవిక్రమ మచ్యుతమ్,
ఆశీవిష మివ క్రుద్ధం తేజోరాశి మనిన్దితమ్. 52

గోవిందుడు ఘోరమైన పరాక్రమము కలవాడు. ఎందును చ్యుతి లేనివాడు. కోపించిన త్రాచువంటివాడు. ముద్దకట్టిన తేజస్సు. ఏ దోషము లేనివాడు. అట్టివానిని తెలియకున్నావు.

ప్రధర్షయ న్మహాబాహుం కృష్ణ మక్లిష్టకారిణమ్,
పతఙ్గోఽగ్ని మివాసాద్య సామాత్యో న భవిష్యసి. 53

అట్టి మహాబాహువు, సులభముగా సర్వము నిర్వహించువాడు అగు కృష్ణుని దరి జేరి అగ్నిలో బడ్డ మిడుతవలె నీ మంత్రులతో పాటు నశించిపోవుదువు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదురవాక్యే త్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
విదురవాక్యము గల నూటముప్పదవ అధ్యాయము.

—:o:—

51. కర్తా - సర్వము సృజించువాడు; న క్రియతే - సృజింపబడనివాడు; పౌరుషే కారణమ్ - సర్వకార్యములకు శక్తి నొసగువాడు;

# ఏకత్రింశదధికశతతమోఽధ్యాయః

# నూటముప్పదియొకటవ అధ్యాయము

## స్వీయవిశ్వరూపదర్శనం కారయిత్వా శ్రీకృష్ణస్య కౌరవసభాతః ప్రస్థానమ్.

## శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును జూపించి కౌరవసభనుండి బయలుదేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

విదురే ణైవ ముక్తస్తు కేశవః శత్రుపూగహా,
దుర్యోధనం ధార్తరాష్ట్ర మభ్యభాషత వీర్యవాన్. 1

విదురు డట్లు దుర్యోధనునకు బోధించిన పిదప మహాశక్తి గలవాడు, శత్రువుల సముదాయములను పరిమార్చువాడు నగు శ్రీకృష్ణుడు దుర్యోధనునితో నిట్లు పలికెను.

ఏకోఽహ మితి యన్మోహా న్మన్యసే మాం సుయోధన,
పరిభూయ సుదుర్బుద్ధే గ్రహీతుం మాం చికీర్షసి. 2

సుయోధనా! సుదుర్బుద్ధీ! నేనొక్కడనే యని అజ్ఞానము వలన భావించి నన్ను అవమానించి పట్టగోరుచున్నావు.

ఇహైవ పాణ్డవాః సర్వే తథై వాన్ధకవృష్ణయః,
ఇహాదిత్యాశ్చ రుద్రాశ్చ వసవశ్చ మహర్షిభిః. 3

ఇదిగో ఇక్కడనే పాండవులు, అంధకులు, వృష్ణివంశమువారు, ఆదిత్యులు, రుద్రులు, వసువులు, మహర్షులతోపాటు అందరు కలరు.

తస్య సంస్మయతః శౌరే ర్విద్యుద్రూపా మహాత్మనః,
అఙ్గుష్ఠమాత్రా స్త్రిదశా ముముచుః పావకార్చిషః. 4

అట్లు అట్టహాసము చేయుచున్న మహాత్ముడగు శౌరినుండి మెరపులవంటి రూపములతో అగ్నిజ్వాలలు గలవారు బొట్టనవ్రేలంతవారు అగు దేవతలు వెలికి వచ్చిరి.

అస్య బ్రహ్మ లలాటస్థో రుద్రో వక్షసి చాభవత్. 5

అతని నొసట బ్రహ్మయు రొమ్మున రుద్రుడును ఉండిరి.

లోకపాలా భుజేష్వాస న్నగ్ని రాస్యా దజాయత,
ఆదిత్యా శ్చైవ సాధ్యాశ్చ వసవోఽథాశ్వినా వపి. 6

లోకపాలకు లందరు భుజములయందు నిలిచిరి. ముఖమునుండి అగ్ని బయలుదేరెను. ఆదిత్యులు, సాధ్యులు, వసువులు, అశ్వినీదేవతలును గానవచ్చిరి.

మరుతశ్చ సహేన్ద్రేణ విశ్వేదేవా స్తథైవ చ,
బభూవు శ్చైకరూపాణి యక్షగన్ధర్వరక్షసామ్. 7

దేవేంద్రునితో పాటు దేవతలు, విశ్వేదేవులు, యక్షులు, గంధర్వులు, రక్షస్సులు - ఒక్కరూపముతో అచట తోచిరి.

ప్రాదురాస్తాం తథా దోర్భ్యాం సంకర్షణధనంజయౌ,
దక్షిణోఽథార్జునో ధన్వీ హలీ రామశ్చ సవ్యతః. 8

అతని భుజమునుండి బలరాముడు, అర్జునుడు పుట్టుకొని వచ్చిరి. కుడి భుజమున విల్లు ధరించి అర్జునుడును, ఎడమ భుజమున నాగలిపట్టుకొని బలరాముడును గానవచ్చిరి.

భీమో యుధిష్ఠిరశ్చైవ మాద్రీపుత్రౌ చ పృష్ఠతః.

భీముడు, యుధిష్ఠిరుడు, మాద్రికొడుకులు వెనుకవైపున కానవచ్చిరి.

అన్ధకా వృష్ణయ శ్చైవ ప్రద్యుమ్నప్రముఖా స్తతః,
అగ్రే బభూవుః కృష్ణస్య సముద్యతమహాయుధాః. 9

అంధకులు, వృష్ణులు, ప్రద్యుమ్నుడు మొదలగువారు ఆయుధము లెత్తి పట్టుకొని కృష్ణుని ముందు నిలిచిరి.

---

8. దోర్భ్యామ్ - భుజములనుండి.

శఙ్ఖ-చక్ర-గదా-శక్తి-శార్ఙ్గ-లాఙ్గల-నన్దకాః, 10
అదృశ్యన్తోద్యతాన్యేవ సర్వప్రహరణాని చ,
నానాబాహుషు కృష్ణస్య దీప్యమానాని సర్వశః. 11

శంఖము, చక్రము, గద, శక్తి, శార్ఙ్గమను విల్లు, నాగలి, నందకమను ఖడ్గము, మరియు తక్కిన ఆయుధము లన్నియు శ్రీకృష్ణుని పెక్కు చేతులలో వెలుగులు చిమ్ముచు పైకి లేచి కానవచ్చినవి.

నేత్రాభ్యాం నస్తతశ్చైవ శ్రోత్రాభ్యాం చ సమన్తతః,
ప్రాదురాసన్ మహారౌద్రాః సధూమాః పావకార్చిషః. 12

కన్నులనుండి, ముక్కునుండియు, చెవులనుండియు, మిక్కిలి భయము గొలుపు, పొగతో కూడిన అగ్నిజ్వాలలు వెలువడినవి.

రోమకూపేషు చ తథా సూర్యస్యేవ మరీచయః.

రోమకూపములనుండి సూర్యుని కిరణములవంటి జ్వాలలు తోచినవి.

తం దృష్ట్వా ఘోర మాత్మానం కేశవస్య మహాత్మనః,
న్యమీలయన్త నేత్రాణి రాజాన స్త్రస్తచేతసః. 13

మహాత్ముడగు కేశవుని ఆ ఘోరరూపమును గాంచి రాజు లందరు గుండె లదరుచుండగా కనులు మూసికొనిరి.

ఋతే ద్రోణం చ భీష్మం చ విదురం చ మహామతిమ్,
సఞ్జయం చ మహాభాగ మృషీం శ్చైవ తపోధనాన్. 14

ద్రోణుడు, భీష్ముడు, దొడ్డబుద్ధిగల విదురుడు, పుణ్యాత్ముడగు సంజయుడు, తపోధనులగు ఋషులు మాత్రము కన్నులు మూసికొనలేదు.

ప్రాదాత్తేషాం స భగవాన్ దివ్యం చక్షు ర్జనార్దనః. 15

వారికి భగవంతుడగు జనార్దనుడు దివ్యమగు నేత్రము నొసగెను.

తద్దృష్ట్వా మహదాశ్చర్యం మాధవస్య సభాతలే,
దేవదున్దుభయో నేదుః పుష్పవర్షం పపాత చ. 16

మాధవుడు సభాతలమున చూపిన ఆ మహాశ్చర్యమును గాంచి దేవతల దుందుభులు మోరసినవి. పూలవాన కురిసెను.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

త్వమేవ పుణ్డరీకాక్ష సర్వస్య జగతో హితః,

తస్మాత్ త్వం యాదవశ్రేష్ఠ ప్రసాదం కర్తు మర్హసి. 17

పుండరీకాక్షా! నీవే జగత్తున కంతటికిని మేలుకూర్చువాడవు. కావున నాయందు అనుగ్రహము చూపుము.

భగవన్ మమ నేత్రాణా మన్తర్ధానం వృణే పునః,

భవన్తం ద్రష్టు మిచ్ఛామి నాన్యం ద్రష్టు మిహోత్సహే. 18

నేను మరల కన్నులు మూతపడుటనే కోరుదును. నిన్ను చూడగోరుచున్నాను. మరి యెవ్వరిని చూడగోరను.

తతోఽబ్రవీ న్మహాబాహు ర్ధృతరాష్ట్రం జనార్దనః,

అదృశ్యమానే నేత్రే ద్వే భవేతాం కురునన్దన. 19

అప్పుడు మహాబాహువగు జనార్దనుడు ధృతరాష్ట్రునితో నీ కన్ను లితరులకు కనబడవని పలికెను.

తత్రాద్భుతం మహారాజ ధృతరాష్ట్రశ్చ చక్షుషీ,

లబ్ధవాన్ వాసుదేవాచ్చ విశ్వరూపదిదృక్షయా. 20

మహారాజా! అప్పు డచ్చట అద్భుతముగా ధృతరాష్ట్రుడు విశ్వరూపము చూడగోరుటచేత కన్నులను పొందెను.

లబ్ధచక్షుష మాసీనం ధృతరాష్ట్రం నరాధిపాః,

విస్మితా ఋషిభిః సార్ధం తుష్టువు ర్మధుసూదనమ్. 21

అచట రాజులందరు ఋషులతోపాటు కన్నులు పొంది కూర్చున్న ధృతరాష్ట్రుని చూచి అచ్చెరువందిరి. మధుసూదనుని స్తుతించిరి.

చచాల చ మహీ కృత్స్నా సాగరశ్చాపి చుక్షుభే,

విస్మయం పరమం జగ్ముః పార్థివా భరతర్షభ. 22

భూమి యంతయు కదలసాగెను. సముద్రము కళవళపడెను. రాజులందరు పరమాశ్చర్యము పొందిరి.

---

19. అదృశ్యమానే-ఇతరులకు కానరావు అని తాత్పర్యము.

తతః స పురుషవ్యాఘ్రః సంజహార వపుః స్వకమ్,
తాం దివ్యా మద్భుతాం చిత్రా మృద్ధిమత్తా మరిందమః. 23

ఆ పురుషోత్తముడు తనదైన దేహమును పొందెను. దివ్యము, అద్భుతము, చిత్రము, సంపన్నము నగు తనువును ఉపసంహరించెను.

తతః సాత్యకి మాదాయ పాణౌ హార్దిక్య మేవ చ,
ఋషిభి స్తై రనుజ్ఞాతో నిర్యయౌ మధుసూదనః. 24

పిదప సాత్యకిని కృతవర్మను చేతులతో విలాసముగా పట్టుకొని ఋషుల కడ అనుమతి గొని మధుసూదనుడు బయలు వెడలెను.

ఋషయోఽన్తర్హితా జగ్ము స్తత స్తే నారదాదయః,
తస్మిన్ కోలాహలే వృత్తే తదద్భుత మివాభవత్. 25

నారదుడు మొదలగు ఋషులు ఆ గందరగోళములో కానరాకుండ వెడలి పోయిరి. అది యంతయు పెద్ద ఆశ్చర్యవిషయ మయ్యెను.

తం ప్రస్థిత మభిప్రేక్ష్య కౌరవాః సహ రాజభిః,
అనుజగ్ము ర్నరవ్యాఘ్రం దేవా ఇవ శతక్రతుమ్. 26

బయలుదేరిన కృష్ణుని గాంచి రాజులతోపాటు కురువంశము వారు, దేవేంద్రుని వెంటనంటిన దేవతల వలె, వెనుక నడువసాగిరి.

అచిన్తయ న్నమేయాత్మా సర్వం తద్రాజమణ్డలమ్,
నిశ్చక్రామ తతః శౌరిః సధూమ ఇవ పావకః. 27

మహానుభావుడగు శ్రీకృష్ణుడు ఆ రాజుల సముదాయమును లెక్కచేయక పొగతో కూడిన అగ్నివలె బయలు వెడలెను.

తతో రథేన శుభ్రేణ మహతా కిఙ్కిణీకినా,
హేమజాలవిచిత్రేణ లఘునా మేఘనాదినా. 28

28. లఘునా - వడిగల.

సూపస్కరేణ శుభ్రేణ వైయాఘ్రేణ వరూథినా,
శైబ్యసుగ్రీవయుక్తేన ప్రత్యదృశ్యత దారుకః. 29

స్వచ్ఛమైనది, గొప్పది, మువ్వలు గలది, బంగారు జాలరులతో విచిత్రమైనది, వేగము గలది, ఉరుమువంటి ధ్వని గలది, చక్కని పరికరములు గలది, పులితోలు తొడుగు గలది, శైబ్యము, సుగ్రీవము మున్నగు గుఱ్ఱములు పూన్చినది యగు రథముతో దారుకుడు కానవచ్చెను.

తథైవ రథ మాస్థాయ కృతవర్మా మహారథః,
వృష్ణీనాం సంమతో వీరో హార్దిక్యః సమదృశ్యత. 30

అట్లే రథము గొని మహారథుడు, వృష్ణివంశమువారికి ప్రియమైన వీరుడు, హృదికుని కుమారుడు నగు కృతవర్మ కానవచ్చెను.

ఉపస్థితరథం శౌరిం ప్రయాస్యన్త మరిన్దమమ్,
ధృతరాష్ట్రో మహారాజః పునరే వాభ్యభాషత. 31

రథమెక్కి బయలుదేరుచున్న శ్రీకృష్ణునితో ధృతరాష్ట్రమహారాజు మరల ఇట్లు పలికెను.

యావద్బలం మే పుత్రేషు పశ్యతస్తే జనార్దన,
ప్రత్యక్షం తే న తే కిఞ్చిత్ పరోక్షం శత్రుకర్శన. 32

జనార్దనా! శత్రుసంహారకుడా! కొడుకుల విషయమున నాకున్న బల మెట్టిదో స్వయముగా చూచుచున్న నీకు అంతయు ప్రత్యక్షమే. పరోక్షమే కొంచెమును లేదు.

కురూణాం శమ మిచ్ఛన్తం యతమానం చ కేశవ,
విదిత్వైతా మవస్థాం మే నాభిశఙ్కితు మర్హసి. 33

నేను కౌరవులు శాంతి పొందుటయే కోరుచున్నాను. దానికొరకే ప్రయత్నించుచున్నాను. ఈ నా అవస్థ నెరిగి నన్ను శంకింపవలదు.

---

29. సు + ఉపస్కరేణ—మంచి పరికరములు గల, వైయాఘ్రేణ—పులితోలు కప్పిన; వరూథినా—రక్షణగల.

న మే పాపేఽ స్త్యభిప్రాయః పాణ్డవాన్ ప్రతి కేశవ,
జ్ఞాతమేవ హితం వాక్యం యన్మయోక్తః సుయోధనః. 34

పాండవుల విషయమున నాకు పాపబుద్ధి లేదు. నేను సుయోధనునకు చెప్పిన హితవాక్యము నీ వెరిగినదే.

జానన్తి కురవః సర్వే రాజానశ్చైవ పార్థివాః,
శమే ప్రయతమానం మాం సర్వయత్నేన మాధవ. 35

మాధవా! ఈ రాజులు, భూమిపాలకులు, కౌరవులు అందరు సమస్తమగు ప్రయత్నముతో శాంతికై ప్రయత్నించుచున్న నన్నెరుగుదురు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతోఽబ్రవీ న్మహాబాహు ర్ధృతరాష్ట్రం జనార్దనః,
ద్రోణం పితామహం భీష్మం క్షత్తారం బాహ్లికం కృపమ్. 36

ప్రత్యక్ష మేతద్ భవతాం యద్వృత్తం కురుసంసది,
యథా చాశిష్టవన్మన్దో రోషా దద్య సముత్థితః. 37

అంత మహాబాహువగు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో, ద్రోణుడు, తాత, విదురుడు, బాహ్లికుడు, కృపుడు మొదలగువారితో ఇట్లు పలికెను. కౌరవుల సభలో ఏమి జరిగెనో మీకు తెలిసినదే. సంస్కారములేనివానివలె బుద్ధిహీనుడగు దుర్యోధనుడు నేడు రోషముతో విజృంభించెను.

వద త్యనీశ మాత్మానం ధృతరాష్ట్రో మహీపతిః,
ఆపృచ్ఛే భవతః సర్వాన్ గమిష్యామి యుధిష్ఠిరమ్. 38

రాజైన ఈ ధృతరాష్ట్రుడు తా నసమర్థుడనని పలుకుచున్నాడు! మీ అందరను వీడుకొందును. యుధిష్ఠిరుని కడ కరుగుదును.

ఆమన్త్ర్య ప్రస్థితం శౌరిం రథస్థం పురుషర్షభ,
అనుజగ్ము ర్మహేష్వాసాః ప్రవీరా భరతర్షభాః. 39

భీష్మో ద్రోణః కృపః క్షత్తా ధృతరాష్ట్రోఽథ బాహ్లికః,
అశ్వత్థామా వికర్ణశ్చ యుయుత్సుశ్చ మహారథః. 40

అట్లు అందరను వీడుకొని రథ మెక్కి బయలుదేరిన శ్రీకృష్ణుని వెంట నంటి పెద్ద ధనువులుగల భరతకులశ్రేష్ఠులు, భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, విదురుడు, ధృతరాష్ట్రుడు, బాహ్లికుడు, అశ్వత్థామ, వికర్ణుడు, మహారథుడగు యుయుత్సువు నడచిరి.

తతో రథేన శుభ్రేణ మహతా కిఙ్కిణీకినా,
కురూణాం పశ్యతాం ద్రష్టుం స్వసారం స పితు ర్యయౌ. 41

పిదప స్వచ్ఛమైనది, గొప్పది, చిరుమువ్వలు గలదియగు రథములో శ్రీకృష్ణుడు, కౌరవులందరు చూచుచుండగా తన మేనత్త కుంతిని చూచుటకై యరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విశ్వరూపదర్శనే ఏకత్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
విశ్వరూపదర్శనముగల నూటముప్పదియొకటవ అధ్యాయము.

—: o :—

41. కింకిణీకం - చిరునవ్వుల తోరణము - అది గలది కింకిణీకి -

## ద్వాత్రింశదధికశతతమోఽధ్యాయః
## నూటముప్పదిరెండవ అధ్యాయము

**శ్రీకృష్ణేన పృష్టయా కున్తీదేవ్యా పాణ్డవాన్ ప్రతి ప్రేషయితుం స్వసన్దేశస్య కథనమ్.**

**శ్రీకృష్ణు డడుగగా కుంతి పాండవులకు తెలుపుటకు తన సందేశమును చెప్పుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ప్రవిశ్యాథ గృహం తస్యా శ్చరణా వభివాద్య చ,
ఆచఖ్యౌ తత్సమాసేన యద్వృత్తం కురుసంసది. 1

అంత కృష్ణుడు కుంతియిల్లు చేరి ఆమె పాదములకు మ్రొక్కి కురుసభలో జరిగినదానిని సంక్షేపముగా చెప్పెను.

వాసుదేవ ఉవాచ-వాసుదేవు డిట్లు చెప్పెను.

ఉక్తం బహువిధం వాక్యం గ్రహణీయం సహేతుకమ్,
ఋషిభిశ్చైవ చ మయా న చాసౌ తద్గృహీతవాన్. 2

ఋషులును నేను గ్రహింపదగిన మాట లెన్నో కారణములు చూపి చెప్పితిమి. ఈతడు దానిని గ్రహింపలేదు.

కాలపక్వ మిదం సర్వం సుయోధనవశానుగమ్,
ఆపృచ్ఛే భవతీం శీఘ్రం ప్రయాస్యే పాణ్డవాన్ ప్రతి. 3

ఇది యంతయు కాలము పండి సుయోధనుని వశమున బోవుచున్నది. నేను త్వరగా నీకడ సెలవు గైకొని పాండవులకడ కరుగుదును.

కిం వాచ్యాః పాణ్డవేయాస్తే భవత్యా వచనా న్మయా,
తద్బ్రూహి త్వం మహాప్రాజ్ఞే శుశ్రూషే వచనం తవ. 4

నీ మాటగా పాండవులకు నే నేమి చెప్పవలయును? నీవు దొడ్డబుద్ధిగల దానవు. చెప్పుము. నీమాట వినగోరుదును.

కుస్త్యువాచ-కుంతి యిట్లు పలికెను.

బ్రూయాః కేశవ రాజానం ధర్మాత్మానం యుధిష్ఠిరమ్,
భూయాంస్తే హీయతే ధర్మో మా పుత్రక వృథా కృథాః. 5

కేశవా! రాజైన ధర్మాత్ముడగు యుధిష్ఠిరునితో నిట్లు చెప్పుము. కొడుకా! నీ ధర్మము మిక్కిలి దొడ్డది. కాని యది యిప్పుడు చెడిపోవుచున్నది. నీవు దానిని వ్యర్థము చేయకుము.

శ్రోత్రియస్యేవ తే రాజన్ మన్దకస్యావిపశ్చితః,
అనువాకహతా బుద్ధి ర్ధర్మమేవైక మీక్షతే. 6

రాజా! పండితుడు కాక, అర్థజ్ఞానము నెరుగక వేదములు వల్లించు బాపని బుద్ధి చెడినట్లు ధర్మమునే చూచుచున్న నీ బుద్ధి చెడినది.

అజ్గావేక్షస్వ ధర్మం త్వం యథా సృష్టః స్వయమ్భువా,
బాహుభ్యాం క్షత్రియాః సృష్టా బాహువీర్యోపజీవినః, 7
క్రూరాయ కర్మణే నిత్యం ప్రజానాం పరిపాలనే.

బ్రహ్మ నిన్నే విధముగా పుట్టించెనో ఆ ధర్మమును పరికింపుము. పరమ పురుషుని భుజములనుండి పుట్టిన క్షత్రియులు భుజశక్తి నాశ్రయించి బ్రదుకవలయును. ప్రజలను పాలించుటలో క్రూరకర్మమునకై వారిని పరమాత్మ సృజించెను.

శృణు చాత్రోపమా మేకాం యా వృద్ధేభ్యః శ్రుతా మయా,
ముచుకున్దస్య రాజర్షే రదదత్ పృథివీ మిమామ్. 8
పురా వైశ్రవణం ప్రీతో న చాసౌ తద్గృహీతవాన్. 9

పెద్దలు చెప్పగా విన్న ఒక కథను దీనికి దృష్టాంతముగా చెప్పెదను వినుము. మునుపు కుబేరుడు ముచుకుందుడను రాజర్షికి ప్రీతుడై యీ భూమి నంతటిని ఒసగెను. కాని అత డది గ్రహింపలేదు.

---

5. భూయాన్ - గొప్పది, భూమిని పాలించుటవలన నేర్పడు గొప్పధర్మము.
6. శ్రోత్రియస్య - వేదము చదువుకొన్న, మన్దకస్య-అర్థజ్ఞానము తెలియని, అవిపశ్చితః-పాండిత్యము లేని; అనువాకహతా-వల్లెవేయుటవలన చెడిన.

బాహువీర్యార్జితం రాజ న్మహీశ్రియ మితి కామయే,
తతో వైశ్రవణం ప్రీతో విస్మితః సమపద్యత. 10

'రాజా! నా చేతుల చేవతో సాధించినదానిని అనుభవింపవలయు నని నా కోరిక' అని ముచుకుందు డనగా కుబేరుడు ప్రీతుడయ్యెను. అచ్చెరువు పొందెను.

ముచుకున్ద స్తతో రాజా సోఽన్వశాస ద్వసున్ధరామ్,
బాహువీర్యార్జితాం సమ్యక్ క్షత్రధర్మ మనువ్రతః. 11

పిదప ముచుకుందరాజు తన చేతుల చేవతో సాధించిన భూమిని, క్షత్రియ ధర్మమునందు కుదురుకొన్న నిష్ఠ కలవాడై పరిపాలించెను.

యం హి ధర్మం చర న్తీహ ప్రజా రాజ్ఞా సురక్షితాః,
చతుర్థం తస్య ధర్మస్య రాజా విన్దేత భారత. 12

రాజు చక్కగా రక్షించుచుండగా ప్రజలు సాధించిన ధర్మములో నాలుగవ భాగమును రాజు పొందును.

రాజా చరతి చేద్ధర్మం దేవత్వాయైవ కల్పతే,
స చే దధర్మం చరతి నరకాయైవ గచ్ఛతి. 13

రాజు ధర్మమును సాధించెనేని ఆతడు దైవత్వము పొందును. అధర్మము చేసినచో నరకమునకే పోవును.

దణ్డనీతిశ్చ ధర్మేభ్య శ్చాతుర్వర్ణ్యం నియచ్ఛతి,
ప్రయుక్తా స్వామినా సమ్య గధర్మేభ్యశ్చ యచ్ఛతి. 14

ప్రభువు ప్రయోగించు దండనీతి నాలుగువర్ణములవారిని ధర్మముల కొరకు అదుపులో పెట్టును. అధర్మము లంటకుండ చక్కగా కాపాడును.

దణ్డనీత్యాం యదా రాజా సమ్యక్ కార్త్స్న్యేన వర్తతే,
తదా కృతయుగం నామ కాలః శ్రేష్ఠః ప్రవర్తతే. 15

రాజు దండనీతియందు సంపూర్ణముగా చక్కగా ప్రవర్తించినచో కృత యుగ మను శ్రేష్ఠమగు కాలము సాగును.

---

14. దండనీతిః స్వామినా ప్రయుక్తా - అని అన్వయము; ధర్మేభ్యః-ధర్మముల కొరకు; నియచ్ఛతి - నియమించును.

కాలో వా కారణం రాజ్ఞో రాజా వా కాలకారణమ్,
ఇతి మే సంశయో మా భూద్రాజా కాలస్య కారణమ్. 16

కాలమునుబట్టి రాజు నడచుకొనవలయునా? రాజునుబట్టి కాలము సాగవలయునా? అను సందేహము నాకు కలుగకుండుగాక! రాజే కాలమునకు కారణము.

రాజా కృతయుగస్రష్టా త్రేతాయా ద్వాపరస్య చ,
యుగస్య చ చతుర్థస్య రాజా భవతి కారణమ్. 17

రాజే, కృతయుగమును, త్రేతాయుగమును, ద్వాపరయుగమును, నాలుగవది యగు కలియుగమును సృష్టించును. ఈ నాలుగింటికి రాజే కారణము.

కృతస్య కరణా ద్రాజా స్వర్గ మత్యన్త మశ్నుతే,
త్రేతాయాః కరణా ద్రాజా స్వర్గం నాత్యన్త మశ్నుతే. 18

కృతయుగమును చేయుటవలన రాజు స్వర్గమును కడదాక అనుభవించును. త్రేతను చేయుటవలన స్వర్గమును కొంతవరకే అనుభవించును.

ప్రవర్తనా ద్ద్వాపరస్య యథాభాగ ముపాశ్నుతే,
కలేః ప్రవర్తనా ద్రాజా పాప మత్యన్త మశ్నుతే. 19

రాజు ద్వాపరయుగమును నడపుటచేత పాపపుణ్యములను ఆ యా ప్రమాణములలో అనుభవించును. కలిని ప్రవర్తింపజేసి పుణ్య మావంతయు లేని పాపము ననుభవించును.

తతో వసతి దుష్కర్మా నరకే శాశ్వతీః సమాః,
రాజదోషేణ హి జగత్ స్పృశ్యతే జగతః స చ. 20

---

16. రాజు ధర్మమునో అధర్మమునో ఆచరించుటవలన కృతత్రేతాద్వాపర కలియుగముల రూపమున కాలమునకు కారణమగుచున్నాడు. ఇట్లు అన్ని కాలములయందును ధర్మములోని హెచ్చుతగ్గులవలన కృతాదియుగముల వ్యవహారము కలుగు నని తాత్పర్యము.

20. జగతః - జగత్తు దోషముచేత; సః - ఆతడును - రాజును. చ - స్పృశ్యతే - స్పృశింపబడును. రాజుదోషము లోకమునకు, ప్రజల దోషము రాజునకును అంటునని తాత్పర్యము.

అంత ఆ పాపకర్ముడు పెక్కేండ్లు నరకమున నివసించును. రాజు తప్పు జగత్తును, జగత్తు దోషము రాజును అంటును.

రాజధర్మా నవేక్షస్వ పితృపైతామహోచితాన్,
నైతద్రాజర్షివృత్తం హి యత్ర త్వం స్థాతు మిచ్ఛసి. 21

తండ్రి తాతల వరుసగా పరిచయములైన రాజధర్మములను పాటింపుము. నీవు నిలువగోరినది రాజర్షుల నడవడి కాదు.

న హి వైక్లవ్యసంసృష్ట ఆనృశంస్యవ్యవస్థితః,
ప్రజాపాలనసంభూతం ఫలం కించన లబ్ధవాన్. 22

ఆందోళనతో విలవిలలాడిపోవువాడవు, మెత్తదనమునే అంటి పెట్టుకొని యుండువాడవునై ప్రజలను పాలించుటవలన పుట్టు ఫలమును ఏ కొంచెము పొందజాలకుంటివి.

న హ్యేతా మాశిషం పాణ్డు ర్న చాహం న పితామహః,
ప్రయుక్తవన్తః పూర్వం తే యథా చరసి మేధయా. 23

నీ విట్లు కావలయునని నీ తండ్రి పాండురాజుగాని, నేను గాని, తాత భీష్ముడుగాని నిన్ను దీవించియుండలేదు. నీవు నీ తెలివితో ప్రవర్తించుచున్నావు.

యజ్ఞో దానం తపః శౌర్యం ప్రజ్ఞా సన్తాన మేవ చ,
మాహాత్మ్యం బల మోజశ్చ నిత్య మాశంసితం మయా. 24

యజ్ఞము, దానము, తపస్సు, పరాక్రమము, ప్రజ్ఞ, మంచి సంతానము, మహిమ, బలము, ఉత్సాహము నీయందు ఎల్లవేళల నిలువవలయునని నేను కోరుకొంటిని.

---

22. న లబ్ధవాన్ - పొందనివాడ వైతివని భావము.
24. ఓజః - మంచి పనులు చేయుటకై ముందుకు దూకు లక్షణము.

నిత్యం స్వాహా స్వధా నిత్యం దద్యు ర్మానుషదేవతాః,
దీర్ఘ మాయు ర్ధనం పుత్రాన్ సమ్యగారాధితాః శుభాః. 25

మంగళమును కూర్చు మానవులను దేవతలను మనము చక్కగా కొలిచినచో వారు స్వాహా, స్వధా అను సత్కర్మలను, దీర్ఘమైన ఆయువును, ధనమును, పుత్రులను అనుగ్రహింతురు.

పుత్రే ష్వాశాసతే నిత్యం పితరో దైవతాని చ,
దాన మధ్యయనం యజ్ఞః ప్రజానాం పరిపాలనమ్. 26

తలిదండ్రులు, దైవతములును పుత్రులయందు దానము, వేదములను అధ్యయనము చేయుట, యజ్ఞము, ప్రజలను పాలించుట అనునవి చెడక యుండవలయునని కోరుదురు.

ఏతద్ధర్మ మధర్మం వా జన్మనై వాభ్యజాయథాః,
తే తు వైద్యాః కులే జాతా అవృత్త్యా తాత పీడితాః. 27

నాయనా! కృష్ణా! నేను చెప్పునది ధర్మమో అధర్మమో స్వభావమును బట్టియే నీ వెరుగుదువు ఆ పాండుతనయు లంతగా విద్యలు నేర్చి, అంత గొప్ప కులమున బుట్టి బ్రదుకుతెరువు లేక పాటుపడుచున్నారు.

---

25 స్వాహా-దేవతల నారాధించుట కీ శబ్దమును వాడుదురు. స్వధా - పితృదేవతల నారాధించుట కీ శబ్దమును వాడుదురు. నిత్యం స్వాహా స్వధా యనగా దేవపితృకార్యములు చక్కగా సాగుట - మానుషులు, దేవతలు చక్కగా కొలువబడినవారై యీ లోకమున ఆయువు మొదలగువానిని, పరలోకమును కూర్చు స్వధా మొదలగు సత్కర్మములను అనుగ్రహింతురని తాత్పర్యము.

27. ఏతత్ - తాను చెప్పెడు ఈమాట; ధర్మమ్ - ధర్మముతో కూడినదో; అధర్మం వా-అధర్మముతో కూడినదో; జన్మనా ఏవ - స్వభావము వలననే; అభ్యజాయథాః-చక్కగా నీ వెరుగుదువు. ఇది కృష్ణుని సంబోధించి యన్నమాటగా గ్రహింపవలయును; తే తు-ఆ పాండవు లన్ననో; వైద్యాః-విద్య కలవారయ్యు; అవృత్త్యా-బ్రదుకుతెరువు లేక; పీడితాః-పీడింపబడుచున్నారు.

యత్ర దానపతిం శూరం క్షుధితాః పృథివీచరాః,
ప్రాప్య తుష్టాః ప్రతిష్ఠన్తే ధర్మః కోఽభ్యధిక స్తతః. 28

ఆకలితో కడుపులు కాలుచున్న జనులు శూరుడగు రాజును పొంది తృప్తితో నిలువ ద్రొక్కుకొన గలిగినచో అంతకంటె మిన్నయగు ధర్మమేముండును?

దానే నాన్యం బలే నాన్యం తథా సూనృతయా పరమ్,
సర్వతః ప్రతిగృహ్ణీయా ద్రాజ్యం ప్రాప్యేహ ధార్మికః. 29

ధర్మము తప్పని రాజు రాజ్యమును పొంది ఒకనిని, దానముతో మరియొకనిని, బలముతో వేరొకనిని ప్రియమైన సత్యవాక్యముతో అన్నివైపుల నుండి ఆకట్టుకొనవలయును.

బ్రాహ్మణః ప్రచరేద్ భైక్షం క్షత్రియః పరిపాలయేత్,
వైశ్యో ధనార్జనం కుర్యా చ్ఛూద్రః పరిచరేచ్చ తాన్. 30

బ్రాహ్మణుడు భిక్షావృత్తిని నడుపవలయును. క్షత్రియుడు పాలింపవలయును. వైశ్యుడు ధనమును సంపాదింపవలయును. శూద్రుడు ఆ యా వృత్తులతో వారిని సేవింపవలయును.

భైక్షం విప్రతిషిద్ధం తే కృషి ర్నైవోపపద్యతే,
క్షత్రియోఽసి క్షతాత్త్రాతా బాహువీర్యోపజీవితా. 31

బిచ్చమెత్తుట నీవు చేయరాని పని. వ్యవసాయము నీకు తగదు. జనులకు కలుగు కష్టములను పోగొట్టు క్షత్రియుడవు గదా! చేతుల చేవతో బ్రదుకుటయే నీ కర్తవ్యము.

---

28. దానపతిమ్ - పాలనాధికారము కలవానిని; 'దేఙ్' పాలనే - అను ధాతువు నుండి యేర్పడిన రూపము.

30. పరిచరేత్ - సేవింపవలయును. సేవించుట యనగా చాకలి, కమ్మరి, కుమ్మరి మున్నగు వృత్తులద్వారా కావలసిన వస్తువులు మొదలగువానిని సమకూర్చుట.

పిత్ర్య మంశం మహాబాహో నిమగ్నం పునరుద్ధర,
సామ్నా భేదేన దానేన దణ్డేనాథ నయేన వా. 32

నీతంత్రిపాలు నీట గలిసినది. మహాబాహూ! దానిని మరల పైకి లాగుకొనుము. సామమో, భేదమో, దానమో, దండమో, నీతియో దేనితోనైన దానిని సాధింపుము.

ఇతో దుఃఖతరం కిం ను యదహం దీనబాన్ధవా,
పరపిణ్డ ముదీక్షే వై త్వాం సూత్వాఽమిత్రకర్శన. 33

శత్రువులను రూపుమాపెడు ఓ ధర్మరాజా! నిన్ను కని దీనులగు చుట్టములు గల దాననై నేను పరుల కూటికై ఎదురుచూచుచున్నాను. ఇంతకంటె పెద్ద దుఃఖ మేముండును?

యుద్ధ్యస్వ రాజధర్మేణ మా నిమజ్జీః పితామహాన్,
మా గమః క్షీణపుణ్యస్త్వం సానుజః పాపికాం గతిమ్. 34

రాజధర్మమును చేపట్టి పోరాడుము. నీ పితృదేవతలను నీట ముంచకుము. పుణ్యము చెడిపోగా, తమ్ములతోపాటు పాపగతికి పోకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కున్తీవాక్యే ద్వాత్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతమున ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కుంతివాక్యముగల నూటముప్పదిరెండవ అధ్యాయము.

—: ০ :—

# త్రయస్త్రింశదధికశతతమోఽధ్యాయః
# నూటముప్పదిమూడవ అధ్యాయము

**కున్త్యా విదులోపాఖ్యానస్య కథనం, తత్ర విదులయా రణాత్ పలాయ్య సమాగతస్య స్వపుత్రస్య భర్త్సనపూర్వకం పునర్యుద్ధాయ ప్రోత్సాహనమ్.**

**కుంతి విదులకథను చెప్పుట, అందు విదుల రణమునుండి పారి వచ్చిన తన కొడుకును మందలించి మరల యుద్ధమునకు పురికొల్పుట.**

కున్త్యువాచ-కుంతి యిట్లు చెప్పెను.

అత్రా ప్యుదాహర న్తీమ మితిహాసం పురాతనమ్,
విదులాయాశ్చ సంవాదం పుత్రస్య చ పరంతప. 1

ప్రాతకాలమునాటి యీ చరితమును ఇక్కడ ఉదాహరింతురు. అది విదులకు, ఆమె కొడుకునకు జరిగిన సంవాదము.

తతః శ్రేయశ్చ భూయశ్చ యథావ ద్వక్తు మర్హసి.

నేను చెప్పినదానికంటె ప్రశస్తమైనవి, మించినది ఉన్నచో తగు విధముగా నీవు చెప్పనగును.

యశస్వినీ మన్యుమతీ కులే జాతా విభావరీ,
క్షత్రధర్మరతా దాన్తా విదులా దీర్ఘదర్శినీ, 2

---

2. తతః - దానికంటె - నేను చెప్పెడిదానికంటె; శ్రేయః - ఎక్కువగా మేలు గూర్చునది; భూయః - గొప్పది; ఉన్నచో, యథావత్ - తగు విధముగా; వక్తు మర్హసి - నీవు చెప్పనగును.

2. మన్యుమతీ - దీనభావముతో నున్నది; విభావరీ - కోపించియున్నది; దాన్తా - మనస్సుపై అదుపు గలది; మన్యుమతీ, విభావరీ అను మాటతో దీనికి పొసగుదల యెట్లనగా - ధర్మభంగమున దీనత, కోపము - అని భావింపవలయును.

విశ్రుతా రాజసంసత్సు శ్రుతవాక్యా బహుశ్రుతా. 3

విదుల యను నామె యొకతె ఉండెడిది. ఆమె గొప్పకీర్తి కలది. గొప్ప కులమున పుట్టినది. ఒకమారామె దీనతతో, కోపముతో ఉండెను. క్షత్రియ ధర్మమునందు అనురాగము గలది. నిగ్రహముతో వర్తించెడిది. ముందుచూపు గలది. అనేక తత్త్వవాక్యములు, శాస్త్రములు చక్కగా శ్రవణము చేసినది. రాజసభలలో ప్రసిద్ధి నందినది.

విదులా నామ రాజన్యా జగర్హే పుత్ర మౌరసమ్,
నిర్జితం సిన్ధురాజేన శయానం దీనచేతసమ్. 4

ఆమె పట్టాభిషేకము పొందిన కాంత. తన, కన్నకొడుకు సింధురాజున కోడి దిగులుగుండెతో పడియుండగా వాని నిట్లు తిట్టినది.

విదులోవాచ - విదుల యిట్లు పలికెను.

అనన్దన మయా జాత ద్విషతాం హర్షవర్ధన,
న మయా త్వం న పిత్రా చ జాతః క్వాభ్యాగతో హ్యసి. 5

నాకు చెడబుట్టినవాడా! శత్రువులకు మోదము పెంచువాడా! నీవు నాకును నీ తండ్రికి పుట్టలేదు. ఎటనుండి దాపురించితివిరా!

నిమన్యు శ్చాప్యసంఖ్యేయః పురుషః క్లీబసాధనః,
యావజ్జీవం నిరాశోఽసి కల్యాణాయ ధురం వహ. 6

ఒక పట్టుదల లేదు. ఒక పరిగణన లేదు. మగవాడవై పేడిచేష్టలతో బ్రదుకుచున్నావు. బ్రదుకెల్ల నీవలన నిరాశయే. మంగళము కూర్చు భారము వహింపరాదా?

---

4. రాజన్యా - మూర్ధాభిషిక్తురాలు - శాస్త్రము ననుసరించి సింహాసనము నందు పాలకురాలుగా అధికారము పొందిన స్త్రీ యని భావము. "మూర్ధాభిషిక్తో రాజన్యః' అని యర్థము.

5. అనన్దన - చెడబుట్టినవాడా! ఇచట 'నఙ్' శబ్దము నిందార్థము కలది.

6 నిమన్యుః - కోపము, పట్టుదల లేనివాడు; అసంఖ్యేయః - లెక్కలోనికి రానివాడు; క్లీబసాధనః - మగతనము లేని చేతలు మున్నగు సాధనములు గలవాడు.

మాఽఽత్మాన మవమాన్యస్వ మైన మల్పేన బీభరః,
మనః కృత్వా సుకల్యాణం మా భైస్త్వం ప్రతిసంహర. 7

నిన్ను నీవు అవమానించుకొనకు. రాజ్యమును తేలికగా భావించి పాలింపకు. శుభమందు మనసుపెట్టి భయపడకుండుము. భయమును పారద్రోలు.

ఉత్తిష్ఠ హే కాపురుష మా శేష్వైవం పరాజితః,
అమిత్రా న్నన్దయన్ సర్వాన్ నిర్మానో బన్ధుశోకదః. 8

నీచుడా! లే. సిగ్గులేనివాడా! చుట్టములకు శోకము కూర్చువాడా! పగవారి నందరిని ఆనందపెట్టుచు ఓడి యీవిధముగా పడియుండకు.

సుపూరా వై కునదికా సుపూరో మూషికాఞ్జలిః,
సుసంతోషః కాపురుషః స్వల్పకేనైవ తుష్యతి. 9

బాగుగా నిండిన చిన్నవాగు, చక్కగా నిండిన ఎలుక రంధ్రము, వెర్రిబాగుల నీచపురుషుడు మిక్కిలి స్వల్పవస్తువుతోడనే తృప్తిపడును.

అప్యహే రారుజన్ దంష్ట్రా మాశ్వేవ నిధనం వ్రజ,
అపి వా సంశయం ప్రాప్య జీవితేఽపి పరాక్రమేః. 10

పాముకోరలను పెరికి యైనను శీఘ్రముగా చావుము. బ్రదుకునందు సంశయము పొందియు చేవ చూపుము.

అప్యరేః శ్యేనవ చ్ఛిద్రం పశ్యేస్త్వం విపరిక్రమన్,
వివదన్ వాథవా తూష్ణీం వ్యోమ్ని వాపరిశఙ్కితః. 11

---

7. మా బీభరః - పాలింపకుము. ప్రతిసంహర - భయమును వితనాడుము.

8. మా శేష్వ - పనిపాటలు లేక పడియుండకు అని భావము.

9. కునదికా-చిన్న యేరు; మూషికాంజలిః-ఎలుకరంధ్రమని భావింపదగును.

10. అహేః - సర్పముయొక్క; ఆరుజన్ - విరుచుచు; పరాక్రమేః - విజృంభింపుము.

11. వివదన్ - శత్రువులను గెలుచుటకు పలువిధములుగా భావనలు చేయుచు; వా - లేదా; తూష్ణీమ్ - ఊరకుండి, వ్యోమ్ని - ఆకాశమున; శ్యేనః యథా - డేగవలె; అపరిశఙ్కితః - శత్రువులు తనకంటె మిన్న యని భయమందక; ఛిద్రమ్ - శత్రువు ఎందు వశమగునో ఆ దోషమును; పశ్యేః - (నీవు) చూడవలయును.

ఆకాశమున జంకుగొంకులు లేక విహరించు డేగవలె పలుభావనలు చేసియో, ఊరకుండియో పగవాని అనుపానులను నీవు పరికింపవలయును.

త్వ మేవం ప్రేతవ చ్ఛేషే కస్మా ద్వజ్రహతో యథా,
ఉత్తిష్ఠ హే కాపురుష మా స్వాప్సీః శత్రునిర్జితః. 12

శవము వలె పడుకొనియున్నావు. నీపై పిడుగుపడెనా యేమి! నీచుడా లే! శత్రువునకు ఓడి నిదురపోకుము.

మా స్తంగమ స్త్వం కృపణో విశ్రూయస్వ స్వకర్మణా,
మా మధ్యే మా జఘన్యే త్వం మాఽధోభూ స్తిష్ఠ గర్జితః. 13

దీనుడవై చావకుము. చేతలతో ప్రసిద్ధి కెక్కుము. మధ్యమమునందు, దాని తరువాతి దానియందు, అధమమునందు నిలువకు. ఉరుముచు నిలబడుము.

అలాతం తిన్దుక స్యేవ ముహూర్తమపి హి జ్వల,
మా తుషాగ్ని రివానర్చి ర్ధూమాయస్వ జిజీవిషుః. 14

13. స్వకర్మణా - నీదగు చేతతో; విశ్రూయస్వ - ప్రసిద్ధి కెక్కుము; మధ్యే - సామభేదఉపాయములు - మధ్యమములు; దానము-అధమము; దండము ఉత్తమము; కావున నీవు సామదానభేదము లను ఉపాయములను ప్రయోగింపవలదు. ఉత్తమమగు దండోపాయమును ప్రయోగింపవలయును అని భావము. గర్జితః - ధీరతను జంకుగొంకులు లేక ఉరిమినట్లు ప్రకటించి; తిష్ఠ - నిలువుము.

14. తిందుకస్య - తుమ్మికిచెట్టుయొక్క. అలాతమ్ - నిప్పురవ్వ - అవి యెట్లు పగిలి నిప్పుకణములను అన్నివైపులకు విరజిమ్ముచు మండునో అట్లు; జ్వల - మండుము - పరాక్రమముతో శత్రువులను కాల్చివేయుము అని భావము; కాని, అనర్చిః - జ్వాలలు లేని; తుషాగ్నిః - ఇవ - ఊకనిప్పు వలె; మా ధూమాయస్వ - కుములుచు - ఉండకుము; 'కాకరం ఖా జిజీవిషుః' అని యొక పాఠము. అప్పుడు కాకర మనగా అగ్నిహోత్రము లుండు గది - దానిని; మా ఖాః - ఆర్పివేయకుము అని అర్థము. 'ఖై తు స్థైర్యే ఖదనహింసయోః' అను ధాతువునుండి యేర్పడిన రూపము. 'కాకరంఖః' అనియు పాఠము. అప్పుడు, కాకి వలె పారిపోవువాడు అని అర్థము. అట్టి వాడవు కాకుము అని భావము. 'రఖి గతౌ'అను ధాతువు నుండి యేర్పడిన రూపము.

తిందుకము కొఱవివలె ముహూర్తకాలమైనను మండుట శ్రేష్ఠము. బ్రదుకగోరినవాడవై మండని ఊకనిప్పువలె పొగచూరి పోకుము.

ముహూర్తం జ్వలితం శ్రేయో న చ ధూమాయితం చిరమ్,
మా హ స్మ కస్యచి ద్గేహే జని రాజ్ఞః ఖరో మృదుః. 15

ముహూర్తకాలమైనను మండుట మేలు. పెద్దకాలము పొగతో కుములుట మంచిది కాదు. ఏరాజు గృహమునందును కర్కశుడై మెత్తని వాడు నై ఎవడును పుట్టరాదు.

కృత్వా మానుష్యకం కర్మ సృత్వాऽऽజిం యావదు త్తమమ్,
ధర్మస్యానృణ్య మాప్నోతి న చాత్మానం విగర్హతే. 16

మానవుడు చేయదగిన పనిని చేసి, ఉత్తమమగు యుద్ధము వెంట పోయి, ధర్మముఅప్పు తీర్చుకొనువా డగును. అప్పుడు తన్ను తాను నిందించుకొన నక్కర లేదు.

అలబ్ధ్వా యది వా లబ్ధ్వా నానుశోచతి పణ్డితః,
ఆనన్తర్యం చారభతే న ప్రాణానాం ధనాయతే. 17

ఫలము లభించినను లభింపకున్నను జ్ఞానము కలవాడు పట్టించుకొనడు. బలముతో సాధించుపనులను చేయుచునే యుండును. ధన మాశింపడు.

---

15. మా జని-పుట్టకుండుగాక; ఖరః - కఠినస్వభావము గలవాడు; మృదుః-మెత్తనివాడు-దయగలవాడు; 'ఖరీ' అనియు పాఠము-దయలేని స్వభావము గలవాడని అర్థము.

16. మానుష్యకం-మనుష్యునకు ఉచితమైన; ఆజిమ్-యుద్ధమును; సృత్వా-అనుసరించి - ఆనృణ్యమ్ - అప్పు తీర్చుకొనుటకు.

17. ప్రాణానామ్-ప్రాణ మనగా బలము-బలముతో సాధింపవలసిన కార్యములను; ఆనన్తర్యమ్-ఆగకుండ-వ్యవధానము లేకుండ; ఆరభతే-మొదలు పెట్టును. పండితుడు బలముతో సాధించవలసిన పనులను విశ్రాంతి యెరుగక చేయునని తాత్పర్యము. న ధనాయతే - తనకు ధనము కావలయునని కోరడు.

ఉద్భావయస్వ వీర్యం వా తాం వా గచ్ఛ ధ్రువాం గతిమ్,
ధర్మం పుత్రాగ్రతః కృత్వా కింనిమిత్తం హి జీవసి. 18

పౌరుషమునైన గుండెకు బట్టించుకొనుము. లేదా ధర్మమును ముందు పెట్టుకొని చావనైన చావుము. అట్లుగాక బ్రదుకుట యేల?

ఇష్టాపూర్తం హి తే క్లీబ కీర్తిశ్చ సబలా హతా,
విచ్ఛిన్నం భోగమూలం తే కింనిమిత్తం హి జీవసి. 19

నీకు సంబంధించిన ఇష్టము, పూర్తము అనునవి నశించినవి. బలముతో పాటు కీర్తియు చచ్చినది. భోగములకు మూలమైన రాజ్యము, ధనము ముక్కలైనది. ఇంక నీవు బ్రదుక నేల?

శత్రు ర్నిమజ్జతా గ్రాహ్యో జఙ్ఘాయాం ప్రపతిష్యతా,
విపరిచ్ఛిన్నమూలోఽపి న విషీదేత్ కథఞ్చన,
ఉద్యమ్య ధుర ముత్కర్షే దాజానేయకృతం స్మరన్. 20

మునిగిపోవుచున్నవాడు, పడిపోవుచున్నవాడును శత్రువును పిక్కయందు పట్టుకొనవలయును. అంతేకాని ఎన్నటికిని మూలము బొత్తుగా చెడిపోయినవాడైనను నీరుకారిపోరాదు. మేలుజాతి గుఱ్ఱముల స్వభావమును గుర్తుపెట్టుకొని ప్రయత్నముతో భారమును నిర్వహింపవలయును.

---

18. ధర్మమ్ - ధర్మమును; అగ్రతః కృత్వా - ముందు పెట్టుకొని - ఇది వెక్కిరింతమాట. నీవు ధర్మమును వెనుకకు త్రోసివేసితివని భావము.

19. భోగమూలమ్-భోగములకు మూలకారణమైన రాజ్యము లేదా ధనము.

20. నిమజ్జతా - మునుగుచున్న; ప్రపతిష్యతా - పడుచున్న; జఙ్ఘాయామ్ - పిక్కయందు; శత్రుః - శత్రువు; గ్రాహ్యః - పట్టుకొనవలసినవాడు. యుద్ధమున సర్వనాశన మగుచున్న సమయములో కూడ శత్రువును వదలరాదని భావము. తాను పడుచు శత్రువును పిక్క పట్టుకొనియైన లాగుకొని పోవలయును గాని దీనతతో చనిపోరాదని భావము.

కురు సత్త్వం చ మానం చ విద్ధి పౌరుష మాత్మనః,
ఉద్భావయ కులం మగ్నం త్వత్కృతే స్వయమేవ హి. 21

బలమును ప్రయోగింపుము. మానమును కాపాడుకొనుము. నీ మగతనమును మంట గలుపకుము. నీకై దిగజారిన నీ వంశప్రతిష్ఠను నీవే లేవనెత్తుము.

యస్య వృత్తం న జల్పన్తి మానవా మహ దద్భుతమ్,
రాశివర్ధనమాత్రం స నైవ స్త్రీ న పునః పుమాన్. 22

ఉత్తమము, అద్భుతము అగు ఎవని నడవడిని మానవులు కొనియాడరో వాడు కేవలము సంఖ్యను పెంచుటకు మాత్రమే పనికి వచ్చును. వాడు స్త్రీ కాదు. పురుషుడును కాదు.

దానే తపసి సత్యే చ యస్య నోచ్చరితం యశః,
విద్యాయా మర్థలాభే వా మాతు రుచ్చార ఏవ సః. 23

దానము, తపస్సు, సత్యము విద్య, ధనసంపాదనము వీనియందు కీర్తిగడింపనివాడు తల్లి వదలిన మలము మాత్రమే యగును.

శ్రుతేన తపసా వాఽపి శ్రియా వా విక్రమేణ వా,
జనాన్ యోఽభిభవత్యన్యాన్ కర్మణా హి స వై పుమాన్. 24

పాండిత్యముతో, తపస్సుతో, సంపదతో, పరాక్రమముతో, ఏదేని దొడ్డ పనితో తక్కిన మానవులను తిరస్కరింపగలవాడే మగవాడు.

న త్వేవ జాల్మం కాపాలీం వృత్తి మేషితు మర్హసి,
నృశంస్యా మయశస్యాం చ దుఃఖాం కాపురుషోచితామ్. 25

---

21. ఉద్యమ్య - ప్రయత్న మొనరించి, ధురమ్ - భారమును. ఆజానేయ కృతమ్ - జాతి గుఱ్ఱముల పనితీరును (క్రుంగిపోవకుండుట అనుదానిని) స్మరన్-తలచుకొనుచు; ఉత్కర్షేత్-మోయవలయును. విద్ధి - పొందుము.
22. 'త్వత్కృతే మగ్నమ్' - నీకై మునిగిపోయిన దానిని అని అన్వయము.
23. రాశివర్ధనః - సంఖ్యను నింపువాడు, మరియొక ప్రయోజనము లేని వాడని తాత్పర్యము.
24. మాతుః - తల్లియొక్క; ఉచ్చారః ఏవ - మలము మాత్రమే.
25. కాపాలీం వృత్తిమ్-బిచ్చ మెత్తుకొను వృత్తిని;

నీచులకు తగినది, చిప్ప చేతబట్టినట్టిది, క్రూరులకు యోగ్యమైనది, నింద్యమైనది, దుఃఖమును కూర్చునది అగు బ్రదుకు తెరవును నీవు కోరరాదు.

య మేన మభినన్దేయు రమిత్రాః పురుషం కృశమ్,
లోకస్య సమవజ్ఞాతం నిహీనాసనవాసనమ్. 26

అహో లాభకరం హీన మల్పజీవన మల్పకమ్,
నేదృశం బన్ధు మాసాద్య బాన్ధవః సుఖ మేధతే. 27

క్రుంగి కృశించిపోయినవాడు నిలువ నీడయు, కట్టుగుడ్డయు లేనివాడు, పౌరుషము లేనివాడని లోక మెల్ల ఎరిగినవాడు, ఏ కొంచెము దొరికినను పొంగి పోవువాడు, నేడో రేపో చచ్చునట్టున్నవాడు, పగవారికి సంతోషము కలిగించు వాడు, నీచుడు నగు ఇట్టి చుట్టమును పొంది ఏ బంధువును సుఖపడడు.

అవృత్త్యైవ విపత్స్యామో వయం రాష్ట్రాత్ ప్రవాసితాః,
సర్వకామరసై ర్హీనాః స్థానభ్రష్టా అకిఞ్చనాః. 28

మనలను దేశమునుండి వెడలగొట్టివైతురు. ఏ కోరికయు ఏ ప్రీతియు నుండదు. నిలువ నీడలేని దరిద్రులమై బ్రదుకుతెరువు లేక చత్తుము.

అవల్గుకారిణం సత్సు కులవంశస్య నాశనమ్,
కలిం పుత్రప్రవాదేన సఞ్జయ త్వా మజీజనమ్, 29

నిరమర్షం నిరుత్సాహం నిర్వీర్య మరినన్దనమ్. 30

26. యమ్, ఏనమ్ బన్ధుమ్ ఆసాద్య అని మూడవ శ్లోకముతో సంబంధము.
27. అహోలాభకరమ్ - ఏ కొంచెము వస్తువు దొరికినను ఏదో మహా వస్తువు దొరికినట్లుగా పొంగిపోయెడువానిని.
28. అవృత్త్యా - బ్రదుకు తెరువు లేకపోవుటచేత. విపత్స్యామః చచ్చిపోదుము;
29. అవల్గుకారిణమ్ - అమంగళము చేయువాడు; అకర్మ - అనియు పాఠము. ఆ పక్షమున ఏపనియు చేయనివాడని అర్థము; కులమనగా - దగ్గరి చుట్టములు - జ్ఞాతులు; వంశ మనగా - చంద్రుడు, సూర్యుడు మొదలగు మొదటి ఉత్పత్తి తావు.
30. సంజయ - ఇది ఆమె కుమారుని పేరు.

ఓరీ సంజయా! నీ విట్లు గొప్పవారిలో పుట్టి అమంగళమును పని గావించితివి. బంధుగులను, వంశమును పాడుచేసినవాడ వైతివి. కొడుకన్న పేరున పాపివి. పట్టుదల, ఉత్సాహము, సత్తువ చచ్చిన నిన్ను, శత్రువులను సంతోషపెట్టు నీచుని కంటిని.

మా స్మ సీమన్తినీ కాచి జ్జనయేత్ పుత్ర మీదృశమ్,
మా ధూమాయ జ్వలాత్యన్త మాక్రమ్య జహి శాత్రవాన్. 31

ఏ పుణ్యస్త్రీకిని ఇట్టి కొడుకు పుట్టరాదు. ఊరక లోలోపల కుమిలి పోకుము. ఒక పెట్టున భగ్గున మండి శత్రువులపై బడి వారిని రూపు మాపుము.

జ్వల మూర్ధ న్యమిత్రాణాం ముహూర్తమపి వా క్షణమ్,
ఏతావానేవ పురుషో యదమర్షీ యదక్షమీ. 32

పగవారి నడినెత్తిపై బడి ఒక ముహూర్తమైనను, క్షణమైనను మండుము. అట్లు కోపము వెల్లగక్కువాడే, శత్రువులను క్షమింపనివాడే మగవాడు.

క్షమావా న్నిరమర్షశ్చ నైవ స్త్రీ న పునః పుమాన్,
సంతోషో వై శ్రియం హన్తి తథానుక్రోశ ఏవ చ. 33

శాంతి శాంతి యనువాడు, ప్రతాపము చూపనివాడు ఆడదియు కాదు, మగవాడును కాడు. ఉన్నదానిని చూచి తృప్తి పడుటయు, పనికిమాలిన దయయు సంపదను చంపివేయును.

అనుత్థానభయే చోభే నిరీహో నాశ్నుతే మహత్,
ఏభ్యో నికృతిపాపేభ్యః ప్రముఞ్చాత్మాన మాత్మనా. 34

---

33. అనుక్రోశః - జాలి;

34. అనుత్థానభయే - అనుత్థానము, అనగా శత్రువు దండెత్తి వచ్చినపుడు నిలువలేకపోవుట) భయము ఈ రెండును సంపదను చంపునని పూర్వ శ్లోకముతో అన్వయము. నిరీహః - కోరికలు చంపుకొని చేష్ట లుడిగి యుండువాడు. మహత్ - ఉన్నత స్థానమును, న అశ్నుతే - పొందడు.

అట్లే పగవానివిషయమున పట్టుదల లేకుండుట, భయము అనునవియు సంపదలను నాశనము చేయును. కోరికలు చచ్చినవాడు గొప్పతనమును పొందదు. ఇట్టి పరాభవము కలిగించు పాపములనుండి నిన్ను నీవు విడిపించుకొనుము.

ఆయసం హృదయం కృత్వా మృగయస్వ పునః స్వకమ్,
పరం విషహతే యస్మాత్ తస్మాత్ పురుష ఉచ్యతే. 35

గుండెను ఉక్కుపిండముగా చేసికొని నీ సొమ్మును నీవు మరల వెదకుకొనుము. పరుని ధాటికి తట్టుకొని నిలువగలవానినే పురుషు డందురు.

తమాహు ర్వ్యర్థనామానం స్త్రీవద్ య ఇహ జీవతి.

అట్లుగాక ఆడుదానివలె బ్రదుకువానిని పనికిమాలినపేరు గలవా డందురు.

శూర స్యోర్జితసత్త్వస్య సింహవిక్రాన్తచారిణః,
దిష్టభావం గతస్యాపి విషయే మోదతే ప్రజా. 36

శూరుడు, పిక్కటిల్లిన సత్తువ గలవాడు, సింహమువలె పరులపై దూకువాడు ఒకవేళ పోరున మరణించినను వాని విషయమున సంతానము సంతోషమే పొందును.

య ఆత్మనః ప్రియసుఖే హిత్వా మృగయతే శ్రియమ్, 37
అమాత్యానా మథో హర్ష మాదధా త్యచిరేణ సః. 38

తన ప్రియమును, సుఖమును వదలివైచి సంపదలనే వెదకువాడు తన దగ్గరివారికి అతిశీఘ్రముగా సంతోషమును కూర్చును.

పుత్ర ఉవాచ - కొడు కిట్లు పలికెను.

కిం ను తే మా మపశ్యన్త్యాః పృథివ్యా అపి సర్వయా,
కిమాభరణకృత్యం తే కిం భోగై ర్జీవితేన వా. 39

---

35. స్వకమ్ - నీదానిని - సొమ్ము మొదలగుదానిని; 'పరం విషహతే' అని నిర్వచనము. అక్షరములు కొంచెము మార్పు చెందగా 'పురుష' అనురూప మేర్పడినదని భావము.

39. మామ్, అపశ్యన్త్యాః - యుద్ధమున నేను చావగా నన్ను చూడకున్న నీకు భూమి మొదలగు వానితో ఏమి పని? అని భావము.

అమ్మా! నేను కానరానిచో నీవు ఈ భూమి అంతయు లభించినను ఫలిత మేమి? ఈ నగలను ధరించుట యేల? ఈ సుఖము లేల? ఈ బ్రదుకేల?

మాతోవాచ - తల్లి యిట్లు పలికెను.

కిమద్యకానాం యే లోకా ద్విషన్త స్తా నవాప్నుయుః,
యే త్వాదృతాత్మనాం లోకాః సుహృద స్తాన్ వ్రజన్తు నః. 40

ఏమి తిందును? ఇప్పుడు తొందర ఏమున్నదిలే అనువారి లోకములను మన పగవారు పొందవలయును. ఆత్మగౌరవము కలవారి లోకములను మన మిత్రులు పొందుదురు గాక!

భృత్యై ర్విహీయమానానాం పరపిణ్డోపజీవినామ్,
కృపణానా మసత్త్వానాం మా వృత్తి మనువర్తిథాః. 41

తాము తిండిపెట్టి పోషింపవలసినవా రందరు జారిపోగా, ఇతరులు పెట్టు పిండముతో బ్రదుకు వెళ్ళబుచ్చుచు దీనులై, గుండె బలము చచ్చినవారి పద్ధతిని అనుసరింపకుము.

అను త్వాం తాత జీవన్తు బ్రాహ్మణాః సుహృద స్తథా,
పర్జన్య మివ భూతాని దేవా ఇవ శతక్రతుమ్. 42

నాయనా! ప్రాణిలోక మంతయు వానదేవుని, దేవత లందరు దేవేంద్రుని ఆశ్రయించి బ్రదుకుచున్నట్లు బ్రహ్మజ్ఞానము కలవారు, ప్రియమిత్రములు ని న్నాశ్రయించి బ్రదుకుదురు గాక!

య మాజీవన్తి పురుషం సర్వభూతాని సఞ్జయ,
పక్వం ద్రుమ మివాసాద్య తస్య జీవిత మర్థవత్. 43

---

40. కిమద్యకానామ్ - కిమ్ అద్యమ్ - తినదగిన దేది? అని ఎల్లప్పుడు తిండికై పరితపించు దరిద్రులయొక్క; లేదా, అద్య కిమ్ - నేడు ఎందుకులే, రేపు చూచుకొందము అను స్వభావముగల సోమరులయొక్క; అనాహతానామ్ అనియు పాఠము - అస్త్రముల దెబ్బలు తిననివారి; అనాదృతానామ్ అనియు పాఠము - అలసులయొక్క అని అర్థము; నిర్మన్యుకానామ్ అనియు పాఠము - కోపము లేనివారి - అని అర్థము.

సంజయా! సర్వప్రాణులును పండిన చెట్టును వలె ఎవని నాశ్రయించి బ్రదుకునో వాని బ్రదుకే సార్థకము.

యస్య శూరస్య విక్రాన్తై రేధన్తే బాన్ధవాః సుఖమ్,
త్రిదశా ఇవ శక్రస్య సాధు తస్యేహ జీవితమ్. 44

దేవేంద్రుని పరాక్రమముతో దేవతలు సుఖపడుచున్నతీరున ఎవని పరాక్రమముచే బంధువు లందరు సుఖమును పెంపొందించుకొందురో అట్టి వారి బ్రదుకు దొడ్డది.

స్వబాహుబల మాశ్రిత్య యోఽభ్యుజ్జీవతి మానవః,
స లోకే లభతే కీర్తిం పరత్ర చ శుభాం గతిమ్. 45

తన చేతిచేవను ఆశ్రయించి బ్రదుకు మానవుడు ఈ లోకమున కీర్తిని, పరలోకమున శుభమును పొందును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదులాపుత్రానుశాసనే త్రయస్త్రింశాధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున విదుల పుత్రుని మందలించుట యను నూటముప్పదిమూడవ అధ్యాయము.

—:-:—

## చతుస్త్రింశదధికశతతమోఽధ్యాయః.

## నూటముప్పదినాలుగవ అధ్యాయము.

### విదులయా స్వపుత్రస్య యుద్ధాయ ప్రోత్సాహనమ్.

### విదుల తన కొడుకును యుద్ధమునకు పురికొల్పుట.

విదులోవాచ-విదుల యిట్లు పలికెను.

అథైతస్యా మవస్థాయాం పౌరుషం హాతు మిచ్ఛసి,
నిహీనసేవితం మార్గం గమిష్య స్యచిరా దివ. 1

ఈ దశలో నీవు మగతనమును వదలివేయగోరినచో వెనువెంటనే పరమ నీచుల దారిలో పయనింతువు.

యో హి తేజో యథాశక్తి న దర్శయతి విక్రమాత్,
క్షత్రియో జీవితాకాఙ్క్షీ స్తేన ఇత్యేవ తం విదుః. 2

శక్తిమేరకు పరాక్రమించి తన ప్రతాపమును చూపక బ్రదుకగోరు క్షత్రియుని దొంగ యనియే పరిగణింతురు.

అర్థవన్త్యుపపన్నాని వాక్యాని గుణవన్తి చ
నైవ సంప్రాప్నువన్తి త్వాం ముమూర్షుమివ భేషజమ్. 3

ప్రయోజనము కూర్చునవి, హేతువులతో కూడినవి, గుణము గలవియు నగు మాటలు, చావబోవువానికి మందువలె, నీకు ఒంటబట్టుట లేదు.

సన్తి వై సిన్ధురాజస్య సన్తుష్టా న తథా జనాః,
దౌర్బల్యా దాసతే మూఢా వ్యసనౌఘప్రతీక్షిణః. 4

జనులు సింధురాజు నెడ వెనుకటి ప్రీతితో లేరు. ఏమియు చేయజాలక, ఏమియు తోచక అతనికి కష్టము లెప్పుడు వచ్చునా యని యెదురుచూచుచున్నారు.

సహాయోపచితిం కృత్వా వ్యవసాయ్య తత స్తతః,
అనుదుష్యేయు రపరేஉపశ్యన్త స్తవ పౌరుషమ్. 5

సహాయసంపద నందించియు, ఆయా సందర్భములలో పరాక్రమించియు కూడ నీవు పౌరుషము చూపని కారణమున నీవారును (తమ శ్రమ యంతయు వ్యర్థమైన దను భావముతో) శత్రువులవైపు చేరుదురు.

తైః కృత్వా సహసఙ్ఘాతం గిరిదుర్గాలయం చర,
కాలే వ్యసనమాకాఙ్క్ష న్నైవాయ మజరామరః. 6

అట్టి నీవారిని కూడదీసికొని గిరిదుర్గములలో స్థలదుర్గములలో పగవాని కీడు నెదురుచూచుచు, తిరుగుచుండుము. వాడేమి? ముసలితనము, చావులేనివాడు కాదు గదా!

సఞ్జయో నామతశ్చ త్వం న చ పశ్యామి త త్త్వయి,
అన్వర్థనామా భవ మే పుత్ర మా వ్యర్థనామకః. 7

కొడుకా! నీ పేరు సంజయుడు. ఆ చక్కని జయము నీయందు నాకు కానరాకున్నది. పేరును సార్థకము చేసికొనుము. వ్యర్థము కానీకుము.

సమ్యగ్దృష్టి ర్మహాప్రాజ్ఞో బాలం త్వాం బ్రాహ్మణోஉబ్రవీత్,
అయం ప్రాప్య మహత్ కృచ్ఛ్రం పునర్వృద్ధిం గమిష్యతి. 8

నీ చిన్ననాడు, చక్కని ముందుచూపు, గొప్ప తెలివియుగల బ్రాహ్మణుడు 'వీడొక పెద్ద ఆపదలో చిక్కుకొని మరల గొప్పస్థితికి వచ్చు'నని పలికెను.

తస్య స్మరన్తీ వచన మాశంసే విజయం తవ,
తస్మాత్ తాత బ్రవీమి త్వాం వక్ష్యామి చ పునః పునః. 9

---

5. సహాయ - ఉపచితిమ్ - సహాయసంపదను; కృత్వా - చేసియు, అపరే - మిగిలిన నీవారు; పౌరుషమ్ - విజృంభించుటను; అపశ్యన్తః - చూడనివారై; వారి ప్రయత్నము ఫలమునకు రాని కారణమున; అనుదుష్యేయుః - ద్రోహము చేయుదురు - శత్రుపక్షమున చేరిపోవుదు రని భావము.

6 స్వీయులను కూర్చుకొను ఉపాయమును చెప్పుచున్నది. తైః - అట్టి నీ వారితో; సంఘాతమ్ - ఐక్యమును - అనగా నీవారిని కలుపుకొని అని భావము. వ్యసనమ్ - శత్రువు కీడును; అయం - వీడు - ఈ నీ శత్రువు.

ఆతని మాటను తలచుకొనుచు నీ గెలుపును కోరుచున్నాను. నాయనా! అందుకే నీ కింతగా చెప్పుచున్నాను. ఇంకను మాటిమాటికి చెప్పెదను.

యస్య హ్యర్థాభినిర్వృత్తౌ భవన్త్యాప్యాయితాః పరే,
తస్యార్థసిద్ధి ర్నియతా నయేష్వర్థానుసారిణః. 10

తాను కార్యము సాధించుటలో తనవారు ప్రీతి పొందినచో, నీతిమార్గము ననుసరించి ప్రయోజనములను సాధించు అట్టివానికి తప్పక కార్యసిద్ధి యగును.

సమృద్ధి రసమృద్ధిర్వా పూర్వేషాం మమ సఞ్జయ,
ఏవం విద్వాన్ యుద్ధమనా భవ మా ప్రత్యుపాహరః. 11

మునుపటివారికిని, నాకును యుద్ధమున గెలుపే కలుగనిమ్ము. ఓటమియే కలుగనిమ్ము. ఏదియైన ఒక్కటియే యని యెరిగి యుద్ధమున బుద్ధి పెట్టుము. వెన్ను చూపకుము.

నాతః పాపీయసీం కాఞ్చి దవస్థాం శమ్బరోఽబ్రవీత్,
యత్ర నైవాద్య న ప్రాత ర్భోజనం ప్రతిదృశ్యతే. 12

ఈ దినమునకు - కాదు - ఈ పూటకు తిండి కానరాదు. అనుదానికంటె మిక్కిలి పాపమైన అవస్థను శంబరుడు పేర్కొనలేదు.

పతిపుత్రవధా దేతత్ పరమం దుఃఖ మబ్రవీత్,
దారిద్ర్య మితి యత్ప్రోక్తం పర్యాయమరణం హి తత్. 13

---

10. అర్థ - అభినిర్వృత్తౌ - ప్రయోజనము కలిగినప్పుడు; పరే - తన చుట్టములు; ఆప్యాయితాః భవన్తి - తృప్తిపడినవా రగుదురు. తస్య - వానికి- అట్లు బంధువులను తృప్తిపరచువానికి; నయేషు - నీతిమార్గములయందు; అర్థసిద్ధిః - కార్యములు నెరవేరుట; నియతా - తప్పనిసరి.

11. మునుపటివారికైనను, తనకైనను గెలుపో, ఓటమియో ఏదియో ఒకటి తప్పక కలుగునని యెరిగి యుద్ధమున బుద్ధిపెట్టవలయునని భావము. మా ప్రత్యుపాహరః - యుద్ధమునుండి తోక ముడవకుము.

12. యుద్ధము చేయనిచో సంపదలు నశించి దారిద్ర్యము సంభవించునను ఉద్దేశముతో లేమివలన నగు కష్టములను ప్రతిపాదించుచున్నది.

13. పర్యాయమరణమ్ - పేరు వేరుగాని అది చావే అని తాత్పర్యము.

దారిద్ర్యమని దేనినందురో అది మగడు, కొడుకువంటివారి వధకంటె మించిన దుఃఖమనియు నాతడు చెప్పెను. అది మరియొక చావుగదా.

అహం మహాకులే జాతా హ్రదా ద్ధ్రద మివాగతా,
ఈశ్వరీ సర్వకల్యాణీ భర్త్రా పరమపూజితా. 14

నేను గొప్పయింట పుట్టితిని. ఒక మహాసరస్సునుండి వేరొక మహా సరస్సునకు చేరినట్లు మరియొక గొప్పయింటిని మెట్టితిని. ఒక రాజ్యమునకు పాలకురాలను. పొందదగిన శుభము లన్నింటిని పొందితిని. భర్త నన్ను గొప్పగా మన్నించెను.

మహార్హమాల్యాభరణాం సుమృష్టామ్బరవాససమ్,
పురా హృష్టః సుహృద్వర్గో మామపశ్యత్ సుహృద్గతామ్. 15

ఎంతయో విలువగల పూలమాలలు, భూషణములు, తళతళలాడు వస్త్రములు ధరించుచు చెలులతో తిరిగెడు నన్ను చెలులు మునుపు ఆనందముతో చూచిరి.

యదా మాం చైవ భార్యాం చ ద్రష్టాఽసి భృశదుర్బలామ్,
న తదా జీవితేనార్థో భవితా తవ సఞ్జయ. 16

ఇప్పుడు అట్టి నేను, నీ భార్యయు చిక్కి శల్యమైన యెడల మమ్ములను చూచి సంజయా! నీకు బ్రదుకుతో పనియేమి?

దాసకర్మకరాన్ భృత్యా నాచార్య ర్త్విక్పురోహితాన్,
అవృత్త్యాఽస్మాన్ ప్రజహతో దృష్ట్వా కిం జీవితేన తే. 17

ఇంట ఆ యా పనులు చేయు పరిచారకులు, ఆచార్యులు, యజ్ఞములు చేయించు ఋత్విక్కులు, పురోహితులు ఇచట బ్రతుకు లేక మనలను వదలి వెళ్ళిపోవుచుండగా చూచి నీవు బ్రదుకనేల?

యది కృత్యం న పశ్యామి తవాద్యాహం యథా పురా,
శ్లాఘనీయం యశస్యం చ కా శాన్తి ర్హృదయస్య మే. 18

---

17. అస్మాన్ ప్రజహతః - మనలను వదలి వెళ్ళిపోవుచున్నవారిని.
18. కృత్యమ్ - చేయదగినపనిని - పరాక్రమమును.

నీవు మనువటి వలె కొనియాడ దగినదియు, కీర్తిని సాధించునదియునగు పనిని చేయుచుండగా నేను చూడకున్నచో నాహృదయమునకు శాంతి యెక్కడిది?

నేతి చే ద్బ్రాహ్మణం బ్రూయాం దీర్యేత హృదయం మమ,
న హ్యహం న చ మే భర్తా నేతి బ్రాహ్మణ ముక్తవాన్. 19

ఇంటికి వచ్చిన బ్రాహ్మణునకు 'లేదు' అని చెప్పవలసి వచ్చినచో నా గుండె బ్రద్దలయి పోవును. నేనుగాని, నాభర్తగాని బ్రాహ్మణునకు 'లేదు' అని చెప్పలేదు.

వయ మాశ్రయణీయాః స్మ న శ్రోతారః పరస్య చ,
సాఽన్య మాసాద్య జీవన్తీ పరిత్యక్ష్యామి జీవితమ్. 20

మన మితరులకు ఆశ్రయ మొసగవలసినవారమే కాని పరుల చెప్పు చేతలలో ఉండవలసినవారము కాము. అట్టి నేను ఒకని నాశ్రయించి బ్రదుక వలసినచో నీ పాడు బ్రదుకును వదలివేయుదును.

అపారే భవ నః పార మప్లవే భవ నః ప్లవః,
కురుష్వ స్థాన మస్థానే మృతాన్ సంజీవయస్వ నః. 21

దరితోచని మమ్ము ఒడ్డును చేర్పుము. తెప్పలేని మాకు తెప్పవగుము. నిలువ నీడలేని మాకు చోటిమ్ము. చచ్చిన మమ్ము బ్రతికింపుము.

సర్వే తే శత్రవః శక్యా న చేజ్జీవితు మర్హసి,
అథ చే దీదృశీం వృత్తిం క్లీబా మభ్యుపపద్యసే. 22

ఆ పగవా రందరిని నీవు గెలువగలవు. అట్లుకాక యిట్టి పేదివృత్తినే చేకొందువేని నీవు బ్రదుకుట కర్హుడవు కావు.

---

20. శ్రోతారః-పరుల ఆజ్ఞను వినవలసినవారు, 'శ్రేతారః' అనియు పాఠము- ఆశ్రయించినవా రని యర్థము.

22. శక్యాః - శక్యులు - గెలువదగు వని భావము.

నిర్విణ్ణాత్మా హతమనా ముఞ్చైతాం పాపజీవికామ్,
ఏకశత్రువధేనైవ శూరో గచ్ఛతి విశ్రుతిమ్. 23

సంకల్పములు నశించి చిత్తమున వైరాగ్యము కుదురుకొనినచో ఈ పాపపు బ్రదుకును వదలిపెట్టుము. ఒక్క శత్రువును చంపినను శూరునకు పేరు వచ్చును.

ఇన్ద్రో వృత్రవధేనైవ మహేన్ద్రః సమపద్యత,
మాహేన్ద్రం చ గృహం లేభే లోకానాం చేశ్వరోఽభవత్. 24

వృత్రుని చంపుటవలననే ఇంద్రుడు మహేంద్రు డాయెను. మహేంద్ర భవనమును సంపాదించెను. లోకము లన్నింటికి ప్రభు వాయెను.

నామ విశ్రావ్య వై సంఖ్యే శత్రూ నాహూయ దంశితాన్,
సేనాగ్రం చాపి విద్రావ్య హత్వా వా పురుషం వరమ్. 25

యదైవ లభతే వీరః సుయుద్ధేన మహద్యశః,
తదైవ ప్రవ్యథన్తేఽస్య శత్రవో వినయన్తి చ. 26

తన పేరు గట్టిగా ప్రకటించి, ఆయుధములు పట్టిన శత్రువులను కవ్వించి, సేనమొనను చెల్లాచెదరు చేసి, కనీసము ఒక్క మహావీరుని చంపి వీరుడు గొప్ప యుద్ధముతో గొప్పకీర్తి సాధించిననాడు పగవారు కుమిలిపోవుదురు. లొంగి వత్తురు.

త్యక్త్వాత్మానం రణే దక్షం శూరం కాపురుషా జనాః,
అవశా స్తర్పయన్తి స్మ సర్వకామసమృద్ధిభిః. 27

---

23. నిర్విణ్ణాత్మా - విరక్తి చెందిన చిత్తము గలవాడు; హతమనాః - సంకల్పములు లేనివాడు; విశ్రుతిమ్ - ప్రసిద్ధిని.

24. గృహమ్ - దీనికి నీలకంఠులు 'గ్రహమ్' అను పాఠమును చూపి సోమపాత్రమను నర్థము నొసగిరి. 'ప్రగ్రహమ్' అనియు పాఠము(మాహేన్ద్రం ప్రగ్రహం లేభే) అపుడు నియంతృత్వమును అని యర్థము. 'ప్రగ్రహాశ్చ తులాసూత్రే ఐన్ద్యాం నియమనే భుజే' అని విశ్వకోశము. నియమన మనగా నియంతలక్షణము.

27. కాపురుషా జనాః - నీచులగు జనులు, ఆత్మానమ్. దేహమును; త్యక్త్వా-, వదలి; రణే - యుద్ధమున; దక్షమ్ - సమర్థుడగు; శూరమ్ - శూరుని, సమృద్ధిభిః-సంపదలతో; తర్పయన్తి స్మ-తృప్తిపరతురు అని అన్వయము.

నీచులగు జనులు వశము తప్పినవారై యుద్ధమున దేహమును వదలి సమర్థుడు, శూరుడు అగువానిని, వాడు కోరిన సంపదల నన్నింటిని అర్పణము చేసి తృప్తిపరతురు.

రాజ్యం చాప్యుగ్రవిభ్రంశం సంశయో జీవితస్య వా,
న లబ్ధస్య హి శత్రో ర్వై శేషం కుర్వన్తి సాధవః. 28

సజ్జనులు ఘోరముగా పతనము చెందిన రాజ్యమునైనను చావునైనను కోరుదురు. అంతేకాని తాము జయించిన శత్రువును ఎంతమాత్రము మిగుల నీయరు. (లేదా ఏ కొద్ది సంపదతో నైనను శత్రువును మననీయరు).

స్వర్గద్వారోపమం రాజ్య మథవాఽప్యమృతోపమమ్,
రుద్ధ మేకాయనం మత్వా పతోల్మక ఇవారిషు. 29

రాజ్యము స్వర్గద్వారము వంటిది. లేదా అమృతమువంటిది. అది పరులకు చిక్కినది. ఒక్కదారి నెన్నుకొని కొఱవివలె శత్రువులపైకి దూకుము.

జహి శత్రూన్ రణే రాజన్ స్వధర్మ మనుపాలయ.

రాజా! యుద్ధమున పగవారిని పరిమార్చుము. నీధర్మమును చక్కగా పాలింపుము.

మా త్వా దృశం సుకృపణం శత్రూణాం భయవర్ధనమ్, 30
అస్మదీయైశ్చ శోచద్భి ర్నదద్భిశ్చ పరై ర్వృతమ్,
అపి త్వాం నానుపశ్యేయం దీనాద్దీన మివాస్థితమ్. 31

---

28. ఉగ్రవిభ్రంశమ్ - ఘోరముగా పతనము చెందుట; జీవితస్య సంశయః - మరణము; శత్రోః లబ్ధస్య - శత్రువునకు దక్కినదాని; శేషమ్ - మిగులును-ఏదో కొద్దిపాటి సంపదను నిలుపుటను; న కుర్వన్తి-చేయరు;

29. గెలిచినచో అమృతమువంటి రాజ్యము దక్కును. చచ్చినచో స్వర్గము దక్కును - అని భావము; రుద్ధం - అట్టి రాజ్యము పరులకు చిక్కెను. ఏకాయనమ్ - ఒకదానిని - గెలిచి రాజ్యమును సాధించుటయో, చచ్చి స్వర్గమును సాధించుటయో యను దానిని; మత్వా-నిశ్చయించి; ఉల్మకః ఇవ - కొఱవివలె: అరిషు - శత్రువులయందు; పత - పడుము.

30. శత్రూణామ్ - శత్రువుల; భయవర్ధనమ్ - భయమును పెంచువానిని, త్వా - నిన్ను; మా దృశమ్ - నేను చూడను.

పగవారి భయమును పారద్రోలు పరమదీనుని నిన్ను నేను చూడజాలను. మనవారు ఏడ్చుచుండగా, పరులు చుట్టుముట్టి పరిహాసములతో అరచుచుండగా మొగమున కళయు కాంతియు లేని నిన్ను నేను చూడజాలను.

హృష్య సౌవీరకన్యాభిః శ్లాఘస్వార్థైర్యథా పురా,
మా చ సైన్ధవకన్యానా మవసన్నో వశం గమః. 32

సౌవీరకన్యలైన నీ భార్యలతో సుఖ మనుభవింపుము. మునుపటివలె సొమ్ములతో వారి నలరింపుము. నీరుగారిపోవుచు శత్రుదేశమువారగు సైంధవ కన్యలకు లొంగిపోకుము.

యువా రూపేణ సంపన్నో విద్యయాఽభిజనేన చ,
యస్త్వాదృశో వికుర్వీత యశస్వీ లోకవిశ్రుతః. 33

యువకుడు, రూపము, విద్య, మంచికులము సమృద్ధిగా గలవాడు, కీర్తిమంతుడు, లోకమున ప్రసిద్ధి కెక్కినవాడు నగు నీ వంటివాడు ఇట్టి వెట్టిపని చేయనగునా?

అధుర్యవచ్చ వోఢవ్యే మన్యే మరణమేవ తత్.

భారమంతయు మోయవలసి యుండగా నీవు లొంగని ఎద్దువలె ఇట్టి విపరీతపు పనిచేయుట చావే యని నా తలపు.

యది త్వా మనుపశ్యామి పరస్య ప్రియవాదినమ్, 34
పృష్ఠతోఽనువ్రజన్తం వా కా శాన్తి ర్హృదయస్య మే,
నాస్మిన్ జాతు కులే జాతో గచ్ఛేద్యోఽన్యస్య పృష్ఠతః. 35

---

32. సౌవీరకన్యాభిః - సౌవీరదేశపు కన్యలగు నీ భార్యలతో; సిన్ధుకన్యానామ్ - శత్రువగు సింధురాజు కన్యల; అవసన్నః - పౌరుషము లేనివాడవై;

33. వికుర్వీత - యుద్ధమునుండి తొలగునా?

34. అధుర్యవత్ - ధుర మనగా కాడి, దానికి కట్టుటకు యోగ్యమైన ఎద్దు ధుర్యము, అట్టిది కానిది అధుర్యము - దానివలె; తత్ - ఆ వెట్టిపని;

పరులకు ప్రియములు పలుకుచు వాని వెంటబడి తిరుగుచున్న నిన్ను చూచినచో నా హృదయమునకు శాంతి యెక్కడిది? ఈ కులమున పుట్టిన వాడెవ్వడును ఒకని వెనుకబడి తిరుగుట యెన్నడు జరుగలేదు.

న త్వం పరస్యానుచర స్తాత జీవితు మర్హసి,
అహం హి క్షత్రహృదయం వేద యత్ పరిశాశ్వతమ్. 36

బాబూ! నీవు ఒకని వెంటబడి తిరుగుచు బ్రదుకరాదు. నేను ఎట్టి మార్పును లేని క్షత్రియహృదయము నెరుగుదును.

పూర్వైః పూర్వతరైః ప్రోక్తం పరైః పరతరై రపి,
శాశ్వతం చావ్యయం చైవ ప్రజాపతివినిర్మితమ్. 37

మునుపటివారు, అంతకు ముందువారు, ఇతరులును, వారికంటె వేరైన వారును ఎల్లకాలమునకు సంబంధించినదియు, ఎట్టిమార్పులు లేనిదియు ప్రజాపతి నిర్మించినదియు నగు క్షత్రియహృదయమును గూర్చి చెప్పియే యున్నారు.

యో వై కశ్చిదిహాజాతః క్షత్రియః క్షత్రకర్మవిత్,
భయాద్ వృత్తిసమీక్షో వా న నమేదిహ కస్యచిత్. 38

ఈ కులమున చక్కగా పుట్టిగా క్షత్రియుడు క్షత్రియధర్మము నెరిగిన వాడు భయమువలననో, బ్రదుకుతెరువును చూచుకొనుటనో ఎవ్వనికిని తల వంచరాదు.

---

36. పరిశాశ్వతమ్ - ఎల్లవిధముల ఒకే రూపముతో నుండునది - క్షీణింపనిదని తాత్పర్యము - వేద - వేద్మి - ఎరుగుదును.

37. పూర్వైః - నీవంశమున పుట్టిన పూర్వులచేత; పూర్వతరైః - వారికంటె మునుపటివారిచేత; పరైః - ఇతరవంశముల వారిచేత; పరతరైః - వారికంటెను చక్కని జ్ఞానము, అనుభవము గల వృద్ధులచేత; ప్రోక్తమ్ - చెప్పబడినది - క్షత్రహృదయ మను మాట పూర్వశ్లోకమునుండి తెచ్చుకొనవలయును.

38. ఆజాతః - చక్కగా ధర్మము తప్పకుండ పుట్టినవాడు - సః - వాడు. భయాత్-ప్రాణము మున్నగునవి పోవునేమో యను భయమువలన; కస్యచిత్ - ఎవనికిని; న నమేత్-తల వంచరాదు; వృత్తిసమీక్షణః - బ్రదుకు తెరువును చూచుకొనువాడై; న నమేత్ - తల వంచరాదు.

ఉద్యచ్ఛేదేవ న నమే దుద్యమో హ్యేవ పౌరుషమ్,
అప్యపర్వణి భజ్యేత న నమేతేహ కస్యచిత్. 39

ప్రయత్నము చేయుచునే యుండవలయును. కాని తల వంచరాదు. ఉద్యమమే గదా పౌరుషము. వ్యర్థముగా విఱుగుట (నాశము) నైన పొంద వచ్చును గాని ఎవ్వనికిని మ్రొక్కరాదు.

మాతఙ్గో మత్త ఇవ చ పరీయాత్ స మహామనాః,
బ్రాహ్మణేభ్యో నమే న్నిత్యం ధర్మాయైవ చ సఞ్జయ. 40

దొడ్డబుద్ధి గలవాడై మదించిన ఏనుగువలె తిరుగుచుండవలెను. బ్రహ్మజ్ఞానము గల మహాత్ములకు ధర్మముకొరకై, సంజయా, నిత్యము మ్రొక్కదగును.

నియచ్ఛ న్నితరాన్ వర్ణాన్ వినిఘ్నన్ సర్వదుష్కృతః,
ససహాయోఽసహాయో వా యావజ్జీవం తథా భవేత్. 41

తక్కిన వర్ణముల వారిని వారి వారి ధర్మములందు కట్టడి చేయుచు పాపిష్ఠుల నందరను రూపుమాపుచు, తోడున్నను లేకున్నను బ్రదుకంతయు అట్లే ప్రవర్తింపవలయును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదులాపుత్రానుశాసనే చతుస్త్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున విదుల పుత్రుని మందలించుట యను నూటముప్పదినాలుగవ అధ్యాయము.

—;o:—

39. ఉద్యచ్ఛేత్ - ఉద్యమము చేయవలయును; అపర్వణి - అకాండమున; వ్యర్థముగా నైనను; భజ్యేత - చావవలయును - మ్రొక్కవలసి వచ్చినచో అని తాత్పర్యము.
40. పరీయాత్ - తిరుగుచుండవలయును.
41. సర్వదుష్కృతః - పాపిష్ఠుల నందరిని.

# పఞ్చత్రింశదధికశతతమోఽధ్యాయః

# నూటముప్పదియైదవ అధ్యాయము

**విదులాతత్పుత్రసంవాదః - విదులయా కార్యే సాఫల్యాధాయకానాం శత్రువశీకర్తౄణాం జయోపాయానాం నిర్దేశః.**

**విదుల కుమారునితో ప్రసంగము చేయుట, పనిని నెరవేర్చునట్టియు పగవారిని లోగొనునట్టియు జయోపాయముల నామె వక్కాణించుట.**

పుత్ర ఉవాచ - కొడు కిట్లు పలికెను.

కృష్ణాయసస్యేవ చ తే సంహత్య హృదయం కృతమ్,
మమ మాత స్త్వకరుణే వీరప్రజ్ఞే హ్యమర్షణే. 1

తల్లీ! దయలేనిదానా! వీరుల తెలివికలదానా! కోపిష్ఠిదానా! నీగుండె నల్లని ఉక్కు ముద్దగా చేసి చేసినట్లున్నది.

అహో క్షత్రసమాచారో యత్ర మా మితరం యథా,
నియోజయసి యుద్ధాయ పరమాతేవ మాం తథా. 2

ఆహా! క్షత్రియాచారము ఎటువంటిది? దానిని పట్టుకొని ఎవడో కాని వానిని మరియొకని తల్లి తరిమినట్లు యుద్ధమునకు తోలుచున్నావు.

ఈదృశం వచనం బ్రూయా ద్భవతీ పుత్ర మేకజమ్,
కిం ను తే మా మపశ్యన్త్యాః పృథివ్యా అపి సర్వయా. 3

ఒక్కొగా నొక్క కొడుకును నన్ను పట్టుకొని యింతలేసి మాట లను చున్నావు. నేను గానరానిచో నీ కీ భూమి యంతయు లభించినను ఏమి లాభము?

---

1. కృష్ణాయసస్య - ఉక్కుయొక్క; సంహత్య - ముద్దచేసి.
3. ఏకజమ్ - ఒక్క కొడుకును - అన్నదమ్ములు లేని వానిని;

కిమాభరణకృత్యేన కిం భోగై ర్జీవితేన వా,
మయి వా సజ్జరహతే ప్రియపుత్రే విశేషతః. 4

నీ కెంతో ముద్దులకుమారుడను నేను యుద్ధమున చావగా నీకు అలంకార ములతో గాని, సుఖములతో గాని, బ్రదుకుతో గాని పనియేమి?

మాతోవాచ - తల్లి యిట్లు పలికెను.

సర్వావస్థా హి విదుషాం తాత ధర్మార్థకారణాత్,
తావే వాభిసమీక్ష్యాహం సజ్జయ త్వా మచూచుదమ్. 5

నాయనా! సంజయా! అన్నియు నెరిగినవారికి ధర్మము, అర్థము కారణ ముగా అన్నిదశలు సిద్ధించుచున్నవి. ఆ రెంటినే జాగ్రత్తగా పరికించి నిన్ను పురికొల్పితిని.

స సమీక్ష్యక్రమోపేతో ముఖ్యః కాలో౽య మాగతః,
అస్మిం శ్చేదాగతే కాలే కార్యం న ప్రతిపద్యసే,
అసంభావితరూప స్త్వ మానృశంస్యం కరిష్యసి! 6

చక్కగా పరికింపదగిన పరాక్రమమునకు యోగ్యమైన సమయ మిదిగో ఆసన్నమైనది. ఇట్లు వచ్చిన కాలమున నీవు చేయదగిన దానిని చేపట్టక పగవారి యందో నీ దేహమునందో జాలి తలచినచో నీ మొగ మెవ్వరును చూడరు.

తం త్వా మయశసా స్పృష్టం న బ్రూయాం యది సజ్జయ,
ఖరీవాత్సల్య మాహు స్తన్నిఃసామర్థ్య మహేతుకమ్. 7

---

4. సర్వావస్థా-గృహస్థ ధర్మము మొదలగునది. మానవునకు అన్ని దశలలో ధర్మార్థములే పనికివచ్చునవని తాత్పర్యము; తా ఏవ - ఆ రెంటినే - ఆ ధర్మార్థములనే; అభిసమీక్ష్య-అన్నికోణములనుండి పరికించి, అచూ చుదమ్ - పురికొల్పితిని;

5. సమీక్ష్యక్రమోపేతః - చక్కగా చూడదగిన పరాక్రమముతో కూడిన; కార్యమ్ - చేయదగిన దానిని- యుద్ధమును; న ప్రతిపద్యసే-చేయవేని.

6. ఆనృశంస్యమ్ - శత్రువులయందో, నీదేహమునందో జాలిని, కరిష్యసి చేత్ - చేసినచో; అసంభావితరూపః - మన్నింపరాని స్థితి గలవాడవు;

7. నిఃసామర్థ్యమ్ - సామర్థ్యము లేని - దేనిని సాధింపని; అహేతుకమ్ - కారణములేని, పనికిమాలిన, ఖరీవాత్సల్యమ్ - గాడిదకు బిడ్డమీద ఉన్న

అపకీర్తి అంటు సోకిన నిన్ను, సంజయా! నేను మందలింపనిచో 'ఎందుకును పనికిరాని గాడిద ప్రేమ ఈ తల్లిది' అందురు.

సద్భి ర్విగర్హితం మార్గం త్యజ మూర్ఖనిషేవితమ్. 8

మూర్ఖులు ఆదరించునట్టిది, సజ్జనులు ఛీకొట్టునట్టిది యగు మార్గమును విడనాడుము.

అవిద్యా వై మహత్యస్తి యా మిమాం సంశ్రితాః ప్రజాః,
తవ స్యాద్యది సద్వృత్తం తేన మే త్వం ప్రియో భవేః. 9

ఈ జనులను పట్టిన అజ్ఞానము చాల గలదు. నీకును అట్టి శీల మున్నచో మంచిది. దానితో నాకు ప్రియుడ వగుదు వన్నమాట!

ధర్మార్థగుణయుక్తేన నేతరేణ కథఞ్చన,
దైవమానుషయుక్తేన సద్భి రాచరితేన చ. 10

ధర్మార్థముల గుణములతో కూడినదియు, సత్పురుషులు ఆచరించునట్టిదియు దైవము, మానుషము కలిసినట్టిదియు నగు నడవడిని నీవు అలవరచుకొనుము. ఎన్నటికిని తక్కినదాని పొంత పోకుము.

---

ప్రేమను. ఆహుః - చెప్పుదురు. గాడిద బిడ్డపై చూపు ప్రేమ ఇటు ఈ లోకమునగాని అటు పరలోకమునగాని దేనిని సాధింపదు. నేనును అట్టి ప్రేమ చూపినదాన నగుదు నని భావము.

9. అవిద్యా - ఆత్మకాని దేహమున ఆత్మయను బుద్ధి; తవ - దేహము నశించినచో ఆత్మ నశించుననుకొను నీయొక్క; వృత్తమ్ - శీలము; సత్ - మంచిది. మేలైనది - ఇది వెక్కిరింత; తేన - అట్టి భావముతో; మే - దేహముకంటె విడిగా ఆత్మను చూచునట్టి నాకు, ప్రియః - ఇష్టుడవు; భవేః - అగుదువు - ఇదియు వెక్కిరింత; దేహము ఆత్మ ఒక్కటే అను కొను చెడు శీలముగలవానిని నేను అసహ్యించుకొందునని తాత్పర్యము.

యో హ్యేవ మవినీతేన రమతే పుత్ర నప్తృణా,
అనుత్థానవతా చాపి దుర్వినీతేన దుర్ధియా, 11
రమతే యస్తు పుత్రేణ మోఘం తస్య ప్రజాఫలమ్.

ఇట్టి వినయము లేని, ఏ పనికిని ప్రయత్నము చేయని, పాడుబుద్ధిగల మనిమనుమనిగాని కొడుకునుగాని చూచి మురిసిపోవువానికి సంతానము వలని ఫలము లేనట్టిదేగదా!

అకుర్వన్తో హి కర్మాణి కుర్వన్తో నిన్దితాని చ,
సుఖం నైవేహ నాముత్ర లభన్తే పురుషాధమాః. 12

చేయవలసినవానిని చేయక, లోకము చెడదిట్టు పనులను చేయు పురుషాధములు ఈ లోకమునగాని పరలోకమునగాని సుఖమును ఎన్నటికిని పొందరు.

యుద్ధాయ క్షత్రియః సృష్టః సఞ్జయేహ జయాయ చ,
జయన్ వా వధ్యమానో వా ప్రాప్నోతీన్ద్రసలోకతామ్. 13

సంజయా! క్షత్రియుడు యుద్ధము చేయుటకే, జయము పొందుటకే పుట్టెను. గెలుచుచున్నవాడై, లేదా చచ్చుచున్నవాడై యింద్రునితో సమానమగు స్థితిని పొందును.

న శక్రభవనే పుణ్యే దివి తద్విద్యతే సుఖమ్,
యదమిత్రాన్ వశే కృత్వా క్షత్రియః సుఖ మేధతే. 14

పగవారిని లొంగదీసికొని క్షత్రియుడు పొందు సుఖమునకు సాటియగు సుఖము పుణ్యమగు స్వర్గమున ఇంద్రభవనమునందును లేదు.

మన్యునా దహ్యమానేన పురుషేణ మనస్వినా,
నికృతేనేహ బహుశః శత్రూన్ ప్రతిజిగీషయా. 15

---

11. మొదటి పాదము - చేవ చచ్చి ఏ ప్రయత్నమునకు సిద్ధపడని వాని వలన వెనుక నాలుగుతరములవారు సంతానఫలము కోల్పోవుదురని భావము.

15. నికృతేన - అపకారము చేయబడిన; శత్రూన్ ప్రతి - శత్రువులపైకి బయలుదేరవలయునని భావము.

అపకారము పొందినను దగుటచే కోపము కాల్చివేయుచుండగా అభిమానవంతుడగు పురుషుడు పెక్కుశ్రోవలలో శత్రువును గెలుచుకోరికతో వారిపైకి దండెత్తవలయును.

ఆత్మానం వా పరిత్యజ్య శత్రుం వా వినిపాత్య చ,
అతోఽన్యేన ప్రకారేణ శాన్తి రస్య కుతో భవేత్. 16

క్షత్రియుడు చచ్చియో, శత్రువును కూలద్రోసియో శాంతి పొందును. మరియొకవిధమున వానికి శాంతి యెక్కడిది ?

ఇహ ప్రాజ్ఞో హి పురుషః స్వల్ప మప్రియ మిచ్ఛతి,
యస్య స్వల్పం ప్రియం లోకే ధ్రువం తస్యాల్ప మప్రియమ్.17

బుద్ధిగలవాడు స్వల్పమైన సంపదను అనిష్టముగా భావించును. ఆ కొద్దియే ప్రియముగా భావించువానికి కీడొనరించు ఆ కొద్దిపాటి ప్రియము తప్పక లభించును.

ప్రియాభావాచ్చ పురుషో నైవ ప్రాప్నోతి శోభనమ్,
ధ్రువం చాభావ మభ్యేతి గత్వా గఙ్గేవ సాగరమ్. 18

ప్రియమైనది లేని పురుషుడు శుభమును పొందనే పొందదు. సముద్రములో కలసిన గంగవలె వాడు తప్పక నాశనము పొందును.

పుత్ర ఉవాచ - పుత్రు డిట్లనెను.

నేయం మతి స్త్వయా వాచ్యా మాతః పుత్రే విశేషతః,
కారుణ్య మేవాత్ర పశ్య భూత్వేహ జడమూకవత్. 19

---

17. స్వల్పమ్ - కొలదిపాటి సంపదను; అప్రియమ్-అనిష్టమైనదిగా; ఇచ్ఛతి - భావించును; యస్య తు - ఎవనికి; స్వల్పమ్ - కొలదిపాటి సంపద; లోకే - లోకమున; ప్రియమ్ - ప్రియ మగునో; తస్య - అట్టివానికి; ధ్రువమ్ - నిశ్చయముగా; అల్పమ్ - ఆ కొలది సంపద; అప్రియమ్ - అనర్థము కూర్చునది - అగును - అనగా రాజు అల్పసంతుష్టుడు కారాదని భావము.

18. అభావమ్ - నాశనమును; అభ్యేతి - పొందును.

19. కారుణ్యమేవ - దయనే; అత్ర - ఈకొడుకు విషయమున, పశ్య - మేలైనదిగా చూడుము.

అమ్మా! నీవిట్టి బుద్ధి నూరి పోయరాదు. అందును ప్రత్యేకించి కొడుకునకు చెప్పనే రాదు. జాలి దలచుటయే మేలని మందుతో, మూగియో యన్నట్లు నన్ను చూడుము.

మాతోవాచ - తల్లి యిట్లు పలికెను.

అతో మే భూయసీ నన్ది ర్యదేవ మనుపశ్యసి,
చోద్యం మాం చోదయస్యేత ద్భృశం వై చోదయామి తే. 20

నీవు నీదేహమునుగూర్చి జాలిపడుటయే మేలైనదిగా చూచుచున్నావు. ఆ మాటయే నాకు (నిన్ను ప్రేరణ చేయుటకు) మరింత పుష్టి నిచ్చుచున్నది. నీపై నన్ను నీకేది చేయవలయునో సూచించుచున్నావు. నేనుమాత్రము నిన్ను మరింతగా నీవు చేయవలసిన దేదో చెప్పుచున్నాను.

అథ త్వాం పూజయిష్యామి హత్వా వై సర్వసైన్ధవాన్,
అహం పశ్యామి విజయం కృచ్ఛ్రభావిత మేవ తే. 21

సింధురాజుల నందరను చంపి, కష్టమని నీవు భావించిన నీ విజయమును చూచినప్పుడే నేను నిన్ను మన్నింపగలను.

---

20. అతః - ఈమాటవలననే, మే - నాకు, భూయసీ - అధికమైన; నన్దిః - పుష్టి - జాలిపడుచున్న మాటయే నన్ను మరింతగా నీకు బోధించుటకు ప్రేరణ చేయుచున్నదని భావము. యత్, ఏవమ్, అనుపశ్యసి - దేహమున జాలి చూపుటయే మేలని నీవు భావించుటయే నన్ను నీకు బుద్ధి చెప్పుటకు ప్రేరణ చేయుచున్నదని భావము. మామ్ - నన్ను; చోద్యమ్ - నీయెడ ప్రవర్తింపవలసిన తీరునుగూర్చి నిజమునకు ప్రవర్తింపరాని దానిని; చోదయసి - ప్రేరణ చేయుచున్నావు. అయినను; నేను వజ్ర హృదయనై నిన్ను నీకర్తవ్యము చేయవలసినదిగా; చోదయామి - ప్రేరణ చేయుచున్నాను.

21. నీవు విజయము సాధించినపుడే నేను నిన్ను మన్నింతునని తాత్పర్యము.

పుత్ర ఉవాచ - కొడుకు కిట్లనెను.

అకోశ స్యాసహాయస్య కుతః సిద్ధి ర్జయో మమ,
ఇత్యవస్థాం విదిత్వైతా మాత్మనాఽత్మని దారుణామ్. 22
రాజ్యా ద్భావో నివృత్తో మే త్రిదివా దివ దుష్కృతః.

ధనాగారము వట్టిపోయినది. తోడగువారు లేరు. నాకు జయము, కార్య సిద్ధి కలుగుటెట్లు? అని యీ దారుణమైన అవస్థను నా అంతట నేను గుర్తించితిని. పాపి స్వర్గమునుండి మరలినట్లు నా హృదయము రాజ్యమునుండి మరలినది.

ఈదృశం భవతీ కఞ్చి దుపాయ మనుపశ్యతి, 23
తన్మే పరిణతప్రజ్ఞే సమ్యక్ ప్రబ్రూహి పృచ్ఛతే,
కరిష్యామి హి తత్సర్వం యథావ దనుశాసనమ్. 24

పండిన ప్రజ్ఞగల ఓ తల్లీ! ఏదైన ఉపాయము నీకు తోచినచో, నిన్ను ప్రార్థించుచున్న నాకు బోధింపుము. నీ ఆజ్ఞ నంతటిని ఉన్నదున్నట్లు పాటింతును

మాతోవాచ - తల్లి యిట్లు పలికెను.

పుత్ర నాత్మాఽవమన్తవ్యః పూర్వాభి రసమృద్ధిభిః,
అభూత్వా హి భవన్త్యర్థా భూత్వా నశ్యన్తి చాపరే,
అమర్షేణైవ చాప్యర్థా నారబ్ధవ్యాః సుబాలిశైః. 25

నిన్ను నీవు హీనుడవుగా తలచుకొనరాదు. మునుపు లేని సంపదలు సిద్ధించుచుండును. ఉన్నవి పోవుచుండును. బుద్ధి తక్కువవారు తొందరపాటుతో ధర్మాదులను సాధింప దొరకొనరాదు.

---

22. ఆత్మనా ఆత్మని - స్వయముగా, విదిత్వా - ఎరిగి.

25. అసమృద్ధిభిః - నశించిన సంపదలను గూర్చి బాధపడుచు - అని భావము. ఆత్మా - తాను. న అవమన్తవ్యః - అవమానించుకొనరాదు; సుబాలిశైః - తెలివి ఏ కొంచెమును లేనివారిచేత; అమర్షేణ ఏవ - తొందరపాటుతో; అర్థాః - ధర్మము మున్నగు ప్రయోజనములు న. ఆరబ్ధవ్యాః - సాధింప మొదలిడరానివి. తెలివిలేనివారు ఊరక కోపము వహించి ధర్మాదులను సాధింప నుంకింపరాదని భావము. పండితులై వివేకముతో సాధింప వలయునని భావము.

సర్వేషాం కర్మణాం తాత ఫలే నిత్య మనిత్యతా,
అనిత్య మితి జానన్తో న భవన్తి భవన్తి చ. 26

బాబూ! ఆ యా కర్మము లన్నింటికి తప్పక ఫలము లభించునని చెప్ప జాలము. అట్లు ఫలము అనిత్యమని తెలిసిన పండితులు దానిని పొందక పోవచ్చును. పొందను వచ్చును.

అథ యే నైవ కుర్వన్తి నైవ జాతు భవన్తి తే,
ఐకగుణ్య మనీహాయా మభావః కర్మణాం ఫలమ్,
అథ ద్వైగుణ్య మీహాయాం ఫలం భవతి వా న వా. 27

ఆ యా కార్యములు బొత్తుగా చేయనివారు ఎన్నటికిని ఫల మందజాలరు. పనులపట్ల ఆసక్తి లేనియెడల గుణ మొక్కటియే. అది కర్మముల ఫలము నశించుట. ఆసక్తియున్న యెడల ఫలము సిద్ధించుటయో, సిద్ధింపకుండుటయో అని రెండు గుణములు.

యస్య ప్రాగేవ విదితా సర్వార్థానా మనిత్యతా,
నుదేద్ వృద్ధిసమృద్ధీ స ప్రతికూలే నృపాత్మజ. 28

కార్యము లన్నింటి ఫలములు సిద్ధించుట మన యిష్టమును బట్టి జరుగదని ముందే యెరిగినవాడు. ప్రతికూలమగు ఆత్మహానిని గాని, పరసమృద్ధిని లెక్క చేయడు.

ఉత్థాతవ్యం జాగృతవ్యం యోక్తవ్యం భూతికర్మసు. 29

---

26. న భవన్తి - ఒకప్పుడు ఐశ్వర్యము పొందువారు కారు; భవన్తి చ - పొందువారును అగుదురు.

27. చేతులు ముడుచుకొని కూర్చుండువారిని నిందించుచున్నది. అనీహాయామ్- కార్యమునకు పూనుకొననిచో, ఐకగుణ్యమ్ - ఒక్కటే గుణము; ఫలమ్ - ఫలము; కర్మణామ్ - కర్మముల; అభావః - నాశము.
ఈహాయామ్ తు - కార్యములందు ఆసక్తియున్నయెడల; ద్వైగుణ్యమ్ - రెండు గుణములు; భవతి, వా, న, వా - కార్యము సిద్ధించుటయో, సిద్ధింపకుండుటయో అనునవి. సిద్ధింపదు - అనుటకంటె సిద్ధింపవచ్చు నన్న ప్రవృత్తి మేలైనది కదా! అని భావము.

29. వృద్ధిసమృద్ధీ - వృద్ధి యనగా పీడ - "వృధు హింసాయామ్" అను ధాతురూప మిది. సమృద్ధి యనగా ఐశ్వర్యము - తనకు పీడయు, పరు

భవిష్యతీత్యేవ మనః కృత్వా సతత మవ్యథైః,
మఙ్గలాని పురస్కృత్య బ్రాహ్మణాం శ్చేశ్వరైః సహ. 30

మానవులు దైవములను, బ్రహ్మజ్ఞానసంపన్నులను, మంగళములను ముందిడుకొని కార్యము తప్పక నెరవేరునను మనసు పెట్టుకొని, దుఃఖమును దరికి రానీక ఎల్లవేళల శుభకార్యములయందు నిలుపవలయును. మెలకువతో నుండవలయును. వానియందు తగులుకొని యుండవలయును.

ప్రాజ్ఞస్య నృపతే రాశు వృద్ధి ర్భవతి పుత్రక,
అభివర్తతి లక్ష్మీ స్తం ప్రాచీమివ దివాకరః. 31

పిల్లవాడా! మంచి ప్రజ్ఞకల రాజునకు, శీఘ్రముగా వృద్ధి కలుగును. సూర్యుడు తూర్పుదిక్కున కెగబ్రాకినట్లు లక్ష్మి వానికడకు చేరుకొనును.

నిదర్శనా న్యుపాయాంశ్చ బహూ న్యుద్ధర్షణాని చ,
అనుదర్శితరూపోఽసి పశ్యామి కురు పౌరుషమ్. 32

---

లకు ఐశ్వర్యమును సిద్ధించినను అట్టి స్థితిని ఫలముల అనిత్యత నెరిగిన వాడు త్రోసివేయునని భావము. తన కర్తవ్యము తాను చేసితి నను తృప్తియే వాని ప్రవృత్తికి ఫలమని తాత్పర్యము. ఉత్థాతవ్యమ్ - నిలువవలయును - కార్యమును నిర్వహించుటకు సిద్ధమై యుండవలయునని భావము; జాగృతవ్యమ్ - మెలకువతో నుండవలయును - కార్యము నెరవేరువరకు పొరపాటు రానీయరాదని భావము; యోక్తవ్యమ్ - కూడి యుండవలయును - చేపట్టిన పనిని విడువరాదని భావము.

30. ఈశ్వరైః సహ - దైవములతో పాటు;

32. ఉద్ధర్షణాని - ఉత్సాహము పెంచువానిని, అనుదర్శితరూపః - చక్కగా నిరూపింపబడిన లోకవృత్తాంతము కలవాడవు - ఇచట రూపశబ్దమునకు లోకపు తీరు అని అర్థము.

నిదర్శనములను, ఉపాయములను, ప్రోత్సాహము కలిగించువానిని, లోకపుతీరులను నీకు పెక్కువిధములుగా నిరూపించితిని మగతనము చూపుము. చూతును.

పురుషార్థ మభిప్రేతం సమాహర్తు మిహార్హసి,
క్రుద్ధాన్ లుబ్ధాన్ పరిక్షీణా నవలిప్తాన్ విమానితాన్, 33
స్పర్ధిన శ్చైవ యే కేచిత్ తాన్యుక్త ఉపధారయ.

కోరిన పురుషార్థమును నీవు చక్కగా కూడదీసికొనవలయును. నీపై కోపించియున్నవారిని, సంపదలపై అత్యాశ కలవారిని, సంపదలు కోల్పోయి ఉన్నవారిని, మిడిసిపడుచుండువారిని, పరువు కోల్పోయినవారిని, నిన్ను మించ వలయునని యత్నించుచున్నవారిని మెలకువతో కూడగట్టుకొనుము.

ఏతేన త్వం ప్రకారేణ మహతో భేత్స్యసే గణాన్, 34
మహావేగ ఇవోద్భూతో మాతరిశ్వా వలాహకాన్.

ఈ విధముగా నీవు పెనువేగముగల గాలి విజృంభించి మేఘములను చెల్లాచెదరు చేసినట్లు, పెనుమూకలను చీల్చివేయగలుగుదువు.

తేషా మగ్రప్రదాయీ స్యాః కల్యోత్థాయీ ప్రియంవదః, 35
తే త్వాం ప్రియం కరిష్యన్తి పురోధాస్యన్తి చ ధ్రువమ్.

అట్టివారికి ముందే తిండి పెట్టుము. వేతనము లిమ్ము. న్యాయమునకు నిలుచువాడవు కమ్ము ప్రియముగా పలుకరింపుము. అప్పుడు వారు నిన్ను ప్రేమింతురు. గొప్పగా మన్నింతురు. ఇది నిక్కము.

---

33 పరిక్షీణాన్ - చెడినవారిని - సంపదలు కోల్పోయినవారి నని భావము; అవలిప్తాన్ - గర్వముతో మిడిసిపడువారిని, విమానితాన్ - అవమానింపబడినవారిని; స్పర్ధినః - పోటీపడువారిని;

35. తేషామ్ - తనపై కోపించియున్నవారు మొదలగువారికి, అగ్రప్రదాయీ- అన్నము వేతనము మున్నగునవి ముందుగనే ఇచ్చువాడవు; స్యాః - కమ్ము. అట్లు కానిచో కోపించియున్నవా రందరు తన్ను వదలి పోవుదు రని భావము. పురోధాస్యన్తి - గొప్పగా మన్నింతురు.
కల్యోత్థాయీ - కల్ప మనగా న్యాయము - దానికై సిద్ధముగా నున్న

యదైవ శత్రుర్జానీయాత్ సపత్నం త్యక్తజీవితమ్,
తదైవాస్మా దుద్విజతే సర్పా ద్వేశ్మగతా దివ. 36

పగవాడు బ్రదుకుపై ఆశలేనివా డని యెరిగిన వెంటనే శత్రువు ఇంట నున్న పాము వంటి ఆ పగవానివలన భయపడుచుండును.

తం విదిత్వా పరాక్రాన్తం వశే న కురుతే యది,
నిర్వాదై ర్నిర్వదే దేన మన్తత స్తద్భవిష్యతి. 37

ఆ శత్రువు పరాక్రమవంతుడని తెలిసికొని, శక్తిచాలక లొంగదీసికొనలేక పోయినచో మంచి మాటలతో వానిని విజృంభింపకుండ చేయవలయును. ఆ విధముగా చివరకు అతనిని లొంగదీసికొనవచ్చును.

నిర్వాదా దాస్పదం లబ్ధ్వా ధనవృద్ధి ర్భవిష్యతి,
ధనవన్తం హి మిత్రాణి భజన్తే చాశ్రయన్తి చ. 38

---

వాడని యర్థము చెప్పుకొనదగును. Monier Williams నిఘంటువు దీనిని 'కల్యోత్థాయియీ' అను దాని ముద్రణదోషముగా చెప్పుచున్నది. కల్యోత్థాయియీ అనగా వేకువజామున నిద్రలేచువాడని యర్థము. ఆ పక్షమున తగినంత ముందుగా కార్యముల పట్ల జాగరూకుడై యుండువా డను నర్థము సంభావ్యము.

36. త్యక్తజీవితమ్ - యుద్ధమున జీవితముపై ఆశలేని వానిని, ప్రాణముల కైన తెగించి పోరువానిని - అని భావము. వేశ్మగతాత్ - ఇంటిలో నున్న; సర్పాదివ-పాము వలన వలె; అస్మాత్ - వీనివలన; ఉద్విజతే - భయపడును.

37. పరాక్రాన్తమ్ - పరాక్రమము కలవానిని: వశే న కురుతే యది - శక్తి చాలక తన అజ్ఞలో నిలుపుకొన లేకున్నచో; నిర్వాదైః - మంచి మాటలతో, నిర్వదేత్ - చివరి స్థితికి కొనిపోవలయును; అన్తతః - చివరకు; తత్ - శత్రువు లొంగుట; భవిష్యతి - సిద్ధించును.

38. నిర్వాదాత్-మంచిమాటలతో, లేక సామదానములతో; ఆస్పదం కృత్వా-స్థానము సంపాదించినచో - అని అర్థము; శత్రువువలన ఉపద్రవము పొందనివానికి ధనము పెంచుకొనుటకు వీలగునని తాత్పర్యము.

ఇట్లు మంచి మాటలతో తగిన స్థానము సంపాదించుకొన్నచో ధనము పెంపొందును. ధనవంతుని కడకు మిత్రులు చేరుదురు. అంటిపెట్టుకొని యుందురు.

స్ఖలితార్థం పున స్తాని స న్త్యజన్తి చ బాన్ధవాః,
అప్యస్మి న్నాశ్వస న్తే చ జుగుప్స న్తే చ తాదృశమ్. 39

ధనము కోలుపడినవాని నన్ననో మిత్రులు, చుట్టములును వదలి వేయుదురు. అంతేగాదు; వానిని నమ్మరు. మరియు అట్టివానిని అసహ్యించుకొందురు.

శత్రుం కృత్వా యః సహాయం విశ్వాస ముపగచ్ఛతి,
అతః సంభావ్య మేవైత ద్యద్రాజ్యం ప్రాప్నుయాదితి. 40

ఎవడు గాని శత్రువును తోడుగా గొని వానిపై నమ్మక ముంచినచో, ఆహా! రాజ్యము దక్కుననుట భావింపదగినదే కదా!

ఇతి మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదులాపుత్రానుశాసనే పఞ్చత్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున విదుల కొడుకును మందలించుట యను నూటముప్పదియైదవ అధ్యాయము.

—:o:—

---

39. స్ఖలితార్థమ్ - ధనము కోల్పోయినవానిని; న ఆశ్వస న్తే - నమ్మరు.
40. సంభావ్యమేవ, ఏతత్ - ఇది ఊహింపదగినదే కదా! ఇది వెక్కిరింత మాట - సంభావింపరాదని తాత్పర్యము.

# షట్త్రింశదధికశతతమోఽధ్యాయః
# నూటముప్పదియారవ అధ్యాయము

**విదులాయా ఉపదేశేన తస్యాః పుత్రస్య పునర్యుద్ధాయోద్యమః.**
**విదుల బోధ విని ఆమె కొడుకు మరల యుద్ధమునకు సిద్ధపడుట.**

మాతోవాచ - తల్లి యిట్లు చెప్పెను.

నైవ రాజ్ఞా దరః కార్యో జాతు కస్యాఞ్చి దాపది,
అథ చేదపి దీర్ణః స్యా న్నైవ వర్తేత దీర్ణవత్. 1

రాజైనవాడు ఎన్నటికిని ఎట్టి ఆపదయందును భయపడరాదు. ఒకవేళ భయపడినను భయపడినవానివలె ప్రవర్తింపరాదు.

దీర్ణం హి దృష్ట్వా రాజానం సర్వమే వానుదీర్యతే,
రాష్ట్రం బల మమాత్యాశ్చ పృథక్కుర్వన్తి తే మతీః. 2

భయపడిన రాజును గాంచి రాష్ట్రము, సేన అంతయు నీరుగారిపోవును. మంత్రులు కూడ బుద్ధి మార్చుకొందురు.

శత్రూనేకే ప్రపద్యన్తే ప్రజహత్యపరే పునః,
అన్యే తు ప్రజిహీర్షన్తి యే పురస్తా ద్విమానితాః. 3

కొందరు శత్రువుల కడకు చేరుకొందురు. మరి కొందరు తన్ను వదలి పోవుదురు. మునుపు తనవలన అవమానము పొందిన మరికొందరు దెబ్బ కొట్ట జూతురు.

---

1. దరః - భయము; జాతు - ఎన్నడును; దీర్ణః - భయపడినవాడు.
2. మతీః - బుద్ధులను - మహీమ్ అనియు పాఠము. అప్పుడు భూమిపై జనులను, పృథక్ కుర్వన్తి - తనకు విరోధులనుగా చేయుదురని భావము.
3. ప్రజిహీర్షన్తి - ప్రహరింపగోరుదురు - దెబ్బతీయుటకు యత్నింతురని భావము.

య ఏవాత్య న్తసుహృద స్త ఏనం పర్యుపాసతే.

మిక్కిలి చెలిమి కలవారు మాత్రము అట్టివానిని కొలిచియుందురు.

అశక్తయః స్వస్తికామా బద్ధవత్సా ఇలా ఇవ, 4

శోచన్త మనుశోచన్తి పతితానివ బాన్ధవాన్.

శక్తి ఉడిగినవారు, సుఖమైన బ్రదుకు కోరువారు కట్టివేయబడిన దూడలను చూచి దుఃఖించు ఆవులవలె, చెడిన బంధువులనుగూర్చి ఏడ్చునట్లు, ఏడ్చువాని వెంటబడి ఏడ్చుచుందురు.

అపి తే పూజితాః పూర్వ మపి తే సుహృదో మతాః, 5

యే రాష్ట్ర మభిమన్య న్తే రాజ్ఞో వ్యసన మీయుషః.

ఆపద పొందిన రాజు రాజ్యము తమదే అని భావించువారు, మునుపు నీ మన్నన నందినవారు, నీ కిష్టులైన వారు నగు చెలికాండ్రు నీకును గలరు గదా!

మా దీదర స్త్వం సుహృదో మా త్వాం దీర్ణం ప్రహాసిషుః. 6

నీవు బెంబేలు పడకుము. నీ చెలికాండ్రు భయపడిన నిన్ను వదలి పోరాదు.

ప్రభావం పౌరుషం బుద్ధిం జిజ్ఞాసన్త్యా మయా తవ,

విదధత్యా సమాశ్వాస ముక్తం తేజోవివృద్ధయే. 7

నీ మహిమ యెట్టిదో, నీ విజృంభణ యెట్టిదో, నీ బుద్ధి యెట్టిదో యెరుగగోరిన నేను, నీకు ధైర్యము కూర్పగోరిన నేను నీ పౌరుషమును రెచ్చగొట్టుటకై యిట్లు పలికితిని.

---

4. ఇలాః - ఆవులు. 'ఇలా ధేనుః సహవత్సా న ఆగాత్' అను మంత్రము వలన ఈ అర్థమును గ్రహింపనగును.

5. తే - నీకును, సుహృదః - మిత్రులు కలరు.

6. యే, రాష్ట్ర మభిమన్య న్తే - ఈ రాష్ట్రము మనది, దీనిని మనము రక్షించుకొనవలయును. రాజును కాపాడుకొనవలయును అని యెవరు భావింతురో - అట్టి మిత్రులు నీకు కలరని భావము. మా దీదరః - బెంబేలు పడకుము.

7. సమాశ్వాసమ్ - ధైర్యమును; విదధత్యా - కూర్చుచున్న.

యదేతత్ సంవిజానాసి యది సమ్య గ్గ్రహీష్యహమ్,
కృత్వాఽసౌమ్య మివాత్మానం జయా యోత్తిష్ఠ సంజయ. 8

సంజయా! నేను నీకు చక్కగా బోధించుచున్నదానిని నీవు బాగుగా తెలిసికొన్నచో హృదయమును గట్టి చేసికొని జయమునకై లెమ్ము.

అస్తి నః కోశనిచయో మహాన్ హ్యవిదిత స్తవ,
తమహం వేద నాన్య స్త ముపసంపాదయామి తే. 9

మనకు, నీకు తెలియని గొప్ప ధనరాశి కలదు. అది నాకు మాత్రమే తెలియును. మఱి యెవ్వడు నెరుగడు. దానిని నీకు చేర్తును.

సన్తి నైకతమా భూయః సుహృద స్తవ సఞ్జయ,
సుఖదుఃఖసహా వీర సజ్గ్రామా దనివ ర్తినః. 10

వీరుడా! సంజయా! నీకు పెద్దలెక్కలో చెలికాండ్రును గలరు. వారు సుఖమును, దుఃఖమును సహింపగలవారు. యుద్ధమున వెన్ను చూపరు.

తాదృశా హి సహాయా వై పురుషస్య బుభూషతః,
ఇష్టం జిహీర్షతః కిఞ్చి త్సచివాః శత్రుకర్శన. 11

శత్రుసంహారకా! మేలు పొందగోరు పురుషునకు అట్టి సహాయులు మంత్రులు ఏ కొంచెము పాటి యిష్టమునుగూడ సాధింపగోరుదురు.

యస్యా స్త్వీదృశకం వాక్యం శ్రుత్వాఽపి స్వల్పచేతసః,
తమ స్త్వపాగమత్ తస్య సుచిత్రార్థపదాక్షరమ్. 12

మిక్కిలి చిత్రములైన అర్థములు, పదములు, అక్షరములు గల ఆమె పలికిన యిట్టి వాక్యమును విన్న అల్పబుద్ధికిని చీకటి తొలగిపోయెను.

---

8. అసౌమ్యమ్ ఇవ - ఏ కొంచెము దయ జాలి లేని దన్నట్లుగా; ఆత్మానమ్ - మనస్సును; కృత్వా - చేసికొని

10. సుఖదుఃఖసహాః - సుఖమున పొంగిపోనివారు, దుఃఖమున క్రుంగి పోనివారు - అని భావము.

11. జిహీర్షతః - సంపాదింపగోరుదురు.

12. స్వల్పచేతసః - గుండెనిబ్బరము లేనివానికిని; తమః - చీకటి, భయము, అపాగమత్ - తొలగిపోయెను.

పుత్ర ఉవాచ - పుత్రు డిట్లనెను.

ఉదకే భూ రియం ధార్యా మర్తవ్యం ప్రవణే మయా,
యస్య మే భవతీ నేత్రీ భవిష్యద్భూతిదర్శినీ. 13

నా భవిష్యత్సంపదను చూపి నన్ను చక్కదిద్దితివి. అమ్మా ! మునిగి పోయిన ఈ భూమిని నేను ఉద్ధరింపవలయును; లేదా యుద్ధ మను పెనులోయలో పడి చావవలయును.

అహం హి వచనం త్వత్తః శుశ్రూషు రపరాపరమ్,
కిఞ్చిత్ కిఞ్చిత్ ప్రతివదం స్తూష్ణీ మాసం ముహుర్ముహుః. 14

అమ్మా! నీనుండి ఒక దానిని మించిన మరియొక మాటను వినగోరిన వాడనై మాటి మాటికి కొంచెము కొంచెము ఎదురు మాట పలుకుచు ఊరకుంటిని.

అతృప్య న్నమృతస్యేవ కృచ్ఛ్రాల్లబ్ధస్య బాన్ధవాత్,
ఉద్యచ్ఛా మ్యేష శత్రూణాం నియమార్థం జయాయ చ. 15

నా చుట్టమవైన నీనుండి ఎంతో కష్టపడి సాధించిన యీ అమృతము వంటి మాటతో నాకు తృప్తి తీరకున్నది. ఇదిగో శత్రువులను లొంగదీసికొనుటకు జయము సాధించుటకును బయలుదేరుచున్నాను.

కున్త్యువాచ - కుంతి యిట్లు పలికెను.

సదశ్వ ఇవ స క్షిప్తః ప్రణున్నో వాక్యసాయకైః,
తచ్చకార తథా సర్వం యథావదనుశాసనమ్. 16

---

13. ఉదకే - నీటియందు మునిగిపోవుచున్న; ఇయం, భూః - ఈ భూమి, ధార్యా - పట్టి నిలుపదగినది - నేను దీని నుద్ధరింపవలయునని భావము; మయా-నాచేత; ప్రవణే- యుద్ధ మనెడు పెద్దలోయలో పడి; మర్తవ్యమ్- చావదగును; నేత్రీ - చక్కదిద్దునది.

14. అపరాపరమ్ - పై పై మాటను; ఒకదానికంటె మిన్నయైన మరియొక మాటను అని భావము; శుశ్రూషుః - వినగోరినవాడనై; ప్రతివదన్ - ఎదురు చెప్పుచు.

15. బాన్ధవాత్ - బంధువువలన; ఉద్యచ్ఛామి -గట్టి ప్రయత్నము చేయుదును. నియమార్థమ్ - లొంగదీసికొనుటకు; బాన్ధవాన్ అని యొక పాఠము - ఆపక్షమున బాంధవులను - ఉద్యచ్ఛామి - ఉద్ధరింతును అని అర్థము.

ఆ పలుకులనెడు ములుకులు బాగుగా నాటగా మిక్కిలి నొచ్చుకొన్న అతడు జాతిగుఱ్ఱమువలె విజృంభించి తల్లి చెప్పినట్లంతయు చేసెను.

ఇద ముద్ధర్షణం భీమం తేజోవర్ధన ముత్తమమ్,
రాజానం శ్రావయే న్మన్త్రి సీదన్తం శత్రుపీడితమ్. 17

ఉత్సాహము కలిగించునదియు, భయంకరమైనదియు, పౌరుషమును రెచ్చగొట్టునదియు, ఉత్తమమైనదియు అగు నీ చరితమును మంత్రివైన కృష్ణా! శత్రువుల పీడనొంది నీరుగారిపోవుచున్న ధర్మరాజునకు వినిపింపుము.

జయో నామేతిహాసోఽయం శ్రోతవ్యో విజిగీషుణా,
మహీం విజయతే క్షిప్రం శ్రుత్వా శత్రూంశ్చ మర్దతి. 18

జయ మను పేరుగల యీ యితిహాసమును జయము కాంక్షించువాడు వినవలయును. అట్లు విన్నవాడు త్వరలోనే భూమిని గెలుచును. శత్రువులను మర్దించును.

ఇదం పుంసవనం చైవ వీరాజనన మేవ చ,
అభీక్ష్ణం గర్భిణీ శ్రుత్వా ధ్రువం వీరం ప్రజాయతే. 19

ఇది కొడుకును ప్రసాదించును. వీరుల పుట్టుకకు కారణమగును. గర్భవతి పలుమారులు విని వీరుడగు కొడుకును ప్రసవించును. నిక్కము.

విద్యాశూరం తపఃశూరం దానశూరం తపస్వినమ్,
బ్రాహ్మ్యా శ్రియా దీవ్యమానం సాధువాదే చ సంమతమ్. 20

---

17. రాజానం, శ్రావయేత్, మన్త్రి- సందర్భమునుబట్టి ధర్మరాజునకు కృష్ణుడు వినిపింపవలయునను నర్థమును గ్రహించితిమి. కేవలముగా మంత్రి రాజునకు వినిపింపవలయునను నర్థమునైనను స్వీకరింపవచ్చును.

19. పుంసవనమ్ - పురుషసంతానము కలుగజేయునది; వీర + ఆజననమ్ వీరులైన పుత్రుల పుట్టుకకు కారణమైనది.

20. తపఃశూరం - తప స్సనగా గాఢభావన, ప్రకృతిరహస్యములను, వైదిక జ్ఞానమును కనిపెట్టుటవంటిది; దానియందు శూరుని, తపస్వినమ్ - తపస్సునందు నిష్ఠకలవానిని.

విద్యలో, బుద్ధికుశలతలో, దానములో శూరుడైనవానిని, తపస్సున నిష్ఠ గలవానిని, బ్రహ్మతేజస్సుతో వెలుగొందువానిని, సజ్జనుల ప్రసంగమునకు యోగ్యుడైనవానిని క్షత్రియవనిత కనును.

అర్చిష్మన్తం బలోపేతం మహాభాగం మహారథమ్,
ధృతిమన్త మనాధృష్యం జేతార మపరాజితమ్. 21

అగ్నివలె తేజస్సుగలవానిని, గొప్పబలశాలిని, మహానుభావుని, మహారథుని, ధైర్యము గలవానిని, ఎవరికి లొంగనివానిని, జయశాలిని, ఓటమి యెరుగనివానిని క్షత్రియవనిత పుత్రునిగా బడయును.

నియన్తార మసాధూనాం గోప్తారం ధర్మచారిణామ్,
ఈదృశం క్షత్రియా సూతే వీరం సత్యపరాక్రమమ్. 22

దుష్టుల నణగద్రొక్కువానిని, ధర్మముగా నడుచుకొనువారిని, రక్షించువానిని, సత్యమునందు నిష్ఠకలవానిని, మరియు నిట్టి గుణములు గల వీరుని క్షత్రియవనిత కుమారునిగా పొందును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
విదులాపుత్రానుశాసనసమాప్తౌ షట్త్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున విదుల
పుత్రునికి చేసిన ఉపదేశము ముగింపుగల నూటముప్పదియారవ
అధ్యాయము.

—: o :—

20. 21, 22 - ఈమూడును కథకు ఫలశ్రుతిశ్లోకములు. ఈ కథ విన్న గర్భవతియగు స్త్రీ సర్వోత్తమగుణములుగల పుత్రుని పొందునని ఫలశ్రుతి.

# సప్తత్రింశదధికశతతమోఽధ్యాయః
# నూటముప్పదియేడవ అధ్యాయము

కున్త్యాః పాణ్డవాన్ ప్రతి సందేశః, తతోఽనుజ్ఞామాదాయ
శ్రీకృష్ణస్యోపప్లవ్యనగరే గమనమ్.

కుంతి పాండవులకు సందేశ మొసగుట, పిమ్మట అనుజ్ఞగొని
శ్రీకృష్ణుడు ఉపప్లవ్యనగరమున కరుగుట.

కున్త్యువాచ - కుంతి యిట్లు పలికెను.

అర్జునం కేశవ బ్రూయా స్త్వయి జాతే స్మ సూతకే,
ఉపోపవిష్టా నారీభి రాశ్రమే పరివారితా. 1

కేశవా! అర్జునునితో ఇట్లాడుము. నీవు పుట్టినపుడు పురిటివేళ ఆశ్రమమున స్త్రీలందరు నాకవచేరి చుట్టియుండగా కూర్చుండితిని.

అథా న్తరిక్షే వాగాసీ ద్దివ్యరూపా మనోరమా,
సహస్రాక్షసమః కున్తి భవిష్య త్యేష తే సుతః. 2

అప్పు డాకసము నుండి హృదయము నలరించు దివ్యమైన వాణి వెలువడెను. కుంతీ! ఈ నీ కుమారుడు దేవేంద్రునితో సమాను డగును.

ఏష జేష్యతి సంగ్రామే కురూన్ సర్వాన్ సమాగతాన్,
భీమసేనద్వితీయశ్చ లోక ముద్వ ర్తయిష్యతి. 3

ఈతడు ఎదురు వచ్చిన కౌరవుల నందరిని యుద్ధమున భీమసేనుని సాయముతో గెలుచును. శత్రువులను చీల్చి చెండాడును.

పుత్రస్తే పృథివీం జేతా యశశ్చాస్య దివం స్పృశేత్,
హత్వా కురూంశ్చ సంగ్రామే వాసుదేవసహాయవాన్. 4

---

3 లోకమ్ - శత్రుజనమును; ఉద్వర్తయిష్యతి - చిందరవందరచేయును.

వాసుదేవుడు తోడుకాగా యుద్ధమున కౌరవుల నందరిని రూపుమాపి భూమిని చేజిక్కించుకొనును. వీని కీర్తి స్వర్గమును తాకును.

పిత్ర్య మంశం ప్రణష్టం చ పునరప్యుద్ధరిష్యతి,
భ్రాతృభిః సహితః శ్రీమాం స్త్రీన్ మేధా నాహరిష్యతి. 5

తండ్రిదైన రాజ్యభాగము జారిపోగా మరల దానిని సాధించును. సోదరులతో గూడి మూడు మహాయజ్ఞముల నిర్వహించును.

స సత్యసన్ధో బీభత్సుః సవ్యసాచీ యథాఉచ్యత,
తథా త్వమేవ జానాసి బలవన్తం దురాసదమ్. 6

అచ్యుతా! సత్యమునందు నిష్ఠకలవాడు, శత్రువులకు అడలు పుట్టించువాడు, ఎడమచేతితో కూడ బాణములను గుప్పించువాడు నగు అర్జునుడు ఎంత బలవంతుడో, ఎంతగా శత్రువులకు అక్రమింపరానివాడో నీవే యెరుగుదువు.

తథా తదస్తు దాశార్హ యథా వాగభ్యభాషత,
ధర్మశ్చేదస్తి వార్ష్ణేయ తథా సత్యం భవిష్యతి. 7

కృష్ణా! ధర్మమని యొకటి యున్నచో ఆనాటి ఆవాక్కు పలికిన రీతిగా అది యట్లే సత్యమగుగాక!

త్వం చాపి తత్తథా కృష్ణ సర్వం సంపాదయిష్యసి,
నాహం తదభ్యసూయామి యథా వాగభ్యభాషత. 8

కృష్ణా! ఆమాట నిజమగునట్లు నీవే చేయగలవు. నేను దానిని తప్పు పట్టను.

నమో ధర్మాయ మహతే ధర్మో ధారయతి ప్రజాః,
ఏత ద్ధనంజయో వాచ్యో నిత్యోద్యుక్తో వృకోదరః. 9

గొప్పది యగు ధర్మమునకు నమస్కారము. ధర్మమే ప్రజలను పట్టి నిలుపును. ధనంజయునకు, ఎల్లవేళల ప్రయత్నములో నుండు భీమునకు ఈ విషయము చెప్పుము.

---

5. మేధాన్ - అశ్వమేధయాగములను
6. బీభత్సుః - మంగళకార్యము లాచరించువా డనియు నర్థము.
8. న, అభ్యసూయామి - బాధపడను, శంకింపను.

యదర్థం క్షత్రియా సూతే తస్య కాలో౽యమాగతః,
న హి వైరం సమాసాద్య సీదన్తి పురుషర్షభాః. 10

క్షత్రియ వనిత, ఏ ప్రయోజనమునకై సంతానము కనునో దానిని సాధించు కాలమిదిగో వచ్చినది. ఉత్తమ పురుషులు పగగాని జారిపోవరు.

విదితా తే సదా బుద్ధి ర్భీమస్య న స శామ్యతి,
యావదన్తం న కురుతే శత్రూణాం శత్రుకర్శన. 11

శత్రుసంహారకా! కృష్ణా! నీ కా భీముని బుద్ధి ఎల్లవేళల తెలిసినదే. వాడు శత్రువులను సాంతముగా రూపుమాపక శాంతింపడు.

సర్వధర్మవిశేషజ్ఞాం స్నుషాం పాణ్డో ర్మహాత్మనః,
బ్రూయా మాధవ కల్యాణీం కృష్ణ కృష్ణాం యశస్వినీమ్. 12

కృష్ణా! మాధవా! ధర్మము లన్నింటి సూక్ష్మము లెరిగినది, మహాత్ముడగు పాండుమహారాజు కోడలు, కల్యాణి, కీర్తి కెక్కినదియగు ద్రౌపదితో నిట్లు పలుకుము.

యుక్త మేత న్మహాభాగే కులే జాతే యశస్విని,
యన్మే పుత్రేషు సర్వేషు యథావత్ త్వమవర్తిథాః. 13

చక్కని కులమున పుట్టి ప్రసిద్ధి కెక్కిన మహానుభావురాలా! నా కొడుకుల యందు నీవు ధర్మము తప్పక ప్రవర్తించితివి. అది బాగుగా నున్నది.

మాద్రీపుత్రౌ చ వక్తవ్యౌ క్షత్రధర్మరతౌ పుభౌ,
విక్రమే ణార్జితాన్ భోగాన్ వృణీతం జీవితాదపి. 14

ఏదో బ్రదుకుట కాదు పరాక్రమముతో సంపాదించిన భోగములను కోరు కొనుడని క్షత్రియధర్మమున ఆసక్తికల మాద్రికొడుకులకు చెప్పుము.

విక్రమాధిగతా హ్యర్థాః క్షత్రధర్మేణ జీవతః,
మనో మనుష్యస్య సదా ప్రీణన్తి పురుషోత్తమ. 15

పురుషోత్తమా! క్షత్రియధర్మముతో బ్రదుకువాడు పరాక్రమముతో సాధించిన అర్థములు వాని హృదయమున నెల్లవేళల ఆనందమును కూర్చును.

యచ్చ వః ప్రేక్షమాణానాం సర్వధర్మోపచాయినామ్,
పాఞ్చాలీ పరుషాణ్యుక్తా కో ను తత్ క్షన్తుమర్హతి. 16

ధర్మము లన్నింటిని చక్కగా పెంపొందించు మీరు చూచుచుండగా పాంచాలినిగూర్చి కారుకూతలు కూసిరి. దాని నెవ్వడైన క్షమించునా?

న రాజ్యహరణం దుఃఖం ద్యూతే చాపి పరాజయః,
ప్రవ్రాజనం సుతానాం వా న మే తద్దుఃఖకారణమ్. 17

రాజ్యమును గుంజుకొనిరి. దానికై అంతగా ఏడువను. మీరు జూదమున ఓడిపోయిరి. దానికొరకును పెద్దగా బాధపడను. కొడుకులు దేశము వదలిపోయిరి. అదికూడ పెద్దగా దుఃఖమునకు కారణము కాదు.

యత్ర సా బృహతీ శ్యామా సభాయాం రుదతీ తదా,
అశ్రౌషీత్ పరుషా వాచ స్తన్మే దుఃఖతరం మహత్. 18

కాని నడివయసున నున్న ఈ దొడ్డయిల్లాలు నిండుసభలో ఏడ్చుచు కారుకూతలు వినెను. అది నాగుండెను కోసివేయు దుఃఖము.

స్త్రీధర్మిణీ వరారోహా క్షత్రధర్మరతా సదా,
నాధ్యగచ్ఛ త్తదా నాథం కృష్ణా నాథవతీ సతీ. 19

స్త్రీధర్మములను నిష్ఠతో పాటించు ఈ అందాలబరిణె ఎల్లవేళల క్షత్రియ ధర్మమును కాపాడుటలో ప్రీతికలది. అట్టి ఆమె మగలుండియు ఆ సమయమున దిక్కుమాలిన దాయెను.

తం వై బ్రూహి మహాబాహో సర్వశస్త్రభృతాం వరమ్,
అర్జునం పురుషవ్యాఘ్రం ద్రౌపద్యాః పదవీం చర. 20

ఓయి మహాబాహూ ! శస్త్రము లన్నియు పట్టిన మగధీరుడు అర్జునునితో ద్రౌపది దారిలో నడువుమని చెప్పుము.

విదితం హి తవాత్యన్తం క్రుద్ధావివ యమాంతకౌ,
భీమార్జునౌ నయేతాం హి దేవానపి పరాం గతిమ్. 21

---

16. సర్వ ధర్మ-ఉపచాయినామ్ - ధర్మము లన్నింటిని చక్కగా పెంపొందించు శీలము గలవారి;

18. బృహతీ - దొడ్డయిల్లాలు; శ్యామా - నడివయస్సు వనిత.

20. పదవీం చర - మార్గము ననుసరింపుము. ఆమె మాట విని శత్రుసంహారము చేయుమని తాత్పర్యము.

నీ వెరుగుదువు. కోపించిన యముడు, మృత్యువువంటి భీమార్జునులు దేవతలను కూడ చంపివేయగలరు.

తయోశ్చైత దవజ్ఞానం యత్సా కృష్ణా సభాగతా,
దుఃశాసనశ్చ యద్భీమం కటుకా న్యభ్యభాషత. 22

ద్రౌపది యిట్లు సభలోనికి వచ్చిన దనగా వారిరువురకు ఇది అవమానము కాదా ? అంతేకాదు. ఆ దుశ్శాసనుడు భీముని నూటిపోటు మాటలనెను.

పశ్యతాం కురువీరాణాం తచ్చ సంస్మారయేః పునః,
పాణ్డవాన్ కుశలం పృచ్ఛేః సపుత్రాన్ కృష్ణయా సహ. 23

కురువీరు లందరు చూచుచుండగా జరిగిన ఈ ఘోరము లన్నింటిని వారికి గుర్తుచేయుము. ఆ మహారాజు పాండుభూపతి కొడుకులను, వారి కొడుకులను ద్రౌపదిని నా మాటగా కుశల మడుగుము.

మాం చ కుశలినీం బ్రూయా స్తేషు భూయో జనార్దన,
అరిష్టం గచ్ఛ పన్థానం పుత్రాన్ మే ప్రతిపాలయ. 24

కృష్ణయ్యా ! నేను కుశలముగా నున్నానని వారికి మరల మరల చెప్పుము. శుభమగు మార్గమున పొమ్ము. నా కొడుకులను కాపాడుము.

అభివాద్యాథ తాం కృష్ణః కృత్వా చాపి ప్రదక్షిణమ్,
నిశ్చక్రామ మహాబాహుః సింహఖేలగతి స్తతః. 25

పిదప కృష్ణుడు ఆమెకు మ్రొక్కి ప్రదక్షిణము చేసి సింహము విలాసముగా నడచు తీరున నడచుచు బయలు వెడలెను.

తతో విసర్జయామాస భీష్మాదీన్ కురుపుఙ్గవాన్,
ఆరోప్యాథ రథే కర్ణం ప్రాయాత్ సాత్యకినా సహ. 26

పిదప కురువంశమున పెద్దలగు భీష్ముడు మొదలగు వారిని వదలి, కర్ణుని రథ మెక్కించుకొని సాత్యకితోపాటు బయలుదేరెను.

తతః ప్రయాతే దాశార్హే కురవః సంగతా మిథః,
జజల్పు ర్మహదాశ్చర్యం కేశవే పరమాద్భుతమ్. 27

అట్లు కృష్ణుడు బయలుదేరిన పిదప కురువంశమువారు తమలో తాము గుమికూడి కృష్ణునికి సంబంధించిన పరమాశ్చర్యమును అద్భుతముగా చెప్పుకొన జొచ్చిరి.

ప్రమూఢా పృథివీ సర్వా మృత్యుపాశవశీకృతా,
దుర్యోధనస్య బాలిశ్యా న్నైతదస్తీతి చాబ్రువన్. 28

ఈ దుర్యోధనుని పిల్లతనమువలన భూమి యంతయు మృత్యువు పాశమునకు చిక్కి చేష్టలు దక్కి యున్నది. ఇక ఇది లేనేలేదని పలికిరి.

తతో నిర్యాయ నగరాత్ ప్రయయౌ పురుషోత్తమః,
మన్త్రయామాస చ తదా కర్ణేన సుచిరం సహ. 29

అంత పురుషోత్తముడు నగరము వెలువడి పయనించెను. కర్ణునితో చాలసేపు మంతనము లాడెను.

విసర్జయిత్వా రాధేయం సర్వయాదవనన్దనః,
తతో జవేన మహతా తూర్ణ మశ్వా నచోదయత్. 30

రాధేయుని పంపించి యాదవు లందరకు ఆనంద మందించు కృష్ణుడు మహావేగముతో గుఱ్ఱములను తోలించెను.

తే పిబన్త ఇవాకాశం దారుకేణ ప్రచోదితాః,
హయా జగ్ము ర్మహావేగా మనోమారుతరంహసః. 31

దారుకుడు తోలుచున్న, మిక్కిలి వడిగల ఆ గుఱ్ఱములు మహావేగముతో వాయువేగముతో నింగిని మ్రింగుచున్నవా యన్నట్లు పోవసాగినవి.

తే వ్యతీత్య మహాధ్వానం క్షిప్రం శ్యేనా ఇవాశుగాః,
ఉచ్చై ర్జగ్ము రుపప్లవ్యం శార్‌ఙ్గధన్వాన మావహన్. 32

అతిశీఘ్రముగా పోవు డేగలో యన్నట్లు ఆ గుఱ్ఱములు కృష్ణుని కైకొని ఎంతో దారిని కడచి ఉపప్లవ్యనగరమున కరిగినవి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కున్తీవాక్యే సప్తత్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కుంతివాక్యముగల నూటముప్పదియేడవ అధ్యాయము.

—: o :—

29. నిర్యాయ - వెలువడి.

31. మనోమారుతరంహసః - మనస్సుయొక్కయు, వాయువుయొక్కయు వేగమువంటి వేగము గలవి.

## అష్టత్రింశదధికశతతమోఽధ్యాయః
## నూటముప్పదియెనిమిదవ అధ్యాయము

### భీష్మద్రోణాభ్యాం దుర్యోధనస్య ప్రబోధనమ్.
### భీష్మద్రోణులు దుర్యోధనునకు బోధ చేయుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

కున్త్యాస్తు వచనం శ్రుత్వా భీష్మద్రోణౌ మహారథౌ,
దుర్యోధన మిదం వాక్య మూచతుః శాసనాతిగమ్. 1

మహారథులగు భీష్మద్రోణులు కుంతిమాట విని, మాట వినని దుర్యోధనునితో నిట్లు పలికిరి.

శ్రుతం తే పురుషవ్యాఘ్ర కున్త్యాః కృష్ణస్య సన్నిధౌ,
వాక్య మర్థవదత్యుగ్ర ముక్తం ధర్మ్య మనుత్తమమ్. 2

ఓయి మహావీరుడా! కృష్ణుని యెదుట ఆ కుంతి ప్రయోజనముగల, ధర్మము తప్పని దొడ్డమాట ఎంత భయంకరముగా పలికినదో వింటివి గదా!

తత్ కరిష్యన్తి కౌన్తేయా వాసుదేవస్య సంమతమ్,
న హి తే జాతు శామ్యేరన్నృతే రాజ్యేన కౌరవ. 3

కురురాజా! ఆ కుంతి కొడుకులు వాసుదేవున కిష్టమైన ఆ పనిని తప్పక చేయుదురు. నీవు రాజ్య మీయకున్నచో ఎన్నటికిని వారు అణగియుండరు.

క్లేశితా హి త్వయా పార్థా ధర్మపాశసితా స్తదా,
సభాయాం ద్రౌపదీ చైవ తైశ్చ తన్మర్షితం తవ. 4

నీవు ధర్మపాశమునకు కట్టుపడిన పృథకొడుకులను పెట్టరాని పాట్లు పెట్టితివి నిండుసభలో ద్రౌపదిని కష్టపరచితివి. వారు దానిని సైచిరి.

కృతాస్త్రం హ్యర్జునం ప్రాప్య భీమం చ కృతనిశ్చయమ్,
గాణ్డీవం చేషుధీ చైవ రథం చ ధ్వజమేవ చ. 5
నకులం సహదేవం చ బలవీర్యసమన్వితౌ,
సహాయం వాసుదేవం చ న క్షంస్యతి యుధిష్ఠిరః. 6

అర్జునుడు అస్త్రవిద్యలో ఆరితేరినవాడు. భీముడు పట్టిన పట్టు వదలని వాడు. గాండీవము, పట్టిపోని అంపపొదులు, దివ్యమగు రథము, అట్టిదే ధ్వజము ఆ అర్జునునకు గలవు. నకులసహదేవులు బలముతో ఉత్సాహముతో కాచుకొని యున్నారు. ఇక తోడన్ననో వాసుదేవుడు. ఇట్టి సంపదగల యుధిష్ఠిరుడు నిన్ను క్షమింపడు.

ప్రత్యక్షం తే మహాబాహో యథా పార్థేన ధీమతా,
విరాటనగరే పూర్వం సర్వే స్మ యుధి నిర్జితాః. 7

మహాబాహూ! మునుపు విరాటనగరమున ఆబుద్ధిశాలి యగు అర్జునుడు మనల నందరను యుద్ధమున ఓడగొట్టె నన్నది నీవు కన్నులార చూచినదియే.

దానవా ఘోరకర్మాణో నివాతకవచా యుధి,
రౌద్ర మస్త్రం సమాదాయ దగ్ధా వానరకేతునా. 8

ఘోరములగు పనులు చేయు నివాతకవచులను రాక్షసులను రౌద్రాస్త్రము నుకైకొని అర్జునుడు బూది గావించెను.

కర్ణప్రభృతయ శ్చేమే త్వం చాపి కవచీ రథీ,
మోక్షితో ఘోషయాత్రాయాం పర్యాప్తం తన్నిదర్శనమ్.

ఈ కర్ణుడు మొదలగువారును, గట్టికవచము తొడిగికొని గొప్పరథ మెక్కియున్న నీవును ఘోషయాత్రనాడు వానివలన ముక్తిపొందుట యను దృష్టాంతము చాలును.

ప్రశామ్య భరతశ్రేష్ఠ భ్రాతృభిః సహ పాణ్డవైః,
రక్షేమాం పృథివీం సర్వాం మృత్యోర్దంష్ట్రాన్తరం గతామ్. 9

భరతశ్రేష్ఠా! తోడబుట్టిన పాండవులతో చెలిమి చేయుము. మృత్యువు కోరల నడుమ చిక్కిన యీ యెల్లభూమిని రక్షింపుము.

---

౮. రౌద్రమ్.రుద్రసంబంధమగు అస్త్రము - పాశుపతము.

జ్యేష్ఠో భ్రాతా ధర్మశీలో వత్సలః శ్లక్ష్ణవాక్కవిః,
తం గచ్ఛ పురుషవ్యాఘ్రం వ్యపనీయేహ కిల్బిషమ్. 10

అన్న, ధర్మశీలుడు, నీ యందు పుత్ర ప్రేమ కలవాడు, ప్రియముగా పలుకరించువాడు, మేధావియు అయిన పురుషవరేణ్యుడగు ధర్మరాజును, ఈ పాపమును రూపుమాపి, ఆశ్రయింపుము.

దృష్టశ్చ త్వం పాణ్డవేన వ్యపనీతశరాసనః. 11

ఆ అర్జునుడు నీ చేతివిల్లు ఎగురగొట్టగా అప్పుడు అందరు నిన్ను చూచిరి గదా!

ప్రశాన్తభ్రుకుటిః శ్రీమాన్ కృతా శాన్తిః కులస్య నః,
త మభ్యేత్య సహామాత్యః పరిష్వజ్య నృపాత్మజమ్, 12
అభివాదయ రాజానం యథాపూర్వ మరిన్దమ.

దొడ్డబుద్ధిగల ఆ రాజిప్పుడు బొమముడి చిట్లించుట లేదు. అది మన కులమునకు శాంతిని సమకూర్చినది. నీవు నీ మంత్రులతోకూడి అతని కడకరిగి ఆ రాజకుమారుని కౌగిలించుకొని మునుపటివలె మన్నింపుము.

అభివాదయమానం త్వాం పాణిభ్యాం భీమపూర్వజః, 13
ప్రతిగృహ్ణాతు సౌహార్దాత్ కున్తీపుత్రో యుధిష్ఠిరః.

భీముని అన్న ధర్మరాజు, మ్రొక్కుచున్న నిన్ను నిండు గుండెతో చేతులతో దగ్గరకు తీసికొనుగాక.

సింహస్కన్ధోరుబాహుస్త్వాం వృత్తాయతమహాభుజః,
పరిష్వజతు బాహుభ్యాం భీమః ప్రహరతాం వరః. 14

సింహము మూపువంటి పెద్ద భుజములు, కండలు నిండుదనముతో మెలి దిరిగిన పొడవైనచేతులు గల యుద్ధవీరుడు భీముడు నిన్ను కౌగిలిలో బంధించు గాక!

కమ్బుగ్రీవో గుడాకేశ స్తతస్త్వాం పుష్కరేక్షణః, 15
అభివాదయతాం పార్థః కున్తీపుత్రో ధనఞ్జయః. 16

---

15. గుడాకేశః - గుడాకమనగా ధనుర్విద్య - దానికి ప్రభువు;

పిదప శంఖమువంటి మెడయు, పద్మమువంటి కన్నులు కలవాడు, విలువిద్యలో ఆరితేరినవాడు అగు అర్జునుడు నీకు మ్రొక్కుగాక!

ఆశ్వినేయౌ నరవ్యాఘ్రౌ రూపేణాప్రతిమౌ భువి,
తౌ చ త్వాం గురువత్ ప్రేమ్ణా పూజయా ప్రత్యుదీయతామ్. 17

ఉత్తములు, రూపమున భూమిలో సాటిలేనివారు అగు అశ్వినీదేవతల పుత్రులు నకులసహదేవులును నిన్ను అన్నవలె, తండ్రివలె ప్రేమతో, మన్ననతో ఎదుర్కొందురు గాక!

ముఞ్చన్త్వానన్దజాశ్రూణి దాశార్హప్రముఖా నృపాః,
సంగచ్ఛ భ్రాతృభిః సార్ధం మానం సంత్యజ్య పార్థివ. 18

కృష్ణుడు మొదలగు రాజులందరు ఆనందబాష్పములు వదలుదురుగాక! రాజా! పట్టుదల వదలి ఆ సోదరులతో చెలిమి పొందుము.

ప్రశాధి పృథివీం కృత్స్నాం తత స్త్వం భ్రాతృభిః సహ,
సమాలిఙ్గ్య చ హర్షేణ నృపా యాన్తు పరస్పరమ్. 19

అటుపై నీ సోదరులతో కలిసి భూమినెల్ల యేలుము. వచ్చిన రాజులందరు ఒకరినొకరు ప్రీతితో కౌగలించుకొనుచు తిరిగిపోవుదురు గాక!

అలం యుద్ధేన రాజేన్ద్ర సుహృదాం శృణు వారణమ్,
ధ్రువం వినాశో యుద్ధే హి క్షత్రియాణాం ప్రదృశ్యతే. 20

రాజేంద్రా! యుద్ధము వలదు. నీ మేలుకోరువారు 'వల'దన్న మాటను వినుము. యుద్ధమైనచో క్షత్రియ వంశరపు చావుమూడుట కానవచ్చుచునే యున్నది.

జ్యోతీంషి ప్రతికూలాని దారుణా మృగపక్షిణః,
ఉత్పాతా వివిధా వీర దృశ్యన్తే క్షత్రనాశనాః. 21

---

17. ఆశ్వినేయౌ-అశ్వినీ దేవతల పుత్రులు - నకుల సహదేవులు.
20. వారణమ్-వలదను మాటను.

నక్షత్రములు అనుకూలముగా లేవు. మృగములు, పక్షులు భయమును సూచించుచున్నవి. క్షత్రియుల వినాశమును సూచించు పెక్కువిధములగు పాడు శకునములు తోచుచున్నవి.

విశేషత ఇహాస్మాకం నిమిత్తాని నివేశనే,
ఉల్కాభి ర్హి ప్రదీప్తాభి ర్బాధ్యతే పృతనా తవ. 22

మీదుమిక్కిలిగా మనయింట శకునములు ఎక్కువగా తోచుచున్నవి. నీ సేన మంటలు రేగు ఉల్కలతో బాధ నొందుచున్నది.

వాహనా న్యప్రహృష్టాని రుద న్తీవ విశామ్పతే,
గృధ్రాస్తే పర్యుపాసన్తే సైన్యాని చ సమన్తతః. 23

నీ గుఱ్ఱములు, ఏనుగులు ఏడ్చుచున్నవో అన్నట్లు వ్రేలుమొగములతో కళయు కాంతియు లేక యున్నవి. నీ సేనల కన్నివైపుల గ్రద్దలు చుట్టుముట్టి తిరుగుచున్నవి.

నగరం న యథాపూర్వం తథా రాజనివేశనమ్,
శివా శ్చాశివనిర్ఘోషా దీప్తాం సేవన్తి వై దిశమ్. 24

నీ నగరము, నీ దివాణము మునుపటివలె లేవు. నక్కలు పాడుకూతలు కూయుచు మండుచున్న దిక్కున చేరియున్నవి.

కురు వాక్యం పితుర్మాతు రస్మాకం చ హితైషిణామ్,
త్వయ్యాయత్తో మహాబాహో శమో వ్యాయామ ఏవ చ. 25

నాయనా ! నీ తండ్రియు, తల్లియు, నీ మేలుకోరు మేమును చెప్పెడు మాట పాటింపుము. శమయో శ్రమయో నీ చేతిలో ఉన్నది.

న చేత్ కరిష్యసి వచః సుహృదా మరికర్శన,
తప్స్యసే వాహినీం దృష్ట్వా పార్థబాణప్రపీడితామ్. 26

---

24. దీప్తాం దిశమ్ - దిక్కులు మండుచున్నట్లు కానవచ్చుట ఒక పాడు శకునము.

25. వ్యాయామః - శ్రమ;

నీ మేలుకోరువారి మాటను బట్టి నడచుకొనవేని అర్జునుని బాణములు విరుగగొడిచిన సేనను చూచి కుమిలిపోదువు

భీమస్య చ మహానాదం నదతః శుష్మిణో రణే,
శ్రుత్వా స్మర్తాసి మే వాక్యం గాణ్డీవస్య చ నిఃస్వనమ్,
యద్యేత దపసవ్యం తే వచో మమ భవిష్యతి. 27

నేను ఇప్పుడు చెప్పెడు మాట నీకు విపరీతముగా తోచినచో మహాబలశాలి యగు భీముడు అరచిన అరపును, గాండీవము ఘోషను విని అప్పుడీ మాటను స్మరింతువు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీష్మద్రోణవాక్యే అష్టత్రింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీష్మద్రోణుల వాక్యముగల నూటముప్పదియెనిమిదవ అధ్యాయము.

—:o:—

27. శుష్మిణః - గొప్పబలము గల; అపసవ్యమ్-విపరీతమైనది-తన భావమునకు వ్యతిరేకమైనది; యది నిర్ఘాతసదృశమ్ - అని ఒక పాఠము-అప్పుడు పిడుగుపాటువంటిదైనను - అని అర్థము.

## ఏకోనచత్వారింశదధికశతతమోఽధ్యాయః
## నూటముప్పదితొమ్మిదవ అధ్యాయము.

**భీష్మేణ సహ సంలప్య ద్రోణేన పునః శమాయ దుర్యోధనస్య ప్రబోధనమ్‌-**
**భీష్మునితో నంప్రదించి ద్రోణుడు మరల శాంతికై దుర్యోధనుని మందలించుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవముక్తస్తు విమనా స్తిర్యగ్దృష్టి రధోముఖః,
సంహత్య చ భ్రువోర్మధ్యం న కిఞ్చిద్వ్యాజహార హ. 1

వారిట్లు పలుకగా దుర్యోధనుడు అడ్డముపులు చూచుచు, తల వంచుకొని కనుబొమలు ముడుచుచు ఏమియు పలుకకుండెను.

తం వై విమనసం దృష్ట్వా సంప్రేక్ష్యాన్యోన్య మన్తికాత్‌,
పునరే వోత్తరం వాక్య ముక్తవన్తౌ నరర్షభౌ. 2

అతడు తాము చెప్పినదానికి వెడబుద్ధియై యున్నట్లెరిగి భీష్మద్రోణులు ఒకరినొకరు పరికించుకొని మరల నిట్లు పలికిరి.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

శుశ్రూషు మనసూయం చ బ్రహ్మణ్యం సత్యవాదినమ్‌,
ప్రతియోత్స్యామహే పార్థ మతో దుఃఖతరం ను కిమ్‌. 3

ఆ అర్జునుడు చక్కగా పెద్దలుచెప్పిన మాట వినుచుండును. వారి మంచి మాటలయందు తప్పులు పట్టడు. పరబ్రహ్మతత్త్వము బాగుగా ఎరిగినవాడు. సత్యమునే పలుకును. అట్టివాని నెదుర్కొని పోర నుంకించుచున్నాము. ఇంత కంటె మిక్కిలి దుఃఖ మేముండును.

ద్రోణ ఉవాచ - ద్రోణు డిట్లు చెప్పెను.

అశ్వత్థామ్ని యథా పుత్రే భూయో మమ ధనఞ్జయే,
బహుమానః పరో రాజన్‌ సంనతిశ్చ కపిధ్వజే. 4

రాజా! నా కొడుకు అశ్వత్థామపం దెంత మక్కువయో అర్జునునియందు అట్టి మక్కువ నాకు గలదు. అర్జునునిపైపు మొగ్గును కలదు.

తం చ పుత్రాత్ ప్రియతమం ప్రతియోత్స్యే ధనంజయమ్,
క్షాత్రం ధర్మ మనుష్ఠాయ ధిగస్తు క్షత్రజీవికామ్. 5

పుత్రుని కంటె మిక్కిలి ప్రియతముడైన అర్జునునితో, క్షత్రియధర్మమున నిలబడి, పోరుదును. ఛీ! క్షత్రియవృత్తి ఎంత కష్టమైనది.

యస్య లోకే సమో నాస్తి కశ్చిదన్యో ధనుర్ధరః,
మత్ప్రసాదాత్ స బీభత్సుః శ్రేయా నన్యై ర్ధనుర్ధరైః. 6

ఆ అర్జునునకు మించిన విలుకాడు ప్రపంచమున మరియొకడు లేడు. నా ప్రసాదము వలన ఆ బీభత్సుడు తక్కిన విలుకాండ్ర నందరిని మిగిలిపోయెను.

మిత్రధ్రుగ్ దుష్టభావశ్చ నాస్తికోఽథానృజుః శఠః,
న సత్సు లభతే పూజాం యజ్ఞే మూర్ఖ ఇవాగతః. 7

మిత్రులను వెన్నుపోటు పొడుచువాడు, చెడు తలపులు కలవాడు, పరలోకము లేదనువాడు, వంచనలు చేయువాడు, మొండి అయినవాడు సజ్జనులున్నచోట, యజ్ఞమునకు వచ్చిన మూర్ఖునివలె మన్నన పొందడు.

వార్యమాణోఽపి పాపేభ్యః పాపాత్మా పాప మిచ్ఛతి,
చోద్యమానోఽపి పాపేన శుభాత్మా శుభ మిచ్ఛతి. 8

పాపాత్ముడు, పాపములవైపు పోవలదని హితులు అడ్డుకొనుచున్నను పాపమునే చేయగోరును. పుణ్యాత్ముడు పాపము తన్ను పురికొల్పుచున్నను పుణ్యమునే చేయగోరును.

---

7. మిత్రధ్రుక్-మిత్రులకు ద్రోహము చేయువాడు; నాస్తికః - పరలోకము లేదని నమ్మువాడు; అనృజుః-కుటిలవర్తనము కలవాడు; శఠః-మొండి; పూజాం న లభతే - మన్నన పొందడు - ఓ దుర్యోధనా! నీవలె - అని భావము.

మిథ్యోపచరితా హ్యేతే వర్తమానా హ్యనుప్రియే,
అహితత్వాయ కల్పన్తే దోషా భరతసత్తమ. 9

ఈ పాండవులను నీవు కపటబుద్ధితో కష్టములపాలొనర్చితివి. అయినను వారు నీయందు ప్రేమతోడనే వర్తించుచున్నారు. ఇక నీ దోషములన్ననో విరోధమునకే కారణము లగుచున్నవి.

త్వముక్తః కురువృద్ధేన మయా చ విదురేణ చ,
వాసుదేవేన చ తథా శ్రేయో నైవాభిమన్యసే. 10

నీకు కురువృద్ధుడగు భీష్ముడును, నేనును, విదురుడును. తుదకు సాక్షాత్తు వాసుదేవుడును హితము చెప్పుట జరిగినది. అయినను నీవు హితమును తల కెక్కించుకొన కున్నావు.

అస్తి మే బలమిత్యేవ సహసా త్వం తితీర్షసి,
సగ్రాహనక్రమకరం గఙ్గావేగ మివోష్ణగే. 11

'నాకు బలమున్నదిలే' అని తొందరపాటుతో వర్షాకాలమున పొంగి పొరలుచున్నదియు, మొసళ్ళు తిమింగిలములు గలదియు నగు గంగవంటి దానిని (పాండవుల సేనను) నీవు దాటగోరు చున్నావు.

వాసస్యైవ యథా హి త్వం ప్రావృణ్వానోఽభిమన్యసే,
స్రజం త్యక్త్వా మివ ప్రాప్య లోభా ద్యౌధిష్ఠిరీం శ్రియమ్. 12

---

9. ఏతే - ఈ పాండవులు, మిథ్యోపచరితాః - నీ చేత కపటములు ప్రయోగింప బడినవారు అయ్యును; అను - తరువాత; ప్రియే - ప్రియము నందు; వర్తమానాః - ఉన్నవారు; హి - ఇది ప్రసిద్ధము; దోషాః - నీ ద్వేషము మున్నగు దోషములు; అహితత్వాయ - విరోధమునకే; కల్పన్తే - కారణము లగుచున్నవి

11. ఉష్ణగే - వేసవి కాలము గడచిన పిమ్మట - వర్షాకాలమున నని యర్థము

12. వాససా - వరులు కట్టుకొన్న గుడ్డతో; ప్రావృణ్వానః - దేహమును కప్పుకొనుచు; అభిమన్యసే - ఇది నాదే యని తలచెదయుచున్నావు. వాస ఏవ' అనియు పాఠము - అప్పుడు వరుల వాస 'గృహమున' - ప్రావృణ్వానః - తలదాచుకొనుచు అని యర్థము.

ఎవనిదో గుడ్డ చుట్టబెట్టుకొని నాదే యనుకొనుచున్నట్లు, ఇతరుడు పెట్టుకొని పారవేసిన మాలవంటి ధర్మరాజు సంపదను దురాశతో చేజిక్కించుకొని 'నాదే' యనుకొనుచున్నావు.

ద్రౌపదీసహితం పార్థం సాయుధై ర్భ్రాతృభి ర్వృతమ్,
వనస్థమపి రాజ్యస్థః పాణ్డవం కో విజేష్యతి. 13

తమ్ము లందరు ఆయుధములు పట్టుకొని అన్ని వైపుల నిలువగా ద్రౌపదితో కూడిన ధర్మరాజు అడవియందే యున్నను రాజ్యమున నున్న ఎవ్వడైనను గెలువగలడా ?

నిదేశే యస్య రాజానః సర్వే తిష్ఠన్తి కిఙ్కరాః,
త మైలబిల మాసాద్య ధర్మరాజో వ్యరాజత. 14

రాజు లందరు సేవకులవలె అతని ఆజ్ఞపై నిలుచుచుందురు. అట్టి ధర్మరాజు కుబేరుని కూడ యుద్ధమున నెదుర్కొని విరాజిల్లెను.

కుబేరసదనం ప్రాప్య తతో రత్నా న్యవాప్య చ,
స్ఫీత మాక్రమ్య తే రాష్ట్రం రాజ్య మిచ్ఛన్తి పాణ్డవాః. 15

పాండవులు కుబేరుని యిల్లు జొచ్చి అందుండి రత్నములు కొనివచ్చి సమృద్ధితో విలసిల్లుచున్న నీ రాజ్యమును వశపరచుకొందురు.

దత్తం హుత మధీతం చ బ్రాహ్మణా స్తర్పితా ధనైః,
ఆవయో ర్గత మాయుశ్చ కృతకృత్యౌ చ విద్ధి నౌ. 16

ఒకరికింత పెట్టితిమి. అగ్నిని వ్రేల్చితిమి. చదువులు నేర్చితిమి. ధనములతో బ్రహ్మజ్ఞానము కలవారిని తృప్తిపరచితిమి. ఆయువుకూడ చాల భాగము కడచిపోయినది. మేమిరువురము చేయవలసినవన్నియు చేసితిమి. ఇది యెరుగుము.

త్వం తు హిత్వా సుఖం రాజ్యం మిత్రాణి చ ధనాని చ,
విగ్రహం పాణ్డవైః కృత్వా మహ ద్వ్యసన మాప్స్యసి. 17

ఇక నీవో పాండవులతో పగపెట్టుకొని సుఖమును, రాజ్యమును, మిత్రులను, ధనములను కోల్పోయి ఘోరమైన ఆపదను పొందనున్నావు.

---

14. ఐలబిలమ్, ఆసాద్య - కుబేరు నెదుర్కొని;

ద్రౌపదీ యస్య చాశాస్తే విజయం సత్యవాదినీ,
తపోఘోరవ్రతా దేవీ కథం జేష్యసి పాణ్డవమ్. 18

ఆ ద్రౌపది సత్యమే పలుకునట్టిది. తపములు, ఘోర వ్రతములు చేసినట్టిది. దివ్య గుణములు కలది. ఆమె పాండవులకు విజయమును కాంక్షించుచుండగా నీవెట్లు గెలుతువు?

మన్త్రీ జనార్దనో యస్య భ్రాతా యస్య ధనఞ్జయః,
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠః కథం జేష్యసి పాణ్డవమ్. 19

ఆ ధర్మరాజునకు మంత్రి జనార్దనుడు. ఆయుధము పట్టిన వారందరిలో మిక్కిలి గొప్పవాడగు ధనంజయుడు తమ్ముడు. వానిని నీవెట్లు గెలువగలవు?

సహాయా బ్రాహ్మణా యస్య ధృతిమన్తో జితేన్ద్రియాః,
తముగ్రతపసం వీరం కథం జేష్యసి పాణ్డవమ్. 20

ఆతనికి గొప్ప ధైర్యము గలవారు, ఇంద్రియములను గెలిచినవారు నగు బ్రహ్మజ్ఞానసంపన్నులు సహాయులు. అట్టి గొప్ప తపస్సంపదగల ధర్మరాజును నీవెట్లు గెలువగలవు?

పునరుక్తం చ వక్ష్యామి యత్కార్యం భూతి మిచ్ఛతా,
సుహృదా మజ్జమానేషు సుహృత్సు వ్యసనార్ణవే. 21

తనవానికి శుభము కోరిన మిత్రుడు, మహాకష్ట మనెడు సముద్రమున మిత్రులు మునిగిపోవు చుండగా చెప్పినదే అయినను మరల చెప్పవలయును. కావున నీకు చెప్పుదును.

అలం యుద్ధేన తై ర్వీరైః శామ్య త్వం కురువృద్ధయే,
మా గమః ససుతామాత్యః సబలశ్చ పరాభవమ్ 22

ఆ వీరులతో యుద్ధము వలదు. కురువంశము పెంపొందుటకై శాంతి పొందుము. కొడుకులతో, మంత్రులతో, సేనతో పాటుగా సర్వనాశనము పొందకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భీష్మద్రోణవాక్యే ఏకోనచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భీష్మద్రోణులవాక్యముగల నూటముప్పదితొమ్మిదవ అధ్యాయము.

—: ० :—

## చత్వారింశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదియవ అధ్యాయము

**శ్రీకృష్ణేన పాణ్డవపక్షం గ్రాహయితుం కర్ణస్య ప్రబోధనమ్.**

**శ్రీకృష్ణుడు పాండవులవైపు చేరుమని కర్ణునికి బోధించుట.**

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లనెను.

రాజపుత్రైః పరివృత స్తథా భృత్యైశ్చ సంజయ,
ఉపరోప్య రథే కర్ణం నిర్యాతో మధుసూదనః. 1

సంజయా! రాజపుత్రులు, సేవకులు చుట్టిరాగా కృష్ణుడు కర్ణుని రథ మెక్కించుకొని బయలుదేరెను.

కి మబ్రవీ దమేయాత్మా రాధేయం పరవీరహా,
కాని సాన్త్వాని గోవిన్దః సూతపుత్రే ప్రయుక్తవాన్. 2

ఆ కృష్ణుని హృదయ మూహింపనలవి కానిది. అతడు శత్రువీరులను రూపుమాపువాడు. అట్టి గోవిందుడు సూతునికొడుకుపై ఏ మెత్తని యుక్తులను ప్రయోగించెనో?

ఉద్యన్మేఘస్వనః కాలే కృష్ణః కర్ణ మథాబ్రవీత్,
మృదు వా యది వా తీక్ష్ణం తన్మమాచక్ష్వ సఞ్జయ. 3

ఆ సమయమున కృష్ణుడు ఎంతో ఎత్తున ఉన్న మేఘము ఉరుమువంటి కంఠధ్వనితో కర్ణునితో మాటాడెను. అది మెత్తనిదో, ఘాటైనదో! సంజయా! నాకు వివరించి చెప్పుము.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

ఆనుపూర్వ్యేణ వాక్యాని తీక్ష్ణాని చ మృదూని చ,
ప్రియాణి ధర్మయుక్తాని సత్యాని చ హితాని చ. 4

హృదయగ్రహణీయాని రాధేయం మధుసూదనః,
యాన్యబ్రవీ దమేయాత్మా తాని మే శృణు భారత. 5

ఊహింపనలవి కాని మహిమగల కృష్ణుడు కర్ణునకు నందలింపు మాటలు, మెత్తనివి, ప్రియమైనవి, ధర్మముతో కూడినవి, సత్యమైనవి, హితమైనవి, హృదయమునకు పట్టించుకొనవలసినవి యగు మాటలు క్రమము ననుసరించి చెప్పెను. వానిని చెప్పెదను వినుము.

వాసుదేవ ఉవాచ - వాసుదేవు డిట్లు పలికెను.

ఉపాసితా స్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః,
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతే నానసూయయా. 6

రాధేయా ! నీవు వేదములు కడదాక తరచి చూచిన బ్రాహ్మణులను సేవించితివి. నియమము తప్పక, అసూయకు లోనుగాక తత్త్వార్థమును గూర్చి వారిని ప్రశ్న చేసితివి.

త్వమేవ కర్ణ జానాసి వేదవాదాన్ సనాతనాన్,
త్వమేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః. 7

నీ అంతట నీవు సనాతనములగు వేదవాదములను ఎరుగుదువు. లోతైన ధర్మశాస్త్రములందు ఆరితేరితివి.

కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే,
వోఢారం పితరం తస్య ప్రాహుః శాస్త్రవిదో జనాః. 8

శాస్త్రములను చక్కగా ఎరిగిన పండితులు కన్యకు పుట్టిన వానిని కానీనుడనియు, సహోఢు డనియు నందురు. అతనికి తల్లి భర్తయే తండ్రి యనియు చెప్పుదురు.

---

8. కన్యకు పుట్టిన వారిలో రెండు విధములు కలవు. పెండ్లి నాటికే పుట్టిన వాడు కానీనుడు, పెండ్లి నాటికి గర్భవతిగా ఉన్న స్త్రీకి పెండ్లి పిదప పుట్టినవాడు సహోఢుడు. ఈ యిరువురకును తల్లి భర్తయే తండ్రియని శాస్త్రముల నిర్దేశము.

సోఽసి కర్ణ తథా జాతః పాణ్డోః పుత్రోఽసి ధర్మతః,
నిగ్రహా ద్ధర్మశాస్త్రాణా మేహి రాజా భవిష్యసి. 9

కర్ణా! నీవట్లు పుట్టినవాడవు. ధర్మమునుబట్టి పాండురాజు కుమారుడవు. ధర్మశాస్త్రముల నియమము ననుసరించి నీవు రాజ వగుదువు.

పితృపక్షే చ తే పార్థా మాతృపక్షే చ వృష్ణయః,
ద్వౌ పక్షా వభిజానీహి త్వమేతౌ పురుషర్షభ. 10

పురుషవరేణ్యా! కుంతి కొడుకులు నీకు తండ్రివైపు చుట్టములు. వృష్ణి వంశము వారమగు మేము తల్లివైపు బంధువులము. ఈ రెండు పక్షములను నీవు అనుమతింపుము.

మయా సార్ధ మితో యాత మద్య త్వాం తాత పాణ్డవాః,
అభిజానన్తు కౌన్తేయం పూర్వజాతం యుధిష్ఠిరాత్. 11

నేడు నాతో కలసివచ్చుచున్న నిన్ను పాండవులు కుంతి కొడుకుగా, యుధిష్ఠిరునికి అన్నగా నిన్ను గుర్తింతురు గాక!

పాదౌ తవ గ్రహీష్యన్తి భ్రాతరః పఞ్చ పాణ్డవాః,
ద్రౌపదేయా స్తథా పఞ్చ సౌభద్ర శ్చాపరాజితః. 12

ఆ పాండుకుమారు లయిదుగురు, ద్రౌపది కొడుకు లయిదుగురు, ఎందును ఓటమి యెరుగని సుభద్రకొడుకు అభిమన్యుడు నీ పాదములు పట్టుకొందురు.

రాజానో రాజపుత్రాశ్చ పాణ్డవార్థే సమాగతాః,
పాదౌ తవ గ్రహీష్యన్తి సర్వే చాన్ధకవృష్ణయః. 13

పాండవుల పనికై వచ్చిన రాజులు, రాజపుత్రులు, అంధక వంశమువారు, వృష్ణివంశమువారు నీ పాదములు పట్టుకొందురు.

హిరణ్మయాం శ్చ తే కుమ్భాన్ రాజతాన్ పార్థివాం స్తథా,
ఓషధ్యః సర్వబీజాని సర్వరత్నాని వీరుధః. 14
రాజన్యా రాజకన్యాశ్చా ప్యానయన్త్వాభిషేచనమ్.

రాజకుమారులు, రాజకన్యలును ఓషధులు, అన్ని విత్తనములు, సర్వ రత్నములు, చిగురుకొమ్మలుగల బంగారు, వెండి మట్టికుండలను గైకొని నీకు అభిషేక వస్తువులను తెత్తురుగాక.

షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌప ద్యుపగమిష్యతి. 15

ఆ అభిషేకకాలమున ద్రౌపది ఆరవవానిగా నిన్ను చేరుకొనును.

అగ్నిం జుహోతు వై ధౌమ్యః సంశితాత్మా ద్విజో త్తమః,
అద్య త్వా మభిషిఞ్చన్తు చాతుర్వైద్యా ద్విజాతయః. 16

చల్లని మనసు గల బ్రాహ్మణశ్రేష్ఠుడు ధౌమ్యుడు అగ్నిని వ్రేల్చుగాక! నాలుగు వేదములలో ఆరితేరిన బ్రాహ్మణులు నిన్ను నేడు అభిషేకింతురు గాక!

పురోహితః పాణ్డవానాం బ్రహ్మకర్మ ణ్యవస్థితః,
తథైవ భ్రాతరః పఞ్చ పాణ్డవాః పురుషర్షభాః. 17
ద్రౌపదేయా స్తథా పఞ్చ పఞ్చాలాశ్చేదయ స్తథా,
అహం చ త్వాభిషేక్ష్యామి రాజానం పృథివీపతిమ్. 18

వేద కర్మములలో గట్టి వాడగు పాండవుల పురోహితుడును, అట్లే నీ తమ్ములైన పాండవు లైదుగురును, ద్రౌపదికుమారు లైదుగురును, పంచాలురు, చేది రాజులు నేనును భూపతిగా వెలుగొందు నిన్నభిషేకింతుము.

యువరాజోఽస్తు తే రాజా ధర్మపుత్రో యుధిష్ఠిరః,
గృహీత్వా వ్యజనం శ్వేతం ధర్మాత్మా సంశితవ్రతః. 19

చక్కని వ్రతములు గల ధర్మాత్ముడు, ధర్మపుత్రుడు యుధిష్ఠిరుడు నీకై తెల్లని వీవన పట్టుకొని యువరాజగు గాక!

ఉపాన్వారోహతు రథం కున్తీపుత్రో యుధిష్ఠిరః.

కుంతి కొడుకు ధర్మరాజు నీవెనుక రథము నెక్కును.

ఛత్రం చ తే మహాశ్వేతం భీమసేనో మహాబలః,
అభిషి క్తస్య కౌ న్తేయో ధారయిష్యతి మూర్ధని. 20

మహాబలము గలవాడు, కుంతి కొడుకు అగు భీమసేనుడు అభిషేకము పొందిన నీకు శిరస్సుపై తెల్లని గొడుగు పట్టును.

---

16. చాతుర్వైద్యాః - నాలుగు వేదములు చక్కగా అధ్యయనము చేసినవారు.
17. బ్రహ్మకర్మణి - వేదకార్యమున; అవస్థితః - నిష్ఠ గలవాడు.

కిఙ్కిణీశతనిర్ఘోషం వైయాఘ్రపరివారణమ్,
రథం శ్వేతహయై ర్యుక్త మర్జునో వాహయిష్యతి. 21

వందల కొలది చిరుగంటల సవ్వడి గలదియు, పులితోలు తొడుగుగల దియు, తెల్లని గుఱ్ఱములు పూన్చినదియు నగు నీ రథమును అర్జునుడు నడపును.

అభిమన్యు శ్చ తే నిత్యం ప్రత్యాసన్నో భవిష్యతి. 22

అభిమన్యుడు ఎల్లవేళల నీదగ్గర మసలుచుండును.

నకులః సహదేవశ్చ ద్రౌపదేయాశ్చ పఞ్చ యే,
పఞ్చాలా శ్చానుయాస్యన్తి శిఖణ్డీ చ మహారథః. 23

నకులుడు, సహదేవుడు, ద్రౌపది కొడుకు లైదుగురు, పంచాలురు మహా రథుడగు శిఖండి నీవెంట నడచి వత్తురు.

అహం చ త్వానుయాస్యామి సర్వే చాన్ధకవృష్ణయః,
దాశార్హాః పరివారా స్తే దాశార్ణాశ్చ విశామ్పతే. 24

నేను, అంధకవృష్ణి వంశములవారు, దాశార్హులు, దశార్ణదేశపు రాజులు - ఈ అందరమును మహారాజా! నీవెనుక నడచి వత్తుము.

భుఙ్క్ష్వ రాజ్యం మహాబాహో భ్రాతృభిః సహ పాణ్డవైః,
జపైర్హోమైశ్చ సంయుక్తో మఙ్గళైశ్చ పృథగ్విధైః. 25

మహాబాహూ! నీతోడబుట్టిన పాండవులతో కూడి, జపములతో హోమము లతో వేరు వేరు విధములగు మంగళములతో కూడినవాడవై రాజ్యము ననుభ వింపుము.

పురోగమాశ్చ తే సన్తు ద్రవిడాః సహ కున్తలైః,
ఆన్ధ్రా స్తాలచరాశ్చైవ చూచుపా వేణుపా స్తథా. 26

ద్రవిడదేశమువారు, కుంతలదేశమువారు, ఆంధ్రులు, తాలచరులు చూచ పులు, వేణుపులు - వీరందరు నీముందు నడతురుగాక!

స్తువన్తు త్వాం చ బహుభిః స్తుతిభిః సూతమాగధాః,
విజయం వసుషేణస్య ఘోషయన్తు చ పాణ్డవాః. 27

స్తోత్రపాఠకులైన సూతులు మాగధులు పెక్కువిధములగు స్తుతులతో నిన్ను పొగడుదురుగాక! వసుషేణుని విజయమును పాండవులు చాటింతురు గాక!

స త్వం పరివృతః పార్థై ర్నక్షత్రైరివ చన్ద్రమాః,
ప్రశాధి రాజ్యం కౌన్తేయ కున్తీం చ ప్రతినన్దయ. 28

అట్టి నీవు నక్షత్రములతో చంద్రునివలె పాండవులతో కూడినవాడవై రాజ్యము నేలుము. కున్తీకుమారా! కుంతిని సంతోషపెట్టుము.

మిత్రాణి తే ప్రహృష్యన్తు వ్యథన్తు రిపవ స్తథా,
సౌభ్రాత్రం చైవ తేఽద్యాస్తు భ్రాతృభిః సహ పాణ్డవైః. 29

నీమిత్రులు పొంగిపోవుదురు గాక! నీ శత్రువులు కుళ్ళి కుళ్ళి యేడ్తురు గాక! తోడబుట్టిన పాండుతనయులతో నీ మంచిసోదరప్రేమ నేడు వెలుగొందు గాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
శ్రీకృష్ణవాక్యే చత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
శ్రీకృష్ణవాక్యము గల నూటనలుబదియవ అధ్యాయము.

—: o :—

27. వసుషేణస్య - ఇది కర్ణునికి సూతుడు పెట్టిన పేరు.

# ఏకచత్వారింశదధికశతతమోఽధ్యాయః
# నూటనలుబదియొకటవ అధ్యాయము

కర్ణేన దుర్యోధనపక్షమేవ పోషయితుం స్వీయం నిశ్చితం మతం
నివేద్య సంగ్రామస్య యజ్ఞరూపతయా వర్ణనమ్.
కర్ణుడు దుర్యోధనునిపక్షమును పెంపొందించుటకు తన నిర్ణయమును
తెలిపి యుద్ధమును యజ్ఞరూపముగా వర్ణించుట.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.

అసంశయం సౌహృదా న్మే ప్రణయాచ్చాత్థ కేశవ,
సఖ్యేన చైవ వార్ష్ణేయ శ్రేయస్కామతయైవ చ. 1

కేశవా! నా మీది స్నేహముతో, చనువుతో చెలిమితో, నామేలు కోరు తలపుతో చెప్పితివి. ఇందు సంశయము లేదు.

సర్వం చైవాభిజానామి పాణ్డోః పుత్రోఽస్మి ధర్మతః,
నిగ్రహా ద్ధర్మశాస్త్రాణాం యథా త్వం కృష్ణ మన్యసే. 2

కృష్ణా! అంతయు నెరుగుదును. ధర్మమును బట్టియు, ధర్మశాస్త్రముల నిర్ణయమునుబట్టియు నీవు తలచినట్లే, నేను పాండురాజు కుమారుడనే యగుదును.

కన్యాగర్భం సమాధత్త భాస్కరాన్మాం జనార్దన,
ఆదిత్యవచనా చ్చైవ జాతం మాం సా వ్యసర్జయత్. 3

జనార్దనా! భాస్కరునివలన కన్యయగు కుంతి నన్ను గర్భమున ధరించెను. సూర్యుని మాటపై పుట్టిన నన్ను వదలివైచెను.

సోఽస్మి కృష్ణ తథా జాతః పాణ్డోః పుత్రోఽస్మి ధర్మతః,
కున్త్యా త్వహ మపాకీర్ణో యథా న కుశలం తథా. 4

కృష్ణా! అపధముగా పుట్టిన నేను ధర్మమును బట్టి పాండుని పుత్రుడనే యగుదును కాని నాక్షేమ మరయక కుంతి నన్ను పారవైచినది.

సూతో హి మామధిరథో దృష్ట్వై వాభ్యానయద్ గృహాన్,

రాధాయా శ్చైవ మాం ప్రాదాత్ సౌహార్దా న్మధుసూదన. 5

కృష్ణా! అధిరథుడగు సూతుడు నన్ను చూచినంతనే ప్రేమగొని యింటికి తెచ్చెను. రాధ కిచ్చెను.

మత్స్నేహా చ్చైవ రాధాయాం సద్యః క్షీర మవాతరత్,

సా మే మూత్రం పురీషం చ ప్రతిజగ్రాహ మాధవ. 6

మాధవా! నామీది ప్రేమతో ఆరాధకు ఉన్నట్లుండి చేపు వచ్చెను. ఆమె నా మలమూత్రములను ఏవగింపక బాగుచేసెను.

తస్యాః పిండవ్యపనయం కుర్యా దస్మద్విధః కథమ్,

ధర్మవిద్ ధర్మశాస్త్రాణాం శ్రవణే సతతం రతః. 7

ధర్మ మెరిగినవాడు, ధర్మశాస్త్రముల నెల్లవేళల వినుటలో ఆసక్తి కలవాడు నగు నావంటివాడు ఆమె పెట్టిన తిండిఋణ మెట్లు తీర్చుకొనును?

తథా మామభిజానాతి సూతశ్చాధిరథః సుతమ్,

పితరం చాభిజానామి తమహం సౌహృదాత్ సదా. 8

అట్లే సూతుడగు అధిరథుడు నన్ను కొడుకుగా మన్నించెను. నేనును అతనిని ప్రేమవలన ఎల్లవేళల తండ్రిగా మన్నించితిని.

స హి మే జాతకర్మాది కారయామాస మాధవ,

శాస్త్రదృష్టేన విధినా పుత్రప్రీత్యా జనార్దన. 9

పుత్రవాత్సల్యముతో నా కాతడు శాస్త్రముచెప్పిన విధానమునుబట్టి జాతకర్మ మున్నగు సంస్కారములు చేయించెను.

నామ వై వసుషేణేతి కారయామాస వై ద్విజైః,

భార్యా శ్చోఢా మమ ప్రాప్తే యౌవనే తత్పరిగ్రహాత్. 10

నాకు బ్రాహ్మణులతో వసుషేణు డను పేరు పెట్టించెను. నాకు వయసు వచ్చిన వెంటనే తనవాడనియే భావించి కన్యలతో పెండ్లిండ్లు గావించెను.

---

7. పిండ వ్యపనయమ్ - పిండ మనగా తిండి; వ్యపనయ మనగా తొలగించుట- తిండి ఋణము తీర్చకుండుట. తిండిపెట్టిన వారిని పోషింపక వదలుట.

తాసు పుత్రాశ్చ పౌత్రాశ్చ మమ జాతా జనార్దన,
తాసు మే హృదయం కృష్ణ సంజాతం కామబన్ధనమ్. 11

వారియందు నాకు కొడుకులు పుట్టిరి. వారివలన మనుమలు గలిగిరి. వారందరియందు నా హృదయము కామభావనతో తగులువడియున్నది.

న పృథివ్యా సకలయా న సువర్ణస్య రాశిభిః,
హర్షాద్ భయాద్వా గోవిన్ద మిథ్యా కర్తుం తదుత్సహే. 12

గోవిందా! మొత్తము భూమి లభించినను, బంగారుపు రాసులు దొరికినను సంతోషముతో కాని, భయమువలనగాని వారి ప్రేమను చెరుపజాలను.

ధృతరాష్ట్రకులే కృష్ణ దుర్యోధనసమాశ్రయాత్,
మయా త్రయోదశ సమా భుక్తం రాజ్య మకణ్టకమ్. 13

కృష్ణా! దుర్యోధనుని ప్రాపువలన ధృతరాష్ట్రుని యింట నేను పదమూ డేండ్లు ఏ కష్టము నెరుగక రాజ్యము ననుభవించితిని.

ఇష్టం చ బహుభి ర్యజ్ఞైః సహ సూతై ర్మయాఽసకృత్,
ఆవాహాశ్చ వివాహాశ్చ సహ సూతై ర్మయా కృతాః. 14

సూతులతో కలసి పెక్కుమారులు నేను పెక్కుయజ్ఞములు చేసితిని. సూతులతో కూడి కులధర్మములను, పెండ్లిండ్లను నిర్వహించితిని.

మాం చ కృష్ణ సమాసాద్య కృతః శస్త్రసముద్యమః,
దుర్యోధనేన వార్ష్ణేయ విగ్రహశ్చాపి పాణ్డవైః. 15

కృష్ణా! దుర్యోధనుడు నన్ను తనవానిగా చేసికొనియే యుద్ధమున ఉత్సాహము గలవా డాయెను. పాండవులతో పగనుకూడ నన్ను చూచియే పెట్టుకొనెను.

తస్మాద్ రణే ద్వైరథే మాం ప్రత్యుద్యాతార మచ్యుత,
వృకవాన్ పరమం కృష్ణ ప్రతీపం సవ్యసాచినః. 16

---

14. ఆవాహాః - కులమున జరుగు వేడుకలు మొదలగునవి. 'ఆవాసాః' అను పాఠమునను అదే యర్థము.

15. శస్త్రసముద్యమః - 'యుద్ధోత్సాహము'; మామ్-నన్ను; సమాసాద్య - మిత్రమునుగా పొంది.

16. ద్వైరథే - ఎదురెదురైన యుద్ధమున,

మరియు అర్జునునితో 'ఎదురెదురై' పోరుటకై నన్ను ప్రత్యేకముగా ఎన్నుకొనెను.

వధాద్ బంధాద్ భయాద్వాపి లోభాద్వాఽపి జనార్దన,
అనృతం నోత్సహే కర్తుం ధార్తరాష్ట్రస్య ధీమతః. 17

చచ్చినను, బలవంతము వలననో, ఓడుదునను భయము వలననో, లోభము వలననో చివరకు చావవలసి వచ్చినను గాని బుద్ధిమంతుడగు దుర్యోధనుని వెన్నుపోటు పొడవజాలను.

యది హ్యద్య న గచ్ఛేయం ద్వైరథం సవ్యసాచినా,
అకీర్తిః స్యాద్ధృషీకేశ మమ పార్థస్య చోభయోః. 18

హృషీకేశా! ఈనాడు నేను అర్జునునితో ఎక్కటి కయ్యమును పొందనిచో అది నాకును, అర్జునునకు - ఇరువురకును అపకీర్తి యగును.

అసంశయం హితార్థాయ బ్రూయాస్త్వం మధుసూదన,
సర్వం చ పాణ్డవాః కుర్యు స్త్వద్వశిత్వా న్న సంశయః. 19

మధుసూదనా! నీవు మేలుకోరియే చెప్పుచున్నావు. నీ అదుపులో ఉన్న కారణముగా పాండవులు నీవు చెప్పినదంతయు చేయుదురు. సంశయము లేదు.

మన్త్రస్య నియమం కుర్యా స్త్వమత్ర మధుసూదన,
ఏత దత్ర హితం మన్యే సర్వం యాదవనన్దన. 20

---

17. వధాత్ - చచ్చినను గాని, బంధాత్ - కుంతీసంబంధమువలన నగు బలవంతమువలనగాని; భయాత్ - ఓడుదునను భయమువలన గాని.

18. ఉభయోః - అపి, అకీర్తిః - ఇరువురు ఒకరినొకరు చంపునట్లు ప్రతిజ్ఞ చేసియున్న కారణమున ప్రతిజ్ఞ నెరవేర్చుకొనక పోవుటచే అపకీర్తి కలుగునని భావము.

19. త్వద్వశిత్వాత్ - నీవు వారిని ఆదేశించువాడవు కనుక; బ్రూయాః - పాండవులను గూర్చి చెప్పుచున్నావు.

20. మన్త్రస్య - కర్ణుడు కుంతి కొడుకు అను రహస్యమును; నియమం కుర్యాః - వెలువరింపకుము అని భావము. ధర్మరాజునకు తెలియనీకు మని ప్రార్థన

కృష్ణా! ఈ విషయమున నీకు మన మాలోచించుదానిని రహస్యముగా నుంచవలయును. ఇచట ఇదియే మేలైనదని నా తలపు.

యది జానాతి మాం రాజా ధర్మాత్మా సంయతేన్ద్రియః,
కున్త్యాః ప్రథమజం పుత్రం న స రాజ్యం గ్రహీష్యతి. 21

ధర్మాత్ముడు, ఇంద్రియనిగ్రహము గలవాడు నగు ధర్మరాజు నన్ను కుంతి మొదటి కొడుకుగా నెరిగెనేని రాజ్యమును గ్రహింపడు.

ప్రాప్య చాపి మహద్రాజ్యం తదహం మధుసూదన,
స్ఫీతం దుర్యోధనాయైవ సంప్రదద్యా మరిన్దమ. 22

ఒకవేళ నేను ఈ మహాసామ్రాజ్యమును కైకొన్నను చక్కగా సిరి సంపదలతో కళకళలాడు దానిని దుర్యోధనునికే ఈయవలసి వచ్చును.

స ఏవ రాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః,
నేతా యస్య హృషీకేశో యోద్ధా యస్య ధనఞ్జయః. 23

ఆ ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడే కలకాలము రాజగుగాక! అతనిని నడపువాడు హృషీకేశుడ వగు నీవు. అతనికై యుద్ధము చేయువాడు ధనంజయుడు.

పృథివీ తస్య రాష్ట్రం చ యస్య భీమో మహారథః,
నకులః సహదేవశ్చ ద్రౌపదేయాశ్చ మాధవ. 24

ధృష్టద్యుమ్నశ్చ పాఞ్చాల్యః సాత్యకిశ్చ మహారథః,
ఉత్తమౌజా యుధామన్యుః సత్యధర్మా చ సౌమకిః. 25

చైద్యశ్చ చేకితానశ్చ శిఖణ్డీ చాపరాజితః,
ఇన్ద్రగోపకవర్ణాశ్చ కేకయా భ్రాతర స్తథా,
ఇన్ద్రాయుధసవర్ణశ్చ కున్తిభోజో మహామనాః. 26

---

21. కానిచో జరుగు నష్టమును వక్కాణించుచున్నాడు.

22. ప్రాప్య చాపి - అధర్మిష్ఠుడైన దుర్యోధనుడు రాజగుట లోకనాశనము కావించునని తాత్పర్యము.

26. ఇంద్రగోపకవర్ణాః - వానకాలమున కానవచ్చు ఆర్ద్రపురుగులవంటి వన్నె కలవారు; ఇంద్రాయుధసవర్ణః - ఇంద్రధనుస్సువంటి వన్నె కలవాడు.

మాతులో భీమసేనస్య శ్యేనజిచ్చ మహారథః,
శఙ్ఖః పుత్రో విరాటస్య నిధిస్త్వం చ జనార్దన. 27
మహానయం కృష్ణ కృతః క్షత్రస్య సముదానయః,
రాజ్యం ప్రాప్త మిదం దీప్తం ప్రథితం సర్వరాజసు. 28

మహారథులగు భీముడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది తనయులు ధృష్టద్యుమ్నుడు, పాంచాలరాజు ద్రుపదుడు, మహారథుడగు సాత్యకి, ఉత్తమౌజుడు యుధామన్యువు, సత్యధర్ముడు సౌమకి, చేదిరాజు చేకితానుడు, ఓటమి యెరుగని శిఖండి, 'ఆర్ద్రి' పురువుల వన్నెగల సోదరులు కేకయులు, ఇంద్రధనుస్సు వంటి వన్నెచిన్నెలు గల మహామతి కుంతిభోజుడు, భీమసేనుని మేనమామ మహారథుడు అగు శ్యేనజిత్తు, విరాటునికొడుకు శంఖుడు, పెన్నిధివి నీవు-ఇట్లు క్షత్రియు లందరు నొక్కచోట చేరిరి. రాజులందరిలో ప్రసిద్ధికెక్కిన ఈ రాజ్యము ఆ ధర్మరాజుదే యగును.

ధార్తరాష్ట్రస్య వార్ష్ణేయ శస్త్రయజ్ఞో భవిష్యతి,
అస్య యజ్ఞస్య వేత్తా త్వం భవిష్యసి జనార్దన. 29

ధృతరాష్ట్రుని కుమారుని కారణముగా ఆయుధముల యజ్ఞము కానున్నది. ఈ యజ్ఞమునకు నీవే ఉపద్రష్ట వగుదువు.

ఆధ్వర్యవం చ తే కృష్ణ క్రతా వస్మిన్ భవిష్యతి,
హోతా చైవాత్ర బీభత్సుః సన్నద్ధః స కపిధ్వజః. 30

కృష్ణా! ఈ యజ్ఞమున అధ్వర్యుపదవియు నీదే. అన్నియు సమకూర్చు కొన్న కపిధ్వజుడు బీభత్సుడు హోత.

---

27. నిధిః త్వమ్ - పెన్నిధివలె అక్షయముగా కోరికలను తీర్చువాడవు నీవు
28. సముదానయః - ఒక్కచోటికి చేరినది;
29. అస్య యజ్ఞస్య వేత్తా - ఈ యజ్ఞమునకు ఉపద్రష్ట - యజ్ఞము చక్కగా జరుగుటను నిర్వహించువాడు.
30. ఆధ్వర్యవం చ - యజ్ఞము నాయకత్వమును - లోకమున ఉపద్రష్టగా, అధ్వర్యువుగా వేరు వేరు వ్యక్తులుందురు. ఇచటనో ఈశ్వరరూపమున నీవే ఉపద్రష్టవు. బ్రహ్మ - ప్రధాన ఋత్విక్కురూపమున నీవే సాక్షివి అని భావము.

గాణ్డీవం స్రుక్ తథా చాజ్యం వీర్యం పుంసాం భవిష్యతి,
ఐన్ద్రిం పాశుపతం బ్రాహ్మం స్థూణాకర్ణం చ మాధవ,
మన్త్రాస్తత్ర భవిష్యన్తి ప్రయుక్తాః సవ్యసాచినా. 31

గాండీవమే స్రుక్కు, మహాపురుషుల పౌరుషమే నెయ్యి, ఐంద్రాస్త్రము, పాశుపతాస్త్రము, బ్రహ్మాస్త్రము, స్థూణాకర్ణాస్త్రము అనునవి సవ్యసాచి ప్రయోగించు మంత్రము లగును.

అనుయాత శ్చ పితర మధికో వా పరాక్రమే,
గీతం స్తోత్రం స సౌభద్రః సమ్యక్ తత్ర భవిష్యతి. 32

పరాక్రమమున తండ్రియడుగుజాడలలో నడచువాడు - ఒకప్పుడు మిన్నయే యనదగువాడు - సుభద్రకొడుకు ఆ యజ్ఞమున ప్రగీతమంత్రముల స్తోత్రమును చేయును.

ఉద్గాతాత్ర పునర్భీమః ప్రస్తోతా సుమహాబలః,
వినదన్ స నరవ్యాఘ్రో నాగానీకాన్తకృద్రణే. 33

మిక్కుటమగు బలముగల భీమసేనుడు ఏనుగుల మందలను రూపుమాపుచు సింహనాదము చేయుచు సామగానములను పాడు ఋత్విక్కు కార్యమును తానును నిర్వహించును.

స చైవ తత్ర ధర్మాత్మా శశ్వద్రాజా యుధిష్ఠిరః,
జపై ర్హోమైశ్చ సంయుక్తో బ్రహ్మత్వం కారయిష్యతి. 34

ధర్మాత్ముడగు రాజు యుధిష్ఠిరుడు జపములు, హోమములు చేయుచు తానై బ్రహ్మ యను ఋత్విక్కు చేయుపనిని నిర్వహించును.

---

31. స్రుక్కు - హోమపాత్ర

32. పితరమ్ అనుయాతః - తండ్రి యడుగుజాడలలో నడచువాడు - తండ్రికి దీటైనవాడని భావము; గీతం స్తోత్రమ్ - ప్రగీతమంత్రములతో చేయు స్తుతిని - సామగానము పాడుట యని యర్థము - ఈపని నిర్వహించువానిని ఉద్గాత యందురు; తత్ - దానిని; సౌభద్రః - సుభద్రకుమారుడు అభిమన్యుడు; భవిష్యతి - చేయును అని భావము.

34. బ్రహ్మత్వమ్ - బ్రహ్మ యను ఋత్విక్కు చేయుపనిని; కారయిష్యతి - స్వార్థమున ణిచ్ ప్రత్యయము చేయును.

శఙ్ఖశబ్దాః సమురజా భేర్యశ్చ మధుసూదన,
ఉత్కృష్టసింహనాదశ్చ సుబ్రహ్మణ్యో భవిష్యతి. 35

శంఖముల ధ్వనులు, మద్దెళ్ల మ్రోతలు, భేరుల రొదలు, చెలరేగిన సింహనాదములు సుబ్రహ్మణ్య స్థానము నలంకరించును.

నకులః సహదేవశ్చ మాద్రీపుత్రౌ యశస్వినౌ,
శామిత్రం తౌ మహావీర్యౌ సమ్యక్ తత్ర భవిష్యతః. 36

ఆ యజ్ఞమున మాద్రి కొడుకులు, గొప్పకీర్తి కలవారు, మహాశక్తి సంపన్నులు అగు నకులసహదేవులు యజ్ఞపశువును చంపు కార్యమును నిర్వహింతురు.

కల్మాషదణ్డా గోవిన్ద విమలా రథశక్తయః,
యూపాః సముపకల్పన్తా మస్మిన్ యజ్ఞే జనార్దన. 37

చిత్రములైన ధ్వజము గల స్వచ్ఛములైన రథముల బారులు ఈ యజ్ఞమున యూపస్తంభము లగుగాక!

కర్ణినాలీకనారాచా వత్సదన్తోపబృంహణాః,
తోమరాః సోమకలశాః పవిత్రాణి ధనూంషి చ. 38

---

35. సుబ్రహ్మణః-భోక్తయగు కాంస్వరూప దైవమును ఆవాహనము చేయువాడు. నాదమే అట్టి సుబ్రహ్మణ్య స్వరూపుడని భావము.

36. శామిత్రమ్ - క్షత్రియు లనెడు పశువులను చంపుపనిని.

37 కల్మాషదణ్డాః - వన్నెవన్నెల ధ్వజములు గల; 38. కర్ణి-మొదలగునవి. బాణములలో జాతులు - కర్ణి - చెవి ఆకారపు అగ్రము గలది; నారాచః- ఇనుపబాణము; నాలీకః - ఈటెవంటి బాణము; వత్సదన్తః - దూడ పల్లు వంటి ఆకారముగల బాణము; - ఉపబృంహణాః - యజ్ఞమున సోమముతో హోమము చేయునపుడు తోడ్పడు చమసాధ్వర్యువులు అని భావము; తోమరాః - చిల్లకోల యను ఆయుధములు; సోమకలశాః - సోమరసమును తీసికొనెడు పాత్రములు; ధనూంషి - విండ్లు; పవిత్రాణి - సోమరసమును చిమ్ముట కుపయోగించు పాత్రలు - విండ్లు బాణములను విసరుట కుపయోగించిన విధముగా ఇవి సోమమును చిమ్ముటకు పనికి వచ్చునని సామ్యము.

కర్ణి, నాళీకము, నారాచము, వత్సదంతము అను బాణములు సోమ ద్రవ్యము చల్లునప్పటి పాత్రలగును. తోమరములు సోమరసము నింపిన కలశములు, విండ్లు పవిత్రములు అగును.

అసయోఽత్ర కపాలాని పురోడాశాః శిరాంసి చ,
హవిస్తు రుధిరం కృష్ణ తస్మిన్ యజ్ఞే భవిష్యతి. 39

కృష్ణా! ఆ యజ్ఞమున కత్తులు కపాలములు, తలలు పురోడాశములు, నెత్తురు హవిస్సు - అగును.

ఇధ్మాః పరిధయశ్చైవ శక్తయో విమలా గదాః,
సదస్యా ద్రోణశిష్యాశ్చ కృపస్య చ శరద్వతః. 40

సమిధలు శక్తులు, పరిధులు గదలు, సదస్యులు ద్రోణుని, కృపుని శిష్యులు.

ఇషవోఽత్ర పరిస్తోమా ముక్తా గాణ్డీవధన్వనా,
మహారథప్రయుక్తాశ్చ ద్రోణద్రౌణిప్రచోదితాః. 41

గాండీవము ధనువుగా గల అర్జునుడు ఇతర మహారథులు, ద్రోణుడు, అశ్వత్థామ మొదలగువారు వదలిన బాణము లీ యజ్ఞమున పరిస్తోమములు.

---

39. కపాలాని - పురోడాశమను వంటకమును వండు పాత్రలు; హవిః - సోమరసము; నెయ్యి - పాలు అను రూపముతో నున్న హోమద్రవ్యము.

40. ఇధ్మాః - అగ్నిని రగుల్కొలుపు కట్టెలు - సమిధ లందురు; యుద్ధమున ఉపయోగించు 'శక్తి' అను ఆయుధములు - ఆ సమిధలు; పరిధయః - అగ్నికి నలువైపుల హోమపదార్థములు చెదరిపోకుండుటకై నిలుపు కట్టెలు - వాని పనిని గదలు చేయునని తాత్పర్యము.

41. పరిస్తోమాః - సోమచమసము మొదలగునవి. ఇవి యజ్ఞము అంగములు చమసము - చతురస్రాకారముగ నుండు యజ్ఞపాత్ర.

ప్రతిప్రాస్థానికం కర్మ సాత్యకిస్తు కరిష్యతి,
దీక్షితో ధార్తరాష్ట్రో౽త్ర పత్నీ చాస్య మహాచమూః. 42

అధ్వర్యువు అనువాని వెంటనుండి ప్రతిప్రస్థానము అను కర్మమును చేయువాడు సాత్యకి. యజ్ఞదీక్ష గొన్నవాడు సుయోధనుడు. అతని కిం పత్ని మహాసేన.

ఘటోత్కచో౽త్ర శామిత్రం కరిష్యతి మహాబలః,
అతిరాత్రే మహాబాహో వితతే యజ్ఞకర్మణి. 43

అతిరాత్ర మను పెద్ద యజ్ఞకర్మమునందు గొప్పబలము గం. ఘటోత్కచుడు పశువధ గావించును.

దక్షిణా త్వస్య యజ్ఞస్య ధృష్టద్యుమ్నః ప్రతాపవాన్,
వైతానికే కర్మముఖే జాతో యత్కృష్ణ పావకాత్. 44

వైతానిక మను శ్రౌతయజ్ఞమున కర్మ మను బయలువెడలు ద్వారమున (యాజ్ఞికకర్మలద్వారా) అగ్నివలన పుట్టిన గొప్ప ప్రతాపముగల ధృష్టద్యుమ్నుడు ఈ యజ్ఞమున దక్షిణ.

---

42. ప్రతిప్రస్థాత అని యొక యజ్ఞనిర్వాహకుడు. అతడు 'అధ్వర్యువు' అను ఋత్విక్కునకు సహాయపడుచుండును - అతడు చేయుపని ప్రతిప్రాస్థానికము - ఆ పనిని కృష్ణుని తమ్ముడు సాత్యకి చేయునని భావము. కృష్ణుడు అధ్వర్యుస్థానీయుడు గదా! దీక్షితః - యజ్ఞదీక్ష కై కొన్న యజమానుడు; పత్నీ - యజమానుని ధర్మపత్ని.

43. అతిరాత్రే - అతిరాత్ర మను క్రతువునందు; శ్లేష వలన అర్ధరాత్రమునందు అనియు అర్థము. ఘటోత్కచుడు రాక్షసుడు కనుక రాత్రి సమయమున బలము పుంజుకొనును.

44. వైతానికే - వితాన మనగా అగ్నులను పరచుట; అందు ప్రసిద్ధి కెక్కినది వైతానికము - దానినే శ్రౌతయజ్ఞ మనియు నందురు; కర్మముఖే - కర్మ ద్వారమున; కర్మమే ముఖము - వెలువడు మార్గముగ గంది, (యజ్ఞకర్మ) పుట్టుక స్థానము కాదు - పావకాత్ - అగ్నివలన

య ద్బ్రువ మహం కృష్ణ కటుకాని స్మ పాణ్డవాన్,
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్యకర్మణా. 45

కృష్ణా! దుర్యోధనుని ప్రీతికై పాండవులను గూర్చి ఘాటైన మాటలు పలికితిని. ఆ నీచపు పనికి చింతించుచున్నాను.

యదా ద్రక్ష్యసి మాం కృష్ణ నిహతం సవ్యసాచినా,
పునశ్చిత్తి స్తదా చాస్య యజ్ఞ స్యాథ భవిష్యతి. 46

కృష్ణా! అర్జునుడు చావగొట్టిన నన్ను నీవు చూచిననాడు ఈ యజ్ఞమునకు 'పునశ్చిత్తి' అను కార్యము జరిగినట్లగును.

దుఃశాసనస్య రుధిరం యదా పాస్యతి పాణ్డవః,
ఆనర్దం నర్దతః సమ్యక్ తదా సూయం భవిష్యతి. 47

ఘోరముగా ఆర్తనాదము చేయు దుశ్శాసనుని రక్తమును భీముడు త్రాపునపుడు 'సూయ' మను కార్యము జరుగును.

యదా ద్రోణం చ భీష్మం చ పాఞ్చాల్యౌ పాతయిష్యతః,
తదా యజ్ఞావసానం తద్ భవిష్యతి జనార్దన. 48

పాంచాలరాజకుమారులు ధృష్టద్యుమ్నుడును, శిఖండియు ద్రోణుని, భీష్ముని కూల్చినపుడు జనార్దనా! ఈ యజ్ఞము అవసానము చెందును.

---

45. ఈ శ్లోకార్థమువలన కర్ణునకు పాండవులయందు నిగూఢముగా ప్రేమ కలదని తెలియుచున్నది.

46. పునశ్చిత్తిః - యజ్ఞము ముగిసిన పిమ్మట చేయు చయనారంభ మను కార్యము. దీనిని యజ్ఞవిశేషములలో చెప్పుదురు.

47. ఆనర్దమ్ నర్దతః - ఆర్తనాదము వెలువడునట్లు అరచుచున్న; సూయమ్-సోమమును త్రాపుట. దీని ముందొక పద ముండవలయును.రాజసూయము అన్నట్లు. కాని అట్లుండుట నిత్యము కాదు. లేదా ఇది ఆర్షప్రయోగము. సుత్య మనియు పాఠము.

48. యజ్ఞావసానమ్ - యజ్ఞమున మధ్య మధ్య చేయబడు ఆహుతుల.

దుర్యోధనం యదా హన్తా భీమసేనో మహాబలః,
తదా సమాప్స్యతే యజ్ఞో ధార్తరాష్ట్రస్య మాధవ. 49

మహాబలము గల భీముడు దుర్యోధనుని మట్టుపెట్టునపుడు ఈ ధృతరాష్ట్రి కుమారయజ్ఞము పరిసమాప్తి చెందును.

స్నుషాశ్చ ప్రస్నుషాశ్చైవ ధృతరాష్ట్రస్య సఙ్గతాః,
హతేశ్వరా నష్టపుత్రా హతనాథాశ్చ కేశవ. 50
రుదన్త్యః సహ గాన్ధార్యా శ్వగృధ్రకురరాకులే,
స యజ్ఞేఽస్మి న్నవభృథో భవిష్యతి జనార్దన. 51

దొరలు, కొడుకులు, మగలు చచ్చిన ధృతరాష్ట్రుని కొడుకుల కోడండ్రు-కోడండ్ర కోడండ్రు ఒక్కచో చేరి గాంధారితో పాటుకుక్కలు, గ్రద్దలు, గోరువంకలు విచ్చలవిడిగా తిరుగుచోట ఏడ్చుచు కన్నీట తడిసిపోవుదురు. అదియే యీ యజ్ఞమున అవభృథస్నాన మగును.

విద్యావృద్ధా వయోవృద్ధాః క్షత్రియాః క్షత్రియర్షభ,
వృథా మృత్యుం న కుర్వీరం స్త్వత్కృతే మధుసూదన. 52

విద్యలలో ఆరితేరినవారు, వయసుచే వృద్ధులు అగు క్షత్రియులు, కృష్ణా! నీవలన వ్యర్థమగు చావు చావకుందురుగాక!

శస్త్రేణ నిధనం గచ్ఛేద్ సమృద్ధం క్షత్రమణ్డలమ్,
కురుక్షేత్రే పుణ్యతమే త్రైలోక్యస్యాపి కేశవ. 53

---

50. ప్రస్నుషాః - కోడండ్ర కోడండ్రు; హత + ఈశ్వరాః - హతనాథాః - ఈశ్వరు లనగా దొరలు - రక్షించువారు; నాథు లనగా మగలు. దొరలు, మగలు చచ్చినవారు. నష్టపుత్రాః - కొడుకులను కోల్పోయినవారు.

51. రుదన్త్యః - కన్నీట దోగిన దేహములు గలవా రగుదురు; అదియే - అవభృథః - యజ్ఞము ముగిసిన పిదప పవిత్రస్నానము. కురరః - లకుముకిపిట్ట లేక గోరువంక లేక పెద్దపక్షి.

52. యుద్ధము మంచిదే యనుచున్నాడు. వృథా - వ్యర్థముగా - యుద్ధము చేయకుండ; మృత్యుం న కుర్వీరన్ - మరణము పొందకుందురుగాక: యుద్ధమున చచ్చుటయే క్షత్రియులకు ఉచితమైన దని భావము; త్వత్కృతే - నీకొరకు - నీవు శాంతిని సాధించినచో అది జరుగదు గదా అని భావము;

కృష్ణా! ముల్లోకమునను మిక్కిలి పుణ్యక్షేత్రమగు కురుక్షేత్రమున పెద్ద సంఖ్యలో ప్రోగుపడిన క్షత్రియుల సముదాయ మంతయు ఆయుధముతో మరణము పొందుగాక!

తదత్ర పుణ్డరీకాక్ష విధత్స్వ యదభీప్సితమ్,
యథా కార్త్స్న్యేన వార్ష్ణేయ క్షత్రం స్వర్గ మవాప్నుయాత్. 54

పుండరీకాక్షా! ఈ క్షత్రియుల సముదాయము మొత్తముగా స్వర్గము పొందు విధానమే కావింపుము. అదియే అందరి కోరిక.

యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ జనార్దన,
తావత్ కీర్తిభవః శబ్దః శాశ్వతోఽయం భవిష్యతి. 55

కొండలు, నదులు, నిలుచునంతకాలము ఈ కీర్తివలన పుట్టిన శబ్దము శాశ్వతముగా నిలుచును.

బ్రాహ్మణాః కథయిష్యన్తి మహాభారత మాహవమ్,
సమాగమేషు వార్ష్ణేయ క్షత్రియాణాం యశోధనమ్. 56

బ్రాహ్మణులు క్షత్రియులకు కీర్తిధనము కూర్చిన మహాభారతయుద్ధమును గూర్చి పదిమంది కూడినచోట చెప్పుదురు గాక!

సముపానయ కౌన్తేయం యుద్ధాయ మమ కేశవ,
మన్త్రసంవరణం కుర్వ న్నిత్యమేవ పరంతప. 57

కేశవా! శత్రుసంహారకా! ఎల్లవేళల ఈ రహస్యమును దాచి యుంచుచు కుంతికొడుకగు అర్జునుని నాతో పోరుటకు తెమ్ము.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కర్ణోపనివాదే ఏకచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున కర్ణుని అభిప్రాయ నివేదనము గల నూట నలుబది యొకటవ అధ్యాయము.

—: ० :—

56. సమాగమేషు - క్షత్రియులు యుద్ధమునకై మూగిన తావులలో-అనియు నర్థము. యశోధనమ్ - పరాక్రమముతో గెలుచుటయో లేక చచ్చుటయో యదియే క్షత్రియులకు ధనమని తాత్పర్యము.

# ద్విచత్వారింశదధికశతతమోఽధ్యాయః

# నూటనలుబదిరెండవ అధ్యాయము

### శ్రీకృష్ణేన కర్ణం ప్రతి పాణ్డవవిజయోఽవశ్యంభావీతి స్వమతస్య ప్రతిపాదనమ్.

### శ్రీకృష్ణుడు కర్ణునితో పాండవుల గెలుపు తప్పనిసరి యని తన అభిప్రాయమును నిరూపించుట.

సఞ్జయ ఉవాచ-సంజయు డిట్లు చెప్పెను.

కర్ణస్య వచనం శ్రుత్వా కేశవః పరవీరహా,
ఉవాచ ప్రహసన్ వాక్యం స్మితపూర్వ మిదం యథా. 1

కర్ణుని మాట విని పరవీరులను పరిమార్చు కేశవుడు పెద్దగా నవ్వి, నగు మోముతో ఇట్లు పలికెను.

శ్రీభగవా నువాచ - శ్రీభగవాను డిట్లు పలికెను.

అపి త్వాం న లభేత్ కర్ణ రాజ్యలంభోపపాదనమ్,
మయా దత్తాం హి పృథివీం న ప్రశాసితు మిచ్ఛసి. 2

కర్ణా! రాజ్యము పొందు ఉపాయము నిన్ను స్పృశింపకున్నది. నేనిచ్చిన భూమిని నీవేల కోరవు.

ధ్రువో జయః పాణ్డవానా మితీదం
న సంశయః కశ్చన విద్యతేఽత్ర.
జయధ్వజో దృశ్యతే పాణ్డవస్య
సముచ్ఛ్రితో వానరరాజ ఉగ్రః. 3

---

2. రాజ్య, లంభ-ఉపపాదనమ్ - రాజ్యమును పొందు ఉపాయము; త్వామ్-నిన్ను; న లభేత్ - తాకజాలకున్నది. రాజ్యమును నీవు నీదని భావింపకున్నావని భావము.

పాండవులకు జయము నిశ్చయము. ఇందు సంశయ మేదియు లేదు. పాండుకుమారుని భయంకరమగు కపికేతనము జయమును సూచించు ధ్వజముగా పైకి లేచి కానవచ్చుచున్నది.

దివ్యా మాయా విహితా భౌమనేన
సముచ్ఛ్రితా ఇన్ద్రకేతుప్రకాశా,
దివ్యాని భూతాని జయావహాని
దృశ్యన్తి చైవాత్ర భయానకాని. 4

విశ్వకర్మ దేవలోకపు మాయతో దేవేంద్రుని జెండావలె వెలుగొందునట్లు దీనిని ఏర్పరచెను. దీనియందు దేవలోకమునకు సంబంధించిన భూతములు వారికి జయమును, వీరికి భయమును కలిగించుచు చూచుచున్నవి.

న సజ్జతే శైలవనస్పతిభ్య
ఊర్ధ్వం తిర్య గ్యోజనమాత్రరూపః,
శ్రీమాన్ ధ్వజః కర్ణ ధనఞ్జయస్య
సముచ్ఛ్రితః పావకతుల్యరూపః. 5

పైకి లేచినదియు, అగ్నితో సమానమగు రూపము కలదియు, శోభలు గలదియు నగు అర్జునుని ధ్వజము పైకిని, అడ్డముగను యోజనము మేర వ్యాపించినదై కొండలకు, చెట్లకు తగుల్కొనకున్నది.

యదా ద్రక్ష్యసి సఙ్గ్రామే శ్వేతాశ్వం కృష్ణసారథిమ్,
ఐన్ద్ర మస్త్రం వికుర్వాణ ముభే చాప్యగ్నిమారుతే. 6
గాణ్డీవస్య చ నిర్ఘోషం విస్ఫూర్జిత మివాశనేః,
న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ. 7

---

4. భౌమనేన - విశ్వకర్మచేత; దృశ్యన్తి - చూచుచున్నవి. ఇది కర్మార్థక క్రియారూపము కాదు. స్వార్థమున యక్ ప్రత్యయము చేరగా నేర్పడిన రూపము - కండ్వాదిగణము ఆకృతిగణము కనుక 'దృశ్'ధాతువునకును ఆ ప్రత్యయము చేరుట కవకాశమున్నది.

6. అగ్నిమారుతే - ఆగ్నేయ, వాయవ్యాస్త్రములు.

7. కృతయుగమున అందరు కృతకృత్యులే - సాధింపవలసినది లేనివారే, కావున ధర్మము, అర్థము, కామము అని వాని అపేక్ష లేదు. త్రేతాయుగ

యుద్ధమున తెల్లని గుఱ్ఱములు కృష్ణుడను సారథియు గల అర్జునుడు ఇంద్రునికి, అగ్నికి, వాయువునకు సంబంధించిన అస్త్రములను గుప్పించు చుండగా పిడుగు మ్రోగినట్లు గాండీవమునుండి భయంకరనాదము వెలువడగా నీవు చూచునప్పుడు త్రేతయు, కృతమును, ద్వాపరమును కలుగవు.

యదా ద్రక్ష్యసి సంగ్రామే కున్తీపుత్రం యుధిష్ఠిరమ్,
జపహోమసమాయుక్తం స్వాం రక్షన్తం మహాచమూమ్. 8
ఆదిత్య మివ దుర్ధర్షం తపన్తం శత్రువాహినీమ్,
న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ. 9

కుంతికొడుకు యుధిష్ఠిరుడు యుద్ధభూమిలో జపములు, హోమములు చేయుచు తన గొప్పసేనను కాపాడుచు సూర్యునివలె తేరిపార జూడరానివాడై శత్రువుల సేనను మాడ్చివేయుచుండగా నీవు చూచినప్పుడు కృతము, త్రేత, ద్వాపరము కలుగవు.

యదా ద్రక్ష్యసి సంగ్రామే భీమసేనం మహాబలమ్,
దుఃశాసనస్య రుధిరం పీత్వా నృత్యన్త మాహవే. 10
ప్రభిన్న మివ మాతఙ్గం ప్రతిద్విరదఘాతినమ్,
న తదా భవితా త్రేతా న కృతం ద్వావరం న చ. 11

యుద్ధమున మహాబలుడగు భీమసేనుడు దుశ్శాసనుని నెత్తురు త్రావి యుద్ధ భూమిలో నృత్యము చేయుచు బాగుగా మదించిన ఏనుగు పోరవచ్చిన ఏనుగును చీల్చి చెండాడినట్లు విజృంభింపగా అప్పుడు కృత త్రేతా ద్వాపరములు కలుగవు.

---

మున ధర్మము ప్రధానముగా, అర్థకామములు దానికి సాధనములుగా జనులు కోరుట కలదు. ద్వాపరమున అర్థకామములు ప్రధానముగా ధర్మము వానికంగముగా జనులు కోరుదురు. ఇట్లు 'కృతం న భవితా'- అనుటచేత మోక్షమునుండి జారుపాటు 'న త్రేతా' అనుటవలన ధర్మము నుండి జారుపాటును చెప్పినట్లయినది. ఆ ధర్మభ్రష్టత దుర్యోధనాదు లందున్నదియే. 'ద్వాపరం న భవితా' అనుటవలన యుద్ధమున చావు తప్పదు కనుక వారికి అర్థకామములు కూడ సిద్ధింపవు - అని భావము.

యదా ద్రక్ష్యసి సంగ్రామే ద్రోణం శాన్తనవం కృపమ్,
సుయోధనం చ రాజానం సైన్ధవం చ జయద్రథమ్. 12
యుద్ధా యాపతత స్తూర్ణం వారితాన్ సవ్యసాచినా,
న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ. 13

యుద్ధమున ద్రోణుడు, భీష్ముడు, కృపుడు, రాజైన సుయోధనుడు, సింధురాజగు జయద్రథుడు పోరుటకై పైకి వచ్చిపడుచుండగా అర్జునుడు ఒక్క క్షణములో వారినందరిని నిలువరింపగా నీవు చూచునపుడు కృతత్రేతాద్వాపరములు గలుగవు.

యదా ద్రక్ష్యసి సఙ్గ్రామే మాద్రీపుత్రౌ మహాబలౌ,
వాహినీం ధార్తరాష్ట్రాణాం క్షోభయన్తౌ గజావివ. 14
విగాఢే శస్త్రసంపాతే పరవీరరథారుజౌ,
న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ. 15

గొప్ప బలము గల మాద్రికొడుకులు ధృతరాష్ట్రకుమారుల సేనను ఏనుగుల వలె మట్టగించుచుండగా, మిక్కిలి దట్టముగా బాణములను క్రుమ్మరించుచు శత్రువీరుల రథములను విరుగగొట్టుచుండగా నీవు చూచునపుడు కృతత్రేతా ద్వాపరములు కలుగవు.

బ్రూయాః కర్ణ ఇతో గత్వా ద్రోణం శాన్తనవం కృపమ్,
సౌమ్యోఽయం వర్తతే మాసః సుప్రాపయవసేన్ధనః. 16
సర్వౌషధివనస్ఫీతః ఫలవా నల్పమక్షికః,
నిష్పఙ్కో రసవత్తోయో నాత్యుష్ణశిశిరః సుఖః. 17

కర్ణా! ఇటనుండి వెళ్లి ద్రోణునికి, భీష్మునకు, కృపునకు చెప్పు. ఇదిగో వెన్నెలతో అందమైన మాసము గడచుచున్నది. గడ్డి, కట్టెలు చక్కగా తెచ్చుకొనదగు నెల. ఓషధు లన్నియు వెల్లివిరిసిన అడవులు పుష్టిగా నున్నవి. పండ్లు సమృద్ధిగా దొరకు కాలము. ఈగ లంతగా లేవు. బురద లేదు. రుచిగల నీరు లభించు సమయము. ఎక్కువవేడియు చలియు లేని సుఖమైన కాలము.

---

15. రథ + ఆరుజౌ - రథములను విరుగగొట్టువారు; విగాఢే - మిక్కిలి దట్టమయిన; శస్త్రసంపాతే-బాణముల క్రుమ్మరింతయందు;
16. సౌమ్యః - వెన్నెలతో అందమైనది.

సప్తమా చ్చాపి దివసా దమావాస్యా భవిష్యతి,
సంగ్రామో యుజ్యతాం తస్యాం తా మాహుః శక్రదేవతామ్. 18

నేటి కేడవదినము అమావాస్య. ఆ రోజున యుద్ధమునకు వలసినది సిద్ధము చేసికొనుడు. ఆ తిథికి ఇంద్రుడు దేవత యందురు.

తథా రాజ్ఞో వదేః సర్వాన్ యే యుద్ధాయాభ్యుపాగతాః,
యద్వో మనీషితం తద్వై సర్వం సమ్పాదయామ్యహమ్. 19

అట్లే యుద్ధమునకై వచ్చిన రాజులందరితో 'మీ మనస్సులోని కోరికను నేను తీర్తు'నని చెప్పుము.

రాజానో రాజపుత్రాశ్చ దుర్యోధనవశానుగాః,
ప్రాప్య శస్త్రేణ నిధనం ప్రాప్స్యన్తి గతి ముత్తమామ్. 20

దుర్యోధనుని చేతి కీలుబొమ్మలగు రాజులు, రాజపుత్రులు యుద్ధముతో చావు పొంది ఉత్తమగతి నందుదురు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కర్ణోపనివాదే భగవద్వాక్యే ద్విచత్వారింశదధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కర్ణునితో మంతనము లాడుటయందు భగవద్వాక్యముగల
నూటనలుబదిరెండవ అధ్యాయము.

—: o :—

18. సంగ్రామః - యుద్ధమునకు కావలసిన సాధనముల సముదాయము; యుజ్యతామ్ - కూర్చుకొనబడుగాక-సంగ్రామము మొదలగుట మరియొక నాడే యను విషయమును తరువాత నిరూపించుచున్నారు.

## త్రిచత్వారింశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదిమూడవ అధ్యాయము

**కర్ణేనాపి పాణ్డవవిజయకౌరవపరాజయసూచకానాం లక్షణానాం,**
**తాదృశస్యైవ స్వకీయస్వప్నస్య వర్ణనమ్.**

**కర్ణుడును పాండవవిజయమును, కౌరవుల ఓటమిని సూచించు లక్షణములను,**
**అట్టిదే యగు తన కలను వర్ణించుట.**

సఞ్జయ ఉవాచ-సంజయు డిట్లు చెప్పెను.

కేశవస్య తు తద్వాక్యం కర్ణః శ్రుత్వాఽఽహితః శుభమ్,
అబ్రవీ దభిసంపూజ్య కృష్ణం తం మధుసూదనమ్. 1

తనకు రాజ్యము నాశ చూపగా కర్ణు డా కృష్ణుని మాట విని ఆతనిని మిక్కిలి గౌరవించి యాతనితో నిట్లు పలికెను.

జానన్ మాం కిం మహాబాహో సంమోహయితు మిచ్ఛసి,
యోఽయం పృథివ్యాః కార్త్స్న్యేన వినాశః సముపస్థితః. 2
నిమిత్తం తత్ర శకుని రహం దుఃశాసన స్తథా,
దుర్యోధనశ్చ నృపతి ర్ధృతరాష్ట్రసుతోఽభవత్. 3

ఓ మహాబాహూ! ఎరిగి యెరిగి నన్నేల మోహపెట్టెదవు? ఈ నేల కంతకు మొత్తముగా మూడిన ఈ వినాశమునకు శకుని, నేను, దుశ్శాసనుడు ధృతరాష్ట్రుని కుమారుడును, రాజు నైన దుర్యోధనుడును కారణము.

అసంశయ మిదం కృష్ణ మహ ద్యుద్ధ ముపస్థితమ్,
పాణ్డవానాం కురూణాం చ ఘోరం రుధిరకర్దమమ్. 4

---

1. శుభమ్-రాజ్యము మున్నగు లాభమును; ఆహితః-ప్రవేశ పెట్టబడినవాడు-ప్రలోభ పెట్టబడినవా డని తాత్పర్యము.

కృష్ణా! పాండవులకు కౌరవులకును ఘోరమైన నెత్తురు బురదగా నగు గొప్ప యుద్ధ మిదిగో వచ్చిపడినది. సంశయము లేదు.

రాజానో రాజపుత్రాశ్చ దుర్యోధనవశానుగాః,
రణే శస్త్రాగ్నినా దగ్ధాః ప్రాప్స్యన్తి యమసాదనమ్. 5

దుర్యోధనుని చేతి కీలుబొమ్మలగు రాజులును, రాజపుత్రులును యుద్ధమున శస్త్రముల అగ్నికి మాడి మసియై యమపురమునకు చేరుకొందురు.

స్వప్నా హి బహవో ఘోరా దృశ్యన్తే మధుసూదన,
నిమిత్తాని చ ఘోరాణి తథోత్పాతాః సుదారుణాః. 6

పరమభయంకరములగు పీడకలలు, అశుభశకునములు, ఉత్పాతములు తోచుచున్నవి.

పరాజయం ధార్తరాష్ట్రే విజయం చ యుధిష్ఠిరే,
శంసన్త ఇవ వార్ష్ణేయ వివిధా రోమహర్షణాః. 7

దుర్యోధనునకు ఓటమిని, ధర్మరాజునకు విజయమును చెప్పుచున్నవో యన్నట్లు గగుర్పాటు పుట్టించు కలలు పెక్కుతీరుల కానవచ్చుచున్నవి.

ప్రాజాపత్యం హి నక్షత్రం గ్రహ స్తీక్ష్ణో మహాద్యుతిః,
శనైశ్చరః పీడయతి పీడయన్ ప్రాణినోఽధికమ్. 8

ప్రాజాపత్యనక్షత్రమును గొప్పవెలుగుగల తీక్ష్ణగ్రహము శని ప్రాణులను మిక్కిలిగా పీడించుచు, బాధించుచున్నది.

---

6. నిమిత్తము లనగా అశుభమును సూచించు పక్షుల జంతువుల అరపులు మొదలగునవి. ఉత్పాతము లనగా నక్షత్రములు రాలుట, ఎదురుగాలులు భయంకరముగా వీచుట, దిక్కులు రక్తము క్రక్కినట్లు కానవచ్చుట మొదలగునవి.

8. ప్రాజాపత్యమ్ - ప్రజాపతికి దక్షునికి సంబంధించిన దగు రోహిణీనక్షత్రమును; లేదా, ప్రజాపతి యనగా రాజైన దుర్యోధనుడు - అతని నామ నక్షత్రము - ఉత్తరాభాద్ర-దానిని; శనైశ్చరః - శనిగ్రహము; పీడయతి - పీడించుచున్నది; ప్రాణినః - ప్రాణులను. అధికమ్-మిక్కిలిగా;

కృత్వా చాఙ్గారకో వక్రం జ్యేష్ఠాయాం మధుసూదన,
అనూరాధాం ప్రార్థయతే మైత్రం సంగమయ న్నివ. 9

అంగారకగ్రహము జ్యేష్ఠయందు వంకరగా నడచుచు, మిత్రుల సముదాయమును పరిమార్చుచు, అనూరాధానక్షత్రమును చేరుకొనుచున్నది.

నూనం మహ ద్భయం కృష్ణ కురూణాం సముపస్థితమ్,
విశేషేణ హి వార్ష్ణేయ చిత్రాం పీడయతే గ్రహః. 10

కృష్ణా! కౌరవులకు మహాభయము దాపురించినది. నిక్కము. ఏలయన గ్రహము విశేషముగా చిత్రానక్షత్రమును పీడించుచున్నది.

సోమస్య లక్ష్మ వ్యావృత్తం రాహు రర్క ముపైతి చ,
దివ శ్చోల్కాః పత న్త్యేతాః సనిర్ఘాతాః సకమ్పనాః. 11

---

పీడయన్ - పీడించుచు - రాజు పీడ నొందినచో ప్రజలందరు పీడ నొందుదురని భావము; లేదా, పృథ్వీకూర్మము (?) కడుపులో నున్న రోహిణిని శని పీడించును. దానిచేత మధ్యదేశమున గొప్ప వినాశము సంఘటిల్లును. రాజుకు నష్టమని చెప్పుదురు.

9. కుజుడు జ్యేష్ఠానక్షత్రమును దరిజేరక వక్రగతి కలవాడైనచో జ్యేష్ఠుడగు రాజునకు శత్రువులందరు నశింతురని భావము; మైత్రమ్ - మిత్రుల సముదాయమును, సంగమయన్ - నాశనము చేయుచు; "వైవస్వతం సంగమనం జనానామ్" మొదలగు తావులందు 'సమ్'తో కూడిన 'గమ్' ధాతువునకు మారణార్థము కన్పట్టుచున్నది.

10. గ్రహః చిత్రాం పీడయతే - మహాపాతకను ఉత్పాతము జ్యోతిశ్శాస్త్రములలో ప్రసిద్ధము. అందు 'రా' అను అక్షరమునకు వేధ యగుటవలన రాజజాతివారికి నాశనము కలుగునని భావము.

11. సోమస్య - చంద్రుని; లక్ష్మ - గుర్తు, వ్యావృత్తమ్ - మరలిపోయినది; క్షీణించుటవలనను, అమావాస్య దగ్గరగా నుండుట వలనను అని భావము - క్షీణచంద్రుడు సూర్యునితో కలిసినపుడు, ఆ యిరువురకు శత్రువగు రాహువు సూర్యుని సమీపించినచో అట్టిదానిని కర్తరీయోగ మందురు. అట్టి యోగమునందు సూర్యచంద్రవంశముల రాజులకు అరిష్టము కలుగునని నమ్మకము.

చంద్రుని రేఖయు మరలిపోయినది. రాహువు సూర్యుని దరిజేరుచున్నాడు. ఆకసమునుండి ఉల్కలు, పిడుగులతో భూకంపములు కలుగునట్టు, ఇవిగో, పడుచున్నవి.

నిష్టనన్తి చ మాతఙ్గా ముఞ్చ న్త్యశ్రూణి వాజినః,
పానీయం యవసం చాపి నాభినన్దన్తి మాధవ. 12

ఏనుగులు బొబ్బలిడుచున్నవి. గుఱ్ఱములు కన్నీరు కార్చుచున్నవి. మాధవా! అవి నీరు త్రాగుట లేదు. గడ్డి తినుట లేదు.

ప్రాదుర్భూతేషు చైతేషు భయ మాహు రుపస్థితమ్,
నిమిత్తేషు మహాబాహో దారుణం ప్రాణినాశనమ్. 13

ఇట్టి మహాఘోరములగు నిమిత్తములు పుట్టినపుడు ప్రాణులను రూపుమాపు భయము దాపురించినదని చెప్పుదురు.

అల్పే భుక్తే పురీషం చ ప్రభూత మిహ దృశ్యతే,
వాజినాం వారణానాం చ మనుష్యాణాం చ కేశవ. 14

గుఱ్ఱములకు, ఏనుగులకు, మనుష్యులకును తిండి కొంచెమును, మలము ఎక్కువగను కన్పట్టుచున్నది.

ధార్తరాష్ట్రస్య సైన్యేషు సర్వేషు మధుసూదన,
పరాభవస్య తల్లిఙ్గ మితి ప్రాహు ర్మనీషిణః. 15

ధృతరాష్ట్రునికి సంబంధించిన సైన్యము అన్నింటియందును గోచరించు ఆ లక్షణము ఓటమికి గుర్తని బుద్ధిమంతు లందురు.

ప్రహృష్టం వాహనం కృష్ణ పాణ్డవానాం ప్రచక్షతే,
ప్రదక్షిణా మృగా శ్చైవ త త్తేషాం జయలక్షణమ్. 16

పాండవుల గుఱ్ఱములు మొదలగునవి ఉత్సాహముతో పొంగిపోవుచున్న వని అనుకొనుచున్నారు. అచట మృగములు ప్రదక్షిణముగా తిరుగుచున్నవి. అది వారికి జయమును సూచించుచున్నది.

అపసవ్యా మృగాః సర్వే ధార్తరాష్ట్రస్య కేశవ,
వాచ శ్చాప్యశరీరిణ్యా స్తత్ పరాభవలక్షణమ్. 17

ధృతరాష్ట్రుని కొడుకు కడ మృగము లన్నియు అప్రదక్షిణముగా తిరుగు చున్నవి. శరీరము లేని మాట లేవో వినవచ్చుచున్నవి. అది ఓటమికి గుర్తు.

మయూరాః పుణ్యశకునా హంస-సారస-చాతకాః,
జీవంజీవకసంఘాశ్చా వ్యనుగచ్ఛన్తి పాణ్డవాన్. 18

నెమళ్లు, పుణ్యలక్షణములు గల హంసలు బెగ్గురుపక్షులు, చాతకములు, వెన్నెలపిట్టల గుంపులు పాండవుల కడ చక్కగా తిరుగుచున్నవి.

గృధ్రాః కఙ్కా బకాః శ్యేనా యాతుధానా స్తథా వృకాః,
మక్షికాణాం చ సఙ్ఘాతా అనుధావన్తి కౌరవాన్. 19

గ్రద్దలు, రాబందులు, కొంగలు, డేగలు, రక్కసులు, తోడేళ్లు, ఈగల గుంపులు కౌరవులవైపు పరుగులెత్తి వచ్చుచున్నవి.

ధార్తరాష్ట్రస్య సైన్యేషు భేరీణాం నాస్తి నిఃస్వనః,
అనాహతాః పాణ్డవానాం నదన్తి పటహాః కిల. 20

దుర్యోధనుని సేనలయందు భేరులమ్రోతయే లేదు. పాండవుల తప్పెటలు మ్రోగింపకయే నాదము చేయుచున్నవట!

ఉదపానాశ్చ నర్దన్తి యథా గోవృషభా స్తథా,
ధార్తరాష్ట్రస్య సైన్యేషు తత్ పరాభవలక్షణమ్. 21

దుర్యోధనుని సేనలుండు తావులందలి బావులు మొదలగునవి ఆవులు; ఎద్దులు రంకెలు వేయుచున్నప్పటి చప్పుళ్ళను వెలువరించుచున్నవి.

---

18. పుణ్యశకునాః - శుభలక్షణములుగల పక్షులు; హంసలు మొదలగునవి; పుణ్యశకునము లనగా 'కోళ్లు' అనియు నర్థము; జీవంజీవకసంఘాః - వెన్నెలపులుగుల గుంపులు - ఇవి 'జీవ జీవ' అని అరచుచుండును. 'జీవ' అనగా బ్రదుకుము అని యర్థము.

19. బకాః అనుదానికి బలాః అని పాఠాంతరము-అప్పుడు కాకులని యర్థము,

21. ఉదపానాః - బావులు మొదలగు జలాశయములు;

మాంసశోణితవర్షం చ వృష్టం దేవేన మాధవ,
తథా గన్ధర్వనగరం భానుమత్ సముపస్థితమ్, 22
సప్రాకారం సపరిఖం సవప్రం చారుతోరణమ్.

వానదేవుడు మాంసమును రక్తమును గురిసెను. అట్లే సూర్యునిచుట్టు గుడి యేర్పడినది. అది ప్రాకారముతో, అగడ్తతో, కోటతో, అందమైన తోరణములతో కూడి కానవచ్చుచున్నది.

కృష్ణశ్చ పరిఘ స్తత్ర భానుమావృత్య తిష్ఠతి. 23
ఉదయాస్తమనే సన్ధ్యే వేదయన్తి మహద్భయమ్,
శివా చ వాశతే ఘోరం తత్ పరాభవలక్షణమ్. 24

ఆ గుడికి పైని సూర్యునిచుట్టి నల్లని రేఖ యేర్పడినది. ఉదయసాయంకాలములసంధ్యలు గొప్ప భీతిని సూచించుచున్నవి. నక్క భయంకరముగా ఊళవేయుచున్నది. అది ఓటమిని సూచించును.

ఏకపక్షాక్షిచరణాః పక్షిణో మధుసూదన,
ఉత్సృజన్తి మహద్ ఘోరం తత్ పరాభవలక్షణమ్. 25

ఒక రెక్క, ఒక కన్ను, ఒక కాలు గల పక్షులు ఏవ గొలుపునట్లుగా రెట్టలు వేయుచున్నవి. అది ఓటమికి గుర్తు.

కృష్ణగ్రీవాశ్చ శకునా రక్తపాదా భయానకాః,
సన్ధ్యా మభిముఖా యాన్తి తత్ పరాభవలక్షణమ్. 26

నల్లని మెడ, ఎర్రని కాళ్ళు గల భయముగొలుపు పక్షులు సంజకెదురుగా పోవుచున్నవి. అది ఓటమికి గుర్తు.

---

22. గన్ధర్వనగరమ్ - ఆకాశమున మేఘములు పట్టణమువలె కానవచ్చు దృశ్యము- అది ప్రాకారాదులతో కానవచ్చుచున్నదని తరువాతి శ్లోకము మొదటి పాదమును కలుపుకొని చెప్పుకొనవలయును.
23. పరిఘః - పరివేషము -గుడి.
24. శివా - ఆడునక్క, వాశతే - ఊళవేయుచున్నది.
25. ఉత్సృజన్తి - వదలుచున్నవి - మలమూత్రములనని భావము.

బ్రాహ్మణాన్ ప్రథమం ద్వేష్టి గురూంశ్చ మధుసూదన,
భృత్యాన్ భక్తిమత శ్చాపి తత్ పరాభవలక్షణమ్. 27

నరుడు ముందు బ్రహ్మవేత్తలను ద్వేషించును. అట్లే గురువులను, తన యెడ భక్తిగల సేవకులను ద్వేషించును. అది ఓటమి చిహ్నము.

పూర్వా దిగ్ లోహితాకారా శస్త్రవర్ణా చ దక్షిణా,
ఆమపాత్రప్రతీకాశా పశ్చిమా మధుసూదన,
ఉత్తరా శంఖవర్ణాభా దిశాం వర్ణా ఉదాహృతాః. 28

తూర్పు దిక్కు ఎఱ్ఱనివన్నె కలది యనియు, దక్షిణదిక్కు ఇనుము రంగుగలది యనియు, పడమరదిక్కు పచ్చికుండ వంటి రంగుగలది యనియు ఉత్తరదిక్కు శంఖమువన్నె వంటి వన్నెకలది యనియు దిక్కుల రంగులను చెప్పుదురు.

ప్రదీప్తాశ్చ దిశః సర్వా ధార్తరాష్ట్రస్య మాధవ,
మహ ద్భయం వేదయన్తి తస్మి న్నుత్పాతదర్శనే. 29

దుర్యోధనుని రాష్ట్రమున దిక్కులన్నియు మండిపోవుచున్నట్లు కానవచ్చుచు, ఆ ఉత్పాతము కంటబడగా గొప్ప కీడేదో మూడనున్నదని తెలుపుచున్నవి.

సహస్రపాదం ప్రాసాదం స్వప్నాన్తే స్మ యుధిష్ఠిరః,
అధిరోహ న్మయా దృష్టః సహ భ్రాతృభి రచ్యుత. 30

అచ్యుతా ! యుధిష్ఠిరుడు తమ్ములతో పాటు వేయిస్తంభముల భవనము నెక్కుచు నాకు కల ముగియుచుండగా కానవచ్చెను.

శ్వేతోష్ణీషాశ్చ దృశ్యన్తే సర్వే వై శుక్లవాససః,
ఆసనాని చ శుభ్రాణి సర్వేషా ముపలక్షయే. 31

---

27. ద్వేష్టి - పోగాలము దాపురించినవాడు బ్రాహ్మణాదులను ద్వేషించునని సామాన్యార్థమును గ్రహింపవచ్చును. లేదా, దుర్యోధనుడు ద్వేషించుచున్నాడని చెప్పుకొనవచ్చును.

28. శస్త్రమ్ - ఇనుము, ఆమపాత్రమ్ - కాల్పనికుండ.

ఆ పాండవు లందరు తెల్లని తలపాగాలతో తెల్లని వస్త్రములు ధరించి కానవచ్చిరి. వారందరి ఆసనములు శుభ్రములై యుండగా చూచితిని.

తవ చాపి మయా కృష్ణ స్వప్నాన్తే రుధిరావిలా,
అన్త్రేణ పృథివీ దృష్టా పరిక్షిప్తా జనార్దన. 32

కృష్ణా! కలలో నీ శరీరము రక్తపు మరకలతో ఆయుధములు చుట్టి యుండగా నాకు కానవచ్చినది.

అస్థిసంచయ మారూఢ శ్చామితౌజా యుధిష్ఠిరః,
సువర్ణపాత్ర్యాం సంహృష్టో భుక్తవాన్ ఘృతపాయసమ్. 33

గొప్ప ఉత్సాహముగల యుధిష్ఠిరుడు ఎముకలగుట్ట నెక్కి పిక్కటిల్లిన ఆనందముతో బంగారు గిన్నెలో నేతి పాయసము తినెను.

యుధిష్ఠిరో మయా దృష్టో గ్రసమానో వసున్ధరామ్,
త్వయా దత్తా మిమాం వ్యక్తం భోక్ష్యతే స వసున్ధరామ్. 34

నీ వొసగిన మట్టిని తినుచు ధర్మరాజు నాకు కానవచ్చెను. అతడు ఈ భూమి నంతటిని అనుభవించునని యిది తెలియజేయుచున్నది.

ఉచ్చం పర్వత మారూఢో భీమకర్మా వృకోదరః,
గదాపాణి ర్నరవ్యాఘ్రో గ్రసన్నివ మహీ మిమామ్. 35

భయంకరమగు చేష్టలు గల పురుషవరేణ్యుడు భీమసేనుడు గద చేబట్టి పెద్దకొండ ఎక్కి యీ భూమి నంతటిని మ్రింగివేయుచున్నట్లు కానవచ్చెను.

క్షపయిష్యతి నః సర్వాన్ స సువ్యక్తం మహారణే,
విదితం మే హృషీకేశ యతో ధర్మ స్తతో జయః. 36

---

32. తవ, పృథివీ - అని అన్వయము - నీ దేహము అని అర్థము. పరిక్షిప్తా- చుట్టబడినదై;

34. వసున్ధరామ్, గ్రసమానః - మట్టిని తినుచు. వ్యక్తమ్ - స్పష్టము; సః - అతడు; వసున్ధరామ్ - భూమిని; భోక్ష్యతే - అనుభవింపగలడు.

అతడు మహాయుద్ధమున మమ్ము లందరను రూపుమాపు నని దీనివలన చక్కగా తెలియుచున్నది. కృష్ణా! ఎచట ధర్మముండునో అచట జయము కల్గు నని నే నెరుగుదును.

పాణ్డురం గజ మారూఢో గాణ్డీవీ స ధనఞ్జయః,
త్వయా సార్ధం హృషీకేశ శ్రియా పరమయా జ్వలన్. 37

గాండీవము చేతబట్టిన ధనంజయుడు నీతోపాటుగ గొప్పశోభతో వెలుగొందుచు తెల్లని ఏనుగు నెక్కి కానవచ్చెను.

యూయం సర్వే వధిష్యధ్వం తత్ర మే నాస్తి సంశయః,
పార్థివాన్ సమరే కృష్ణ దుర్యోధనపురోగమాన్. 38

కృష్ణా! దుర్యోధనుడు మొదలైన రాజుల నందరిని యుద్ధమున మీరందరు చంపుదురు. అందు నాకు సంశయము లేదు.

నకులః సహదేవశ్చ సాత్యకిశ్చ మహారథః,
శుక్లకేయూరకణ్ఠత్రాః శుక్లమాల్యాంబరావృతాః. 39
అధిరూఢా నరవ్యాఘ్రా నరవాహన ముత్తమమ్,
త్రయ ఏతే మయా దృష్టాః పాణ్డురచ్ఛత్రవాససః. 40

నకులుడు, సహదేవుడును, మహారథుడగు సాత్యకియు తెల్లని కేయూరములు, కంఠభూషణములు, మాల్యములు, వస్త్రములు ధరించి గొప్ప నరవాహనము నెక్కి తెల్లని గొడుగు, వస్త్రములు తాల్చి నాకు కానవచ్చిరి.

శ్వేతోష్ణీషాశ్చ దృశ్యన్తే త్రయ ఏతే జనార్దన.

జనార్దనా! ఈ ముగ్గురు తెల్లని తలపాగలతో కానవచ్చుచున్నారు.

ధార్తరాష్ట్రేషు సైన్యేషు తాన్ విజానీహి కేశవ. 41

ఇక దుర్యోధనుని సేనలయందున్నవారిని గూర్చి చెప్పెదను. వినుము.

---

39. శుక్లకేయూరకణ్ఠత్రాః - శుక్ల - తెల్లని, కేయూర - బాహుపురులు, కణ్ఠత్రాః - కంఠత్రము అను ఆభరణములు కలవారు - తలపై నుండి భుజములపరకు వ్రేలాడు ఒకవిధమగు ఆభరణమును కంఠత్ర మందురు.

అశ్వత్థామా కృపశ్చైవ కృతవర్మా చ సాత్వతః,
రక్తోష్ణీషాశ్చ దృశ్యన్తే సర్వే మాధవ పార్థివాః. 42

మాధవా! అశ్వత్థామ, కృపుడు, కృతవర్మయు, తక్కినరాజు లందరును ఎఱ్ఱని తలపాగలతో కానవచ్చుచున్నారు.

ఉష్ట్రప్రయుక్త మారూఢౌ భీష్మద్రోణౌ మహారథౌ,
మయా సార్ధం మహాబాహో ధార్తరాష్ట్రేణ వా విభో. 43

మహారథులగు భీష్మద్రోణులు నాతోడనో దుర్యోధనునితోడనో కలసి ఒంటెలు పూన్చిన బండి నెక్కి కానవచ్చిరి.

అగస్త్యశాస్తాం చ దిశం ప్రయాతాః స్మ జనార్దన,
అచిరేణైవ కాలేన ప్రాప్స్యామో యమసాదనమ్. 44

అగస్త్యుడు శాసించినదగు దక్షిణదిక్కునకు మేమందరము ప్రయాణము చేయుచుంటిమి. కొలదికాలములోనే మేమందరము యముని లోకమునకు చేరుకొందుము.

అహం చాన్యే చ రాజానో యచ్చ తత్ క్షత్రమణ్డలమ్,
గాణ్డీవాగ్నిం ప్రవేక్ష్యామ ఇతి మే నాస్తి సంశయః. 45

నేనును, రాజులును, తక్కిన క్షత్రియుల సముదాయ మంతయును గాండీవము మంటలో చొచ్చెదము. ఇందు నాకు సంశయము లేదు.

కృష్ణ ఉవాచ - కృష్ణు డిట్లు పలికెను.

ఉపస్థితవినాశేయం నూన మద్య వసున్ధరా,
యథా హి మే వచః కర్ణ నోపైతి హృదయం తవ. 46

కర్ణా! నీ హృదయము నా మాటను గ్రహింపకున్నది. ఈ భూమికి నేడు ఇదిగో వినాశము దాపురించినది.

సర్వేషాం తాత భూతానాం వినాశే ప్రత్యుపస్థితే,
అనయో నయసంకాశో హృదయా న్నాపసర్పతి. 47

బాబూ! ప్రాణు లన్నింటికి చావు దాపురించిన సమయమున అవినీతి కూడ నీతివలె కన్పట్టుచు గుండెనుండి తొలగిపోవదు.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.

అపి త్వాం కృష్ణ పశ్యామ జీవన్తోఽస్మా న్మహారణాత్,
సముత్తీర్ణా మహాబాహో వీరక్షత్రవినాశనాత్. 48

---

46. హృదయమ్ - ఇది కర్తృపదము; నోపైతి - అంగీకరింపకున్నది.

కృష్ణా! వీరులగు క్షత్రియులను రూపుమాపు ఈ మహాయుద్ధమునుండి బయటపడి నిన్ను మరల చూతుమా ?

అథవా సఙ్గమః కృష్ణ స్వర్గే నో భవితా ధ్రువమ్,
తత్రేదానీం సమేష్యామః పునః సార్ధం త్వయాఽనఘ. 49

లేదా కృష్ణా! స్వర్గమున మనకు తప్పక కలయిక కలుగును. అం దిప్పటి వలె మరల నిన్ను మేమందరము కలియుదుము.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా మాధవం కర్ణః పరిష్వజ్య చ పీడితమ్,
విసర్జితః కేశవేన రథోపస్థా దవాతరత్. 50

కర్ణు డిట్లు పలికి కృష్ణుని బిగియార కౌగిలించుకొని అతనికడ సెలవు గైకొని రథమునుండి దిగెను.

తతః స్వరథ మాస్థాయ జామ్బూనదవిభూషితమ్,
సహాస్మాభి ర్నివవృతే రాధేయో దీనమానసః. 51

పిదప రాధేయుడు దిగులు పడిన మనస్సుతో తన బంగారురథ మెక్కి మాతోపాటు వెనుదిరిగెను.

తతః శీఘ్రతరం ప్రాయాత్ కేశవః సహ సాత్యకిః,
పున రుచ్చారయన్ వాణీం యాహి యాహీతి సారథిమ్. 52

అంత కేశవుడు పద పద అనుచు సారథిని హెచ్చరించుచు సాత్యకితో పాటు బయలుదేరెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి కర్ణోపనివాదే కృష్ణకర్ణసంవాదే త్రిచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున కర్ణుని విడదీయు ప్రయత్నమునందు కృష్ణకర్ణసంవాదము గల నూటనలువదిమూడవ అధ్యాయము.

—: ౦ :—

50. పీడితం, పరిష్వజ్య - నొప్పిపుట్టునట్లు కౌగిలించుకొని - గట్టి ప్రేమతో కౌగిలించుకొని - యని భావము.

# చతుశ్చత్వారింశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదినాలుగవ అధ్యాయము

**విదురవార్తా మాకర్ణ్య భావినా యుద్ధదుష్పరిణామేన వ్యథితాయాః**
**కున్త్యా శ్చిరం విచార్య కర్ణసమీపే గమనమ్.**
**విదురునినుండి వార్త విని జరుగబోవు యుద్ధము కీడునకు**
**కుమిలిపోయిన కుంతి పెద్దయుం బ్రొద్దు చింతించి కర్ణునికడ కరుగుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

అసిద్ధానునయే కృష్ణే కురుభ్యః పాణ్డవాన్ గతే,
అభిగమ్య పృథాం క్షత్తా శనైః శోచ న్నివాబ్రవీత్. 1

కృష్ణుడు కౌరవులయెడ తన మంచిమాటలు ఫలింపక పాండవులకడ కరుగగా ఒకనాడు విదురుడు కుంతికడకు వచ్చి విచారించుచు మెల్లగా నిట్లనెను.

జానాసి మే జీవపుత్రి భావం నిత్య మవిగ్రహే,
క్రోశతో న చ గృహ్ణీతే వచనం మే సుయోధనః. 2

జీవపుత్రీ! కుంతీదేవీ! యుద్ధము కాకుండ చేయవలయునను నా భావము నీ వెరుగుదువు. ఆ దుర్యోధనుడు నేనెంత మొత్తుకున్నను నామాట పట్టించుకొనకున్నాడు.

ఉపపన్నో హ్యసౌ రాజా చేదిపాఞ్చాలకేకయైః,
భీమార్జునాభ్యాం కృష్ణేన యుయుధానయమై రపి. 3
ఉపప్లవ్యే నివిష్టోఽపి ధర్మ మేవ యుధిష్ఠిరః,
కాఙ్క్షతే జ్ఞాతిసౌహార్దాద్ బలవాన్ దుర్బలో యథా. 4

---

1. అసిద్ధానునయే-ఫలించని, మంచిమాటలు గలవాడు కాగా;
2. జీవపుత్రీ - బ్రదికియున్న కొడుకులు గలది.

ఈ రాజు యుధిష్ఠిరుడు చేది, పాంచాల, కేకయ రాజులతో, భీమార్జునులతో, కృష్ణునితో, సాత్యకితో, నకులసహదేవులతో గూడి ఉపప్లవ్యమున బలముగల వాడై యుండియు జ్ఞాతులయందలి స్నేహమువలన, సత్తువలేని వానివలె ధర్మమునే కాంక్షించుచున్నాడు.

రాజా తు ధృతరాష్ట్రోఽయం వయోవృద్ధో న శామ్యతి,
మత్తః పుత్రమదే నైవ విధర్మే పథి వర్తతే. 5

ఇక ఈ రాజు ధృతరాష్ట్రుడన్ననో వయసు పైబడ్డ ముదుసలియయ్యును, కొడుకులున్న పొంగుతో ఒడలెరుగక, అధర్మమార్గమున బోవుచున్నాడు. శాంతి కోరకున్నాడు.

జయద్రథస్య కర్ణస్య తథా దుఃశాసనస్య చ,
సౌబలస్య చ దుర్బుద్ధ్యా మిథో భేదః ప్రవత్స్యసే. 6

జయద్రథుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని అనువారల పాడుబుద్ధినే పాటిగా బట్టి విడిపోవుటకే సిద్ధపడుచున్నాడు.

అధర్మేణ హి ధర్మిష్ఠం కృతం వైకార్య మీదృశమ్,
యేషాం తేషా మయం ధర్మః సానుబన్ధో భవిష్యతి. 7

అధర్మముతో చేసిన ఇట్టి పాడుపని వారికి గొప్ప ధర్మముగనే కానవచ్చుచున్నది. వారి ధర్మము తొందరలో ఫలమునకు రాగలదు.

---

7. యేషామ్ - ఎవరికి; అధర్మేణ - అధర్మముతో కృతమపి - చేయబడినదయ్యు; ఈదృశమ్ - ఇట్టి, వైకార్యమ్ - వికారమును పుట్టించుపని - వైరము; - పదునాలుగవయేట మీరు రాజ్యము పొందుదురని చెప్పి యిప్పుడు అట్లు చేయకుండుట - అనునది; ధర్మిష్ఠమ్ - ధర్మయుక్తముగనే - భాసించుచున్నదో - తేషామ్ - అట్టివారి, అయం ధర్మః - ఈ ధర్మము; సానుబన్ధః - సఫలము, భవిష్యతి - కాగలదు - ధార్తరాష్ట్రులు అధర్మమును ధర్మముగా తలచుచున్నారు. అట్టి అధర్మఫలితమగు వినాశనమును కొలదికాలములోనే అనుభవింతురని భావము.

క్రియమాణే బలాద్ధర్మే కురుభిః కో న సంజ్వరేత్,
అసామ్నా కేశవే యాతే సముద్యోక్ష్యన్తి పాణ్డవాః. 8

కౌరవులు బలాత్కారముగా అధర్మమును ధర్మము చేయుదురేని ఎవ్వడు దుఃఖపడడు? కృష్ణుడు సామము ఫలింపక తిరిగిపోయెను. ఇక పాండవులు యుద్ధమునకు సిద్ధపడుదురు.

తతః కురూణా మనయో భవితా వీరనాశనః,
చిన్తయ న్న లభే నిద్రా మహఃసు చ నిశాసు చ. 9

అంతట కౌరవులకు వీరులందరు చచ్చు కీడు మూడును. దీనినే తలపోయుచున్న నాకు రేయింబవళ్ళు నిద్రపట్టకున్నది.

శ్రుత్వా తు కున్తీ తద్వాక్య మర్థకామేన భాషితమ్,
సా నిఃశ్వసన్తీ దుఃఖార్తా మనసా విమమర్శ హ. 10

అందరకు హితము కోరు విదురు డిట్లు పలుకగా ఆ మాట విని కుంతి నిట్టూర్పులు పుచ్చుచు, లోలోపల కుమిలిపోవుచు నిట్లాలోచించెను.

ధిగ స్త్వర్థం యత్కృతేఽయం మహాన్ జ్ఞాతివధః కృతః,
వర్త్స్యతే సుహృదాం చైవ యుద్ధేఽస్మిన్ వై పరాభవః. 11

ఛీ! ధన మెంత నీచమైనది! దీనికొఱకే గదా యింతగా బంధువుల వధ జరుగనున్నది. ఈ యుద్ధమున మేలుకోరువారికిని పరాభవము ఏర్పడును.

పాణ్డవా శ్చేదిపాఞ్చాలా యాదవాశ్చ సమాగతాః,
భారతైః సహ యోత్స్యన్తి కిం ను దుఃఖ మతఃపరమ్. 12

---

8. క్రియమాణే బలాద్ధర్మే - నీతినియమములు లేనివారు పరుల భార్యలతో రమించుచు జారపురుష సంతోషము కలుగుచున్నది కావున అట్టిది ధర్మమే యందురు. కాని అది శాస్త్రము ననుసరించి ధర్మము కాదు. అట్లే కౌరవులు పాండవులకు రాజ్య మీక చెప్పు సాకులన్నియు పైకి ధర్మములుగా అనిపించినను ధర్మములు కాజాలవని తాత్పర్యము.

10. అర్థకామేన - హితము కోరునట్టి;

11. కృతః - చేయబడినది - ఇంకను జ్ఞాతివధము జరుగకున్నను నిశ్చయముగా జరుగును గనుక జరిగినట్లే యని భావము.

పాండవులు, చేదిరాజులు, పాంచాలురు, యాదవులు ఒక్కటియై భరత కులము వారితో పోరుదురు. ఇంతకు మించిన దుఃఖ మేముండును?

పశ్యే దోషం ధ్రువం యుద్ధే తథాఽయుద్ధే పరాభవమ్,
అధనస్య మృతం శ్రేయో న హి జ్ఞాతిక్షయో జయః. 13

యుద్ధమున నిక్కముగా దోషము కానవచ్చుచున్నది. అట్లని యుద్ధము వలదన్నచో పరాభవము కలుగును. దరిద్రునకు చావే మేలు. కాని జ్ఞాతులు ఛావగా నగునది గెలుపు కాదు.

ఇతి మే చిన్తయన్త్యా వై హృది దుఃఖం ప్రవర్తతే.

ఇట్లు తలచుకొనుచుండగా నా హృదయమున దుఃఖము నిండిపోవుచున్నది.

పితామహః శాన్తనవ ఆచార్యశ్చ యుధాం పతిః. 14
కర్ణశ్చ ధార్తరాష్ట్రార్థం వర్ధయన్తి భయం మమ.

తాతయగు భీష్ముడు యుద్ధములలో నాయకుడగు ద్రోణాచార్యుడు, కర్ణుడు, దుర్యోధనునికై పోరుచు నా భయమును మరింత పెంచుచున్నారు.

నాచార్యః కామవాన్ శిష్యై ర్ద్రోణో యుధ్యేత జాతుచిత్, 15
పాణ్డవేషు కథం హార్దం కుర్యా న్న చ పితామహః.

ద్రోణాచార్యుడు ఎన్నటికిని గెలుపొందనే వలయునన్న కోరికతో శిష్యులతో పోరడు. తాత పాండవులయందు మెత్తని మనసు పెట్టక యెట్లుండును?

అయం త్వేకో వృథాదృష్టి ర్ధార్తరాష్ట్రస్య దుర్మతేః, 16
మోహానువర్తీ సతతం పాపో ద్వేష్టి చ పాణ్డవాన్.

ఈ కర్ణు డొక్కడు మాత్రము పనికిమాలిన తలపులతో దుష్టబుద్ధి యగు దుర్యోధనుని అజ్ఞానము వెంటబడి పోవుచున్నాడు. ఎప్పుడు పాపములే చేయును. మరియు పాండవులను ద్వేషించును.

---

13. పశ్యే - పశ్యామి - ఆత్మనేపదప్రయోగము ఆర్షము. అయుద్ధే-యుద్ధము కానిచో.

15. కామవాన్ -(జయించు) కోరికగలవాడై; దుర్యోధనుని ఇచ్చకమునకై ఏదో యుద్ధముచేయును గాని గెలిచితీరవలయునన్న పట్టుదలతో పోరడని భావము;

మహత్యనర్థే నిర్బన్ధీ బలవాంశ్చ విశేషతః, 17
కర్ణః సదా పాణ్డవానాం తన్మే దహతి సమ్ప్రతి.

పాండవులకు గొప్పకీడు కలుగవలయునని పట్టుపట్టి యున్నాడు. మీదు మిక్కిలి బలవంతుడు. అది యిప్పుడు నన్ను కాల్చివేయుచున్నది.

ఆశంసే త్వద్య కర్ణస్య మనోఽహం పాణ్డవాన్ ప్రతి, 18
ప్రసాదయితు మాసాద్య దర్శయన్తీ యథాతథమ్.

నేడు నేను కర్ణుని మనస్సు పాండవుల యెడ ప్రసన్నమగుటకై ఏదో మార్గమున ఆతనికి కానబడి చెప్పుదును.

తోషితో భగవాన్ యత్ర దుర్వాసా మే వరం దదౌ, 19
ఆహ్వానం మన్త్రసంయుక్తం వసన్త్యాః పితృవేశ్మని.

నేను తండ్రి యింట నున్ననాడు సంతోషించిన దుర్వాసుడను భగవానుడు నాకు మంత్రపూర్వకముగా దేవతల నాహ్వానించుట యను వర మొసగెను.

సాఽహ మన్తఃపురే రాజ్ఞః కున్తిభోజపురస్కృతా, 20
చిన్తయన్తీ బహువిధం హృదయేన విదూయతా.

కుంతిభోజమహారాజు అంతఃపురమున మన్నన లొందుచున్న నేను త్రొక్కిసలాడుచున్న మనస్సుతో పెక్కువిధముల చింతించుచు నుంటిని.

బలాబలం చ మన్త్రాణాం బ్రాహ్మణస్య చ వాగ్బలమ్, 21
స్త్రీభావా ద్బాలభావాచ్చ చిన్తయన్తీ పునః పునః.

స్త్రీని అగుటవలనను, పిన్నతనమువలనను మంత్రములకు బలము కలదా? లేదా? బ్రాహ్మణుని వాక్కుబల మెట్టిది? అను వానిని గురించి పలు విధముల చింతించుచుంటిని.

ధాత్ర్యా విస్రబ్ధయా గుప్తా సఖీజనవృతా తదా, 22
దోషం పరిహరన్తీ చ పితు శ్చారిత్ర్యరక్షిణీ.

నమ్మకముగల దాది నన్ను కాపాడినది. సఖులు నన్ను క్రమ్ముకొనిరి. తండ్రి కీర్తిని కాపాడుచు దోషము బయటపడకుండ చూచుకొంటిని.

కథం న సుకృతం మే స్యా న్నాపరాధవతీ కథమ్, 23
భవేయ మితి సంచిన్త్య బ్రాహ్మణం తం నమస్య చ,
కౌతూహలాత్తు తం లబ్ధ్వా బాలిశ్యా దాచరం తదా,
కన్యా సతీ దేవ మర్క మాసాదయ మహం తతః. 24

నాకు పుణ్య మెట్లు కలుగదు? నేను తప్పుచేసినదాన నెట్లు కాకుందును? అని తలపోయుచు ఆ బ్రాహ్మణునకు నమస్కరించి ఏమగునో చూత మని ఆ మంత్రమును పొంది పిల్లచేష్టగా దేవత నాహ్వానించితిని. కన్య నైన నేను దానివలన సూర్యుని రప్పించుకొంటిని.

యోఽసౌ కానీనగర్భో మే పుత్రవత్ పరిరక్షితః,
కస్మాన్న కుర్యా ద్వచనం పథ్యం భ్రాతృహితం తథా. 25

వాడే కానీనుడుగా నా కడుపున పుట్టిన యీ కర్ణుడు. కొడుకువలెనే యిన్నాళ్ళు చూచుకొనుచుంటిని. అట్టివాడు నేను చెప్పెడు మేలుమాటను, తమ్ము లకు హితమైన దానిని ఏల చేయకుండును?

ఇతి కున్తీ వినిశ్చిత్య కార్యనిశ్చయ ముత్తమమ్,
కార్యార్థ మభినిశ్చిత్య యయౌ భాగీరథీం ప్రతి. 26

ఇట్లు కుంతి చేయదగిన మంచిపనిని గూర్చి ఆలోచించి, అది తప్పక చేయదగినపనిగా నిర్ణయించి గంగయొద్దను కరిగెను.

ఆత్మజస్య తత స్తస్య ఘృణినః సత్యసఙ్గినః,
గఙ్గాతీరే పృథాఽశ్రౌషీ ద్వేదాధ్యయననిఃస్వనమ్. 27

దయగలవాడు, ప్రతిజ్ఞ తప్పనివాడు అగు తన కొడుకు గంగయొద్దున వేదము చదువుచున్న నాదమును కుంతి వినెను.

---

24. ఆచరమ్ - దేవత నాహ్వానించుటను, చేసితిని, ఆసాదయమ్ - పొందితిని;
25. పుత్రవత్ పరిరక్షితః - వాడెక్కడ నున్నను 'కొడుకు' అనెడు మమ కారము తోడనే వాని యోగక్షేమములు కాంక్షించితి నని భావము. దీనికి "కామం చ పరివాసితః" అని పాఠాంతరము. అప్పుడు చేతులార వదలు కొంటి నని అర్థము.

ప్రాఙ్ముఖ స్యోర్ధ్వబాహోః సా పర్యతిష్ఠత పృష్ఠతః,
జప్యావసానం కార్యార్థం ప్రతీక్షన్తీ తపస్వినీ. 28

తూర్పునకు మొగముపెట్టి చేతులు పైకెత్తి నిలుచున్న కర్ణుని వెనుక వైపున నిలబడి ఆ దీనురాలు జపము ముగియుటను, తనపని నెరవేరుటను ఎదురు చూచుచు ఉండెను.

అతిష్ఠత్ సూర్యతాపార్తా కర్ణ స్యోత్తరవాససి,
కౌరవ్యపత్నీ వార్ష్ణేయీ పద్మమాలేవ శుష్యతీ. 29

సూర్యుని వేడిమికి కందిపోవుచు ఆ పాండుని పత్ని వృష్ణివంశమువారి ఆడు పడుచు తామరతీగవలె వాడిపోవుచు కర్ణుని ఉత్తరీయపునీడలో నిలబడియుండెను.

ఆపృష్ఠతాపా జ్జప్త్వా స పరివృత్య యతవ్రతః,
దృష్ట్వా కున్తీ ముపాతిష్ఠ దభివాద్య కృతాఞ్జలిః. 30

వ్రతనిష్ఠగల ఆ కర్ణుడు వెన్ను వేడియెక్కువరకు జపముచేసి వెనుదిరిగి కుంతిని చూచి చేతులు మోడ్చి మ్రొక్కి నిలుచుండెను.

యథాన్యాయం మహాతేజా మానీ ధర్మభృతాం వరః,
ఉత్స్మయన్ ప్రణతః ప్రాహ కున్తీం వైకర్తనో వృషః. 31

గొప్ప తేజస్సు, అభిమానము గలవాడు, ధర్మమును పాటించువారిలో ఉత్తముడు నగు కర్ణుడు న్యాయము ననుసరించి ఆమెకు నమస్కరించి ఆశ్చర్య పడుచు నిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి కున్తీకర్ణసమాగమే చతుశ్చత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున కుంతీకర్ణుల కలయిక గల నూటనలుబదినాల్గవ అధ్యాయము.

—: ౦ :—

29. ఉత్తరవాససి - ఉత్తరీయవస్త్రపు నీడయందు.

30. ఆపృష్ఠతాపాత్ - వెన్నుభాగము వేడి యెక్కువరకు అనగా - సూర్యుడు వీపు వైపునకు వచ్చువరకు - అపరాహ్ణమువరకు - అని భావము.

31. వైకర్తనః - వికర్తనుని - సూర్యుని - కొడుకు; వృషః - కర్ణుడు; ఉత్స్మయన్-ఆశ్చర్యపడుచు. వృష ఆనునది కర్ణునకు మరియొక పేరు.

## పఞ్చచత్వారింశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదియైదవ అధ్యాయము

కున్త్యాః కర్ణం ప్రతి త్వం మే పుత్రోఽసీతి
నివేద్య పాణ్డవపక్షే సమ్మిలితు మాగ్రహః.

కుంతి కర్ణునితో నీవు నాకొడుకవని తెలిపి
పాండవులతో కలియుమని నిర్బంధించుట.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.

రాధేయోఽహ మాధిరథిః కర్ణ స్త్వా మభివాదయే,
ప్రాప్తా కిమర్థం భవతీ బ్రూహి కిం కరవాణి తే. 1

రాధ కొడుకను, అధిరథుని పుత్రుడను కర్ణుడను నీకు మ్రొక్కుచున్నాను. పూజ్యురాలా! ఏమిపనికై వచ్చితివి? నీకు నేనేమి చేయవలయునో తెలుపుము.

కున్త్యువాచ - కుంతి యిట్లు పలికెను.

కౌన్తేయ స్త్వం న రాధేయో న తవాధిరథః పితా,
నాసి సూతకులే జాతః కర్ణ తద్విద్ధి మే వచః. 2

కర్ణా! నీవు కుంతి కుమారుడవు. రాధకొడుకవు కావు. నీ తండ్రి అధిరథుడు కాడు. నీవు సూతకులమున పుట్టినవాడవు కావు. నా మాట వినుము.

కానీన స్త్వం మయా జాతః పూర్వజః కుక్షిణా ధృతః,
కున్తిరాజస్య భవనే పార్థ స్త్వమసి పుత్రక. 3

నాయనా! నేను కన్యగా నున్నపుడు నీవు నాకు కుంతిభోజు నింట పుట్టితివి. నిన్ను కడుపున పెట్టుకొని మోసితిని. నీవు పృథకుమారుడవురా!

---

1. అధిరథిః- అధిరథుడను వాని కొడుకు; భవతీ - పూజ్యురాలు - నీవు అని భావము.

ప్రకాశకర్మా తపనో యోఽయం దేవో విరోచనః,
అజీజన త్త్వాం మయ్యేష కర్ణ శస్త్రభృతాం వరమ్. 4

కర్ణా! లోకములకు వెలుగునిచ్చు ఈ సూర్యదేవుడు ఆయుధధారులలో శ్రేష్ఠుడవగు నిన్ను నాయందు కనెను.

కుణ్డలీ బద్ధకవచో దేవగర్భః శ్రియా వృతః,
జాత స్త్వమసి దుర్ధర్ష మయా పుత్ర పితు ర్గృహే. 5

నీవు నా తండ్రియింట కుండలములతో కవచములతో దేవగర్భుడవై మహాశోభతో వెలుగొందుచు నాకు పుట్టితివి.

స త్వం భ్రాతౄ నసంబుద్ధ్య మోహా ద్యదుపసేవసే,
ధార్తరాష్ట్రా న్న తద్యుక్తం త్వయి పుత్ర విశేషతః. 6

అట్టి నీవు నీ తమ్ములను ఎరుగక మోహమువలన ధృతరాష్ట్రుని కుమారులను కొలుచుచున్నావు. కొడుకా! నీకిది బొత్తుగా తగని పని.

ఏతద్ధర్మఫలం పుత్ర నరాణాం ధర్మనిశ్చయే,
యత్తుష్య న్త్యస్య పితరో మాతా చాప్యేకదర్శినీ. 7

కుమారా! కొడుకుమీదనే ప్రాణములు నిలుపుకొన్న తల్లిని, తండ్రితాతలను సంతోషపెట్టుటయే ధర్మనిర్ణయవిషయమున ధర్మఫలము.

అర్జునే నార్జితాం పూర్వం హృతాం లోభా దసాధుభిః,
ఆచ్ఛిద్య ధార్తరాష్ట్రేభ్యో భుఙ్క్ష్వ యౌధిష్ఠిరీం శ్రియమ్. 8

మునుపు అర్జునుడు సంపాదించినది దుష్టులగు ధృతరాష్ట్రకుమారులు పేరాసతో కొల్లగొట్టినదియగు ధర్మరాజు సంపదను మరల సాధించి అనుభవింపుము.

అద్య పశ్యన్తు కురవః కర్ణార్జునసమాగమమ్,
సౌభ్రాత్రేణ సమాలక్ష్య సంనమన్తా మసాధవః. 9

---

5. దేవగర్భః - దేవతాజాతికి చెందిన సూర్యుని బీజమువలన పుట్టినవాడవని తాత్పర్యము.

7. ఏకదర్శినీ - ఒక్కనినే - కొడుకునే - స్నేహముతో చూచినది.

9. సంనమన్తామ్ - క్రుంగిపోదురు గాక.

నేడు అన్నదమ్ముల ప్రేమతో కర్ణార్జునులు పొందిన కలయికను కౌరవులు చూతురు. అది గాంచి దుష్టులు క్రుంగిపోవుదురుగాక!

కర్ణార్జునౌ వై భవేతాం యథా రామజనార్దనౌ,
అసాధ్యం కిం ను లోకే స్యా ద్యువయోః సహితాత్మనోః. 10

మనసులు కలిసిన కర్ణార్జునులు మీరిద్దరు బలరామకృష్ణులవలె పెంపొందితిరేని మీకు లోకమున సాధింపరాని దేముండును?

కర్ణ శోభిష్యసే నూనం పఞ్చభి ర్భ్రాతృభి ర్వృతః,
దేవైః పరివృతో బ్రహ్మ వేద్యా మివ మహాధ్వరే. 11

గొప్ప యజ్ఞమున వేదికపై దేవతలు కొలిచియున్న బ్రహ్మవలె నీవు అయిదుగురు తమ్ములతో కూడి, కర్ణా! తప్పక శోభిల్లుదువు.

ఉపపన్నో గుణై స్సర్వై ర్జ్యేష్ఠః శ్రేష్ఠేషు బన్ధుషు,
సూతపుత్రేతి మా శబ్దః పార్థ స్త్వమసి వీర్యవాన్. 12

మంచి గుణములన్నియు గలవాడవు. మొదటి కుమారుడవు. పేరెన్నిక గన్న చుట్టములలో నీకు సూతపుత్రుడను పేరు రాకుండు గాక ! నీవు పృథ కుమారుడవు. గొప్పశక్తి గలవాడవు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
పఞ్చచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కుంతీకర్ణుల సమావేశముగల నూటనలుబదియైదవ అధ్యాయము.

—: o :—

---

10. భవేతామ్ - పెంపొందితిరేని; సహితాత్మనోః-మనసులు కలసినవారై;
12. మా - మా భూత్ - కలుగకుండుగాక - 'సూతుని కొడుకు' అనుమాట లోకమున కలుగకుండుగాక అని భావము.

## షట్చత్వారింశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదియారవ అధ్యాయము

**కర్ణస్య కున్తీం ప్రత్యుత్తర మర్జునం విహాయ అన్యాం శ్చతురః పాణ్డవాన్ న హనిష్యామీతి ప్రతిజ్ఞా చ.**

**కర్ణుడు కుంతికి బదులుచెప్పుట, అర్జునుడు కాక తక్కిన నలువురు పాండవులను చంపనని మాటయిచ్చుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః సూర్యా న్నిశ్చరితాం కర్ణః శుశ్రావ భారతీమ్,
దురత్యయాం ప్రణయినీం పితృవద్భాస్కరేరితామ్. 1

అంత సూర్యునినుండి వెలువడినదియు, దాటరానిదియు, ప్రేమతో నిండినదియు, తండ్రివలె బుజ్జగించుచు సూర్యుడు పలికినదియు నగు వాక్యము కర్ణునకు వినబడెను.

సత్య మాహ పృథా వాక్యం కర్ణ మాతృవచః కురు,
శ్రేయ స్తే స్యా న్నరవ్యాఘ్ర సర్వ మాచరత స్తథా. 2

కర్ణా! పురుషవరా! కుంతి నిజమాడెను. తల్లి చెప్పినట్లు చేయుము. ఆమె చెప్పినట్లు అంతయు చేసినచో నీకు మేలగును.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తస్య మాత్రా చ స్వయం పిత్రా చ భానునా,
చచాల నైవ కర్ణస్య మతిః సత్యధృతే స్తదా. 3

ఇట్లు తల్లియు స్వయముగా తండ్రియైన సూర్యుడును చెప్పినను సత్యమున పట్టుగల కర్ణుని మది కదలనే లేదు.

కర్ణ ఉవాచ-కర్ణు డిట్లు పలికెను.

న చైత చ్ఛ్రద్ధధే వాక్యం క్షత్రియే భాషితం త్వయా,
ధర్మద్వారం యమైతత్ స్యాన్నియోగకరణం తవ. 4

ఓ క్షత్రియకాంతా! నీ వాడిన మాట నేను మనసున పెట్టను. నీవు చెప్పినట్లు చేయుట నాకు ధర్మము జారిపోవు దారి యగును.

అకరో న్మయి యత్ పాపం భవతీ సుమహాత్యయమ్,
అపాకీర్ణోఽస్మి యన్మాత స్తద్యశః కీర్తినాశనమ్. 5

పూజ్యులారా! నీవు నాయందు చేసిన పాపము మిక్కిలి ఘోరమైనది. తల్లీ! నన్ను దిక్కుమాలినవానిగా చేసివైచితివి. అది యశస్సును కీర్తిని చంపివైచు నట్టిది.

అహం చేత్ క్షత్రియో జాతో న ప్రాప్తః క్షత్రసత్క్రియామ్,
త్వత్కృతే కిం ను పాపీయః శత్రుః కుర్యా న్మమాహితమ్. 6

నేను క్షత్రియుడనై పుట్టియున్నచో నాకు క్షత్రియ సంస్కారము జరుగ లేదు కదా! నీవలన కలిగిన యీ కీడుకంటె మించిన దానిని ఏ శత్రువు నాకు చేయజాలును?

---

4. న శ్రద్దధే - చేయవలసినపనిగా నేను తలంపోయను. ధర్మద్వారమ్ - ధర్మము జారిపోవు దారి; తవ-నీ; నియోగకరణమ్ -అజ్ఞను పాటించుట.

5. సుమహాత్యయమ్-మిక్కిలి గొప్ప వినాశము-జాతి నాశనమగుట యగునది-కలది. నీవు చేసిన పనివలన నాకు క్షత్రియజాతిత్వము నశించుట యను ఘోరకష్టము కలిగినదని భావము; యశః -మహాత్ముడను ఖ్యాతి; కీర్తిః-అట్టి ఖ్యాతిని సత్పురుషులు కొనియాడుట; అపాకీర్ణః-వదలిపెట్టబడినవాడు;

6. త్వత్కృతే - నీ సుఖముకొరకు. కన్యకు అయిన గర్భము లోకము తెలియకుండుగాక అను కారణమున నీవు నాకు క్షత్రియసంస్కారము కావింపక పోతివి. అట్టి నీకంటె మించిన శత్రు వెవరు? దీనికంటె మిగిలిన కీడు నాకెట్టిది? ఇంతకు మించిన పాపము నాకు చేయగలవా డెవడుండును? అని శ్లోకతాత్పర్యము.

క్రియాకాలే త్వనుక్రోశ మకృత్వా త్వమిమం మమ,
హీనసంస్కారసమయ మద్య మాం సమచూచుదః. 7

సంస్కారకాలమున నాయందు ఇప్పటి దయ లేకపైతివి. హీనమంపు సంస్కారము పొందిన నన్నినాడు నీపనికై ప్రేరణ చేయుచున్నావు.

న వై మమ హితం పూర్వం మాతృవచ్చేష్టితం త్వయా,
సా మాం సంబోధయస్యద్య కేవలాత్మహితైషిణీ. 8

నిజముగా నీవాడు తల్లివలె నాయందు హిత మొనరింపలేదు. నేడు కేవలము నీ మేలు కోరుకొనుచు నాకు బోధ చేయుచున్నావు.

కృష్ణేన సహితాత్ కో వై న వ్యథేత ధనఞ్జయాత్,
కో ఽద్య భీతం న మాం విద్యాత్ పార్థానాం సమితిం గతమ్. 9

కృష్ణునితో కూడిన ధనంజయునివలన వ్యథ నందనివా డెవ్వడు? కుంతి కొడుకులతో పోరవచ్చినవేళ నేను అటువైపు చేరినచో నన్ను పిరికివా డన కుందురా?

అభ్రాతా విదితః పూర్వం యుద్ధకాలే ప్రకాశితః,
పాణ్డవాన్ యది గచ్ఛామి కిం మాం క్షత్రం వదిష్యతి. 10

మునుపు నాకు తమ్ములు లేరని లోక మెరుగును. ఇప్పుడు యుద్ధకాలమున తమ్ము లున్నట్లు వెల్లడి చేసికొని నేను పాండవులతో కలసినచో నన్ను క్షత్రియు లందురు?

సర్వకామైః సంవిభక్తః పూజితశ్చ యథాసుఖమ్,
అహం వై ధార్తరాష్ట్రాణాం కుర్యాం తదఫలం కథమ్. 11

ధృతరాష్ట్రుని కొడుకులు నన్ను లా మనుభవించు సుఖము లన్నింటిలో భాగస్వామిని చేసిరి. నన్ను సుఖము చెడకుండ మన్నించిరి. దాని నెట్లు నిష్ఫల మొనర్తును?

---

7. క్రియాకాలే - క్షత్రియులకు ఉచితమగు సంస్కారము చేయవలసినవేళ; అనుక్రోశమ్ - దయను. సమచూచుదః - పనికై ప్రేరణ చేసితివి;

ఉపనహ్య పరై ర్వైరం యే మాం నిత్య ముపాసతే,
నమస్కుర్వ న్తి చ సదా వసవో వాసవం యథా. 12

ఆ ధృతరాష్ట్రసుతులు పరులతో వైరము పెట్టుకొని నన్ను ప్రతిక్షణము కొలుచుచున్నారు. వసువులు దేవేంద్రునకువలె ఎల్లవేళల నాకు మ్రొక్కుచున్నారు.

మమ ప్రాణేన యే శత్రూన్ శక్తాః ప్రతిసమాసితుమ్,
మన్య న్తే తే కథం తేషా మహం ఛిన్ద్యాం మనోరథమ్. 13

నా బలముతో వారు శత్రువులను గెలువగలమని తలపోయుచున్నారు. అట్టి వారి కోరికను నేనెట్లు త్రుంచివేయగలను ?

మయా ప్లవేన సఙ్గ్రామం తితీర్ష న్తి దురత్యయమ్,
అపారే పారకామా యే త్యజేయం తానహం కథమ్. 14

నేను తెప్పగా దాటరాని యుద్ధమును దాటగోరుచున్నారు. ఒడ్డు దొరకని దశలో ఒడ్డుకు చేరగోరు వారిని నేనెట్లు వదలివైతును ?

అయం హి కాలః సంప్రాప్తో ధార్తరాష్ట్రోపజీవినామ్,
నిర్వేష్టవ్యం మయా తత్ర ప్రాణా నపరిరక్షతా. 15

దుర్యోధనుని ఉప్పు తిని బ్రదుకువారికి ఇదిగో తగిన సమయ మాసన్నమైనది. అందు నేను ప్రాణములను కూడ లెక్కచేయక అప్పు తీర్చుకొనవలయును.

కృతార్థాః సుభృతా యే హి కృత్యకాలే హ్యుపస్థితే,
అనవేక్ష్య కృతం పాపా వికుర్వ న్త్యనవస్థితాః. 16

---

12. ఉపనహ్య - కట్టి - గట్టిగా పట్టుకొని యని భావము;
13. ప్రాణేన - బలముతో; ప్రతిసమాసితుమ్ - గెలుచుటకు;
14. దురత్యయమ్ - దాటరాని; పారకామాః - ఒడ్డునకు చేరగోరువారు - నేనిప్పుడు మీ వైపునకు వచ్చినచో వారు నడిసముద్రమున దిక్కులేక మునిగిపోవుదురని భావము;
15. నిర్వేష్టవ్యమ్ - వారు పెట్టిన అన్నమునకు ఋణము తీర్చుకొనవలయునని భావము.

రాజకిల్బిషిణాం తేషాం భర్తృపిణ్డాపహారిణామ్,
నైవాయం న పరో లోకో విద్యతే పాపకర్మణామ్. 17

రాజువలన మేలు పొంది తగిన సమయము వచ్చినపుడు పొందిన మేలు గుర్తింపక యిటు నటు ఊగులాడుచు నీచకార్యము లాచరించు పాపులకు, రాజద్రోహులకు, ప్రభువు కూడు కొల్లగొట్టువారికి, పాపకర్ములకు ఈ లోకము గాని పరలోకము గాని లేదు.

ధృతరాష్ట్రస్య పుత్రాణా మర్థే యోత్స్యామి తే సుతైః,
బలం చ శక్తిం చాస్థాయ న వై త్వయ్యనృతం వదే. 18

నా బలమును శక్తిని కూడగట్టుకొని ధృతరాష్ట్రుని కొడుకులకై నీ కొడుకులతో పోరెదను. నీతో కల్లలాడజాలను.

ఆనృశంస్య మథో వృత్తం రక్షన్ సత్పురుషోచితమ్,
అతోఽర్థకర మప్యేత న్న కరోమ్యద్య తే వచః. 19

సత్పురుషులకు తగిన క్రూరము కాని నడవడిని కాపాడుచు, నీవు చెప్పినది నాకు ప్రయోజనమును కూర్చునదైనను, నీ మాటను పాటింపజాలను.

న చ తేఽయం సమారమ్భో మయి మోఘో భవిష్యతి,
వధ్యాన్ విషహ్యాన్ సఙ్గ్రామే న హనిష్యామి తే సుతాన్. 20
యుధిష్ఠిరం చ భీమం చ యమౌ చైవార్జునా దృతే,
అర్జునేన సమం యుద్ధ మపి యౌధిష్ఠిరే బలే. 21

కాని నా విషయమున నీ యీ ప్రయత్నము వ్యర్థము కారాదు. ధర్మరాజు, భీముడు, కవలలు యుద్ధమున నాకు చంపదగినవా రయ్యును చంపుటకు దొరకినపుడు వారిని చంపను. అర్జునుని మాత్రము వదలను. ధర్మరాజు సేనలో నాకు దీటైన యుద్ధము అనుర్జునితోడిదే.

---

19. ఆనృశంస్యమ్ - క్రూరముకానితనము. అర్థకరమ్, అపి - ప్రయోజనము కూర్చునదైనను.

20. వధ్యాన్ - చంపదగినవారిని; విషహ్యాన్ - చేజిక్కినపుడు చంపుటకు వీలైనవారిని;

21. యౌధిష్ఠిరే - యుధిష్ఠిరునికి సంబంధించిన.

అర్జునం హి నిహత్యాజౌ సంప్రాప్తం స్యాత్ ఫలం మయా,
యశసా చాపి యుజ్యేయం నిహతః సవ్యసాచినా. 22

యుద్ధమున అర్జునుని చంపినచో నాకు ఫలము సిద్ధించినట్లే. కాక సవ్యసాచిచేత చత్తునేని కీర్తి దక్కును.

న తే జాతు న శిష్యన్తి పుత్రాః పఞ్చ యశస్విని,
నిరర్జునాః సకర్ణా వా సార్జునా వా హతే మయి. 23

యశస్వినీ! అర్జునుడు చావగా కర్ణునితో పాటు అయిదుగురో, నేను చావగా అర్జునునితో పాటు అయిదుగురో కొడుకులు మాత్రమే నీకు ఎన్నటికైన మిగులుదురు.

ఇతి కర్ణవచః శ్రుత్వా కున్తీ దుఃఖాత్ ప్రవేపతీ,
ఉవాచ పుత్ర మాశ్లిష్య కర్ణం ధైర్యా దకమ్పనమ్. 24

ఆ మాట విని ధైర్యమునుండి సడలకున్న కర్ణుని కౌగిలించుకొని దుఃఖముతో ఊగిపోవుచున్న కుంతి యిట్లు పలికెను.

ఏవం వై భావ్య మేతేన క్షయం యాస్యన్తి కౌరవాః,
యథా త్వం భాషసే కర్ణ దైవం తు బలవత్తరమ్. 25

కర్ణా! నీవు పలికినట్లే కానిమ్ము. దీనితో కౌరవులు నశింతురు. దైవము బలవత్తర మైనది గదా!

త్వయా చతుర్ణాం భ్రాతౄణా మభయం శత్రుకర్శన,
దత్తం తత్ ప్రతిజానీహి సంగరప్రతిమోచనమ్. 26

యుద్ధమున నీ చేతికి దొరికినపుడు వదలివైతునని నీ నలుగురు తమ్ములకు అభయ మొసగితివి. దానిని మరువకుము.

అనామయం స్వస్తి చేతి పృథాఽథో కర్ణ మబ్రవీత్,
తాం కర్ణోఽథ తథేత్యుక్త్వా తత స్తౌ జగ్మతుః పృథక్. 27

నీకు సుఖ మగుగాక, స్వస్తి అని కుంతి కర్ణునితో పలికెను. కర్ణుడును ఆమెతో అట్లే పలికెను. పిదప ఎవరిత్రోవను వారు పోయిరి.

---

23. న శిష్యన్తి ఇతి న-మిగులరని లేదు. తప్పక మిగులుదురని భావము;

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కున్తీకర్ణసమాగమే షట్చత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కుంతీకర్ణుల కలయిక కల నూటనలువదియారవ అధ్యాయము.

—:o:—

---

* ధర్మాధర్మౌ న త్యజతో ధర్మాధర్మైకసంశ్రయౌ,
ప్రార్థితా వపి పిత్రాద్యైః కర్ణదుర్యోధనావివ.

ధర్మమునో అధర్మమునో - ఒకదానిని అంటిపెట్టుకొన్నవారు తండ్రి మొదలగువారు వేడుకొన్నను కర్ణదుర్యోధనులవలె ధర్మమును గాని, అధర్మమును గాని వదలిపెట్టరు' - అని యీ కథాభాగము మొత్తమునకు తాత్పర్యము.

# సప్తచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

# నూటనలుబదియేడవ అధ్యాయము.

### యుధిష్ఠిరేణ పృష్టేన శ్రీకృష్ణేన కౌరవసభాయా ముక్తానాం భీష్మవచనానాం శ్రవణమ్.

### యుధిష్ఠిరు డడుగగా శ్రీకృష్ణుడు కౌరవసభలో పలికిన భీష్ముని మాటలను వినిపించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఆగమ్య హాస్తినపురా దుపప్లవ్య మరిందమః,
పాణ్డవానాం యథావృత్తం కేశవః సర్వ ముక్తవాన్. 1

హస్తినాపురమునుండి ఉపప్లవ్యమునకు తిరిగివచ్చి శ్రీకృష్ణుడు పాండవులకు జరిగినదంతయు వివరించెను.

సంభాష్య సుచిరం కాలం మన్త్రయిత్వా పునః పునః,
స్వమేవ భవనం శౌరి ర్విశ్రామార్థం జగామ హ. 2

చాలసేపు ముచ్చటలాడి వెళ్ళివత్తునని మరల మరల పలికి అలసత తీర్చుకొనుటకై కృష్ణుడు తన భవనమున కరిగెను.

విసృజ్య సర్వా న్నృపతీన్ విరాటప్రముఖాం స్తదా,
పాణ్డవా భ్రాతరః పఞ్చ భానా వస్తంగతే సతి. 3
సన్ధ్యా ముపాస్య ధ్యాయన్త స్తమేవ గతమానసాః,
ఆనాయ్య కృష్ణం దాశార్హం పున ర్మన్త్ర మమన్త్రయన్. 4

విరాటుడు మొదలగు రాజుల నందరను వారి వారి నెలవులకు పంపి పాండుకుమారులైదుగురు సూర్యు డస్తమించుచుండగా సంధ్య నుపాసించి కృష్ణునే తలపోయుచు, మనస్సుల నతని యందే చేర్చి అతనిని పిలిపించి మరల నిట్లు మంతనము లాడజొచ్చిరి.

యుధిష్ఠిర ఉవాచ- యుధిష్ఠిరు డిట్లు పలికెను.

త్వయా నాగపురం గత్వా సభాయాం ధృతరాష్ట్రజః,
కిముక్తః పుణ్డరీకాక్ష తన్నః శంసితు మర్హసి. 5

పుండరీకాక్షా! నీవు హస్తినాపురమున కరిగి సభలో దుర్యోధనునితో నేమి పలికితివి. దానిని మాకు చెప్పదగును.

వాసుదేవ ఉవాచ- వాసుదేవు డిట్లు పలికెను.

మయా నాగపురం గత్వా సభాయాం ధృతరాష్ట్రజః,
తథ్యం పథ్యం హితం చోక్తో న చ గృహ్ణాతి దుర్మతిః. 6

నేను హస్తినాపురమున కరిగి నిండుసభలో ఆ దుర్యోధనునకు ఉన్న మాటను, న్యాయము తప్పని దానిని, రెండు వైపులకు మేలైన దానిని పలికితిని. ఆ దుష్టున కది తలకెక్కలేదు.

యుధిష్ఠిర ఉవాచ- ధర్మరా జిట్లనెను.

తస్మి న్నుత్పథ మాపన్నే కురువృద్ధః పితామహః,
కిముక్తవాన్ హృషీకేశ దుర్యోధన మమర్షణమ్. 7

వాడు చెడుదారి బట్టుచుండగా కౌరవులలో పెద్దవాడు, తాత కోపముతో చిరచిరలాడు దుర్యోధనునితో ఏమి పలికెను?

ఆచార్యో వా మహాభాగ భారద్వాజః కిమబ్రవీత్,
పితా వా ధృతరాష్ట్ర స్తం గాన్ధారీ వా కి మబ్రవీత్. 8

ద్రోణాచార్యు డేమి పలికెను? తండ్రి ధృతరాష్ట్రు డేమనెను? తల్లి గాంధారి ఏమి చెప్పెను?

పితా యవీయా నస్మాకం క్షత్తా ధర్మవిదాం వరః,
పుత్రశోకాభిసంతప్తః కి మాహ ధృతరాష్ట్రజమ్. 9

మా పినతండ్రి, ధర్మమెరిగిన వారిలో శ్రేష్ఠుడు, కొడుకులను గూర్చిన దుఃఖముతో కుమిలిపోవుచుండువాడు విదురుడు దుర్యోధనున కేమి బోధించెను?

---

5. నాగపురమ్ - హస్తినాపురమునకు;
6. పథ్యమ్ - న్యాయముతో కూడినది; హితమ్ - రెండువైపుల వారికి మేలు కూర్చునది.

కిం చ సర్వే నృపతయః సభాయాం యే సమాసతే,
ఉక్తవన్తో యథాతత్త్వం తద్బ్రూహి త్వం జనార్దన. 10

మరియు సభలో నున్న రాజు లందరు ఉన్నదున్నట్లు ఏమి పలికిరి? జనార్దనా! దానిని మాకు చెప్పుము.

ఉక్తవాన్ హి భవాన్ సర్వం వచనం కురుముఖ్యయోః,
ధార్తరాష్ట్రస్య తేషాం హి వచనం కురుసంసది. 11
కామలోభాభిభూతస్య మన్దస్య ప్రాజ్ఞమానినః,
అప్రియం హృదయే మహ్యం తన్న తిష్ఠతి కేశవ. 12

భీష్ముడు, ధృతరాష్ట్రుడు, ఇంకను తక్కిన రాజులు, నీవును నా కొఱకై కౌరవసభలో పలికిన పలుకెల్ల అప్రియమై కామముతో, లోభముతో కన్ను గానని బుద్ధిహీనుడు, గొప్పతెలివిగలవాడ నని అనుకొనువాడు అగు దుర్యోధనుని హృదయమున నిలువదు.

తేషాం వాక్యాని గోవిన్ద శ్రోతు మిచ్ఛామ్యహం విభో,
యథా చ నాభిపద్యేత కాల స్తాత తథా కురు,
భవాన్ హి నో గతిః కృష్ణ భవాన్నాథో భవాన్ గురుః. 13

గోవిందా! ప్రభూ! వారి వాక్యములు వినవలతును. కాలము మీరిపోకుండ చేయవలసినది చేయుము. కృష్ణా! నీవే మాకు గతివి. నీవే మాకు నాథుడవు. నీవే మాకు గురువవు.

వాసుదేవ ఉవాచ - వాసుదేవు డిట్లు పలికెను.

శృణు రాజన్ యథావాక్య ముక్తో రాజా సుయోధనః,
మధ్యే కురూణాం రాజేన్ద్ర సభాయాం తన్నిబోధ మే. 14

---

11. 12 - కురుముఖ్యయోః - భీష్మ ధృతరాష్ట్రుల యొక్కయు, తేషాం చ - ఆ రాజులయొక్కయు, వచనమ్ - పలుకు, యత్ - ఏది; భవాన్ - నీవు; ఉక్తవాన్ - పలికితివో, మహ్యమ్ - నాకొఱకు అయిన; తత్ సర్వమ్ - అది యంతయు; అప్రియమ్ - ప్రియముకానిదై; ధార్తరాష్ట్రస్య -దుర్యోధనుని; హృదయే - హృదయమున; న తిష్ఠతి - నిలువదు - అని అన్వయము.

13. న అభిపద్యేత - మించిపోవదు; నః - మాయొక్క;

రాజేంద్రా! కౌరవుల నిండుసభలో సుయోధనునకు బోధించిన వాక్య మెట్టిదో వినుము.

మయా విశ్రావితే వాక్యే జహాస ధృతరాష్ట్రజః,
అథ భీష్మః సుసంక్రుద్ధ ఇదం వచన మబ్రవీత్. 15

నేను వినిపించిన వాక్యములను విని దుర్యోధనుడు పెద్దగా నవ్వెను. దానితో మిక్కిలి కోపించిన భీష్మ డిట్లు పలికెను.

దుర్యోధన నిబోధేదం కులార్థే యద్బ్రవీమి తే,
తచ్ఛ్రుత్వా రాజశార్దూల స్వకులస్య హితం కురు. 16

దుర్యోధనా! రాజశార్దూలా! ఈ కులమును కాపాడుటకై పలుకుచున్న నా మాట వినుము. విని కులమునకు మేలైన విధముగా ఆచరింపుము.

మమ తాత పితా రాజన్ శాన్తను ర్లోకవిశ్రుతః,
తస్యాహ మేక ఏవాసం పుత్రః పుత్రవతాం వరః. 17

నాయనా! మా తండ్రి శంతనుమహారాజు లోకమున ప్రసిద్ధి నొందిన వాడు. ఆయనకు నే నొక్కడనే పుత్రుడనై యుంటిని. పుత్రవంతులు నన్ను శ్రేష్ఠుడని భావించిరి.

తస్య బుద్ధిః సముత్పన్నా ద్వితీయః స్యాత్ కథం సుతః,
ఏకపుత్ర మపుత్రం వై ప్రవదన్తి మనీషిణః. 18

అతనికి మరియొక కొడు కెట్లు కలుగునా. అను ఆలోచన బయలుదేరెను. ఏలయన శాస్త్రవేత్తలు ఒక్క పుత్రుడుగల తండ్రిని పుత్రులు లేనివాడనియే. యందురట!

న చోచ్ఛేదం కులం యాయాద్ విస్తీర్యేచ్చ కథం యశః,
తస్యాహ మీప్సితం బుద్ధ్వా కాలీం మాతర మావహమ్. 19

'ఈ కుల మెట్లు తెగిపోకుండును? నా కీర్తి ఎట్లు విస్తరిల్లును' అని ఆయన చింతించుచుండగా అతని కోరిక నెరిగి నేను సత్యవతిని తల్లినిగా తెచ్చితిని.

---

19. కాలీమ్ - సత్యవతిని;

ప్రతిజ్ఞాం దుష్కరాం కృత్వా పితు రర్థే కులస్య చ,
అరాజా చోర్ధ్వరేతాశ్చ యథా సువిదితం తవ.
ప్రతీతో నివసామ్యేష ప్రతిజ్ఞా మనుపాలయన్. 20

తండ్రి కొఱకును, కులము కొరకును నేను చేయశక్యముకాని ప్రతిజ్ఞను గావించి సత్యవతిని తెచ్చితిని. రాజ్యమును గ్రహింపక, బ్రహ్మచారినై యున్న విషయము నీ వెరిగినదే. ఆ ప్రతిజ్ఞను చక్కగా కాపాడుకొనుచు ఇదిగో తృప్తితో బ్రదుకుచున్నాను.

తస్యాం జజ్ఞే మహాబాహుః శ్రీమాన్ కురుకులోద్వహః,
విచిత్రవీర్యో ధర్మాత్మా కనీయాన్ మమ పార్థివ. 21

రాజా! ఆమెయందు నా తమ్ముడు విచిత్రవీర్యుడు పుట్టెను. అతడు మహాబాహువు. శ్రీమంతుడు. ధర్మాత్ముడు. కురుకులము నుద్ధరించినవాడు.

స్వర్యాతేఽహం పితరి తం స్వరాజ్యే సన్న్యవేశయమ్,
విచిత్రవీర్యం రాజానం భృత్యో భూత్వా హ్యధశ్చరః. 22

నా తండ్రి స్వర్గస్థుడు కాగా నా తమ్ముని విచిత్రవీర్యుని నా రాజ్యమున రాజుగా నెలకొల్పితిని. నేను క్రిందనుండి సేవకుడనై సంచరించితిని.

తస్యాహం సదృశాన్ దారాన్ రాజేన్ద్ర సముపాహరమ్,
జిత్వా పార్థివసఙ్ఘాత మపి తే బహుశః శ్రుతమ్. 23

రాజేంద్రా! అతనికై నేను పలువురు రాజుల నోడించి తగిన భార్యలను తెచ్చితిని. ఇది యంతయు నీవు పెక్కుమారులు వినియుందువు.

తతో రామేణ సమరే ద్వన్ద్వయుద్ధ ముపాగమమ్,
స హి రామభయా దేభి ర్నాగరై ర్విప్రవాసితః. 24

అపుడు నాకు పరశురామునితో ద్వంద్వయుద్ధము సంఘటిల్లెను. ఆ రాముని భయమువలన నగరజను లందరు నాతమ్ముని దూరభూమికి తొలగించిరి.

---

20 ప్రతీతః - తుష్టుడు;

24. విప్రవాసితః - దూరభూమిలో నిలుపబడెను. పరశురామునకు భయపడి స్వయముగా పారిపోవుచు ప్రజలు తన శిబిరమును శూన్య మొనర్చిన కారణముగా నని భావము.

దారే ష్వప్యతిసక్తశ్చ యక్ష్మాణం సమపద్యత,
యదా త్వరాజకే రాష్ట్రే న వవర్ష సురేశ్వరః,
తదాభ్యధావ న్మామేవ ప్రజాః క్షుద్భయపీడితాః. 25

మరియు నాతడు భార్యలయందు మితిమీరి సంచరించి క్షయరోగము పొందెను. రాజ్యము దిక్కుమాలినది కాగా దేవేంద్రుడు వర్షములేకుండ చేసెను. అంత ప్రజలు ఆకలిదప్పులకు తాళజాలక నాకడకే పరువున వచ్చిరి.

ప్రజా ఊచుః - ప్రజ లిట్లు పలికిరి.

ఉపక్షీణాః ప్రజాః సర్వా రాజా భవ భవాయ నః,
ఈతీః ప్రణుద భద్రం తే శాన్తనోః కులవర్ధన. 26

శంతనుకులవర్ధనా! ప్రజలందరు చెడిపోయిరి. మా మేలుకోరి రాజవు కమ్ము. ఈతిబాధలను తొలగింపుము. నీకు మేలయ్యెడు.

పీడ్యన్తే తే ప్రజాః సర్వా వ్యాధిభి ర్భృశదారుణైః,
అల్పావశిష్టా గాఙ్గేయ తాః పరిత్రాతు మర్హసి. 27

గంగాకుమారా! ఈ నీ ప్రజలందరు మక్కిలి ఘోరములైన వ్యాధులతో బాధపడుచున్నారు. చావగా మిగిలినవారు చాల తక్కువమంది. వీరిని నీవు రక్షింపవలయును.

వ్యాధీన్ ప్రణుద వీర త్వం ప్రజా ధర్మేణ పాలయ,
త్వయి జీవతి మా రాష్ట్రం వినాశ ముపగచ్ఛతు. 28

ఓయి వీరా! ఈ రోగములను పరిమార్పుము. ప్రజలను ధర్మముతో పాలింపుము. నీవు బ్రదికియుండగా ఈ రాష్ట్రము నాశనము పొందకుండుగాక!

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

ప్రజానాం క్రోశతీనాం వై నైవాక్షుభ్యత మే మనః,
ప్రతిజ్ఞాం రక్షమాణస్య సద్వృత్తం స్మరత స్తథా. 29

---

26. ఈతీః-అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, చిలుకలు, మిడుతలు, చేరువనున్న శత్రురాజులు - అనునవి ఆరు ఈతిబాధలు.

ప్రతిజ్ఞను కాపాడుకొనుచు చక్కని నడవడిని స్మరించుచున్న నా మనస్సు ప్రజలంతగా మెచ్చుకొనుచున్నను క్షోభ పడనేలేదు.

తతః పౌరా మహారాజ మాతా కాలీ చ మే శుభా,
భృత్యాః పురోహితాచార్యా బ్రాహ్మణాశ్చ బహుశ్రుతాః,
మా మూచు ర్భృశసంతప్తా భవ రాజేతి సంతతమ్. 30

మహారాజా! అంతట పురజనులు, పుణ్యాత్మురాలు నాతల్లి సత్యవతియు, సేవకులు, పురోహితులును, ఆచార్యులు, గొప్ప పాండిత్యముగల బ్రాహ్మణులును, ఎంతో బాధపడుచు నన్ను రాజు కమ్మని మాటిమాటికి చెప్పజొచ్చిరి.

ప్రతీపరక్షితం రాష్ట్రం త్వాం ప్రాప్య వినశిష్యతి,
స త్వ మస్మద్ధితార్థం వై రాజా భవ మహామతే. 31

మున్ను రాష్ట్రమును ప్రతీపమహారాజు కాపాడెను. ఇప్పుడు అది నీ కాలమున నశించిపోనున్నది. కావున నీవు మా మేలుకోరి ఓ మహామతీ! రాజవగుము.

ఇత్యుక్తః ప్రాఞ్జలి ర్భూత్వా దుఃఖితో భృశ మాతురః,
తేభ్యో న్యవేదయం తత్ర ప్రతిజ్ఞాం పితృగౌరవాత్. 32

వారిట్లు పలుకగా గుండె కుతకుతలాడిపోయిన నేను చేతులు మోడ్చి తండ్రిపైనున్న గౌరవముతో నేను చేసిన ప్రతిజ్ఞను వారికి విన్నవించితిని,

ఊర్ధ్వరేతా హ్యరాజా చ కులస్యార్థే పునః పునః,
విశేషత స్త్వదర్థం చ ధురి మా మాం నియోజయ. 33

నేను బ్రహ్మచారిని, రాజు కారానివాడను. ఈ కులమును ఉద్ధరించుటకై, ముఖ్యముగా నీ కొరకై యిట్లు ప్రతిజ్ఞ పట్టితిని. అమ్మా! నన్నీ భారమున నియోగింపకుము.

తతోఽహం ప్రాఞ్జలి ర్భూత్వా మాతరం సంప్రసాదయమ్,
నామ్బ శాన్తనునా జాతః కౌరవం వంశ ముద్వహన్. 34
ప్రతిజ్ఞాం వితథాం కుర్యా మితి రాజన్ పునః పునః
విశేషత స్త్వదర్థం చ ప్రతిజ్ఞాం కృతవా నహమ్. 35

మరల నేను చేతులు జోడించి తల్లి నిట్లు ప్రార్థించితిని. అమ్మా! శంతనుని కుమారుడను. కురువంశభారమును నెత్తికెత్తుకొని పట్టిన ప్రతిజ్ఞను వ్యర్థము చేయజాలను. మరియు ఆ ప్రతిజ్ఞను కూడ నీ కొరకే పట్టితిని.

అహం ప్రేష్యశ్చ దాసశ్చ తవాద్య సుతవత్సలే.

నేను నీ బంటను, దాసుడను. తల్లీ! నాయందు పుత్రప్రేమగలదానా! నన్ను మన్నింపుమని మరల మరల వేడుకొంటిని.

ఏవం తా మనునీయాహం మాతరం జన మేవ చ. 36
అయాచం భ్రాతృదారేషు తదా వ్యాసం మహామునిమ్,
సహ మాత్రా మహారాజ ప్రసాద్య తమృషిం తదా. 37

ఇట్లామెను, జనులను బ్రతిమాలి మహామునియగు వేదవ్యాసుని తల్లితో పాటు ప్రార్థించి తమ్ముని భార్యలందు సంతానము పొందుమని వేడుకొంటిని.

అపత్యార్థం మహారాజ ప్రసాదం కృతవాం శ్చ సః,
త్రీన్ స పుత్రా నజనయ త్తదా భరతసత్తమ. 38

మహారాజా! నే నట్లు సంతానముకొరకు ప్రార్థింపగా ఆ మహర్షి అనుగ్రహము చూపెను. ముప్వురు కొడుకులను ప్రసాదించెను.

అన్ధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ,
రాజా తు పాణ్డు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః. 39

నీ తండ్రి గ్రుడ్డివాడు. అవయవలోపము వలన రాజు కాలేదు. మహాత్ముడు, లోకమున ప్రసిద్ధి కెక్కినవాడు నగు పాండురాజు రాజాయెను.

స రాజా తస్య తే పుత్రాః పితు ర్దాయాద్యహారిణః,
మా తాత కలహం కార్షీ రాజ్య స్యార్ధం ప్రదీయతామ్. 40

అట్లతడు రాజు కాగా ఆతని పుత్రులు తండ్రి రాజ్యభాగమును పొందవలసినవారు. బాబూ! వారితో పోరుచేయకుము. సగము రాజ్యమిమ్ము.

మయి జీవతి రాజ్యం కః సంప్రశాసేత్ పుమా నిహ,
మావమంస్థా వచో మహ్యం శమ మిచ్ఛామి వః సదా. 41

నేను బ్రదికియుండగా నిక్కడ రాజ్యమేలు మగవా డెవ్వడు? నా కొఱకు నా మాటను ధిక్కరింపకుము. నేను ఎల్లవేళల మీ అందరికి శాంతిని కోరుదును.

న విశేషోఽస్తి మే పుత్ర త్వయి తేషు చ పార్థివ,
మత మేతత్ పితు స్తుభ్యం గాన్ధార్యా విదురస్య చ. 42

కుమారా! నాకు నీయందును, వారియందును భేద మావంతయు లేదు. ఇది నీ తండ్రికి, తల్లికి, విదురునకును ఇష్టమైన విషయము.

శ్రోతవ్యం ఖలు వృద్ధానాం నాభిశఙ్క్యే ర్వచో మమ,
నాశయిష్యసి మా సర్వ మాత్మానం పృథివీం తథా. 43

నాయనా! పెద్దలమాట వినవలయునుగదా! నామాటను శంకింపకుము నిన్ను, ఈ భూమిని, సర్వమును నాశనము చేయకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
భగవద్వాక్యే సప్తచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
భగవద్వాక్యముగల నూటనలుబదియేడవఅధ్యాయము.

—: o :—

## అష్టచత్వారింశదధికశతతమోఽధ్యాయః
## నూటనలుబదియెనిమిదవ అధ్యాయము

### ద్రోణవిదురయో ర్గాన్ధార్యాశ్చ వచనానాం శ్రీకృష్ణకర్తృకం కథనమ్.
### ద్రోణవిదురులయు గాంధారియొక్కయు మాటలను శ్రీకృష్ణుడు ధర్మరాజునకు చెప్పుట.

వాసుదేవ ఉవాచ-వాసుదేవు డిట్లు చెప్పెను.

భీష్మేణోక్తే తతో ద్రోణో దుర్యోధన మభాషత,
మధ్యే నృపాణాం భద్రం తే వచనం వచనక్షమః. 1

భీష్ము డిట్లు పలికినపిదప చక్కనిపలుకు పొందికగల ద్రోణుడు రాజు లందరు నున్నచోట దుర్యోధనునితో నీకు మేలుకూర్చుమాట నిట్లు పలికెను.

ప్రాతీపః శాన్తను స్తాత కులస్యార్థే యథా స్థితః,
యథా దేవవ్రతో భీష్మః కులస్యార్థే స్థితోఽభవత్. 2

నాయనా! ప్రతీపునికుమారుడు శంతను డెట్లు కులము నుద్ధరించుటకై పూనుకొనెనో యట్లే దేవవ్రతుడగు ఈ భీష్ముడును కులరక్షణకై పూనుకొనెను.

తథా పాణ్డు ర్నరపతిః సత్యసన్ధో జితేన్ద్రియః,
రాజా కురూణాం ధర్మాత్మా సువ్రతః సుసమాహితః. 3
జ్యేష్ఠాయ రాజ్య మదదా ధృతరాష్ట్రాయ ధీమతే,
యవీయసే తథా క్షత్త్రే కురూణాం వంశవర్ధనః. 4

అట్లే సత్యము తప్పనివాడు, ఇంద్రియములపై అదుపుగలవాడు, ధర్మాత్ముడు, వ్రతనిష్ఠగలవాడు, ఆటుపోటులు లేనివాడు, కౌరవులలో గుణసంపదలతో విరాజిల్లువాడు నగు పాండురాజు బుద్ధిమంతుడు, అన్నయగు ధృతరాష్ట్రునకు రాజ్య మొసగెను. కురువంశమును వృద్ధి పొందించుచు తమ్ముడగు విదురునకు కూడ రాజ్యభార మప్పగించెను.

తతః సింహాసనే రాజన్ స్థాపయిత్వైన మచ్యుతమ్,
వనం జగామ కౌరవ్యో భార్యాభ్యాం సహితో నృపః. 5

పిమ్మట ఈ ధృతరాష్ట్రుని సింహాసనమునందు జారిపోకుండ నిలద్రొక్కు కొనునట్లు చేసి ఆ పాండురాజు భార్యలతో కూడి వనమున కరిగెను.

నీచైః స్థిత్వా తు విదుర ఉపాస్తే స్మ వినీతవత్,
ప్రేష్యవత్ పురుషవ్యాఘ్రో వాలవ్యజన ముత్క్షిపన్. 6

విదురుడు పురుషసింహమయ్యు వినయముతో క్రింద నిలబడి బంటువలె వింజామరము వీచుచు ఈ ధృతరాష్ట్రుని కొలిచియుండెను.

తతః సర్వాః ప్రజా స్తాత ధృతరాష్ట్రం జనేశ్వరమ్,
అన్వపద్యన్త విధివ ద్యథా పాణ్డుం జనాధిపమ్. 7

అంతట ప్రజలందరు పాండుమహారాజునువలె ధృతరాష్ట్రుని జనపాలకునిగా సమ్మతించి అనుసరించిరి.

విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం సవిదురాయ చ,
చచార పృథివీం పాణ్డుః సర్వాం పరపురఞ్జయః. 8

విదురునితోపాటు ధృతరాష్ట్రునకు రాజ్య మప్పగించి పాండురాజు శత్రుపురములను జయించుచు భూమి నంతటిని తిరుగసాగెను.

కోశసంవననే దానే భృత్యానాం చాన్వవేక్షణే,
భరణే చైవ సర్వస్య విదురః సత్యసఙ్గరః. 9

---

4. జ్యేష్ఠాయ - తనకన్న పెద్దవాడగు ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు కనుక రాజ్యమున కనర్హుడు - అయినను భక్తితో అతనికి రాజ్యమును సమర్పించెను. క్షత్త్రే - విదురుడు దాసీపుత్రుడు కనుక రాజ్యమున కనర్హుడు - అయినను తమ్ముడన్న ప్రేమతో అతనికి రాజ్యము నప్పగించెను. ఇట్లు పాండురాజు రాజ్యము మీద మమకారమును వదలి వారిరువురికడ న్యాసముగా నుంచెనని భావము.

9. సంవననమ్ - తన సొమ్ముగా భావించి కాపాడుట;

సత్యము తప్పని విదురుడు కోశాగారమును పరిరక్షించుట, దానములు చేయుట, భృత్యుల నరసికొనుట, సర్వమును భరించుట యను కార్యములు చేయుచుండెను.

సన్ధివిగ్రహసంయుక్తో రాజ్ఞాం సంవాహనక్రియాః,
అవైక్షత మహాతేజా భీష్మః పరపురఞ్జయః. 10

సంధివిగ్రహములను నిర్ణయించుట. రాజులనుండి కప్పములు గ్రహించుట మొదలగు పనులను శత్రుమర్దన సామర్థ్యముగల భీష్ముడు చూచుకొనుచుండెను.

సింహాసనస్థో నృపతి ర్ధృతరాష్ట్రో మహాబలః,
అన్వాస్యమానః సతతం విదురేణ మహాత్మనా. 11

మహాత్ముడగు విదురుడు ఎల్లవేళల వెంటదగిలి కొలుచుచుండగా గొప్ప బలముగల ధృతరాష్ట్రుడు రాజై సింహాసన మెక్కియుండెను.

కథం తస్య కులే జాతః కులభేదం వ్యవస్యసి,
సంభూయ భ్రాతృభిః సార్ధం భుంక్ష్వ భోగాన్ జనాధిప. 12

అట్టివాని కులమున బుట్టి నీవెట్లు కులమును ముక్కలు గావింతువు? అన్నదమ్ములతో కలసి భోగముల ననుభవింపుము.

బ్రవీమ్యహం న కార్పణ్యా న్నార్థహేతోః కథఞ్చన,
భీష్మేణ దత్త మిచ్ఛామి న త్వయా రాజసత్తమ. 13

నేను పోరునకు భయపడియో ధన మాశించియో ఎన్నటికిని పలుకను. భీష్ము డిచ్చిన దానిని ఇష్టపడుదును. నీనుండి ఏమియు ఆశింపను.

---

10. సంవాహనక్రియాః - సంవాహన మనగా సంప్రాపణము - ధనమును, కానుకలను తెచ్చుట - వానికి సంబంధించిన పనులను.

13. కార్పణ్యాత్ - జాలివలన - దీనతవలన - యుద్ధమునకు భయపడి అని భావము.

నాహం త్వత్తోఽభికాఙ్క్షిష్యే వృత్త్యుపాయం జనాధిప,
యతో భీష్మ స్తతో ద్రోణో యద్భీష్మ స్త్వాహ తత్కురు. 14

రాజా! నీవలన బ్రదుకుతెరువు ఉపాయమును నేను కోరుకొనను. భీష్మ డెందుండునో ద్రోణు డందుండును. కావున భీష్ముడు చెప్పినట్లు చేయుము.

దీయతాం పాణ్డుపుత్రేభ్యో రాజ్యార్ధ మరికర్శన,
సమ మాచార్యకం తాత తవ తేషాం చ మే సదా. 15

పాండుకుమారులకు రాజ్యమున సగభాగ మిమ్ము నీకును, వారికిని నేను ఆచార్యుడ నగుట ఎల్లపుడు సమానమే కదా!

అశ్వత్థామా యథా మహ్యం తథా శ్వేతహయో మమ,
బహునా కిం ప్రలాపేన యతో ధర్మ స్తతో జయః. 16

నాకు అశ్వత్థామ ఎట్టివాడో తెలిగుఱ్ఱముల అర్జునుడును అట్టివాడే. పలుమాట లేల. ధర్మ మేవైపున నుండునో గెలుపు ఆ వైపునకు సిద్ధించును.

వాసుదేవ ఉవాచ - శ్రీకృష్ణు డిట్లు పలికెను.

ఏవ ముక్తే మహారాజ ద్రోణే నామితతేజసా,
వ్యాజహార తతో వాక్యం విదురః సత్యసఙ్గరః,
పితు ర్వదన మన్వీక్ష్య పరివృత్య చ ధర్మవిత్. 17

మహాతేజస్సుగల ద్రోణు డిట్లు పలికిన పిదప సత్యమున నిష్ఠగల ధర్మవేత్త విదురుడు తండ్రియగు భీష్ముని మొగము చూచి మరలి యిట్లు పలికెను.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

దేవవ్రత నిబోధేదం వచనం మమ భాషతః,
ప్రణష్టః కౌరవో వంశ స్త్వయాఽయం పున రుద్ధృతః. 18

దేవవ్రతా! నేను పలుకుచున్నమాట వినుము. మున్ను కురువంశము పాడు కాగా నీవు దానిని మరల ఉద్ధరించితివి.

తన్మే విలపమానస్య వచనం సముపేక్షసే,
కోఽయం దుర్యోధనో నామ కులేఽస్మిన్ కులపాంసనః. 19

17. పితుః - తండ్రివరుస యగు భీష్ముని; పరివృత్య - మరలి.

నేను మొత్తుకొనుచు చెప్పెడు నా మాటను నీవు పాటింపవు. ఈ కులమున చెడబుట్టిన ఈ దుర్యోధను డెవ్వడు ?

యస్య లోభాభిభూతస్య మతిం సమనువర్తసే,
అనార్య స్యాకృతజ్ఞస్య లోభేన హతచేతసః. 20

వీడు నీచుడు, చేసిన మేలు గుర్తింపనివాడు. అత్యాశతో వీని హృదయము చచ్చినది. అట్టి వీని బుద్ధిని బట్టి వ్రేలాడుచున్నావు.

అతిక్రామతి యః శాస్త్రం పితు ర్ధర్మార్థదర్శినః,
ఏతే నశ్యన్తి కురవో దుర్యోధనకృతేన వై. 21

వీడు ధర్మమును అర్థమును పరికించి తండ్రి బోధించు ఆజ్ఞను పాటింప కున్నాడు. ఈ దుర్యోధనుని కారణముగా ఈ కౌరవు లందరు నశించుచు చున్నారు.

యథా తే న ప్రణశ్యేయు ర్మహారాజ తథా కురు,
మాం చైవ ధృతరాష్ట్రం చ పూర్వ మేవ మహామతే. 22
చిత్రకార ఇవాలేఖ్యం కృత్వా స్థాపితవా నసి.

మహారాజా ! ఆ కౌరవులందరు నశింపకుండునట్లు ఆచరింపుము. మహామతీ ! మున్ను నీవే నన్నును ధృతరాష్ట్రుని, చిత్రకారుడు బొమ్మను నిలిపినట్లు, నిలిపితివి.

ప్రజాపతిః ప్రజాః సృష్ట్వా యథా సంహరతే తథా,
నోపేక్షస్వ మహాబాహో పశ్యమానః కులక్షయమ్. 23

ప్రజాపతి ప్రజలను సృజించి మరల రూపుమాపినట్లు ప్రవర్తింపకుము. ఓ మహాబాహూ ! కులము నాశనమగుచుండగా చూచుచు ఊరకుండకుము.

అథ తేఽద్య మతి ర్నష్టా వినాశే ప్రత్యుపస్థితే,
వనం గచ్ఛ మయా సార్ధం ధృతరాష్ట్రేణ చైవ హ. 24

---

21. శాస్త్రమ్ - శాసనమును - ఆజ్ఞను, దుర్యోధనకృతేన - దుర్యోధనుడు చేయు పనితో.

23. చిత్రకారః ఆలేఖ్యమ్, ఇవ - నీ ఆజ్ఞకు లోబడి నేనును ధృతరాష్ట్రుడును చిత్తరువులోని బొమ్మలవలె స్వతంత్రింపక మెలగుచున్నా మని భావము.

నేడు నీ బుద్ధి పనిచేయకున్నచో, ఈ కులమునకు వినాశము దాపురించినచో నాతో, ధృతరాష్ట్రునితో కలిసి అడవులకు పద.

బద్ధ్వా వా నికృతిప్రజ్ఞం ధార్తరాష్ట్రం సుదుర్మతిమ్,
శాధీదం రాజ్య మద్యాశు పాణ్డవై రభిరక్షితమ్. 25

లేదా నీచకార్యములయందే ప్రజ్ఞగల ఈ దురాత్ముడు దుర్యోధనుని బంధించి పాండవులు రక్షించెడు ఈ రాజ్యమును వెంటనే పాలింపుము.

ప్రసీద రాజశార్దూల వినాశో దృశ్యతే మహాన్, 26
పాణ్డవానాం కురూణాం చ రాజ్ఞా మమితతేజసామ్.

రాజోత్తమా ! దయచూడుము. పాండుకుమారులకు, కౌరవులకు, గొప్ప తేజస్సుగల రాజులకు గొప్పకీడు కానవచ్చుచున్నది.

విరరా మైవ ముక్త్వా తు విదురో దీనమానసః,
ప్రధ్యాయమానః స తదా నిఃశ్వసంశ్చ పునః పునః. 27

ఇట్లు పలికి విదురుడు గుండె దిగులుతో ఏదో చింతించుచు మాటిమాటికి నిట్టూర్పులు విడచుచు పలుకకుండెను.

తతో౽థ రాజ్ఞః సుబలస్య పుత్రీ
ధర్మార్థయుక్తం కులనాశభీతా,
దుర్యోధనం పాపమతిం నృశంసం
రాజ్ఞాం సమక్షం సుత మాహ కోపాత్. 28

పిదప సుబలరాజపుత్రి గాంధారి కులము నశించు నను భయముతో పాప బుద్ధియు, క్రూరుడు నగు కొడుకు దుర్యోధనునితో రాజుల యెదుట కోపముతో ధర్మము, అర్థము కూడినమాట నిట్లు పలికెను.

---

25. వనం గచ్ఛ-అట్లు నీవును నిన్ననుసరించు ద్రోణుడును, తానును, తండ్రియును వదలిపోవగా తగిన బలములేని ఈ దుర్యోధనుడు పాండవులకు వెరచి యుద్ధము మాని చక్కబడు నని విదురుని ఆశయము.

యే పార్థివా రాజసభాం ప్రవిష్టా
బ్రహ్మర్షయో యే చ సభాసదోఽన్యే,
శృణ్వన్తు వక్ష్యామి తవాపరాధం
పాపస్య సామాత్యపరిచ్ఛదస్య. 29

దుర్యోధనా! మంత్రులతో, బంటులతో కూడిన పాపివి నీదగు అపరాధమును చెప్పుచున్నాను. దీనిని ఇచట రాజసభలో ప్రవేశించిన రాజులును, బ్రహ్మర్షులును, మరియు నితరులగు సభ్యులును విందురు గాక!

రాజ్యం కురూణా మను పూర్వభోజ్యం
క్రమాగతో నః కులధర్మ ఏషః,
త్వం పాపబుద్ధేఽతినృశంసకర్మన్
రాజ్యం కురూణా మనయా ద్విహంసి. 30

ఈ రాజ్యమును కురువంశమువారు పెద్దవాని క్రమముగా అనుభవించుచు వచ్చిరి. ఇది కులక్రమము ననుసరించి వచ్చుచున్న ధర్మము. ఓరీ పాపబుద్ధీ! క్రూరకర్ముడా! నీ వీనాడు నీతిదప్పి కౌరవుల రాజ్యమును రూపుమాపుచున్నావు.

రాజ్యే స్థితో ధృతరాష్ట్రో మనీషీ
తస్యానుజో విదురో దీర్ఘదర్శీ,
ఏతా వతిక్రమ్య కథం నృపత్వం
దుర్యోధన ప్రార్థయసేఽద్య మోహాత్. 31

బుద్ధిశాలియగు ధృతరాష్ట్రుడు రాజ్యమున నెలకొనెను. అతని తమ్ముడు విదురుడు ముందుచూపు గలవాడు. వీరిద్దరిని కాదని, ఒడలెరుగని తనముతో ఈనాడు నీ వెట్లు రాజత్వమును కోరుదువు ?

రాజా చ క్షత్తా చ మహానుభావౌ
భీష్మే స్థితే పరవన్తౌ భవేతామ్,
అయం తు ధర్మజ్ఞతయా మహాత్మా
న కామయే ద్యో నృపరో నదీజః. 32

మహానుభావులైన రాజును, విదురుడును పెద్దవాడు భీష్ముడున్నాడు కనుక అతనికి లోబడి ప్రవర్తించుచున్నారు. ఇక మహాత్ముడు ఈ గంగకొడుకు ధర్మ మెరిగినవాడు కావున నేదియు కోరడు.

రాజ్యం తు పాణ్డో రిద మప్రధృష్యం
తస్యాద్య పుత్రాః ప్రభవన్తి నాన్యే,
రాజ్యం తదేత న్నిఖిలం పాణ్డవానాం
పైతామహం పుత్రపౌత్రానుగామి. 33

ఈ రాజ్యమంతయు పాండురాజునకు సంబంధించినది. కాదని యెవ్వరు ననుటకు వీలులేనిది. దానికి ఈ నాడాతని కొడుకులే ఏలికలు కాదగినవారు. ఇతరులు కారు. ఇట్టి రాజ్యమంతయు తండ్రితాతల వరుసను పాండవులకు సంబంధించినది. వారి కొడుకులకు, మనుమలకు చెందవలసినది.

యద్వై బ్రూతే కురుముఖ్యో మహాత్మా
దేవవ్రతః సత్యసన్ధో మనీషీ,
సర్వం తదస్మాభి రహత్య కార్యం
రాజ్యం స్వధర్మాన్ పరిపాలయద్భిః. 34

కౌరవులందరికి పెద్ద, మహాత్ముడు, సత్యమున నిష్ఠగలవాడు, బుద్ధిమంతుడు అగు ఈ దేవవ్రతుడు చెప్పినట్లు విని మన మందరము మన ధర్మములను కాపాడుకొనుచు రాజ్యము చెడకుండ చూచుకొనవలయును.

అనుజ్ఞయా చాథ మహావ్రతస్య
బ్రూయా న్నృపోఽయం విదుర స్తథైవ,
కార్యం భవే త్తత్సుహృద్భి ర్నియోజ్యం
ధర్మం పురస్కృత్య సుదీర్ఘకాలమ్. 35

ఈ రాజును, ఆ విదురుడును ఏమి పలికినను ఆ మహావ్రతము గల భీష్ముని అనుమతితోడనే పలుకుదురు. మేలు కోరెడు మిత్రములు చెప్పిన దానిని ధర్మమును ముందిడుకొని కలకాలము మన మాచరింపవలయును.

---

35 అహత్య - అహత్వా - పాడుచేయక.

న్యాయాగతం రాజ్య మిదం కురూణాం
యుధిష్ఠిరః శాస్తు వై ధర్మపుత్రః,
ప్రబోధితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా
పురస్కృతః శాన్తనవేన చైవ. 36

ధృతరాష్ట్రుడు నడపుచుండగా భీష్ముడు మున్నిడుకొని మన్నించుచుండగా ధర్మపుత్రుడగు యుధిష్ఠిరుడు న్యాయమునుబట్టి వచ్చిన ఈ కురురాజ్యము నేలుగాక !

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి కృష్ణవాక్యే
అష్టచత్వారింశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణవాక్యముగల నూటనలుబదియెనిమిదవ అధ్యాయము.

—: o :—

## ఏకోనపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

## నూటనలుబదియెనిమిదవ అధ్యాయము

### ధృతరాష్ట్రస్య దుర్యోధనం ప్రతి వచనమ్ - పాణ్డవేభ్యో రాజ్యార్ధం దాతు మాదేశః

### ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు చెప్పిన మాటలు - పాండవులకు సగము రాజ్య మిమ్మని ఆదేశించుట.

వాసుదేవ ఉవాచ - వాసుదేవు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే తు గాన్ధార్యా ధృతరాష్ట్రో జనేశ్వరః,
దుర్యోధన మువా చేదం రాజమధ్యే జనాధిప. 1

రాజా ! గాంధారి యిట్లు పలికిన పిదప ధృతరాష్ట్రమహారాజు రాజులందరు నున్నచోట దుర్యోధనునితో నిట్లు పలికెను.

దుర్యోధన నిబోధేదం యత్త్వాం వక్ష్యామి పుత్రక,
తథా తత్ కురు భద్రం తే యద్యస్తి పితృగౌరవమ్. 2

కొడుకా! దుర్యోధనా! నేను చెప్పుమాట వినుము. తండ్రి యను గౌరవము నీ కున్నచో ఆ విధముగా చేయుము. నీకు మేలయ్యెడు.

సోమః ప్రజాపతిః పూర్వం కురూణాం వంశవర్ధనః,
సోమాద్ బభూవ షష్ఠోఽయం యయాతి ర్నహుషాత్మజః. 3

మొదట ఈ కురువంశమును పెంపొందించినవాడు చంద్రుడను ప్రజాపతి. అతనినుండి ఆరవతరమువాడు నహుషుని కొడుకు యయాతి.

తస్య పుత్రా బభూవు ర్హి పఞ్చ రాజర్షిసత్తమాః,
తేషాం యదు ర్మహాతేజా జ్యేష్ఠః సమభవత్ ప్రభుః. 4

అతనికి రాజర్షివరులగు కొడుకు లైదుగు రుండిరి. వారిలో పెద్దవాడు తేజస్సుగల యదువు సమర్థుడై యుండెను.

పూరు ర్యవీయాంశ్చ తతో యోఽస్మాకం వంశవర్ధనః,
శర్మిష్ఠయా సంప్రసూతో దుహిత్రా వృషపర్వణః. 5

మన వంశమును కొనసాగించిన పూరువు అందరికంటె చిన్నవాడు. వృషపర్వమహారాజుబిడ్డ శర్మిష్ఠకు పుట్టినవాడు.

యదుశ్చ భరతశ్రేష్ఠ దేవయాన్యాః సుతోఽభవత్,
దౌహిత్ర స్తాత శుక్రస్య కావ్య స్యామితతేజసః. 6

యదువు దేవయానికొడుకు. మహాతేజస్సుగల శుక్రాచార్యుని కూతుకొడుకు.

యాదవానాం కులకరో బలవాన్ వీర్యసమ్మతః,
అవమేనే స తు క్షత్రం దర్పపూర్ణః సుమన్దధీః. 7

అతడు యాదవవంశమునకు కర్త. బలవంతుడు, పరాక్రమము కలవాడు. కాని ఆతడు బుద్ధి ఏ మాత్రము లేనివాడై నిండైన గర్వముతో క్షత్రియజాతిని అవమానించెను.

న చాతిష్ఠత్ పితుః శాస్త్రే బలదర్పవిమోహితః,
అవమేనే చ పితరం భ్రాతౄం శ్చాప్యపరాజితః. 8

ఓటమి యెరుగని ఆ యదువు బలముతో గర్వముతో కన్ను గాననివాడై తండ్రిమాట వినకుండెను. తండ్రిని, తమ్ములను అవమానించెను.

పృథివ్యాం చతురన్తాయాం యదు రేవాభవద్బలీ,
వశే కృత్వా స నృపతీ న్న్యవస న్నాగసాహ్వయే. 9

నాలుగు సముద్రములు చుట్టిన నేలలో యదువే గొప్పబలము కలిగి యుండెను. అతడు రాజుల నందరను లోబరచుకొని కరిపురమున నివసించెను.

తం పితా పరమక్రుద్ధో యయాతి ర్నహుషాత్మజః,
శశాప పుత్రం గాన్ధారే రాజ్యా చ్చాపి వ్యరోపయత్., 10

అతని తండ్రి, నహుషుని కుమారుడగు యయాతి మిక్కిలి కోపముతో వానిని శపించెను. రాజ్యమునుండి తొలగించి వైచెను.

యే చైన మన్వవర్తన్త భ్రాతరో బలదర్పితాః,
శశాప తా నభిక్రుద్ధో యయాతి స్తనయా న్నథ. 11

బలముతో కన్నుగానక అతని వెంటబడి తిరుగు అతని తమ్ములను కూడ యయాతి మహాకోపముతో శపించెను.

యవీయాంసం తతః పూరుం పుత్రం స్వవశవర్తినమ్,
రాజ్యే నివేశయామాస విధేయం నృపసత్తమః. 12

రాజులలో శ్రేష్ఠుడగు యయాతి తనకు లోబడి యున్నవాడు, మాట వినువాడునగు చివరికొడుకు పూరుని రాజ్యమున నెలకొల్పెను.

ఏవం జ్యేష్ఠోఽప్యథోత్సిక్తో న రాజ్య మభిజాయతే,
యవీయాంసోఽపి జాయన్తే రాజ్యం వృద్ధోపసేవయా. 13

ఈ విధముగా పెద్దకొడుకే అయినను గర్వముతో ఎదురుతిరిగినవాడు రాజ్యమును పొందడు. పెద్దలను మన్నించుటచేత చిన్నవారయ్యును రాజ్యమును పొందుదురు.

తథైవ సర్వధర్మజ్ఞః పితు ర్మమ పితామహః,
ప్రతీపః పృథివీపాల త్రిషు లోకేషు విశ్రుతః. 14

అట్లే మా ముత్తాత, సర్వధర్మము లెరిగినవాడు ప్రతీపమహారాజు మూడు లోకములలో పేరు గాంచినవాడు.

తస్య పార్థివసింహస్య రాజ్యం ధర్మేణ శాసతః,
త్రయః ప్రజజ్ఞిరే పుత్రా దేవకల్పా యశస్వినః. 15

రాజసింహుడై ధర్మముతో రాజ్యమేలుచున్న ఆతనికి దేవతుల్యులు, కీర్తి నొందినవారు నగు కొడుకులు ముగ్గురు పుట్టిరి.

దేవాపి రభవ చ్ఛ్రేష్ఠో బాహ్లీక స్తదనన్తరమ్,
తృతీయః శాన్తను స్తాత ధృతిమాన్ మే పితామహః. 16

దేవాపి పెద్దవాడు. బాహ్లీకుడు అతని తరువాతివాడు. మూడవవాడు నా తాత శాంతనుడు. అతడు గొప్ప ధైర్యశాలి.

---

13. ఉత్సిక్తః - గర్వించినవాడు - హద్దు మీరినవాడు; న, అభిజాయతే - పొందడు; జాయన్తే - పొందుదురు; యవీయాంసః - చిన్న కొడుకులు;

దేవాపి స్తు మహాతేజా స్త్వగ్దోషీ రాజస త్తమః,
ధార్మికః సత్యవాదీ చ పితుః శుశ్రూషణే రతః. 17

మహాతేజస్సుగల దేవాపి ధార్మికుడు; సత్యవాది; తండ్రికి సేవలు చేయుటలో ప్రీతిగలవాడు. కాని ఆతనికి చర్మరోగ ముండెడిది.

పౌరజానపదానాం చ సమ్మతః సాధు సత్కృతః,
సర్వేషాం బాలవృద్ధానాం దేవాపి ర్హృదయంగమః. 18

ఆ దేవాపి పురజనులకు, గ్రామవాసులకు ఇష్టమైనవాడు. సజ్జను లాతనిని మిక్కిలిగా మన్నించెడివారు. పసివారికి, పెద్దవారికి అందరకు ఆతడు మిక్కిలి యిష్టు డాయెను.

వదాన్యః సత్యసన్ధశ్చ సర్వభూతహితే రతః,
వర్తమానః పితుః శాస్త్రే బ్రాహ్మణానాం తథైవ చ. 19

ఆ దేవాపి గొప్పదాత. సత్యనిష్ఠ గలవాడు. ప్రాణు లన్నింటికి మేలు చేయు నాసక్తి కలవాడు. తండ్రి ఆజ్ఞను బ్రహ్మజ్ఞానుల ఆజ్ఞను పాటించి మెలగువాడు.

బాహ్లీకస్య ప్రియో భ్రాతా శాన్తనో శ్చ మహాత్మనః,
సౌభ్రాత్రం చ పరం తేషాం సహితానాం మహాత్మనామ్. 20

అతడు బాహ్లీకునకు, మహాత్ముడగు శాంతనునకును ప్రియమైన అన్న. ఆ మహాత్ములు గొప్ప సోదరస్నేహముతో కలసి మెలగెడివారు.

అథ కాలస్య పర్యాయే వృద్ధో నృపతిస త్తమః,
సమ్భారా నభిషేకార్థం కారయామాస శాస్త్రతః. 21

అంత కాలము గడువగా వృద్ధుడైన మహారాజు శాస్త్రమున చెప్పిన విధముగా అభిషేకసామగ్రిని ఏర్పాటు చేసెను.

కారయామాస సర్వాణి మఙ్గలార్థాని వై విభుః,
తం బ్రాహ్మణా శ్చ వృద్ధాశ్చ పౌరజానపదైః సహ. 22
సర్వే నివారయామాసు ర్దేవాపే రభిషేచనమ్.

17. త్వగ్దోషీ - కుష్ఠరోగము కలవాడు;

అభిషేకమంగళమునకు వలయు వస్తువుల నన్నింటిని రాజు ఏర్పాటు చేసెను. బ్రాహ్మణులు, కులము పెద్దలును, పురజనులును, గ్రామ జనులును అందరు కూడి దేవాపి అభిషేకమును నివారించిరి.

స తచ్ఛ్రుత్వా తు నృపతి రభిషేకనివారణమ్,
అశ్రుకంఠో౽భవ ద్రాజా పర్యశోచత చాత్మజమ్. 23

ఆ రాజు ప్రజలు అభిషేకమును వలదనుట విని కంటతడి పెట్టెను. కుమారునిగూర్చి మిక్కిలి శోకించెను.

ఏవం వదాన్యో ధర్మజ్ఞః సత్యసన్ధశ్చ సో౽భవత్,
ప్రియః ప్రజానా మపి సం స్త్వగ్దోషేణ ప్రదూషితః. 24

ఇట్లు గొప్పదాత, ధర్మజ్ఞుడు, సత్యమును పాలించువాడు, ప్రజలందరకు ప్రియుడును అయ్యు ఆ దేవాపి చర్మదోషముచేత చెడిపోయెను.

హీనాఙ్గం పృథివీపాలం నాభినన్దన్తి దేవతాః,
ఇతి కృత్వా నృపశ్రేష్ఠం ప్రత్యషేధన్ ద్విజర్షభాః. 25

బ్రాహ్మణప్రవరులు అంగలోపముకల రాజును దేవతలు మెచ్చరని రాజును నిషేధించిరి.

తతః ప్రవ్యథితాఙ్గో౽సౌ పుత్రశోకసమన్వితః,
నివారితం నృపం దృష్ట్వా దేవాపిః సంశ్రితో వనమ్. 26

అంత నారాజు పుత్రదుఃఖముతో ఒడలెల్ల నలగిపోయెను. అట్లు ప్రజలు నివారించిన రాజును గాంచి దేవాపి అడవులు పట్టెను.

బాహ్లికో మాతులకులం త్యక్త్వా రాజ్యం సమాశ్రితః,
పితృభ్రాతౄన్ పరిత్యజ్య ప్రాప్తవాన్ పరమర్ధిమత్. 27

బాహ్లికుడు తండ్రిని సోదరులను రాజ్యమును వదలి మేనమామల యిల్లు చేరి గొప్ప సంపదలు గల రాజ్యమును పొందెను.

బాహ్లికేన త్వనుజ్ఞాతః శాన్తను ర్లోకవిశ్రుతః,
పితర్యుపరతే రాజన్ రాజా రాజ్య మకారయత్. 28

---

23. రాజా - ప్రతీపమహారాజు; ఆత్మజమ్ - కొడుకైన దేవాపిని గూర్చి;
28. అకారయత్ - అకరోత్ - ఆర్షరూపము,

బాహ్లికు డొప్పుకొనగా లోకమున ప్రసిద్ధిగల శాంతనుడు తండ్రి మరణిం
చిన పిదప రాజై రాజ్య మేలెను.

తథైవాహం మతిమతా పరిచి న్త్యేహ పాణ్డునా,
జ్యేష్ఠః ప్రభ్రంశితో రాజ్యాద్ధీనాఙ్గ ఇతి భారత. 29

అట్లే మొదటికుమారుడ నైనను అంగలోపము కలవాడను గనుక
పెద్దలు నన్ను కాదని బుద్ధిమంతుడగు పాండుని రాజు గావించిరి.

పాణ్డుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి సన్నృపః,
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిన్దమ. 30

ఆ విధముగా పాండురాజు చిన్నవాడయ్యు రాజ్యము పొందెను. అతని
మరణానంతరము ఈ రాజ్య మాతని కుమారులకు చెందును.

మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్యమిచ్ఛసి,
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి. 31

నాకు రాజ్యమున భాగము లేకుండగా నీ వెట్లు రాజ్యమును కోరుదువు?
రాజపుత్రుడవు, స్వామిని కాని నీవు పరుల సొమ్మున కాసపడుచున్నావు.

యుధిష్ఠిరో రాజపుత్రో మహాత్మా
న్యాయాగతం రాజ్య మిదం చ తస్య,
స కౌరవస్యాస్య కులస్య భర్తా
ప్రశాసితా చైవ మహానుభావః. 32

యుధిష్ఠిరుడు రాజు కొడుకు. మహాత్ముడు. న్యాయమును బట్టి యిది అతని
రాజ్యము. అతడే యీ కౌరవకుల మంతటికి ప్రభువు. మహానుభావుడగు అతడే
ఏలిక.

స సత్యసన్ధః స తథాఽప్రమత్తః
శాస్త్రే స్థితో బన్ధుజనస్య సాధుః,
ప్రియః ప్రజానాం సుహృదానుకమ్పీ
జితేన్ద్రియః సాధుజనస్య భర్తా. 33

అతడు సత్యమే పలుకువాడు. ఎల్లవేళల జాగరూకుడై ప్రవర్తించును.
చుట్టములు చెప్పినట్లు నడచుకొనును. సత్పురుషుడు. ప్రజల కిష్టమైన వాడు.
మిత్రములయందు మక్కిలి దయ గలవాడు. ఇంద్రియములను పట్టి నిలుపువాడు.
సాధుజనులను పోషించువాడు.

---

33. అనుకమ్పీ - ఆ - అనుకమ్పీ - సంపూర్ణమైన దయకలవాడు:

క్షమా తితిక్షా దమ ఆర్జవం చ
సత్యవ్రతత్వం శ్రుత మప్రమాదః,
భూతానుకమ్పా హ్యనుశాసనం చ
యుధిష్ఠిరే రాజగుణాః సమస్తాః. 34

ఓర్పు, దుఃఖములకు తాళగలిగియుండుట, ఇంద్రియములపై అదుపు, ఋజుత్వము, సత్యవ్రతము, శాస్త్రపాండిత్యము, పొరపడకుండుట, భూతముల యందు దయ, చక్కగా ప్రజలను పాలించుట అను రాజగుణము లన్నియు ధర్మరాజునందు కలవు.

అరాజపుత్ర స్త్వ మనార్యవృత్తో
లుబ్ధః సదా బన్ధుషు పాపబుద్ధిః,
క్రమాగతం రాజ్య మిదం పరేషాం
హర్తుం కథం శక్ష్యసి దుర్వినీత. 35

ఓరీ! అదుపాజ్ఞలు లేనివాడా! నీవు రాజకుమారుడవు కావు. సజ్జనుల నడవడి నీయందు లేదు. లోభివి. ఎల్లప్పుడు చుట్టములకు చేటు కోరుచుందువు. ఇతరులకు వంశక్రమమును బట్టి వచ్చిన ఈ రాజ్యము నెట్లు చేజిక్కించుకొన గలవు?

ప్రయచ్ఛ రాజ్యార్ధ మపేతమోహః
సవాహనం త్వం సపరిచ్ఛదం చ,
తతోఽవశేషం తవ జీవితస్య
సహానుజస్యైవ భవే న్నరేన్ద్ర. 36

రాజా! మోహమును విడనాడి సగము రాజ్యమును వాహనములతో, లాంఛనములతో పాండవుల కొసగుము. అప్పుడే నీకును, నీతమ్ములకును ఆయువు మిగిలియుండును.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి ధృతరాష్ట్రవాక్యకథనే
ఏకోనపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున ధృతరాష్ట్రుని వాక్యములను వివరించుట యను నూటనలుబదితొమ్మిదవ అధ్యాయము.

—:0:—

# పఞ్చాశదధికశతతమోఽధ్యాయః

# నూటయేబదియవ అధ్యాయము

**శ్రీకృష్ణేన కౌరవాన్ ప్రతి సామదానభేదానాం విఫలతా ముక్త్వా దణ్డనీతే రేవౌచిత్యస్య ప్రతిపాదనమ్.**

**శ్రీకృష్ణుడు కౌరవులయెడ సామదానభేదములు పనికిరావని చెప్పి దండనీతియే తగినదని నిరూపించుట.**

వాసుదేవ ఉవాచ - శ్రీకృష్ణు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే తు భీష్మేణ ద్రోణేన విదురేణ చ,
గాన్ధార్యా ధృతరాష్ట్రేణ న వై మన్దోఽన్వబుధ్యత. 1

ఇట్లు భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, గాంధారి, ధృతరాష్ట్రుడు బోధించినను ఆ బుద్ధిహీనుడు తెలియకుండెను.

అవధూ యోత్థితో మన్దః క్రోధసంర క్తలోచనః,
అన్వద్రవ న్త తం పశ్చా ద్రాజాన స్త్యక్తజీవితాః. 2

ఆ బుద్ధిహీనుడు కోపముతో నెరుపెక్కిన కనులతో దులుపుకొని లేచి పోయెను. బ్రదుకుపై ఆశలేని రాజులందరు వానివెనుకబడి దురుసుగా వెడలి పోయిరి.

ఆజ్ఞాపయచ్చ రాజ్ఞ స్తాన్ పార్థివా న్నష్టచేతసః,
ప్రయాధ్వం వై కురుక్షేత్రం పుష్యోఽద్యేతి పునః పునః. 3

అంతే కాదు. బుద్ధి బుగ్గి అయిన ఆరాజుల నందరను ఈనాడు పుష్యమి, కురుక్షేత్రమునకు పదడు పదడు అనియు మరల మరల ఆజ్ఞాపించెను.

---

3. పుష్యః-పుష్యమీనక్షత్రము. అశ్వినిమొదలుకొని పూర్ణిమ తరువాత ఎనిమిదవదినమున నగును. ఇంతకు ముందుకూడ ఏడవరోజునకు పైని అమావాస్య వచ్చును. అప్పుడు యుద్ధమునకు సిద్ధము కండు అని చెప్పియున్నారు.

తతస్తే పృథివీపాలాః ప్రయయుః సహ సైనికాః,
భీష్మం సేనాపతిం కృత్వా సంహృష్టాః కాలచోదితాః. 4

అంత నా రాజు లందరు యముడు తోలుకొని పోవుచుండగా పొంగిపోవుచు భీష్ముని సేనానాయకుని గావించుకొని సైనికులతోపాటు బయలుదేరిరి.

అక్షౌహిణ్యో దశైకా చ కౌరవాణాం సమాగతాః,
తాసాం ప్రముఖతో భీష్మ స్తాలకేతు ర్వ్యరోచత. 5

కౌరవుల సేన పదునొకం డక్షౌహిణులు వచ్చిచేరెను. వారిలో కొట్టవచ్చినట్లు తాటిసిడముగల భీష్ముడు విరాజిల్లెను.

యదత్ర యుక్తం ప్రాప్తం చ తద్విధత్స్వ విశాంపతే,
ఉక్తం భీష్మేణ యద్వాక్యం ద్రోణేన విదురేణ చ. 6
గాన్ధార్యా ధృతరాష్ట్రేణ సమక్షం మమ భారత,
ఏతత్తే కథితం రాజన్ యద్వృత్తం కురుసంసది. 7

రాజా! ఇందు ఏది తగినదో దేనిని చేయగలమో అది చేయుము. భీష్ముడు, విదురుడు, గాంధారి, ధృతరాష్ట్రుడును నా యెదుట చెప్పినదంతయు కురుసభలో జరిగిన దంతయు నీకు చెప్పితిని.

సామ్య మాదౌ ప్రయుక్తం యే రాజన్ సౌభ్రాత్ర మిచ్ఛతా,
అభేదాయాస్య వంశస్య ప్రజానాం చ వివృద్ధయే. 8

మీ అన్నదమ్ముల మంచితనమును కోరి నేను ఈ వంశము ముక్కలు కాకుండుటకై, ప్రజలు పెంపొందుటకై ముందుగా సామవాక్యములు పలికితిని.

పున ర్భేదశ్చ మే యుక్తో యదా సామ న గృహ్యతే,
కర్మానుకీర్తనం చైవ దేవమానుషసంహితమ్. 9

ఆతనికి సామము తలకెక్కకపోవుటచే భేదమును గూడ ప్రయోగించితిని. దేవతలకు, మనుష్యులకు సంబంధించిన ఆయా కర్మములనుగూడ వక్కాణించితిని.

---

8. సామ్యమ్-సామముయొక్క భావము-సామోపాయ మని తాత్పర్యము.
9. పున ర్భేదశ్చ - కర్ణుని విడదీయుటకు చేసిన ప్రయత్నము.

యదా నాద్రియతే వాక్యం సామపూర్వం సుయోధనః,
తదా మయా సమానీయ భేదితాః సర్వపార్థివాః. 10

మెత్తని మాటలను సుయోధనుడు ఆదరింపని వేళ రాజుల నందరిని పిలిచి వారు చీలిపోవునట్లు చేసితిని.

అద్భుతాని చ ఘోరాణి దారుణాని చ భారత,
అమానుషాణి కర్మాణి దర్శితాని మయా విభో. 11

రాజా! అద్భుతములు, ఘోరములు, భయంకరములు, మానవులకు సాధ్యము కానివి యగు పనులు కూడ చూపితిని.

నిర్భర్త్సయిత్వా రాజ్ఞస్తాం స్తృణీకృత్య సుయోధనమ్,
రాధేయం భీషయిత్వా చ సౌబలం చ పునః పునః. 12
ద్యూతతో ధార్తరాష్ట్రాణాం నిన్దాం కృత్వా తథా పునః,
భేదయిత్వా నృపాన్ సర్వాన్ వాగ్భిర్మన్త్రేణ చాసకృత్. 13
పునః సామాభిసంయుక్తం సంప్రదాన మథాబ్రువమ్,
అభేదాత్ కురువంశస్య కార్యయోగా త్తథైవ చ. 14

ఆ దుర్యోధనుని గడ్డిపరకగా తీసివైచి, రాజుల నందరిని బెదరించి, కర్ణుని, శకునిని భయపెట్టి, జూదమాడిన కారణమున ధృతరాష్ట్రసుతులయందు తప్పు చూపించి, రాజుల నందరిని మాటలతో మంత్రముంతో చెదరిపోవునట్లు చేసి మరల సామదానవాక్యములను పలికితిని. ఇది యంతయు కురువంశము పాడై పోకుండుటకు, పని నెరవేరుటకును చేసితిని.

తే శూరా ధృతరాష్ట్రస్య భీష్మస్య విదురస్య చ,
తిష్ఠేయుః పాణ్డవాః సర్వే హిత్వా మాన మధశ్చరాః. 15

శూరులగు ఆ పాండవులందరు పట్టుదల విడచి, దిగివచ్చి భీష్ముని, విదురుని, ధృతరాష్ట్రుని మాటపై నిలుతురు.

ప్రయచ్ఛన్తు చ తే రాజ్య మనీశా స్తే భవన్తు చ,
యథాఽఽహ రాజా గాఙ్గేయో విదురశ్చ హితం తవ. 16

సర్వం భవతు తే రాజ్యం పఞ్చ గ్రామాన్ విసర్జయ,
అవశ్యం భరణీయా హి పితు స్తే రాజసత్తమ. 17

"దుర్యోధనా! వారు రాజ్యమును వదలుకొందురుగాక! పాలకులు కాకుందురు గాక! భీష్ముడు, విదురుడు నీకు హితము బోధించిన తీరున వారికి అయిదూళ్లైనను వదలుము. రాజ్య మంతయు నీకే యుండనిమ్ము. నీతండ్రి వారిని తప్పక పోషింపవలయునుగదా!"

ఏవ ముక్తోఽపి దుష్టాత్మా నైవ భాగం వ్యముఞ్చత,
దణ్డం చతుర్థం పశ్యామి తేషు పాపేషు నాన్యథా. 18

ఇట్లు చెప్పినను ఆ దుష్టాత్ముడు భాగము వదలనే వదలడాయెను. ఇక ఆ పాపులయందు నాలుగవదగు దండ మొక్కటియే ఉచితమని నాకు తోచుచున్నది. మరియొక దారి లేదు.

నిర్యాతాశ్చ వినాశాయ కురుక్షేత్రం నరాధిపాః,
ఏతత్తే కథితం రాజన్ యద్వృత్తం కురుసంసది. 19

చావు మూడి ఆ రాజు లందరు కురుక్షేత్రమునకు బయలుదేరిరి. రాజా! కురుసభలో జరిగిన దంతయు నీకు చెప్పితిని.

న తే రాజ్యం ప్రయచ్ఛన్తి వినా యుద్ధేన పాణ్డవ,
వినాశహేతవః సర్వే ప్రత్యుపస్థితమృత్యవః. 20

పాండుకుమారా! యుద్ధమున కాక వారు నీకు రాజ్య మొసగరు. లోక వినాశమునకు కారకులై వారందరు మృత్యువు దాపురించినవారై యున్నారు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి భగవద్యానపర్వణి
కృష్ణవాక్యే పఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున భగవద్యానపర్వమున
కృష్ణవాక్యముగల నూటయేబదియవ అధ్యాయము.
సమాప్తం భగవద్యానపర్వ-భగవద్యానపర్వము ముగిసెను.

—:o:—

17. అయిదుగ్రామములు తీసికొని రాజ్యము మొత్తము వారికే యిచ్చుట అను రూపమున దానమను ఉపాయమును ప్రయోగించితి నని తాత్పర్యము.

## * సైన్య నిర్యాణ పర్వ - ౮

## సైన్య నిర్యాణ పర్వము

### ఏకపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

### నూటఏబదియొకటవ అధ్యాయము

పాణ్డవపక్షే సేనాపతే ర్నిర్ధారణం, పాణ్డవ-
సేనాయాః కురుక్షేత్రే ప్రవేశశ్చ.

పాండవపక్షమున సేనాపతిని నిర్ణయించుట,
పాండవసేన కురుక్షేత్రమున ప్రవేశించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

జనార్దనవచః శ్రుత్వా ధర్మరాజో యుధిష్ఠిరః,
భ్రాతౄ నువాచ ధర్మాత్మా సమక్షం కేశవస్య హ. 1

జనార్దనుడు పలికిన మాట విని ధర్మముతో విరాజిల్లు యుధిష్ఠిరుడు, కేశవుని యెదుట తమ్ములతో నిట్లు పలికెను.

శ్రుతం భవద్భి ర్యద్వృత్తం సభాయాం కురుసంసది,
కేశవస్యాపి యద్వాక్యం తత్సర్వ మవధారితమ్. 2

కురువంశమువా రందరు కూడిన సభలో జరిగిన వృత్తాంత మంతయు మీరు వింటిరి. కృష్ణుడు పలికిన మాటయు మనకు చక్కగా తెలిసినది.

తస్మాత్ సేనావిభాగం మే కురుధ్వం నరసత్తమాః,
అక్షౌహిణ్యశ్చ సప్తైతాః సమేతా విజయాయ వై. 3

---

* సేనలు కురుక్షేత్రమునకు తరలిన తీరు వివరించు పర్వము.

మానవశ్రేష్ఠులారా! ఈ సేనల పంపకము ఏర్పాటు చేయుడు. మనకు విజయము సాధించుటకై ఇవిగో ఏడక్షౌహిణులు ఇచటకు చేరియున్నవి.

తాసాం యే పతయః సప్త విఖ్యాతా స్తా న్నిబోధత,
ద్రుపదశ్చ విరాటశ్చ ధృష్టద్యుమ్నశిఖణ్డినౌ. 4
సాత్యకి శ్చేకితానశ్చ భీమసేనశ్చ వీర్యవాన్,
ఏతే సేనాప్రణేతారో వీరాః సర్వే తనుత్యజః. 5

ఆ ఏడు అక్షౌహిణులకు ప్రసిద్ధికెక్కిన నాయకు లేడుగురు కలరు. వారిని గూర్చి తెలిసికొనుడు. ద్రుపదుడు, విరాటుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి, చేకితానుడు, మహాశక్తిసంపన్నుడగు భీమసేనుడు అను ఈ వీరు లందరును దేహములు శాశ్వతము కావను భావముతో సేనలకు నాయకులై యున్నారు.

సర్వే వేదవిదః శూరాః సర్వే సుచరితవ్రతాః,
హ్రీమన్తో నీతిమన్తశ్చ సర్వే యుద్ధవిశారదాః. 6

వీరందరు చక్కగా వేదముల నెరిగినవారు. శూరులు. మంచి నడవడిని వ్రతముగా నడుపుచున్నవారు. పాడుపనులకు సిగ్గుపడువారు, నీతి గలవారు. యుద్ధములలో ఆరితేరినవారు.

ఇష్వస్త్రకుశలాః సర్వే తథా సర్వాస్త్రయోధినః.

అట్లే వీరందరు బాణవిద్యలో చక్కని నేర్పుగలవారు. అన్ని విధము లగు అస్త్రములతో పోరగలవారు.

సప్తానామపి యో నేతా సేనానాం ప్రవిభాగవిత్,
యః సహేత రణే భీష్మం శరార్చిః పావకోపమమ్. 7
తం తావత్ సహదేవాత్ర ప్రబ్రూహి కురునన్దన,
స్వమతం పురుషవ్యాఘ్ర కో నః సేనాపతిః క్షమః. 8

సేనల చక్కని విభాగము లన్నియు బాగుగా నెరిగినవాడు, ఏడు అక్షౌహిణులను నడుపగలవాడు, యుద్ధమున బాణములను జ్వాలలతో మండు అగ్ని వంటి భీష్ముని తట్టుకొనగలవాడు, మనకు సేనాపతి కాదగినవాడు ఎవ్వడో సహదేవా! నీ అభిప్రాయము నెరిగింపుము.

సహదేవ ఉవాచ - సహదేవు డిట్లు పలికెను.

సంయుక్త ఏకదుఃఖశ్చ వీర్యవాంశ్చ మహీపతిః,
యం సమాశ్రిత్య ధర్మజ్ఞం స్వమంశ మనుయుఙ్క్ష్మహే. 9
మత్స్యో విరాటో బలవాన్ కృతాస్త్రో యుద్ధదుర్మదః,
ప్రసహిష్యతి సంగ్రామే భీష్మం తాంశ్చ మహారథాన్. 10

మనకు చుట్టము, మన దుఃఖమే తన దుఃఖ మనుకొనువాడు, పరాక్రమము గల రాజు అగు మత్స్యదేశాధిపతి విరాటుడు బలవంతుడు. ధర్మమెరిగిన అతని నాశ్రయించియే మనము రాజ్యభాగమును పొందగోరుచున్నాము. అతడు యుద్ధమున భీష్ముని, తక్కుంగల మహారథులను తట్టుకొనగలుగును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథోక్తే సహదేవేన వాక్యే వాక్యవిశారద,
నకులోఽనన్తరం తస్మాదిదం వచన మాదదే. 11

సహదేవు డట్లు పలుకగా నకులుడు ఈ విధముగా మాట నందుకొనెను.

వయసా శాస్త్రతో ధైర్యాత్ కులే నాభిజనేన చ,
హ్రీమాన్ బలాన్వితః శ్రీమాన్ సర్వశాస్త్రవిశారదః. 12

ఈ ద్రుపదుడు వయస్సుచే, విద్యచే, ధైర్యమున, కులమున, బంధువర్గముచే పెద్దవాడు. నెమ్మదితనము, బలము, సంపద, అన్ని శాస్త్రములతో ఆరితేరినతనము కలవాడు.

వేదం చాస్త్రం భరద్వాజా ద్దుర్ధర్షః సత్యసఙ్గరః,
యో నిత్యం స్పర్ధతే ద్రోణం భీష్మం చైవ మహాబలమ్. 13

భరద్వాజునివలన వేదమును, ధనుర్వేదమును అభ్యసించెను. ఎవ్వరు నీతని కదల్పజాలరు. సత్యనిష్ఠ కలవాడు. మరియు ప్రతిదినము ద్రోణునితో, మహాబలముగల భీష్మునితో పోటీపడుచుండును.

---

9. సంయుక్తః - చుట్టము.
12. కులేన - తన వంశము వారితో;
అభిజనేన - తనకు సంబంధించిన యితరజనుల సమూహముచే.

శ్లాఘ్యః పార్థివవంశస్య ప్రముఖే వాహినీపతిః,
పుత్రపౌత్రైః పరివృతః శతశాఖ ఇవ ద్రుమః. 14

రాజుల సముదాయములో మెచ్చదగిన సేనాపతి. కొడుకులతో, మనుమలతో కూడి నూరు కొమ్మలు గల వృక్షమువలె విరాజిల్లుచుండును.

య స్తతాప తపో ఘోరం సదారః పృథివీపతిః,
రోషా ద్ద్రోణవినాశాయ వీరః సమితిశోభనః. 15

ఈతడు ద్రోణుని చావు గోరి రోషముతో భార్యతో పాటు మహాఘోరమగు తప మొనరించెను. యుద్ధమున శోభిల్లు వీరుడు.

పితే వాస్మాన్ సమాధ త్తే యః సదా పార్థివర్షభః,
శ్వశురో ద్రుపదోఽస్మాకం సేనాగ్రం స ప్రకర్షతు. 16

మనల నెల్లవేళల కన్నతండ్రివలె కాపాడు మన మామ ద్రుపదుడు సేనమొనలో విరాజిల్లు గాక!

స ద్రోణభీష్మా వాయాతౌ సహే దితి మతి ర్మమ,
స హి దివ్యాస్త్రవి ద్రాజా సఖా చాఙ్గిరసో నృపః. 17

ఎదురు వచ్చు ద్రోణభీష్ములను తట్టుకొనగల వీరు డతడని నా భావము. ఆతడు దివ్యములగు అస్త్రములను నేర్చెను గదా. మఱియు ద్రోణునకు చెలికాడు.

మాద్రీసుతాభ్యా ముక్తే తు స్వమతే కురునన్దనః,
వాసవి ర్వాసవసమః సవ్యసా చ్యబ్రవీ ద్వచః. 18

ఇట్లు మాద్రికొడుకులు తమ అభిప్రాయములను చెప్పిన పిదప దేవేంద్రునకు సాటివచ్చు అర్జును డిట్లు పలికెను.

---

17. అఙ్గిరసః - ద్రోణునియొక్క.

18. వాసవిః - వాసవు డనగా ఇంద్రుడు - అతని కొడుకు.
సవ్యసాచీ - కుడియెడమచేతులతో సమానముగా బాణప్రయోగము చేయువాడు.

యోఽయం తపఃప్రభావేణ ఋషిసంతోషణేన చ,
దివ్యః పురుష ఉత్పన్నో జ్వాలావర్ణో మహాభుజః. 19

ఇదిగో ఈతడు జ్వాలలవంటి వన్నెతో విలసిల్లు మహాభుజుడు, తపశ్శక్తితో ఋషి నారాధించుటవలన పుట్టిన దివ్యపురుషుడు.

ధనుష్మాన్ కవచీ ఖడ్గీ రథ మారుహ్యా దంశితః,
దివ్యై ర్హయవరై ర్యుక్త మగ్నికుణ్డాత్ సముత్థితః. 20

వింటితో, కవచముతో, ఖడ్గముతో, చక్కని ఆభరణములతో కూడి, దివ్యములగు గుఱ్ఱములు పూన్చిన రథమెక్కి అగ్నికుండము నుండి లేచి వచ్చినవాడు.

గర్జన్నివ మహామేఘో రథఘోషేణ వీర్యవాన్,
సింహసంహననో వీరః సింహతుల్యపరాక్రమః. 21

రథఘోషతో మహామేఘము గర్జించుచున్నట్లుండు శక్తిశాలి. సింహము మేనువంటి దీతని మేను. సింహమును పోలిన పరాక్రమము గలవాడు.

సింహోరస్కః సింహభుజః సింహవక్షా మహాబలః,
సింహప్రగర్జనో వీరః సింహస్కన్ధో మహాద్యుతిః. 22

సింహము రొమ్ము వంటి రొమ్ము, సింహము భుజము వంటి భుజము, సింహమున కెదురొడ్డగల రొమ్ము, సింహగర్జన వంటి గర్జన, సింహము మూపు వంటి మూపుగల మహాబలుడు. గొప్పతేజము గల వీరు డితడు.

సుభ్రూః సుదంష్ట్రః సుహనుః సుబాహుః సుముఖోఽకృశః,
సుజత్రుః సువిశాలాక్షః సుపాదః సుప్రతిష్ఠితః. 23

చక్కని కనుబొమలు, పలువరుస, బుగ్గలు, బాహువులు, మోము, మెడ పూస, వెడద కన్నులు, పాదములు కలవాడు, మంచి నిలకడ కలవాడు.

---

22. సింహోరస్కః, సింహవక్షః - అను పదములకు అర్థ మొక్కటియే యైనను ఒకటి వైశాల్యమును, మరియొకటి గట్టితనమును చెప్పుచున్న వని భావింపదగును.

అభేద్యః సర్వశస్త్రాణాం ప్రభిన్న ఇవ వారణః,
జజ్ఞే ద్రోణవినాశాయ సత్యవాదీ జితేన్ద్రియః. 24

ఏ ఆయుధమును అతనిని భేదింపజాలదు. మదించిన ఏనుగువలె కన్పట్టును. కేవలము ద్రోణుని చంపుటకే పుట్టెను. సత్యమునే పలుకును. ఇంద్రియములపై అదుపు కలవాడు.

ధృష్టద్యుమ్న మహం మన్యే సహేద్ భీష్మస్య సాయకాన్,
వజ్రాశనిసమస్పర్శాన్ దీప్తాస్యా నురగానివ. 25

వజ్రమువలె, పిడుగువలె తాకునట్టివియు, మంటలు గ్రక్కు నోళ్ళుగల పాములవంటివియు నగు భీష్ముని బాణములను ఇట్టి ధృష్టద్యుమ్నుడు సహింపగలడు. అట్టివాడు మనకు సేనాపతి కావలయునని నా అభిప్రాయము.

యమదూతసమాన్ వేగే నిపాతే పావకోపమాన్,
రామేణాజౌ విషహితాన్ వజ్రనిష్పేషదారుణాన్. 26

ఆ భీష్ముని బాణములు వేగమున యమదూతలను పోలినట్టివి. పైని బడుటలో అగ్నికి సాటివచ్చునట్టివి. వజ్రమువలె పిండి గొట్టుటలో దారుణమైనవి. వానిని యుద్ధమున పరశురాముడు మాత్రమే తాళగలిగెను.

పురుషం తం న పశ్యామి యః సహేత మహావ్రతమ్,
ధృష్టద్యుమ్న మృతే రాజ న్నితి మే ధీయతే మతిః. 27

అట్టి పురుషుని, మహావ్రతము పాటించువానిని, ధృష్టద్యుమ్నుని కాక మరి యొకనిని నే నెరుగను. రాజా! నా బుద్ధి కిట్లు తోచుచున్నది.

క్షిప్రహస్త శ్చిత్రయోధీ మతః సేనాపతి ర్మమ,
అభేద్యకవచః శ్రీమాన్ మాతఙ్గ ఇవ యూథపః. 28

చేతి యొడుపు కలవాడు. చిత్రవిచిత్రములుగా పోరును. వాని కవచము నెవ్వడు పగులగొట్టలేడు. శోభతో వెలిగి పోవుచుండును. ఏనుగుల మందకు నాయకుడా యన్నట్లుండును.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను

అర్జునే నైవ ముక్తే తు భీమో వాక్యం సమాదదే.

అర్జును డిట్లు పలుకగా భీము డిట్లు పలుకు నందుకొనెను.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

వధార్థం యః సముత్పన్నః శిఖణ్డీ ద్రుపదాత్మజః,
వద న్తి సిద్ధా రాజేన్ద్ర ఋషయశ్చ సమాగతాః. 29

రాజేంద్రా! మనకడకు వచ్చు సిద్ధులును, ఋషులును ద్రుపదుని కొడుకు శిఖండి భీష్ముని చంపుటకే పుట్టె నని చెప్పుదురు.

యస్య స్జ్ఞ్గామమధ్యే తు దివ్య మస్త్రం ప్రకుర్వతః,
రూపం ద్రక్ష్య న్తి పురుషా రామ స్యేవ మహాత్మనః. 30

అతడు యుద్ధమధ్యమున అస్త్రము ప్రయోగించుచుండగా మానవులకు మహాత్ముడగు రాముని రూపమే కానవచ్చునట.

న తం యుద్ధే ప్రపశ్యామి యో భిన్ద్యాత్తు శిఖణ్డినమ్,
శస్త్రేణ సమరే రాజన్ సన్నద్ధం స్యన్దనే స్థితమ్. 31

రాజా! ఆయుధము చేతబట్టి యుద్ధమునకు సిద్ధపడి రథమెక్కియున్న శిఖండిని దెబ్బకొట్టగలవాడు నాకు కానరాడు.

ద్వైరథే సమరే నాన్యో భీష్మం హన్యా న్మహావ్రతమ్,
శిఖణ్డిన మృతే వీరం స మే సేనాపతి ర్మతః. 32

ఎదురెదురు పోరున మహావ్రతుడగు భీష్ముని చంపగలవాడు శిఖండి కాక మరొక్కడు లేడు. అతడు సేనాపతి యగుట నా అభిప్రాయము.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లు పలికెను.

సర్వస్య జగత స్తాత సారాసారం బలాబలమ్,
సర్వం జానాతి ధర్మాత్మా మత మేషాం చ కేశవః. 33

నాయనా! ధర్మాత్ముడగు ఈ కృష్ణుడు సర్వజగత్తుయొక్క సారము-పొల్లు, బలము - బలహీనత, ఈ అందరి భావము- అంతయును ఎరుగును.

య మాహ కృష్ణో దాశార్హః సోఽస్తు సేనాపతి ర్మమ,
కృతాస్త్రోఽప్యకృతాస్త్రో వా వృద్ధో వా యది వా యువా. 34

ఈ కృష్ణు డెవ్వనిని చెప్పునో యతడు, అస్త్రవిద్యలో నిపుణుడో- కాడో, ముదుసలియో - పడుచువాడో ఎవడైనను నాకు సేనాపతి యగును.

ఏష నో విజయే మూల మేష తాత విపర్యయే,
అత్ర ప్రాణాశ్చ రాజ్యం చ భావాభావౌ సుఖాసుఖౌ. 35

ఈతడే మన విజయమునకు మూలము. ఒకవేళ ఓటమి యైనచో దానికిని అతడే కారణము. మన ప్రాణములు, రాజ్యము, భావములు, అభావములు, సుఖములు, దుఃఖములు అన్నియు అతనియందే కలవు.

ఏష ధాతా విధాతా చ సిద్ధి రత్ర ప్రతిష్ఠితా,
య మాహ కృష్ణో దాశార్హః సోఽస్తు నో వాహినీపతిః. 36

ఇతడే ధాత. ఇతడే విధాత. మన కార్యములు నెరవేరుట యనునది యీతని యందే నెలకొనియున్నది. ఆత డెవ్వని పేర్కొనునో యతడే మనకు సేనాపతి యగును.

బ్రవీతు వదతాం శ్రేష్ఠో నిశా సమభివర్తతే,
తతః సేనాపతిం కృత్వా కృష్ణస్య వశవర్తినః, 37
రాత్రేః శేషే వ్యతిక్రాన్తే ప్రయాస్యామో రణాజిరమ్,
అధివాసితశస్త్రాశ్చ కృతకౌతుకమఙ్గలాః. 38

చక్కని మాట పొందికగల యీ మహానుభావుడు కృష్ణుడు సేనాపతిని నిర్ణయింపవలయును. రాత్రి గడుచుచున్నది. సేనాపతిని నిర్ణయించుకొని కృష్ణునకు లోబడి మెలగుచు మిగిలిన రాత్రి కడచిన పిదప ఆయుధములకు పూజలు గావించి రక్షాబంధనములు కట్టుకొని స్వస్తివాచనములు గావించుకొని యుద్ధభూమి కరుగుదము.

---

35. విపర్యయే - మార్పునందు - గెలుపుకాకపోవుటయందు; భావ-అభావౌ- అభిప్రాయములు తోచుట, తోచకుండుట అనునవి.

38. అధివాసితశస్త్రాః - అధివాసన మనగా కట్టలు కట్టి పూజించుట. శస్త్రములకు ఆ పని కావించినవారమై అని అర్థము.

కృతకౌతుకమఙ్గలాః - కౌతుక మనగా తోరణము (రక్షాబంధనము) మంగళ మనగా స్వస్తివాచనము. అవి కావించు కొన్నవారమై అని అర్థము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తద్వచనం శ్రుత్వా ధర్మరాజస్య ధీమతః,
అబ్రవీత్ పుణ్డరీకాక్షో ధనఞ్జయ మవేక్ష్య హ. 39

ధీశాలియగు ధర్మరా జాడిన ఆ మాట విని పుండరీకాక్షుడు ధనంజయు నొకమారు చూచి యిట్లు పలికెను.

మమాప్యేతే మహారాజ భవద్భి ర్య ఉదాహృతాః,
నేతార స్తవ సేనాయా మతా విక్రాన్తయోధినః. 40

మహారాజా! మీరు మీరు చెప్పిన నాయకులందరు గొప్పపరాక్రమముగల యోధులే. నాకును ఇష్టులే. నీ సేనకు నాయకులు కాదగినవారే.

సర్వ ఏవ సమర్థా హి తవ శత్రుం ప్రబాధితుమ్,
ఇన్ద్రస్యాపి భయం హ్యేతే జనయేయు ర్మహాహవే. 41

వీ రందరు నీ శత్రువును చీల్చి చెండాడుటకు చాలినవారే. ఘోరమగు యుద్ధమున వీరు ఇంద్రునకైనను భయము పుట్టింతురు.

కిం పున ర్ధార్తరాష్ట్రాణాం లుబ్ధానాం పాపచేతసామ్.

ఇక పాపబుద్ధియు, దురాశయు గల ధృతరాష్ట్రుని కొడుకులమాట చెప్ప నేల?

మయాఽపి హి మహాబాహో త్వత్ప్రియార్థం మహాహవే, 42
కృతో యత్నో మహాం స్తత్ర శమః స్యాదితి భారత.

భారతా! మహాబాహూ! ఈ యుద్ధము విషయమున నీకు ప్రియము కూర్చుటకై శాంతి కావలయునని నేనెంతో ప్రయత్నము చేసితిని.

ధర్మస్య గత మానృణ్యం న స్మ వాచ్యా వివక్షతామ్. 43

---

39. ధనంజయ మవేక్ష్య - అనుఃచేత అతడు చెప్పిన సేనాపతి తనకు సరి పడె నన్న సూచన చేసి.

43. ధర్మస్య అనృణ్యం గతమ్ - అధర్మముగా ప్రవర్తింపకుండుటయే ధర్మమునకు ఋణపడి యుండకుండుట. శాంతికై మనము న్యాయముగా చేయవలసిన దంతయు చేసితి మని తాత్పర్యము. వివక్షతామ్ - తప్పు నెత్తి చెప్పగోరువారికి. న వాచ్యాః స్మ - నిందింపదగినవారము కాము. మనలో ఈదోష మున్నదని ఎవ్వరును చెప్పుట కవకాశములేదని భావము.

మనము ధర్మమునకు ఋణపడి యుండలేదు. మనల నెవ్వరు వ్రేలెత్తి చూపుటకు అవకాశము లేదు.

కృతాస్త్రం మన్యతే బాల ఆత్మాన మవిచక్షణః,
ధార్తరాష్ట్రో బలస్థం చ పశ్య త్యాత్మాన మాతురః. 44

వివేకము లేనివాడు, పిల్లతనము వదలనివాడు నగు దుర్యోధనుడు తాను అస్త్రవిద్యలో ఆరితేరినవాడని తలచుచున్నాడు. రోగివంటి ఆతనికి తాను బలవంతుడే యన్నట్లే కనిపించుచున్నది.

యుజ్యతాం వాహినీ సాధు వధసాధ్యా హి మే మతాః,
న ధార్తరాష్ట్రాః శక్ష్యన్తి స్థాతుం దృష్ట్వా ధనఞ్జయమ్. 45

చక్కగా సేనను సిద్ధము చేయుడు. వారు చంపుటచేతనే చక్కబడువారని నా అభిప్రాయము. ధనంజయుని చూచి ధృతరాష్ట్రకుమారులు నిలువను జాలరు.

భీమసేనం చ సంక్రుద్ధం యమౌ చాపి యమోపమౌ,
యుయుధానద్వితీయం చ ధృష్టద్యుమ్న మమర్షణమ్. 46
అభిమన్యుం ద్రౌపదేయాన్ విరాటద్రుపదా వపి,
అక్షౌహిణీపతీం శ్చాన్యా న్నరేన్ద్రాన్ భీమవిక్రమాన్. 47

కోపముతో పెల్లురేగిన భీమసేనుని, యమునివంటి కవలలను, సాత్యకిని, తీవ్రకోపముగల ధృష్టద్యుమ్నుని, అభిమన్యుని, ద్రౌపది కొడుకులను, విరాటద్రుపదులను, భయంకరమగు విజృంభణ గల ఇతర రాజులను, అక్షౌహిణీ నాయకులను చూచి కౌరవులు నిలువజాలరు.

సారవద్బల మస్మాకం దుష్ప్రధర్షం దురాసదమ్,
ధార్తరాష్ట్రబలం సంఖ్యే హనిష్యతి న సంశయః. 48

గొప్పసారము కలది, ఇతరులకు దెబ్బకొట్టరానిది, ఇతరులకు చొరశక్యము కానిది యగు మన బలము దుర్యోధనుని సేనను యుద్ధమున చావగొట్టును. సంశయము లేదు.

ధృష్టద్యుమ్న మహం మన్యే సేనాపతి మరిన్దమ.

శత్రుమర్దనా! నేను మన సేనాపతిగా ధృష్టద్యుమ్నుడే తగినవాడని భావించుచున్నాను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే తు కృష్ణేన సంప్రాహృష్య న్నరోత్తమాః. 49

కృష్ణు డిట్లు పలుకగా అచటి నరవరు లందరు మిక్కిలి సంతసించిరి.

తేషాం ప్రహృష్టమనసాం నాదః సమభవ న్మహాన్,
యోగ ఇత్యథ సైన్యానాం త్వరతాం సంప్రధావతామ్. 50

ఉత్సాహముతో ఉప్పొంగు మనస్సులుగల సైనికులు యుద్ధమునకు సిద్ధము కండని తొందరపెట్టుచు పరువులెత్తుచుండగా గొప్ప నాదము చెలరేగెను.

హయవారణశబ్దాశ్చ నేమిఘోషాశ్చ సర్వతః,
శఙ్ఖదున్దుభిఘోషాశ్చ తుములాః సర్వతోఽభవన్. 51

ఎటు చూచినను గుఱ్ఱములయు, ఏనుగులయు నాదములు, చక్రముల పట్టాల రొదలు, శంఖములయు, దుందుభులయు మ్రోతలు పిక్కటిల్లెను.

తదుగ్రం సాగరనిభం క్షుబ్ధం బలసమాగమమ్,
రథపత్తిగజోదగ్రం మహోర్మిభి రివాకులమ్. 52

ఆ సైనికుల కదలిక, పెనుతరంగములతో అల్లకల్లోలమైన సముద్రమువలె రథములతో, పత్తులతో ఏనుగులతో భయంకరమై కానవచ్చెను.

ధావతా మాహ్వయానానాం తనుత్రాణి చ బధ్నతామ్,
ప్రయాస్యతాం పాణ్డవానాం ససైన్యానాం సమన్తతః. 53

---

50. యోగః - యుద్ధమునకు సిద్ధమగుట - 'ద్రవ్యోపాయ సన్నహనేష్వపి యోగః' - అని విశ్వకోశము.

52. పత్తి అనునది ఒక సేనావిభాగము - ఒక రథము, ఒక యేనుగు, మూడు గుఱ్ఱములు, ఐదుగురు కాల్బంటులు గలదానిని పత్తి యందురు.

53. తనుత్రాణి-కవచములను.

ఒకరి నొకరు పిలుచుకొనుచు, కవచములు కట్టుకొనుచు సైనికులతో పరువెత్తుకొని పోవుచున్న పాండవులసేన ఎటు చూచినను సముద్రమువలె కాన నయ్యెను.

గఙ్గేవ పూర్ణా దుర్ధర్షా సమదృశ్యత వాహినీ,
అగ్రానీకే భీమసేనో మాద్రీపుత్రౌ చ దంశితౌ. 54

వరదలో ఉప్పొంగిన గంగవలె ఆ సేన ఎవ్వరికిని లొంగనిదై కాన వచ్చెను. చక్కగా అలంకరించుకొన్న భీమసేనుడు నకులసహదేవులును ఆ సేనకు ముందు నడచిరి.

సౌభద్రో ద్రౌపదేయాశ్చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
ప్రభద్రకాశ్చ పఞ్చాలా భీమసేనముఖా యయుః. 55

అభిమన్యుడు, ద్రౌపది కొడుకులు, ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, ప్రభ ద్రకులు, పాంచాలురు భీమసేనుని ముందుంచుకొని బయలుదేరిరి.

తతః శబ్దః సమభవత్ సముద్రస్యేవ పర్వణి,
హృష్టానాం సంప్రయాతానాం ఘోషో దివ మివాస్పృశత్. 56

అంత నా శబ్దము పున్నమినాటి సముద్రపు ఘోషవలె ఉవ్వెత్తున లేచెను. సంతోషముతో ఉప్పొంగి నడచుచున్న సైనికుల ఘోష మిన్నుముట్టిన ట్లుండెను.

ప్రహృష్టా దంశితా యోధాః పరానీకవిదారణాః,
తేషాం మధ్యే యయౌ రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః. 57

యోధులందరు చక్కగా అలంకరించుకొని ఉత్సాహముతో పొంగిపోవు చుండిరి. శత్రుసేనను చీల్చివేయుశక్తి గలిగి యుండిరి. వారి నడుమ కుంతి కొడుకు యుధిష్ఠిరుడు నడచుచుండెను.

శకటాపణవేశాశ్చ యానయుగ్యం చ సర్వశః,
కోశం యన్త్రాయుధం చైవ యే చ వైద్యాశ్చికిత్సకాః. 58

---

55. సౌభద్రః - సుభద్ర కొడుకు - అభిమన్యుడు.

58. శకటములు - వస్తుసంభారములు కొనివచ్చుట కుపయోగించు బండ్లు; ఆపణములు-ఆ యా వస్తువులను అమ్ముట కుపయోగించు దుకాణములు, వేశాః - వేశ్యలు మొదలగువా రుండుటకు అనువగు గుడారములు;

బండ్లు, దుకాణములు, భోగము స్త్రీల గుడారములు, ప్రయాణమున కనువగు రథములు, భాండాగారము, ఫిరంగులు, ఆ యా రోగములకు చికిత్స చేయు వైద్యులు - ఈ అందరిని తీసికొని బయలుదేరెను.

ఫల్గు యచ్చ బలం కిఞ్చి ద్యచ్చాపి కృశదుర్బలమ్,
తత్సంగృహ్య యయౌ రాజా యే చాపి పరిచారకాః. 59

ధర్మరాజు సారము లేని దానిని, ఉన్న దానిని, చిక్కి శల్యమైన దానిని కూడ వదలక ఉన్న పరిచారకు లందరను తీసికొని బయలుదేరెను.

ఉపప్లవ్యే తు పాఞ్చాలీ ద్రౌపదీ సత్యవాదినీ,
సహ స్త్రీభి ర్నివవృతే దాసీదాససమావృతా. 60

సత్యవాదిని, పాంచాలపుత్రి, ద్రౌపది - రాజస్త్రీలతో దాసీజనముతో కూడి ఉపప్లవ్యమున నుండెను.

కృత్వా మూలప్రతీకారం గుల్మైః స్థావరజఙ్గమైః,
స్కన్ధావారేణ మహతా ప్రయయుః పాణ్డునన్దనాః. 61

స్థావరములు, జంగమములు నైన సైన్యరక్షణములతో మూలద్రవ్యము మున్నగువానికి తగిన రక్షణ లేర్పరచి గొప్పసేనతో పాండుకుమారులు బయలు దేరిరి.

దదతో గాం హిరణ్యం చ బ్రాహ్మణై రభిసంవృతాః,
స్తూయమానా యయూ రాజన్ రథై ర్మణివిభూషణైః. 62

---

యానయుగ్యమ్ - మనుజులు మాత్రము ప్రయాణించుటకు అనువైన బండ్లు; కోశమ్ - ధనాగారము; యన్త్రాయుధమ్-యంత్రములతో గుండ్లు విసరు సాధనములు; చికిత్సకాః - శస్త్రచికిత్స చేయువారు; వైద్యాః - సాధారణ రోగములను కుదుర్చువారు.

61. గుల్మైః - రక్షణకైన ఏర్పాటులతో; స్థావరజఙ్గమైః - స్థావరము అనగా స్థిరముగా నుండు ప్రాకారములు మొదలగునవి. జంగమము అనగా-ఆ యా తావులలో నిలుచు శూరుల సముదాయములు-వీనితో; మూలప్రతీకారమ్-ముఖ్యమైనదానిని; - అంతఃపురము, ధనము అనువాని రక్షణమును; కృత్వా -చేసి; స్కన్ధావారేణ - సేనలతో.

62. గామ్ - గోవును, లేక భూమిని;

గోదానము, సువర్ణదానము చేయుచు పాండవులు, బ్రాహ్మణులు చుట్టును చేరి స్తుతించుచుండగా, మణుల అలంకారములు గల రథములతో బయలుదేరిరి.

కేకయా ధృష్టకేతు శ్చ పుత్రః కాశ్యస్య చాభిభూః,
శ్రేణిమాన్ వసుదానశ్చ శిఖణ్డీ చాపరాజితః. 63

హృష్టా స్తుష్టాః కవచినః సశస్త్రాః సమలఙ్కృతాః,
రాజాన మన్వయుః సర్వే పరివార్య యుధిష్ఠిరమ్. 64

కేకయులు, ధృష్టకేతుడు, జయశాలి యగు కాశిరాజుకొడుకును, శ్రేణిమంతుడు, వసుదానుడు, ఓటమి యెరుగని శిఖండి మొదలగువారు సంతోషముతో, తృప్తితో కవచములు ధరించి చక్కగా అలంకరించుకొని ధర్మరాజును అన్ని వైపుల కొలిచి నడువసాగిరి.

జఘనార్ధే విరాటశ్చ యాజ్ఞసేనిశ్చ సౌమకిః,
సుధర్మా కున్తిభోజశ్చ ధృష్టద్యుమ్నస్య చాత్మజాః. 65

ధర్మజుని వెనుకవైపు విరాటుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, సుధర్ముడు, కుంతిభోజుడు, ధృష్టద్యుమ్నుని కొడుకులును నడువసాగిరి.

రథాయుతాని చత్వారి హయాః పఞ్చగుణా స్తథా,
పత్తిసైన్యం దశగుణం గజానా మయుతాని షట్. 66

నలువదివేల రథములు, దాని కైదురెట్లు గుఱ్ఱములు, దానికి పదిరెట్లు కాల్బంటులు, అరువదివేల ఏనుగులు బయలుదేరెను.

అనాధృష్టి శ్చేకితానో ధృష్టకేతుశ్చ సాత్యకిః,
పరివార్య యయుః సర్వే వాసుదేవధనఞ్జయౌ. 67

అనాధృష్టి, చేకితానుడు, ధృష్టకేతువు సాత్యకి అనువారు వాసుదేవ ధనంజయుల ప్రక్కన నడువసాగిరి.

---

65. జఘనార్ధే - వెనుకవైపు సగభాగమున;

66. అయుతమ్ - పదివేలు; పత్తిసైన్యమ్ - కాల్బంటుల సేన.

ఆసాద్య తు కురుక్షేత్రం వ్యూఢానీకాః ప్రహారిణః,
పాణ్డవాః సమదృశ్యన్త నర్దన్తో వృషభా ఇవ. 68

కురుక్షేత్రమును చేరి సేనలను మోహరించుకొని. ఆయా ఆయుధములు ధరించి పాండవులు ఱంకెలు వేయుచున్న ఆబోతుల వలె కానవచ్చిరి.

తేఽవగాహ్య కురుక్షేత్రం శఙ్ఖాన్ దధ్ము రరిన్దమాః,
తథైవ దధ్మతుః శఙ్ఖం వాసుదేవధనఞ్జయౌ. 69

కురుక్షేత్రమును ప్రవేశించిన ఆ శత్రుసంహారకు లందరు శంఖము లూదిరి. అట్లే వాసుదేవుడును, ధనంజయుడును శంఖములు మొరయించిరి.

పాఞ్చజన్యస్య నిర్ఘోషం విస్ఫూర్జిత మివాశనేః,
నిశమ్య సర్వసైన్యాని సమహృష్యన్త సర్వశః. 70

అర్జునుని పాంచజన్యము ధ్వని పిడుగు మ్రోతవలె వెలువడగా సైన్యము లన్నియు విని రోమాంచము పొందెను.

శఙ్ఖదున్దుభిసంహృష్టః సింహనాద స్తరస్వినామ్,
పృథివీం చా న్తరిక్షం చ సాగరాం శ్చాన్వనాదయత్. 71

శంఖములయు, దుందుభులయు నాదములతో ఉప్పొంగిన బలము గల సైనికుల సింహనాదము నింగిని, నేలను, సముద్రములను ప్రతిధ్వనింపజేసెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి,
కురుక్షేత్రప్రవేశే ఏకపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
కురుక్షేత్రప్రవేశ మను నూటఏబదియొకటవ అధ్యాయము.

—: o :—

---

68. నర్దన్తః - ఱంకెలు వేయుచున్న.
69. అవగాహ్య - చొచ్చి.
70. సమహృష్యన్త - రోమాంచము - గగుర్పాటు - కలవారైరి.

## ద్విపఞ్చాశదధికశతతమోఽధ్యాయః
## నూటయేబదిరెండవ అధ్యాయము

**కురుక్షేత్రే పాణ్డవసేనాయా నివేశః, శిబిరనిర్మాణం చ**

**కురుక్షేత్రమున పాండవసేన విడియుట; శిబిరములు నిర్మించుకొనుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో దేశే సమే స్నిగ్ధే ప్రభూతయవసేన్ధనే,
నివేశయామాస తదా సేనాం రాజా యుధిష్ఠిరః. 1

అంత ధర్మరాజు ఎగుడుదిగుడు లేనిది, రాలు రప్పలు లేనిదియు, మిక్కుట మగు గడ్డి, కట్టెలు కలదియు నగు ప్రదేశమున సేనను విడియించెను.

పరిహృత్య శ్మశానాని దేవతాయతనాని చ,
ఆశ్రమాంశ్చ మహర్షీణాం తీర్థాన్యాయతనాని చ. 2
మధురానూషరే దేశే శుచౌ పుణ్యే మహామతిః,
నివేశం కారయామాస కున్తీపుత్రో యుధిష్ఠిరః. 3

వల్లకాడులను, దేవాలయములను, మహర్షుల ఆశ్రమములను, పవిత్రము లగు తావులను, సత్రములు మొదలగు ప్రదేశములను తప్పించి, మనోహరము, బీడుపడినది, పరిశుద్ధము, పుణ్యము నగు ప్రదేశమున దొడ్డబుద్ధిగల యుధిష్ఠిరుడు సేనలను విడిది చేయించెను.

తతశ్చ పునరుత్థాయ సుఖీ విశ్రాంతవాహనః,
ప్రయయౌ పృథివీపాలై ర్వృతః శతసహస్రశః. 4

అటుపైని వాహనముల అలసట పోగొట్టి తాను విశ్రాంతి నొంది లేచి వేలకొలదిగా రాజులు చుట్టి రాగా బయలుదేరెను.

---

3. మధుర, అనూషరే - చూడముచ్చట అయినది, బీడుకానిది యగు.

విద్రావ్య శతశో గుల్మాన్ ధార్తరాష్ట్రస్య సైనికాన్,
పర్యక్రామత్ సమన్తాచ్చ పార్థేన సహ కేశవః 5

మార్గమున దుర్యోధనుని సైనికుల గుంపులను వందలకొలదిగా పారద్రోలి కృష్ణార్జునులు ముందుకు సాగిరి.

శిబిరం మాపయామాస ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
సాత్యకిశ్చ రథోదారో యుయుధానశ్చ వీర్యవాన్. 6

ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, రథికులలో శ్రేష్ఠుడు, గొప్పశక్తి గలవాడు, యుద్ధవీరుడు నగు సాత్యకియు శిబిరము వేయించిరి.

ఆసాద్య సరితం పుణ్యాం కురుక్షేత్రే హిరణ్వతీమ్,
సూపతీర్థాం శుచిజలాం శర్కరాపఙ్కవర్జితామ్, 7
ఖానయామాస పరిఖాం కేశవ స్తత్ర భారత,
గుప్త్యర్థ మపి చాదిశ్య బలం తత్ర న్యవేశయత్. 8

కురుక్షేత్రమున అందమైన పరిసరములు గలదియు, గులకరాలు, బురదయు లేనిదియు, నిర్మలమైన నీరు గలదియు నగు హిరణ్వతి యను పుణ్య నదిని చేరుకొని రక్షణకొరకు పరిఖను త్రవ్వించి కృష్ణుడు సేనను విడిది చేయించెను.

విధి ర్యః శిబిర స్యాసీత్ పాణ్డవానాం మహాత్మనామ్,
తద్విధాని నరేన్ద్రాణాం కారయామాస కేశవః. 9

మహాత్ములగు పాండవుల శిబిరముల తీరెట్టిదో అట్టివే యగు శిబిరములను ఆ యా రాజులకై కృష్ణుడు వేయించెను.

---

5. గుల్మాన్ - సైనికుల గుంపులను.
7. సూపతీర్థామ్ - అందమైన పరిసరములు గల.
8. పరిఖామ్ - అగడితను.
9. తద్విధాని - అట్టివే యగు శిబిరములను.

ప్రభూతతరకాష్ఠాని దురాధర్షతరాణి చ,
భక్ష్యభోజ్యాన్నపానాని శతశోఽథ సహస్రశః. 10
శిబిరాణి మహార్హాణి రాజ్ఞాం తత్ర పృథక్ పృథక్,
విమానానీవ రాజేన్ద్ర నివిష్టాని మహీతలే. 11

మిక్కిలిగట్టివి యగు కట్టెలు కలిగి, ఎవ్వరికి లొంగనివియు, అన్నపానములు సమృద్ధిగా గలవియు, గొప్ప ధనసమృద్ధి కలవియు నగు శిబిరములను ఆ యా రాజులకు వేరువేరుగా నిర్మింపజేసెను. అవి యన్నియు భూతలమున నున్న విమానములా యన్నట్లుండెను.

తత్రాసన్ శిల్పినః ప్రాజ్ఞాః శతశో దత్తవేతనాః,
సర్వోపకరణై ర్యుక్తా వైద్యాః శాస్త్రవిశారదాః. 12

అందు గొప్పబుద్ధికుశలత కలవారును, మంచిజీతములు కలవారు, కావలసిన పనిముట్లన్నింటితో కూడి విద్యలో శాస్త్రములో ఆరితేరినవారు నగు శిల్పులు వందలకొలదిగా నుండిరి.

జ్యాధనుర్వర్మశస్త్రాణాం తథైవ మధుసర్పిషోః,
ససర్జరసపాంసూనాం రాశయః పర్వతోపమాః. 13

అల్లెత్రాళ్ళు, కవచములు, ఆయుధములు, తేనెలు, ధూపముల పొడులు మున్నగువాని కొండలవంటి రాశులు ఆ శిబిరములందు కలవు.

బహూదకం సుయవసం తుషాఙ్గారసమన్వితమ్,
శిబిరే శిబిరే రాజా సఞ్చకార యుధిష్ఠిరః. 14

ప్రతి శిబిరమునందును సమృద్ధిగా నీటిని, గడ్డిని, ఊక, బొగ్గులు మొదలగు వానిని ధర్మరాజు సమకూర్చెను.

మహాయన్త్రాణి నారాచా స్తోమరాణి పరశ్వథాః,
ధనూంషి కవచాదీని ఋష్టయ స్తూణసంయుతాః. 15

---

12. వైద్యాః - వైద్యముచేయువారు; లేక విద్యావంతులు.
13. సర్జరసపాంసూనామ్ - యక్షధూప మను సుగంధద్రవ్యము పొడుల యొక్క.
15. ఋష్టయః - ఈటెలు.

ఫిరంగులు, బాణములు, చిల్లకోలలు, గొడ్డళ్ళు, విండ్లు, కవచములు, ఈటెలు, అంపపొదులు మొదలగునవి అచట నిండుగా గలవు.

గజాః కణ్టకసన్నాహా లోహవర్మోత్తరచ్ఛదాః,
దృశ్యన్తే తత్ర గిర్యాభాః సహస్రశతయోధినః. 16

ముళ్ళుగల కవచములతో, దృఢమైన మైమరుపులతో వేలకొలది యోధులు గల ఏనుగులు కొండలవలె అందు గానవచ్చుచున్నవి.

నివిష్టాన్ పాణ్డవాం స్తత్ర జ్ఞాత్వా మిత్రాణి భారత,
అభిసస్రు ర్యథాదేశం సబలాః సహవాహనాః. 17

పాండవు లందు వచ్చియుండి రని విని వారి మిత్రములందరు సేనలతో, వాహనములతో కూడి వారి మాటమేరకు అచటకు పరువున వచ్చిరి.

చరితబ్రహ్మచర్యా స్తే సోమపా భూరిదక్షిణాః,
జయాయ పాణ్డుపుత్రాణాం సమాజగ్ము ర్మహీక్షితః. 18

బ్రహ్మచర్యము చక్కగా పాటించువారు, సోమయాగమున సోమరసము త్రావినవారు, గొప్ప దక్షిణలతో యజ్ఞములు చేసినవారు నగు రాజులు పాండుపుత్రులకు జయము కూర్చుటకై ప్రీతితో వచ్చిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
శిబిరాదినిర్మాణే ద్విపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
శిబిరాదినిర్మాణము గల నూటయేబదిరెండవ అధ్యాయము.

—: o :—

---

16. కణ్టకసన్నాహాః - వెలుపలి భాగములు వాడిముళ్ళున్న కవచములు గల - అట్టి కవచములు గల ఏనుగులు శత్రువుల ఏనుగుల చర్మములను గ్రుచ్చి నొప్పి పుట్టించును.

17. అభిసస్రుః - పరువున వచ్చి చేరిరి.

## త్రిపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

## నూటయేబదిమూడవ అధ్యాయము

**సాంగ్రామికవ్యవస్థాం శిబిరనిర్మాణం చ కర్తుం**
**దుర్యోధనస్యాదేశః; సైనికానాం రణయాత్రోద్యమశ్చ.**

**యుద్ధసంబంధమైన ఏర్పాట్లు, శిబిరనిర్మాణము చేయుటకు**
**దుర్యోధనుడు ఆదేశించుట, సైనికులు రణయాత్రకై చేయు ప్రయత్నము**

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

యుధిష్ఠిరం సహానీక ముపాయాన్తం యుయుత్సయా,
సన్నివిష్టం కురుక్షేత్రే వాసుదేవేన పాలితమ్. 1

విరాటద్రుపదాభ్యాం చ సపుత్రాభ్యాం సమన్వితమ్,
కేకయై ర్వృష్ణిభి శ్చైవ పార్థివైః శతశో వృతమ్. 2

మహేన్ద్ర మివ చాదిత్యై రభిగుప్తం మహారథైః,
శ్రుత్వా దుర్యోధనో రాజా కిం కార్యం ప్రత్యపద్యత. 3

ధర్మరాజు యుద్ధము చేయు కోరికతో శ్రీకృష్ణుడు కాపాడుచున్న సేనతో కూడి కొడుకులతో పాటు, విరాటుడు, ద్రుపదుడు, కేకయులు, వృష్ణులు, అను వారితో తక్కిన వందల కొలది రాజులతోపాటు దేవతలు రక్షించుచున్న మహేంద్రునివలె మహారథులు రక్షించుచుండగా కురుక్షేత్రమున నిలిచి యుండెనని విని దుర్యోధనమహారాజు ఏ పనిని చేపట్టెను?

ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం విస్తరేణ మహామతే,
సంభ్రమే తుములే తస్మిన్ యదాసీత్ కురుజాఙ్గలే. 4

ఓయి మేధావీ! ఆ కురుక్షేత్రమున ఏర్పడిన ఆ గందరగోళమంతయు విస్తరముగా వినగోరుచున్నాను.

వ్యథయేయు రిమే దేవాన్ సేన్ద్రానపి సమాగమే,
పాణ్డవా వాసుదేవశ్చ విరాట్ద్రుపదౌ తథా. 5
ధృష్టద్యుమ్నశ్చ పాఞ్చాల్యః శిఖణ్డీ చ మహారథః,
యుధామన్యుశ్చ విక్రాన్తో దేవై రపి దురాసదః. 6

ఆ పాండుకుమారులు, వాసుదేవుడు, విరాటుడు, ద్రుపదుడు, పాంచాలరాజు కొడుకు ధృష్టద్యుమ్నుడు, మహారథుడగు శిఖండి, గొప్ప పరాక్రమముగల వాడును, దేవతలకును గెల్వరానివాడును అగు యుధామన్యుడు తలపడినచో ఇంద్రునితో పాటు దేవతలను కూడ నొప్పింతురు.

ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం విస్తరేణ తపోధన,
కురూణాం పాణ్డవానాం చ యద్యదాసీ ద్విచేష్టితమ్. 7

కౌరవులకు పాండవులకు జరిగిన ఆ వికారపు చేష్ట యంతయు విస్తరముగా వినగోరుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ప్రతియాతే తు దాశార్హే రాజా దుర్యోధన స్తదా,
కర్ణం దుశ్శాసనం చైవ శకునిం చాబ్రవీ దిదమ్. 8

కృష్ణుడు తిరిగి వెళ్ళిన పిదప దుర్యోధనుడు కర్ణునితో, దుశ్శాసనునితో, శకునితో ఇట్లు పలికెను.

అకృతేనైవ కార్యేణ గతః పార్థా నధోక్షజః,
స ఏనా న్మన్యునావిష్టో ధ్రువం ధక్ష్యత్యసంశయమ్. 9

కృష్ణుడు వచ్చినపని సాధింపకయే పాండవులకడ కేగెను. కోపము పెల్లు రేగిన అతడు వీరిని బాగుగా ఉడికించును. సంశయము లేదు.

ఇష్టో హి వాసుదేవస్య పాణ్డవై ర్మమ విగ్రహః,
భీమసేనార్జునౌ చైవ దాశార్హస్య మతే స్థితౌ. 10

ఆ వాసుదేవునకు పాండవులతో నేను పగపెట్టుకొనుట యిష్టము. భీమార్జును లాతని యిష్టము ననుసరించియే ప్రవర్తింతురు.

అజాతశత్రు రత్యర్థం భీమసేనవశానుగః,
నికృతశ్చ మయా పూర్వం సహ సర్వైః సహోదరైః. 11

అజాతశత్రువగు ధర్మరాజు భీమునకు లోబడియుండును. మరియు నేను నా తమ్ములతో కలసి, ఆతనికి ఆతని తమ్ములకును మునుపు కీడు చేసియుంటిని.

విరాట్ద్రుపదౌ చైవ కృతవైరౌ మయా సహ,
తౌ చ సేనాప్రణేతారౌ వాసుదేవవశానుగౌ. 12

విరాట్ద్రుపదులును నాతో విరోధము పెట్టుకొనియున్నారు. వారిపుడు సేనలను నడుపుచున్నారు. మరియు వాసుదేవుని వశమున నడచుకొందురు.

భవితా విగ్రహః సోఽయం తుములో రోమహర్షణః,
తస్మాత్ సాంగ్రామికం సర్వం కారయధ్వ మతన్ద్రితాః. 13

కావున ఇదిగో ఘోరమయిన విరోధము వచ్చిపడనున్నది. తలచుకొన్నచో ఒడలు గగుర్పొడుచుచున్నది. కావున మీరందరు, మెలకువతో యుద్ధమునకు ఏర్పాటులు చేయవలయును.

శిబిరాణి కురుక్షేత్రే క్రియన్తాం వసుధాధిపాః,
స్వపర్యాప్తావకాశాని దురాదేయాని శత్రుభిః. 14

కావున రాజులారా! మీకు తగినంత వెసులుబాటు గలుగునట్లుగా, పగవారికి చొరశక్యముకాని శిబిరములను ఏర్పాటుచేయుడు.

ఆసన్నజలకోష్ఠాని శతశోఽథ సహస్రశః,
అచ్ఛేద్యాహారమార్గాణి బన్ధోచ్ఛ్రయచితాని చ. 15

అందుబాటులో నీరు సమృద్ధిగా గల గదులను, శత్రువులు చెరుపజాలని ఆయా వస్తువులు తెచ్చుకొను మార్గములు గలవానిని, చక్కని కూర్పు గలవానిని నూర్లకొలదిగా వేలకొలదిగా కూర్పుడు.

---

15. ఆసన్నజలకోష్ఠాని-నీరు దగ్గరగా నున్న గదులు గలదానిని, అచ్ఛేద్య-ఆహారమార్గాణి - శత్రువులు పాడుచేయజాలని వస్తువులు కొనితెచ్చు మార్గముగలవానిని, బన్ధ-ఉచ్ఛ్రయ-చితాని - కట్టలు కట్టి ఎత్తుగా పేర్చిన వస్తువుల సముదాయములు కలవానిని.

వివిధాయుధపూర్ణాని పతాకాధ్వజవన్తి చ,
సమాశ్చ తేషాం పన్థానః క్రియన్తాం నగరాద్బహిః. 16

పలువిధములగు ఆయుధములతో నిండినవానిని, జెండాలు, ధ్వజములు గలవానిని కూర్పుడు. నగరము వెలుపల వాని కవసరమగు బాటలు చక్క జేయుడు.

ప్రయాణం ఘుష్యతా మద్య శ్వోభూత ఇతి మా చిరమ్,
తే తథేతి ప్రతిజ్ఞాయ శ్వోభూతే చక్రిరే తథా. 17
హృష్టరూపా మహాత్మానో నివాసాయ మహీక్షితామ్.

'రేపే ప్రయాణమని యిప్పుడే చాటింపుడు. జాగుసేయవలదు.' అని దుర్యోధనుడు చెప్పగా వారట్లే యని నొక్కి చెప్పి రాజుల బసకై అన్ని యేర్పాటులు ఉల్లాసముతో మరునాడే కావించిరి.

తత స్తే పార్థివాః సర్వే తచ్ఛ్రుత్వా రాజశాసనమ్, 18
ఆసనేభ్యో మహార్హేభ్యో ఉదతిష్ఠ న్నమర్షితాః,
బాహూన్ పరిఘసంకాశాన్ సంస్పృశన్తః శనైః శనైః, 19
కాఞ్చనాఙ్గదదీప్తాంశ్చ చన్దనాగురుభూషితాన్.

అంత నా రాజు లందరు ప్రభుశాసనము విని ఆవేశముతో పొంగిపోవుచు, గడియలవంటివియు, బాహుపురులతో తళతళలాడుచున్నవియు, అగురుతో అలరారుచున్నవియు నగు చేతులను మెల్లమెల్లగా తాకుచు గొప్పవెంగల ఆసనముల నుండి ఎగిరిపడుచుండిరి.

ఉష్ణీషాణి నియచ్ఛన్తః పుణ్డరీకనిభైః కరైః,
అన్తరీయోత్తరీయాణి భూషణాని చ సర్వశః. 20

పద్మములవంటి చేతులతో తలపాగలను, ధోవతులను, ఉత్తరీయములను ఆభరణములను చక్కజేసికొనుచుండిరి.

తే రథాన్ రథినః శ్రేష్ఠా హయాంశ్చ హయకోవిదాః,
సజ్జయన్తి స్మ నాగాంశ్చ నాగశిక్షా స్వనుష్ఠితాః. 21

శ్రేష్ఠులగు రథములవారు రథములను, అశ్వవిద్యలో ఆరితేరినవారు గుఱ్ఱములను, ఏనుగుల తీర్పులో నేర్పుగలవారు ఏనుగులను సిద్ధము చేయుచుండిరి.

అథ వర్మాణి చిత్రాణి కాఞ్చనాని బహూని చ,
వివిధాని చ శస్త్రాణి చక్రుః సర్వాణి సర్వశః. 22

చిత్రచిత్రములగు బంగారు కవచములను పెక్కింటిని, పలువిధములగు ఆయుధము లన్నింటిని అన్నివైపులనుండి సిద్ధము చేయుచుండిరి.

పదాతయశ్చ పురుషాః శస్త్రాణి వివిధాని చ,
ఉపాజహ్రుః శరీరేషు హేమచిత్రాణ్యనేకశః. 23

కాలుబలమునందలి పురుషులు బంగారు వన్నెచిన్నెలు గల పలుతీరుల ఆయుధములను ఒడలియందు కట్టుకొనుచుండిరి.

తదుత్సవ ఇవోదగ్రం సంప్రహృష్టనరావృతమ్,
నగరం ధార్తరాష్ట్రస్య భారతాసీత్సమాకులమ్. 24

ఉప్పొంగు ఉత్సాహముగల నరులతో నిండిన దుర్యోధనుని నగర మంతయు పండుగనా డున్నట్లు ఆర్భాటముతో విరాజిల్లెను.

జనౌఘసలిలావర్తో రథనాగాశ్వమీనవాన్,
శఙ్ఖదున్దుభినిర్ఘోషః కోశసఞ్చయరత్నవాన్. 25
చిత్రాభరణవర్మోర్మిః శస్త్రనిర్మలఫేనవాన్,
ప్రాసాదమాలాద్రివృతో రథ్యాపణమహాహ్రదః. 26
యోధచన్ద్రోదయోద్భూతః కురురాజమహార్ణవః,
వ్యదృశ్యత తదా రాజం శ్చన్ద్రోదయ ఇవోదధిః. 27

కురురాజు మహాసేనాసముద్రము చంద్రోదయము నాటి మహాసముద్రము వలె కన్పట్టెను. అందు మనుజుల గుంపులే సుడులు. రథములు, ఏనుగులు, గుఱ్ఱములు అనునవియే పెనుచేపలు. శంఖములయు, దుందుభులయు రొదలే ఘోష. ధనరాశులే రత్నములు. చిత్రములగు కవచములు భూషణములు తరంగములు. ఆయుధములే స్వచ్ఛమగు నురుగు. పెద్దపెద్ద భవనముల వరుసలే కొండలు. బాటలు, విపణివీథులు జలాశయములు. యోధుల విజృంభణమే చంద్రోదయము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
దుర్యోధనసైన్యసజ్జకరణే త్రిపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
దుర్యోధనుని సేన సిద్ధమగుట యను నూటయేబదిమూడవ అధ్యాయము.

—: o :—

# చతుఃపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

# నూటయేబదినాలుగవ అధ్యాయము

యుధిష్ఠిరస్య శ్రీకృష్ణం ప్రతి కాలప్రాప్తకర్తవ్యజిజ్ఞాసా, భగవతా యుద్ధస్యైవ కర్తవ్యతయోపపాదనం, యుధిష్ఠిరసంతాపః, శ్రీకృష్ణవచనానామర్జునేన సమర్థనమ్.

**యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని తత్కాలమున చేయదగిన దేమి యని యడుగుట, శ్రీకృష్ణుడు యుద్ధమే కర్తవ్యమని నిరూపించుట, యుధిష్ఠిరుడు మనమున కష్టపడుట, అర్జునుడు శ్రీకృష్ణుని మాటలను సమర్థించుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

వాసుదేవస్య తద్వాక్య మనుస్మృత్య యుధిష్ఠిరః,
పునః పప్రచ్ఛ వార్ష్ణేయం కథం మన్దోఽబ్రవీ దిదమ్. 1

వాసుదేవుని పలుకు ననుసరించి ధర్మరాజు కృష్ణుని మరల నిట్లడిగెను. ఏమీ! ఆ బుద్ధిహీను డిట్లు పలికెనా?

అస్మి న్నభ్యాగతే కాలే కించ నః క్షమ మచ్యుత,
కథం చ వర్తమానా వై స్వధర్మా న్న చ్యవేమహి. 2

అచ్యుతా! కాల మిట్లు వచ్చి పడినది. ఇప్పుడు మనము ఏమి చేయదగును? ఏమి చేసినచో మనము మన ధర్మమునుండి జారకుందుము?

దుర్యోధనస్య కర్ణస్య శకునేః సౌబలస్య చ,
వాసుదేవ మతజ్ఞోఽసి మమ సభ్రాతృకస్య చ. 3

వాసుదేవా! నీవు దుర్యోధనుని, కర్ణుని, సుబలరాజగు శకునియొక్కయు అభిప్రాయము లెరిగినవాడవు. మా తమ్ములతో కూడిన నా అభిప్రాయము కూడ ఎరుగుదువు.

విదురస్యాపి తద్వాక్యం శ్రుతం భీష్మస్య చోభయోః,
కున్త్యాశ్చ విపులప్రజ్ఞ ప్రజ్ఞా కార్త్స్న్యేన తే శ్రుతా. 4

విదురుడు, భీష్ముడు పలికినమాట వింటివి. గొప్ప ప్రజ్ఞ కలవాడవు. కుంతిభావమును కూడ మొత్తముగా వినియున్నావు.

సర్వ మేత దతిక్రమ్య విచార్య చ పునః పునః,
క్షమం యన్నో మహాబాహో తద్బ్రవీహ్యవిచారయన్. 5

కృష్ణా! ఇది యంతయు అటుంచి, నీవు చక్కగా మరల మరల ఆలోచించి, సంకోచము విడనాడి మనకేది తగినదో దానిని చెప్పుము.

శ్రుత్వైతద్ధర్మరాజస్య ధర్మార్థసహితం వచః,
మేఘదున్దుభినిర్ఘోషః కృష్ణో వాక్య మథాబ్రవీత్. 6

ధర్మమును అర్థమును సాధించుటకై ధర్మరాజు పలికిన మాట విని శ్రీకృష్ణుడు ఉరుమువంటి, దుందుభినాదము వంటి కంఠస్వరముతో నిట్లు పలుకజొచ్చెను.

కృష్ణ ఉవాచ - కృష్ణు డిట్లు పలికెను.

ఉక్తవానస్మి యద్వాక్యం ధర్మార్థసహితం హితమ్,
న తు తన్నికృతిప్రజ్ఞే కౌరవ్యే ప్రతితిష్ఠతి. 7

నేను ధర్మమునకు, అర్థమునకు భంగమురాని మేలైనమాట చెప్పితిని. కాని వంచనలో పండితుడైన ఆ దుర్యోధనునియం దది కుదురుకొనదు.

న చ భీష్మస్య దుర్మేధాః శృణోతి విదురస్య వా,
మమ వా భాషితం కిఞ్చిత్ సర్వ మేవాతివర్తతే. 8

ఆ పాడుబుద్ధివాడు భీష్ముని మాటగాని నా మాటగాని కొంచెమేని వినడు. చిటారుకొమ్మ యెక్కి కూర్చున్నాడు.

నైష కామయతే ధర్మం నైష కామయతే యశః,
జితం స మన్యతే సర్వం దురాత్మా కర్ణ మాశ్రితః. 9

7. నికృతిప్రజ్ఞే - వంచనయందు బుద్ధికుశలతగల వానియందు.
8. సర్వమ్, అతివర్తతే ఏవ - ఏ హద్దును లేక ప్రవర్తించునని భావము;

వానికి ధర్మము కాబట్టదు. కీర్తి కాబట్టదు. ఆ దుర్మార్గుడు కర్ణుని పట్టి వ్రేలాడుచు అంతయు గెలిచినట్లే భావించుచున్నాడు.

బన్ధ మాజ్ఞాపయామాస మమ చాపి సుయోధనః,
న చ తం లబ్ధవాన్ కామం దురాత్మా పాపనిశ్చయః. 10

ఆ దురాత్ముడు, పాపనిర్ణయములు చేయు దుర్యోధనుడు నన్నే కట్టిపడ వేయ నాజ్ఞ యిచ్చెను. కాని వాని కోరిక తీరలేదు.

న చ భీష్మో న చ ద్రోణో యుక్తం తత్రాహతు ర్వచః,
సర్వే త మనువర్తన్తే ఋతే విదుర మచ్యుత. 11

భీష్ముడు కాని, ద్రోణుడు కాని అపుడు తగిన మంచిమాట పలుకకుండిరి. ఒక్క విదురుడు మాత్రము వానికి లోబడకున్నాడు.

శకునిః సౌబలశ్చైవ కర్ణదుఃశాసనా వపి,
త్వయ్యయుక్తా న్యభాషన్త మూఢా మూఢ మమర్షణమ్. 12

బుద్ధిలేనివారగు శకుని, కర్ణుడు, దుశ్శాసనుడు అసూయాపరుడైన ఆ మూఢునే యనుసరించుచు నీ విషయమున పనికిమాలిన పలుకులు పలికిరి.

కించ తేన మయో క్తేన యాన్యభాషత కౌరవః,
సంక్షేపేణ దురాత్మాఽసౌ న యుక్తం త్వయి వర్తతే. 13

వాడు కూసిన కూతలన్నియు నేను చెప్పనేల ? కొలదిలో చెప్పవలసినచో వాడు నిలువెల్ల దుష్టుడు. నీయందు సరిగా మెలగడు.

పార్థివేషు న సర్వేషు య ఇమే తవ సైనికాః,
యత్ పాపం యన్న కల్యాణం సర్వం తస్మిన్ ప్రతిష్ఠితమ్. 14

---

11. తత్ర - బంధింప వచ్చిన సమయమందు - ఇక్కడ 'యుక్తమ్' అనగా, ఏదో నీతులు చెప్పుట యని కృష్ణుని తాత్పర్యము కాదు. తగిన దండనీతి ప్రయోగింప వలయునని భావము.

అచ్యుత - ఇది ధర్మరాజునకు సంబోధన - ధర్మమునుండి జారని వాడా ! అను తాత్పర్యము గ్రహింపదగును.

14. న కల్యాణమ్ - చెడు ధోరణి - నీ వారియందు లేని పాపము, అధర్మ ధోరణి దుర్యోధనునియందు స్థిరముగా నున్నవని భావము.

నీ వైపు యుద్ధము చేయగోరి వచ్చిన రాజులందరియందు లేని పాపము, లేని అపభమగు తీరు వానియందు గూడుకట్టుకొని కూర్చున్నది.

న చాపి వయ మత్యర్థం పరిత్యాగేన కర్హిచిత్,
కౌరవైః శమ మిచ్ఛామ స్తత్ర యుద్ధ మనన్తరమ్. 15

మనము ఎన్నటికిని అంతయు వదలుకొని కౌరవులతో శాంతిని కోరము. ఇక యుద్ధమే తరువాయి.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తచ్ఛ్రుత్వా పార్థివాః సర్వే వాసుదేవస్య భాషితమ్,
అబ్రువన్తో ముఖం రాజ్ఞః సముదైక్షన్త భారత. 16

కృష్ణుని మాట విన్న రాజులందరు ఏమియు పలుకక రాజు మొగము చూచుచుండిరి.

యుధిష్ఠిర స్త్వభిప్రాయ మభిలక్ష్య మహీక్షితామ్,
యోగ మాజ్ఞాపయామాస భీమార్జునయమైః సహ. 17

ధర్మరాజు రాజుల అభిప్రాయము గుర్తించి భీమార్జునులను నకులసహదేవులతో పాటు యుద్ధప్రయత్నములు చేయ నాజ్ఞాపించెను.

తతః కిలకిలాభూత మనీకం పాణ్డవస్య హ,
ఆజ్ఞాపితే తదా యోగే సహ హృష్య న్త సైనికాః. 18

అంత పాండవసేనలో కిలకిలారావములు చెలరేగెను. యుద్ధప్రయత్నమునకు ఆజ్ఞ వెలువడిన వెంటనే సైనికులు సంతోషముతో పొంగిపోయిరి.

అవధ్యానాం వధం పశ్యన్ ధర్మరాజో యుధిష్ఠిరః,
నిఃశ్వసన్ భీమసేనం చ విజయం చేద మబ్రవీత్. 19

చంపదగని వారిని చంపుచున్నామే యన్న భావముతో యుధిష్ఠిరుడు నిట్టూర్చుచు భీమసేనునితో, అర్జునునితో ఇట్లు పలికెను.

---

15. పరిత్యాగేన - రాజ్యము నుపేక్షించుటచేత; అనన్తరమ్ - వెంటనే చేయదగిన పని.

17. యోగమ్ - యుద్ధమునకు సంబంధించిన ఉద్యోగమును-ప్రయత్నమును.

యదర్థం వనవాసశ్చ ప్రాప్తం దుఃఖం చ యన్మయా,
సోఽయ మస్మా నుపైత్యేవ పరోఽనర్థః ప్రయత్నతః. 20

ఏది కలుగరాదని అడవుల బడి పరమదుఃఖ మనుభవించితినో ఆ పెను కీడు బలాత్కారముగా మనపై ఇదిగో వచ్చిపడినది.

తస్మిన్ యత్నః కృతోఽస్మాభిః స నో హీనః ప్రయత్నతః,
అకృతే తు ప్రయత్నేఽస్మా నుపావృత్తః కలిర్మహాన్. 21

అది నిమిత్తముగా మన మెంతో ప్రయత్నము చేసి శత్రువధ చేయ కుంటిమి. ప్రయత్నము చేయకున్నను మనలను గొప్పపాపము చుట్టుకొను చున్నది.

కథం హ్యవధ్యైః సంగ్రామః కార్యం సహ భవిష్యతి,
కథం హత్వా గురూన్ వృద్ధాన్ విజయో నో భవిష్యతి. 22

చంపదగని వారితో పోరెట్లు చేయదగును ? గురువులను, పెద్దలను చంపి నచో మన కది జయ మెట్లగును ?

తచ్ఛ్రుత్వా ధర్మరాజస్య సవ్యసాచీ పరంతపః,
యదుక్తం వాసుదేవేన శ్రావయామాస తద్వచః. 23

---

20. యదర్థమ్ - దేనిని తప్పించుటకై;
సోఽయమ్ - కులక్షయరూపమైన ఆ పాపము.

21. తస్మిన్ - ఆ కీడు నిమిత్తము కాగా; యత్నః- ఆ కులక్షయము కాకుండు ఉపాయము - అప్పటి కప్పుడు శత్రువులను రూపుమాపుట అను-భీము నికి ఇష్టమైన ఉపాయము, అస్మాభిః - శాంతిని కోరెడు మనచేత; ప్రయత్నతః - ప్రయత్నపూర్వకముగా; హీనః - వ్యర్థమైనదిగా చేయ బడినది. అకృతే తు ప్రయత్నే - ప్రయత్నము చేయకున్నను; మహాన్- గొప్ప; కలిః - పాపము; అస్మాన్ - మనలను; ఉపావృత్తః - చుట్టు కొన్నది - కులక్షయము కారాదని ద్యూతకాలమున ఎంతో నిగ్రహము పూని అప్పటి కప్పుడు శత్రువులను చంపుట యను పాపము చేయక పడరాని పాట్లు పడితిమి. ఇప్పుడు మనమై యుద్ధప్రయత్నము చేయకు న్నను ఆ పాపము మనకు చుట్టుకొనుచునే యున్నదని భావము.

ధర్మరాజు పలుకు విన్న అర్జునుడు వాసుదేవుడు పలికిన ఆ మాటనే వినిపించెను.

ఉక్తవాన్ దేవకీపుత్రః కున్త్యాశ్చ విదురస్య చ,
వచనం తత్త్వయా రాజన్ నిఖిలేనావధారితమ్. 24

రాజా! కుంతియు, విదురుడు చెప్పిన మాట నీకు కృష్ణుడు తెలిపెను. అది యంతయు నీవు గుండెకు పట్టించుకొంటివి.

న చ తౌ వక్ష్యతోఽధర్మ మితి మే నైష్ఠికీ మతిః,
నాపి యుక్తం చ కౌన్తేయ నివర్తితు మయుధ్యతః. 25

వారిరువురు అధర్మము నెన్నటికిని చెప్పరని నా తిరుగులేని అభిప్రాయము. మరియు కుంతీకుమారా! నీవు నేడు యుద్ధము చేయక మరలుటయు తగినపని కాదు.

తచ్ఛ్రుత్వా వాసుదేవోఽపి సవ్యసాచివచ స్తదా,
స్మయమానోఽ బ్రవీద్వాక్యం పార్థ మేవ మితి బ్రువన్. 26

అర్జునుని మాట విన్నపిదప కృష్ణుడు చిరునవ్వు నవ్వుచు ధర్మరాజుతో 'అది యట్టిదే' యని పలికెను.

తత స్తే దృఢసంకల్పా యుద్ధాయ సహ సైనికాః,
పాణ్డవేయా మహారాజ తాం రాత్రిం సుఖ మావసన్. 27

మహారాజా! అంత ఆ కుంతీకుమారులు సైనికులతోపాటు చెదరని సంకల్పము కలవారై ఆ రాత్రి సుఖముగా నుండిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
యుధిష్ఠిరార్జునసంవాదే చతుఃపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
ధర్మరాజార్జునసంవాదముగల నూటయేబదినాలుగవ అధ్యాయము.

—: ౦ :—

25. తౌ-ఆ కుంతీవిదురులు; అధర్మమ్ - ధర్మముకానిదానిని; న వక్ష్యతః - పలుకరు; ఇతి - అని; మే-నా; నైష్ఠికీ - తిరుగులేని; మతిః-అభిప్రాయము. అయుధ్యతః - యుద్ధము చేయక; నివర్తితుమ్, అపి - మరలుటయు; న యుక్తమ్ - తగదు.

## పఞ్చపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

## నూటయేబదిఅయిదవ అధ్యాయము

దుర్యోధనకర్తృకం స్వీయసైన్యవిభాజనమ్.
పృథక్పృథగక్షౌహిణీపతీనా మభిషేచనం చ.

దుర్యోధనుడు తనసైన్యమును భాగములుగా చేయుట,
అక్షౌహిణులకు విడివిడిగా సేనాపతులను నిర్ణయించి
వారి కభిషేకము చేయుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

వ్యుష్టాయాం వై రజన్యాం హి రాజా దుర్యోధన స్తతః,
వ్యభజ త్తాన్యనీకాని దశ చైకం చ భారత. 1

ఆ రాత్రి గడచిన పిమ్మట దుర్యోధనుడు తన సేనలను పదునొకండు భాగములుగా చేసెను.

నరహస్తిరథాశ్వానాం సారం మధ్యం చ ఫల్గు చ,
సర్వేష్వేతేష్వనీకేషు సందిదేశ నరాధిపః. 2

కాల్బంటులు, ఏనుగులు, రథములు, గుఱ్ఱములు అనువానిలో ముందు, నడుమ, వెనుక ఉండవలసినదానిని సేన లన్నింటియందును ఏర్పరచెను.

---

1. వ్యుష్టాయామ్ - గడువగా; రజన్యామ్ - రాత్రి.
2. సారమ్ - ముందు నడచునది; మధ్యమ్-నడుమ ఉండునది. ఫల్గు-సారము లేనిది - వెనుకవైపున నుండవలసినది.

సానుకర్షాః సతూణీరాః సవరూథాః సతోమరాః,
సోపాసఙ్గాః సశక్తికాః సనిషఙ్గాః సహర్ష్టయః. 3

అనుకర్షములు, పెద్ద అంపపొదులు, కవచములు, చిల్లకోలలు, అంపపొదులు, శక్తులు, నిషంగములు, ఈటెలు కలవారు.........

సధ్వజాః సపతాకాశ్చ సశరాసనతోమరాః,
రజ్జుభిశ్చ విచిత్రాభిః సపాశాః సపరిచ్ఛదాః. 4

ధ్వజములు, జెండాగుడ్డలు, వింటితో విసరు తోమరములు, విచిత్రములగు త్రాళ్ళుగల పాశములు, పరపులు మొదలగునవి కలవారు.......

సకచగ్రహవిక్షేపాః సతైలగుడవాలుకాః,
సాశీవిషఘటాః సర్వే ససర్జరసపాంసవః. 5

---

3. ఈ శ్లోకము మొదలుకొని 10వ శ్లోకమున గల "నానామణివిభూషితాః" అన్నంతవరకు గల విశేషణము లన్నియు "చిత్రానీకాః" - అనుదానికి సంబంధించినవి; - సానుకర్షాః - అనుకర్షములు గలవారు. అనుకర్షమనగా రథముయొక్క అవయవము ఏదైన పోయినయెడల సరిచేయుట కుపయోగించు కొయ్య. దీనిని రథముక్రింద కట్టి యుందురు. 'అనుకర్షో రథాధఃస్థదారుణి' అని మేదిని. తూణీరము, ఉపాసంగము, నిషంగము - అనునవి అంపపొదులలో భేదములు. తూణీరము చాల పెద్దది; రథములు దీనిని మోయును, ఉపాసంగము - గుఱ్ఱములు, ఏనుగులు మోయగల బాణముల పొది; నిషంగము-కాల్బంటులు మోయు పొది. సవరూథాః - రథములపై రక్షణకు వేయు చర్మపు తొడుగును వరూథమందురు. అది కలవారు; తోమరము అనగా-చేతితో విసరెడు ములుకులు గల కఱ్ఱలు, శక్తి అనగా ఇనుపదండము; ఋష్టి యనగా పెద్దబరువు గల కత్తి.

4. శరాసనతోమరాః-వింటితో ప్రయోగించు లావుపాటి బాణములు. పాశము అనగా దగ్గరకు వచ్చిన వారిని మెడకు చుట్టి లాగుటకు వీలైన త్రాళ్ళు; పరిచ్ఛదము అనగా - పలుపులు, కంబళ్ళు మొదలగునవి.

5. కచగ్రహవిక్షేపాః - జుట్టును పట్టించి లాగుటకు వీలైన కఱ్ఱలు, వీని చివర జిగురు పదార్థ ముండును. ఆ దండమును విసరగా అది జుట్టునకు

సఘణ్టఫలకాః సర్వే సాయోగుడజలోపలాః,
సశాలభిన్దిపాలాశ్చ సమధూచ్ఛిష్టముద్గరాః. 6

ఘంటంతో కూడిన పలకలు, ఇనుము, బెల్లము కరగించిన పాకము, గుండ్లు, శాలములు, భిందివాలములు, మైనము, రోకలివంటి ఆయుధములు కలవారు.........

సకాణ్డదణ్డకాః సర్వే ససీరవిషతోమరాః,
సశూర్పవిటకాః సర్వే సదాత్రాఙ్కుశతోమరాః. 7

---

అంటుకొని సులభముగా ఊడిరాదు. కరగ్రహ మనియు పాఠము-అంకుశ మని అర్థము - నూనె, బెల్లము, ఇసుక వీనిని బాగుగా వేడిచేసి శత్రువులపై క్రుమ్మరింతురు. సాశీవిషఘటాః - పెద్ద భయంకరములగు పాములున్న కుండలు. వీనిని శత్రువుల మధ్య వదలుదురు; సర్జరసః- ఒకరకమగు పొడి - సాంబ్రాణి యననగును. దీనివలన నిప్పు చెలరేగును.

6. సఘణ్టఫలకాః - ఘంటలుగల పలకలు - ఆయుధముల చివరలు కలవారు-గంటలు గల చర్మము, కత్తులు, పట్టిసములు, చురకత్తులు మొదలగునవి కలవారని కొందరు.
గుడజలమ్ - బాగుగా వేడిచేసిన బెల్లము కరగించిన పాకము.
ఉపలాః - యంత్రములతో ప్రయోగించు గుండ్లు;
శాలములు - పెద్దగా ధ్వనిచేయు ఆయుధములు;
భిన్దిపాలాః - పెద్ద ఇనుప గుదియలు, 'సహూల' అనియు పాఠము - అప్పుడు హూలము ఆయుధముగా గలవారు.
మధూచ్ఛిష్టమ్ - తేనెపట్టులో తేనె తీసివేయగా మిగిలిన మైనము - దీనిని కూడ వేడిచేసి శత్రువుల మీద పోయుదురు.
ముద్గరములు - రోకలివంటి ఆయుధములు.

7. సకాణ్డదణ్డకాః - కాండమనగా బాణపు ములికి, దానితో కూడిన దండము కాండదండము - అది కలవారు; ముళ్ళున్న కఱ్ఱలు అను ఆయుధములు గలవారని భావము;

ముళ్లకట్టెలు, నాగళ్లు, విషతోమరములు, చేటల పెట్టెలు, కొడవళ్లు, రేగుముళ్లవంటి ముళ్లుగల తోమరములు గలవారు.

సకీలకవచాః సర్వే వాసీవృషాదనాన్వితాః,
వ్యాఘ్రచర్మపరివారా ద్వీపిచర్మావృతాశ్చ తే. 8

బొడిపెలున్న కవచములు కలవారు, కట్టెలలో గుట్టుగా నున్న ఆయుధములు, ఉలులు, పులితోళ్ళు, చిరుతపులితోళ్ళు కప్పుకొన్నవారు...

సహర్ష్టయః సశృఙ్గాశ్చ సప్రాసవివిధాయుధాః,
సకుఠారాః సకుద్దాలాః సతైలక్షౌమసర్పిషః. 9

---

సీరమనగా - నాగలి; అట్టి ఆయుధము, విషము పూసిన తోమరములు గలవారు;
సశూర్పపిటకాః - బాగుగా కాలిన బెల్లము ముక్కలు మొదలగువానిని విసరుట కుపయోగించు చేటలు, పిటకము అనగా అట్టి చేటలు గల పెట్టెలు - ఇవి కలవారు;
దాత్రము - కొడవలి. అంకుశతోమరాః-అంకుశములు కూర్చిన తోమరములు.

8. సకీలకవచాః - బొడిపెలున్న కవచములు గలవారు-ఇట్టివారిని పిడికిటి పోట్లతో నొప్పించుట కష్టము. సకీలక్రకచాః అనియు పాఠము. వాడి పళ్లుగల అంపములు గలవారని యర్థము. వాశీ లేక వాసీ అనగా-లోపల గుట్టుగా ఆయుధములున్న కట్టె. వృషాదనము లనగా - ఉలులు. వ్యాఘ్ర చర్మపరీవారాః - పులితోళ్లు కప్పుకొన్నవారు; ద్వీపి అనగా-చిరుతపులి.

9. సహ + ఋష్టయః - ద్రవిడదేశములో ప్రసిద్ధమగు, చేతితో విసరు వంకరగా నుండు ఆయుధము ఋష్టి - దానితో కూడినవారు; శృంగము లనగా - కొమ్ములు - వీనిని గదల దెబ్బలకు పోయిన రక్తమును వదలించుటకు ఉపయోగింతురట; లేదా మలమూత్రములను వదలుట కుపయోగింతురు. తైలక్షౌమాని - నూనె గుడ్డలు; వీని బూడిదను దెబ్బలు తగిలిన చోట అద్దుదురు. సర్పిః - నెయ్యి - వైద్యముకొరకుపయోగింతురు.

ఋష్టులు, కొమ్ములు, బల్లెములు, మరియు పెక్కువిధములగు ఆయుధములు, గొడ్డళ్ళు, గునపములు, నూనెగుడ్డలు, నేయి కలవారు.

రుక్మజాలప్రతిచ్ఛన్నా నానామణివిభూషితాః,
చిత్రానీకాః సువపుషో జ్వలితా ఇవ పావకాః. 10

బంగారు తీగలతో అల్లిన కవచములు ధరించినవారు, అనేకములగు మణిభూషణములు కలవారు, మంచి దేహములు కలవారు, అగ్నులవలె వెలుగొందుచున్నవారు నగు చిత్రచిత్రముల ధోరణులు గల సైనికులు అందు కలరు.

తథా కవచినః శూరాః శస్త్రేషు కృతనిశ్చయాః,
కులీనా హయయోనిజ్ఞాః సారథ్యే వినివేశితాః. 11

అట్లే గొప్ప కవచములుగల శూరులు, ఆయుధముల ప్రయోగములో ఆరితేరినవారు, గొప్ప కులమున పుట్టినవారు, గుఱ్ఱముల జాతుల నెరిగినవారు, రథము నడుపువృత్తిలో నేర్పుగలవారు కలరు.

బద్ధారిష్టా బద్ధకక్షా బద్ధధ్వజపతాకినః,
బద్ధాభరణనిర్యూహా బద్ధచర్మాసిపట్టిశాః. 12

తాయెతులు మొదలగువానిని, బిరుదములవంటివానిని, ధ్వజములు, పతాకలను, ఆభరణములు, శిఖరములు, ఒరలు, కత్తులు, పట్టిసములను కట్టుకొన్నవారు కలరు.

---

10. చిత్రానీకాః - చిత్రములైన సైన్యములు - చిత్ర చిత్రములుగా కానవచ్చు సైనికులని భావము. అనీకశబ్దము పుంలింగమును కలదు. "అనీకో౽స్త్రీ రణే సైన్యే" అని మేదినీనిఘంటువు.

12. బద్ధారిష్టాః - అరిష్టము లనగా అశుభములను పారద్రోలుటకై కట్టుకొను తాయెత్తుల వంటివి. అవి కట్టుకొన్నవారు; బద్ధకక్షాః - కక్షము లనగా గుఱ్ఱములు మొదలగు వాని తలలపై ఘంటలు, మాలలు, ముత్యములు మొదలగువాని గుత్తులతో కలిపి తమ ప్రతాపాతిశయమును వ్యక్తము చేయుటకు కట్టుకొను బిరుదము. అవి కట్టుకొన్నవారు "కక్షా స్యాద న్తరీయస్య పశ్చా దఞ్చలపల్లవే, స్పర్ధాపదే నా దోర్మూలే" అని మేదినీ నిఘంటువు.

బద్ధాభరణనిర్యూహాః - ఆభరణము లనగా నిచట చిరుగంటలు, నిర్యూహము లనగా సిగబంతులు, అట్టివి కలవారు.

చతుర్యుజో రథాః సర్వే సర్వే చోత్తమవాజినః,
సప్రాసబుష్టికాః సర్వే సర్వే శతశరాసనాః. 13

రథము లన్నియు నలుగురితో కూడియున్నవి. అందరు మేలు జాతి గుఱ్ఱములతో కూడియుండిరి. అందరి చేతులలో ఈటెలు, బల్లెములు కలవు. వందల కొలది విండ్లు పట్టియున్నారు.

ధుర్యయో ర్హయయో రేక స్తథాన్యౌ పార్ష్ణిసారథీ,
తౌ చాపి రథినాం శ్రేష్ఠౌ రథీ చ హయవి త్తథా. 14

రథమున కున్న నలుగు రెవ్వ రనగా-రథములకు కట్టిన రెండు గుఱ్ఱము లను చూచుకొనుట కొకడు, రథికులలో మేలు తరగతికి చెందిన చక్రరక్షకు లిద్దరు, గుఱ్ఱముల తత్త్వ మెరిగిన రథి యొకడు - ఇట్లు ప్రతిరథమునకు నలుగురు చొప్పున ఉందురు.

నగరాణీవ గుప్తాని దురాధర్షాణి శత్రుభిః,
ఆసన్ రథసహస్రాణి హేమమాలీని సర్వశః. 15

శత్రువులు ఆక్రమింపజాలనివి, నగరములవలె చక్కని రక్షణ కలవియు, బంగారు మాలలు కలవియు నగు వేలకొలది రథములు అచట నుండెను.

యథా రథా స్తథా నాగా బద్ధకక్షాః స్వలఙ్కృతాః,
బభూవుః సప్తపురుషా రత్నవన్త ఇవాద్రయః. 16

రథములవలెనే ఏనుగులుకూడ బిరుదములు కట్టుకొని చక్కగా అలంకరించుకొని యున్నవి. ఒక్కొక్క ఏనుగునకు ఏడుగురు మనుష్యులు కలరు. అట్లా ఏనుగులు రత్నములు కప్పిన కొండలలో యన్నట్లున్నవి.

---

14. 13 వ శ్లోకములో చెప్పిన నలుగు రెవ్వరో ఈ శ్లోకమున వివరించు చున్నారు. 1. రథి. 2. సారథి. 3, 4 - చక్రరక్షకులు. చక్రరక్షకులు కూడా గొప్ప యోధులు. ధుర్యయోః - ఇరుసుకు దగ్గరగా నున్న; హయయోః - గుఱ్ఱములకు; పార్ష్ణిసారథీ - చక్రరక్షకులు - ఇద్దరు.

15. హేమమాలీని - బంగారుమాలలు గలవి.

ద్వావఙ్కుశధరౌ తత్ర ద్వావుత్తమధనుర్ధరౌ,
ద్వౌ వరాసిధరౌ రాజన్నేకః శక్తిపినాకధృక్. 17

ఏనుగులపై నున్న యేడుగురు ఎవ్వరన - అంకుశములు పట్టినవా రిరువురు, మేలుజాతి విండ్లు పట్టినవా రిరువురు, మేలైన ఖడ్గములు ధరించిన వారిద్దరు, శక్తి త్రిశూలము పట్టినవా డొకడు.

గజై ర్మత్తైః సమాకీర్ణం సవర్మాయుధకోశకైః,
తద్బభూవ బలం రాజన్ కౌరవ్యస్య మహాత్మనః. 18

గొప్ప గుండెనిబ్బరముగల దుర్యోధనుని ఆ సేన మదించిన ఏనుగులతో, కవచములతో, ఆయుధములతో, ఒరలు మొదలగువానితో నిండియుండెను.

ఆముక్తకవచై ర్యుక్తైః సపతాకైః స్వలఙ్కృతైః,
సాదిభి శ్చోపపన్నాస్తు తథా చాయుతశో హయాః. 19

కవచములు దాల్చినవారును, పతాకలతో కూడినవారును, చక్కగా అలంకరించుకొన్నవారును అగు రథికులతో కూడిన గుఱ్ఱములు వేలకొలదిగా నుండెను.

అసంగ్రాహాః సుసంపన్నా హేమభాణ్డపరిచ్ఛదాః,
అనేకశతసాహస్రాః సర్వే సాదివశే స్థితాః. 20

---

17. అంకుశమును దాల్చినవారు ఏనుగులను అదుపులో పెట్టుదురు. విండ్లు పట్టిన యిద్దరు దూరముగా నున్నవారిని కొట్టుట కుపయోగపడుదురు. కత్తి పట్టినవారు దగ్గరగా వచ్చిన శత్రువులను కొట్టుదురు, శక్తి, త్రిశూలము ధరించినవారు అల్లంత దూరమున నున్న శత్రువులను కొట్టుదురు. పినాక మనగా త్రిశూలము.

19. సాదిభిః - గుఱ్ఱపురౌతులతో.

20. అసంగ్రాహాః-సంగ్రాహ మనగా ముందు రెండుకాళ్లను పైకెత్తి హేషితము (గుఱ్ఱపు అరపు) చేయుచు గంతులు వేయుట - అట్టివి లేనివి, కనుకనే, సుసంపన్నాః - చక్కని శిక్షణ కలవి; భాండ మనగా అశ్వములకు పెట్టు ఆభరణములు, పరిచ్ఛద మనగా పైని కప్పు వస్త్రములు - అవి కలవి.

సంగ్రాహములు లేనివియు, చక్కని శిక్షణ కలవియు, బంగారు తొడవులు గలవియు, రథికుని అదుపులో నిలుచునవియు నగు లక్షలకొలది గుఱ్ఱములు అందు కలవు.

నానారూపవికారాశ్చ నానాకవచశస్త్రిణః,
పదాతినో నరా స్తత్ర బభూవు ర్హేమమాలినః. 21

పెక్కు రూపవికారములు గలవారు, అనేకవిధములగు కవచములు, ఆయుధములు కలవారు, బంగారు దండగలవారు నగు కాల్బలము మానవులు అందు కలరు.

రథ స్యాసన్ దశ గజా గజస్య దశ వాజినః,
నరా దశ హయ స్యాసన్ పాదరక్షాః సమన్తతః. 22

ఒక రథమునకు పది యేనుగులు, ఒక ఏనుగునకు పది గుఱ్ఱములు, ఒక గుఱ్ఱమునకు పదిమంది నరులు పరివారమై అంతట నిలిచిరి.

రథస్య నాగాః పఞ్చాశ న్నాగస్యాసన్ శతం హయాః,
హయస్య పురుషాః సప్త భిన్నసన్ధానకారిణః. 23

ఒక రథమునకు ఏబది యేనుగులు, ఒక యేనుగునకు నూరు గుఱ్ఱములు, ఒక గుఱ్ఱమునకు ఏడుగురు నరులు, చెదిరినవారిని ఒకచోటికి తెచ్చుటకై యుండిరి.

---

21. నానారూపవికారాః - ఎరుపు, నలుపు మొదలగు రంగులు, గుఱ్ఱము మొగము వంటి మొగము మొదలగుతీరులు గలవారు.

22. ఈ శ్లోకములో చెప్పిన విభాగము ప్రకారము ఒక రథమునకు పది యేనుగులు, వందగుఱ్ఱములు, వేయిమంది నరులు పరివారముగా నుందురని భావము.

23. పై శ్లోకమున చెప్పిన దొక పద్ధతి - మరియొకపద్ధతి ఈ శ్లోకమున చెప్పుచున్నారు. దీని ప్రకారము ఒక రథమునకు ఏబది ఏనుగులు, అయిదువేల గుఱ్ఱములు, ముప్పదియైదువేల కాల్బంటులు పరివారముగా నుందురని తాత్పర్యము.

ఇచట రథములలో పరివారమునందలి సంఖ్యాభేదము ప్రధానవ్యక్తులు, అప్రధానవ్యక్తులు అనుదానినిబట్టి హెచ్చుతగ్గులుగా నుండునని తెలియదగును.

సేనా పఞ్చశతం నాగా రథా స్తావ న్త ఏవ చ,
దశ సేనా చ పృతనా పృతనాదశ వాహినీ. 24

అయిదు వందల ఏనుగులు, అయిదు వందల రథములు గల దానిని సేన యందురు. అట్టి సేన పదిరెట్లయినచో పృతన యగును. పృతన పదిరెట్లయినచో వాహిని.

సేనా చ వాహినీ చైవ పృతనా ధ్వజినీ చమూః,
అక్షౌహిణీతి పర్యాయై ర్నిరుక్తా చ వరూధినీ. 25

సేన, వాహిని, పృతన, ధ్వజిని, చమువు, అక్షౌహిణి అను వేరు వేరు పేర్లతో సేనను నిర్వచింతుము.

---

24. ఈ ప్రకరణమున ఈ పరివార సంఖ్యలో హెచ్చుతగ్గులు ప్రాధాన్యము-అప్రాధాన్యము అనువాని దృష్టితో చెప్పుట జరిగినది. సాధారణ సంఖ్య ఆదిపర్వమున "ఏకో రథో గజస్త్వేకో నరాః పఞ్చ పదాతయః, త్రయశ్చ తురగా స్తజ్జ్ఞైః పత్తి రిత్యభిధీయతే" ఒక రథము, ఒక యేనుగు, అయిదుగురు కాల్బంటులు, మూడు గుఱ్ఱములు కలదానిని పత్తి యందురు - మొదలగు శ్లోకములందు వివరించిరి. దాని ననుసరించియే యీ శ్లోకమును చెప్పుచున్నారు. ఇందు రథములకు, ఏనుగులకు సమాన సంఖ్య చెప్పుట - గుఱ్ఱములయు, నరులయు సంఖ్యను సూచించును. దానివలన సేనయందు, అయిదు వందల ఏనుగులు, అయిదు వందల రథములతో పాటు పదునైదు వందల గుఱ్ఱములు, ఇరువదియైదు వందల మంది నరులుందురని తెలియనగును. పృతనయందు అయిదు వేల ఏనుగులు, అయిదు వేల రథములు, ఇరువదియైదువేల నరులు, పదునైదువేల గుఱ్ఱములు నుండును. వాహినియందు ఏబదివేల ఏనుగులు, ఏబదివేల రథములు, రెండున్నర లక్షల మంది నరులు, లక్షన్నర గుఱ్ఱములు ఉండును.

25. ఇట్లు చెప్పినను ఆదిపర్వమున చెప్పిన లెక్క సరిపోవుట లేదు. ఆ శంకకు సమాధానముగా ఈ శ్లోకమును చెప్పుచున్నారు. సేన, పృతన, వాహిని మొదలగునవి పర్యాయవాచకములే కాని సంఖ్యలోని భేదములను పురస్కరించుకొని భిన్నార్థములు కలవిగా భావింపరాదు. ఎట్లన ఒక్క

ఏవం వ్యూఢాన్యనీకాని కౌరవేయేణ ధీమతా,
అక్షౌహిణ్యో దశైకా చ సఙ్ఖ్యాతాః సప్త చైవ హ. 26

తెలివిగల కురురాజు ఇట్లు సేనలను మోహరించెను. ఒక వైపు అక్షౌహిణులు పదునొకండు, మరియొకవైపు ఏడుగా లెక్కకు వచ్చినవి.

అక్షౌహిణ్యస్తు సప్తైవ పాణ్డవానా మభూ ద్బలమ్,
అక్షౌహిణ్యో దశైకా చ కౌరవాణా మభూ ద్బలమ్. 27

పాండవుల బలము ఏడు అక్షౌహిణు లాయెను. కౌరవుల బలము పదునొకం డక్షౌహిణు లాయెను.

నరాణాం పఞ్చ పఞ్చాశ దేషా పత్తి ర్విధీయతే,
సేనాముఖం చ తిస్ర స్తా గుల్మ ఇత్యభిశబ్దితమ్. 28

ఏబదియైదుగురు నరులు గలదానిని పత్తి యందురు. దానికి మూడు రెట్లు సేనాముఖము. అది మూడురెట్లయినచో గుల్మము.

త్రయో గుల్మా గణ స్త్వాసీద్ గణా స్త్వయుతశోఽభవన్,
దుర్యోధనస్య సేనాసు యోత్స్యమానాః ప్రహారిణః. 29

మూడు గుల్మము లొక గణము. దుర్యోధనుని సేనలయందు యుద్ధము చేయు ఆయుధధారుల గణములు వేలకొలదిగా గలవు.

తత్ర దుర్యోధనో రాజా శూరాన్ బుద్ధిమతో నరాన్,
ప్రసమీక్ష్య మహాబాహు శ్చక్రే సేనాపతీం స్తదా. 30

అందు దుర్యోధనమహారాజు బుద్ధిమంతులైన వారిని చక్కగా పరికించి సేనాపతులనుగా నియమించెను.

---

భీమసేనుని యందే పదివేల ఏనుగుల బల మున్నట్లు చెప్పబడినది. ఇట్లు బల పరిగణనమును బట్టియే పదునొకండు, ఏడు అక్షౌహిణుల లెక్క కాని కేవలము లెక్క ప్రకారము, పాండవుల బలము సంఖ్య కౌరవ బలము సంఖ్య కంటె తక్కువ అయినను, లెక్కింప శక్యము కాని శ్రీకృష్ణుని బలము సహాయముగా నున్నందువలన వారికి జయము కలిగెనని సంభావింపదగును.

29 అయుతశః - అయుత మనగా పదివేలు- వేల కొలదిగా ననుటచే లెక్క పెట్టజాలని, సంఖ్యలో కొల్చంటులు కలరను సర్థము వ్యక్తమగుచున్నది.

పృథగక్షౌహిణీనాం చ ప్రణేతౄ న్నరసత్తమాన్,
విధివత్ పూర్వ మానీయ పార్థివా నభ్యభాషత. 31

నరులలో శ్రేష్ఠులగు అక్షౌహిణీనాయకు లందరిని విడివిడిగా రావించి వారితో మంచి మాటలు పలుకుచుండెను.

కృపం ద్రోణం చ శల్యం చ సైన్ధవం చ జయద్రథమ్,
సుదక్షిణం చ కాంబోజం కృతవర్మాణ మేవ చ. 32
ద్రోణపుత్రం చ కర్ణం చ భూరిశ్రవస మేవ చ,
శకునిం సౌబలం చైవ బాహ్లీకం చ మహాబలమ్. 33

కృపుని, ద్రోణుని, శల్యుని, సింధురాజగు జయద్రథుని, కాంబోజరాజగు సుదక్షిణుని, కృతవర్మను, ద్రోణుని కుమారుడగు అశ్వత్థామను, కర్ణుని, భూరిశ్రవసుని, సుబలరాజగు శకునిని, మహాబలుడగు బాహ్లీకుని - ఈ పదునొకండుగురిని అక్షౌహిణీనాయకుల నొనర్చెను.

దివసే దివసే తేషాం ప్రతివేలం చ భారత,
చక్రే స వివిధాః పూజాః ప్రత్యక్షం చ పునః పునః. 34

ప్రతిదినము ఆ యా సమయములలో తానై వచ్చి వారికి పలువిధములగు మన్ననలు గావించెను.

తథా వినియతాః సర్వే యే చ తేషాం పదానుగాః,
బభూవుః సైనికా రాజ్ఞాం ప్రియం రాజ్ఞ శ్చికీర్షవః. 35

అట్లు వారందరను, వారి అనుయాయులను లొంగదీసికొనెను. ఆ రాజుల సైనికు లందరు ఆ రాజునకు ప్రియము చేయగోరినవారైరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
దుర్యోధనసైన్యవిభాగే పఞ్చపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
దుర్యోధనసైన్యవిభాగము గల నూటయేబదియైదవ అధ్యాయము.

—:o:—

## షట్పఞ్చాశదధికశతతమోఽధ్యాయః
## నూటయేబదియారవ అధ్యాయము

**దుర్యోధనేన భీష్మస్య ప్రధాన సేనాపతిపదే అభిషేకః,**
**కురుక్షేత్రం గత్వా శిబిరనిర్మాపణం చ.**
**దుర్యోధనుడు భీష్ముని ప్రధాన సేనాపతిగా అభిషేకించుట,**
**కురుక్షేత్రమున కరిగి శిబిరములను వేయించుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః శాన్తనవం భీష్మం ప్రాఞ్జలి ర్ధృతరాష్ట్రజః,
సహ సర్వై ర్మహీపాలై రిదం వచన మబ్రవీత్. 1

పిదప ధృతరాష్ట్రుని కొడుకు రాజులందరితో కూడి చేతులు జోడించి శంతనుకుమారుడగు భీష్మునితో నిట్లు పలికెను.

ఋతే సేనాప్రణేతారం పృతనా సుమహత్యపి,
దీర్యతే యుద్ధ మాసాద్య పిపీలికపుటం యథా. 2

సేన యెంత పెద్దదియైనను గట్టిసేనానాయకుడు లేనిచో యుద్ధమాడు నపుడు చీమలగుంపువలె చెల్లాచెదరై పోవును.

న హి జాతు ద్వయో ర్బుద్ధిః సమా భవతి కర్హిచిత్,
శౌర్యం చ బలనేతౄణాం స్పర్ధతే చ పరస్పరమ్. 3

ఎన్నటికిని ఇద్దరి బుద్ధి సమానముగా నుండదు. సేనానాయకుల శౌర్యము కూడ ఒకదానితో నొకటి పోటీపడుచుండును.

శ్రూయతే చ మహాప్రాజ్ఞ హైహయా నమితౌజసః,
అభ్యయు ర్బ్రాహ్మణాః సర్వే సముచ్ఛ్రితకుశధ్వజాః. 4

మహామేధావీ! ఒక కథ వినవచ్చుచున్నది. గొప్ప దేహబలము గల హైహయులను, దర్భల ధ్వజము లెత్తుకొని బ్రాహ్మణు లెదుర్కొనిరి.

తా నభ్యయు స్తదా వైశ్యాః శూద్రా శ్చైవ పితామహ,
ఏకతస్తు త్రయో వర్ణా ఏకతః క్షత్రియర్షభాః. 5

అట్లే వారికడకు వైశ్యులు, శూద్రులును పోరవచ్చిరి. ఇట్లొకవైపు మూడు వర్ణములవారును, మఱియొకవైపు క్షత్రియవరేణ్యులును ఉండిరి.

తతో యుద్ధే ష్వభజ్య న్త త్రయో వర్ణాః పునః పునః,
క్షత్రియాశ్చ జయ న్త్యేవ బహులం చైకతో బలమ్. 6

అంత యుద్ధమున మూడువర్ణములవారును మాటిమాటికి ఓడిపోవజొచ్చిరి. క్షత్రియులు ఒకవైపున నున్న గొప్పబలమును గెలువనే గెలిచిరి.

తత స్తే క్షత్రియానేవ పప్రచ్ఛు ర్ద్విజసత్తమాః,
తేభ్యః శశంసు ర్ధర్మజ్ఞా యాథాతథ్యం పితామహ. 7

తాతా! అంత ఆ బ్రాహ్మణప్రవరులు క్షత్రియులనే గెలు పెట్లు పొందితిరని అడిగిరి. ధర్మ మెరిగిన ఆ క్షత్రియులును వారి కున్నదున్నట్లు చెప్పిరి.

వయ మేకస్య శృణ్వానా మహాబుద్ధిమతో రణే,
భవన్త స్తు పృథక్ సర్వే స్వబుద్ధివశవర్తినః. 8

యుద్ధమున మేము దొడ్డబుద్ధిగలవారమై ఒక్కని మాట వినుచుందుము. మీ రన్ననో ఎవరిబుద్ధికి తోచినట్లు వారు నడచుకొందురు.

తత స్తే బ్రాహ్మణా శ్చక్రు రేకం సేనాపతిం ద్విజమ్,
నయే సుకుశలం శూర మజయన్ క్షత్రియాం స్తతః. 9

అంత నా బ్రాహ్మణు లందరు నీతిలో ఆరితేరిన ఒక బ్రాహ్మణశూరుని సేనాపతిగా చేసికొని క్షత్రియుల నందరిని గెల్చిరి.

ఏవం యే కుశలం శూరం హితేప్సిత మకల్మషమ్,
సేనాపతిం ప్రకుర్వన్తి తే జయన్తి రణే రిపూన్. 10

ఇట్లు నేర్పు గలవాడును, మేలు కోరువాడును, పాపబుద్ధి లేనివాడును అగు శూరుని సేనాపతిని గావించుకొనువారు యుద్ధమున గెలుతురు.

భవా నుశనసా తుల్యో హితైషీ చ సదా మమ,
అసంహార్యః స్థితో ధర్మే స నః సేనాపతి ర్భవ. 11

నీవు శుక్రాచార్యు నంతటివాడవు ఎల్లవేళల నా మేలు కోరుదువు. నిన్నె వ్వరు నేమియు చేయజాలరు. ధర్మమున నిష్ఠగలవాడవు. అట్టి నీవు మాకు సేనా పతివి కావలయును.

రశ్మివతా మివాదిత్యో వీరుధా మివ చన్ద్రమాః,
కుబేర ఇవ యక్షాణాం దేవానా మివ వాసవః. 12

కిరణములు గలవారికి ఆదిత్యుడు, లతలకు చంద్రుడు, యక్షులకు కుబేరుడు, దేవతలకు ఇంద్రుడు ఎట్లో మాకు నీ వట్టివాడవు.

పర్వతానాం యథా మేరుః సుపర్ణః పక్షిణాం యథా,
కుమార ఇవ దేవానాం వసూనామివ హవ్యవాట్. 13

పర్వతములకు మేరువు, పక్షులకు గరుత్మంతుడు, దేవతలకు కుమార స్వామి, వసువులకు అగ్ని యెట్టివాడో మాకు నీ వట్టివాడవు.

భవతా హి వయం గుప్తాః శక్రేణేవ దివౌకసః,
అనాధృష్యా భవిష్యామ స్త్రిదశానా మపి ధ్రువమ్. 14

దేవతలను కాపాడు దేవేంద్రునివలె నీవు మమ్ము కాపాడుచుండగా మేము దేవతలకును లొంగనివార మగుదుము. ఇది నిశ్చయము.

ప్రయాతు నో భవా నగ్రే దేవానా మివ పావకిః,
వయం త్వా మనుయాస్యామః సౌరభేయా ఇవర్షభమ్. 15

దేవతల మొనగాడైన కుమారస్వామి వలె నీవు మాకు ముందు నడువ వలయును. మేము ఎద్దువెనుక చను ఆవులవలె నిన్ననుసరింతుము.

---

11. ఉశనసా - శుక్రునితో, అసంహార్యః - తండ్రి యిచ్చిన వరమువలన యముడును నిన్ను చంపజాలడని భావము.

13. కుమారః - కుమారస్వామి, శివకుమారుడు.

15. అగ్నికుమారుడు - కుమారస్వామి.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

ఏవ మేత న్మహాబాహో యథా వదసి భారత,
యథైవ హి భవన్తో మే తథైవ మమ పాణ్డవాః. 16

మహాబాహూ! భారతా! నీవు పలికినట్లే కానిమ్ము. కాని నాకు మీ రెట్టి వారో పాండవులును అట్టివారే.

అపి చైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప,
సంయోద్ధవ్యం తవార్థాయ యథా మే సమయః కృతః. 17

రాజా! నీకువలె వారికిని నేను మేలైన మాట చెప్పవలయును. నీకొఱకు యుద్ధమును చేయవలయును. ఇది మున్ను చేసిన ప్రతిజ్ఞయే కదా!

న తు పశ్యామి యోద్ధార మాత్మనః సదృశం భువి,
ఋతే తస్మా న్నరవ్యాఘ్రాత్ కున్తీపుత్రా ద్ధనఞ్జయాత్. 18

నరవరుడు, కుంతికొడుకు ధనంజయు డొక్కడు తప్ప నాకు సాటి వచ్చు యుద్ధవీరుడు భూమిలో లేడు.

స హి వేద మహాబుద్ధి ర్దివ్యాన్యస్త్రాణ్యనేకశః,
న తు మాం వివృతో యుద్ధే జాతు యుధ్యేత పాణ్డవః. 19

మహాబుద్ధియగు నాతడు ఎన్నో దివ్యములగు అస్త్రము లెరిగెను. అయి నను వాడు నాకెదురుగా నిలిచి యెన్నడు యుద్ధము చేయడు.

అహం చైవ క్షణే నైవ నిర్మనుష్య మిదం జగత్,
కుర్యాం శస్త్రబలేనైవ ససురాసురరాక్షసమ్. 20

నేనును నా ఆయుధముల బలముతోడనే ఒక్కక్షణములో దేవతలతో అసురులతో రక్కసులతో పాటు ఈ జగము నంతటిని ప్రాణి యన్నది లేకుండ చేయగలను.

నత్వేవోత్సాదనీయా మే పాణ్డోః పుత్రా జనాధిప,
తస్మా ద్యోధాన్ హనిష్యామి ప్రయోగేణాయుతం సదా. 21

---

19. వివృతః - బయటపడి, చక్కగా ఎదురుగా వచ్చి;

21. మే - నాకు, నాచేత, న ఉత్సాదనీయాః - చంపదగినవారు కారు; సదా- ప్రతిదినము;

అయినను రాజా! ఆ పాండుకుమారులను నేను చంపజాలను. దెబ్బ కొక్క పదివేల మంది లెక్కగా ఇతరులను ప్రతిదినము చంపగలను.

ఏవ మేషాం కరిష్యామి నిధనం కురునన్దన,
న చేత్తే మాం హనిష్యన్తి పూర్వమేవ సమాగమే. 22

నా కెదురుపడి వారు నన్ను ముందే చంపకున్న యెడల వారి నీవిధముగా చంపుదును.

సేనాపతి స్త్వహం రాజన్ సమయే నాపరేణ తే,
భవిష్యామి యథాకామం తన్మే శ్రోతు మిహార్హసి. 23

రాజా! మరియొక కట్టుబాటుపై నీకోరికమేరకు సేనాపతి నగుదును. దానిని నీవు ఇక్కడనే వినవలయును.

కర్ణో వా యుధ్యతాం పూర్వ మహం వా పృథివీపతే,
స్పర్ధతే హి సదాఽత్యర్థం సూతపుత్రో మయా రణే. 24

రాజా! ఈ కర్ణుడో నేనో ముందు పోరవలయును. ఏలయన ఈ సూత పుత్రుడు యుద్ధమున నాతో మిక్కిలిగా పోటీ పడుచుండును.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.

నాహం జీవతి గాఙ్గేయే రాజన్ యోత్స్యే కథఞ్చన,
హతే భీష్మే తు యోత్స్యామి సహ గాణ్డీవధన్వనా. 25

రాజా! ఈ గంగకొడుకు బ్రదికియుండగా నే నెన్నటికిని యుద్ధము చేయను. ఆతడు చచ్చిన తరువాతనే అర్జునునితో పోరుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

తతః సేనాపతిం చక్రే విధివద్భూరిదక్షిణమ్,
ధృతరాష్ట్రాత్మజో భీష్మం సోఽభిషిక్తో వ్యరోచత. 26

అంత ధృతరాష్ట్రునికొడుకు గొప్ప దక్షిణలతో యజ్ఞములు చేసియున్న భీష్ముడు మిక్కిలిగా ప్రకాశించెను.

తతో భేరీశ్చ శఙ్ఖాంశ్చ శతశోఽథ సహస్రశః,
వాదయామాసు రవ్యగ్రా వాదకా రాజశాసనాత్. 27

అంత వాద్యములవారు రాజాజ్ఞవలన పందలకొలదిగా, వేలకొలదిగా భేరులను, శంఖములను అల పెరుగక వాయించిరి.

సింహనాదాశ్చ వివిధా వాహనానాం చ నిఃస్వనాః,
ప్రాదురాస న్ననభ్రే చ వర్షం రుధిరకర్దమమ్. 28

పలువిధములగు సింహనాదములు, వాహనముల ధ్వనులు వెలువడినవి. రక్తపు బురదగల వాన, మేఘములు లేకయే కురిసెను.

నిర్ఘాతాః పృథివీకమ్పా గజబృంహితనిఃస్వనాః,
ఆసంశ్చ సర్వయోధానాం పాతయన్తో మనాంస్యుత. 29

యోధుల గుండెలను మూర్ఛ నొందించుచు పిడుగులు పడెను. భూమి దద్ధరిల్లెను. ఏనుగుల ఘీంకారనాదములు చెలరేగెను.

వాచ శ్చాప్యశరీరిణ్యో దివశ్చోల్కాః ప్రపేదిరే,
శివాశ్చ భయవేదిన్యో నేదు ర్దీప్తతరా భృశమ్. 30

అశరీరవాణులు వెలువడినవి. ఆకసమునుండి ఉల్కలు రాలినవి. రానున్న కీడును తెలుపుచు నక్కలు గొంతెత్తి పెద్దగా అరచినవి.

సైనాపత్యే యదా రాజా గాఙ్గేయ మభిషిక్తవాన్,
తదైతా న్యుగ్రరూపాణి బభూవుః శతశో నృప. 31

రాజు భీష్ముని సేనాపతి అధికారమున అభిషేకము చేసినంతనే యిట్టి భయము గొలుపు లక్షణములు నూర్లకొలది తోచినవి.

తతః సేనాపతిం కృత్వా భీష్మం పరబలార్దనమ్,
వాచయిత్వా ద్విజశ్రేష్ఠాన్ గోభి ర్నిష్కైశ్చ భూరిశః. 32

పరుల సేనలను నుగ్గు నూచగా గొట్టెడు భీష్ముని సేనాపతిగా నొనరించుకొని దుర్యోధనుడు బ్రాహ్మణులను గోవులు, బంగారు కాసులు, గొప్పగా చదివించెను.

---

29. పాతయన్తః - మూర్ఛ నొందించుచు.

వర్ధమానో జయాశీర్భి ర్నిర్యయౌ సైనికై ర్వృతః,
ఆపగేయం పురస్కృత్య భ్రాతృభిః సహిత స్తదా. 33

జయము పొందు మనువారి ఆశీస్సులతో పొంగిపోవుచు సైనికులు చుట్టి రాగా భీష్ముని ముందిడుకొని తమ్ములతోపాటు బయలుదేరెను.

స్కన్ధావారేణ మహతా కురుక్షేత్రం జగామ హ.

గొప్ప సేనతో కూడి కురుక్షేత్రమున కరిగెను.

పరిక్రమ్య కురుక్షేత్రం కర్ణేన సహ కౌరవః,
శిబిరం మాపయామాస సమే దేశే జనాధిప. 35

కురురాజు కురుక్షేత్రమంతయు కర్ణునితోపాటు చుట్టివచ్చి సమమగు ప్రదేశమున శిబిరము వేయించెను.

మధురానూషరే దేశే ప్రభూతయవసేన్ధనే,
యథైవ హాస్తినపురం తద్వచ్ఛిబిర మాబభౌ. 36

అందమైన బీడుగాని ప్రదేశమున గడ్డి, వంటచెఱకు సమృద్ధిగా నున్న చోట వెలసిన ఆ శిబిరము హస్తినాపురమువలెనే విరాజిల్లెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
భీష్మసైనాపత్యే షట్పఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్య నిర్యాణపర్వమున
భీష్ముని సేనాపతిగా చేయుట యను వృత్తాంతము గల
నూటయేబదియారవ అధ్యాయము.

—:౦:—

# సప్తపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

## నూటయేబది యేడవ అధ్యాయము

**యుధిష్ఠిరేణ స్వసేనాపతీనా మభిషేకో, యదుభిః సహ బలరామ స్యాగమనం పాణ్డవై ర్లబ్ధానుజ్ఞస్య తస్య తీర్థయాత్రాయై ప్రస్థానమ్.**

**యుధిష్ఠిరుడు తన సేనాపతులకు అభిషేకము గావించుట, యాదవులతోపాటు బలరాముడు వచ్చుట, పాండవుల అనుమతి గొని ఆతడు తీర్థయాత్రలకు బయలుదేరుట.**

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

ఆపగేయం మహాత్మానం భీష్మం శస్త్రభృతాం వరమ్,
పితామహం భారతానాం ధ్వజం సర్వమహీక్షితామ్. 1

బృహస్పతిసమం బుద్ధ్యా క్షమయా పృథివీసమమ్,
సముద్రమివ గామ్భీర్యే హిమవన్తమివ స్థిరమ్. 2

ప్రజాపతి మివౌదార్యే తేజసా భాస్కరోపమమ్,
మహేన్ద్రమివ శత్రూణాం ధ్వంసనం శరవృష్టిభిః. 3

రణయజ్ఞే ప్రవితతే సుభీమే లోమహర్షణే,
దీక్షితం చిరరాత్రాయ శ్రుత్వా తత్ర యుధిష్ఠిరః, 4

కిమబ్రవీ న్మహాబాహుః సర్వశస్త్రభృతాం వరః,
భీమసేనార్జునౌ వాఽపి కృష్ణో వా ప్రత్యభాషత. 5

గంగాతనయుడు మహాత్ముడు. ఆయుధము పట్టినవారిలో మిన్న. భరత వంశమువారికి తాత. రాజులందరికి ధ్వజస్తంభమువంటివాడు. బుద్ధిలో బృహస్పతికి దీటైనవాడు. ఓర్పున భూదేవికి ఈడైనవాడు. గాంభీర్యమున సముద్రము వంటివాడు. హిమవత్పర్వతమువలె చెదరక నిలుచువాడు. ఔదార్యమున ప్రజాపతి వంటివాడు. తేజస్సున సూర్యుని పోలువాడు. దేవేంద్రునివలె బాణముల వర్షముతో శత్రువులను రూపుమాపువాడు. అట్టి భీష్ముడు మిక్కిలి దొడ్డయు, మహాభయం

కరమైనదియు నగు యుద్ధమను యజ్ఞమున పెక్కుదినములకై దీక్షబూనె నని విని అచట ధర్మరాజేమి పలికెను ? భీమార్జును లేమనిరి ? కృష్ణు డేమనెను ?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఆపద్ధర్మార్థకుశలో మహాబుద్ధి ర్యుధిష్ఠిరః,
సర్వాన్ భ్రాతౄన్ సమానీయ వాసుదేవం చ శాశ్వతమ్, 6
ఉవాచ వదతాం శ్రేష్ఠః సాన్త్వపూర్వ మిదం వచః.

ఆపదలయందు పాటింపవలసిన ధర్మములు, అర్థములు అనువానియందు నేర్పరియు, గొప్ప బుద్ధివిశేషము కలవాడును అగు ధర్మరాజు తమ్ములందరను, నిత్యుడగు వాసుదేవుని రావించి పలుకుల పొందికతనము కలవాడై మన్ననతో ఇట్లు పలికెను.

పర్యాక్రామత సేనాని యత్తా స్తిష్ఠత దంశితాః. 7
పితామహేన వో యుద్ధం పూర్వమేవ భవిష్యతి,
తస్మాత్ సప్తసు సేనాసు ప్రణేతౄన్ మమ పశ్యత. 8

సేనల నన్నింటిని అదుపులో పెట్టుకొనుడు. తగిన ఆయుధములు ధరించి సిద్ధముగా నిలుపుడు. మీకు ముందుగానే తాతతో యుద్ధము కానున్నది. కావున మన ఏడు సేనలకు నాయకులను చూడుడు.

కృష్ణ ఉవాచ - కృష్ణు డిట్లు పలికెను.

యథాఽర్హతి భవాన్ వక్తు మస్మిన్ కాలే హ్యుపస్థితే,
తథేద మర్థవ ద్వాక్య ముక్తం తే భరతర్షభ. 9

భరతవరేణ్యా! తగిన కాలమున నీ వే పలుకు పలుకదగునో అట్టిదే యగు అర్థవంతమగు పలుకు పలికితివి.

రోచతే మే మహాబాహో క్రియతాం యదనన్తరమ్,
నాయకా స్తవ సేనాయాం క్రియన్తా మిహ సప్త వై. 10

నీ మాట నాకు నచ్చినది. తరువాతి కార్యమున కుపక్రమింపుము నీ సేనయం దేడుగురు నాయకులను నిర్ణయింపుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో ద్రుపద మానాయ్య విరాటం శినిపుఙ్గవమ్,
ధృష్టద్యుమ్నం చ పాఞ్చాల్యం ధృష్టకేతుం చ పార్థివ. 11
శిఖణ్డినం చ పాఞ్చాల్యం సహదేవం చ మాగధమ్,
ఏతాన్ సప్త మహాభాగాన్ వీరాన్ యుద్ధాభికాఙ్క్షిణః. 12
సేనాప్రణేతౄన్ విధివ దభ్యషిఞ్చ ద్యుధిష్ఠిరః,
సర్వసేనాపతిం చాత్ర ధృష్టద్యుమ్నం చకార హ. 13

అంత ధర్మరాజు ద్రుపదుని, విరాటుని, సాత్యకిని, పాంచాలరాజు కొడుకు ధృష్టద్యుమ్నుని, ధృష్టకేతుని, శిఖండిని, మగధరాజగు సహదేవుని రావించి దొడ్డవారగు నీ యేవురు వీరులను యుద్ధమునకు ముందుదుముకువారిని, సేనానాయకులనుగా శాస్త్రము ననుసరించి అభిషేకించెను. సర్వసేనాపతిగా ధృష్టద్యుమ్నుని నియమించెను.

ద్రోణాన్తహేతో రుత్పన్నో య ఇద్ధా జ్జాతవేదసః.

ఆ ధృష్టద్యుమ్నుడు ద్రోణుని మట్టుపెట్టుటకే ప్రజ్వరిల్లుచున్న అగ్ని నుండి పుట్టెను.

సర్వేషా మేవ తేషాం తు సమస్తానాం మహాత్మనామ్,
సేనాపతిపతిం చక్రే గుడాకేశం ధనఞ్జయమ్. 14

మహాత్ములగు వారందరికి నాయకునిగా గుడాకేశుడగు అర్జునుని నియమించెను.

అర్జునస్యాపి నేతా చ సంయన్తా చైవ వాజినామ్,
సఙ్కర్షణానుజః శ్రీమాన్ మహాబుద్ధి ర్జనార్దనః. 15

అర్జునునకు నాయకుడుగ, అతని గుఱ్ఱములకు సారథిగా బలరాముని తమ్ముడు, మహాబుద్ధియు, శ్రీమంతుడు నగు జనార్దనుడు ఉండెను.

---

11. శినిపుఙ్గవమ్-శినివంశమున శ్రేష్ఠుడగు సాత్యకిని;

తద్దృష్ట్వోపస్థితం యుద్ధం సమాసన్నం మహాత్యయమ్,
ప్రావిశద్ భవనం రాజన్ పాణ్డవానాం హలాయుధః. 16

అట్లు మహావినాశము కలిగించుచు దాపురించిన ఘోరయుద్ధమును చూచి బలరాముడు పాండవుల భవనమున కరుదెంచెను.

సహాక్రూరప్రభృతిభి ర్గదసాంబోద్ధవాదిభిః,
రౌక్మిణేయాహుకసుతై శ్చారుదేష్ణపురోగమైః. 17
వృష్ణిముఖ్యై రభిగతై ర్వ్యాఘ్రైరివ బలోత్కటైః,
అభిగుప్తో మహాబాహు ర్మరుద్భిరివ వాసవః. 18
నీలకౌశేయవసనః కైలాసశిఖరోపమః,
సింహఖేలగతిః శ్రీమాన్ మదరక్తాన్తలోచనః. 19

అక్రూరుడు, గదుడు, సాంబుడు, ఉద్ధవుడు, ప్రద్యుమ్నుడు, ఆహుకుని కుమారులు చారుదేష్ణుడు మొదలగువారు - బలముతో పిక్కటిల్లిన పులులవంటి యీ వృష్ణివంశమువా రందరు వచ్చి, దేవతలు దేవేంద్రుని కాపాడినట్లుగా కాపాడుచుండగా, గొప్పభుజములు కలవాడై నల్లని పట్టువస్త్రము ధరించి కైలాస శిఖరమును పోలుచు, సింహము విలాసముగా నడచునట్లు నడచుచు, శోభతో విరాజిల్లుచు, మదముతో ఎఱ్ఱబారిన కంటితుదలు గలవాడై బలరాము డరుదెంచెను.

తం దృష్ట్వా ధర్మరాజశ్చ కేశవశ్చ మహాద్యుతిః,
ఉదతిష్ఠ త్తతః పార్థో భీమకర్మా వృకోదరః, 20
గాణ్డీవధన్వా యే చాన్యే రాజాన స్తత్ర కేచన. 21

అతనిని చూచి ధర్మరాజును మహాతేజస్వి యగు కేశవుడును లేచి నిలిచిరి. భీమకర్ముడగు వృకోదరుడును, గాండీవధారియగు అర్జునుడును, తక్కంగల రాజు లందరును లేచి నిలిచిరి.

---

16. మహాత్యయమ్-మహాక్షయము కలిగించుదానిని;
18. ఆహుకసుతైః - ఆహుకుడు శ్రీకృష్ణుని ముత్తాత - అతని కుమారులతో;
రౌక్మిణేయః - రుక్మిణికుమారుడు ప్రద్యుమ్నుడు.
19. నీలకౌశేయవసనః - నీలవర్ణముగల పట్టువస్త్రమును తాల్చినవాడు; బలరాముడు నీలాంబరుడు.

పూజయాంచక్రిరే తే వై సమాయాన్తం హలాయుధమ్,
తత స్తం పాణ్డవో రాజా కరే పస్పర్శ పాణినా. 22

అట్లు వచ్చుచున్న హలాయుధుడగు బలరాముని వారందరు పూజించిరి. పిదప పాండునికొడుకు ధర్మరాజు ఆతనిచేతిని చేతితో స్పృశించెను.

వాసుదేవపురోగా స్తం సర్వ ఏవాభ్యవాదయన్,
విరాటద్రుపదౌ వృద్ధా వభివాద్య హలాయుధః. 23

వాసుదేవుని ముందిడుకొని వారంద రాతనికి అభివాదనము చేసిరి. వృద్ధులగు విరాటద్రుపదులకు హలాయుధుడగు బలరాముడు మ్రొక్కి ధర్మరాజుతో కూడి ఆసీనుడయ్యెను.

తత స్తేషూపవిష్టేషు పార్థివేషు సమన్తతః,
వాసుదేవ మభిప్రేక్ష్య రౌహిణేయోఽభ్యభాషత. 24

అంత నా రాజులంద రందందు కూర్చుండగా బలరాముడు వాసుదేవుని గాంచి యిట్లు పలికెను.

భవితాఽయం మహారౌద్రో దారుణః పురుషక్షయః,
దిష్ట మేత ద్ధ్రువం మన్యే న శక్య మతివర్తితుమ్. 25

ఇదిగో మహాభయంకరము, దారుణము అయిన జనవినాశము దాపురించినది. ఇది దైవచేష్టితము, తప్పింపరానిదని నేను తలంతును.

తస్మా ద్యుద్ధాత్ సముత్తీర్ణా నపి వః ససుహృజ్జనాన్,
అరోగా నక్షతై ర్దేహై ర్ద్రష్టాస్మీతి మతి ర్మమ. 26

మీరందరు మీ చెలికాండ్రతోపాటు ఈ యుద్ధమును గండము గడిచి, ఆరోగ్యముతో చెడని దేహములతో నుండగా చూతురా! అని నా మది కనిపించుచున్నది.

సమేతం పార్థివం క్షత్రం కాలపక్వ మసంశయమ్,
విమర్దశ్చ మహాన్ భావీ మాంసశోణితకర్దమః. 27

24. రౌహిణేయః - రోహిణీదేవికుమారుడు - బలరాముడు.

భూమిపై గల క్షత్రియకులమున కంతటికి కాలము మూడినది. సంశయము లేదు. గొప్ప కొట్లాట కానున్నది. మాంసము, రక్తముల బురద యేర్పడనున్నది.

ఉక్తో మయా వాసుదేవః పునః పున రుపహ్వరే,
సమ్బన్ధిషు సమాం వృత్తిం వర్తస్వ మధుసూదన. 28

ఒంటరిగా నున్నపుడు నేను పలుమారులు కృష్ణునితో మధుసూదనా! చుట్టములయందు ఒక్కతీరున మెలగుమని చెప్పితిని.

పాణ్డవా హి యథాస్మాకం తథా దుర్యోధనో నృపః,
తస్యాపి క్రియతాం సాహ్యం స పర్యేతి పునః పునః. 29

మనకు పాండవులెట్లో దుర్యోధనమహారాజు కూడ అట్టివాడే. ఆతడు మనచుట్టు మాటి మాటికి తిరుగుచున్నాడు. ఆతనికిని సాయము చేయుమని బోధించితిని.

తచ్చ మే నాకరో ద్వాక్యం త్వదర్థే మధుసూదనః,
నిర్విష్టః సర్వభావేన ధనఞ్జయ మవేక్ష్య హ. 30

మధుసూదనుడు నీకొరకై నామాట వినలేదు. ధనంజయుని చూచి మనసెల్ల నీకర్పించి మీలో చేరెను.

ధ్రువో జయః పాణ్డవానా మితి మే నిశ్చితా మతిః,
తథా హ్యభినివేశోఽయం వాసుదేవస్య భారత. 31

పాండవులకే జయము. ఇది తప్పదని నా ఊహ. అట్లనియే ఈ వాసుదేవుని పట్టుదల.

న చాహ ముత్సహే కృష్ణ మృతే లోక ముదీక్షితుమ్,
తతోఽహ మనువర్తామి కేశవస్య చికీర్షితమ్. 32

ఈ కృష్ణుని వదలి ఇతర లోకమును చూచుటకును నాకు మనసొప్పదు. కావున ఆతడేది చేయగోరిన దానినే అనుసరించి పోవుదును.

---

28. ఉపహ్వరే - ఏకాంతమున.

ఉభౌ శిష్యౌ హి మే వీరౌ గదాయుద్ధవిశారదౌ,
తుల్యస్నేహోఽస్మ్యతో భీమే తథా దుర్యోధనే నృపే. 33

గద ఘోరున ఆరితేరిన వీరులు వారిరువురు నా శిష్యులే కావున భీముని యందును, దుర్యోధనమహారాజునందును నాకు సమమగు నెయ్యము కలదు.

తస్మా ద్యాస్యామి తీర్థాని సరస్వత్యా నిషేవితుమ్,
నహి శక్ష్యామి కౌరవ్యా న్నశ్యమానా నుపేక్షితుమ్. 34

కావున వేదశాస్త్రములు అధ్యయనము చేయుచు తీర్థయాత్రలకు బోయెదను. కురువంశమువారు కొట్టుకొని చచ్చుచుంతగా చూడజాలను.

ఏవ ముక్త్వా మహాబాహు రనుజ్ఞాత శ్చ పాణ్డవైః,
తీర్థయాత్రాం యయౌ రామో నిర్వర్త్య మధుసూదనమ్. 35

ఆ మహాబాహువగు బలరాముడు ఇట్లు పలికి మధుసూదనుని వీడ్కొని పాండవుల కడ అనుమతి గొని తీర్థయాత్రల కరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
బలరామ తీర్థయాత్రాగమనే సప్తపఞ్చాశదధిక
శతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
బలరాముడు తీర్థయాత్రల కరుగుట యను నూటయేబదియేడవ
అధ్యాయము.

—:o:—

# అష్టపఞ్చాశదధికశతతమోఽధ్యాయః

# నూటయేబదియెనిమిదవ అధ్యాయము

సాహాయ్యం ప్రదాతుం రుక్మిణ ఆగమనం,
పాణ్డవైః కౌరవైశ్చ తత్సాహాయ్యానఙ్గీకరణమ్.

**సాయము చేయుటకై రుక్మి వచ్చుట, పాండవులు, కౌరవులును ఆతని సాయము నంగీకరింపకుండుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏతస్మిన్నేవ కాలే తు భీష్మకస్య మహాత్మనః,
హిరణ్యరోమ్ణో నృపతేః సాక్షా దిన్ద్రసఖస్య వై, 1

ఆ కుంతీనా మధిపతి ర్భోజస్యాతియశస్వినః,
దాక్షిణాత్యపతేః పుత్రో దిక్షు రుక్మీతి విశ్రుతః. 2

ఇంద్రుని చెలికాడు, హిరణ్యరోముడు, మహాత్ముడు, దక్షిణ దేశమున గల భోజదేశమున కధిపతి, గొప్పపేరు గలవాడు నగు భీష్మకుని కుమారుడు, దిక్కులందు రుక్మి యని పేరొందినవాడు, సంకల్పములపై అధికారము కలవాడు...

యః కింపురుషసింహస్య గన్ధమాదనవాసినః,
కృత్స్నం శిష్యో ధనుర్వేదం చతుష్పాద మవాప్తవాన్. 3

గంధమాదనపర్వతమున నివసించు కింపురుషశ్రేష్ఠుని శిష్యుడై నాలుగు పాదములుగల ధనుర్వేదము మొత్తము సాధించినవాడు...

యో మాహేన్ద్రం ధనుర్లేభే తుల్యం గాణ్డీవతేజసా,
శార్ఙ్గేణ చ మహాబాహుః సమ్మితం దివ్యలక్షణమ్, 4

గాండీవము తేజస్సుతో సాటియైనది, శార్ఙ్గముతో సాటివచ్చునది, దివ్య లక్షణములు గలదియు నగు మహేంద్రుని ధనువును సంపాదించినవాడు...

త్రీణ్యేవైతాని దివ్యాని ధనూంషి దివిచారిణామ్,
వారుణం గాణ్డివం తత్ర మాహేన్ద్రం విజయం ధనుః,
శార్ఙ్గం తు వైష్ణవం ప్రాహు ర్దివ్యం తేజోమయం ధనుః. 5

స్వర్గమున మెలగువారికి సంబంధించిన దివ్యములగు ధనువులు ఈ మూడే. అందు గాండీవము వరుణదేవునకు సంబంధించినది. విజయ మను ధనుస్సు మహేంద్రునిది. శార్ఙ్గము విష్ణునకు చెందినది. అది తేజస్సుతో నేర్పడిన ధనువు.

ధారయామాస తత్కృష్ణం పరసేనాభయావహమ్,
గాణ్డీవం పావకా ల్లేభే ఖాణ్డవే పాకశాసనిః. 6

పరుల సేనలకు భయము పుట్టించు ఆ శార్ఙ్గధనువును కృష్ణుడు చేపట్టెను. ఖాండవవనమున అర్జునుడు అగ్నిదేవునివలన గాండీవమును పొందెను.

ద్రుమాద్ రుక్మీ మహాతేజా విజయం ప్రత్యపద్యత,
సంఛిద్య మౌరవాన్ పాశా న్నిహత్య మురుతేజసా. 7

గొప్ప తేజస్సుగల రుక్మి తన సత్తువతో ప్రేగు నరములతో నేర్పడిన త్రాళ్ళను కోసివైచి మురుని చంపి ఒక చెట్టునుండి విజయమను ధనుస్సును సాధించెను.

నిర్జిత్య నరకం భౌమ మాహృత్య మణికుణ్డలే,
షోడశ స్త్రీసహస్రాణి రత్నాని వివిధాని చ, 8
ప్రతిపేదే హృషీకేశః శార్ఙ్గం చ ధనురుత్తమమ్.

---

4. ...అగు రుక్మి పాండవులకడకు వచ్చెనని వాక్యమును పూర్తి చేసికొనవలయును.

7. మౌరవాన్ - ప్రేగులతో అల్లిన పాశములను. అవియే పిదప శార్ఙ్గమునకు అల్లెత్రాడుగా నయ్యెను.

భూదేవి కొడుకగు నరకుని గెలిచి మణికుండలములను, పదునారువేల కాంతలను, పలువిధములగు రత్నములను, ఉత్తమమగు శార్ఙ్గధనువును శ్రీకృష్ణుడు వశము చేసికొనెను.

రుక్మీ తు విజయం లబ్ధ్వా ధను ర్మేఘనిభస్వనమ్,
విభీషయన్నివ జగత్ పాణ్డవా నభ్యవర్తత. 9

రుక్మియు ఉరుమువంటి నాదముగల విజయధనువును గైకొని లోకములను బెదరగొట్టుచు పాండవులకడ కరుదెంచెను.

నామృష్యత పురా యోఽసౌ స్వబాహుబలగర్వితః. 10
రుక్మిణ్యాహరణం వీరో వాసుదేవేన ధీమతా,
కృత్వా ప్రతిజ్ఞాం నాహత్వా నివర్తిష్యే జనార్దనమ్. 11

మును వీతడు తన భుజబలమువలన ఒడలెరుగని వీరుడై ధీశాలియగు వాసుదేవుడు రుక్మిణి నెత్తుకొని పోవునపుడు విజృంభించి జనార్దనుని చంపక వెనుదిరుగ నని ప్రతిజ్ఞ చేసెను.

తతోఽన్వధావ ద్వార్ష్ణేయం సర్వశస్త్రభృతాం వరః,
సేనయా చతురఙ్గిణ్యా మహత్యా దూరపాతయా. 12

ఆయుధము లన్నింట ఆరితేరిన ఈ వీరుడు గొప్పదియు, బహుదూరము వచ్చి పడినదియు నగు నాలుగు అంశములు గల సేనతో కృష్ణుని వెంటబడెను.

విచిత్రాయుధవర్మిణ్యా గఙ్గయేవ ప్రవృద్ధయా,
స సమాసాద్య వార్ష్ణేయం యోగానా మీశ్వరం ప్రభుమ్. 13
వ్యంసితో వ్రీడితో రాజ న్నాజగామ స కుణ్డినమ్.

ఆ సేన విచిత్రములగు ఆయుధములు, కవచములు గలదియై గంగవలె ఉప్పొంగి పోవుచుండెను. అట్టిసేనతో కూడి యోగముల కీశ్వరుడు, ప్రభువు నగు శ్రీకృష్ణుని మార్కొనెను. కృష్ణునివలన పరాభవము నంది సిగ్గుపడి కుండిన నగరమునకు తిరిగివచ్చెను.

---

12. దూరపాతయా - బహుదూరము వెంటనంటి పోయినదగు.
14. వ్యంసితః - పరాభవింపబడిన వాడు; వ్రీడితః - సిగ్గుపడినవాడు.

యత్రైవ కృష్ణేన రణే నిర్జితః పరవీరహా,
తత్ర భోజకటం నామ కృతం నగర ముత్తమమ్. 14

శత్రుసంహారకుడగు ఆ రుక్మి కృష్ణుడు తన్నోడించిన ప్రదేశమున భోజకటకమను గొప్పనగరమును నిర్మించెను.

సైన్యేన మహతా తేన ప్రభూతగజవాజినా,
పురం తద్భువి విఖ్యాతం నామ్నా భోజకటం నృప. 15

పెక్కు ఏనుగులు గుఱ్ఱములు గల ఆ గొప్ప సేనతో ఆ పురము భోజకటకమని భూమిలో పేరొందెను.

స భోజరాజః సైన్యేన మహతా పరివారితః,
అక్షౌహిణ్యా మహావీర్యః పాణ్డవాన్ క్షిప్ర మాగమత్. 16

అట్టి గొప్ప పరాక్రమము గల భోజరాజు గొప్పసేన చుట్టిరాగా ఒక అక్షౌహిణిసేనతో పాండవుల కడకు పరుపున వచ్చెను.

తతః స కవచీ ధన్వీ తలీ ఖడ్గీ శరాసనీ,
ధ్వజే నాదిత్యవర్ణేన ప్రవివేశ మహాచమూమ్. 17

అంత నాతడు కవచము, విల్లు, వ్రేళ్ళ తొడుగులు, ఖడ్గము, అమ్ముం బొదులు ధరించి సూర్యునివంటి వన్నెగల ధ్వజముతో మహాసేనలో ప్రవేశించెను.

విదితః పాణ్డవేయానాం వాసుదేవప్రియేప్సయా,
యుధిష్ఠిరస్తు తం రాజా ప్రత్యుద్గ మ్యాభ్యపూజయత్. 18

పాండుకుమారు లాతని రాక నెరిగిరి. ధర్మరాజు మాత్రము వాసుదేవునకు ప్రియ మొనరింపగోరి వాని కెదురేగి మన్ననలు గావించెను.

స పూజితః పాణ్డుపుత్రై ర్యథాన్యాయం సుసంస్తుతః. 19
ప్రతిగృహ్య తు తాన్ సర్వాన్ విశ్రాన్తః సహ సైనికైః,
ఉవాచ మధ్యే వీరాణాం కున్తీపుత్రం ధనఞ్జయమ్. 20

---

17. ధన్వీ - ప్రసిద్ధమగు విజయ మను ధనువు నిట గ్రహింపవగును

పాండుపుత్రులు మర్యాద ననుసరించి అతనికి అతిథిపూజలు గావించిరి. అతని గుణములను స్తుతించిరి. అతడు వానిని స్వీకరించి సైనికులతో పాటు కొంత తడవు విశ్రమించి వీరులందరి నడుమ కుంతి కొడుకగు ధనంజయునితో నిట్లు పలికెను.

సహాయోఽస్మి స్థితో యుద్ధే యది భీతోఽసి పాణ్డవ,
కరిష్యామి రణే సాహ్య మసహ్యం తవ శత్రుభిః. 21

పాండుకుమారా। నీవు భయపడినచో ఇదిగో నీకు యుద్ధమున సహాయుడనై నిలిచెదను. నీ పగవారు తట్టుకొనజాలని సాయము పోరున నీకు గావించెదను.

న హి మే విక్రమే తుల్యః పుమా నస్తీహ కశ్చన,
హనిష్యామి రణే భాగం యన్మే దాస్యసి పాణ్డవ, 22
అపి ద్రోణకృపౌ వీరౌ భీష్మకర్ణావథో పునః.

పరాక్రమమున నాకు సాటి వచ్చు మగవాడిం దొక్కడును లేడు. యుద్ధమున నా పాలుగా ఏర్పరిచిన పగవారి సేనను చంపివైచెదను. వారు ద్రోణుడో, కృపుడో, కర్ణుడో ఎవరైన కానిమ్ము.

అథవా సర్వ ఏవైతే తిష్ఠన్తు వసుధాధిపాః,
నిహత్య సమరే శత్రూం స్తవ దాస్యామి మేదినీమ్. 23

కాదా, ఈ రాజులందరు నిట్లే యుందురు గాక! శత్రువుల నందరను యుద్ధమున రూపుమాపి నీకు భూమి నొసగెదను.

ఇత్యుక్తో ధర్మరాజస్య కేశవస్య చ సన్నిధౌ, 24
శృణ్వతాం పార్థివేన్ద్రాణా మన్యేషాం చైవ సర్వశః,
వాసుదేవ మభిప్రేక్ష్య ధర్మరాజం చ పాణ్డవమ్, 25
ఉవాచ ధీమాన్ కౌన్తేయః ప్రసహ్య సఖిపూర్వకమ్.

ధర్మరాజు కేశవుడు ఉన్నచోట రాజులందరు, తక్కవగల యోధులందరు వినుచుండగా రుక్మి తన్నుగూర్చి యిట్లు పలుకగా ధీశాలియగు అర్జునుడు వాసుదేవుని, ధర్మరాజును చక్కగా చూచి చనవుతో నవ్వి యిట్లు పలికెను.

కౌరవాణాం కులే జాతః పాణ్డోః పుత్రో విశేషతః. 26

ద్రోణం వ్యపదిశన్ శిష్యో వాసుదేవసహాయవాన్,

భీతోఽస్మీతి కథం బ్రూయాం దధానో గాణ్డీవం ధనుః. 27

కురువంశమున, అందును పాండురాజుతనయుడనై పుట్టి, ద్రోణాచార్యుని గురువుగా చెప్పకొనుచు, ఆతనికి శిష్యుడనై యుండి, వాసుదేవుని సహాయము గలవాడనై గాండీవము చేతబట్టినవాడనై భయపడితి నని యెట్లు పలుకుదును?

యుధ్యమానస్య మే వీర గన్ధర్వైః సుమహాబలైః,

సహాయో ఘోషయాత్రాయాం కస్తదాసీత్ సఖా మమ. 28

ఘోషయాత్రయందు పిక్కటిల్లిన పెనుబలముగల గంధర్వులతో పోరునపుడు నాకు తోడుపడిన సఖు డెవ్వడు?

తథా ప్రతిభయే తస్మిన్ దేవదానవసంకులే,

ఖాణ్డవే యుధ్యమానస్య కః సహాయ స్తదాఽభవత్. 29

అట్లే దేవదానవులు భయంకరముగా చెంరేగినపుడు ఖాండవమున పోరినవేళ నాకు తోడైనవా డెవ్వడు?

నివాతకవచై ర్యుద్ధే కాలకేయైశ్చ దానవైః,

తత్ర మే యుధ్యమానస్య కః సహాయ స్తదాఽభవత్. 30

నివాతకవచులు, కాలకేయులు, అను దానవులతో నేను కయ్యమాడినపుడు నాకు తోడైనవా డెవ్వడు?

తథా విరాటనగరే కురుభిః సహ సఙ్గరే,

యుధ్యతో బహుభి స్తత్ర కః సహాయోఽభవ న్మమ. 31

అట్లే విరాటనగరమున పెక్కండ్రు కౌరవులతో తలపడిన నాకు అండగా నిలిచినవా డెవడు?

ఉపజీవ్య రణే రుద్రం శక్రం వైశ్రవణం యమమ్,

వరుణం పావకం చైవ కృపం ద్రోణం చ మాధవమ్. 32

---

32. ఉపజీవ్య - ఆరాధించి; రణే - యుద్ధము కారణముగా.

27. ద్రోణం వ్యపదిశన్ - ద్రోణుడు నాగురువని చెప్పకొనువాడ నగుచు.

ధారయన్ గాణ్డీవం దివ్యం ధనుస్తేజోమయం దృఢమ్,
అక్షయ్యశరసంయుక్తో దివ్యాస్త్రపరిబృంహితః, 33
కథ మస్మద్విధో బ్రూయా ద్భీతోఽస్మీతి యశోహరమ్,
వచనం నరశార్దూల వజ్రాయుధ మపి స్వయమ్. 34

యుద్ధముకొఱకై రుద్రుని, దేవేంద్రుని, కుబేరుని, యముని, వరుణుని, అగ్నిని, కృపుని, ద్రోణుని, శ్రీకృష్ణుని ఆరాధించి, తేజస్సుతో నిండిన దివ్యమగు గాండీవమును ధరించి, తరుగులేని అమ్ములు కలవాడు, దివ్యాస్త్రములతో ఉప్పొంగుచున్నవాడు నగు నావంటివాడు పిడుగువంటి మాటను, కీర్తిని రూపుమాపు దానిని భయపడితినను దాని నెట్లు పలుకును?

నాస్మి భీతో మహాబాహో సహాయార్థశ్చ నాస్తి మే,
యథాకామం యథాయోగం గచ్ఛ వాఽన్యత్ర తిష్ఠ వా. 35

ఓయి మహాబాహూ! నేను భయపడువాడను గాను. నీ సాయముతో నాకు పనిలేదు. నీయిచ్ఛ వచ్చిన ప్రకారము, నీవు కావలసినచోటి కరుగుము. లేదా మరియొక చోట నిలుపుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
(తచ్ఛ్రుత్వా వచనం తస్య విజయస్య హి ధీమతః)
వినివర్త్య తతో రుక్మీ సేనాం సాగరసంనిభామ్,
దుర్యోధన ముపాగచ్ఛత్ తథైవ భరతర్షభ. 36

భారతశ్రేష్ఠా! (ధీరుడగు అర్జునుని ఆ మాట విని)రుక్మి సముద్రమువంటి సేనను మరలించుకొని అదేవిధముగా దుర్యోధనుని చేర నరిగెను.

తథైవ చాభిగమ్యైన మువాచ వసుధాధిపః,
ప్రత్యాఖ్యాతశ్చ తేనాపి స తదా శూరమానినా. 37

అతని దరిజేరి ఆ రాజు అవిధముగనే పలికెను,పొగరుబోతైన దుర్యోధను డాతనిని తిరస్కరించివైచెను.

ద్వావేవ తు మహారాజ తస్మాద్యుద్ధాదపేయతుః,
రౌహిణేయశ్చ వార్ష్ణేయో రుక్మీ చ వసుధాధిపః. 38

మహారాజా! అట్లా యుద్ధము నుండి తొలగిపోయిన వారిరువురే. వృష్ణి వంశమువాడగు బలరాముడు, రాజైన రుక్మియు.

గతే రామే తీర్థయాత్రాం భీష్మకస్య సుతే తథా,
ఉపావిశన్ పాణ్డవేయా యన్త్రాయ పునరేవ చ. 39

బలరాముడు తీర్థయాత్ర కరిగినపిదప, రుక్మి తనయింటి కరిగినవెనుక పాండవులు ఆలోచనకై మరల కూర్చుండిరి.

సమితి ర్ధర్మరాజస్య సా పార్థివసమాకులా,
శుశుభే తారకై శ్చిత్రా ద్యౌశ్చన్ద్రేణేవ భారత. 40

రాజులతో నిండిన ఆ ధర్మరాజుసేన నక్షత్రములతో చంద్రునితో చిత్రముగ కన్పట్టు గగనమువలె విరాజిల్లెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
రుక్మిప్రత్యాఖ్యానే అష్టపఞ్చాశదధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున రుక్మిని తిరస్కరించుట యను నూట యేబది యెనిమిదవ అధ్యాయము.

—: o :—

# ఊనషష్ట్యధికశతతమోఽధ్యాయః
# నూటయేబదితొమ్మిదవ అధ్యాయము

## ధృతరాష్ట్రసంజయసంవాదః.
## ధృతరాష్ట్ర సంజయుల సంవాదము.

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

తథా వ్యూఢే ష్వనీకేషు కురుక్షేత్రే ద్విజర్షభ,
కిమకుర్వంశ్చ కురవః కాలే నాభిప్రచోదితాః. 1

విప్రవరా! అట్లు కురుక్షేత్రమున సేనలు మోహరించియుండగా కాలము వెంటబడి తరుముచుండగా కౌరవు లేమి చేసిరి?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథా వ్యూఢే ష్వనీకేషు యత్తేషు భరతర్షభ,
ధృతరాష్ట్రో మహారాజ సఞ్జయం వాక్యమబ్రవీత్. 2

అట్లు పోరునకు సిద్ధపడి సేన లన్నియు మోహరించియుండగా ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లు పలికెను.

ఏహి సఞ్జయ సర్వం మే ఆచక్ష్వానవశేషతః,
సేనానివేశే యద్వృత్తాం కురుపాణ్డవసేనయోః. 3

సంజయా! రా! కురుపాండవసేనల విడిదులలో జరిగిన దెల్ల నేమియు మిగులనీయక అంతయు నాకు చెప్పు.

దిష్ట మేవ పరం మన్యే పౌరుషం చాప్యనర్థకమ్,
యదహం బుధ్యమానోఽపి యుద్ధదోషాన్ క్షయోదయాన్. 4

4. క్షయోదయాన్ - క్షయమునకే అయిన అభ్యుదయము వేనివలన నగునో అట్టివానిని;

తథాపి నికృతిప్రజ్ఞం పుత్రం దుర్ద్యూతదేవినమ్,
న శక్నోమి నియన్తుం వా కర్తుం వా హిత మాత్మనః. 5

దైవమే గొప్పదని తలంతును. మానవయత్నము పనికిమాలినది. నాలోననే పుట్టు యుద్ధదోషములన్నింటిని బాగుగా నెరుగుచున్నవాడనయ్యు కపటమార్గమున ఆరితేరినవాడు, కల్లజూదరి యగు కొడుకును అదుపున పెట్టజాలకున్నాను. నాకు మేలైనదానిని చేయజాలకున్నాను.

భవత్యేవ హి మే సూత బుద్ధి ర్దోషానుదర్శినీ,
దుర్యోధనం సమాసాద్య పునః సా పరివర్తతే. 6

సూతా! నా బుద్ధి దోషములను పరికించుచునే యున్నది. కాని దుర్యోధనుని చూచినంత తిరిగి యది పెడత్రోవ పట్టుచున్నది.

ఏవం గతే హి యద్భావి తద్భవిష్యతి సఞ్జయ,
క్షత్రధర్మః కిల రణే తనుత్యాగో హి పూజితః. 7

సంజయా! ఇట్టి యెడ నేది కావలయునో అదియే అగును. యుద్ధమున దేహమును వదలుట యనునది లోకులు మన్నించు క్షత్రధర్మము గదా!

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

త్వద్యుక్తోఽయ మనుప్రశ్నో మహారాజ యథేచ్ఛసి,
న తు దుర్యోధనే దోష మిమ మాధాతు మర్హసి. 8

మహారాజా! నీవు తెలియగోరెడు ప్రశ్నకు సమాధానము నీయందే యున్నది. ఈ తప్పును దుర్యోధనున కంటగట్టరాదు.

శృణుష్వానవశేషేణ వదతో మమ పార్థివ,
య ఆత్మనో దుశ్చరితా దశుభం ప్రాప్నుయాన్నరః,
న స కాలం న వా దేవా నేనసా గన్తు మర్హతి. 9

---

5. నికృతిప్రజ్ఞమ్ - కుట్రకు సంబంధించిన ప్రజ్ఞ కలవాడు - ఆతనికి ధర్మవిషయములందు ఏ మాత్రము బుద్ధి తోడ్పడదని తాత్పర్యము.

9. ఏనసా - తప్పుచూపి; కాలమ్ - కాలమునుగాని, దేవాన్ - దేవతలనుగాని, గన్తుమ్-నిందించుటకు; న అర్హతి-తగదు; దోషము చక్కగా

ఏమియు దాపక చెప్పెదను వినుము. తనపైన పాడుపనులవలన కీడు పొందు మానవుడు కాలమునో, దేవతలనో తప్పుపట్టి నిందింపరాదు.

మహారాజ మనుష్యేషు నిన్ద్యం యః సర్వ మాచరేత్,
స వధ్యః సర్వలోకస్య నిన్దితాని సమాచరన్. 10

మహారాజా! మనుష్యులయందు నిందింపదగినదెల్ల చేయువాడు, పాడు పనులు చేయుచునే యుండును. అట్టివాడు ఎల్లలోకమునకు వధింపదగినవాడగును.

నికారా మనుజశ్రేష్ఠ పాణ్డవై స్త్వత్ప్రతీక్షయా,
అనుభూతాః సహామాత్యై ర్నికృతై రధి దేవనే. 11

నీవు చూచుచు ఊరకున్న కాలమున (నీలో మార్పు కలుగునని యెదురు చూచుచు) పాండవులు వారి సన్నిహితులతోపాటు పెనుజూదమున పెక్కుపాట్లు అనుభవించిరి.

హయానాం చ గజానాం చ రాజ్ఞాం చామితతేజసామ్,
వైశసం సమరం వృత్తం యత్తన్మే శృణు సర్వశః. 12

గుఱ్ఱములకు, ఏనుగులకు, మహాతేజస్సుగల రాజులకు యుద్ధము కారణముగా చావు దాపురించినది. అది యెల్ల చెప్పెదను వినుము.

స్థిరో భూత్వా మహాప్రాజ్ఞ సర్వలోకక్షయోదయమ్,
యథాభూతం మహాయుద్ధే శ్రుత్వా చైకమనా భవ. 13

మహామేధావీ! సర్వలోకము నాశనము కానున్నది. ఈ మహాయుద్ధమున ఉన్నదున్నట్లు చెప్పెదను. స్థిరుడవై విని మనసు చెదరక నిలువుము.

---

కానవచ్చుచుండగా కానరాని దానిని భావించుట అన్యాయము. స్పష్టముగా అపరాధము ఏదో తెలియనియెడల కాలముమీదనో దేవతలమీదనో నెపముపెట్టుట సహజమే కాని తప్పు తనది యని గట్టిగా తెలియుచుండగా కాలమును దేవతలను నిందించుట పనికిరాదని తాత్పర్యము.

11. నికారాః - తిరస్కారములు, అపకారములు.

12. వైరమ్ - యుద్ధము కారణమైన; వైశసమ్ - చావు.

నహ్యేవ కర్తా పురుషః కర్మణోః శుభపాపయోః,
అస్వతన్త్రో హి పురుషః కార్యతే దారుయన్త్రవత్. 14

మనుజుడు పుణ్యపాపకర్మములకు తనంతతాను కర్త కాడు. కొయ్య బొమ్మవలె స్వతంత్రత లేక దైవప్రేరణచే ఆ యా పనులు చేయుచున్నాడు.

కేచి దీశ్వరనిర్దిష్టాః కేచిదేవ యదృచ్ఛయా,
పూర్వకర్మభి రప్యన్యే త్రైధ మేత త్ప్రదృశ్యతే,
తస్మా దనర్థ మాపన్నః స్థిరో భూత్వా నిశామయ. 15

కొందరు ఈశ్వరుని ఆజ్ఞలకు లోబడినవారు. మరికొందరు బుద్ధి వచ్చి నట్లు ప్రవర్తింతురు. ఇంక కొందరు మునుపటి కర్మములు త్రిప్పినట్లు తిరుగుదురు. ఇట్లు ఇది మూడు విధములుగా కానవచ్చుచున్నది. కావున కీడు మూడిన నీవు చెదరక బెదరక నేను చెప్పు దానిని వినుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సైన్యనిర్యాణపర్వణి
సఞ్జయవాక్యే ఊనషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సైన్యనిర్యాణపర్వమున
సంజయవాక్యముగల నూటయేబదితొమ్మిదవ అధ్యాయము.

సమాప్తం సైన్యనిర్యాణపర్వ.

సైన్యనిర్యాణపర్వము ముగిసెను.

—: o :—

* ఉలూకదూతాగమన పర్వ - లా

# ఉలూకదూతాగమనపర్వము - 8

## షష్ట్యధికశతతమోఽధ్యాయః

## నూటయరువదియవ అధ్యాయము

**దుర్యోధనేన పాణ్డవాన్ ప్రతి సన్దేశం ప్రాపయితు ముకూకం దూత్యాయ ప్రేషణం, సందేశనివేదనం చ.**

**దుర్యోధనుడు పాండవుల కడకు సందేశము పంపుటకై ఉలూకుని రాయబార మంపుట, సందేశము నివేదించుట.**

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

హిరణ్వత్యాం నివిష్టేషు పాణ్డవేషు మహాత్మసు,
న్యవిశన్త మహారాజ కౌరవేయా యథావిధి. 1

మహాత్ములగు పాండవులు హిరణ్వతియందు విడిది చేసికొనియుండగా కౌరవులు కార్యములన్నియు చక్కగా చేసికొని కురుక్షేత్రమును ప్రవేశించిరి.

తత్ర దుర్యోధనో రాజా నివేశ్య బల మోజసా,
సంమానయిత్వా నృపతీ న్న్యస్య గుల్మాం స్తథైవ చ. 2
ఆరక్షస్య విధిం కృత్వా యోధానాం తత్ర భారత,
కర్ణం దుఃశాసనం చైవ శకునిం చాపి సౌబలమ్. 3
ఆనాయ్య నృపతి స్తత్ర మన్త్రియామాస భారత,
తత్ర దుర్యోధనో రాజా కర్ణేన సహ భారత. 4

---

* ఉలూకుడు దుర్యోధనుని దూత-అతడు పాండవులకడకు వచ్చి సందేశము వినిపించు వృత్తాంతము గల పర్వము.

2. ఆరక్షస్య - రక్షింపదగినవాని, విధమ్ - రక్షణవిధిని.

దుర్యోధనుడు సేనను విడియించి, రాజుల నందరను మన్నించి సైన్యము లకు స్థావరము లేర్పరచి రక్షణకు ఏర్పాటు లన్నియు కావించి, యోధులకు వలయు ఏర్పాటు లొనర్చి కర్ణుని, దుశ్శాసనుని, శకునిని రావించి పిదప కర్ణునితో మంతనము లాడెను.

సంభాషిత్వా చ కర్ణేన భ్రాత్రా దుశ్శాసనేన చ,
సౌబలేన చ రాజేన్ద్ర మన్త్రయిత్వా నరర్షభ. 5
ఆహూయోపహ్వరే రాజ న్నులూక మిద మబ్రవీత్.

కర్ణునితో, తమ్ముడగు దుశ్శాసనునితో, శకునితో సంభాషించి, ఉలూకుడను వానిని దగ్గరకు పిలిచి యిట్లు పలికెను.

ఉలూక గచ్ఛ కైతవ్యం పాణ్డవాన్ సహసోమకాన్,
గత్వా మమ వచో బ్రూహి వాసుదేవస్య శృణ్వతః. 6

ఉలూకా! సోమకులతో కూడియున్న పాండవులకడకు కపటముగా పొమ్ము. పోయి వాసుదేవుడు వినుచుండగా నామాట నిట్లు చెప్పుము.

ఇదం తత్ సమనుప్రాప్తం వర్షపూగాభిచిన్తితమ్,
పాణ్డవానాం కురూణాం చ యుద్ధం లోకభయఙ్కరమ్. 7

ఇదిగో పెక్కేండ్లుగా ఎదురుచూచుచున్న కురుపాండవుల యుద్ధము లోకముల కెల్ల భయము గొలుపుచు వచ్చిపడినది.

8
యదేతత్ కత్థనావాక్యం సఞ్జయో మహదబ్రవీత్,
వాసుదేవసహాయస్య గర్జతః సానుజస్య తే,
మధ్యే కురూణాం కౌన్తేయ తస్య కాలోఽయమాగతః. 9

వాసుదేవుడు తోడుగా నున్న నీవు తమ్ములతో పాటు కౌరవుల నడుమ నిన్ను నీవు పొగడికొనుచు పలికిన పలుకు సంజయుడు గొప్పగా చెప్పెనే - దానికి తగిన సమయము దగ్గరకు వచ్చినది.

యథా వః సంప్రతిజ్ఞాతం తత్ సర్వం క్రియతామితి,
జ్యేష్ఠం తథైవ కౌన్తేయం బ్రూయాస్త్వం వచనాన్మమ. 10

---

8. కత్థనావాక్యమ్ - తన్ను తాను పొగడికొనుమాట.
10. సంప్రతిజ్ఞాతమ్ - దుశ్శాసనుని నెత్తురు త్రాగుట మొదలైనవి.

'మీరు పలికిన ప్రతినల నన్నింటిని తీర్చుకొనుడు' - అని నామాటగా కుంతి కొడుకులలో పెద్దవానికి చెప్పుము.

భ్రాతృభిః సహితః సర్వైః సోమకైశ్చ సకేకయైః,
కథం వా ధార్మికో భూత్వా త్వమధర్మే మనః కృథాః. 11

నీవు ధర్మమూర్తివి కదా! తమ్ములందరితో, సోమకులతో, కేకయులతో కూడి అధర్మమున నెట్లు మనసు పెట్టుదువు?

య ఇచ్ఛసి జగత్ సర్వం నశ్యమానం నృశంసవత్,
అభయం సర్వభూతేభ్యో దాతా త్వమితి మే మతిః. 12

నీవు క్రూరునివలె లోకమంతయు నాశనమై పోవుటనే కోరుచున్నావు. నీవేదో సర్వభూతములకు అభయమిచ్చువాడ వని నేను తలచితిని.

శ్రూయతే హి పురా గీతః శ్లోకోఽయం భరతర్షభ,
ప్రహ్లాదేనాథ భద్రం తే హృతే రాజ్యే తు దైవతైః. 13

మున్ను దేవతలచేత తన రాజ్యము దెబ్బతినగా ప్రహ్లాదుడు చెప్పిన శ్లోక మొకటి వినవచ్చుచున్నది.

యస్య ధర్మధ్వజో నిత్యం సురా ధ్వజ ఇవోచ్ఛ్రితః,
ప్రచ్ఛన్నాని చ పాపాని బైడాలం నామ తద్వ్రతమ్. 14

దేవతలారా! ధర్మముగుర్తు ధ్వజమువలె లోకమున కంతయు వెల్లడి యగుచు పాపములు గుట్టుగా నుండునట్టి వ్రతమును 'బైడాల' మందురు.

---

11. తమ్ములతో కూడి ఎట్లు అధర్మమున మనసు పెట్టుదువని అన్వయము.

12. అభయం దాతా - సర్వ ప్రాణులకు అభయమిచ్చు వాడవని నా తలపు అనగా యుద్ధము వొంత పోక సన్యాసము స్వీకరించి సమస్తప్రాణులను కాపాడు ప్రవృత్తి నీయందు గలదని నేను భావించితిని - అని తాత్పర్యము.

14. సురాః - దేవతలారా! అని సంబోధనము; ధర్మధ్వజః - ధర్మము గుర్తు; ఉచ్ఛ్రితః - పైకి వెల్లడిచేయబడినది; పైకి ధర్మమును ప్రకటించుచు లోలోపల పాపములు చేయుట; బైడాలమ్-పిల్లికి సంబంధించిన;

అత్ర తే వర్తయిష్యామి అఖ్యాన మిద ముత్తమమ్,
కథితం నారదేనేహ పితు ర్మమ నరాధిప. 15

రాజా! నా తండ్రికి నారదుడు చెప్పిన మేలైన యీ కథను నీ కిట అన్వయింతును.

మార్జారః కిల దుష్టాత్మా నిశ్చేష్టః సర్వకర్మసు,
ఊర్ధ్వబాహుః స్థితో రాజన్ గఙ్గాతీరే కదాచన. 16

ఒకప్పుడు గంగయొద్దున పాడుబుద్ధిగల పిల్లి యొకటి ముంగాళ్ళు పైకెత్తి పనులన్నింటియందు చేష్టలుడిగి యుండినదట.

స వై కృత్వా మనఃశుద్ధిం ప్రత్యయార్థం శరీరిణామ్,
కరోమి ధర్మ మిత్యాహ సర్వానేవ శరీరిణః. 17

అది ప్రాణుల నమ్మికకై హింసను మానివైచి 'ఇదిగో ధర్మ మాచరించుచున్నాను' అని ప్రాణు లన్నింటికి చెప్పజొచ్చెను.

తస్య కాలేన మహతా విశ్రమ్భం జగ్ము రణ్డజాః,
సమేత్య చ ప్రశంసన్తి మార్జారం తం విశామ్పతే. 18

పెద్దకాలమునకు పక్షులన్నియు దానియెడ నమ్మకము పెంచుకొనినవి. అన్నియు కలిసి దానిని పొగడజొచ్చినవి.

పూజ్యమానస్తు తైః సర్వైః పక్షిభిః పక్షిభోజనః,
ఆత్మకార్యం కృతం మేనే చర్యాయాశ్చ కృతం ఫలమ్. 19

పక్షులే భోజనముగా గల ఆ పిల్లి ఆ పక్షు లట్లు తన్ను మన్నించుచుండగా తన పంట పండినట్లే, తన వ్రతము ఫలించినట్లే తలపోసెను.

అథ దీర్ఘస్య కాలస్య తం దేశం మూషికా యయుః,
దదృశు స్తం చ తే తత్ర ధార్మికం వ్రతచారిణమ్. 20
కార్యేణ మహతా యుక్తం దమ్భయుక్తేన భారత.

17. మనఃశుద్ధిమ్ - హింసనుండి మరలుటను.
18. విశ్రమ్భమ్ - నమ్మకమును.

అంత పెద్దకాలమున కాప్రాంతమునకు ఎలుకలు చేరినవి. పెద్ద పని యేదో పెట్టుకొని ఆర్భాటముగా ధర్మప్రవృత్తితో వ్రతము చేయుచున్న ఆ మార్జాలమును చూచినవి.

తేషాం మతి రియం రాజ న్నాసీ త్తత్ర వినిశ్చయే. 21
బహుమిత్రా వయం సర్వే తేషాం నో మాతులో హ్యయమ్,
రక్షాం కరోతు సతతం వృద్ధబాలస్య సర్వశః. 22

అవి అన్నియు చక్కగా ఆలోచించి చివరకు ఇట్లు నిశ్చయము చేసికొనెను. మనము పెక్కంద్రు చెలికాండ్రము. ఇది మనకు మామ. మన పెద్దవారిని, పసివారిని ఎల్లవేళల అన్నివైపులనుండి రక్షించును.

ఉపగమ్య తు తే సర్వే బిడాల మిద మబ్రువన్,
భవత్ప్రసాదా దిచ్ఛామ శ్చర్తుం చైవ యథాసుఖమ్. 23

అవి అన్నియు పిల్లికడకు వచ్చి యిట్లు పలికెను. నీ దయతో సుఖముగా తిరుగగోరుచున్నాము.

భవాన్నో గతిరవ్యగ్రా భవాన్నః పరమః సుహృత్,
తే వయం సహితాః సర్వే భవన్తం శరణం గతాః. 24

నీవే మాకు దిక్కు. నీవు మాకు గొప్ప చెలికాడవు. మేమందరము కూడి నిన్ను శరణు జొచ్చితిమి.

భవాన్ ధర్మపరో నిత్యం భవాన్ ధర్మే వ్యవస్థితః,
స నో రక్ష మహాప్రాజ్ఞ త్రిదశానివ వజ్రభృత్. 25

నీ వెల్లవేళల ధర్మపరుడవు. ధర్మమున నిలిచియున్నావు. ఓయి మహామేధావీ! దేవతలను దేవేంద్రునివలె నీవు మమ్ము రక్షింపుము.

ఏవ ముక్తస్తు తైః సర్వై ర్మూషికైః స విశాంపతే,
ప్రత్యువాచ తతః సర్వాన్ మూషికాన్ మూషికాన్తకృత్. 26

---

22. బహుమిత్రాః-పెక్కంద్రు, చెలిమి గలవారము; బహ్వమిత్రాః-అనియు పాఠము. పెక్కుమంది శత్రువులు కలవారమని అర్థము, వృద్ధబాలస్య-వృద్ధులయొక్కయు బాలురయొక్కయు సముదాయముయొక్క;

ఆ ఎలుక లన్నియు నిట్లు పలుకగా ఎలుకలను రూపుమాపు ఆ పిల్లి వాని కిట్లు బదులు పలికెను.

ద్వయోర్యోగం న పశ్యామి తపసో రక్షణస్య చ,
అవశ్యం తు మయా కార్యం వచనం భవతాం హితమ్. 27

తపస్సు, రక్షణము ఈ రెంటికి కలయిక యెట్లో నాకు తోచకున్నది. అయినను మీరు పలికిన మీకు మేలైన పని నాకు తప్పక చేయదగినది.

యుష్మాభి రపి కర్తవ్యం వచనం మమ నిత్యశః,
తపసాఽస్మి పరిశ్రాన్తో దృఢం నియమ మాస్థితః. 28

మీరును నేను చెప్పిన దానిని ప్రతిదినము చేయవలయును. గట్టి వ్రతమును చేపట్టి తపస్సుతో మిక్కిలి బడలి యున్నాను.

న చాపి గమనే శక్తిం కాఞ్చిత్ పశ్యామి చిన్తయన్,
సోఽస్మి నేయః సదా తాతా నదీకూల మితఃపరమ్. 29

నాయనలారా! ఎంత చింతించినను నడచుటకు శక్తి చాలకున్నది. నన్ను మీరు ఇటుపై నది యొడ్డునకు నిత్యము తీసికొని పోవలయును.

తథేతి తం ప్రతిజ్ఞాయ మూషికా భరతర్షభ,
వృద్ధబాల మథో సర్వం మార్జారాయ న్యవేదయన్. 30

ఎలుకలట్లే యని మాటయిచ్చి పెద్దవారిని, పిల్లలను ఆ పిల్లి కప్పగించెను.

తతః స పాపో దుష్టాత్మా మూషికా నథ భక్షయన్,
పీవరశ్చ సువర్ణశ్చ దృఢబన్ధశ్చ జాయతే. 31

పిదప ఆ పాడుబుద్ధిగల పాపిష్ఠిపిల్లి ఎలుకలను తినుచు తెగబలిసెను. నిగనిగలాడ జొచ్చెను. కీళ్ళు గట్టిపడిన దాయెను.

మూషికాణాం గణ శ్చాత్ర భృశం సంక్షీయతేఽథ సః,
మార్జారో వర్ధతే చాపి తేజోబలసమన్వితః. 32

ఎలుకల మూక మిక్కిలి సన్నగిల్లెను. పిల్లి వర్చస్సు, బలము కలిగి బలియదొడగెను.

తతస్తే మూషికా స్సర్వే సమేత్యాన్యోన్య మబ్రువన్,
మాతులో వర్ధతే నిత్యం వయం క్షీయామహే భృశమ్. 33

అంత నా ఎలుకలన్నియు తమలో తామిట్లు పలుకుకొనెను. మామ బలియుచున్నాడు. మనము రోజురోజుకు తరిగి పోవుచున్నాము.

తతః ప్రాజ్ఞతమః కశ్చి ద్డిణ్డికో నామ మూషికః,
అబ్రవీ ద్వచనం రాజన్ మూషికాణాం మహాగణమ్. 34

అంత చక్కని తెలివిగల డిండికమను నెలుక ఆ ఎలుకల మూకతో నిట్లు పలికెను.

గచ్ఛతాం వో నదీతీరం సహితానాం విశేషతః,
పృష్ఠతోఽహం గమిష్యామి సహైవ మాతులేన తు. 35

మీరందరు ఒక్కటిగా నదియొద్దునకు మెలకువతో వెనుకవైపు వచ్చుచుండగా నేను మామతోపాటు కలిసి పోయెదను.

సాధు సాధ్వితి తే సర్వే పూజయాంచక్రిరే తదా,
చక్రుశ్చైవ యథాన్యాయం డిణ్డికస్య వచోఽర్థవత్. 36

మేలు మేలని ఆ ఎలుకలన్నియు దానిని కొనియాడెను. అర్థవంతమగు ఆ డిండికము చెప్పినట్లు చేసెను.

అవిజ్ఞానా త్తతః సోఽథ డిణ్డికం హ్యుపభుక్తవాన్,
తత స్తే సహితాః సర్వే మన్త్రయామాసు రఞ్జసా. 37

ఆ పిల్లి వెనుక వచ్చు నెలుకల సంగతి ఎఱుగక డిండికమును తినివైచెను. అప్పు డవి యన్నియు గూడి ఒక్కమారుగా కూడబలికికొనెను.

తత్ర వృద్ధతమః కశ్చిత్ కోలికో నామ మూషికః,
అబ్రవీ ద్వచనం రాజన్ జ్ఞాతిమధ్యే యథాతథమ్. 38

అందు అన్నింటికంటె పెద్దదియగు కోలికమను ఎలుక తన జాతి వారిలో నున్నదున్న ట్లిట్లు పలికెను.

న మాతులో ధర్మకామ శ్ఛద్మమాత్రం కృతా శిఖా,
న మూలఫలభక్షస్య విష్ఠా భవతి లోమశా. 39

ఈ మామ ధర్మమున కాంక్ష కలది కాదు. కపటముననే యిట్టి రూపము తాల్చినది. దుంపలు పండ్లు తినుదాని మలము వెంట్రుకలతో నిండినదికాదు గదా!

అస్య గాత్రాణి వర్ధన్తే గణశ్చ పరిహీయతే,
అద్య సప్తాష్టదివసాన్ డిణ్డికో౽పి న దృశ్యతే. 40

దీని అవయవములు బలియుచున్నవి. మన గుంపేమో తరిగిపోవుచున్నది. నేటికి ఏడెనిమిది దినములుగా చిందికము గూడ కానరాకున్నది.

ఏతచ్ఛ్రుత్వా వచః సర్వే మూషికా విప్రదుద్రువుః,
బిడాలో౽పి స దుష్టాత్మా జగామైవ యథాగతమ్. 41

ఈ మాట విని ఎలుక లన్నియు పారిపోయినవి. పాడుబుద్ధిగల పిల్లియు తన దారిని తాను పోయెను.

తథా త్వమపి దుష్టాత్మన్ బైడాలం వ్రత మాస్థితః,
చరసి జ్ఞాతిషు సదా బిడాలో మూషికేష్వివ. 42

ఓయి దుష్టాత్ముడా! నీవును పిల్లి పూనిన వ్రతము పూని అది ఎలుకల యందు మెలగిన తీరున బంధువులయందు మెలగుచున్నావు.

అన్యథా కిల తే వాక్య మన్యథా కర్మ దృశ్యతే,
దమ్భనార్థాయ లోకస్య వేదా శ్చోపశమశ్చ తే. 43

నీవు చెప్పెడి దొకటియు చేసెడిది మరొకటియుగా కానవచ్చుచున్నది. లోకమును వంచించుటకే నీ చదువులు, శాంతియు.

త్యక్త్వా ఛద్మ త్విదం రాజన్ క్షత్రధర్మం సమాశ్రితః,
కురు కార్యాణి సర్వాణి ధర్మిష్ఠో౽సి నరర్షభ. 44

---

39. శిఖా - శత్రువునకు కూడ మిత్రభావము ప్రకటించు వైఖరియని తాత్పర్యము.

44. ఇదమ్ - దీనిని అజాతశత్రుడన్న భావమును, త్యక్త్వా - వదలి; ధర్మిష్ఠో౽సి - ఇది వెక్కిరింత. ధర్మిష్ఠుడవు.

రాజా! ఈ వంచనను పదలివైచి క్షత్రియధర్మమును చేపట్టి సర్వ కార్యము లొనరింపుము. ఆహా! గొప్ప ధర్మిష్ఠుడవు గదా!

బాహువీర్యేణ పృథివీం లబ్ధ్వా భరతసత్తమ,
దేహి దానం ద్విజాతిభ్యః పితృభ్యశ్చ యథోచితమ్. 45

చేతి లావున భూమిని చేజిక్కించుకొని బ్రాహ్మణులకు, పితృదేవతలకు తగిన తీరున దానమిమ్ము.

క్లిష్టాయా వర్షపూగాంశ్చ మాతు ర్మాతృహితే స్థితః,
ప్రమార్జాశ్రు రణే జిత్వా సమ్మానం పరమావహ. 46

పెక్కేండ్లు నలిగిపోయిన తల్లి కన్నీరు తుడుపుము. తల్లికి మేలు చేయుటకై సిద్ధపడుము. యుద్ధమున గెలిచి గొప్ప మన్ననకు పాత్రుడవగుము.

పఞ్చ గ్రామా వృతా యత్నా న్నాస్మాభి రపవర్జితాః,
యుధ్యామహే కథం సంఖ్యే కోపయేయ చ పాణ్డవాన్. 47

నీవు కోరిన అయిదూళ్ళను మేము ప్రయత్నపడి తొలగ ద్రోసితిమి. వాని నిచ్చినచో యుద్ధమున పోరుట యెట్లు? పాండవులను కోపింపజేయుట యెట్లు?

త్వత్కృతే దుష్టభావస్య సంత్యాగో విదురస్య చ,
జాతుషే చ గృహం దాహం స్మర తం పురుషో భవ. 48

లక్కయిల్లు కాల్చునాడు నీకై విదురుడు దుష్టభావము వదలుటయు జరిగినది. దానిని తలచి మగవాడవై నిలువుము.

యచ్చ కృష్ణ మవోచ స్త్వ మాయాన్తం కురుసంసది,
అయ మస్మి స్థితో రాజన్ శమాయ సమరాయ చ. 49
తస్యాయ మాగతః కాలః సమరస్య నరాధిప,
ఏతదర్థం మయా సర్వం కృత మేత ద్యుధిష్ఠిర. 50

కౌరవసభకు వచ్చుచున్న కృష్ణునితో 'మేము శాంతికి, సమరమునకు సిద్ధముగా నున్నాము' అని పలికితివి. అదిగో ఆ యుద్ధమునకు సమయ మాసన్నమైనది. యుధిష్ఠిరా! దానికొరకే అన్ని ఏర్పాటులను గావించితిని.

---

46. ప్రమార్డ్జ - ప్రమార్జయ - తుడుపుము.

కిం ను యుద్ధాత్ పరం లాభం క్షత్రియో బహుమన్యతే,
కిం చ త్వం క్షత్రియకులే జాతః సంప్రథితో భువి. 51

క్షత్రియుడు యుద్ధముకంటె మించిన లాభమును దేనిని గొప్పగా తలచును? మరియు నీవు క్షత్రియకులమున బుట్టితి నని లోకమున పేరొందితి వేల?

ద్రోణా దస్త్రాణి సంప్రాప్య కృపాచ్చ భరతర్షభ,
తుల్యయోనౌ సమబలే వాసుదేవం సమాశ్రితః. 52

ద్రోణునివలనను, కృపునివలనను, అస్త్రవిద్యను గడించి మాకు సాటి యగు కులము, బలము కలిగియుండియు వాసుదేవుని పట్టి వ్రేలాడుచున్నావు.

బ్రూయా స్త్వం వాసుదేవం చ పాణ్డవానాం సమీపతః,
ఆత్మార్థం పాణ్డవార్థం చ యత్తో మాం ప్రతియోధయ. 53

ఉలూకా! నీవా పాండవులు దగ్గర నుండగా ఆ వాసుదేవునితో నిట్లు పలుకుము. ఓయి! నిన్నును పాండవులను ఉద్ధరించుటకై సిద్ధపడి నాతో పోరుము.

సభామధ్యే చ యద్రూపం మాయయా కృతవా నసి,
తత్తథైవ పునః కృత్వా సార్జునో మామభిద్రవ. 54

నిండుసభలో మాయతో ఏదో రూపమును కల్పించితివే. దాని నట్లే మరల యుద్ధమున కావించి అర్జునునితో కలిసి నన్ను పారద్రోలుము!

ఇన్ద్రజాలం చ మాయా వై కుహకా వాऽపి భీషణా,
ఆత్తశస్త్రస్య సఙ్గ్రామే వహన్తి ప్రతిగర్జనాః. 55

ఇంద్రజాలము, మాయ, కృత్య, బెదరింపు అనునవి యుద్ధమున శస్త్రము పట్టినవానికి పట్టశక్యము కాని కోపము తెప్పించును.

---

55. మాయా - మోసము; కుహకా - క్షుద్రవిద్య - భీషణా - బెదరింపు. ఇతి - ప్రతిగర్జనాః -మిక్కిలి కోపమును; వహన్తి-తెప్పించును. ఇంద్రజాలాదులు ఆయుధములు పట్టినవానికి తీవ్రకోపమునకు కారణము లగును గాని భయము పుట్టింప వని తాత్పర్యము.

వయ మప్యుత్సహేమ ద్యాం ఖం చ గచ్ఛేమ మాయయా,
రసాతలం విశామోఽపి ఐన్ద్రం వా పుర మేవ తు. 56
దర్శయేమ చ రూపాణి స్వశరీరే బహూన్యపి,
న తు పర్యాయతః సిద్ధి ర్బుద్ధి మాప్నోతి మానుషీమ్. 57

మేమును మాయతో భూమిలోనికి, ఆకసమునకు పోగలము. పాతాళమును ఇంద్రుని పురమును చేరుకొనగలము. మా దేహమున పెక్కురూపములు చూపగలము. కాని యిట్టి పిచ్చిచేష్టలవలన తనకు సిద్ధి కలుగదు. పరులకు మానవ సహజమైన బుద్ధియు కలుగదు.

మన సైవ హి భూతాని ధాతైవ కురుతే వశే.

బ్రహ్మయే తనసంకల్పముతో భూతము లన్నింటిని తన వశమున నుంచుకొనును.

యద్భ్రవీషి చ వార్ష్ణేయ ధార్తరాష్ట్రా నహం రణే. 58
ఘాతయిత్వా ప్రదాస్యామి పార్థేభ్యో రాజ్య ముత్తమమ్,
ఆచచక్షే చ యే సర్వం సఞ్జయ స్తవ భాషితమ్. 59

---

57. పర్యాయతః - ఇచట పర్యాయమనగా పైచెప్పిన భయపెట్టు ప్రకారము-దానివలన; సిద్ధిః - తనకు కార్యసిద్ధి - కలుగదు; పరుడును-మానుషీం బుద్ధిమ్ - మానవసాధారణమైన భయపడు లక్షణమును; న ప్రాప్నోతి-పొందడు.

58. పైదానికి కారణము వివరించుచున్నాడు; యతః - ఏలయన; మనసా, ఏవ-మనస్సుచేతనే; ధాతా-బ్రహ్మ; భూతాని - భూతములను - ప్రాణులను; వశే కురుతే - వశము చేసికొనును. మమ్ములను ఈశ్వరుడే లోగొనవలయును గాని, నీవంటివారి బెదరింపులు కాదని భావము.

పూర్వశ్లోకము; 'న తు' అనుదానికి 'నను' అనుపాఠాంతరము కలదు. ఆ పక్షమున పర్యాయతః - క్రమముగా అని అర్థము. భావ మదియే అనగా మానవుడు క్రమమునుబట్టి-విధి ఏర్పరచిన క్రమమునుబట్టి సిద్ధి పొందును గాని బెదరింపులవలన కాదని భావము. 'పర్యాయః ప్రకారే ఽవసరే క్రమే' అని మేది నికోశము.

వార్ష్ణేయా! ధృతరాష్ట్రునివారం నందరను యుద్ధమున చంపి కుంతీ కుమారులకు ఉత్తమమగు రాజ్య మొసగెద నని నీవు పలుకుచుందువట. ఆ నీ మాట నెల్ల సంజయుడు నాకు చెప్పెను.

మద్ద్వితీయేన పార్థేన వైరం వః సవ్యసాచినా,
స సత్యసఙ్గరో భూత్వా పాణ్డవార్థే పరాక్రమీ, 60
యుధ్య స్వాద్య రణే యత్తః పశ్యామః పురుషో భవ.

నేను తోడుగా నున్న అర్జునునితో, కుడి యెడమ చేతులతో బాణములు గుప్పించువానితో మీకు పగ అనియు నందువట మాటపై నిలబడి పాండవులకై పరాక్రమించి నేడు పోరికి సిద్ధపడి రమ్ము. చూతము. మగవాడవు కమ్ము.

యస్తు శత్రు మభిజ్ఞాయ శుద్ధం పౌరుష మాస్థితః, 61
కరోతి ద్విషతాం శోకం స జీవతి సుజీవితమ్.

శత్రువు బలపరాక్రమములు చక్కగా ఎఱిగి పౌరుషము గట్టి చేసికొని శత్రువులకు దుఃఖము కలుగజేయువాడు బ్రదికిన బ్రదుకే బ్రదుకు.

అకస్మా చ్చైవ తే కృష్ణ ఖ్యాతం లోకే మహద్యశః, 62
అద్యేదానీం విజానీమః సన్తి షణ్డాః సశృఙ్గకాః.

కృష్ణా! ఉన్నట్లుండి లోకమున నీకు పెద్దకీర్తి బయలుదేరినది. లోకమున మగవాని గుర్తులు గల పేడివాండ్రుందు రని యిప్పుడు మాకు తెలిసినది.

మద్విధో నాపి నృపతి స్త్వయి యుక్తః కథఞ్చన, 63
సన్నాహం సంయుగే కర్తుం కంసభృత్యే విశేషతః.

నావంటి రాజు నీతో - మీదు మిక్కిలి కంసుని సేవకునితో యుద్ధ ప్రయత్నము చేయుట తగినపని కాదు.

---

62. సశృఙ్గకాః - శృంగ మనగా పురుష చిహ్నము - గడ్డములు మీసములు, మగగురి మొదలగునది - అవి కలిగిన; షణ్డాః - పేడివాండ్రు. సన్తి - ఉందురు. వారియందు నీ శౌర్యము పేరు గాంచిన దని భావము.

తం చ తూబరకం బాలం బహ్వాశిన మవిద్యకమ్, 64
ఉలూక మద్వచో బ్రూహి అసకృ ద్భీమసేనకమ్.

ఉలూకా! ఆ నీచుడు భీము డున్నాడే పొడుగుకొమ్ముల ఎద్దువంటివాడు, వివేకము లేనివాడు, వట్టి తిండిపోతు, చదువుసంధ్యలు లేనివాడు. వానితో నా మాట నిట్లు పలుమారులు పలుకుము.

విరాటనగరే పార్థ య స్త్వం సూదో హ్యభూః పురా, 65
వల్లవో నామ విఖ్యాత స్తన్మమైవ హి పౌరుషమ్.

కుంతికొడుకా! నీవు మునుపు విరాటనగరమున వల్లవుడను పేరున ప్రసిద్ధి పడసి వంటలవాడ వైతివి. అది నా పౌరుషమువలననే కదా!

ప్రతిజ్ఞాతం సభామధ్యే న తన్మిథ్యా త్వయా పురా, 66
దుశ్శాసనస్య రుధిరం పీయతాం యది శక్యతే.

ఓయి! నిండు సభలో మునుపు ప్రతినలు పలికితివి. అది వట్టిది కాదా? ఏదీ శక్తి యున్నచో దుశ్శాసనుని నెత్తురు త్రావుము.

య ద్బ్రవీషి చ కౌన్తేయ ధార్తరాష్ట్రా నహం రణే, 67
నిహనిష్యామి తరసా తస్య కాలోఽయ మాగతః.

భీమా! యుద్ధమున ధృతరాష్ట్రకుమారులను ఒక్కపెట్టున చంపుదు ననుచుందువు. ఇదిగో దానికి సమయము వచ్చినది.

---

64. తూబరకమ్ - పెద్ద కొమ్ములు గల ఎద్దును తూబరక మందురు. భీము డట్టివాడని దుర్యోధనుని భావము; 'తూపర' అను పాఠమునందును అదియే భావన; తూబరశబ్దమునకు మీసము లేని మగవా డనియు నర్థము. "తూబరో ఽశ్మశ్రుపురుషే ప్రౌఢశృఙ్గానడుహ్యపి" అని మేదిని. భీమసేను డట్టివాడని ఎగతాళి. 'అశ్వో ఽజ స్తూపరో గోమృగ ఇతి ప్రాజాపత్యాః' అను వేదవాక్యమునందు అశ్వాదుల నడుమ నున్న తూపర శబ్దము పశువునే చెప్పును. కావున ఆ అర్థమే యిట గ్రహించుట సముచితము. అవిద్యకమ్ - చదువు సంధ్యలు లేని మూఢు డని భావము.

త్వం హి భోజ్యే పురస్కార్యో భక్ష్యే పేయే చ భారత, 68
క్వ యుద్ధం క్వ చ భోక్తవ్యం యుధ్యస్వ పురుషో భవ.

నీవు భోజ్యములు, భక్ష్యములు, పానీయములు అనుభవించుటయందు ముందు నిలువదగినవాడవు. ఏదీ యుద్ధము చేయుము మగవాడవు కమ్ము.

శయిష్యసే హతో భూమౌ గదా మాలిఙ్గ్య భారత, 69
తద్వ్యర్థా చ సభామధ్యే వల్గితం తే వృకోదర.

దెబ్బకు నేల కూలి గదను కౌగిలించుకొని పడియుందువు. వృకోదరా! అట్టి నీవు నిండుసభలో పనికిమాలినవిధముగా గంతులు వైచితివి.

ఉలూక నకులం బ్రూహి వచనా న్మమ భారత, 70
యుధ్య స్వాద్య స్థిరో భూత్వా పశ్యామ స్తవ పౌరుషమ్.

ఉలూకా! నా మాటగా నకులునితో నిట్లనుము. చక్క నిలిచి పోరాడుము. నీ మగతనము చూచెదము.

యుధిష్ఠిరానురాగం చ ద్వేషం చ మయి భారత,
కృష్ణాయా శ్చ పరిక్లేశం స్మరేదానీం యథాతథమ్. 71

యుధిష్ఠిరునిపై నీకు గల ప్రేమను, నాయందలి ద్వేషమును ద్రౌపది పడిన పాటులను ఇప్పుడు ఉన్నదున్నట్లు స్మరింపుము.

బ్రూయా స్త్వం సహదేవం చ రాజమధ్యే వచో మమ,
యుధ్యేదానీం రణే యత్తః క్లేశాన్ స్మర చ పాణ్డవ. 72

నీవు రాజులనడుమ సహదేవునకు నామాట వినిపింపుము. ఓయి! ఇపుడు యుద్ధమునకు సిద్ధపడి పోరుము. పడిన పాట్లు గుర్తు తెచ్చుకొనుము.

విరాటద్రుపదౌ చోభౌ బ్రూయా స్త్వం వచనా న్మమ,
న దృష్టపూర్వా భర్తారో భృత్యైరపి మహాగుణైః. 73

---

73. భర్తారః - రాజులు.

తథాఽర్థపతిభి ర్భృత్యా యతః సృష్టాః ప్రజా స్తతః,
అశ్లాఘ్యోఽయం నరపతి ర్యువయో రితి చాగతమ్. 74

విరాట్ద్రుపదు లిరువురకు నా మాటగా నిట్లు చెప్పుము. గొప్పగుణములు గల సేవకులు మంచిప్రభువులను మునుపు చూడకున్నారు. అట్లే ప్రజలు పుట్టిన నాటినుండియు ప్రభువులకు గొప్ప భృత్యులు దొరకలేదు. ఈ పనికిమాలిన రాజు మీ యిరువురకు దొరకెను. కావున మీ రతనికడకు వచ్చితిరి.

తే యూయం సంహతా భూత్వా తద్వధార్థం మమాపి చ,
ఆత్మార్థం పాణ్డవార్థం చ ప్రయుధ్యధ్వం మయా సహ. 75

అట్టి మీ రందరు కట్టకట్టుకొని నన్ను చంపుటకును, మిమ్ములను పాండవులను ఉద్ధరించుకొనుటకును నాతో గొప్పగా పోరుడు.

ధృష్టద్యుమ్నం చ పాఞ్చాల్యం బ్రూయా స్త్వం వచనా న్మమ,
ఏష తే సమయః ప్రాప్తో లబ్ధవ్యశ్చ త్వయాపి సః. 76

పాంచాలుని కొడుకు ధృష్టద్యుమ్నునితో నా మాట నిట్లు పలుకుము. ఇదిగో సమయము వచ్చినది. నీవు కూడ దానిని పొందవలయును.

ద్రోణ మాసాద్య సమరే జ్ఞాస్యసే హిత ముత్తమమ్,
యుధ్యస్వ ససుహృత్ పాపం కురు కర్మ సుదుష్కరమ్. 77

---

74. అర్థపతిభిః-రాజులతో; యతః ప్రజాః సృష్టాః-ప్రజలు ఎప్పుడు సృజింపబడిరో; తతః - ఆ కాలము మొదలుకొని; సృష్ట్యారంభమునుండియు-అని భావము; మూఢులైన మీరు గుణవంతుడ నగు నాయందు తుష్టి నందకున్నారు; మూఢుడైన యుధిష్ఠిరుడు గుణహీనులగు మీయందు తుష్టి నందుచున్నాడు అని భావము.

76. లబ్ధవ్యశ్చ త్వయాఽపి సః - అది = సమయము నీవు పొందవలయును. అనగా నీకు కాలము మూడినదని భావము.

77. పాపం కర్మ కురు - గురువధరూప మైన పాపకర్మము చేయుము; 'స్వార్థమ్' అను పాఠమున 'సుదుష్కరమ్' అను పదముచేతనే యా యర్థము సిద్ధించును. 'ససుహృత్స్వార్థమ్' అని మరియొక పాఠము -

యుద్ధమున ద్రోణునితో తలపడి మేలైన హిత మేదో తెలిసికొందువు. మిత్రులతో కూడి పోరుము. మిక్కిలి దుష్కరమైన పాపము చేయుము.

శిఖణ్డిన మథో బ్రూహి ఉలూక వచనా న్మమ,
స్త్రీతి మత్వా మహాబాహు ర్న హనిష్యతి కౌరవః, 78
గాఙ్గేయో ధన్వినాం శ్రేష్ఠో యుధ్యేదానీం సునిర్భయః,
కురు కర్మ రణే యత్తః పశ్యామః పౌరుషం తవ. 79

పిదప శిఖండికి నా మాటగా నిట్లు చెప్పుము 'ఓరీ! - గొప్ప భుజములు గల వాడు కురువంశశ్రేష్ఠుడు, ధనుర్విద్యలో ఆరితేరినవాడు నగు గంగకొడుకు భీష్ముడు ఆడుదాన వని తలచి నిన్ను చంపడులెమ్ము. ఏ కొంచెము భయము లేక స్థిరముగా నిలిచి పోరుము. నీ పౌరుషము చూతుము.

ఏవ ముక్త్వా తతో రాజా ప్రహ స్యోలూక మబ్రవీత్,
ధనఞ్జయం పునర్బ్రూహి వాసుదేవస్య శృణ్వతః. 80

ఇట్లు పలికి రాజు పెద్దగా నవ్వి ఉలూకునితో నిట్లనెను. వాసుదేవుడు వినుచుండగా ధనంజయునితో మరల ఇట్లు పలుకుము.

అస్మాన్ వా త్వం పరాజిత్య ప్రశాధి పృథివీ మిమామ్,
అథవా నిర్జితోఽస్మాభి రణే వీర శయిష్యసి. 81

ఓయి! నీవు మమ్ము యుద్ధమున గెలిచి యీ భూమండల మంతయు పాలింతువు. లేదా మాచేత ఓడి యుద్ధభూమిలో నేల కూలెదవు.

రాష్ట్రా న్నిర్వాసనక్లేశం వనవాసం చ పాణ్డవ,
కృష్ణాయాశ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ 82

దేశమును వదలిపోయి పడిన పాటు, అడవులలో బ్రదుకు, ద్రౌపది పడిన పాటును స్మరించుచు పురుషుడవై నిలువుము.

యదర్థం క్షత్రియా సూతే సర్వం తదిద మాగతమ్,
బలం వీర్యం చ శౌర్యం చ పరం చాప్యస్త్రలాఘవమ్, 83
పౌరుషం దర్శయన్ యుద్ధే కోపస్య కురు నిష్కృతిమ్.

---

అప్పుడు ఇది క్రియావిశేషణము. మిత్రులతో, పాండవులతో కూడి యుద్ధ మొనర్పు మని భావము. ఇదియే మూలపాఠముగా తోచు చున్నది.

క్షత్రియకాంత ఎందుకు సంతానము కనునో అది యంతయు ఇదిగో వచ్చిపడినది. బలము, పరాక్రమము, శౌర్యము, గొప్పది యగు అస్త్రముల ఒడుపు, మగతనము చూపుచు కోపమునకు ప్రతిక్రియ కావింపుము.

పరిక్లిష్టస్య దీనస్య దీర్ఘకాలోషితస్య చ,
హృదయం కస్య న స్ఫోటే దైశ్వర్యా ద్భ్రంశితస్య చ. 84

కష్టములు పడి దీనుడై బహుకాలము ఎందో బ్రదికి ఐశ్వర్యము కోలు వోయిన యెవ్వని గుండె బ్రద్దలు కాదు ?

కులే జాతస్య శూరస్య పరవిత్తే ష్వగృధ్యతః,
ఆస్థితం రాజ్య మాక్రమ్య కోపం కస్య న దీపయేత్. 85

ఉత్తమకులమున బుట్టి, శూరుడై పరుల ధనముల కాసింపకున్నవానిలో నిలిచియున్న కోపమును రాజ్య మాక్రమించిన నావంటివాడు రగులుకొలుపడా?

యత్త దుక్తం మహద్వాక్యం కర్మణా తద్విభావ్యతామ్,
అకర్మణా కత్థితేన సన్తః కుపురుషం విదుః. 86

పలికిన పెద్ద పెద్ద మాటలను చేష్టతో నిరూపింపవలయును. చేతులు ముడుచుకొని గొప్పలు చెప్పుకొనినచో సజ్జనులు నీచు దందురు.

అమిత్రాణాం వశే స్థానం రాజ్యం చ పున రుద్ధర,
ద్వా వర్థౌ యుద్ధకామస్య తస్మాత్తత్ కురు పౌరుషమ్. 87

పగవారికి వశమైన స్థితిని, రాజ్యమును తిరిగి ఉద్ధరింపుము. యుద్ధము చేయగోరువానికి ఈ రెండే ప్రయోజనములు. కావున అట్టి మగతనమును ప్రయోగింపుము.

---

85. రాజ్య మాక్రమ్య - నావంటివాడు రాజ్యమును కొల్లగొట్టి యుండగా-అని యర్థము.

86 అకర్మణా - యుద్ధము చేయక;
కత్థితేన - తన్ను తాను పొగడుకొన్న మాత్రమున.

87. స్థానమ్ - స్థితి - తమ బ్రదుకు అని భావము. తత్ - స్థితి నొందుట, రాజ్యమును పొందుట అను తీరు గల, పౌరుషమ్-మగతనమును, కురు-చేయుము, చూపుమని భావము.

పరాజితోఽసి ద్యూతేన కృష్ణా చానాయితా సభామ్,
శక్యోఽమర్షో మనుష్యేణ కర్తుం పురుషమానినా. 88

జూదమున ని న్నోడగొట్టితిమి. కృష్ణను సభలోని కీడ్చితిమి. మగతనము గల మనుష్యుడు ఇప్పటికైన కోపము చూపవలదా?

ద్వాదశైవ తు వర్షాణి వనే ధిష్ణ్యా ద్వివాసితః,
సంవత్సరం విరాటస్య దాస్య మాస్థాయ చోషితః. 89

పన్నెండేండ్లు ఇల్లు వెడలగొట్టి అడవులకు పంపితిమి. ఒక్క యేడు విరాటునికడ సేవకవృత్తిని చేపట్టి నివసించితిరి.

రాష్ట్రా న్నిర్వాసనక్లేశం వనవాసం చ పాణ్డవ,
కృష్ణాయాశ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ. 90

దేశము వదలిపోయి పడినపాటును, అడవులలో బ్రదుకవలసిన కష్టమును, ద్రౌపది పడినపాటును గుర్తునకు తెచ్చుకొని పురుషుడ వగుము.

అప్రియాణాం చ వచనం ప్రబ్రువత్సు పునః పునః,
అమర్షం దర్శయస్వ త్వ మమర్షో హ్యేవ పౌరుషమ్. 91

మాటిమాటికి శత్రువు లాడు పలుకునకు కోపము చూపుము. కోపమే కదా పౌరుషము.

క్రోధో బలం తథా వీర్యం జ్ఞానయోగోఽస్త్రలాఘవమ్,
ఇహ తే దృశ్యతాం పార్థ యుద్ధ్యస్వ పురుషో భవ. 92

నీలోని క్రోధము, బలము, శక్తి, తెలివి, అస్త్రముల ఒడుపు అనువానిని అర్జునా! మాకు చూపుము. పోరుము. మగవాడవు కమ్ము.

---

89. ధిష్ణ్యాత్ - ఇంటినుండి.

91. అప్రియాణామ్ - శత్రువులకు; వచనమ్ - పలుకదగిన 'మీరు పశువులు, నీ కిచట మగలు లేరు, వీరు షేడివారు'-మొదలగుదానిని; ప్రబ్రువత్సు- పెద్దగా పలుకుచున్న దుశ్శాసనాదులయందు; అమర్షం - కోపమును; దర్శయ - చూపుము,

లోహాభిసారో నిర్వృత్తః కురుక్షేత్ర మకర్దమమ్,
పుష్టాస్తేఽశ్వా భృతా యోధాః శ్వో యుద్ధ్యస్వ సకేశవః. 93

ఆయుధములకు హారతులు పట్టితిమి. కురుక్షేత్రము బురద లేనిదై యున్నది. నీ గుఱ్ఱములు చియ్యబట్టి యున్నవి. యుద్ధవీరులను పోషించితివి. రేపు కృష్ణునితో కలిసి పో రానర్పుము.

అసమాగమ్య భీష్మేణ సంయుగే కిం వికత్థసే,
ఆరురుక్షు ర్యథా మన్దః పర్వతం గన్ధమాదనమ్. 94

తెలివి లేనివాడు గంధమాదనపర్వత మెక్క గోరినట్లు యుద్ధమున భీష్మునితో తలపడకయే పొగరుమాటలు పలుకుదు వేల ?

ఏవం కత్థసి కౌన్తేయ అకత్థన్ పురుషో భవ.

కుంతీకుమారా ! ఊరక గొప్పలు చెప్పుకొందువు. ప్రజ్ఞ లాడి ప్రయోజనము లేదు. పురుషుడ వగుము.

సూతపుత్రం సుదుర్ధర్షం శల్యం చ బలినాం వరమ్, 95
ద్రోణం చ బలినాం శ్రేష్ఠం శచీపతిసమం యుధి,
అజిత్వా సంయుగే పార్థ రాజ్యం కథ మిహేచ్ఛసి. 96

ఎవ్వనికిని లొంగదీయరాని కర్ణుని, బలవంతులలో గొప్పవాడగు శల్యుని, యుద్ధమున దేవేంద్రునికి సాటివచ్చువాడు, మహాబలుడు నగు ద్రోణుని రణమున గెలువకయే రాజ్యము నెట్లు పొందగోరుదువు ?

బ్రాహ్మే ధనుషి చాచార్యం వేదయో ర న్తగం ద్వయోః,
యుధి ధుర్య మవిక్షోభ్య మనీకచర మచ్యుతమ్, 97
ద్రోణం మహాద్యుతిం పార్థ జేతు మిచ్ఛసి తన్మృషా,
న హి శుశ్రుమ వాతేన మేరు మున్మథితం గిరిమ్. 98

---

93. లోహాభిసారః - శస్త్రములకు హారతులు పట్టుట; వానియందు దేవతాహ్వానము చేయుట మొదలగు కార్యము. అకర్దమమ్ - బురదలేనిది - యుద్ధమునకు యోగ్యముగా నుండెనని చెప్పినట్లయినది.

97. వేదయోః - వేదము, ధనుర్వేదము అనువాని. అంతగమ్ - అంతము చూచినవానిని.

వేదమునందు ధనువునందును ఆచార్యుడు, వేదము ధనుర్వేదము అను రెంటిని కడదాక అధ్యయనము చేసినవాడు, యుద్ధమున ఎంతటి భారమైన తట్టుకొనగలవాడు, ఎవ్వరికి క్షోభపెట్టరానివాడు, సేనలలో తిరుగుచు స్థిరముగా నిలువగలవాడు, గొప్పతేజస్సు గలవాడు నగు ద్రోణుని గెలువగోరుచున్నావు. అది వట్టిమాట. గాలి మేరుపర్వతమును కలచివైచె నని ఎందును వినము.

అనిలో వా వహే న్మేరుం ద్యౌర్వాపి నిపతే న్మహీమ్,
యుగం వా పరివర్తేత యద్యేవం స్యా ద్యథాత్థ మామ్. 99

నీవు నాతో పలికినట్లే అయినచో గాలి మేరువు నెత్తుకొని పోవును. ఆకసము నేల గూలును. కాలచక్రము తలక్రిందు లగును.

కోహ్యస్తి జీవితాకాఙ్క్షీ ప్రాప్యేమ మరిమర్దనమ్,
పార్థో వా ఇతరో వాఽపి కోఽన్యః స్వస్తిగృహాన్ వ్రజేత్. 100

పగవారిని నుగ్గునుగ్గుచేసెడు ద్రోణునితో తలపడి బ్రదుకుపై ఆశయున్నవాడెవడైనను - వాడు అర్జునుడో మరియొకడో - సుఖముగా ఇల్లు చేరునా?

కథ మాభ్యా మభిధ్యాతః సంస్పృష్టో దారుణేన వా,
రణే జీవన్ ప్రముచ్యేత పదా భూమి ముపస్పృశన్. 101

ఈ భీష్మద్రోణులు చంపగోరినవా డెవ్వడు గాని వారి భయంకరమగు అస్త్రము ముట్టగా కాలితో నేలను తాకుచు యుద్ధమున బ్రదికి బయటపడునా?

కిం దర్దురః కూపశయో యథేమాం
న బుధ్యసే రాజచమూం సమేతామ్,
దురాధర్షాం దేవచమూప్రకాశాం
గుప్తాం నరేన్ద్రై స్త్రిదశై రివ ద్యామ్. 102

---

99. యుగమ్ - కాలచక్రము.

101. ఆభ్యామ్ - భీష్మద్రోణులచేత; అభిధ్యాతః - చంపదగినవాడుగా నిర్ణయింపబడినవాడు; దారుణేన - భయంకరమగు అస్త్రముతో, పదా భూమి ముపస్పృశన్ - కాలితో నేలను తాకుచు - మానవుడై యుండి - అని భావము.

102. దర్దురః - కప్ప.

ఇచట కూడిన రాజులసేన ఎవ్వరికి నలవికానిది. దేవతల సేనవలె విరాజిల్లుచున్నది. రాజు లందరు స్వర్గమును దేవతలవలె కాపాడుచున్నట్టిది. నూతిలో కప్పవలె నీవు దీనిని తెలియకున్నా వేమి?

ప్రాచ్యైః ప్రతీచ్యై రథ దాక్షిణాత్యై
రుదీచ్యకామ్బోజశకైః ఖశైశ్చ,
శాల్వైః సమత్స్యైః కురుమధ్యదేశ్యైః
మ్లేచ్ఛైః పులిన్దై ర్ద్రవిడాన్ధ్రకాఞ్చ్యైః. 103

తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము దిక్కుల రాజులు, కాంబోజులు, శకులు, ఖశులు, శాల్వులు, మత్స్యులు, కురుమధ్యదేశమువారు, మ్లేచ్ఛులు, పుళిందులు, ద్రవిడులు, ఆంధ్రులు, కాంచీదేశమువారు నా సేనను కాపాడుచున్నారు.

నానాజనౌఘం యుధి సంప్రవృద్ధం
గాఙ్గం యథా వేగ మపారణీయమ్,
మాం చ స్థితం నాగబలస్య మధ్యే
యుయుత్ససే మన్ద కిమల్పబుద్ధే. 104

ఈ నా సైన్యము పలురీతుల జనముల సముదాయములతో పెరిగిపోయి గంగవేగమువలె దాట శక్యముకానిదై యున్నది. అట్టి సేనను, ఏనుగుల బలము నడుమ నున్న నన్ను మందుడా! అల్పబుద్ధీ! ఎదుర్కొన చూచుచున్నావా?

అక్షయ్యా విషుధీ చైవ అగ్నిదత్తం చ తే రథమ్,
జానీమో హి రణే పార్థ కేతుం దివ్యం చ భారత. 105

అర్జునా! నీ తరుగుపోని అంపపొదులను, అగ్ని యిచ్చిన రథమును, దివ్యమగు ధ్వజమును యుద్ధమున తెలిసికొందుము.

---

104. నాగబలస్య - ఏనుగుల సేనయొక్క; యుయుత్ససే - యుద్ధము చేయ గోరుచున్నావు.

అకత్థమానో యుద్ధ్యస్వ కత్థసేఽర్జున కిం బహు,
పర్యాయాత్ సిద్ధి రేతస్య నైతత్సిధ్యతి కత్థనాత్. 106

ఊరక దంభములు పలుకక పోరికి రమ్ము. పెల్లుగా పొగడుకొందువేల? యుద్ధమువలననే కార్యసిద్ధి యగును గాని డాబుమాటలవలన కాదు.

యదీదం కత్థనా ల్లోకే సిధ్యేత్ కర్మ ధనఞ్జయ,
సర్వే భవేయుః సిద్ధార్థాః కత్థనే కో హి దుర్గతః. 107

లోకమున డాబులు పలికిననే పనులు నెరవేరినచో ధనంజయా! అందరు పనులు నేరవేరినవారే యగుదురు. పొగడికలో ఎవ్వడు తగ్గిపోవును?

జానామి తే వాసుదేవం సహాయం
జానామి తే గాణ్డివం తాలమాత్రమ్,
జానామ్యహం త్వాదృశో నాస్తి యోద్ధా
జానాన స్తే రాజ్య మేతద్ధరామి. 108

నీకు వాసుదేవుడు తోడని నే నెరుగుదును. నీ గాండీవము తాటిచెట్టంతటి దనియు ఎరుగుదును. నీతో సాటివచ్చు యుద్ధవీరుడు లేదనియు ఎరుగుదును. తెలిసి తెలిసి యిదిగో నీ రాజ్యమును దక్కించుకొనుచున్నాను.

న తు పర్యాయధర్మేణ సిద్ధిం ప్రాప్నోతి మానవః,
మనసైవానుకూలాని ధాతైవ కురుతే వశే. 109

మానవుడు కపటధర్మముతో గట్టెక్కడు. బ్రహ్మయే మనస్సుతో అనుకూలవిషయములను వశము చేయును.

---

106. పర్యాయాత్ - క్రమమార్గమువలన - యుద్ధమువలన అని భావము.

109 పర్యాయధర్మేణ - ఉపధర్మముచేత - మాయ మొదలగుదానితో - అని భావము. పర్యాయధర్మ మనగా క్రమధర్మము. ఈతడు రాజపుత్రుడు. రాజ్యమున కర్హుడు - అనునట్టిది. దానితో మానవుడు సిద్ధి పొందడు. శౌర్యముతోడనే సిద్ధిని పొందును - అని కొందరు చెప్పుదురు. మనసా- సంకల్పముతో; ధాతైవ - బ్రహ్మయే; అనుకూలాని - అనుకూలము లగువానిని; వశే కురుతే - వశ మొనర్చును. మనుష్యుడు కర్త కాదని తాత్పర్యము.

త్రయోదశ సమా భుక్తం రాజ్యం విలపత స్తవ,
భూయ శ్చైవ ప్రశాసిష్యే త్వాం నిహత్య సబాన్ధవమ్. 110

నీ వేడ్చుచుండగా పదమూడేండ్లు రాజ్య మనుభవించితిని. నిన్ను నీ బంధువులతోపాటు మట్టుబెట్టి యింకను రాజ్య మేలుదును.

క్వ తదా గాణ్డీవం తేఽభూద్యత్త్వం దాసపణైర్జితః,
క్వ తదా భీమసేనస్య బలం మాసీచ్చ ఫాల్గున. 111

ఓరి దాసుడా! నిన్ను పందెములతో గెలిచితిమి. అపుడు నీ గాండీవ మెందు బోయెను? ఆ భీమసేనుని బల మెందుండెను?

సగదా ద్భీమసేనాద్వా ఫాల్గునా ద్వా సగాణ్డివాత్,
న వై మోక్ష స్తదా యోఽభూ ద్వినా కృష్ణా మనిన్దితామ్. 112

ఆ నాడు గద చేపట్టిన భీమసేనునివలన గాని, గాండీవము ధరించిన ఫాల్గునునివలన గాని మీకు మోక్షము కలుగలేదు. ఏ పాప మెరుగని ద్రౌపది దక్క మీకు దిక్కు లేకపోయినది.

సా వో దాస్యే సమాపన్నాన్ మోచయామాస పార్షతీ,
అమానుష్యం సమాపన్నాన్ దాసకర్మణ్యవస్థితాన్. 113

పృషతవంశమున పుట్టిన ఆ ద్రౌపది ఆనాడు దాస్యమున చిక్కుకొని నీచత్వ మందిన మిమ్ము విడిపించెను.

అవోచం యత్ షణ్డతిలా నహం వ స్తథ్యమేవ తత్,
ధృతా హి వేణీ పార్థేన విరాటనగరే తదా. 114

నేను మిమ్ము పేడులని పలికినమాట నిజమే యయ్యెను. అర్జునుడు విరాటనగరమున జడ ముడిచెను గదా!

---

111. దాస - దాసుడా; 'వాసవ' అను పాఠమున ఇంద్రపుత్రా అని అర్థము.
113. అమానుష్యమ్ - అల్పమనుష్యత్వమును - నీచమానవలక్షణమును 'అలవణా యవాగూః' గంజి అలవణము - అనగా ఉప్పు తక్కువగా నున్న గంజి అన్నట్లు ఇక్కడ 'నఞ్' శబ్దము అల్పార్థకము;

సూదకర్మణి విశ్రాన్తం విరాటస్య మహానసే,
భీమసేనేన కౌన్తేయ యత్తు తన్మమ పౌరుషమ్. 115

భీమసేనుడు విరాటుని వంటయింట వంటపనియందు పాటుపడెను. కుంతీకుమారా! అదియా నాయందు పౌరుషము చూపుట?

ఏవ మేవ సదా దణ్డం క్షత్రియాః క్షత్రియే దధుః,
వేణీం కృత్వా షణ్ఢవేషః కన్యాం న ర్తితవానసి. 116

క్షత్రియకులమున పుట్టినవారు క్షత్రియునియందు ఎల్లవేళల దండమునే అవలంబింతురు. నీవేమో జడచుట్టి పేడివేషము ధరించి కన్యకు ఆట నేర్పితివి.

న భయా ద్వాసుదేవస్య న చాపి తవ ఫాల్గుణ,
రాజ్యం ప్రతిప్రదాస్యామి యుద్ధ్యస్వ సహకేశవః. 117

వాసుదేవునకో, నీకో భయపడి నేను రాజ్యము మీ కొసగను. కృష్ణునితో కూడి యుద్ధ మాడుము.

న మాయాఽహీన్ద్రజాలం వా కుహకా వాఽపి భీషణా,
ఆత్తశస్త్రస్య సఙ్గ్రామే వహన్తి ప్రతిగర్జనాః. 118

మాయ, ఇంద్రజాలము, వంచన, బెదరింపు అనునవి ఆయుధము పట్టిన వానిని యుద్ధమున వెరపింపజాలవు.

---

116. 'కన్యాం న ర్తితవానసి' అనుదానికి పిదప "శ్రోణ్యాం వేణ్యాం చ కక్ష్యాం చ సంయుగే చ పలాయతే" అను సగము శ్లోకము కానవచ్చుచున్నది. దాని యర్థ మిది - పిరుదులు, జడ, పార్శ్వములు, - ఇవి రతిలో మర్దనమునకు అనువగు స్థానములు. వాని విషయమున పేడివాడు - స్త్రీ వేషము వేసికొన్నను, సంయుగే - స్మరయుద్ధము వచ్చినపుడు పలాయతే పారిపోవును. స్త్రీ అయినచో దీని విషయమున చక్కగా నిలుచును. వీడు ఆమెకంటె అధము డని భావము - నీవట్టి వాడ వని అధిక్షేపము.-'కక్షాయమ్' అని యుండవలసినచోట 'కక్ష్యామ్' అనునది ఆర్షప్రయోగమని తెలియదగును.

వాసుదేవసహస్రం వా ఫాల్గునానాం శతాని వా,
ఆసాద్య మా మహేషుఘేషుం ద్రవిష్యన్తి దిశో దశ. 119

వేయిమంది కృష్ణులైనను, వందమంది అర్జునులైనను, మొక్కవోని బాణములు గల నన్ను తాకి పదిదిక్కులకు పారిపోవుదురు.

సంయుగం గచ్ఛ భీష్మేణ భిన్ధి వా శిరసా గిరిమ్,
తరస్వ వా మహాగాధం బాహుభ్యాం పురుషోదధిమ్. 120

భీష్మునితో పోరికి రమ్ము. లేదా తలను కొండకు కొట్టుకొనుము. కాదా పెనులోతుగల ఈ జనసముద్రమును చేతులతో దాటుము.

శారద్వతమహామీనం వివింశతిమహోరగమ్,
బృహద్బలమహోద్వేలం సౌమదత్తితిమిఙ్గిలమ్. 121
భీష్మవేగ మపర్యన్తం ద్రోణగ్రాహదురాసదమ్,
కర్ణశల్యఝషావర్తం కామ్బోజవడవాముఖమ్. 122
దుశ్శాసనౌఘం శలశల్యమత్స్యం
సుషేణచిత్రాయుధనాగనక్రమ్,
జయద్రథాద్రిం పురుమిత్రగాధం
దుర్మర్షణోదం శకునిప్రపాతమ్. 123
శస్త్రౌఘ మక్షయ్య మభిప్రవృద్ధం
యదాఽవగాహ్య శ్రమనష్టచేతాః,
భవిష్యసి త్వం హతసర్వబాన్ధవ
స్తదా మన స్తే పరితాప మేష్యతి. 124

---

120. భీష్మునితో యుద్ధ మనగా కొండకు తల తాటించుట మొదలగువానివలె తన చావు తాను తెచ్చుకొనుట వంటిదని భావము.

121. ఉద్వేలః - వృద్ధి - పొంగు - పోటు.

123. ఓఘః - ప్రవాహము, పురుమిత్రః - దుర్యోధనుని తమ్ముడు. గాధః - లోతుయొక్క చివర; గాధ మనియు పాఠము-అప్పుడు అతనివలన దాట శక్యముకాని దని భావము. దుర్మర్షణోదమ్ - దుర్మర్షణు డను దుర్యోధనుని తమ్ము డను నీరుగలది.

కృపుడను పెనుచేప, వివింశతి యను మహాసర్పము, బృహద్బలుడను పోటు, భూరిశ్రవుడను తిమింగిలము, భీష్ముడను వేగము కలదియు, అంతులేనిదియు, ద్రోణుడను మొసలివలన చేరరానిదియు, కర్ణుడు శల్యుడు అను చేపలు, సుడులు గలదియు, కాంబోజుడను బడబాగ్ని కలదియు, దుశ్శాసనుడను ప్రవాహము, శలుడు శల్యుడు అను చేపలు, సుషేణుడు, చిత్రాయుధుడు అను నీటియేనుగు, మొసలి సైంధవుడను కొండయు, పురుమిత్రుడను లోతు, దుర్మర్షణుడను నీరు, శకుని యను జలపాతము అయుధముల వడియు కలిగి తరుగువోనిదై పెంపొందుచున్న నా సేనాసముద్రమున మునిగి అలసతతో జారిన గుండె గలవాడవయినపుడు, చుట్టము లందరు చచ్చినవాడ వైననాడు నీ మనస్సు పరితాపము పొందును.

తదా మనస్తే త్రిదివా దివాశుచే
ర్నివర్తితా పార్థ మహీప్రశాసనాత్,
ప్రశామ్య రాజ్యం హి సుదుర్లభం త్వయా
బుభూషితః స్వర్గ ఇవాతపస్వినా. 125

అపుడు నీ మనస్సు అపవిత్రుని మనస్సు స్వర్గమునుండి మరలినట్లు భూమి నేలు కోరికనుండి మరలును. శాంతుడ వగుము. తపస్సుచేయనివానికి స్వర్గము వలె నీకు రాజ్యము సులభము కాదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ఉలూకదూతాగమనపర్వణి
దుర్యోధనవాక్యే షష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ఉలూకదూతాగమనపర్వమున
దుర్యోధనవాక్యముగల నూట అరువదియవ అధ్యాయము.

—: o :—

125. నివర్తితా - మరలగలదు - ప్రశామ్య - శాంతుడ వగుము. 'ప్రశాస్య రాజ్యమ్' అనియు పాఠము. ఏలదగిన రాజ్య మని యర్థము; బుభూషితః - పొందగోరినది. తపస్సు చేయనివానికి స్వర్గమువలె నీకు రాజ్యము పొందశక్యము కానిదని భావము.

## ఏకషష్ట్యధికశతతమోఽధ్యాయః

## నూట అరువదియొకటవ అధ్యాయము

### పాణ్డవశిబిరం గత్వోలూకేన సభాయాం దుర్యోధన సందేశస్య కథనమ్.

### పాణ్డవశిబిరమున కరిగి ఉలూకుడు సభలో దుర్యోధనుని సందేశము చెప్పుట.

సంజయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

సేనానివేశం సంప్రాప్తః కైతవ్యః పాణ్డవస్య హ,
సమాగతః పాణ్డవేయై ర్యుధిష్ఠిర మభాషత. 1

ఆ జూదగాడు పాండవుని సేనాశిబిరములోని కరిగి పాండవులను కలిసి ధర్మరాజుతో నిట్లు పలికెను.

అభిజ్ఞో దూతవాక్యానాం యథోక్తం బ్రువతో మమ,
దుర్యోధనసమాదేశం శ్రుత్వా న క్రోద్ధు మర్హసి. 2

రాజా ! దూతపలుకు లెట్టివో చక్కగా తెలిసినవాడవు. దుర్యోధనుడు ఆదేశించిన దానిని ఆతడు పలికినట్లే నేను చెప్పినచో విని నీవు కోపగింపరాదు.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

ఉలూక న భయం తేఽస్తి బ్రూహి త్వం విగతజ్వరః,
యన్మతం ధార్తరాష్ట్రస్య లుబ్ధ స్యాదీర్ఘదర్శినః. 3

ఉలూకా ! నీకు భయము లేదు. జంకుగొంకులు లేక ఆశపోతు, ముందు చూపులేనివాడు నగు దుర్యోధనుని అభిప్రాయమును చెప్పుము.

తతో ద్యుతిమతాం మధ్యే పాణ్డవానాం మహాత్మనామ్,
సృఞ్జయానాం చ మత్స్యానాం కృష్ణస్య చ యశస్వినః. 4

ద్రుపదస్య సపుత్రస్య విరాటస్య చ సన్నిధౌ,
భూమిపానాం చ సర్వేషాం మధ్యే వాక్యం జగాద హ. 5

పిమ్మట తేజశ్శాలురు, మహాత్ములు నయిన పాండవులు, సృంజయులు, మత్స్యులు, కీర్తిశాలి యగు కృష్ణుడు, కొడుకులతోపాటు ద్రుపదుడు, విరాటుడు, తక్కినరాజు లందరు ఉన్నచోట ఉలూకు డిట్లు పలుకజొచ్చెను.

ఉలూక ఉవాచ - ఉలూకు డిట్లు పలికెను.

ఇదం త్వా మబ్రవీ ద్రాజా ధార్తరాష్ట్రో మహామనాః,
శృణ్వతాం కురువీరాణాం తన్నిబోధ యుధిష్ఠిర. 6

యుధిష్ఠిరా! కౌరవు లందరు వినుచుండగా దొడ్డబుద్ధి గల దుర్యోధను డిట్లు నిన్ను గూర్చి పలికెను. అది వినుము.

పరాజితోఽసి ద్యూతేన కృష్ణా చానాయితా సభామ్,
శక్యోఽమర్షో మనుష్యేణ కర్తుం పురుషమానినా. 7

జూదమున నిన్నోడించితిమి. ద్రౌపదిని సభలోనికి రప్పించితిమి. మగవాడ ననుకొను నరుడు ఇట్టియెడ కోపము పొందదగును.

ద్వాదశైవ తు వర్షాణి వనే ధిష్ణ్యా ద్వివాసితాః,
సంవత్సరం విరాటస్య దాస్య మాస్థాయ చోషితాః. 8

పండ్రెండేండ్లు ఇంటినుండి వెడలగొట్టి అడవులకు పంపితిమి. ఒక్కయేడు విరాటునికడ దాస్యము చేయుచు నివసించితిరి.

అమర్షం రాజ్యహరణం వనవాసం చ పాణ్డవ,
ద్రౌపద్యాశ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ. 9

పాండుకుమారా! ఇట్లు కలిగిన అవమానమును, రాజ్యము కొల్లగొట్టుటను, అడవులబడి యుండుటను, ద్రౌపది పడిన పాటులను తలచుకొనుచు మగవాడవు కమ్ము.

అశక్తేన చ యచ్ఛప్తం భీమసేనేన పాణ్డవ,
దుశ్శాసనస్య రుధిరం పీయతాం యది శక్యతే. 10

10. శప్తమ్ - ప్రతిన చేయబడెను.

సత్తువలేని భీముడు ప్రతిన పట్టెను. ఏదీ! చేతనైనచో దుశ్శాసనుని రక్తము నాతని త్రాగు మనుము.

లోహాభిసారో నిర్వృత్తః కురుక్షేత్ర మకర్దమమ్,
సమః పన్థా భృతాఽస్త్రేఽశ్వాః శ్వో యుధ్యస్వ సకేశవః. 11

ఆయుధపూజ జరిగినది. కురుక్షేత్రము బురదలేనిదై యున్నది. బాటలు చక్కగా నున్నవి. గుఱ్ఱములను చక్కగా మేపితిమి. కృష్ణునితోపాటు రేపు పోరికి రమ్ము.

అసమాగమ్య భీష్మేణ సంయుగే కిం వికత్థసే,
ఆరురుక్షు ర్యథా మన్దః పర్వతం గన్ధమాదనమ్. 12

తెలివితక్కువవాడు గంధమాదనపర్వత మెక్కగోరినట్లు భీష్మునితో యుద్ధమున తలపడకయే గొప్పలు పలుకుదు వేల?

ఏవం కత్థసి కౌన్తేయ అకత్థన్ పురుషో భవ,
సూతపుత్రం సుదుర్ధర్షం శల్యం చ బలినాం వరమ్. 13
ద్రోణం చ బలినాం శ్రేష్ఠం శచీపతిసమం యుధి,
అజిత్వా సంయుగే పార్థ రాజ్యం కథ మిహేచ్ఛసి. 14

కుంతీతనయా! ఊరక పొగడికొనెదేల? మాటలు చాలించి మగవాడ వగుము. ఎవ్వరికిని అణపజాలని కర్ణుని, బలవంతులలో శ్రేష్ఠుడగు శల్యుని, యుద్ధమున దేవేంద్రునకు సాటివచ్చు మహాబలుడు ద్రోణుని గెలువక రాజ్యము నెట్లు దక్కించుకొనగోరుదువు.

బ్రాహ్మే ధనుషి చాచార్యం వేదయో రన్తగం ద్వయోః,
యుధి ధుర్య మవిక్షోభ్య మనీకచర మచ్యుతమ్, 15
ద్రోణం మహాద్యుతిం పార్థ జేతు మిచ్ఛసి తన్మృషా,
న హి శుశ్రుమ వాతేన మేరు మున్మథితం గిరిమ్. 16

---

11. ఈ అధ్యాయము నందలి శ్లోకము లన్నియు 160 వ అధ్యాయమున వ్యాఖ్యానము చేయబడినవి.

వేదమునందు, అస్త్రవిద్యయందును ఆచార్యుడు, వేదము, ధనుర్వేదము అను వాని అంతము ముట్టినవాడు, యుద్ధమున సర్వభావమును వహించువాడు, ఎందును గుండెదిటవు తప్పనివాడు, సేనలో తిరుగుచు జారుపాటు లేనివాడు, మహాతేజస్వియు నగు ద్రోణుని గెలువ గోరుదువు అది వ్యర్థము. గాలి కొండను పిండికొట్టెనని యెందును వినము.

అనిలో వా వహే న్మేరుం ద్యౌర్వాఽపి నిపతే న్మహీమ్,
యుగం వా పరివ ర్తేత యద్యేవం స్యాద్యథాత్థ మామ్. 17

నీవు నాతో పలికినట్లే అయినచో గాలి కొండ నెగురగొట్టును. ఆకసము నేల గూలును కాలచక్రము తలక్రిందు లగును.

కో హ్యస్తి జీవితాకాఙ్క్షీ ప్రాప్యేమ మరిమర్దనమ్,
గజో వాజీ రథో వాఽపి పునః స్వస్తి గృహాన్ వ్రజేత్. 18

బ్రదుకుపై ఆశగలవా డెవ్వడు గాని, ఏనుగు గాని, గుఱ్ఱము గాని, రథము గాని శత్రువులను నుగ్గునూచగా గొట్టు ద్రోణుని మార్కొని మరల సుఖముగా ఇంటికి చేరగలుగునా ?

కథ మాభ్యా మభిధ్యాతః సంస్పృష్టో దారుణేన వా,
రణే జీవన్ విముచ్యేత పదా భూమి ముపస్పృశన్. 19

కాలితో నేలను తాకుచున్నవాడు, ఈ భీష్మద్రోణులు వధ్యుడుగా నిర్ణయించినవాడు, వారి భయంకరమగు ఆయుధము తాకినవాడు యుద్ధమున బ్రతికి బయటపడునా?

కిం దర్దురః కూపశయో యథేమాం
న బుధ్యసే రాజచమూం సమేతాం,
దురాధర్షాం దేవచమూప్రకాశాం
గుప్తాం నరేన్ద్రై స్త్రిదశై రివ ద్యామ్. 20

నూతిలో పడియుండు కప్పవలె నీవు ఇచట సమకూడినదియు, ఎవ్వరికి సాధింప నలవికానిదియు దేవసేనవలె ప్రకాశించునదియు, దేవతలు కాపాడుచున్న స్వర్గమువలె రాజులు కాపాడుచున్నట్టిదియు నగు రాజు సేనను ఏల తెలియకున్నావు ?

ప్రాచ్యైః ప్రతీచ్యై రథ దాక్షిణాత్యై
రుదీచ్యకామ్బోజశకైః ఖశైశ్చ,
శాల్వైః సమత్స్యైః కురుముఖ్యదేశ్యై
ర్మ్లేచ్ఛైః పులిన్దై ర్ద్రవిడాన్ధ్రకాఞ్చ్యైః. 21

నాలుగు దిక్కుల వారు, కాంబోజులు, శకులు, ఖశులు, శాల్వులు, మత్స్యులు, కురుముఖ్యదేశములవారు, మ్లేచ్ఛులు, పుళిందులు, ద్రవిడులు, ఆంధ్రులు, కాంచీదేశమువారు దీనిని కాపాడుచున్నారు.

నానాజనౌఘం యుధి సంప్రవృద్ధం
గాఙ్గం యథా వేగ మపారణీయమ్,
మాం చ స్థితం నాగబలస్య మధ్యే
యుయుత్ససే మన్ద కిమల్పబుద్ధే. 22

పెక్కండ్రు జనము లనెడు ప్రవాహము కలిగి యుద్ధమున పొంగిపోవుచు గంగానది వేగమువలె దాటరానిదగు నా సేనను, ఏనుగుల బలము నడుమనున్న నన్నును బుద్ధిహీనుడా! మార్కొనగోరుచున్నావు.

ఇత్యేవ ముక్త్వా రాజానం ధర్మపుత్రం యుధిష్ఠిరమ్,
అభ్యావృత్య పున ర్జిష్ణు ములూకః ప్రత్యభాషత. 23

ధర్మపుత్రుడు యుధిష్ఠిరుడు నగు రాజుతో ఇట్లు పలికి ఉలూకుడు అర్జునుని వైపు తిరిగి యిట్లు పలికెను.

అకత్థమానో యుధ్యస్వ కత్థసేఽర్జున కిం బహు,
పర్యాయా త్సిద్ధి రేతస్య నైత త్సిధ్యతి కత్థనాత్. 24

అర్జునా! పలు పొగడిక లేల? మాటలు కట్టిపెట్టి పోరుము. క్రమమార్గమున గెలుపు కలుగును కాని పొగడ్తలవలన కాదు.

యదీదం కత్థనాల్లోకే సిధ్యేత్ కర్మ ధనఞ్జయ,
సర్వే భవేయుః సిద్ధార్థాః కత్థనే కో హి దుర్గతః. 25

ధనంజయా! పొగడికోలు వలననే పనులు నెరవేరినచో అందరు ప్రయోజనవంతులే. పొగడికోలునందు సామర్థ్యములేనివా డెవ్వడు?

జానామి తే వాసుదేవం సహాయం
జానామి తే గాణ్డీవం తాలమాత్రమ్,
జానామ్యేతత్ త్వాదృశో నాస్తి యోద్ధా
జానాన స్తే రాజ్య మేత ద్ధరామి. 26

నీకు వాసుదేవుడు తోడనియు, తాటిచెట్టంత గాండీవము నీకు గలదనియు, నీకు సాటివచ్చు యోధుడు లేడనియు ఎఱిగియు ఇదిగో నీరాజ్యము కొల్లగొట్టుదుము.

న తు పర్యాయధర్మేణ రాజ్యం ప్రాప్నోతి మానుషః,
మనసై వానుకూలాని విధాతా కురుతే వశే. 27

మానవుడు తప్పుదారులతో రాజ్యము పొందడు. బ్రహ్మ మనస్సంకల్పము చేతనే కార్యములను అనుకూలపరచును.

త్రయోదశ సమా భుక్తం రాజ్యం విలపత స్తవ,
భూయ శ్చైవ ప్రశాసిష్యే నిహత్య త్వాం సబాన్ధవమ్. 28

నీవు మొఱ్ఱో అని మొత్తుకొనుచుండగా పదుమూడేండ్లు రాజ్య మనుభ వించితిని. తిరిగియు నిన్ను నీ చుట్టములతోపాటు చావగొట్టి రాజ్య మేలుదును.

క్వ తదా గాణ్డీవం తేఽభూద్యత్త్వం దాస పణై ర్జితః,
క్వ తదా భీమసేనస్య బల మాసీచ్చ ఫాల్గున. 29

నిన్ను పందెములతో ఒడుచుకొనిననాడు నీ గాండీవ మెందు బోయెను ? ఆ భీమసేనుని బల మేమాయెను ?

సగదా ద్భీమసేనా ద్వా పార్థాద్వాఽపి సగాణ్డివాత్,
న వై మోక్ష స్తదా వోఽభూ ద్వినా కృష్ణా మనిన్దితామ్. 30

గద పట్టిన భీమసేనునివలన గాని, గాండీవము పట్టిన అర్జునునివలన గాని ఆనాడు మీకు ముక్తి కలుగలేదు. ఆ పనికి పాపము ఏ పాపమెరుగని ద్రౌపది మీకు గతి యాయెను.

సా వో దాస్యే సమాపన్నాన్ మోక్షయామాస పార్షతీ,
అమానుష్యం సమాపన్నాన్ దాసకర్మ ణ్యవస్థితాన్. 31

అ ద్రౌపది నాడు దాస్యమున చిక్కుకొని నీచపురుషులైన మిమ్ము వదలించినది.

అవోచం యత్ షణ్ఢతిలా నహం వ స్తథ్య మేవ తత్,
ధృతా హి వేణీ పార్థేన విరాటనగరే తదా. 32

నే నప్పుడు మిమ్ములను పేడివా రంటిని. అది నిజమే కదా! అర్జునుడు విరాటనగరమున జడ చుట్టెను.

సూదకర్మణి చ శ్రాన్తం విరాటస్య మహానసే,
భీమసేనేన కౌన్తేయ యచ్చ తన్మమ పౌరుషమ్. 33

విరాటుని వంటయింట భీమసేనుడు వంటపనులు చేయుచు అలసి పోయెను. అది గదా నా మగతనము.

ఏవ మేతత్ సదా దణ్డం క్షత్రియాః క్షత్రియే దధుః,
వేణీం కృత్వా షణ్ఢవేషః కన్యాం న ర్తితవానసి. 34

క్షత్రియులు క్షత్రియునియెడ నెల్లవేళల దండమునే ప్రయోగింతురు. అది అట్టిదే. మరి నీవో పేడివేషము తాల్చి జడ అల్లుకొని కన్నె కాట నేర్పితివి.

న భయా ద్వాసుదేవస్య న చాపి తవ ఫాల్గున,
రాజ్యం ప్రతిప్రదాస్యామి యుధ్యస్వ సహ కేశవః. 35

వాసుదేవునకో నీకో వెఱచి నేను రాజ్య మొసగను. కృష్ణునితో కూడి పోరాడుము.

న మాయా హీన్ద్రజాలం వా కుహకా వాऽపి భీషణా,
ఆత్తశస్త్రస్య మే యుద్ధే వహన్తి ప్రతిగర్జనాః. 36

నీ మాయలు, ఇంద్రజాలము, వంచన, బెదరింపు అనునవి ఆయుధము చేపట్టిన నాకు మారుగర్జనలు కానోపవు.

వాసుదేవసహస్రం వా ఫాల్గునానాం శతాని వా,
ఆసాద్య మామమోఘేషుం ద్రవిష్యన్తి దిశో దశ. 37

వేయిమంది కృష్ణులైనను, వందలకొలది అర్జునులైనను మొక్కవోని ములుకులు గల నన్ను తాకి పది దిక్కులకు పారుదురు.

సంయుగం గచ్ఛ భీష్మేణ భిన్ధి వా శిరసా గిరిమ్,
తరేమం వా మహాగాధం బాహుభ్యాం పురుషోదధిమ్. 38

భీష్మునితో పోరునకు రమ్ము. కాదా తలతో కొండను దీకొమ్ము. లేదా లోతెరుగరాని ఈ జనసముద్రమును చేతులతో నీదుము.

శారద్వతమహామీనం వివింశతిమహోరగమ్,
బృహద్బలమహోద్వేలం సౌమదత్తితిమిఙ్గిలమ్. 39

ఈ జనసాగరము కృపుడను పెనుచేపయు, వివింశతి యను పెనుబాము, బృహద్బలు డను గొప్ప పొంగు, భూరిశ్రవు డను తిమింగిలము కలది.

భీష్మవేగ మపర్యన్తం ద్రోణగ్రాహదురాసదమ్,
కర్ణశల్యఝషావర్తం కాంబోజవడవాముఖమ్. 40

భీష్ముడను వడికలది, ద్రోణు డను మొసలిచే చొరరానిది, కర్ణుడు శల్యుడు అను చేపయు, సుడియు గలది, కాంబోజరా జను బడబాగ్ని గలది.

దుశ్శాసనౌఘం శలశల్యమత్స్యం
సుషేణచిత్రాయుధనాగనక్రమ్,
జయద్రథాద్రిం పురుమిత్రగాధం
దుర్మర్షణోదం శకునిప్రపాతమ్. 41

దుశ్శాసను డను ప్రవాహము. శలుడు, శల్యుడు అను పెనుచేపలు, సుషేణుడు చిత్రాయుధుడు అను నీటి యేనుగులు మొసళ్ళు, జయద్రథు డను కొండలు, పురుమిత్రు డను లోతు, దుర్మర్షణు డను జలము, శకుని యను జలపాతము కలది.

శస్త్రౌఘ మక్షయ్య మతిప్రవృద్ధం
యదాఽవగాహ్య శ్రమనష్టచేతాః,
భవిష్యసి త్వం హతసర్వబాన్ధవ-
స్తదా మన స్తే పరితాపమేష్యతి. 42

ఆయుధము లనెడు ప్రవాహము కలిగి, తరుగులేనిదై పెరిగిపోవుచున్న ఆ జనసముద్రమున మునిగి, అలసతతో స్పృహ దప్పిన నీవు నీ చుట్టము లందరు చావగా మనసున పరితాప మందెదవు.

తదా మన స్తే త్రిదివా దివాశుచే-
ర్నివ ర్తితా పార్థ మహీప్రశాసనాత్,
ప్రశామ్య రాజ్యం హి సుదుర్లభం త్వయా
బుభూషితః స్వర్గ ఇ వాతపస్వినా. 43

అప్పుడు అపవిత్రుని మది స్వర్గమునుండి మరలిన విధమున రాజ్య మేలు కోరికనుంకి నీమనస్సు మరలును. తపస్సు చేయనివాడు స్వర్గము కోరినట్లు రాజ్యము కోరుచున్న నీ కది పొందరానిది. శాంతింపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ఉలూకదూతాగమనపర్వణి
ఉలూకవాక్యే ఏకషష్ట్యు త్తరశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ఉలూకదూతాగమనపర్వమున
ఉలూకవాక్యము గల నూట అరువదియొకటవ అధ్యాయము.

—: o :—

# ద్విషష్ట్యధికశతతమోఽధ్యాయః
# నూటయరువది రెండవ అధ్యాయము

## పాణ్డవపక్షతో దుర్యోధనాయ ప్రతిసన్దేశః
## పాండవపక్షమునుండి దుర్యోధనునకు ప్రతిసందేశము

సంజయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ఉలూక స్త్వర్జునం భూయో-యథోక్తాం వాక్య మబ్రవీత్,
ఆశీవిష మివ క్రుద్ధం తుదన్ వాక్యశలాకయా. 1

కోపించిన త్రాచుపాము వలె నున్న అర్జునుని-పలుకు లను ములుకులతో నొప్పించుచు దుర్యోధనుడు పలికిన మాటను ఉలూకుడు ఉన్నదున్నట్లు పలికెను.

తస్య తద్వచనం శ్రుత్వా రుషితాః పాణ్డవా భృశమ్,
ప్రాగేవ భృశసంక్రుద్ధాః కైతవ్యే నాపి ధర్షితాః. 2
ఆసనే ష్వదతిష్ఠన్త బాహూం శ్చైవ ప్రచిక్షిపుః,
ఆశీవిషా ఇవ క్రుద్ధా వీక్షాంచక్రుః పరస్పరమ్. 3

మొదలే మహాకోపముతో మండిపడుచున్న పాండవులు ఆ జూదగాని బెదరింపు మాటలు విని మరింత తీవ్రకోపము పొందినవారై ఆసనములనుండి ఒక్కపెట్టున లేచిరి. చేతులు విసురుగా త్రిప్ప దొడగిరి. కోపించిన త్రాచులవలె నొకరి నొకరు చూడసాగిరి.

అవాక్ శిరా భీమసేనః సముదైక్షత కేశవమ్,
నేత్రాభ్యాం లోహితాన్తాభ్యా మాశీవిష ఇవ శ్వసన్. 4

భీమసేనుడు త్రాచువలె బుసకొట్టుచు తల వంచి ఎరుపెక్కిన కంటికొనలతో శ్రీకృష్ణుని చూచుచుండెను.

ఆర్తం వాతాత్మజం దృష్ట్వా క్రోధే నాభిహతం భృశమ్,
ఉత్స్మయ న్నివ దాశార్హః కైతవ్యం ప్రత్యభాషత. 5

క్రోధముతో మిక్కిలిగా దెబ్బ తిని దుఃఖపడుచున్న భీమసేనుని గాంచి నవ్వుచున్నట్లున్న శ్రీకృష్ణుడు ఆ జూదరితో నిట్లు పలికెను.

ప్రయాహి శీఘ్రం కైతవ్య బ్రూయా శ్చైవ సుయోధనమ్,
శ్రుతం వాక్యం గృహీతోఽర్థో మతం యత్తే తథాస్తు తత్. 6

జూదరీ! త్వరగా పొమ్ము. సుయోధనునితో 'నీ వాక్యము వింటిమి. దాని యర్థము గ్రహించితిమి. నీ తల పెట్లో అట్లే యగును లె'మ్మని చెప్పుము.

ఏవ ముక్త్వా మహాబాహుః కేశవో రాజసత్తమ,
పున రేవ మహాప్రాజ్ఞం యుధిష్ఠిర ముదైక్షత. 7

మహాబాహు వగు కేశవు డిట్లు పలికి, మహామేధావి యగు ధర్మరాజును తిరిగి చూచెను.

సృఞ్జయానాం చ సర్వేషాం కృష్ణస్య చ యశస్వినః,
ద్రుపదస్య సపుత్రస్య విరాటస్య చ సన్నిధౌ. 8
భూమిపానాం చ సర్వేషాం మధ్యే వాక్యం జగాద హ,
ఉలూకోఽప్యర్జునం భూయో యథోక్తం వాక్య మబ్రవీత్. 9

సృంజయు లందరికడ, కీర్తిశాలియగు కృష్ణుడు, కొడుకులతో కూడిన ద్రుపదుడు, విరాటుడు సమస్తరాజులు ఉన్నచోట ఉలూకుడు మరల అర్జునునితో మున్నన్నమాటలు పలికెను.

ఆశీవిష మివ క్రుద్ధం తుదన్ వాక్యశలాకయా,
కృష్ణాదీం శ్చైవ తాన్ సర్వాన్ యథోక్తం వాక్య మబ్రవీత్. 10

కోపించిన త్రాచువలె నున్న అర్జునుని పలుకు లను ఇనుపకాడతో గ్రుచ్చి పొడుచుచు దుర్యోధను డాడిన మాటలు చెప్పెను.

ఉలూకస్య తు తద్వాక్యం పాపం దారుణ మీరితమ్,
శ్రుత్వా విచుక్షుభే పార్థో లలాటం చాప్యమార్జయత్. 11

ఉలూకు డట్లు పలికిన దారుణమగు పాపవాక్యమును విని ధర్మరాజు హృదయమున కుమిలిపోయెను. నొసలు తుడుచుకొనుచుండెను.

తదవస్థం తదా దృష్ట్వా పార్థం సా సమితి ర్నృప,
నామృష్యన్త మహారాజ పాణ్డవానాం మహారథాః. 12

అట్టి దశలో నున్న ధర్మరాజును గాంచిన సభలోని మహారథు లందరు కుతకుతలాడిపోయిరి.

అధిక్షేపేణ కృష్ణస్య పార్థస్య చ మహాత్మనః,
శ్రుత్వా తే పురుషవ్యాఘ్రాః క్రోధా జ్జజ్వలు రచ్యుతాః. 13

కృష్ణుని, మహాత్ముడగు అర్జునుని నిందించిన మాటతో ఆ పురుషవరేణ్యు లందరు క్రోధముతో మండిపడిరి. దృఢముగా నిలిచిరి.

ధృష్టద్యుమ్నః శిఖణ్డీ చ సాత్యకి శ్చ మహారథః,
కేకయా భ్రాతరః పఞ్చ రాక్షసశ్చ ఘటోత్కచః. 14
ద్రౌపదేయాభిమన్యు శ్చ ధృష్టకేతుశ్చ పార్థివః,
భీమసేనశ్చ విక్రాన్తో యమజౌ చ మహారథౌ. 15
ఉత్పేతు రాసనాత్ సర్వే క్రోధసంర క్తలోచనాః,
బాహూన్ ప్రగృహ్య రుచిరాన్ రక్తచన్దనరూషితాన్,
అఙ్గదైః పారిహార్యైశ్చ కేయూరైశ్చ విభూషితాన్. 16

ధృష్టద్యుమ్నుడు, శిఖండి, మహారథుడగు సాత్యకి, కేకయసోదరు లైదుగురు, రాక్షసుడగు ఘటోత్కచుడు, ద్రౌపది కుమారులు,అభిమన్యుడు, ధృష్టకేతు మహారాజు, పరాక్రమశాలి యగు భీమసేనుడు, మహారథు లగు కవలలు - ఈ అందరును క్రోధముతో నెరుపెక్కిన కన్నులతో ఆసనములనుండి ఒక్క పెట్టున ఈవలకు దుమికిరి. మంచిగంధము పూతగలవియు, బాహుపురులతో, కేయూరములతో, అనేకహారములతో అలంకరణ పొందిన చేతులు జాడించు చుండిరి.

---

12. సమితిః - సభ
15. ద్రౌపదేయాభిమన్యుః - ద్రౌపదికుమారులతో కూడిన అభిమన్యుడు.
16. పారిహార్యైః - అంచట ముత్యాల గుత్తులు గల హారములతో, ముత్యాల జాలరులతో.

దన్తాన్ దన్తేషు నిష్పిష్య సృక్విణీ పరిలేలిహన్,
తేషా మాకారభావజ్ఞః కున్తీపుత్రో వృకోదరః, 17
ఉదతిష్ఠత్ సవేగేన క్రోధేన ప్రజ్వల న్నివ.

పండ్లు పటపట కొరికి, పెదవి అంచులను మిక్కుటముగా నాకుచు కుంతీ కుమారుడగు భీమసేనుడు వారందరి ఆకారములను, భావములను గుర్తించి కోపముతో మండిపడుచు పెనువేగముతో క్రింవికి దుమికెను.

ఉద్ధృత్య సహసా నేత్రే దన్తాన్ కటకటాయ్య చ,
హస్తం హస్తేన నిష్పిష్య ఉలూకం వాక్య మబ్రవీత్. 18

కనులు పెద్దగా చేసి పండ్లు కటకటలాడించి చేతిని చేతితో నలుపుచు ఉలూకునితో నిట్లు పలికెను.

అశక్తానా మివాస్మాకం ప్రోత్సాహననిమిత్తకమ్, 19
శ్రుతం తే వచనం మూర్ఖ యత్త్వాం దుర్యోధనోఽబ్రవీత్.

మూర్ఖుడా! శక్తిలేనివారికి వలె మాకు ఉత్సాహము పుట్టించుటకై దుర్యోధనుడు పలికినమాట నీవలన వింటిమి.

తన్మే కథయతో మన్ద శృణు వాక్యం దురాసదమ్. 20
సర్వక్షత్రస్య మధ్యం త్వం యద్వక్ష్యసి సుయోధనమ్,
శృణ్వతః సూతపుత్రస్య పితు శ్చ త్వం దురాత్మనః. 21

క్షత్రియు లందరినడుమ సూతుని కొడుకును, దురాత్ముడగు నీ నాయనయు వినుచుండగా సుయోధనునకు చెప్పవలసిన భరింపరాని మాటను చెప్పుచున్నాను వినుము.

అస్మాభిః ప్రీతికామై స్తు భ్రాతు ర్జ్యేష్ఠస్య నిత్యశః,
మర్షితం తే దురాచార తత్త్వం న బహుమన్యసే. 22

అన్నగారి ప్రీతి నెల్లవేళల కోరెడు మేము, దురాచారా! నీవు చేసిన దింతయు సహించితిమి. దానిని నీవు నీ గొప్పగా తలపరాదు.

---

21. పితుః-నాయన-ఉలూకుడు శకుని కొడుకు.

ప్రేషితశ్చ హృషీకేశః శమాకాఙ్క్షీ కురూన్ ప్రతి,
కులస్య హితకామేన ధర్మరాజేన ధీమతా. 23

బుద్ధిమంతుడగు ధర్మరాజు కులము మేలు గోరి శాంతిని కోరెడు శ్రీకృష్ణుని కురువంశము వారికడకు పంపెను.

త్వం కాలచోదితో నూనం గన్తుకామో యమక్షయమ్,
గచ్ఛస్వాహవ మస్మాభి స్తచ్చ శ్వో భవితా ధ్రువమ్. 24

కాలము పురికొల్పుచుండగా యమునింటికి పోగోరుచున్న నీవు మాతో యుద్ధమునకు రమ్ము. ఇదిగో అది రేపు తప్పక కానున్నది.

మయాఽపి చ ప్రతిజ్ఞాతో వధః సభ్రాతృకస్య తే,
స తథా భవితా పాప నాత్ర కార్యా విచారణా. 25

ఓరీ పాపాత్ముడా! తమ్ములతోపాటు నిన్ను రూపుమాపుదు నని నేను ప్రతిన పట్టితిని. అది యట్లే యగును. ఇందు విచారణ చేయ బనిలేదు.

వేలా మతిక్రమేత్ సద్యః సాగరో వరుణాలయః,
పర్వతాశ్చ విశీర్యేయు ర్మమోక్తం న మృషా భవేత్. 26

వరుణదేవుని ఆలయమగు సముద్రము చెలియలికట్టను దాటివచ్చుగాక; కొండలు ముక్కలగుగాక. నామాట మాత్రము అబద్ధము కాదు.

సహాయ స్తే యది యమః కుబేరో రుద్ర ఏవ వా,
యథాప్రతిజ్ఞం దుర్బుద్ధే ప్రకరిష్య న్తి పాణ్డవాః.

దుర్బుద్ధీ! నీకు యముడో, కుబేరుడో, రుద్రుడో తోడుగా వచ్చినను పాండవులు పట్టిన ప్రతినను చేసి తీరుదురు.

దుశ్శాసనస్య రుధిరం పాతా చాస్మి యథేప్సితమ్. 27
యశ్చేహ ప్రతిసంరబ్ధః క్షత్రియో మాఽభియాస్యతి,
అపి భీష్మం పురస్కృత్య తం నేష్యామి యమక్షయమ్. 28

---

28. దుశ్శాసనుని నెత్తురు త్రావు వేళ; మా. నన్ను; అభియాస్యతి-ఎదుర్కొనునో;

నా యిచ్చవచ్చినట్లు దుశ్శాసనుని నెత్తురు (త్రావుదును. అప్పుడు ఎవడైన పొగరెక్కి దూకుడుగా భీష్ముని ముందుంచుకొని, నాపైపునకు వచ్చెనేని వానిని కూడ యమునింటికి చేర్తును.

యచ్చైత దుక్తం వచనం మయా క్షత్రస్య సంసది,
యథైత ద్భవితా సత్యం తథైవాత్మాన మాలభే. 29

ఇదిగో క్షత్రియు లున్న నిండుసభలో పలుకుచున్న నా యీమాట సత్యమే యగును. నామీద ఒట్టు వేసికొని పలుకుచున్నాను.

భీమసేనవచః శ్రుత్వా సహదేవోఽప్యమర్షణః,
క్రోధసంరక్తనయన స్తతో వాక్య మువాచ హ. 30

భీమసేనుని మాట విని కోపముతో ఎరుపెక్కిన కన్నులతో మండిపడుచున్న సహదేవు డిట్లు పలికెను.

శౌటీర! శూరసదృశ మనీకజనసంసది,
శృణు పాప వచో మహ్యం యద్వాచ్యో పితా త్వయా. 31

గరువముగలవానికి, పరాక్రమము కలవానికి తగిన నా యీ మాటను సేనాజనమున్న సభలో పలుకుచున్నదానిని, ఓరీ పాపాత్ముడా! నీ తండ్రికి చెప్పవలసిన దానిని వినుము.

నాస్మాకం భవితా భేదః కదాచిత్ కురుభిః సహ,
ధృతరాష్ట్రస్య సంబంధో యది న స్యా త్త్వయా సహ. 32

---

29. ఆత్మానమ్ ఆలభే - నామీద ఒట్టు-అని భావము; లేదా గుండెపై చేతి నిడుకొని చెప్పుచున్నాడని భావించి ఈశ్వరునిపై ఒట్టు అను నర్థము గ్రహింపదగును.

31. శౌటీరః - గర్వముతో కూడినవాడు; శూరః - పరాక్రమము కలవాడు. 'శౌట్ట గర్వే' - 'శూర విక్రాన్తౌ' - అని ధాతువులు. అనేకజనః - సేన యందున్న జనము; మహ్యమ్-నా.

32. ధృతరాష్ట్రుడు పిన్ననాడే నిన్ను వెడలగొట్టినచో పాండవులకు కౌరవులకు ఈ విరోధము కలిగెడిది కాదని భావము;

ఓరీ! ధృతరాష్ట్రునకు నీతో చుట్టరికము కలుగనిమొదల మాకు కౌరవులతో నెన్నటికిని వైరము కలిగెడిది కాదు.

త్వం తు లోకవినాశాయ ధృతరాష్ట్రకులస్య చ,
ఉత్పన్నో వైరపురుషః స్వకులఘ్నశ్చ పాపకృత్. 33

నీవు లోకవినాశమునకే పుట్టితివి. తంపులమారివాడవు. ధృతరాష్ట్రుని కులమును, నీ కులమును నాశనముచేయు పాపిష్ఠుడవు.

జన్మప్రభృతి చాస్మాకం పితా తే పాపపురుషః,
అహితాని నృశంసాని నిత్యశః కర్తు మిచ్ఛతి. 34

ఓరీ ఉలూకా! పాపిష్ఠివాడైన నీతండ్రి పుట్టినది మొదలు మాకు క్రూరము లగు కీడులు చేయుటకే నిత్యము కోరుచున్నాడు.

తస్య వైరానుషఙ్గస్య గన్తాఽస్మ్యన్తం సుదుర్గమమ్,
అహ మాదౌ నిహత్య త్వాం శకునేః సంప్రపశ్యతః. 35

నీతండ్రి శకుని కన్నులార గాంచుచుండగా మొదట నిన్ను చంపి తేలికగా పొందజాలని పగ అంతమును చేరుకొందును.

తతోఽస్మి శకునిం హన్తా మిషతాం సర్వధన్వినామ్.
గొప్ప విలుకాండ్రందరు కూడి యుండగా అటుపై శకునిని చంపెదను.

భీమస్య వచనం శ్రుత్వా సహదేవస్య చోభయోః. 36
ఉవాచ ఫాల్గునో వాక్యం భీమసేనం స్మయన్నివ,
భీమసేన న తే సన్తి యేషాః వైరం త్వయా సహ. 37

ఇట్లు భీమసేనుని, సహదేవుని పలుకులు విని అర్జునుడు భీముని చూచి నవ్వుచు నిట్లు పలికెను; భీమసేనా! నీతో పగ పెట్టుకొనినవా రెవ్వరు ఇచటలేరు.

---

34. 'తే పితా అస్మాకమ్ అహితాని కర్తుమిచ్ఛతి' అని అన్వయము.

36. 'భీమసేనస్య వచనమ్' అని ప్రాచీనుల పాఠము - అప్పుడు శ్రుత్వా - విని అను పదమును కలుపుకొనవలయును.

37. న సన్తి - నీ ఎదురుగా లేరని భావము-కావున నీ విపుడు విజృంభింప రాదని తాత్పర్యము;

మన్దా గృహేషు సుఖినో మృత్యుపాశవశం గతాః,
ఉలూక శ్చ న తే వాచ్యః పరుషం పురుషోత్తమ. 38

ఆ బుద్ధిహీనులు మృత్యువు పాశమునకు చిక్కి యిండ్లలో సుఖముగా నున్నారు. పురుషశ్రేష్ఠా! నీవు ఉలూకుని పరుషముగా పలుకరాదు.

దూతాః కి మపరాధ్యన్తే యథోక్త స్యానుభాషిణః.

దూతలు చేయు తప్పేమి? వారు చెప్పిన మాటలు అప్పజెప్పుదురు.

ఏవ ముక్త్వా మహాబాహు ర్భీమం భీమపరాక్రమమ్,
ధృష్టద్యుమ్నముఖాన్ వీరాన్ సుహృదః సమభాషత. 39

భయంకరమగు పరాక్రమము గల భీమునితో నిట్లు పలికి ఆ మహాబాహువు ధృష్టద్యుమ్నుడు మొదలగు వీరమిత్రులతో నిట్లు ముచ్చటించెను.

శ్రుతం వ స్తస్య పాపస్య ధార్తరాష్ట్రస్య భాషితమ్. 40
కుత్సనం వాసుదేవస్య మమ చైవ విశేషతః,
శ్రుత్వా భవన్తః సంరబ్ధా అస్మాకం హితకామ్యయా. 41

మీరు పాపియగు దుర్యోధనుని మాటలు - విశేషించి వాసుదేవుని, నన్నును నిందించిన తీరు వింటిరి. విని మా మేలు కోరినవారగుటచే ఉడుకెక్కి యుంటిరి.

ప్రభావా ద్వాసుదేవస్య భవతాం చ ప్రయత్నతః,
సమగ్రం పార్థివం క్షత్రం సర్వం న గణయా మ్యహమ్. 42

వాసుదేవుని ప్రభావము వలనను, మీ ప్రయత్నము వలనను, రాజలోక మంతయు నొక్కటైనను నేను లెక్కచేయను.

భవద్భిః సమనుజ్ఞాతో వాక్య మస్య యదుత్తరమ్,
ఉలూకే ప్రాపయిష్యామి యద్వక్ష్యతి సుయోధనమ్. 43

మీ రనుమతించినచో ఇతడాడిన దానికి సమాధానముగా దుర్యోధనునకు చెప్పవలసిన దానిని ఈ ఉలూకుని ద్వారా తెలియజేసెదను.

శ్వోభూతే కత్థిత స్యాస్య ప్రతివాక్యం చమూముఖే,
గాణ్డీవే నాభిధాస్యామి క్లీబా హి వచనోత్తరాః. 44

పిని పొగడికోలు పలుకునకు సమాధానము రేపు సేనమొనట నిలిచి గాండీవముతో చెప్పెదను. మాటలతో సమాధానమును పనికి మాలినది కదా!

తత స్తే పార్థివాః సర్వే ప్రశశంసు ర్ధనఞ్జయమ్,
తేన వాక్యోపచారేణ విస్మితా రాజసత్తమాః. 45

అంత నా రాజులందరు ధనంజయుని కొనియాడిరి. ఆ రాజశ్రేష్ఠులందరు ఆ వాక్యముల మర్యాదకు అబ్బురపడిరి.

అనునీయ చ తాన్ సర్వాన్ యథామాన్యం యథావయః,
ధర్మరాజం తదా వాక్యం తత్ప్రాప్యం ప్రత్యభాషత. 46

వారి వారి వయసులను బట్టియు, వారి వారిని మన్నింపవలసిన తీరును బట్టియు వారందరిని శాంతపరచి ధర్మరాజుతో దుర్యోధనున కందింపవలసిన వాక్యమును గూర్చి యిట్లు పలికెను.

ఆత్మాన మవమన్వానో న హి స్యాత్ పార్థివోత్తమః,
తత్రోత్తరం ప్రవక్ష్యామి తవ శుశ్రూషణే రతః. 47

రాజశ్రేష్ఠుడు తన్ను తక్కువ చేసికొనరాదు. కావున మహారాజా! నీ సేనలో ఆనందము పొందెడు నేను వారికి సమాధానము చెప్పెదను.

ఉలూకం భరతశ్రేష్ఠ సామపూర్వ మథోర్జితమ్,
దుర్యోధనస్య తద్వాక్యం నిశమ్య భరతర్షభః. 48
అతిలోహితనేత్రాభ్యా మాశీవిష ఇవ శ్వసన్,
స్మయమాన ఇవ క్రోధాత్ సృక్విణీ పరిసంలిహన్. 49
జనార్దనమభిప్రేక్ష్య భ్రాతౄం శ్చైవేద మబ్రవీత్,
అభ్యభాషత కైతవ్యం ప్రగృహ్య విపులం భుజమ్. 50

---

47. ఆత్మానమ్ - తన్ను, అవమన్వానః-తక్కువ చేసికొనువాడు; న స్యాత్ - కారాదు - మహారాజు తానై సమాధానము చెప్పరాదు. చెప్పినచో తన్ను తాను తక్కువ చేసికొనుట-లేదా - ఆవలివాడు నిందింపగా తగిన సమాధానము చెప్పకపోవుటయు తక్కువ చేసికొనుటయే

అంత అర్జునుడు దుర్యోధను దన్న మాటను స్మరించెను. మిక్కిలి ఎఱ్ఱ బడిన కన్నులతో, పాము వలె బుసకొట్టుచుండెను. క్రోధముతో నవ్వుచున్నట్లుండి పెదవుల తుదలు నాలుకతో తాకుచుండెను. శ్రీకృష్ణుని, తన అన్నదమ్ములను ఒక్కమారు చూచి ఉలూకుని విశాలమగు భుజమును పట్టుకొని మెత్తనిది బరు వైనది యగు మాట నిట్లు పలికెను.

ఉలూక గచ్ఛ కైతవ్య బ్రూహి తాత సుయోధనమ్,
కృతఘ్నం వైరపురుషం దుర్మతిం కులపాంసనమ్. 51

నాయనా! ఉలూకా! జూదరి కొడుకా! పద. కృతఘ్నుడు పగనే కోరెడు వాడు, దుష్టబుద్ధి, కులమున చెడబుట్టినవాడు అగు దుర్యోధనునితో ఇట్లు చెప్పుము.

పాణ్డవేషు సదా పాప నిత్యం జిహ్మం ప్రవర్తతే,
స్వవీర్యాద్యః పరాక్రమ్య పాప ఆహ్వయతే పరాన్,
అభీతః పూరయన్ వాక్య మేష వై క్షత్రియః పుమాన్. 52

ఓరీ! పాపాత్ముడా! పాండవులయందు ఎల్లప్పుడు మోసము కలదా? తన శక్తితో పరాక్రమించి పగవారిని యుద్ధమునకు పిలిచి వెరపులేనివాడై మాట నిలబెట్టుకొన్నవాడే క్షత్రియుడు.

స పాపః క్షత్రియో భూత్వా అస్మా నాహూయ సంయుగే,
మాన్యామాన్యాన్ పురస్కృత్య యుద్ధం మాగాః కులాధమ. 53

కులమున చెడబుట్టినవాడా! నీవు క్షత్రియుడవై యుండి మాన్యులను, మాన్యత లేనివారిని ముందు బెట్టుకొని మమ్ములను యుద్ధమువైపు కవ్వించి పోరునకు అరుగకుము.

---

52,53. స్వశక్తితో పౌరుషము చూపి అన్నమాటను నిలబెట్టుకొనువాడే క్షత్రియుడగును గాని నీవలె జాతిమాత్రమున క్షత్రియుడై వారిని వీరిని ఆశ్రయించి జయము పొందగోరుట క్షత్రియధర్మము కాదని తాత్పర్యము.

53. మాన్య, అమాన్యాన్ - మాన్యులు భీష్ముడు మొదలగువారు, అమాన్యులు-కుమారులగు లక్ష్మణుడు మొదలగువారు. బాలురను, వృద్ధులను చంపు కొనకుము - అని హితవు.

ఆత్మవీర్యం సమాశ్రిత్య భృత్యవీర్యం చ కౌరవ,
ఆహ్వాయస్వ రణే పార్థాన్ సర్వథా క్షత్రియో భవ. 54

నీదైన శక్తిపై, నీ సేవకుల శక్తిపై ఆధారపడి యుద్ధమునకు కుంతీ కుమారులను పిలువుము. అట్లు సర్వవిధముల క్షత్రియుడవు కమ్ము.

పరవీర్యం సమాశ్రిత్య యః సమాహ్వాయతే పరాన్,
అశక్తః స్వయ మాదాతు మేత దేవ నపుంసకమ్. 55

స్వయముగా జయము గొను శక్తిలేనివాడు, పరుల పరాక్రమముపై ఆధార పడి శత్రువులను కవ్వించుటయే పేడితనము.

స త్వం పరేషాం వీర్యేణ ఆత్మానం బహు మన్యసే,
కథ మేవ మశక్త స్త్వమస్మాన్ సమభిగర్జసి. 56

అట్టివాడ వగు నీవు భీష్మాదుల బలమును చూచుకొని గొప్పవాడ నైతి నని తలచుచున్నావు. ఇట్లు శక్తిలేని నీవు మాపై గర్జింతు వేల ?

కృష్ణ ఉవాచ - కృష్ణు డిట్లు పలికెను.

మద్వచ శ్చాపి భూయ స్తే వక్తవ్యః స సుయోధనః,
శ్వ ఇదానీం ప్రపద్యేథాః పురుషో భవ దుర్మతే. 57

ఉలూకా! నా మాటను గూడ ఆ దుర్యోధనునకు చెప్పుము. ఓరీ దుర్మతీ! రేపీపాటికి యుద్ధము పొందనున్నావు. పురుషుడ వగుము.

మన్యసే యచ్చ మూఢ త్వం న యోత్స్యతి జనార్దనః,
సారథ్యేన వృతః పార్థై రితి త్వం న బిభేషి చ. 58

తెలివిమాలినవాడా! జనార్దనుని పాండవులు రథము నడుపుటకే ఎన్ను కొనిరి. కావున అతడు యుద్ధము చేయడని తలచుచున్నావు. అందువలన భయ పడకున్నావు.

---

54. సర్వథా - అన్ని విధముల - పుట్టిన మాత్రమున క్షత్రియుడ ననుకొను చున్నావు. పరాక్రమాదులలో క్షత్రియుడ వగు మని తాత్పర్యము.

55. నపుంసకమ్ - నపుంసకత్వము

56. పరేషామ్ - కర్ణాదులయొక్క

జఘన్యకాల మప్యేతన్న భవేత్ సర్వపార్థివాన్,
నిర్దహేయ మహం క్రోధాత్ తృణానీవ హుతాశనః. 59

కాలమునకు కాలము చెల్లకుందుగాక. నేను కోపము వచ్చినచో అగ్ని గడ్డి పరకలనువలె రాజు లందరిని మాడ్చివేయుదును.

యుధిష్ఠిరనియోగాత్తు ఫాల్గునస్య మహాత్మనః,
కరిష్యే యుధ్యమానస్య సారథ్యం విజితాత్మనః. 60

యుధిష్ఠిరుని మాటపై మహాత్ముడు, మనోనిగ్రహము కలవాడు అగు అర్జునుడు పోరాడుచుండగా సారథ్యము చేసెదను.

యద్యుత్పతసి లోకాం స్త్రీన్ యద్యావిశసి భూతలమ్,
తత్ర తత్రార్జునరథం ప్రభాతే ద్రక్ష్యసే పునః. 61

దుర్యోధనా! మూడులోకములకు ఎగిరిపోయినను, భూమి అట్టడుగునకు చేరుకొన్నను నీవు అందందు అర్జునరథమును రేపు ఉదయమున చూచెదవు.

యచ్చాపి భీమసేనస్య మన్యసే మోఘభాషితమ్,
దుఃశాసనస్య రుధిరం పీత మద్యావధారయ. 62

భీముసేనునిది వ్యర్థమైన మాట యని తలచుచున్నావు. దుశ్శాసనుని నెత్తురు నేడు త్రాగనే బడినది. ఇది గుర్తించు.

న త్వాం సమీక్షతే పార్థో నాపి రాజా యుధిష్ఠిరః,
న భీమసేనో న యమౌ ప్రతికూలప్రభాషిణమ్. 63

ఇప్పుడు ఎదురుకూతలు కూయుచున్న నిన్ను కుంతీకుమారుడు యుధిష్ఠిర మహారాజుకాని, భీమసేనుడుగాని నకులసహదేవులుగాని లెక్కగొనరు.

ఇది శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ఉలూకదూతాభిగమనపర్వణి -
కృష్ణాదివాక్యే ద్విషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ఉలూకదూతాభిగమనపర్వమున
కృష్ణాదుల వాక్యములు గల నూట అరువది రెండవ అధ్యాయము.

—: o :—

59. జఘన్యకాలమపి, ఏతత్ - ఇది ప్రళయకాలము కాకుందుగాక.
63. న సమీక్షతే - లెక్కగొనడు.

## త్రిషష్ట్యధికశతతమోఽధ్యాయః
## నూట యరువదిమూడవ అధ్యాయము

పాణ్డవ విరాట ద్రుపద శిఖణ్డి ధృష్టద్యుమ్నానాం సందేశ
మాదాయ ఉలూకస్య నివర్తనం, తద్వార్తా మాకర్ణ్య దుర్యోధనస్య
స్వకీయసేనాయై యుద్ధా యోద్యన్తు మాదేశః.

పాండవులు, విరాటుడు, ద్రుపదుడు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు
అను వారి సందేశము గొని ఉలూకుడు మరలిపోవుట, ఆ వార్త
విని దుర్యోధనుడు తనసేనకు యుద్ధమునకు లెండని ఆనతి నొసగుట.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

దుర్యోధనస్య తద్వాక్యం నిశమ్య భరతర్షభ,
నేత్రాభ్యా మతితామ్రాభ్యాం కైతవ్యం సముదైక్షత. 1

అర్జునుడు దుర్యోధనుని ఆ పలుకులు విని మిక్కిలిగా రక్తము చిమ్ము చున్న కన్నులతో శకునికొడుకును గట్టిగా చూచెను.

స కేశవ మభిప్రేక్ష్య గుడాకేశో మహాయశాః,
అభ్యభాషత కైతవ్యం ప్రగృహ్య విపులం భుజమ్. 2

గొప్పకీర్తిగల ఆ అర్జునుడు ఒక్కసారి కేశవుని కనుగొని ఉలూకుని విశాలమగు చేయి పట్టుకొని యిట్లు పలికెను.

స్వవీర్యం యః సమాశ్రిత్య సమాహ్వయతి వై పరాన్,
అభీతో యుధ్యతే శత్రూన్ స వై పురుష ఉచ్యతే. 3

---

1. సముదైక్షత - తరువాతి శ్లోకములోని 'గుడాకేశుడు' ఈ క్రియకు కర్త- అర్జునుడు చూచెనని తాత్పర్యము.
2. పూరణాత్ - పురుషః - నిండైన లక్షణములు గలవాడు పురుషుడు. సాధారణార్థమున నీవు మగవాడవే కావచ్చును అని భావము.

ఎవడు తన గుండెబలము నూతగా గొని పగవారిని పోరునకు కవ్వించునో, వెరపు లేక శత్రువులతో పోరునో వానినే మగవా డందురు.

పరవీర్యం సమాశ్రిత్య యః సమాహ్వాయతే పరాన్,
క్షత్రబన్ధు రశక్తత్వా ల్లోకే స పురుషాధమః. 4

పరుల బలము నమ్ముకొని పగవారిని కయ్యమునకు పిలుచు సత్తువలేని వాడు కనుక, జాతిమాత్రమున క్షత్రియుడై లోకమున పురుషాధము డగును.

స త్వం పరేషాం వీర్యేణ మన్యసే వీర్య మాత్మనః,
స్వయం కాపురుషో మూఢ పరాంశ్చ క్షేప్తు మిచ్ఛసి. 5

అట్టి నీవు పరుల పరాక్రమమును నీ శక్తియే అనుకొనుచున్నావు. నీవు నీచుడవై, మూఢుడా! ఇతరులను ఆక్షేపింపగోరుచున్నావు.

య స్త్వం వృద్ధం సర్వరాజ్ఞాం హితబుద్ధిం జితేన్ద్రియమ్,
మరణాయ మహాప్రాజ్ఞం దీక్షయిత్వా వికత్థసే. 6

పెద్దవాడు, రాజు లందరకు హితము కూర్పవలయు నను బుద్ధి గలవాడు, ఇంద్రియములపై గట్టి అదుపు గలవాడు. మహామేధావి యగు భీష్ముని మరణమునకు దీక్ష యిచ్చి పోటుమాటలు పలుకుచున్నావు.

భావ స్తే విదితోఽస్మాభి ర్దుర్బుద్ధే కులపాంసన,
న హనిష్య న్తి గాఙ్గేయం పాణ్డవా ఘృణయేతి హ. 7

ఓరీ దుర్బుద్ధీ! కులమునకు చీడపురుగైనవాడా! నీ భావము మాకు అర్థమైనది. పాండవులు జాలితో భీష్ముని చంపరని గదా నీ ఊహ!

యస్య వీర్యం సమాశ్రిత్య ధార్తరాష్ట్ర వికత్థసే,
హన్తాఽస్మి ప్రథమం భీష్మం మిషతాం సర్వధన్వినామ్. 8

---

4 క్షత్రబన్ధుః - క్షత్రియకులమున పుట్టినవాడే కాని క్షత్రియయోగ్యమగు కర్మము లాచరించువాడు కాదని భావము.

6. వృద్ధమ్ - భీష్ముని, బాహ్లికుని కూడ.

8. మిషతామ్ - చూచుచుండగా.

దుర్యోధనా! ఎవరి గుండె బలమును పట్టి పొగడికొనుచున్నావో ఆ భీష్ముని, విలు కాండ్రందరు చూచుచుండగా మొట్ట మొదట మట్టు పెట్టెదను.

కైతవ్య గత్వా భరతాన్ సమేత్య
సుయోధనం ధార్తరాష్ట్రం వదస్వ,
తథే త్యువా చార్జునః సవ్యసాచీ
నిశావ్యపాయే భవితా విమర్దః. 9

ఓరి జూదరికొడుకా! నీవు పోయి భరతవంశమువారి నందరిని సమావేశ పరచి దుర్యోధనునితో ఇట్లు చెప్పుము. సవ్యసాచి యగు అర్జునుడు అట్లే అని పలికెను. తెల్లవారినవెంటనే యుద్ధము కాగలదు.

యద్వాఽబ్రవీ ద్వాక్య మదీనసత్త్వాం
మధ్యే కురూన్ హర్షయన్ సత్యసన్ధః,
అహం హన్తా సృఞ్జయానా మనీకం
శాల్వేయకాంశ్చేతి మమైష భారః.
కైతవ్య గత్వా భరతాన్ సమేత్య
సుయోధనం ధార్తరాష్ట్రం వదస్వ. 10

కౌరవుల నడుమ వారిని ఉప్పొంగజేయుచు సత్యసంధు డగు భీష్ముడు నేను సృంజయులయు శాల్వేయకులయు సేనను రూపుమాపుదును. ఈ మాట సుయోధనుని కెరిగించి పిదప పాండవులతో చెప్పుము.

---

9. సమేత్య - ఒక్కచోటికి తెచ్చి, సమావేశపరచి; నిశావ్యపాయే - రాత్రి గడచినపిమ్మట - మరునాటిప్రొద్దున అని భావము

10. సత్యసన్ధః - సత్యమగు ప్రతిజ్ఞ కలవాడు - భీష్ముడు; అహం హన్తా - మొదలుకొని 11వ శ్లోకము పూర్వార్ధము దాక భీష్ముని వాక్యము. 'నేను సృంజయాదులను చంపుదును' అను వాక్యమును కౌరవు లందరిముందు దుర్యోధనునితో చెప్పుము; పిదప దానిని, భరతాన్ గత్వా - పాండవుల కడ కరిగి; వదస్వ-పలుకుము-అని భావము దానివలన దుర్యోధనునకు సుఖమును, పాండవులకు భయమును కలుగు నని అభిప్రాయము.

హన్యా మహం ద్రోణ మృతేఽపి లోకం
న తే భయం విద్యతే పాణ్డవేభ్యః,
తతో హి తే లబ్ధతమం చ రాజ్య
మాపద్గతాః పాణ్డవా శ్చేతి భావః. 11

ద్రోణుడు లేకున్నను నేను లోక మంతటిని నాశనము చేయగలను. నీకు పాండవులవలన భయము లేదు అనియు భీష్ముడు పలికెను. ఆ మాట వినిన నీకు రాజ్యము చిక్కినట్లే భావము కలిగెను. పాండవులు ఆపద నంది రనియే తలపోయుచున్నావు.

స దర్పపూర్ణో న సమీక్షసే త్వ
మనర్థ మాత్మన్యపి వర్తమానమ్,
తస్మా దహం తే ప్రథమం సమూహే
హన్తా సమక్షం కురువృద్ధ మేవ. 12

దానితో నిండుగా పొగరెక్కిన నీవు నీయందే ఉన్న కీడు పరికింపజాల కున్నావు. భీష్మ దట్లు పలికిన కారణమున నీ మూకలో ముందుగా ఆ కురు వృద్ధునే నీ ముందే చంపెదను.

సూర్యోదయే యుక్తసేనః ప్రతీక్ష్య
ధ్వజీ రథీ రక్షత సత్యసన్ధమ్,
అహం హి వః పశ్యతాం ద్వీప మేనం
భీష్మం రథాత్ పాతయిష్యామి బాణైః. 13

---

11. ద్రోణమ్, ఋతే, అపి-ద్రోణుడు లేకున్నను; అహమ్-నేను; లోకమ్-లోకమును; హన్యామ్ - చంపెదను - ఇది దుర్యోధనునితో భీష్మ డన్న మాట. తతః - ఆ భీష్ముని మాటవలన, రాజ్యమ్, లబ్ధతమమ్ ఇతి - గట్టిగా చిక్కినదనియు; పాండవాః - పాండవులు; ఆపద్గతాః - ఆపద నందినవారనియు; తే - నీయొక్క (దుర్యోధనునియొక్క) భావః - అభిప్రాయము.

12. కురువృద్ధమ్ - కురువులలో పెద్దవాడగు భీష్ముని; హన్తా - చంపుదును.

13. నీవు సర్వసేనతో భీష్ముని కాపాడుకొనుము అని భావము. ద్వీపమ్ - మునిగిపోవువారికి రక్షణస్థానము - అట్టివాడగు భీష్ముని చంపినచో అందరు చచ్చినట్లే అని భావము.

ప్రొద్దు పొడిచిన వేళకు సేనలను సిద్ధము చేసికొని ధ్వజములను రథములను చక్కజేసికొని ఆ సత్యసంధుని రక్షించుకొనుడు. నేను మాత్రము మీరందరు చూచుచుండగా మీకు ద్వీపమైన ఈ భీష్ముని బాణములతో రథమునుండి కూలద్రోయుదును.

శ్వోభూతే కత్థనావాక్యం విజ్ఞాస్యతి సుయోధనః,
ఆచితం శరజాలేన మయా దృష్ట్వా పితామహమ్. 14

రేపటిదినమున ఒడలెల్ల నా బాణములు గ్రుచ్చుకొనియున్న భీష్ముని చూచి దుర్యోధనుడు తన పొగడికోలుమాటల సార మెరుగును

యదుక్తశ్చ సభామధ్యే పురుషో హ్రస్వదర్శనః,
క్రుద్ధేన భీమసేనేన భ్రాతా దుఃశాసన స్తవ. 15
అధర్మజ్ఞో నిత్యవైరీ పాపబుద్ధి ర్నృశంసవత్,
సత్యాం ప్రతిజ్ఞా మచిరా ద్ద్రక్ష్యసే తాం సుయోధన. 16

ముందుచూపు లేనివాడు, ధర్మ మెరుగనివాడు,పగకు అంతము లేనివాడు, పాపబుద్ధి యగు నీ తమ్ముడు దుశ్శాసనునిగూర్చి పెనుకోపముతో భీమసేనుడు అతిక్రూరముగా చేసిన ప్రతిజ్ఞ నిజమగుటను, సుయోధనా! త్వరలో చూడగలవు.

అభిమానస్య దర్పస్య క్రోధపారుష్యయో స్తథా,
నైష్ఠుర్య స్యావలేపస్య ఆత్మసంభావనస్య చ, 17
నృశంసతాయా స్తైక్ష్ణ్యస్య ధర్మవిద్వేషణస్య చ,
అధర్మ స్యాతివాదస్య వృద్ధాతిక్రమణస్య చ. 18

---

17. అభిమానః - నేను శ్రేష్ఠుడ నను భావము; దర్పః - ఇతరులను మీరగల సామర్థ్యము కలవాడను అను భావము; క్రోధః - ఎల్లప్పుడు మండిపడు చుండుట; పారుష్యమ్ - శూలములవంటి మాటలు పలుకుట, నైష్ఠుర్యమ్-స్నేహము లేకుండుట; అవలేపః - ఇతరులను చులకన చేయుట; ఆత్మసంభావనమ్ - నేనే సర్వజ్ఞుడను, శూరుడను అనుకొనుట.

18. నృశంసతా-దయలేనితనము; తైక్ష్ణ్యమ్-బిరుసుతనము-విషము పెట్టుట మున్నగు బీభత్సకార్యములు చేయుట; ధర్మవిద్వేషణమ్-ధర్మమునందు

దర్శనస్య చ చక్రస్య కృత్స్నస్యాపనయస్య చ,
ద్రక్ష్యసి త్వం ఫలం తీవ్ర మచిరేణ సుయోధన. 19

అభిమానమునకు, దర్పమునకు, క్రోధమునకు, కటికతనమునకు, నిష్ఠురత్వమునకు, పరులను తులనాడుటకు, నిన్ను నీవు గొప్పవాడవని తలచుటకు, దయలేనితనమునకు, వాదిమికి, ధర్మమును కక్కసించుకొనుటకు, ధర్మము పాటింపకుండుటకు, హద్దు మీరి పలుకుటకు, పెద్దలను మన్నింపకుండుటకు, అసమర్థులను చూచి జయము కల్గునని నిశ్చయించుకొన్నదానికి, సేన అధికముగా నుండెనని విఱ్ఱవీగుటకు. మమ్ములను బొత్తుగా దూరము చేసికొన్నందులకు అగు తీవ్రమైన ఫలమును, దుర్యోధనా! నీవు త్వరలోనే చూడగలవు.

వాసుదేవద్వితీయే హి మయి క్రుద్ధే నరాధమ,
ఆశా తే జీవితే మూఢ రాజ్యే వా కేన హేతునా!. 20

మూఢుడా! నరాధముడా! వాసుదేవుడు తోడై యున్న నేను క్రోధము వహించియుండగా నీకు బ్రదుకునందు గాని, రాజ్యమునందు గాని ఆశ ఏ కారణమున కలుగును?

శాన్తే భీష్మే తథా ద్రోణే సూతపుత్రే చ పాతితే,
నిరాశో జీవితో రాజ్యే పుత్రేషు చ భవిష్యసి. 21

---

ద్వేషముండుట; కపటద్యూతము మున్నగునవి చేయుట వంటిది; అధర్మః - ధర్మమును మన్నింపకుండుట - అన్నమాట ప్రకారము రాజ్యము నొసగకుండుట; అతివాదః-ధర్మిష్ఠులయందు ధర్మము పాటింపనివారు అని ఆరోపించుట - నీవు బైడాలవ్రత మాచరించుచున్నావని ధర్మరాజును నిందించుట. వృద్ధాతిక్రమణమ్ - విదురుడు మున్నగు వారిని మన్నింపకుండుట.

19. దర్శనమ్-కర్ణాదులయందు విజయమును సంభావించుట; చక్రమ్ - సేన అధికముగా నున్నదని పొంగిపోవుట. అపనయః - మమ్ములను దూరముగా పారద్రోలుట - ఈ దుష్కార్యము లన్నింటి ఫలము చూడగలవని భావము.

భీష్ముడు, ద్రోణుడు చావగా సూతుని కొడుకు కర్ణుని మేము నేల గూల్చగా అప్పుడు నీవు బ్రదుకునందు, రాజ్యమునందు, కొడుకులయందు ఆశ చచ్చినవాడ వగుదువు.

భ్రాతౄణాం నిధనం శ్రుత్వా పుత్రాణాం చ సుయోధన,
భీమసేనేన నిహతో దుష్కృతాని స్మరిష్యసి. 22

తమ్ములు, కొడుకులు చచ్చిరని వినిన నీవు భీమసేనునిచేత చావుదెబ్బ తిని చేసిన పాపకార్యము లన్నింటిని స్మరింతువు.

న ద్వితీయాం ప్రతిజ్ఞాం హి ప్రతిజానామి కైతవ,
సత్యం బ్రవీమ్యహం హ్యేతత్ సర్వం సత్యం భవిష్యసి. 23

ఓరి జూదరీ! నేను రెండవ ప్రతిజ్ఞ పట్టుట లేదు. సత్యమే చెప్పుచున్నాను. ఇది యంతయు నిజమగును.

యుధిష్ఠిరోఽపి కైతవ్య ములూక మిద మబ్రవీత్,
ఉలూక మద్వచో బ్రూహి గత్వా తాత సుయోధనమ్. 24

పిదప యుధిష్ఠిరుడును శకుని కొడుకగు ఉలూకునితో నిట్లు పలికెను; ఉలూకా! ఆ సుయోధనుని కడ కరిగి వానికి నా మాట నిట్లు పలుకుము:

స్వేన వృత్తేన మే వృత్తం నాధిగన్తుం త్వ మర్హసి,
ఉభయో ర న్తరం వేద సూనృతానృతయో రపి. 25

సుయోధనా! నీ నడవడితో నా ప్రవర్తనను మీరజాలవు. మన యిరువురకు సత్యమునకు అసత్యమునకు ఉన్నంతదూర మని నే నెరుగుదును.

న చాహం కామయే పాప మపి కీటపిపీలయోః,
కిం పున ర్జ్ఞాతిషు వధం కామయేయం కథఞ్చన. 26

నేను పురుగునకు, చీమకును, కీడు చేయగోరను. అట్టియెడ దగ్గరచుట్టము లను రూపుమాపుట కెన్నడైనను ఎట్లు కోరుదును?

---

25. వేద - ఎరుగుదును.

ఏతదర్థం మయా తాత పఞ్చగ్రామా వృతాః పురా,
కథం తవ సుదుర్బుద్ధే న ప్రేక్షేయ వ్యసనం మహత్. 27

ఓయి సుదుర్బుద్ధీ! నీకు మూడెడు పెనుకీడు ఎట్లును చూడజాలక మునుపు బాబూ! అయిదూళ్ళిమ్మంటిని.

స త్వం కామ పరీతాత్మా మూఢభావాచ్చ కత్థసే,
తథైవ వాసుదేవస్య న గృహ్ణాసి హితం వచః. 28

నిలువెల్ల లోభముతో నిండిన నీవు కన్నుగానక గొప్పలు పలుకుచున్నావు. అట్లే వాసుదేవుడు నీ మేలు కోరి చెప్పిన మాటను గూడ నీవు పట్టించుకొనలేదు.

కిఞ్చేదానీం బహూక్తేన యుధ్యస్వ సహ బాన్ధవైః,
మమ విప్రియకర్తారం కైతవ్య బ్రూహి కౌరవమ్. 29

ఇంక ఇప్పుడు పలు మాటలాడి ఫలమేమి? చుట్టములతో పోరుము. ఓయి ఉలూకా! నాకు ప్రియము కాని పని చేయుచున్న ఆ దుర్యోధనునితో మరియు నిట్లు పలుకుము.

శ్రుతం వాక్యం గృహీతోఽర్థో మతం యత్తే తథాస్తు తత్.

దుర్యోధనా! నీ మాట వింటిమి. దాని యర్థము గ్రహించితిమి. నీ యిష్ట మెట్లో యట్లే యగుగాక!

భీమసేన స్తతో వాక్యం భూయ ఆహ నృపాత్మజమ్. 30

పిదప భీమసేనుడు రాజకుమారునిగూర్చి మరియు నిట్లు పలికెను.

ఉలూక మద్వచో బ్రూహి దుర్మతిం పాపపూరుషమ్,
శఠం నైకృతికం పాపం దురాచారం సుయోధనమ్. 31

ఉలూకా! దుష్టబుద్ధి, పాపి, మొండి, అపకారి, దురాచారుడు అగు ఆ దుర్యోధనునితో నా మాట నిట్లు చెప్పుము.

---

27. ఓయి సుదుర్బుద్ధీ! నీకు మూడెడి గొప్పకీడును - చావును, కథమ్ - కథమపి - ఏతీరుగను; న ప్రేక్షేయ - చూడజాలను అనుకారణమువలన - అయిదూళ్లడిగితి నని అన్వయము.

గృధ్రోదరే వా వస్తవ్యం పురే వా నాగసాహ్వయే,
ప్రతిజ్ఞాతం మయా తచ్చ సభామధ్యే నరాధమ. 32
కర్తాఽహం తద్వచః సత్యం సత్యే నైవ శపామి తే,
దుఃశాసనస్య రుధిరం హత్వా పాస్యామ్యహం మృధే. 33

నేను నిండుసభలో ప్రతిన పట్టితిని. సత్యము మీద ఒట్టు. దానిని నిజము గావింతును. నరాధముడా! వాడు గ్రద్దకడుపులో దాగుకొన్నను, కరిపురములో నివసించియున్నను దుశ్శాసనుని యుద్ధమున చంపి నెత్తురు త్రావుదును.

సక్థినీ తవ భజ్క్త్వైవ హత్వా హి తవ సోదరాన్,
సర్వేషాం ధార్తరాష్ట్రాణా మహం మృత్యుః సుయోధన. 34

సుయోధనా! నీ తొడలు విరుగబొడిచి, నీ తమ్ములను చంపి, నేను ధృతరాష్ట్రుని కొడుకు లందరికి మృత్యువ నగుదును.

సర్వేషాం రాజపుత్రాణా మభిమన్యు రసంశయమ్,
కర్మణా తోషయిష్యామి భూయ శ్చైవ వచః శృణు. 35

నిలువెల్ల కోపము గల నేను రాజపుత్రు లందరకు నా చేష్టతో సంతోషము కూర్తును. మరియు నామాట వినుము.

హత్వా సుయోధన త్వాం వై సహితం సర్వసోదరైః,
ఆక్రమిష్యే పదా మూర్ధ్ని ధర్మరాజస్య పశ్యతః. 36

తమ్ము లందరితో పాటు నిన్ను నేలగూల్చి ధర్మరాజు చూచుచుండగా కాలితో నీ తల తన్నుదును.

నకుల స్తు తతో వాక్య మిద మాహ మహీపతే,
ఉలూక బ్రూహి కౌరవ్యం ధార్తరాష్ట్రం సుయోధనమ్. 37

రాజా! అంత నకులు డిట్లు పలికెను. ఉలూకా! ఆ కురురాజు ధృతరాష్ట్రుని కొడుకు దుర్యోధనునితో నిట్లు పలుకుము.

శ్రుతం తే గదతో వాక్యం సర్వ మేవ యథాతథమ్,
తథా కర్తాఽస్మి కౌరవ్య యథా త్వ మనుశాసి మామ్. 38

నీవు పలికిన వాక్యము అంతయు ఉన్నదున్నట్లు వింటిమి. కురురాజా! నీవు నాకు చెప్పినట్లే యంతయు చేసెదను.

శోచిష్యసే మహారాజ సపుత్రజ్ఞాతిబాన్ధవః,
ఇమం చ క్లేశ మస్మాకం హృష్టో యత్త్వం వికత్థసే. 40

మహారాజా! కొడుకులతో, కులమువారితో, బంధువులతో కూడి నీ వేడ్తువు. ఏల యన ఈ మా పాటు చూచి పొంగిపోవుచు పొగడికొనుచున్నావు.

విరాట్ద్రుపదౌ వృద్ధా వులూక మిద మూచతుః,
దాసభావం నియచ్ఛేవ సాధో రితి మతిః సదా.
తౌ చ దాసా వదాసౌ వా పౌరుషం యస్య యాదృశమ్. 41

పెద్దవయసువా రగు విరాట్ద్రుపదులు ఉలూకునితో నిట్లు పలికిరి. మేము సత్పురుషునకు దాసభావమును గట్టిగా కోరుకొందుము. ఎల్లప్పుడు మా కదియే భావన. అట్టి మేము దాసులమో, కామో, యెవని పౌరుష మెట్టిదో రేపు చూచెదము.

శిఖణ్డీ తు తతో వాక్య ములూక మిద మబ్రవీత్,
వక్తవ్యో భవతా రాజా పాపే ష్వభిరతః సదా. 42

అంత శిఖండి ఉలూకునితో నిట్లు పలికెను. ఉలూకా! ఎల్లవేళల పాపము లన్న పడిచచ్చు ఆ దుర్యోధనునికి నీ విట్లు చెప్పవలయును.

పశ్య త్వం మాం రణే రాజన్ కుర్వాణం కర్మ దారుణమ్,
యస్య వీర్యం సమాసాద్య మన్యసే విజయం యుధి, 43
త మహం పాతయిష్యామి రథా త్తవ పితామహమ్.

---

41. యత్, ఇమం అస్మాకమ్, క్లేశం, దృష్ట్వా వికత్థసే- మేము పొందిన ఈ పాటును చూచి పొగడికొనుచున్న కారణమున; త్వమ్ - అట్టి - నీవు దుఃఖింతు వని భావము.

41. నేను మీకు ప్రభువను - అన్న దుర్యోధనుని మాటకు విరాట్ద్రుపదులు బదులు చెప్పుచున్నారు. సాధోః - సజ్జనునకు; దాసభావమ్ - దాసుల మగుటను; నియచ్ఛేవ-కోరుకొందుము ఇతి - అని;ఆవయోః - మా యిరువురకు; మతిః - భావన; అస్తి-కలదు; మేము దాసులమో, స్వతంత్రులమో యెట్టిదో - రేపు చూతము గాక-అని కలుపుకొనవలయును.

రాజా! యుద్ధమున దారుణకర్మ మాచరించు నన్ను చూడుము. ఎవని శక్తిని అండగా గొని యుద్ధమున గెలుపును భావించుచున్నావో అట్టి నీ తాతను రథమునుండి కూలద్రోయుదును.

అహం భీష్మవధాత్. సృష్టో నూనం ధాత్రా మహాత్మనా, 44
సోఽహం భీష్మం హనిష్యామి మిషతాం సర్వధన్వినామ్.

దొడ్డబుద్ధి గల బ్రహ్మ నన్ను భీష్ముని వధించుటకే పుట్టించెను. అట్టి నేను ధనుర్విద్యలో ఆరితేరినవా రందరు చూచుచుండగా భీష్ముని చంపెదను.

ధృష్టద్యుమ్నోఽపి కైతవ్య ములూక మిద మబ్రవీత్. 45
సుయోధనో మమ వచో వక్తవ్యో నృపతేః సుతః.

అంత ధృష్టద్యుమ్నుడు ఉలూకునితో నిట్లు పలికెను. ఆ రాజుకొడుకు సుయోధనునితో నా మాటగా నిట్లు చెప్పుము.

అహం ద్రోణం హనిష్యామి సగణం సహ బాన్ధవమ్, 46
అవశ్యం చ మయా కార్యం పూర్వేషాం చరితం మహత్,
కర్తా చాహం తథా కర్మ యథా నాన్యః కరిష్యతి. 47

నేను ద్రోణుని, వాని సైనికులతో, చుట్టములతో పాటు సంహరించెదను. నా పూర్వులకై దొడ్డపని నేను తప్పక చేయవలయును. మరియెవ్వరు చేయజాలని పని నేను చేయుదును.

త మబ్రవీ ద్ధర్మరాజః కారుణ్యార్థం వచో మహత్,
నాహం జ్ఞాతివధం రాజన్ కామయేయం కథఞ్చన. 48
తవైవ దోషా ద్దుర్బుద్ధే సర్వ మేత త్త్వనావృతమ్.

---

44. భీష్మవధాత్ - భీష్ముని వధ కారణముగా

47. పూర్వేషాం చరితమ్ - పూర్వులకు సంబంధించిన పనిని - ద్రోణునితోడి పగతీర్చుకొనుట యను దానిని: సర్వేషామ్ అనియు పాఠము - అర్థ మదియే.

48. అనావృతమ్ - విస్పష్టము

అంత ధర్మరాజు దయతో దొడ్డమాట పలికెను. రాజా! నే నెన్నటికిని చుట్టముల చావును కోరను. దుర్బుద్ధీ! ఇది యంతయు నీ తప్పు వలననే యగు చున్నది. ఇది అంద రెరిగిన విషయము.

స గచ్ఛ మాచిరం తాత ఉలూక యది మన్యసే, 49
ఇహ వా తిష్ఠ భద్రం తే వయం హి తవ బాన్ధవాః.

నాయనా! ఉలూకా! జాగు సేయకు. పద. లేదా ఉండదలచినచో నీ విచటనే యుండుము. నీకు మేలయ్యెడు. మేము నీ బంధువులము కదా.

ఉలూక స్తు తతో రాజన్ ధర్మపుత్రం యుధిష్ఠిరమ్, 50
ఆమన్త్ర్య ప్రయయౌ తత్ర యత్ర రాజా సుయోధనః.

పిదప ఉలూకుడు ధర్మపుత్రుడైన యుధిష్ఠిరునికడ సెలవు గైకొని సుయోధను డున్నచోటి కరిగెను.

ఉలూక స్తత ఆగమ్య దుర్యోధన మమర్షణమ్, 51
అర్జునస్య సమావేశం యథోక్తం సర్వ మబ్రవీత్.

ఉలూకుడు అటనుండి వచ్చి కోపిష్ఠి యగు దుర్యోధనునిలో అర్జునుడు చెప్పినదంతయు యథాతథముగా చెప్పెను.

వాసుదేవస్య భీమస్య ధర్మరాజస్య పౌరుషమ్, 52
నకులస్య విరాటస్య ద్రుపదస్య చ భారత,
సహదేవస్య చ వచో ధృష్టద్యుమ్న శిఖణ్డినోః,
కేశవార్జునయో ర్వాక్యం యథోక్తం సర్వ మబ్రవీత్. 53

వాసుదేవుడు, భీముడు, ధర్మరాజు నకులుడు, విరాటుడు, ద్రుపదుడు, సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, కృష్ణార్జునులు-అనువారి పరాక్రమమును, వారాడిన మాటలను ఉన్నదున్నట్లు అంతయు నివేదించెను.

---

49. మా చిరమ్ - జాగుసేయకుము.
51. ఆమన్త్ర్య - సెలవు గైకొని;

కైతవ్యస్య తు తద్వాక్యం నిశమ్య భరతర్షభః,
దుఃశాసనం చ కర్ణం చ శకునిం చాపి భారత. 54
ఆజ్ఞాపయత రాజ్ఞశ్చ బలం మిత్రబలం తథా,
యథా ప్రాగుదయాత్ సర్వే యుక్తా స్తిష్ఠన్త్యనీకినః. 55

శకునికొడుకు మాట విని, ఆ భరతవరేణ్యుడు, దుశ్శాసనుని, కర్ణుని, శకునిని, ఇతరరాజులను, తన సేనను, చెలిమికాండ్ర సేనను - తెల్లవారులోపల సేన లెట్లు మోహరింపవలయు ననుదానినిగూర్చి ఆజ్ఞాపించెను.

తతః కర్ణసమాదిష్టా దూతాః సంత్వరితా రథైః,
ఉష్ట్రవామీభి రప్యన్యే సదశ్వైశ్చ మహాజవైః. 56
తూర్ణం పరియయుః సేనాం కృత్స్నాం కర్ణస్య శాసనాత్,
ఆజ్ఞాపయన్తో రాజ్ఞశ్చ యోగః ప్రాగుదయా దితి. 57

అంత కర్ణు డాదేశింపగా దూతలు త్వరగా రథములతో, ఒంటెలతో, గొప్ప వేగముగల గుఱ్ఱములతో సేన నంతటిని చుట్టివచ్చిరి. తెల్లవారక మున్నే సేన అంతయు సిద్ధముగా నుండవలయు నని రాజు లందరికి కర్ణుని శాసనమును చాటిచెప్పుచు తిరిగివచ్చిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ఉలూకదూతాగమనపర్వణి
ఉలూకాపయానే త్రిషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ఉలూకదూతాగమన
పర్వమున ఉలూకుడు తిరిగివచ్చుట యను
నూటఅరువది మూడవ అధ్యాయము.

—:o:—

---

57. ఉదయాత్-సూర్యోదయమునకు; ప్రాక్ - ముందు; యోగః - సేన సిద్ధముగా నుండవలయునని;

# చతుష్షష్ట్యధికశతతమోఽధ్యాయః

# నూట ఇరువది నాలుగవ అధ్యాయము

పాణ్డవసేనాయా యుద్ధక్షేత్రే గమనమ్, ధృష్టద్యుమ్నకర్తృకం స్వసైనికానాం కృతే యుద్ధయోగ్యవిపక్షీణా మవధారణమ్.

పాండవసేన యుద్ధక్షేత్రమున కరుగుట, ధృష్టద్యుమ్నుడు తన సైనికులకు పోరదగిన శత్రువులను నిర్ణయించి చెప్పుట.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

ఉలూకస్య వచః శ్రుత్వా కున్తీపుత్రో యుధిష్ఠిరః,
సేనాం నిర్యాపయామాస ధృష్టద్యుమ్నపురోగమమ్. 1

ఉలూకునిమాట విని కుంతికుమారుడు యుధిష్ఠిరుడు ధృష్టద్యుమ్నుడు ముందున్న సేనను బయలుదేరదీసెను.

పదాతినీం నాగవతీం రథినీ మశ్వవృన్దినీమ్,
చతుర్విధబలాం భీమా మకమ్పాం పృథివీ మివ. 2
భీమసేనాదిభి ర్గుప్తాం సార్జునైశ్చ మహారథైః,
ధృష్టద్యుమ్నవశాం దుర్గాం సాగర స్తిమితోపమామ్. 3

ఆ సేన పదాతులతో, ఏనుగులతో, రథములతో, గుఱ్ఱములతో నాలుగు తీరుల బలముతో కూడియుండెను. భయంకరముగా నుండెను. భూమివలె నిలువ ద్రొక్కకొని యుండెను. భీమసేనుడు, అర్జునుడు మొదలగు మహారథులు దానిని కాపాడుచుండిరి. ధృష్టద్యుమ్నుని వశమున నుండెను. పగవారికి లొంగనిదై యుండెను. ఎగిరి పడని సముద్రమును పోలియుండెను.

తస్యా స్త్వగ్రే మహేష్వాసః పాఞ్చాల్యో యుద్ధదుర్మదః,
ద్రోణప్రేప్సు రనీకాని ధృష్టద్యుమ్నో వ్యకర్షత. 4

ఆ మహాసేనకు ముందు భాగమున పెద్దధనువు గలవాడు, యుద్ధమున గొప్ప ఆవేశము గలవాడు నగు పాంచాలరాజు కొడుకు ధృష్టద్యుమ్నుడు నిలిచి ద్రోణుని సాధింపగోరినవాడై సేనలను నడపించుచుండెను.

యథాబలం యథోత్సాహం రథినః సముపాదిశత్.

వారి వారి బలమునకు, ఉత్సాహమునకు తగిన విధముగా రథులను ఏర్పరచెను.

అర్జునం సూతపుత్రాయ భీమం దుర్యోధనాయ చ, 5
ధృష్టకేతుం చ శల్యాయ గౌతమా యోత్తమౌజసమ్.
అశ్వత్థామ్నే చ నకులం శైబ్యం చ కృతవర్మణే, 6
సైన్ధవాయ చ వార్ష్ణేయం యుయుధానం సమాదిశత్.

అర్జునుని కర్ణునికొరకు, భీముని దుర్యోధనునికొరకు, ధృష్టకేతుని శల్యునకు, ఉత్తమౌజుని కృపునికి, నకులుని అశ్వత్థామకు, శైబ్యుని కృతవర్మకు వృష్ణివంశమువాడగు సాత్యకిని సైన్ధవునకుగా నియమించెను.

శిఖణ్డినం చ భీష్మాయ ప్రముఖే సమకల్పయత్. 7

భీష్మునికొరకు శిఖండిని ముందుభాగమున నేర్పరచెను.

సహదేవం శకునయే చేకితానం శలాయ వై,
ద్రౌపదేయాం స్తథా పఞ్చ త్రిగర్తేభ్యః సమాదిశత్. 8

సహదేవుని శకునికి, చేకితానుని శలునకు, ద్రౌపదికుమారు లైదుగురిని త్రిగర్తరాజులకు నిర్దేశించెను.

వృషసేనాయ సౌభద్రం శేషాణాం చ మహీక్షితామ్,
స సమర్థం హి తం మేనే పార్థా దభ్యధికం రణే. 9

వృషసేనునకు అభిమన్యుని నియమించెను. అట్లే శేషులను రాజులకు అతడు చాలునని ధృష్టద్యుమ్నుడు తలపోసెను, అతడు యుద్ధమున అర్జునుని కంటె మిన్న అనియు సంభావించెను.

---

5. యథాబలమ్ - సముపాదిశత్ - నీవు వీనితో, నీవు వీనితో పోరవలయు నని ఒక్కొక్కరి కొక్కొక్క రథికుని ఏర్పరచెను.

ఏవం విభజ్య యోధాం స్తాన్ పృథక్చ సహ చైవ హ,
జ్వాలావర్ణో మహేష్వాసో ద్రోణ మంశ మకల్పయత్. 10

ఈ విధముగా యోధులను వేరువేరుగను, సముదాయముగను ఏర్పరచి అగ్నిజ్వాలలవంటి వన్నెగల ఆమహాధనుష్కుడు ద్రోణుని తనవంతుగా చేసికొనెను.

ధృష్టద్యుమ్నో మహేష్వాసః సర్వసేనాపతి స్తతః,
విధివద్ వ్యూహ్య మేధావీ యుద్ధాయ ధృతమానసః, 11
యథోద్దిష్టాని సైన్యాని పాణ్డవానా మయోజయత్,
జయాయ పాణ్డుపుత్రాణాం యత్త స్తస్థౌ రణాజిరే. 12

గొప్పవిల్లు తాల్చినవాడు, సర్వసేనాపతి, మేధావియు నగు ధృష్ట ద్యుమ్నుడు యుద్ధమునకు నిశ్చయించుకొని, చేయదగిన రీతిగా వ్యూహములను ఏర్పరచి, పాండవుల సైన్యములను పైని చెప్పిన తీరున నిలుపబెట్టెను. పాండవుల జయమునకై సర్వవిధముల సన్నద్ధుడై సేన ముందట తాను నిలిచెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ఉలూకదూతాగమనపర్వణి
సేనాపతినియోగే చతుఃషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ఉలూకదూతాగమన
పర్వమున సేనాపతుల నేర్పరచుట యను నూటయరువది
నాలుగవ అధ్యాయము.

సమాప్త ముతూకదూతాగమనపర్వ.

ఉలూకదూతాగమనపర్వము ముగిసెను.

—:౦:—

10. మొదటిశ్లోకమున 'ఉలూకుని మాట విని' అనునది మొదలు ఇంతవరకు చెప్పినదానికి యోధులసార మెరిగి వారివారికి తగిన యోధులను కూర్చుట తాత్పర్యార్థము; పృథక్ - ఇంతవరకు చెప్పిన రీతిగా ప్రధాన వ్యక్తులను, సహ చైవ - ఇతరులను సముదాయములుగా చేసి;

# రథాతిరథసంఖ్యాన పర్వ--౯

# రథాతిరథనిర్ణయపర్వము–9

## పఞ్చషష్ట్యధికశతతమోఽధ్యాయః - ౧౬౫

## నూటఅరువదియైదవ అధ్యాయము - 165

**దుర్యోధనపృష్టేన భీష్మేణ కౌరవపక్షీయ రథ్యతిరథినాం పరిచాయనమ్.**

**దుర్యోధను డడుగగా భీష్ముడు కౌరవపక్షమున నున్న రథులను అతిరథులను పరిచయము చేయుట.**

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ప్రతిజ్ఞాతే ఫాల్గునేన వధే భీష్మస్య సంయుగే,
కిమకుర్వత మే మన్దాః పుత్రా దుర్యోధనాదయః. 1

అర్జునుడు యుద్ధమున భీష్ముని చంపుదు నని ప్రతిజ్ఞ పట్టగా బుద్ధిలేని నా కొడుకులు దుర్యోధనాదులు ఏమి చేసిరి?

హతమేవ హి పశ్యామి గాఙ్గేయం పితరం రణే,
వాసుదేవ సహాయేన పార్థేన దృఢధన్వనా. 2

గట్టి విల్లు చేపట్టిన కుంతికొడుకు, శ్రీకృష్ణుడు తోడైనవాడు యుద్ధమున నా తండ్రి భీష్ముని చంపివేసినట్లే తోచుచున్నది.

స చాపరిమితప్రజ్ఞ స్తచ్ఛ్రుత్వా పార్థభాషితమ్,
కి ముక్తవాన్ మహేష్వాసో భీష్మః ప్రహరతాం వరః. 3

గొప్ప ధనువు గలవాడు, పోటుగాండ్రలో మేలైనవాడు, ఇంతనరాని ప్రజ్ఞ గలవాడు నగు భీష్ముడు అర్జునుని మాట విని యేమి పలికెను.

సైనాపత్యం చ సంప్రాప్య కౌరవాణాం ధురంధరః,
కిమచేష్టత గాఙ్గేయో మహాబుద్ధిపరాక్రమః. 4

గొప్ప తెలివితో కూడిన పరాక్రమము గలవాడు, కౌరవుల బరువుబాధ్యత లన్నింటిని నెత్తి కెత్తుకొన్నవాడు అగు భీష్ముడు సేనాపతిపదవి పొంది యేమి చేసెను?

వైశమ్పాయన ఉవాచ - వైశమ్పాయను డిట్లు చెప్పెను.

తత స్తత్సఞ్జయ స్తస్మై సర్వమేవ న్యవేదయత్,
యథోక్తం కురువృద్ధేన భీష్మే ణామితతేజసా. 5

అంత సంజయుడు ధృతరాష్ట్రునకు కురువృద్ధుడు, మహాతేజస్సు గల వాడు నగు భీష్ముడు పలికిన దంతయు విన్నవించెను.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

సైనాపత్య మనుప్రాప్య భీష్మః శాన్తనవో నృప,
దుర్యోధన మువాచేదం వచనం హర్షయన్నివ. 6

సేనాపతి పట్టము పొంది శంతనుకుమారు డగు భీష్ముడు దుర్యోధనుని ఉప్పొంగజేయుచు నిట్లు పలికెను.

నమస్కృత్య కుమారాయ సేనాన్యే శక్తిపాణయే,
అహం సేనాపతి స్తేఽద్య భవిష్యామి న సంశయః. 7

శక్తిని చేత ధరించిన సేనాని కుమారస్వామికి మ్రొక్కి యిప్పుడు నీకు నేను సేనాపతి నగుదును. ఇందు సంశయము లేదు.

సేనాకర్మ ణ్యభిజ్ఞోఽస్మి వ్యూహేషు వివిధేషు చ,
కర్మ కారయితుం చైవ భృతాన ప్యభృతాం స్తథా. 8
యాత్రాయానే చ యుద్ధే చ తథా ప్రశమనేషు చ,
భృశం వేద మహారాజ యథా వేద బృహస్పతిః. 9

---

8 భృతాన్ - జీత మిచ్చి ఏర్పాటు చేసికొన్న సైనికులను; అభృతాన్ - నెయ్యముతో వచ్చినవారిని.

9. యాత్రాయానే - యుద్ధమునకు సంబంధించిన ప్రయాణమునందు, ప్రశమనేషు - పగవారు ప్రయోగించు అస్త్రములకు బదులు చేయుటయందు; వేద - ఎరుగుదును; వేద - ఎరుగును;

మహారాజా! పలువిధములగు మొగ్గరములు తీర్చుటయందు, సేనను నిర్వహించుటయందును మంచి జ్ఞానము కలదు. వేతనములవారిని, మైత్రితో వచ్చిన వారిని ఆయా పనులయందు చక్కదిద్దగలను. యుద్ధయాత్రలు తీర్చుటయందు, యుద్ధము చేయునపుడు పగవారు ప్రయోగించు అస్త్రములను త్రిప్పికొట్టుటయందును బృహస్పతి కున్నంత తెలివి నాకు మిక్కుటముగా గలదు.

వ్యూహానాం చ సమారంభాన్ దైవగాన్ధర్వమానుషాన్,
తైరహం మోహయిష్యామి పాణ్డవాన్ వ్యేతు తే జ్వరః. 10

దేవతలకు, గంధర్వులకు, నరులకు సంబంధించిన మొగ్గరములను తీర్చుటలో నాకు గొప్ప ప్రజ్ఞ కలదు. వానితో పాండవులను మోహపెట్టుదును. గుండెలో దిగులు పడకుము.

సోఽహం యోత్స్యామి తత్త్వేన పాలయం స్తవ వాహినీమ్,
యథావ చ్ఛాస్త్రతో రాజన్ వ్యేతు తే మానసో జ్వరః. 11

అట్టి నేను వంచన లేక నీ సేనను కాపాడుచు క్రమము తప్పకుండ పోరుదును. నీవు దిగులు పడకుము.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

విద్యతే మే న గాఙ్గేయ భయం దేవాసురేష్వపి,
సమస్తేష మహాబాహో సత్య మేత ద్బ్రవీమి తే. 12

దేవతల విషయమున గాని, రాక్షసుల విషయమున గాని - ఎందుగాని ఓ మహాబాహూ! గాంగేయా! నాకు భయము లేదు. నిజము చెప్పుచున్నాను.

కిం పున స్త్వయి దుర్ధర్షే సైనాపత్యే వ్యవస్థితే,
ద్రోణే చ పురుషవ్యాఘ్రే స్థితే యుద్ధాభినన్దిని. 13

ఎవ్వరికి సాధింపరానివాడవు నీవు సేనాపతిపదవిలో నెలకొనియుండగా, పోరన్నచో పొంగిపోవు పురుషశ్రేష్ఠుడు ద్రోణుడుండగా నా కేమి భయము?

భవద్భ్యాం పురుషాగ్ర్యాభ్యాం స్థితాభ్యాం విజయే మమ,
న దుర్లభం కురుశ్రేష్ఠ దేవరాజ్యమపి ధ్రువమ్. 14

---

11. తత్త్వేన-వంచన లేకుండ;

నా గెలుపునకై పురుషవరేణ్యులగు మీ యిరువురు నుండగా నా కేమి కొరత? దేవతల రాజ్యమైనను దుర్లభము కాదు. ఇది నిజము.

రథసంఖ్యాం తు కార్త్స్న్యేన పరేషామాత్మన స్తథా,
తథైవాతిరథానాం చ వేత్తుమిచ్ఛామి కౌరవ. 15

పగవారిలో, మనలో ఉన్న రథులు, అతిరథులు ఎవ్వ రెట్టివారో సంపూర్ణముగా ఎరుగగోరుచున్నాను.

పితామహో హి కుశలః పరేషా మాత్మన స్తథా,
శ్రోతు మిచ్ఛా మ్యహం సర్వైః సహైభి ర్వసుధాధిపైః. 16

పరులకు, నాకు సంబంధించినవారి శక్తిసామర్థ్యములను లెక్కగట్టుటలో తాతకు మంచి నేర్పుగలదు. కావున ఈ రాజు లందరితోపాటు నేను దానిని విన గోరుదును.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

గాన్ధారే శృణు రాజేన్ద్ర రథసంఖ్యాం స్వకే బలే,
యే రథాః పృథివీపాల తథైవాతిరథాశ్చ యే. 17

రాజేంద్రా! గాంధారీతనయా! మన బలమున రథు లెవ్వరో, అతిరథు లెవ్వరో - ఆ లెక్క చెప్పెదను. వినుము.

బహూ నీహ సహస్రాణి ప్రయుతా న్యర్బుదాని చ,
రథానాం తవ సేనాయాం యథాముఖ్యం తు మే శృణు. 18

నీ సేనలో రథులు వేలు, పదిలక్షలు, పదికోట్లు-అను లెక్కలో ఉన్నారు. వారిలో ముఖ్యులను మాత్రము చెప్పుదును. ఆలకింపుము.

---

15. తు - భయము లేదు కాని; రథసంఖ్యామ్-యుద్ధమున ఒక ప్రత్యేకమగు సామర్థ్యము గలవానిని 'రథుడు' అందురు - అట్టివారి పరిగణనను; కార్త్స్న్యేన - ఏమియు మిగులకుండ - మొత్తముగా;

18. అర్బుదాని - పెద్దసంఖ్యలో అని తాత్పర్యము - అర్బుదమనగా - పది కోట్లు; ప్రయుతాని - పది లక్షలు;

భవా నగ్రే రథోదారః సహ సర్వైః సహోదరైః,
దుఃశాసనప్రభృతిభి ర్భ్రాతృభిః శతసంమితైః. 19

నీవు గొప్ప రథులలో ముందు లెక్కింపదగినవాడవు. అట్లే నీ తమ్ములు దుశ్శాసనుడు మొదలగు నూరుమందియు గొప్ప రథులు.

సర్వే కృతప్రహరణా శ్ఛేదభేదవిశారదాః,
రథోపస్థే గజస్కన్ధే గదాప్రాసాసిచర్మణి. 20

మీరందరు అస్త్రవిద్యలో ఆరితేరినవారు. శత్రుసేనలను చీల్చుటలో, పగులగొట్టుటలో నేర్పరులు. రథమునం దుండియు, ఏనుగులపై నెక్కియు పోరు నేర్పుగలవారు. గద, బల్లెము, కత్తి యనువానియందు నిపుణులు.

సంయన్తారః ప్రహర్తారః కృతాస్త్రా భారసాధనాః,
ఇష్వస్త్రే ద్రోణశిష్యాశ్చ కృపస్య చ శరద్వతః. 21

మీరు పరుల దెబ్బలను తట్టుకొనగలవారు. పరులను దెబ్బకొట్టగలవారు. అస్త్రవిద్యలో నిపుణులు. బరువైన పనులు సాధింపగలవారు. ఆయుధవిద్యలో ద్రోణునకు, శరద్వంతుని కుమారుడగు కృపునకు శిష్యులు.

ఏతే హనిష్యన్తి రణే పఞ్చాలాన్ యుద్ధదుర్మదాన్,
కృతకిల్బిషాః పాణ్డవేయై ర్ధార్తరాష్ట్రా మనస్వినః. 22

ఈ ధృతరాష్ట్రకుమారు లందరు అహంకారము కలవారు. పాండవులు ఉడుకెక్కింపగా, యుద్ధమున పిచ్చి ఆవేశము గల పాంచాలురను రూపుమాపుదురు.

తథాఽహం భరతశ్రేష్ఠ సర్వసేనాపతి స్తవ,
శత్రూన్ విధ్వంసయిష్యామి కదర్థీకృత్య పాణ్డవాన్. 23

---

20. కృతప్రహరణాః - అస్త్రవిద్యను చక్కగా నేర్చినవారు.
22. కృతకిల్బిషాః - కిల్బిషశబ్దమునకు 'రోగము' అనియు నర్థము కలదు. పాండవులచేత ఉడుకు పొందినవారై అని తాత్పర్యము. మనస్వినః - అహంకారము కలవారు;
23. కదర్థీకృత్య - కష్టములపాలు చేసి;

భరతశ్రేష్ఠా! నీ సర్వసేనాపతి నగు నేనును అట్టివాడనే. పాండవులను ముప్పతిప్పలు పెట్టి పగవారిని పరిమార్తును.

న త్వాత్మనో గుణాన్ వక్తు మర్హామి విదితోఽస్మి తే.

నా గుణములు నేను చెప్పుకొనరాదు నే నెట్టివాడనో నీ వెరుగుదువు.

కృతవర్మా త్వతిరథో భోజః శస్త్రభృతాం వరః,
అర్థసిద్ధిం తవ రణే కరిష్యతి న సంశయః. 24

భోజవంశమువాడు కృతవర్మ యన్నవో అతిరథుడు. ఆయుధము పట్టినవారిలో అగ్రేసరుడు. ఆతడు నీకు యుద్ధమున కార్యసిద్ధి తప్పక కలిగించును.

శస్త్రవిద్భి రనాధృష్యో దూరపాతీ దృఢాయుధః,
హనిష్యతి చమూం తేషాం మహేన్ద్రో దానవానివ. 52

ఆయుధములలో ఆరితేరినవారికిని ఆతడు లొంగడు. దూరమున నున్న లక్ష్యమును గూడ పడవేయును. గట్టి ఆయుధములు గలవాడు. అట్టి కృతవర్మ మహేంద్రుడు దానవులను వలె వారి సేనను నాశనము చేయును.

మద్రరాజో మహేష్వాసః శల్యో మేఽతిరథో మతః,
స్పర్ధతే వాసుదేవేన నిత్యం యో వై రణే రణే. 26

మద్రరాజు శల్యుడు పెనువిల్లు గలవాడు. అత డతిరథుడని నా భావము. ప్రతియుద్ధమునందు నాత డెల్లవేళల వాసుదేవునితో పోటీపడుచుండును.

భాగినేయా న్నిజాం స్త్యక్త్వా శల్య స్తేఽతిరథో మతః,
ఏష యోత్స్యతి సంగ్రామే పాణ్డవాంశ్చ మహారథాన్. 27
సాగరోర్మిసమై ర్బాణైః ప్లావయన్నివ శాత్రవాన్.

అతిరథుడగు ఆ శల్యుడు తన మేనల్లుండ్రను గూడ వదలి నీ కిష్టుడాయెను. ఆతడు యుద్ధమున సముద్రతరంగముల వంటి బాణములతో శత్రువులను ముంచి యెత్తుచు మహారథులగు పాండవులతో పోరాడును.

---

25. అతిరథః - రథికంటె మించినవాడు; అర్థసిద్ధిమ్ - ప్రయోజనసిద్ధిని;

భూరిశ్రవాః కృతాస్త్రశ్చ తవ చాపి హితః సుహృత్. 28
సౌమదత్తి ర్మహేష్వాసో రథయూథపయూథపః,
బలక్షయ మమిత్రాణాం సుమహాన్తం కరిష్యతి. 29

అస్త్రములు చక్కగా నేర్చిన సోమదత్తుని కొడుకు భూరిశ్రవుడును నీ మేలుకోరు చెలికాడు. గొప్ప ధనువు కలవాడు. రథముల వరుసల నాయకుల గుంపునకు నాయకుడు పగవారి సేనను పెద్ద యెత్తున రూపుమాపును.

సిన్ధురాజో మహారాజ మతో మే ద్విగుణో రథః,
యోత్స్యతే సమరే రాజన్ విక్రాన్తో రథసత్తమః. 30

సింధురాజు ఇద్దరు రథులకు సమానుడు. పరాక్రమముతో పోరగలడు.

ద్రౌపదీహరణే రాజన్ పరిక్లిష్టశ్చ పాణ్డవైః,
సంస్మరం స్తం పరిక్లేశం యోత్స్యతే పరవీరహా. 31

రాజా! ద్రౌపది నెత్తుకొని పోయినపు డీతడు పాండవులవలన పడరాని పాట్లు పడెను. ఆ పాటును తలచుకొనుచు పగవారిని పరిమార్చుచు పోరును.

ఏతేన హి తదా రాజం స్తప ఆస్థాయ దారుణమ్,
సుదుర్లభో వరో లబ్ధః పాణ్డవాన్ యోద్ధు మాహవే. 32

ఈతడు అపుడు మహాభయంకరమగు తపము చేసి పాండవులతో పోరగల శక్తికై పొందరాని వరము పొందెను.

స ఏష రథశార్దూల స్తద్వైరం సంస్మరన్ రణే,
యోత్స్యతే పాణ్డవై స్తాత ప్రాణాం స్త్యక్త్వా సుదు స్త్యజాన్. 34

నాయనా! ఈ రథవరుడు ఆ పగను తలచుచు, వదలుటకు శక్యముకాని ప్రాణములనైనను వదలుటకు సిద్ధపడి పాండవులతో పోరును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
పఞ్చషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యానపర్వమున
నూటయరువదియైదవ అధ్యాయము.

—: ౦ :—

# షట్ షష్ట్యధికశతతమోఽధ్యాయః
# నూటయరువదియారవ అధ్యాయము

## కౌరవరథినాం పరిచయః.
## కౌరవరథుల పరిచయము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

సుదక్షిణస్తు కామ్బోజో రథ ఏకగుణో మతః,
తథార్థసిద్ధి మాకాఙ్క్షన్ యోత్స్యతే సమరే పరైః. 1

కాంబోజరాజగు సుదక్షిణుదు రథుడని నా అభిప్రాయము. అతడు కార్య సిద్ధి కావలయునను కోరికతో పగవారితో పోరును.

ఏతస్య రథసింహస్య తవార్థే రాజసత్తమ,
పరాక్రమం యథేన్ద్రస్య ద్రక్ష్యన్తి కురవో యుధి. 2

రాజవరా! నీ పనికై యింద్రునివలె విజృంభించు ఈ రథికవరేణ్యుని పరాక్రమమును కౌరవులు యుద్ధభూమిలో కాంతురు.

ఏతస్య రథవంశే హి తిగ్మవేగప్రహారిణః,
కామ్బోజానాం మహారాజ శలభానా మివాయతిః. 3

మహారాజా! మిక్కిలి వాడిగల ఆయుధములు గల యీతని రథముల సముదాయముపై కాంబోజుల రాక శలభముల రాక వంటిది.

నీలో మాహిష్మతీవాసీ నీలవర్మా రథస్తవ,
రథవంశేన కదనం శత్రూణాం వై కరిష్యతి. 4

మాహిష్మతి నివాసి, నల్లని కవచమువాడు, నీలుడు రథికుడు. ఆతడు నీకై తన రథముల సముదాయముతో కూడి శత్రువులతో కయ్యమాడును.

---

4. రథవంశేన - రథముల సముదాయముతో - కూడి అని కలుపుకొన వలయును.

కృతవైరః పురా చైవ సహదేవేన మారిష,
యోత్స్యతే సతతం రాజం స్త్వార్థే కురునన్దన. 5

నాయనా! మున్నే యీతడు సహదేవునితో పగ పెట్టుకొని యున్నాడు. కావున రాజా! నీకై యితడు యుద్ధమాడును.

విన్దానువిన్దా వావన్త్యౌ సంమతౌ రథసత్తమౌ,
కృతినౌ సమరే తాత దృఢవీర్యపరాక్రమౌ. 6

అవంతి రాజకుమారులు, యుద్ధమున ఫలసిద్ధి గలవారు, చెదరని శక్తియు, పరాక్రమము గలవారు, విందానువిందులు రథికవరులుగా ప్రసిద్ధి కెక్కిన వారు.

ఏతౌ తౌ పురుషవ్యాఘ్రౌ రిపుసైన్యం ప్రధక్ష్యతః,
గదాప్రాసాసినారాచై స్తోమరైశ్చ కరచ్యుతైః. 7

పులులవంటి యీ పురుషులు చేతుల నుండి దూసికొనివచ్చిన గదలతో, ఈటెలతో, కత్తులతో, బాణములతో, తోమరములతో పగవారి మూకను భస్మము గావింతురు.

యుద్ధాభికామౌ సమరే క్రీడన్తా విప యూథపౌ,
యూథమధ్యే మహారాజ విచరన్తౌ కృతాన్తవత్. 8

ఈ రాజకుమారు లిరువురు కోరి కోరి పోరున కరుగుదురు. యుద్ధభూమిలో ఏనుగుమందల నాయకులవలె ఆటలాడినట్లు పోరుదురు. సేనలనడుమ యములో అన్నట్లు విచ్చలవిడిగా విహరింతురు.

త్రిగర్తా భ్రాతరః పఞ్చ రథోదారా మతా మమ,
కృతవైరాశ్చ పార్థై స్తే విరాటనగరే తదా. 9

ఇదిగో యీ త్రిగర్తసోదరు లైదుగురు ఉత్తమరథికులని నా అభిప్రాయము. వీ రప్పుడు విరాటనగరమున కుంతికొడుకులతో పగ పెట్టుకొన్నవారు గదా।

మకరా ఇవ రాజేన్ద్ర సముద్ధతతరఙ్గిణీమ్.
గఙ్గాం విక్షోభయిష్యన్తి పార్థానాం యుధి వాహినీమ్. 10

రాజేంద్రా! పొంగి పొరలుచున్న గంగను పెనుమొసళ్ళవలె వీరు పోరున పాండవులసేనను అతలాకుతలము చేయుదురు.

తే రథాః పఞ్చ రాజేన్ద్ర యేషాం సత్యరథో ముఖమ్,
ఏతే యోత్స్యన్తి సఙ్గ్రామే సంస్మరన్తః పురాకృతమ్. 11

ఆ రథికు లైదుగురు. వారిలో మొదటివాడు సత్యరథుడు. వీరందరు మునుపటి అవమానమును తలపునకు తెచ్చుకొనుచు యుద్ధ మాడుదురు.

వ్యలీకం పాణ్డవేయేన భీమసేనానుజేన హ,
దిశో విజయతా రాజన్ శ్వేతవాహేన భారత. 12

ఆ పాండుకుమారుడు, భీమసేనుని తమ్ముడు, తెలిగుఱ్ఱములవాడు, దిక్కులను జయించునపుడు వీరికి ద్రోహము చేసెను. అది తలచుచు పోరుదురు.

తే హనిష్యన్తి పార్థానాం తానాసాద్య మహారథాన్,
వరాన్ వరాన్ మహేష్వాసాన్ క్షత్రియాణాం ధురన్ధరాన్. 13

వారు పాండవులవారగు మహారథులను క్షత్రియులలో మొనగాండ్రను గొప్ప విలుకాండ్రను మేలైనవారిని ఏరి ఏరి చంపుదురు.

లక్ష్మణ స్తవ పుత్రశ్చ తథా దుఃశాసనస్య చ,
ఉభౌ తౌ పురుషవ్యాఘ్రౌ సఙ్గ్రామే ష్వపలాయినౌ. 14

నీ కొడుకు లక్ష్మణుడును దుశ్శాసనుని కుమారుడును ఇరువురును పురుష శ్రేష్ఠులు. యుద్ధములలో వెన్ను చూపనివారు.

తరుణౌ సుకుమారౌ చ రాజపుత్రౌ తరస్వినౌ,
యుద్ధానాం చ విశేషజ్ఞౌ ప్రణేతారౌ చ సర్వశః. 15

ఈ రాజపుత్రులు మంచివయసులో ఉన్నవారు. సుకుమారులు, వడి గలవారు, యుద్ధములలో మెలకువ లెరిగినవారు. సేనలను అన్నివిధముల నడుప గలవారు.

రథౌ తౌ కురుశార్దూల మతౌ మే రథసత్తమౌ,
క్షత్రధర్మరతౌ వీరౌ మహత్ కర్మ కరిష్యతః. 16

కురువరా! వీ రిరువురు రథికవరు లని నా లెక్క. క్షత్రధర్మమున ప్రీతి గల వీరులు. ఘనకార్యము చేయగలవారు.

---

12. వ్యలీకమ్ - అప్రియము.

దణ్డధారో మహారాజ రథ ఏకో నరర్షభ,
యోత్స్యతే తవ సఙ్గ్రామే స్వేన సైన్యేన పాలితః. 17

రాజా! ఈ దండధారు డొక రథికుడు. తన సైన్యము తన్ను పాలించు చుండగా యుద్ధమున నీకై పోరును.

బృహద్బల స్తథా రాజా కౌసల్యో రథసత్తమః,
రథో మమ మత స్తాత మహావేగపరాక్రమః. 18

కోసలరాజగు బృహద్బలు డొక రథుడు. అతనిది తీవ్రమైన పరాక్రమము.

ఏష యోత్స్యతి సఙ్గ్రామే స్వాన్ బన్ధూన్ సంప్రహర్షయన్,
ఉగ్రాయుధో మహేష్వాసో ధార్తరాష్ట్రహితే రతః. 19

ఈతడు భయంకరమైన ఆయుధములను, పెద్ద వింటిని చేపట్టి ధృతరాష్ట్రుని కొడుకుల మేలే తనకు ప్రియకార్యము కాగా తన చుట్టముల నుప్పొంగ జేయుచు పోరును.

కృపః శారద్వతో రాజన్ రథయూథపయూథపః,
ప్రియాన్ ప్రాణాన్ పరిత్యజ్య ప్రధక్ష్యతి రిపూం స్తవ. 20

శరద్వంతుని కొడుకగు కృపుడు రథనాయకుల నాయకుడు. ప్రియమైన ప్రాణములను కూడ లెక్కచేయక నీ పగవారిని కాల్చి వైచును.

గౌతమస్య మహర్షేర్య ఆచార్యస్య శరద్వతః,
కార్తికేయ ఇవాజేయః శర స్తంబా త్సుతోఽభవత్. 2

ఈతడు గౌతమగోత్రమువాడు, మహర్షి, ఆచార్యుడు నగు శరద్వంతునకు రెల్లుకాదనుండి కుమారస్వామివలె గెలువరానివాడై పుట్టెను.

ఏష సేనాః సుబహులా వివిధాయుధకార్ముకాః,
అగ్నివత్సమరే తాత చరిష్యతి వినిర్దహన్. 22

పెక్కు విధములగు ఆయుధములను, విండ్లను పట్టిన లెక్కలేని సేనలను ఈతడు అగ్నివలె మాడ్చివేయుచు వీరవిహారము చేయును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
షట్షష్ట్యధిక శతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యానపర్వమున
నూటయరువదియారవ అధ్యాయము.

—: o :—

# సప్తషష్ట్యధికశతతమోఽధ్యాయః
# నూటయరువదియేడవ అధ్యాయము

**కౌరవపక్షీయ రథిమహారథ్యతిరథినాం వర్ణనమ్.**

**కౌరవపక్షమువారగు రథులను, మహారథులను, అతిరథులను వర్ణించుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

శకుని ర్మాతులస్తేఽసౌ రథ ఏకో నరాధిప,
ప్రయుజ్య పాణ్డవై ర్వైరం యోత్స్యతే నాత్ర సంశయః. 1

రాజా ! నీ మేనమామ యీ శకుని ఒక రథుడు. పాండవులతో పగగొని పోరును. ఇందు సందియము లేదు.

ఏతస్య సేనా దుర్ధర్షా సమరే ప్రతియాయినః,
వికృతాయుధభూయిష్ఠా వాయువేగసమా జవే. 2

పలువిధములగు ఆయుధములతో నిండినదియు, వాయువేగము వంటి వేగము గలదియు నగు ఈతని సేన ఎదురుపోరువారికి లొంగదీసికొనరానిది.

ద్రోణపుత్రో మహేష్వాసః సర్వానే వాతిధన్వినః,
సమరే చిత్రయోధీ చ దృఢాస్త్రశ్చ మహారథః. 3

ద్రోణుని కొడుకు అశ్వత్థామ గొప్ప ధనుర్ధరుడు. మహాధానుష్కుల నందరిని మించువాడు. అచ్చెరువుగొలుపునట్లు పోరువాడు. చెక్కుచెదరని అస్త్రవిద్య కలవాడు. మహారథుడు.

ఏతస్య హి మహారాజ యథా గాణ్డీవధన్వనః,
శరాసనవినిర్ముక్తాః సంసక్తా యాన్తి సాయకాః. 4

---

2. వికృత, ఆయుధభూయిష్ఠాః - అనేకవిధములగు ఆయుధములతో నిండినది.

గాండీవము దాల్చిన అర్జునుని బాణమువంటి యీతని వింటినుండి వెలువడెడు బాణములు కూడ ఒకదాని కొకటి తగులుకొని వచ్చిపడుచుండును.

నైష శక్యో మయా వీరః సంఖ్యాతుం రథసత్తమః,
నిర్దహేదపి లోకాంస్త్రీ నిచ్ఛన్నేష మహారథః. 5

ఈ రథసత్తము డింతవాడని నేను లెక్కకట్టుటకును జాలను. ఈ మహారథుడు సంకల్పించినచో మూడు లోకములను గాల్చివేయును.

క్రోధ స్తేజశ్చ తపసా సంభృతో౽౽శ్రమవాసినామ్,
ద్రోణే నానుగృహీతశ్చ దివ్యై రస్త్రై రుదారధీః. 6

ఈతడు తపస్సు చేసికొను ఆశ్రమవాసుల క్రోధము, తేజము ముద్దకట్టి నట్టివాడు. తపస్సంపదతో నిండినవాడు. దొడ్డబుద్ధికల యీతనికి ద్రోణుడు దివ్యములగు అస్త్రముల ననుగ్రహించెను.

దోష స్త్వస్య మహా నేకో యేనైవ భరతర్షభ,
న మే రథో నాతిరథో మతః పార్థివసత్తమ. 7

రాజసత్తమా! ఈతనితో ఒక్క దోషము కలదు. దానితో ఈతడు రథుడని గాని, అతిరథుడని కాని నేను భావింపజాలను.

జీవితం ప్రియ మత్యర్థ మాయుష్కామః సదా ద్విజః,
న హ్యస్య సదృశః కశ్చి దుభయోః సేనయోరపి. 8

ఈతనికి బ్రదుకన్న మిక్కిలి ప్రియము. ఈ బాప డెల్లప్పుడు ఆయువును కోరుచుండును. (ఈ దోషము లేనిచో) ఈ రెండు సేనలలో ఈతని కీడైన వాడు లేడు.

---

6. ఆశ్రమవాసినామ్ - ఋషులయొక్క; క్రోధః, తేజశ్చ - క్రోధము, తేజము అయినవాడు - మహర్షుల క్రోధము తేజము ముద్దకట్టి యీతని స్వరూపముగా నయ్యెనని తాత్పర్యము; 'సంభృతో + ఆశ్రమ' అను చోట పూర్వరూపసంధి ఆర్షము.

హన్యా దేకరథేనైవ దేవానా మపి వాహినీమ్,
వపుష్మాం స్తలఘోషేణ స్ఫోటయే దపి పర్వతాన్. 9

ఒక్క రథముతో నీతడు దేవతల సేననుకూడ రూపుమాపగలడు. పెను దేహముగల యీతడు అరచేతితో చరచి కొండలనుగూడ పిండిచేయగలడు.

అసంఖ్యేయగుణో వీరః ప్రహన్తా దారుణద్యుతిః,
దణ్డపాణి రివాసహ్యః కాలవత్ ప్రచరిష్యతి. 10

ఈ వీరుడు లెక్కపెట్టజాలని గుణములు కలవారు. గొప్ప పోటుగాడు. భయంకరమగు తేజము కలవాడు. దండముచేత ధరించిన యమునివలె సహింపరానివాడై వీరవిహారము చేయును.

యుగాన్తాగ్నిసమః క్రోధాత్ సింహగ్రీవో మహాద్యుతిః,
ఏష భారతయుద్ధస్య పృష్ఠం సంశమయిష్యతి. 11

సింహమువంటి మెడయు గొప్ప తేజమును గల యీతడు క్రోధము రేగినచో యుగాంతమునందలి అగ్నివంటివా డగును భారతయుద్ధమున నీతడు మిగులు లేకుండ జేయును.

పితా త్వస్య మహాతేజా వృద్ధోఽపి యువభి ర్వరః,
రణే కర్మ మహత్ కర్తా అత్ర మే నాస్తి సంశయః. 12

ఇక నీతని తండ్రియన్ననో మహాతేజస్వి. ముదుసలియే యయ్యు పడుచువారికంటె శ్రేష్ఠుడు. యుద్ధమున కడు దొడ్డపనులు చేయును. ఇందు నాకు సందియము లేదు.

అస్త్రవేగానిలోద్ధూతః సేనాకక్షేన్ధనోత్థితః,
పాణ్డుపుత్రస్య సైన్యాని ప్రధక్ష్యతి రణే ధృతః. 13

అస్త్రముల వేగమనెడు గాలికి పెల్లు రేగినవాడు, సేన అనెడు ఎండిన అడవికట్టెలచేత విజృంభించువాడు నగు ఈతడు నిలువద్రొక్కికొని పాండు కుమారుని సేనలను యుద్ధమున బూదిచేసి వేయును.

---

11. పృష్ఠమ్ - మిగులును; సంశమయిష్యతి—పూర్తిగా అణచి వేయును.
12. యువభిః- యువకులకంటె అని భావము.
13. కక్షా - ఎండిన యడవి

రథయూథపయూథానాం యూథపోఽయం నరర్షభః,
భారద్వాజాత్మజః కర్తా కర్మ తీవ్రం హితం తవ. 14

ఈ నరశ్రేష్ఠుడు రథముల సముదాయముల నాయకుల నాయకుల నాయకుడు. భారద్వాజగోత్రమువాడు. నీకు మేలైనపని యెంత తీవ్రమైనదైనను చేయగలడు.

సర్వమూర్ధాభిషిక్తానా మాచార్యః స్థవిరో గురుః,
గచ్ఛే దన్తం సృఞ్జయానాం ప్రియ స్త్వస్య ధనఞ్జయః. 15

ఈ వృద్ధుడు పట్టాభిషేకము పొందిన మహారాజు లందరకు ఆచార్యుడు, గురువు. సృంజయుల అంతము చూచును. కాని యీతనికి ధనంజయుడు ప్రియుడు.

నైష జాతు మహేష్వాసః పార్థ మక్లిష్టకారిణమ్,
హన్యా దాచార్యకం దీప్తం సంస్మృత్య గుణనిర్జితమ్. 16

దొడ్డ విల్లుగల యీ ద్రోణుడు గుణములతో సాధించిన ప్రసిద్ధమగు గురుత్వమును గుర్తుంచుకొని, నీచకార్యములు చేయని అర్జునుని ఎన్నటికిని చంపడు.

శ్లాఘతేఽయం సదా వీర పార్థస్య గుణవిస్తరైః,
పుత్రా దభ్యధికం చైనం భారద్వాజోఽనుపశ్యతి. 17

అర్జునుని గుణముల విరివికి పొంగిపోవు ఈ ద్రోణుడు ఎల్లవేళల నాతనిని కొనియాడుచుండును. అంతేకాదు. ఇతనిని కొడుకుకంటె మిన్నగా చూచును.

హన్యా దేకరథేనైవ దేవగన్ధర్వమానుషాన్,
ఏకీభూతా నపి రణే దివ్యై రస్త్రైః ప్రతాపవాన్. 18

గొప్ప ప్రతాపముగల యీతడు ఒక్కరథముతోడనే, దేవతలు, గంధర్వులు, మానవులు కట్టగట్టుకొని వచ్చినను దివ్యములగు అస్త్రములతో యుద్ధమున చంపగలడు.

---

16. ఆచార్యకమ్ - గురుత్వమును; దీప్తమ్ - ప్రసిద్ధమగు దానిని; గుణనిర్జితమ్ - గుణములతో సాధించిన దానిని.

పౌరవో రాజశార్దూల స్తవ రాజన్ మహారథః,
మతో మమ రథోదారః పరవీరరథారుజః. 19

రాజా! పౌరవుడను రాజవరేణ్యుడు మహారథుడు. ఉత్తమరథుడని నా అభిప్రాయము. శత్రువీరుల రథములను నుగ్గునూచ చేయును.

స్వేన సైన్యేన మహతా ప్రతపన్ శత్రువాహినీమ్,
ప్రధక్ష్యతి స పఞ్చాలాన్ కక్ష మగ్నిగతి ర్యథా. 20

తనదగు పెనుసేనతో శత్రుసేనను మంటబెట్టుచు నీతడు అగ్ని గడ్డిని కాల్చినట్లు పంచాలురను మాడ్చివేయగలడు.

సత్యశ్రవా రథ స్త్వేకో రాజపుత్రో బృహద్బలః,
తవ రాజన్ రిపుబలే కాలవత్ ప్రచరిష్యతి. 21

రాజపుత్రుడు నిజమైన కీర్తిగలవాడు అగు బృహద్బలుడు ఒక రథుడు. రాజా! నీ శత్రువుల సేనలో యమునివలె విహరించును.

ఏతస్య యోధా రాజేన్ద్ర విచిత్రకవచాయుధాః,
విచరిష్యన్తి సఙ్గ్రామే నిఘ్నన్తః శాత్రవాం స్తవ. 22

వీరి యోధులు విచిత్రములగు కవచములను, ఆయుధములను ధరించి నీ పగవారిని పరిమార్చుచు విహరింతురు.

వృషసేనో రథ స్తేఽగ్ర్యః కర్ణపుత్రో మహారథః,
ప్రధక్ష్యతి రిపూణాం తే బలం తు బలినాం వరః. 23

ఇదిగో ఈ వృషసేనుడు మన కర్ణుని కుమారుడు మహారథుడు. శ్రేష్ఠుడు. బలవంతులలో ఎన్నదగినవాడు. నీ శత్రువుల సేనను బూదిచేయును.

జలసన్ధో మహాతేజా రాజన్ రథవర స్తవ,
త్యక్ష్యతే సమరే ప్రాణాన్ మాధవః పరవీరహా. 24

మధువంశమువాడు, రథికులలో శ్రేష్ఠుడు, గొప్ప తేజస్సు గలవాడు, పగవారిని రూపుమాపువాడు నగు ఈ జలసంధుడు పోరున ప్రాణములనైన వదలును.

21. సత్యశ్రవాః - సత్యమగు కీర్తి గలవాడు.

ఏష యోత్స్యతి సఙ్గ్రామే గజస్కన్ధవిశారదః,
రథేన వా మహాబాహుః క్షపయన్ శత్రువాహినీమ్. 25

ఈత డేనుగునందును రథమందును ఉండి పోరుటలో దిట్ట. పగవారి బలమును తరుగజేయుచు పోరాడును.

రథ ఏష మహారాజ మతో మే రాజసత్తమ,
త్వదర్థే త్యక్ష్యతే ప్రాణాన్ సహసైన్యో మహారణే. 26

రాజసత్తమా! ఈత డొక రథు డని నా అభిప్రాయము. నీకై తన సైనికులతోపాటు మహాయుద్ధమున ప్రాణములనైన వదలును.

ఏష విక్రాన్తయోధీ చ చిత్రయోధీ చ సఙ్గరే,
వీతభీ శ్చాపి తే రాజన్ శత్రుభిః సహ యోత్స్యతే. 27

ఈతడు సాహసముతో పోరును. చిత్రములగు పద్ధతులతో పోరును. భయ మెరుగక నీ శత్రువులతో కయ్యమాడును.

బాహ్లీకోఽతిరథశ్చైవ సమరే చానివర్తనః,
మమ రాజ న్మతో యుద్ధే శూరో వైవస్వతోపమః. 28

ఈ బాహ్లీకుడు అతిరథుడు. యుద్ధమున వెనుదిరుగడు. మహాశూరుడు. పోరున యమునివంటివా డని నా అభిప్రాయము.

న హ్యేష సమరం ప్రాప్య నివర్తేత కథఞ్చన,
యథా సతతగో రాజన్ స హి హన్యాత్ పరాన్ రణే. 29

ఈతడు రణరంగమున చొచ్చి యెన్నటికిని వెనుకకు మరలడు. వాయువువలె ముందునకే దూసికొని పోవును. రణమున పరులను రాచి రంపాన బెట్టును.

సేనాపతి ర్మహారాజ సత్యవాంస్తే మహారథః,
రణే ష్వద్భుతకర్మా చ రథీ పరరథారుజః. 30

ఈ నీ సేనాపతి మాటపై నిలుచు మహారథుడు యుద్ధములలో అబ్బురము గొలుపు పనులు చేయును. పరుల రథములను తునకలు చేయును.

---

29. సతతగః - ఎల్లప్పుడు కదలువాడు - వాయువు.

ఏతస్య సమరం దృష్ట్వా న వ్యథాస్తి కథఞ్చన,
ఉత్స్మయ న్నుత్పత త్యేష పరాన్ రథపథస్థితాన్. 31

ఈతని యుద్ధము చూచి నీవు ఎన్నటికిని దిగులొందవు. ఉత్సాహపు పొంగుతో నీతడు రథమార్గమున నిలిచిన వారి తలలపై దుముకును.

ఏష చారిషు విక్రాన్తః కర్మ సత్పురుషోచితమ్,
కర్తా విమర్దే సుమహ త్త్వదర్థే పురుషోత్తమః. 32

ఈతడు శత్రువులపై దుముకుచు సత్పురుషులు చేయు మహాకార్యము నీకై చేయును. ఈతడు మహాపురుషుడు.

అలమ్బుషో రాక్షసేన్ద్రః క్రూరకర్మా మహారథః,
హనిష్యతి పరాన్ రాజన్ పూర్వవైర మనుస్మరన్. 33

ఈ రాక్షసరాజు అలంబుసుడు మహారథుడు. ఎంతటి క్రూరకర్మము నైన చేయగలడు. మునుపటి పగను స్మరించుచు నీ శత్రువులను రూపుమాపును.

ఏష రాక్షససైన్యానాం సర్వేషాం రథసత్తమః,
మాయావీ దృఢవైరశ్చ సమరే విచరిష్యతి. 34

ఈతడు రాక్షససేన లన్నింటికి నాయకుడు. మాయ లెరిగినవాడు, గట్టి పగ గలవాడు. యుద్ధమున నిరవిహారము చేయును.

ప్రాగ్జ్యోతిషాధిపో వీరో భగదత్తః ప్రతాపవాన్,
గజాఙ్కుశధరశ్రేష్ఠో రథే చైవ విశారదః. 35

ప్రాగ్జ్యోతిషదేశప్రభువు భగదత్తుడు గొప్ప ప్రతాపముగల వీరుడు. గజయుద్ధము చేయువారిలో శ్రేష్ఠుడు. రథమునందును ఆరితేరినవాడు.

ఏతేన యుద్ధ మభవత్ పురా గాణ్డీవధన్వనః,
దివసాన్ సుబహూన్ రాజ న్నుభయో ర్జయగృద్ధినోః. 36

35. గజ - అఙ్కుశ - ధర - శ్రేష్ఠః - ఏనుగుల నదలించు అంకుశములను పట్టువారిలో శ్రేష్ఠుడు. ఏనుగుపై నిలిచి యుద్ధము చేయువారిలో శ్రేష్ఠ డని తాత్పర్యము - గజాంకుశరూపము నొందిన నారాయణాస్త్ర విష యమున నేర్పుగలవా డనియు నర్థము.

మునుపు గాండీవికి ఈతనితో యుద్ధమాయెను. జయము కాంక్షించుచు వీరిరువురు పెక్కు దినములు పోరిరి.

తతః సఖాయం గాన్ధారే మానయన్ పాకశాసనమ్,
అకరోత్ సంవిదం తేన పాణ్డవేన మహాత్మనా. 37

కడకు, ఓ దుర్యోధనా ! తన మిత్రమగు దేవేంద్రుని మన్నించి యీతడు మహాత్ముడగు పాండవునితో చెలిమి చేసికొనెను.

ఏష యోత్స్యతి సఙ్గ్రామే గజస్కన్ధవిశారదః,
ఐరావతగజో రాజా దేవానామివ వాసవః. 38

దేవరాజగు వాసవు డైరావతగజము నెక్కిన ట్లీతడు గజయుద్ధమున నేర్పుగలవాడై పోరును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
సప్తషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథపరిగణనము
గల నూటఅరువదియేడవ అధ్యాయము.

—: ౦ :—

## అష్టషష్ట్యధిక శతతమోఽధ్యాయః
## నూటయరువదియెనిమిదవ అధ్యాయము

**కౌరవపక్షీయరథినా మతిరథినాం చ వర్ణనమ్, కర్ణభీష్మయోః సరోషసంవాదః, దుర్యోధనకర్తృకం తయో ర్వివాదస్య నివారణమ్.**

**కౌరవపక్షములోని రథులను, అతిరథులను వర్ణించుట, కర్ణభీష్ములు కోపోద్రేకముతో వివాదపడుట, దుర్యోధనుడు వారి వివాదమును నివారించుట.**

భీష్మ ఉవాచ - భీష్ముడు పలికెను.

అచలో వృషకశ్చైవ సహితౌ భ్రాతరా వుభౌ,
రథౌ తవ దురాధర్షౌ శత్రూన్ విధ్వంసయిష్యతః. 1

అచలుడు, వృషకుడు అను అన్నదమ్ము లిరువురు రథులు. పరులకు లొంగనివారు. నీ శత్రువులను నాశము చేయుదురు.

బలవన్తౌ నరవ్యాఘ్రౌ దృఢక్రోధౌ ప్రహారిణౌ,
గాన్ధారముఖ్యౌ తరుణౌ దర్శనీయౌ మహాబలౌ. 2

వీ రిరువురు, గొప్పబలము కలవారు, చెదరని క్రోధము గలవారు, గొప్ప ఆయుధములు గలవారు, గాంధారులలో శ్రేష్ఠులు, చిన్నవారు, చూడముచ్చట అయినవారు.

సఖా తే దయితో నిత్యం య ఏష రణకర్కశః,
ఉత్సాహయతి రాజం స్త్వాం విగ్రహే పాణ్డవైః సహ. 3
పరుషః కత్థనో నీచః కర్ణో వైకర్తన స్తవ,
మన్త్రీ నేతా చ బన్ధుశ్చ మానీ చాత్యన్త ముచ్ఛ్రితః. 4

---

4. వైకర్తనః - వికర్తను డనగా సూర్యుడు. అతని కొడుకు; ఉచ్ఛ్రితః- మిడిసిపడుచుండువాడు;

5. విచేతనః - మూర్ఖుడు.

ఇదిగో నీకు మిక్కిలి ప్రియమైన చెలికాడు - రణములందు క్రూరుడు, నిత్యము పాండవులతోడి పగకు నిన్ను పురికొల్పుచుండును. కరకుమనిసి, తన్ను తా బొగడుకొనుచుండును నీకు మంత్రి, నాయకుడు, చుట్టము, పొగరు బోతు. ఎక్కువగా మిడిసిపడువాడు అగు సూర్యకుమారుడగు కర్ణుడు.

ఏష నైవ రథః కర్ణో న చాప్యతిరథో రణే,
వియుక్తః కవచేనైష సహజేన విచేతనః. 5

ఈతడు రథుడే కాడు. అతిరథుడును కానే కాడు ఏలయన ఈ మూర్ఖుడు సహజమైన కవచమును పోగొట్టుకొనెను.

కుణ్డలాభ్యాం చ దివ్యాభ్యాం వియుక్తః సతతం ఘృణీ,
అభిశాపాచ్చ రామస్య బ్రాహ్మణస్య చ భాషణాత్. 6
కరణానాం వియోగాచ్చ తేన మేఽర్ధరథో మతః,
నైష ఫాల్గున మాసాద్య పునర్జీవన్ విమోక్ష్యతే. 7

దేవలోకపు కుండలములుకూడ కోల్పోయెను. ఎల్లప్పుడు ఇతరులను తిట్టుచుండును. పరశురాముని శాపము, బ్రాహ్మణుని తిట్టు, సాధనములు కోల్పోవుట అనువానివలన ఈతడు అర్ధరథు డయ్యెనని నా అభిప్రాయము. అర్జునునితో తలపడి యీతడు బ్రదికి బయటపడడు.

తతోఽబ్రవీత్ పున ర్ద్రోణః సర్వశస్త్రభృతాం వరః,
ఏవ మేత ద్యథాత్థ త్వం న మిథ్యాస్తి కదాచన. 8

అంత శస్త్రధారు లందరిలో శ్రేష్ఠుడగు ద్రోణు డందుకొని నీవు పలికినది సత్యమే. ఈ మాట యెన్నటికిని పొల్లుకాదు.

రణే రణేఽభిమానీ చ విముఖశ్చాపి దృశ్యతే,
ఘృణీ కర్ణః ప్రమాదీ చ తేన మేఽర్ధరథో మతః. 9

కయ్య మన్నచో పొంగిపోవును. కాని సమయమునకు మొగము చాటు వేయును. కారులు కూయుచుండును. ప్రమాదపడుచుండును. అందువలన అర్ధ రథు డనియే నా అభిప్రాయము.

---

7. కరణానామ్ - మహాసాధనములగు సహజకవచాదుల;
9. ప్రమాదీ - తాను చేయుదునన్న విషయమును మరచువాడు.

ఏతచ్ఛ్రుత్వా తు రాధేయః క్రోధా దుత్ఫాల్య లోచనే,
ఉవాచ భీష్మం రాధేయ స్తుదన్ వాగ్భిః ప్రతోదవత్. 10

ఇది విని రాధేయుడు క్రోధముతో గ్రుడ్లురిమి చూచి భీష్ముని మాటలను కోలలతో నొప్పించుచు ఇట్లు పలికెను.

పితామహ యథేష్టం మాం వాక్శరై రుపకృన్తసి,
అనాగసం సదా ద్వేషా దేవమేవ పదే పదే. 11

తాతా! ఏ పాప మెరుగని నన్ను మాటిమాటికి ద్వేషముతో పలుకుల ములుకులతో ఇచ్చివచ్చినట్లు గ్రుచ్చుచున్నావు.

మర్షయామి చ తత్ సర్వం దుర్యోధనకృతేన వై,
త్వం తు మాం మన్యసే మన్దం యథా కాపురుషం తథా. 12

దుర్యోధనుని మొగము చూచి నే నది యంతయు సహించుచున్నాను నీ వేమో నన్నొక బుద్ధిహీనునిగా నీచునిగా లెక్కగట్టుచున్నావు.

భవా నర్ధరథో మహ్యం మతో వై నాత్ర సంశయః,
సర్వస్య జగత శ్చైవ గాఙ్గేయో న మృషా వదేత్. 13

నన్ను నీ వర్ధరథు డంటివి. గంగకొడుకు పలికినది అసత్యము కాదని లోక మెల్ల నమ్మును.

కురూణా మహితో నిత్యం న చ రాజాఽవబుధ్యతే.

నీ వెల్లవేళల కౌరవులకు ద్రోహమే చేయుచున్నావు. ఈ రాజిది యెరుగకున్నాడు.

కో హి నామ సమానేషు రాజసూదారకర్మసు, 14
తేజోవధ మిమం కుర్యా ద్విభేదయిషు రాహవే,
యథా త్వం గుణవిద్వేషా దపరాగం చికీర్షసి. 15

---

13. 'నీవు కర్ణు డర్ధరథు డని నా అభిప్రాయ మంటివి. లోక మెల్ల నీమాట తప్పక నమ్మును. అట్టి నీమాటను బట్టి అందరు నన్నవమానింతురుగదా!' అని కర్ణుని వేదన.

15. విభేదయిషుః - భేదము పుట్టింపగోరినవాడై; అపరాగమ్ - ద్వేషమును.

గొప్ప కార్యములు చేయునట్టి సాటి రాజుల విషయమున నిట్లు పరువు తీయు పని నెవ్వడు చేయును? యుద్ధసమయమున భేదము పుట్టింపగోరినవాడవై నీవు గుణములను కక్కసించుకొనుచు ద్వేషము కూర్ప నెంచుచున్నాడవు.

న హాయనైర్న పలితైర్న విత్తైర్న చ బన్ధుభిః,
మహారథత్వం సంఖ్యాతుం శక్యం క్షత్రస్య కౌరవ. 16

ఓయి కౌరవా! ఏండ్లు, తెల్లబడిన కేశములు, ధనములు, బంధువులు - వీనితో క్షత్రియుని మహారథత్వమును లెక్కింప నలవి కాదు.

బలజ్యేష్ఠం స్మృతం క్షత్రం మన్త్రజ్యేష్ఠా ద్విజాతయః,
ధనజ్యేష్ఠాః స్మృతా వైశ్యాః శూద్రాస్తు వయసాధికాః. 17

క్షత్రజాతిలో పెద్దతనమును బలమునుబట్టి నిర్ణయింతురు. బ్రాహ్మణులు మంత్రములతో పెద్దలగుదురు. వైశ్యులు ధనమునుబట్టియు, శూద్రులు వయస్సును బట్టియు పెద్దలుగా భావింపబడుదురు.

యథేచ్ఛకం స్వయం బ్రూయా రథా నతిరథాం స్తథా,
కామద్వేషసమాయుక్తో మోహాత్ ప్రకురుతే భవాన్. 18

కొందరిపై రాగము, మరికొందరిపై ద్వేషము పెట్టుకొని నీ యిచ్చ వచ్చినట్లు స్వయముగా వీరు రథులు, వీ రతిరథులు అని పలుకుచున్నావు. ఒడలెరుగక వీరిలో వీరికి తగవు పెట్టుచున్నావు.

దుర్యోధన మహాబాహో సాధు సమ్య గవేక్ష్యతామ్,
త్యజ్యతాం దుష్టభావోఽయం భీష్మః కిల్బిషకృత్ తవ. 19

ఓయి మహాబాహూ! దుర్యోధనా! చక్కగా మేలైనదానిని పరికింపుము. దుష్టబుద్ధియు నీకు ద్రోహము చేయువాడు నగు ఈ భీష్ముని వదలివేయుము.

భిన్నా హి సేనా నృపతే దుఃసన్ధేయా భవత్యుత,
మౌలా హి పురుషవ్యాఘ్ర కిము నానాసముత్థితాః. 20

---

18. ప్రకురుతే - ప్రకారమును - భేదమును పుట్టించుచున్నాడు. "ప్రకార స్తుల్యభేదయోః" అని విశ్వలోకము.

20. మౌలా-తండ్రితాతల తరముగా వచ్చిన మూలబలము; నానాసముత్థితాః- వేరువేరుగా ఒక పనికై వచ్చి చేరిన సేనలు;

మూలబలముకూడ ముక్కలైనచో అతుకుట కష్టము. ఇక వేర్వేరుతీరుల వారు ఒక పనికై వచ్చి భేదము పొందినచో చెప్పనేల?

ఏషాం ద్వైధం సముత్పన్నం యోధానాం యుధి భారత,
తేజోవధో నః క్రియతే ప్రత్యక్షేణ విశేషతః. 21

ఇదిగో యీ యోధులలో భేదము పుట్టినది. అందరి యెదుట మా పౌరుషము నీతడు చంపివైచెను.

రథానాం క్వ చ విజ్ఞానం క్వ చ భీష్మో ఒల్పచేతనః,
అహ మావారయిష్యామి పాణ్డవానా మనీకినీమ్. 22

రథులను గూర్చి విజ్ఞాన మెక్కడ? ఈ అల్పబుద్ధి యగు భీష్మ డెక్కడ? పాండవసేనను నే నొక్కడనే నిలువరింపగలను.

ఆసాద్య మా మమోఘేషుం గమిష్యన్తి దిశో దశ,
పాణ్డవాః సహ పఞ్చాలాః శార్దూలం వృషభా ఇవ. 23

మొక్కవోని బాణములు గల నన్ను చేరవచ్చి పాండవులు పాంచాలురతో పాటు పులిని గన్న యెద్దులవలె పదిదిక్కులకు పరువు లిడుదురు.

క్వ చ యుద్ధం విమర్దో వా మన్త్రి సువ్యాహృతాని చ,
క్వ చ భీష్మో గతవయా మన్దాత్మా కాలచోదితః. 24

యుద్ధ మెక్కడ? యుద్ధమున రాపిడి యెక్కడ? మంత్రములో మంచి మాట లెక్కడ? వయసు మళ్ళిన భీష్మ డెక్కడ? ఈతడు బుద్ధిహీనుడు, కాలము మూడినవాడు.

ఏకాకీ స్పర్ధతే నిత్యం సర్వేణ జగతా సహ,
న చాన్యం పురుషం కఞ్చి న్మన్యతే మోఘదర్శనః. 25

ఒంటివాడగు నీతడు మొత్తము జగత్తుతో పోటీపడుచుండును. చెడిన చూపుగల యితనికి మరయొక డెవ్వడు మగవాడుగా తోచడు.

---

21. ద్వైధమ్ - భేదము - ఒకరి కొకరు పగ వారగుట.

24. యుద్ధవిషయమున వృద్ధుడు, ఆలోచన విషయమున మూర్ఖుడు, శక్తిహీనుడు కనుక బుద్ధిహీనుడు అగు భీష్ముడు అయోగ్యు డని కర్ణుని తాత్పర్యము.

శ్రోతవ్యం ఖలు వృద్ధానా మితి శాస్త్రనిదర్శనమ్,
న త్వేవ హ్యతివృద్ధానాం పున ర్బాలా హి తే మతాః. 26

పెద్దలమాట వినదగునని శాస్త్రమర్యాద. కాని మిక్కిలి వృద్ధుల మాట వినినే రాదు. ఏలయన వారు బాలురనియే లోకము భావన.

అహ మేకో హనిష్యామి పాణ్డవానా మనీకినీమ్,
సుయుద్ధే రాజశార్దూల యశో భీష్మం గమిష్యతి. 27

పాండవసేన నంతటిని నేనొక్కడనే సరియగు యుద్ధమున రూపుమాపుదును. కాని కీర్తి యీ భీష్మునకు దక్కును.

కృత స్సేనాపతి స్త్వేష త్వయా భీష్మో నరాధిప,
సేనాపతౌ యశో గన్తా న తు యోధాన్ కథఞ్చన. 28

రాజా! నీ వీ భీష్ముని సేనాపతిని చేసితివి. కీర్తి సేనాపతికే దక్కును కాని యోధుల కెన్నటికిని దక్కదు.

నాహం జీవతి గాఙ్గేయే యోత్స్యే రాజన్ కథఞ్చన,
హతే భీష్మే తు యోద్ధాఽస్మి సర్వై రేవ మహారథైః. 29

ఈ భీష్ముడు బ్రదికియుండగా నేను యుద్ధమాడను. ఈతడు చచ్చిన వెనుక మహారథు లందరితో పోరుదును.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

సముద్యతోఽయం భారో మే సుమహాన్ సాగరోపమః,
ధార్తరాష్ట్రస్య సఙ్గ్రామే వర్షపూగాభిచిన్తితః. 30

దుర్యోధనుని యుద్ధమునకు సంబంధించి పెక్కేండ్లు చక్కగా ఆలోచితమైన గొప్ప బరువు, పెనుసముద్ర మంతటిది, నా నెత్తి కెత్తబడినది.

---

26. మిక్కిలిగా వయసు మళ్ళినవారు బాలురవంటివారే అని నా అభిప్రాయము. ఈ భీష్మ డట్టివాడని కర్ణుని తాత్పర్యము.

28. చంపువాడవు నీవు కాగా యశము భీష్మున కెట్లు దక్కునన్న ప్రశ్నకు సమాధానముగా ఈ శ్లోకము చెప్పుచున్నారు.

తస్మి న్నభ్యాగతే కాలే ప్రతప్తే లోమహర్షణే
మిథో భేదో న మే కార్య స్తేన జీవసి సూతజ. 31

దాని కనువగు కాలము కాలిపోవుచు, ఒడలు గగుర్పొడుచునట్లు వచ్చి పడినది. ఇప్పుడు నేను ఒకరి కొకరికి పగ కూర్పరాదు. ఓరీ సూతపుత్రా! ఆ కారణమున బ్రదికి పోయితివి.

న హ్యస్య త్వద్య విక్రమ్య స్థవిరోఽపి శిశో స్తవ,
యుద్ధశ్రద్ధా మహం ఛిన్ద్యాం జీవితస్య చ సూతజ. 32

ముదుసలినైనను నేనిప్పుడు విక్రమించి పిల్లవాడవగు నీ యుద్ధాభిమానమును, నీ బ్రదుకును ముక్కలు చేయ గలను. కాని చేయరాదు కనుక చేయకున్నాను.

జామదగ్న్యేన రామేణ మహాస్త్రాణి విముఞ్చతా,
న మే వ్యథా కృతా కాచి త్త్వం తు మే కిం కరిష్యసి. 33

జమదగ్ని కొడుకు పరశురాముడు మహాస్త్రములు గుప్పించినప్పుడే నాకు చీమ కుట్టినట్టును లేదు. ఇక నీవు నన్నేమి చేయగలవు?

కామం నైతత్ ప్రశంస న్తి స న్తః స్వబలసం స్తవమ్,
వక్ష్యామి తు త్వాం సంతప్తో నిహీన కులపాంసన. 34

సజ్జనులు తమ బలమును తాము పొగడుకొనుటను బొత్తుగా మెచ్చరు. కాని నీచుడా! కులపాంసనా! ఒడలు మండిపోవుచున్న నేను- నా సంగతి ఎట్టిదో నీకు చెప్పెదను.

సమేతం పార్థివం క్షత్రం కాశిరాజస్వయంవరే,
నిర్జిత్యైకరథేనైవ యాః కన్యా స్తరసా హృతాః. 35

కాశిరాజేర్పరచిన స్వయంవరమందు నేలపైగల రాజు లందరు ఒక్కపెట్టున నాపైకి రాగా ఒక్క రథముతో వారిని గెలిచి యా కన్యకలను వడిగా హరించి తెచ్చితిని.

---

32. నీ యుద్ధాభిమానమును, నీ బ్రదుకును ముదుసలినైన నేను ఇప్పుడే విక్రమించి ముక్కలు చేయగలను. కాని ఇచటి సేన దిక్కులేక ముక్కలై పోవునను భయముతో చేయలేకున్నాను- అని భావము.

ఈదృశానాం సహస్రాణి విశిష్టానామథో పునః,
మయైకేన నిరస్తాని ససైన్యాని రణాజిరే. 36

ఇట్టివారిని, ఇంకను గొప్పవారిని వేలకొలదిగా నేనొక్కడనే రణరంగమున పారద్రోలితిని.

త్వాం ప్రాప్య వైరపురుషం కురూణా మనయో మహాన్,
ఉపస్థితో వినాశాయ యతస్వ పురుషో భవ. 37

పగయే బ్రతుకుగా గల నిన్ను పొందిన యీ కౌరవులకు గొప్ప కీడు మూడినది. ఇది సర్వనాశనమునకే వచ్చి పడినది. అయినను ప్రయత్నింపుము. మగవాడవు కమ్ము.

యుద్ధ్యస్వ సమరే పార్థం యేన విస్పర్ధసే సహ,
ద్రక్ష్యామి త్వాం వినిర్ముక్త మస్మా ద్యుద్ధాత్ సుదుర్మతే. 38

ఓరీ దుష్టబుద్ధీ! రణరంగమున అర్జునునితో పోటీపడుచుందువు గదా! ఈ యుద్ధమున బ్రదికి బయటపడినచో నిన్ను చూచెదను.

తమువాచ తతో రాజా ధార్తరాష్ట్రః ప్రతాపవాన్,
మాం సమీక్షస్వ గాఙ్గేయ కార్యం హి మహ దుద్యతమ్. 39

అంత ధృతరాష్ట్రుని కుమారుడు ప్రతాపవంతుడగు రాజాతనితో నిట్లనెను. గంగానందనా! నన్ను పరికింపుము. ముందు దొడ్డకార్యము కలదు.

చిన్త్యతా మిద మేకాగ్రం మమ నిఃశ్రేయసం పరమ్,
ఉభావపి భవన్తౌ మే మహత్ కర్మ కరిష్యతః. 40

మీరు నా మేలే చెదరని దృష్టితో ఆలోచింపవలయును. మీ రిరువురు నాదయిన దొడ్డపనిని చేయనున్నారు.

---

ఈ ప్రకరణమున చెప్పిన రథాదిపరిగణనయందలి తాత్పర్య మేమనగా- భీష్మద్రోణులు సమర్థులయ్యును పాండవులను చంపరు. కర్ణుడును కుంతికి వరమిచ్చుట చేత భీమాదులను చంపగలవాడయ్యు చంపడు. అర్జును డతనికి గెలువరానివాడు. ఇట్లు పాండవులకే జయ మగును.

భూయశ్చ శ్రోతు మిచ్ఛామి పరేషాం రథసత్తమాన్,
యే చైవాతిరథా స్తత్ర యే చైవ రథయూథపాః. 41

పగవారి రథవరులను గూర్చి యింకను వినవలతును. అందు అతిరథు లెవ్వరు? రథసముదాయముల నాయకు లెవ్వరు?

బలాబల మమిత్రాణాం శ్రోతు మిచ్ఛామి కౌరవ,
ప్రభాతాయాం రజన్యాం వై ఇదం యుద్ధం భవిష్యతి. 42

శత్రువుల బలాబలములను వినగోరుచున్నాను. తెల్లవారినవెంటనే యుద్ధము కానున్నది.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
భీష్మకర్ణసంవాదే అష్టషష్ట్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యాన
పర్వమున భీష్మకర్ణసంవాదము గల నూటయరువది యెనిమిదవ
అధ్యాయము.

—:o:—

# ఊనసప్తత్యధికశతతమోఽధ్యాయః.

# నూటయరువదితొమ్మిదవ అధ్యాయము.

పాణ్డవదళీయరథ్యాదీనాం, తేషాం మహత్త్వస్య చ వర్ణనమ్.

పాండవపక్షములోని రథికులయు,వారి మహత్త్వముయొక్కయు వర్ణనము.

భీష్మ ఉవాచ - భీష్ముడిట్లు పలికెను.

ఏతే రథా స్తవాఖ్యాతా స్తథైవాతిరథా నృప,
యే చాప్యర్ధరథా రాజన్ పాణ్డవానా మతః శృణు. 1

రాజా! ఈ రథులను, అతిరథులను, అర్ధరథులను నీకు చెప్పితిని. ఇక పాండవుల వారినిగూర్చి వినుము.

యది కౌతూహలం తేఽద్య పాణ్డవానాం బలే నృప,
రథసంఖ్యాం శృణుష్వ త్వం సహైభి ర్వసుధాధిపైః. 2

నీకు వినవలయునని యుత్కంఠ యున్నచో పాండవులకు సంబంధించిన రథుల లెక్కను చెప్పెదను. ఈ రాజులతో కూడి వినుము.

స్వయం రాజా రథోదారః పాణ్డవః కున్తినన్దనః,
అగ్నివత్ సమరే తాత చరిష్యతి న సంశయః. 3

పాండుకుమారుడు, కుంతీతనయుడు ధర్మరాజు స్వయముగా రథులలో గొప్పవాడు. యుద్ధమున అగ్నివలె చెలరేగును. సంశయము లేదు.

భీమసేనస్తు రాజేన్ద్ర రథోఽష్టగుణసంమితః,
న తస్యాస్తి సమో యుద్ధే గదయా సాయకైరపి. 4

రాజేంద్రా! ఇక భీమసేనుడన్ననో ఎనిమిది మంది రథులపెట్టు. గదతో గాని బాణములతో గాని యుద్ధమున నాతనికి సాటియే లేరు.

నాగాయుతబలో మానీ తేజసా న చ మానుషః.

ఆతడు పదివేల యేనుగుల బలము గలవాడు. అభిమానము గలవాడు. తేజస్సు చూచినచో మనుష్యజాతియే కాదనిపించును.

మాద్రీపుత్రౌ చ రథినౌ ద్వావేవ పురుషర్షభౌ, 5
అశ్వినావివ రూపేణ తేజసా చ సమన్వితౌ.

మాద్రికొడుకు లిరువురు రథులు. పురుషశ్రేష్ఠులు. రూపమున అశ్వినుల వంటివారు. గొప్పతేజస్సు కలవారు.

ఏతే చమూ ముపగతాః స్మరన్తః క్లేశ ముత్తమమ్, 6
రుద్రవత్ ప్రచరిష్యన్తి తత్ర మే నాస్తి సంశయః.

వీరు సేనలో చొరబడి తమపడిన పాట్లు తలచుకొని రుద్రులవలె చెలరేగుదురు. ఇందు సంశయము నా కేమాత్రము లేదు.

సర్వ ఏవ మహాత్మానః శాలస్తమ్భా ఇవోద్గతాః, 7
ప్రాదేశేనాధికాః పుంభి రన్యై స్తే చ ప్రమాణతః.

వారందరు మహాత్ములు. పొడుచుకొని వచ్చిన సాలస్తంభములవంటివారు. ఏ ఇతరపురుషులకంటెను కొలతలో గూడ జేనెడు ఎక్కువవారు.

సింహసంహననాః సర్వే పాణ్డుపుత్రా మహాబలాః, 8
చరితబ్రహ్మచర్యాశ్చ సర్వే తాత తపస్వినః.

ఆ పాండుపుత్రు లందరు సింహముల వంటి దేహము కలవారు. బ్రహ్మచర్యమును పాటించువారు. నాయనా! వారందరు తపస్వులు.

హ్రీమన్తః పురుషవ్యాఘ్రా వ్యాఘ్రా ఇవ బలోత్కటాః. 9

పాడుపనులకు సిగ్గుపడువారు. పురుషశ్రేష్ఠులు. పెద్దపులులవలె పిక్కటిల్లిన బలము గలవారు.

---

8. ప్రాదేశేన - చూపుడువ్రేలు బొటనవ్రేలు చాచిన మేరతో సింహసంహననాః - సింహము దేహము వంటి దేహము కలవారు; సంహనన మనగా దేహము;

జవే ప్రహారే సంమర్దే సర్వ ఏవాతిమానుషాః,
సర్వై ర్జితా మహీపాలా దిగ్జయే భరతర్షభ. 10

వేగము, పోటు, రాపిడి అనువాని విషయమున వారు మనుష్యులలెక్క మించినవారు భూమిలో గల రాజు లందరు దిగ్విజయకాలమున వీరి కోడిన వారే కదా !

న చైషాం పురుషాః కేచి దాయుధాని గదాః శరాన్,
విషహన్తి సదా కర్తు మధిజ్యాన్యపి కౌరవ. 11

వీరి యాయుధములను, గదలను, బాణములను ఏ పురుషులును సహింప జాలరు. వానిని ప్రయోగమునకు సిద్ధపరచుటకును జాలరు.

ఉద్యతా వా గదా గుర్వీః శరాన్ వా క్షేప్తు మాహవే,
జవే లక్ష్యస్య హరణే భోజ్యే పాంసువికర్షణే, 12
బాలై రపి భవన్త స్తైః సర్వ ఏవ విశేషితః.

పెద్ద గదలను ఎత్తి వైచుట, యుద్ధమున బాణములను విసరుట, వేగముగా పోవుట, గురిని కొట్టుట, ఆయువుపట్టులను పీడించుట, దుమ్మునందు బడవైచి లాగుట అను పనులయందును వారు పసివాండ్రుగా నున్నపుడే మిమ్మ మీరియున్నారు.

ఏతత్ సైన్యం సమాసాద్య సర్వ ఏవ బలోత్కటాః, 13
విధ్వంసయిష్యన్తి రణే మా స్మ తైః సహ సఙ్గమః.

ఇప్పుడీ సైన్యమును దరిజేరి పిక్కటిల్లిన బలముగల వారందరు సర్వ నాశనము చేయుదురు. వారితో పోరు వలదు.

---

12. ఉద్యతామ్ - ఉద్గచ్ఛతామ్ - విసరుచున్నవారి యొక్క. 'ఉద్యన్తుమ్' అనియు పాఠాంతరము-విసరుటకు అని అర్థము. భోజ్యే - కౌటిల్యము నందు - ఇచట కౌటిల్య మనగా ఆయువుపట్టులందు బాధ కల్గించుట. భుజ కౌటిల్యే-అను ధాతువు రూపము. పాంసువికర్షణే - దుమ్మునందు పడవైచి గుంజుటయందు, ముష్టియుద్ధమున నేలపై బడ లాగుటయందు అని భావము.

ఏకైకశ స్తే సంమర్దే హన్యుః సర్వాన్ మహీక్షితః, 14
ప్రత్యక్షం తవ రాజేన్ద్ర రాజసూయే యథాఽభవత్.

వారు ఒక్కరొక్కరు కయ్యమున రాజుల నందరను చంపగలరు. రాజేంద్రా! రాజసూయయాగసందర్భమున నేమి జరిగెనో నీకు ప్రత్యక్షమే కదా!

ద్రౌపద్యాశ్చ పరిక్లేశం ద్యూతే చ పరుషా గిరః, 15
తే స్మరన్త శ్చ సజ్గ్రామే చరిష్యన్తి చ రుద్రవత్.

ద్రౌపది పడిన పాటు, జూదమునాడు మీరు కూసిన కారుకూతలు తలచుకొనుచు వారు రుద్రులవలె పోరున చెలరేగుదురు.

లోహితాక్షో గుడాకేశో నారాయణసహాయవాన్, 16
ఉభయోః సేనయో ర్వీరో రథో నాస్తీతి తాదృశః.

ఎరుపెక్కిన కనులు గలిగి, నారాయణుడు తోడై వచ్చు అర్జునునికి సాటి వచ్చు వీరరథికుడు రెండుసేనలలో లేడు.

న హి దేవేషు వా పూర్వం మనుష్యేషూరగేషు వా, 17
రాక్షసే ష్వథ యక్షేషు నరేషు కుత ఏవ తు.

దేవతలయందు గాని మునుపటి మహావీరులగు మనుష్యులయందు గాని నాగులయందు గాని రాక్షసులయందు గాని యక్షులయందు గాని అతనికి దీటైన వారు లేరు. ఇక నరుల సంగతి చెప్పనేల?

భూతోఽథవా భవిష్యో వా రథః కశ్చిన్మయా శ్రుతః. 18

అట్టి రథికవరుడు మునుపటివానిని, ముందు రాగలవానిని నేను వినలేదు.

సమాయుక్తో మహారాజ రథః పార్థస్య ధీమతః,
వాసుదేవశ్చ సంయన్తా యోద్ధా చైవ ధనఞ్జయః. 19

మహారాజా! దొడ్డబుద్ధి గల అర్జునుని రథము సిద్ధమై యున్నది. దానికి సారథి వాసుదేవుడు. రథి ధనంజయుడు.

గాణ్డీవం చ ధను ర్దివ్యం తే చాశ్వా వాతరంహసః,
అభేద్యం కవచం దివ్య మక్షయ్యౌ చ మహేషుధీ. 20

విల్లు దివ్యమైన గాండీవము. గుఱ్ఱములు వాయువేగము గలవి. కవచము పగులగొట్టరానిది; దివ్యము. అంబులపొదులు తరుగువోనివి.

అస్త్రగ్రామశ్చ మాహేన్ద్రో రౌద్రః కౌబేర ఏవ చ,
యామ్యశ్చ వారుణశ్చైవ గదా శ్చోగ్రప్రదర్శనాః. 21

అస్త్రముల సముదాయ మన్ననో - మాహేంద్రము, రౌద్రము, కౌబేరము, యామ్యము, వారుణము అనునవి. అట్లే చూచుటకే వెరపుగొలుపు గదలును గలవు.

వజ్రాదీని చ ముఖ్యాని నానాప్రహరణాని చ.

మరియు వజ్రములు మొదలగు అనేకవిధములగు ఆయుధములు వారికి కలవు.

దానవానాం సహస్రాణి హిరణ్యపురవాసినామ్, 22
హతా న్యేకరథేనాజౌ క స్తస్య సదృశో రథః.

అతడు ఒక్క రథముతో హిరణ్యపురవాసులగు రక్కసులను వేలకొలదిగా యుద్ధమున పరిమార్చెను. అతనితో సాటి రాగల రథు డెవ్వడు ?

ఏష హన్యాద్ధి సంరంభీ బలవాన్ సత్యవిక్రమః, 23
తవ సేనాం మహాబాహుః స్వాం చైవ పరిపాలయన్.

గొప్ప బలము, నిజమైన పరాక్రమము గల ఆ అర్జునుడు చెలరేగి తన సేనను కాపాడుకొనుచు నీ సేనను రూపుమాపును.

అహం చైనం ప్రత్యుదియా మాచార్యో వా ధనఞ్జయమ్, 24
న తృతీయోఽస్తి రాజేన్ద్ర సేనయో రుభయోరపి,
య ఏనం శరవర్షాణి వర్షన్త ముదియా ద్రథీ. 25

---

24. ప్రత్యుదియామ్ - యుద్ధమున ఎదురుగా నిలువగలను.

నేనో, ఆచార్యుడు ద్రోణుడో యీ ధనంజయుని ఎదుర్కొనవలయును. బాణముల వర్షము గ్రుమ్మరించు ఆ అర్జును నెదుర్కొను మూడవ రథికుడు రెండుసేనలలో లేడు.

జీమూత ఇవ ఘర్మాన్తే మహావాతసమీరితః,
సమాయుక్తస్తు కౌన్తేయో వాసుదేవసహాయవాన్,
తరుణశ్చ కృతీ చైవ జీర్ణా వావా ముభావపి. 26

వర్షర్తువున పెనుగాలికి విజృంభించిన మేఘమువలె కుంతికొడుకు వాసుదేవుడు తోడుకాగా సిద్ధమైయున్నాడు. ఆతడు మంచివయసులో ఉన్నాడు. విద్యలో ఆరితేరియున్నాడు. మే మిరువురము చిక్కి శల్యమై యున్నవారము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏతచ్ఛ్రుత్వా తు భీష్మస్య రాజ్ఞాం దధ్వంసిరే తదా, 27
కాఞ్చనాఙ్గదినః పీనా భుజా శ్చన్దనరూషితాః,
మనోభిః సహ సంవేగైః సంస్మృత్య చ పురాతనమ్,
సామర్థ్యం పాణ్డవేయానాం యథా ప్రత్యక్షదర్శనాత్. 28

భీష్ము డాడిన యీ పలుకులు విన్న రాజులకు పాండుకుమారుల మునుపటి పరాక్రమము గుర్తుకు వచ్చినది. అది యిప్పుడు ప్రత్యక్షముగా చూచుచున్నారో యన్నట్లు నిలువని హృదయములతో ఉన్నవారల బంగారు ఆభరణములు కలవియు, బలిసినవియు, గంధపు పూతలు గలవియు నగు భుజములు వ్రేలాడి పోవజొచ్చినవి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
పాణ్డవరథాతిరథసంఖ్యాయాం ఊనసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యానపర్వమున
పాండవుల రథాతిరథులను నిరూపించుట గల
నూటయరువదితొమ్మిదవ అధ్యాయము.

—:०:—

27. దధ్వంసిరే - ప్రీలిపోయినవి.

# సప్తత్యధికశతతమోఽధ్యాయః
# నూటడెబ్బదియవ అధ్యాయము

పాణ్డవదలీయరథిమహారథినాం వర్ణనం, విరాటద్రుపదయోః ప్రశంసనం చ.

పాండవులవైపున గల రథిమహారథులను వర్ణించుట,
విరాటద్రుపదులను ప్రశంసించుట.

భీష్మ ఉవాచ - భీష్ముడు పలికెను.

ద్రౌపదేయా మహారాజ సర్వే పఞ్చ మహారథాః,
వైరాటి రుత్తర శ్చైవ రథోదారో మతో మమ. 1

మహారాజా! ద్రౌపది కొడుకు లైదుగురును మహారథులు. విరాటుని కొడుకు ఉత్తరుడు రథికశ్రేష్ఠుడు.

అభిమన్యు ర్మహాబాహూ రథయూథపయూథపః,
సమః పార్థేన సమరే వాసుదేవేన చారిహా. 2

శత్రుసంహారకుడు మహాబాహువు నగు అభిమన్యుడు అనేకరథుల సముదాయమునకు నాయకుడు. యుద్ధమున అర్జునునకు వాసుదేవునకు దీటైన వాడు.

లబ్ధాస్త్ర శ్చిత్రయోధీ చ మనస్వీ చ దృఢవ్రతః,
సంస్మరన్ వై పరిక్లేశం స్వపితు ర్విక్రమిష్యతి. 3

అత డెన్నో యస్త్రములను సాధించెను. చిత్రచిత్రముగా పోరును. మానధనుడు. చెదరని దీక్ష కలవాడు. తన తండ్రి పడిన పాటును స్మరించుచు చెలరేగును.

సాత్యకి ర్మాధవః శూరో రథయూథపయూథపః,
ఏష వృష్ణిప్రవీరాణా మమర్షీ జితసాధ్వసః. 4

మధువంశమువాడు శూరుడు నగు సాత్యకి మహారథుడు. ఈతడు వృష్ణి వంశమువారిలో మిక్కిలి క్రోధము కలవాడు. భయ మన్నది యెరుగనివాడు.

ఉత్తమౌజా స్తథా రాజన్ రథోదారో మతో మమ,
యుధామన్యుశ్చ విక్రాన్తో రథోదారో మతో మమ. 5

రాజా! ఉత్తమౌజుడు, పరాక్రమవంతు డగు యుధామన్యువు నా లెక్కలో రథులలో శ్రేష్ఠులు.

ఏతేషాం బహుసాహస్రా రథా నాగా హయా స్తథా,
యోత్స్యన్తే తే తనూం స్త్యక్త్వా కున్తీపుత్రప్రియేప్సయా. 6

వీరికి పెక్కువేల రథములు, ఏనుగులు, గుఱ్ఱములు కలవు. వాని వీర భటు లందరు ప్రాణములకు తెగించి కుంతికొడుకునకు ప్రియము కూర్చుటకై యుద్ధమాడుదురు.

పాణ్డవైః సహ రాజేన్ద్ర తవ సేనాసు భారత,
అగ్నిమారుతవ ద్రాజ న్నాహ్వయన్తః పరస్పరమ్. 7

రాజేంద్రా! వారందరు పాండవులతోపాటు నీ సేనలపై బడుటకై అగ్ని వలె, వాయువువలె విజృంభించుచు ఒకరి నొకరు పిలిచికొనుచున్నారు.

అజేయౌ సమరే వృద్ధౌ విరాట్ద్రుపదౌ తథా,
మహారథౌ మహావీర్యౌ మతౌ మే పురుషర్షభౌ. 8

వృద్ధులగు విరాట్ద్రుపదులు యుద్ధమున గెలువరానివారు, పురుషశ్రేష్ఠులు, గొప్ప గుండెదిటవు గలవారు. వారు మహారథులని నేను సంభావింతును.

వయోవృద్ధా వపి హి తౌ క్షత్రధర్మపరాయణౌ,
యతిష్యేతే పరం శక్త్యా స్థితౌ వీరగతే పథి. 9

వారు వయసుచేత వృద్ధులైనను క్షత్రియధర్మమునందు గట్టి పట్టుదల గలవారు కావున వీరులు పోవు దారిలో గట్టిగా నిలబడి శక్తియంతయు ధారపోసి (పాండవుల జయమునకై) ప్రయత్నింతురు.

సంబన్ధకేన రాజేన్ద్ర తౌ తు వీర్యబలాన్వయాత్,
ఆర్యవృత్తౌ మహేష్వాసౌ స్నేహవీర్యసితౌ వుభౌ. 10

---

9. వీరగతే - వీరు లనుసరించెడు.

10. సితౌ - కట్టివేయబడినవారు.

పైగా వారికి పాండవులతో చుట్టరికము కలదు. వీర్యము, బలము, గొప్ప వంశమున పుట్టుకయు కలవారు. ఆర్యప్రవృత్తి కలవారు. మహాధానుష్కులు. స్నేహమునకు, వీర్యమునకు కట్టుబడి యుండువారు.

కారణం ప్రాప్య తు నరాః సర్వ ఏవ మహాభుజాః,
శూరా వా కాతరా వాఽపి భవన్తి కురుపుఙ్గవ. 11

కురువరా! లోకమున నరులందరు శూరులైనను భీరువులైనను తగిన కారణమున్నయెడల మహాభుజు లగుదురు.

ఏకాయనగతా వేతౌ పార్థివౌ దృఢధన్వినౌ,
ప్రాణాం స్త్యక్త్వా పరం శక్త్యా ఘట్టితారౌ పరన్తప. 12

శత్రుసంహారకా! గట్టి ధనువులుగల ఈ రాజు లిరువురు మరణమే శరణముగా భావించియున్నవారు. కావున ప్రాణములను వదలియైనను శక్తినంతను గూడగట్టుకొని శత్రువులను నుగ్గుచేయుదురు.

పృథగక్షౌహిణీభ్యాం తావుభౌ సంయతి దారుణౌ,
సంబంధిభావం రక్షన్తౌ మహత్ కర్మ కరిష్యతః. 13

ఒక్కొక్క అక్షౌహిణితో వారిరువురు మహాఘోరమగు యుద్ధమున చుట్టరికమును కాపాడుచు ఘనకార్య మాచరింతురు.

లోకవీరౌ మహేష్వాసౌ త్యక్తాత్మానౌ చ భారత,
ప్రత్యయం పరిరక్షన్తౌ మహత్ కర్మ కరిష్యతః. 14

వారిరువురు లోకమున ప్రసిద్ధికెక్కిన వీరులు. గొప్ప ధనువులు గలవారు. దేహమునందు వాంఛ లేనివారు. నమ్మకమును వమ్ముచేయక రక్షించువారు. కావున మహాకార్యమును నిర్వహింతురు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
సప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యాన
పర్వమున నూటడెబ్బదియవ అధ్యాయము.

—: o :—

12. ఏకాయనగతౌ - ఒకే త్రోవలో నున్నవారు. సందర్భమునుబట్టి మరణమే శరణముగా గలవారని తాత్పర్యము.

# ఏకసప్తత్యధికశతతమోఽధ్యాయః
# నూటడెబ్బదియొకటవ అధ్యాయము

పాణ్డవపక్షీయరథిమహారథ్యతిరథినాం వర్ణనమ్.
**పాండవసేనలోని రథులను మహారథులను అతిరథులను వర్ణించుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

పఞ్చాలరాజస్య సుతో రాజా పరపురఞ్జయః,
శిఖణ్డీ రథముఖ్యో మే మతః పార్థస్య భారత. 1

పాంచాలరాజు కొడుకు, శత్రుపురములను గెలుచువాడు శిఖండి ధర్మరాజు పక్షమున రథశ్రేష్ఠుడని నా భావన.

ఏష యోత్స్యతి సఙ్గ్రామే నాశయన్ పూర్వసంస్థితమ్,
పరం యశో విప్రథయం స్తవ సేనాసు భారత. 2

ఈతడు తన పూర్వస్థితిని నాశనము చేయుచు గొప్ప యశమును నీ సేనల యందు వెదజల్లుచు పోరాడును.

ఏతస్య బహులాః సేనాః పఞ్చాలాశ్చ ప్రభద్రకాః,
తేనాసౌ రథవంశేన మహత్ కర్మ కరిష్యతి. 3

ఈతనికి పంచాలురు, ప్రభద్రకులు అను పెక్కు సేనలు గలవు. ఆ రథముల సముదాయముతో ఈతడు ఘోరమైన పోరు గావించును.

---

2. పూర్వసంస్థితమ్ - మునుపటిదగు స్త్రీస్వరూపమును; నాశయన్ - నశింపజేయుచు - కన్పడకుండ జేయుచు, పౌరుషమును ప్రదర్శించుచు; లేదా పూర్వసంస్థితమ్ - మొగ్గరములలో ముందున్న సైనికుల సముదాయమును; నాశయన్ - నశింపజేయుచు; వ్యూహములలో ముందు నిలిచిన సైనికులను పారద్రోలుచు - అని భావము.

ధృష్టద్యుమ్నశ్చ సేనానీః సర్వసేనాసు భారత,
మతో మేఽతిరథో రాజన్ ద్రోణశిష్యో మహారథః. 4

ద్రోణుని శిష్యుడు గొప్ప రథము కలవాడు అగు ధృష్టద్యుమ్నుడు వారి సేనలన్నింటికి సేనాని. ఆతడు అతిరథు డని నా అభిప్రాయము.

ఏష యోత్స్యతి సంగ్రామే సూదయన్ వై పరాన్ రణే,
భగవానివ సంక్రుద్ధః పినాకీ యుగసంక్షయే. 5

ప్రళయకాలమున మహాక్రోధము గల పినాకధారి యగు శంకర భగవానునివలె నీతడు యుద్ధరంగమున పరుల ప్రాణములు తీయుచు పోరు సల్పును.

ఏతస్య తద్రథానీకం కథయన్తి రణప్రియాః,
బహుత్వాత్ సాగరప్రఖ్యం దేవానామివ సంయుగే. 6

రణప్రియులు ఈతని రథముల సేన దేవతల సేనవలె చాల గొప్పది యగుటచే సముద్రమువంటి దని పేర్కొందురు.

క్షత్రధర్మా తు రాజేన్ద్ర మతో మేఽర్ధరథో నృప,
ధృష్టద్యుమ్నస్య తనయో బాల్యా న్నాతికృతశ్రమః. 7

ధృష్టద్యుమ్నుని కొడుకు క్షత్రధర్ముడు చిన్ననాటినుండియు ఎక్కువ పరిశ్రమ చేయనివా డగుటచే అర్ధరథుడని నాలెక్క.

శిశుపాలసుతో వీర శ్చేదిరాజో మహారథః,
ధృష్టకేతు ర్మహేష్వాసః సంబన్ధీ పాణ్డవస్య హ. 8

శిశుపాలుని కొడుకు చేది దేశపురాజు, వీరుడు, గొప్ప విలుకాడు ధృష్టకేతువు మహారథుడు. ఆతడు పాండుకుమారునకు చుట్టము గదా!

ఏష చేదిపతిః శూరః సహ పుత్రేణ భారత,
మహారథానాం సుకరం మహత్ కర్మ కరిష్యతి. 9

శూరుడగు ఈ చేదిరాజు తన కొడుకులతో పాటు మహారథులు చేయ దగు దొడ్డ పనిని సులభముగా చేయును.

క్షత్రధర్మరతో మహ్యం మతః పరపురంజయః,
క్షత్రదేవస్తు రాజేన్ద్ర పాణ్డవేషు రథోత్తమః. 10

క్షత్రియధర్మమునందు ప్రీతి గలవాడు, శత్రుపురములను గెలిచినవాడు నగు క్షత్రదేవుడు పాండవపక్షమున రథోత్తముడు.

జయన్తశ్చామితౌజాశ్చ సత్యజిచ్చ మహారథః,
మహారథా మహాత్మానః సర్వే పాఞ్చాలసత్తమాః. 11
యోత్స్యన్తే సమరే తాత సంరబ్ధా ఇవ కుఞ్జరాః.

పాంచాలవీరులగు జయంతుడు, అమితౌజుడు, సత్యజిత్తు, మహారథుడు అనువారు మహారథులు, మహాత్ములు. యుద్ధమున చెలరేగిన ఏనుగులవలె పోరుదురు.

అజో భోజశ్చ విక్రాన్తౌ పాండవార్థే మహారథౌ, 12
యోత్స్యేతే బలినౌ శూరౌ పరం శక్త్యా క్షయిష్యతః.

అజుడు, భోజుడు అనువారు గొప్ప పరాక్రమము కలవారు. పాండవపక్షమున మహారథులు. గొప్ప బలము, శౌర్యము కలిగి శక్తి సంతతిని వినియోగించి తమ సామర్థ్యము చూపుదురు.

శీఘ్రాస్త్రాశ్చిత్రయోద్ధారః కృతినో దృఢవిక్రమాః, 13
కేకయాః పఞ్చ రాజేన్ద్ర భ్రాతరో దృఢవిక్రమాః,
సర్వే చైవ రథోదారాః సర్వే లోహితకధ్వజాః. 14

కేకయదేశపు సోదరులైదుగురు అస్త్రముల ఒడుపు గలవారు. ఆరితేరినవారు. చెదరని పరాక్రమము కలవారు. చిత్రవిచిత్రపద్ధతులతో పోరువారు. అందరు రథశ్రేష్ఠులు. అందరు కెంపుల ధ్వజములు కలవారు.

కాశికః సుకుమారశ్చ నీలో యశ్చాపరో నృప,
సూర్యదత్తశ్చ శఙ్ఖశ్చ మదిరాశ్వశ్చ నామతః, 15
సర్వ ఏవ రథోదారాః సర్వే చాహవలక్షణాః,
సర్వాస్త్రవిదుషః సర్వే మహాత్మానో మతా మమ. 16

---

18. క్షయిష్యతః - సామర్థ్యమును చూపుదురు. ఈ 'క్షి' ధాతువు ఐశ్వర్యార్థకము.

సుకుమారుడైన కాశిపుడు, నీలుడు, సూర్యదత్తుడు, శంఖుడు, మదిరాశ్వుడు - అను నీ అయిదుగురు రథశ్రేష్ఠులు. అందరు యుద్ధముల లక్షణములు నిండుగా గలవారు. అస్త్రము లన్నింట ఆరితేరినవారు. మహాత్ములు.

వార్ధక్షేమి ర్మహారాజ మతో మమ మహారథః,
చిత్రాయుధశ్చ నృపతి ర్మతో మే రథసత్తమః. 17

మహారాజా! వార్ధక్షేమి మహారథు డని నా అభిప్రాయము. అట్లే చిత్రాయుధు డను రాజును రథశ్రేష్ఠుడు.

స హి సంగ్రామశోభీ చ భక్తశ్చాపి కిరీటినః.

ఆ చిత్రాయుధుడు యుద్ధమున శోభిల్లుచుండును. కిరీటికి భక్తుడు,

చేకితానః సత్యధృతిః పాణ్డవానాం మహారథౌ,
ద్వా విమౌ పురుషవ్యాఘ్రౌ రథోదారౌ మతౌ మమ. 18

చేకితానుడు, సత్యధృతి అను నీ యిరువురు పురుషశ్రేష్ఠులు పాండవుల మహారథులని నా భావన.

వ్యాఘ్రదత్తశ్చ రాజేన్ద్ర చన్ద్రసేనశ్చ భారత,
మతౌ మమ రథోదారౌ పాణ్డవానాం న సంశయః. 19

వ్యాఘ్రదత్తుడు, చంద్రసేనుడు అను రాజులు పాండవుల పక్షమున రథశ్రేష్ఠులు. సంశయింప నక్కరలేదు.

సేనాబిన్దుశ్చ రాజేన్ద్ర క్రోధహన్తా చ నామతః,
యః సమో వాసుదేవేన భీమసేనేన వా విభో. 20

రాజేంద్రా! సేనాబిందు డనువాడు, అతనికి క్రోధహన్త అనియు పేరు. వాసుదేవునకో భీమసేనునకో సాటియైనవాడు.

స యోత్స్యతి హి విక్రమ్య సమరే తవ సైనికైః,
మాం చ ద్రోణం కృపం చైవ యథా సంమన్యతే భవాన్, 21
తథా స సమరశ్లాఘీ మన్తవ్యో రథసత్తమః.

ఆ సేనాబిందుడు నీ సైనికులతో విజృంభించి పోరును. నీవు నన్ను, ద్రోణుని, కృపుని ఎట్లు మన్ననతో చూతువో అట్లు చూడదగిన రథశ్రేష్ఠుడు. సమరమును కొనియాడు వీరుడు.

---

16. 'విద్వాంసః' అనుదానికి 'విదుషః' అనునది ఆర్ష ప్రయోగము.

కాశ్యః పరమశీఘ్రాస్త్రః శ్లాఘనీయో నరోత్తమః, 22
రథ ఏకగుణో మహ్యం జ్ఞేయః పరపురఞ్జయః.

కాశిరాజు మంచివడిగల అస్త్రములు గలవాడు. కొనియాడదగినవాడు. నరులలో ఉత్తముడు. పగవారి పురములు గెలిచినవాడు. అతడు ఒక రథుడు.

అయం చ యుధి విక్రాన్తో మన్తవ్యోఽష్టగుణో రథః, 23
సత్యజిత్ సమరశ్లాఘీ ద్రుపదస్యాత్మజో యువా.

ద్రుపదుని కుమారుడు, యువకుడు, యుద్ధమన్నచో మురిసిపోవువాడు, పరాక్రమవంతుడు అగు సత్యజిత్తు ఎనిమిదిమంది రథులకు దీటైనవాడు.

గతః సోఽతిరథత్వం హి ధృష్టద్యుమ్నేన సమ్మితః, 24
పాణ్డవానాం యశస్కామః పరం కర్మ కరిష్యతి.

ధృష్టద్యుమ్నునకు సాటివచ్చు నీతడు అతిరథవ్యవహారము పొందినవాడు. పాండవులకు కీర్తి కోరువాడై మహాకార్యము లాచరించును.

అనురక్తశ్చ శూరశ్చ రథోఽయ మపరో మహాన్, 25
పాణ్డ్యరాజో మహావీర్యః పాణ్డవానాం ధురన్ధరః,
ధృఢధన్వా మహేష్వాసః పాణ్డవానాం మహారథః. 26

మరియొక మహాశూరుడు, గొప్పశక్తి కలవాడు, పాండ్యరాజు, పాండవుల దారిలో మహారథుడు. గట్టిది దొడ్డది యగు విల్లు కలవాడు, పాండవులపై మిక్కిలి యనురాగము గలవాడు.

శ్రేణిమాన్ కౌరవశ్రేష్ఠ వసుదానశ్చ పార్థివః,
ఉభా వేతా వతిరథౌ మతౌ పరపురఞ్జయౌ. 27

కౌరవరాజా! శ్రేణిమంతుడు, వసుదానుడు అను రాజు లిద్దరు శత్రువులను గెలిచినవారు. ఈ యిరువురు అతిరథులు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
ఏకసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యానపర్వమున
నూటడెబ్బదియొకటవ అధ్యాయము.

—:0:—

## ద్విసప్తత్యధికశతతమోఽధ్యాయః
## నూటడెబ్బదిరెండవ అధ్యాయము.

**పాణ్డవదళీయాతిరథినో వర్ణయతా భీష్మేణ శిఖణ్డినః పాణ్డవానాం చ వధం న కరిష్యామీతి నిశ్చయస్య ప్రకాశనమ్.**

**పాండవపక్షమునందలి అతిరథులను వర్ణించుచు భీష్ముడు శిఖండిని, పాండవులను చంపనను నిశ్చయమును వెల్లడి చేయుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

రోచమానో మహారాజ పాణ్డవానాం మహారథః,
యోత్స్యతేఽమరవ త్సంఖ్యే పరసైన్యేషు భారత. 1

మహారాజా! రోచమానుడు పాండవుల వైపు మహారథుడు. శత్రుసేనలపై దేవజాతివానివలె విజృంభించి యుద్ధము చేయును.

పురుజిత్ కున్తిభోజశ్చ మహేష్వాసో మహాబలః,
మాతులో భీమసేనస్య స చ మేఽతిరథో మతః. 2

కుంతిభోజరాజు పురుజిత్తు గొప్ప విలుకాడు. మహాబలుడు. భీమసేనుని మేనమామ. అత దతిరథు డని నా అభిప్రాయము.

ఏష వీరో మహేష్వాసః కృతీ చ నిపుణశ్చ హ,
చిత్రయోధీ చ శక్తశ్చ మతో మే రథపుఙ్గవః. 3

మహాధనుర్ధరుడగు ఈ వీరుడు యుద్ధములో ఆరితేరినవాడు. నేర్పరి. చిత్రముగా పోరును. సమర్థుడు. రథశ్రేష్ఠుడని నా అభిప్రాయము.

స యోత్స్యతి హి విక్రమ్య మఘవానివ దానవైః,
యోధా యే చాస్య విఖ్యాతాః సర్వే యుద్ధవిశారదాః. 4

---

2. భీమసేనుని మేనమామ యనుటలో అతని క్రోధావేశమును వక్కాణించుట తాత్పర్యము. లేదా భీమసేను నంతటి వాడని చెప్పుటయు తాత్పర్యము.

అతడు చెలరేగి దానవులతో పోరు దేవేంద్రునివలె యుద్ధ మొనరించును. ఆతని యోధులుకూడ ప్రసిద్ధులు, యుద్ధములలో ఆరితేరినవారు.

భాగినేయకృతే వీరః స కరిష్యతి సఙ్గరే,
సుమహత్ కర్మ పాణ్డూనాం స్థితః ప్రియహితే రతః. 5

మేనల్లుండ్రకొరకుగా అతడు, వారి ప్రియమును హితమును ఆసక్తితో కాపాడుచు యుద్ధమున మహాకార్య మాచరించును.

భైమసేని ర్మహారాజ హైడిమ్బో రాక్షసేశ్వరః,
మతో మే బహుమాయావీ రథయూథపయూథపః. 6

హిడింబాభీమసేనుల కుమారుడు, రాక్షసరాజు ఘటోత్కచుడు పెక్కు మాయలు కలవాడు. అతడు మహారథులకు మహారథుడు.

యోత్స్యతే సమరే తాత మాయావీ సమరప్రియః,
యే చాస్య రాక్షసా వీరాః సచివా వశవర్తినః. 7

యుద్ధమన్నచో పొంగిపోవు ఆ మాయావి యుద్ధమున వీరవిహారము చేయును. మరియు రాక్షసవీరులు, మంత్రులు ఆతని మాటపై నిలబడి యుద్ధ మాడుదురు.

ఏతే చాన్యే చ బహవో నానాజనపదేశ్వరాః,
సమేతాః పాణ్డవస్యార్థే వాసుదేవపురోగమాః. 8

వీరును, మరియు చాలమంది జనపదముల ప్రభువులు వాసుదేవుని ముందిడుకొని పాండవులకై కూడియున్నారు.

ఏతే ప్రాధాన్యతో రాజన్ పాణ్డవస్య మహాత్మనః,
రథాశ్చాతిరథాశ్చైవ యే చాన్యేఽర్ధరథా నృప. 9
నేష్యన్తి సమరే సేనాం భీమాం యౌధిష్ఠిరీం నృప,
మహేన్ద్రేణేవ వీరేణ పాల్యమానాం కిరీటినా. 10

రాజా ! ప్రధానముగా మహాత్ముడగు ధర్మరాజునకు సంబంధించిన రథులు, అతిరథులు, మహారథులు, అర్ధరథులు వీరు. మహాభయంకరమైన యుధిష్ఠిరుని సేనను,మహేంద్రునివలె వీరుడైన అర్జునుడు కాపాడుచుండగా,వీరు నడుపుదురు.

తైరహం సమరే వీర మాయావిద్భి ర్జయైషిభిః,
యోత్స్యామి జయ మాకాంక్ష న్నథవా నిధనం రణే. 11

వీరుడా! మాయాపురులై జయము గోరు వీరితో నేను జయమునో మరణ మునో కోరుచు పోరుదును.

వాసుదేవం చ పార్థం చ చక్రగాణ్డీవధారిణౌ,
సన్ధ్యాగతా వివార్కేన్దూ సమేష్యేతే రథోత్తమౌ. 12
యే చైవ తే రథోదారాః పాణ్డుపుత్రస్య సైనికాః,
సహసైన్యా నహం తాంశ్చ ప్రతీయాం రణమూర్ధని. 13

చక్రము దాల్చిన వాసుదేవుడు, గాండీవము పట్టిన అర్జునుడు సంధ్యా కాలమునందలి సూర్యచంద్రులవలె ఉత్తమరథముతో కలసివత్తురు. వారిని, మరియు పాండుపుత్రుని రథవరులను, వారి సైనికులతోపాటు రణరంగమున నేను ఎదుర్కొందును.

ఏతే రథాశ్చాతిరథాశ్చ తుభ్యం
యథాప్రధానం నృప కీర్తితా మయా,
తథాఽపరే యేఽర్ధరథాశ్చ కేచి
త్తథైవ తేషామపి కౌరవేన్ద్ర. 14

కౌరవరాజా! నీవారిలో ముఖ్యులైన రథులను, అతిరథులను, అర్ధరథులను పేర్కొంటిని. అట్లే పాండవుల వారిని కూడా వివరించితిని.

అర్జునం వాసుదేవం చ యే చాన్యే తత్ర పార్థివాః,
సర్వాం స్తాన్ వారయిష్యామి యావద్ద్రక్ష్యామి భారత. 15

నా కంట చూపున్నంతవరకు అర్జునుని, వాసుదేవుని ఇంకను అందున్న రాజుల నందరను నిలువరింపగలను.

పాఞ్చాల్యం తు మహాబాహో నాహం హన్యాం శిఖణ్డినమ్,
ఉద్యతేషు మథో దృష్ట్వా ప్రతియుధ్యన్తమాహవే. 16

పాంచాలరాజు శిఖండి మాత్రము బాణమెత్తుకొని ఎదురుగా నిలిచి పోరుట చూచితినేని నేను వానిని చంపను.

---

12. రథోత్తమౌ - అగ్ని యొసగినది, ఉత్తమరథము కలవారని భావము - ఆహితాగ్ని మొదలగువానిలో చేరుటవలన 'ఉత్తమ' పదము ఉత్తర పదముగా నుండదగును. లేదా రథమునందు - రథయుద్ధమునందు ఉత్తములు అనియు చెప్పదగును.

లోక స్తం వేద యదహం పితుః ప్రియచికీర్షయా,
ప్రాప్తం రాజ్యం పరిత్యజ్య బ్రహ్మచర్యవ్రతే స్థితః. 17

తండ్రికి ప్రియము చేయగోరి చేతికి చిక్కిన రాజ్యమును వదలి బ్రహ్మచర్యవ్రతమున నెలకొన్న యీ నన్ను లోక మెరుగును.

చిత్రాఙ్గదం కౌరవాణా మాధిపత్యేఽభ్యషేచయమ్,
విచిత్రవీర్యం చ శిశుం యౌవరాజ్యేఽభ్యషేచయమ్. 18

చిత్రాంగదుని కౌరవులకు అధిపతిగా అభిషేకించితిని. పసివాడగు విచిత్రవీర్యుని యువరాజుగా అభిషేకించితిని.

దేవవ్రతత్వం విజ్ఞాప్య పృథివీం సర్వరాజసు,
నైవ హన్యాం స్త్రియం జాతు న స్త్రీపూర్వం కదాచన. 19

భూమిలో గల రాజులకెల్ల దేవవ్రతత్వమును ప్రకటించిన నేను స్త్రీని, ఒకప్పుడు స్త్రీయై యున్నవానిని ఎన్నటికి చంపను.

స హి స్త్రీపూర్వకో రాజన్ శిఖండీ యది తే శ్రుతః,
కన్యా భూత్వా పుమాన్ జాతో న యోత్స్యే తేన భారత. 20

రాజా! నీవు వినియే యుందువు. ఆ శిఖండి మొదట ఆడుజాతి. కన్యగా పుట్టి మగవాడయ్యెను. భారతా! ఆ కారణమున నేను వానితో పోరాడను.

సర్వాం స్త్వన్యాన్ హనిష్యామి పార్థివాన్ భరతర్షభ,
యాన్ సమేష్యామి సమరే న తు కున్తీసుతా న్నృప. 21

నా కెదురైన తక్కిన రాజుల నందరను యుద్ధమున చంపివైచెదను. రాజా! కుంతికొడుకులను మాత్రము చంపను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి రథాతిరథసంఖ్యానపర్వణి
ద్విసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున రథాతిరథసంఖ్యానపర్వమున
నూటడెబ్బదిరెండవ అధ్యాయము.

సమాప్తం రథాతిరథసంఖ్యానపర్వ.
రథాతిరథసంఖ్యానపర్వము ముగిసెను.

—:o:—

19. దేవవ్రతత్వమ్ - బ్రహ్మచారివ్రతమును పాటించుట. అట్టివాడు స్త్రీ కెదురుగా పోవుట యనగా దృష్టిమైథున మను దోషము వాటిల్లును. మొదట ఆడుదియై యిప్పుడు పురుషుడుగా నున్నవానిని చూచుటయు దోషమే. వాని స్త్రీభావమును స్మరించుటచేత వికారము కలుగవచ్చును.

# అమ్బోపాఖ్యానపర్వ - ౧౦

# అంబోపాఖ్యానపర్వము - 10

## త్రిసప్తత్యధికశతతమోఽధ్యాయః

## నూటడెబ్బదిమూడవ అధ్యాయము

**అమ్బోపాఖ్యానారమ్భః - భీష్మకర్తృకం కాశిరాజకన్యానా మపహరణమ్.**

**అంబోపాఖ్యానారంభము - భీష్ముడు చేసిన కాశిరాజకన్యకల అపహరణము.**

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

కిమర్థం భరతశ్రేష్ఠ నైవ హన్యాః శిఖణ్డినమ్,
ఉద్యతేషు మథో దృష్ట్వా సమరే ష్వాతతాయినమ్. 1

భరతశ్రేష్ఠా! యుద్ధములలో బాణమెత్తుకొని ప్రాణాంతకుడై కానవచ్చు శిఖండిని నీవేల చంపవు?

పూర్వ ముక్త్వా మహాబాహో పఞ్చాలాన్ సహ సోమకైః,
హనిష్యామీతి గాఙ్గేయ తన్మే బ్రూహి పితామహ. 2

తాతా! గంగానందనా! మునుపు పాంచాలురను, సోమకులతోపాటు చంపుదునని పలికితివి గదా! దాని సంగతి నాకు చెప్పుము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

శృణు దుర్యోధన కథాం సహైభి ర్వసుధాధిపైః,
యదర్థం యుధి సంప్రేక్ష్య నాహం హన్యాం శిఖణ్డినమ్. 3

దుర్యోధనా! యుద్ధమున శిఖండిని గాంచి నే నేల చంపనో ఆ కథను ఈ రాజు లందరితోపాటు ఆలకింపుము.

మహారాజో మమ పితా శాన్తను ర్లోకవిశ్రుతః,
దిష్టాన్త మాప ధర్మాత్మా సమయే భరతర్షభ! 4

లోకములందు ప్రసిద్ధుడు, ధర్మాత్ముడు, నా తండ్రి శాంతనుడు ఒక కాలమున మరణ మొందెను.

తతోఽహం భరతశ్రేష్ఠ ప్రతిజ్ఞాం పరిపాలయన్,
చిత్రాఙ్గదం భ్రాతరం వై మహారాజ్యేఽభ్యషేచయమ్. 5

అంత నేను చేసిన ప్రతిజ్ఞను పరిపాలించుచు తమ్ముడు చిత్రాంగదుని మహారాజ్యమున అభిషేకించితిని.

తస్మింశ్చ నిధనం ప్రాప్తే సత్యవత్యా మతే స్థితః,
విచిత్రవీర్యం రాజాన మభ్యషిఞ్చం యథావిధి. 6

అతడును మరణింపగా సత్యవతియిష్టమునుబట్టి విచిత్రవీర్యుని రాజుగా యథావిధిగా అభిషేకించితిని.

మయాఽభిషిక్తో రాజేన్ద్ర యవీయానపి ధర్మతః,
విచిత్రవీర్యో ధర్మాత్మా మామేవ సముదైక్షత. 7

ధర్మమునుబట్టి నేను చిన్నవానినైనను అతనిని అభిషేకింపగా ధర్మాత్ముడగు విచిత్రవీర్యుడు నన్నే పెద్దగా సంభావించెను.

తస్య దారక్రియాం తాత చికీర్షు రహమ ప్యుత,
అనురూపాదివ కులా దిత్యేవ చ మనో దధే. 8

నాయనా! అనురూపమైన కులమునుండియే వానికి ధర్మపత్నిని తేవలయునని కోరితిని.

తథాఽశ్రౌషం మహాబాహో తిస్రః కన్యాః స్వయంవరాః,
రూపేణాప్రతిమాః సర్వాః కాశిరాజసుతా స్తదా,
అమ్బాం చైవామ్బికాం చైవ తథై వామ్బాలికామపి. 9

అపుడు రూపమున సాటిలేని వారిని అంబ, అంబిక, అంబాలిక అను కాశిరాజ కన్యకలను, స్వయంవరమున ఉన్నవారినిగూర్చి వింటిని.

---

4. దిష్టాన్తమ్ - మరణమును.

రాజానశ్చ సమాహూతాః పృథివ్యాం భరతర్షభ.

భరతశ్రేష్ఠా! భూమిపై గల రాజుల నందరిని కాశిరాజు స్వయంవరమున కాహ్వానించెను.

అమ్బా జ్యేష్ఠాఽభవ త్తాసామమ్బికా త్వథ మధ్యమా,
అమ్బాలికా చ రాజేన్ద్ర రాజకన్యా యవీయసీ. 10

వారిలో అంబ పెద్దది, అంబిక రెండవది. అంబాలిక అను రాజకన్య చిన్నది.

సోఽహ మేకరథేనైవ గతః కాశిపతేః పురీమ్, 11
అపశ్యం తా మహాబాహో తిస్రః కన్యాః స్వలంకృతాః,
రాజ్ఞశ్చైవ సమాహూతాన్ పార్థివాన్ పృథివీపతే. 12

అంత నేను ఒక్క రథముతో కాశిపతి పురమున కరిగితిని. చక్కగా అలంకరించుకొన్న ఆ ముగ్గురు కన్యలను, ఆహూతులైన రాజుల నందరిని చూచితిని.

తతోఽహం తాన్నృపాన్ సర్వా నాహూయ సమరే స్థితాన్
రథ మారోపయాంచక్రే కన్యా స్తా భరతర్షభ. 13

అంత పోరునకు సిద్ధపడియున్న ఆ రాజుల నందరిని యుద్ధమునకు పిలిచి ఆ కన్యలను రథ మెక్కించుకొంటిని.

వీర్యశుల్కాశ్చ తా జ్ఞాత్వా సమారోప్య రథం తదా,
అవోచం పార్థివాన్ సర్వా నహం తత్ర సమాగతాన్. 14

ఆ కన్యలను పరాక్రమమునకు దక్కువారినిగా నెరిగి రథ మెక్కించుకొని అచట మూగిన రాజు లందరితో నిట్లు పలికితిని.

భీష్మః శాన్తనవః కన్యా హరతీతి పునః పునః,
తే యతధ్వం పరం శక్త్యా సర్వే మోక్షాయ పార్థివాః,
ప్రసహ్య హి హరామ్యేష మిషతాం వో నరర్షభాః. 15

"ఇదిగో శాంతను కుమారుడు, భీష్ముడు వీరిని దక్కించుకొనుచున్నాడు. విడిపించుటకై రాజు లందరును శక్తిమేరకు ప్రయత్నింపుడు. ఇదిగో మీరందరు కట్టగట్టుకొని వచ్చినను బలాత్కారముగా వీరిని కొనిపోవుచున్నాను".

తతస్తే పృథివీపాలాః సముత్పేతు రుదాయుధాః,
యోగో యోగ ఇతి క్రుద్ధాః సారథీ నభ్యచోదయన్. 16

అంత నా రాజు లందరు ఆయుధము లెత్తుకొని రండు కూడుడు అని సారథులను పురికొల్పుచు తీవ్రకోపముతో నాపై వచ్చి పడిరి.

తే రథై ర్గజసంకాశై ర్గజైశ్చ గజయోధినః,
పత్తై శ్చాశ్వై ర్మహీపాలాః సముత్పేతు రుదాయుధాః. 17

ఏనుగులవంటి రథములతో రథులు, ఏనుగులతో ఏనుగులవారు, బలిసిన గుఱ్ఱములతో ఆశ్వికులైన రాజులు ఆయుధము లెత్తిపట్టుకొని నాపై దుమికిరి.

తతస్తే మాం మహీపాలాః సర్వ ఏవ విశాంపతే,
రథవ్రాతేన మహతా సర్వతః పర్యవారయన్. 18

అంత నా రాజు లందరు రథముల గుంపులతో అన్నివైపుల నన్ను చుట్టుముట్టిరి.

తానహం శరవర్షేణ సమన్తాత్ పర్యవారయమ్,
సర్వాన్నృపాంశ్చా ప్యజయం దేవరాజేవ దానవాన్. 19

నేనును వారి నందరిని బాణముల వానతో అన్నివైపుల చుట్టు ముట్టితిని. దేవేంద్రుడు దానవులనువలె నే నా రాజుల నందరిని జయించితిని.

అపాతయం శరై ర్దీప్తైః ప్రహసన్ భరతర్షభ,
తేషా మాపతతాం చిత్రాన్ ధ్వజాన్ హేమపరిష్కృతాన్. 20

వచ్చి మీద పడుచున్న ఆ రాజుల విచిత్రములగు ధ్వజములను, సువర్ణాభరణములు కలవానిని మండుచున్న బాణములతో నవ్వుచు నేలఁ గూల్చితిని.

ఏకై కేన హి బాణేన భూమౌ పాతితవా నహమ్,
హయాం స్తేషాం గజాంశ్చైవ సారథీం శ్చాప్యహం రణే. 21

బాణమున కొక్కటిగా వారి గుఱ్ఱములను, ఏనుగులను, సారథులను నేను నేల గూలనేసితిని.

తే నివృత్తాశ్చ భగ్నాశ్చ దృష్ట్వా తల్లాఘవం మమ.

ఆ నా చేతి ఒడుపు చూచి వారు విరిగి పారిరి.

[ప్రణిపేతుశ్చ సర్వే వై ప్రశశంసుశ్చ పార్థివాః,
తత ఆదాయ తాః కన్యా నృపతీం శ్చ విసృజ్య తాన్.]
అథాహం హస్తినపుర మాయాం జిత్వా మహీక్షితః. 22

[ఆ రాజు లందరు నాకు ప్రణమిల్లిరి. పొగడ్తలు చేసిరి. అంత నేనా కన్యలను గైకొని రాజులను వదలి] హస్తినాపురమునకు తిరిగి వచ్చితిని.

తతో౽హం తాశ్చ కన్యా వై భ్రాతు రర్థాయ భారత,
తచ్చ కర్మ మహాబాహో సత్యవత్యై న్యవేదయమ్. 23

అటుపై నేను సోదరునికై చేసిన ఆ కార్యమును, ఆ కన్యలను సత్యవతీ దేవికి నివేదించితిని.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
కన్యాహరణే త్రిసప్తత్యధికశతతమో౽ధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
కన్యలను తెచ్చుట యను నూటడెబ్బదిమూడవ అధ్యాయము.

—: o :—

## చతుఃసప్తత్యధికశతతమోఽధ్యాయః

## నూటడెబ్బదినాలుగవ అధ్యాయము

**అమ్బయా శాల్వరాజేఽనురాగం ప్రకటయ్య తత్పార్శ్వం గన్తుం భీష్మతోఽనుజ్ఞాయాః ప్రార్థనమ్.**

**అంబ శాల్వరాజునందు అనురాగమును ప్రకటించి అతనికడ కరుగుటకు భీష్ముని అనుజ్ఞను వేడుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతోఽహం భరతశ్రేష్ఠ మాతరం వీరమాతరమ్,
అభిగమ్యోపసంగృహ్య దాశేయీ మిద మబ్రువమ్. 1

భరతశ్రేష్ఠా! అంత నేను వీరమాత యగు తల్లిని సమీపించి పాదములకు మ్రొక్కి దాశరాజు కూతుతో నిట్లంటిని.

ఇమాః కాశిపతేః కన్యా మయా నిర్జిత్య పార్థివాన్,
విచిత్రవీర్యస్య కృతే వీర్యశుల్కా హృతా ఇతి. 2

'నేను రాజులను ఓడించి యీ కాశిరాజు కన్యలను విచిత్రవీర్యునికొరకు వీర్యశుల్కలనుగా హరించి తెచ్చితిని' అని చెప్పితిని.

తతో మూర్ధ న్యుపాఘ్రాయ పర్యశ్రునయనా నృప,
ఆహ సత్యవతీ హృష్టా దిష్ట్యా పుత్ర జితం త్వయా। 3

అంత సత్యవతి కన్నులలో ఆనందబాష్పములు నిండగా నా శిరసు మూర్కొని ఆనందించినదై 'కొడుకా! దైవవశమున గెలిచితివి' అని పలికెను.

---

1. ఉపసంగృహ్య - పాదములకు ప్రణమిల్లి.
2. వీర్యశుల్కాః - వీర్యమే మూల్యముగా గలవారు. పరాక్రమముతో కొనదగిన వారని తాత్పర్యము.

సత్యవత్యా స్త్వనుమతే వివాహే సముపస్థితే,
ఉవాచ వాక్యం సవ్రీడా జ్యేష్ఠా కాశిపతేః సుతా. 4

సత్యవతి ఒప్పుకొన్న వివాహసమయము వచ్చిన సమయమున కాశిరాజు పెద్దబిడ్డ సిగ్గుపడుచు నిట్లు పలికెను.

భీష్మ త్వమసి ధర్మజ్ఞః సర్వశాస్త్రవిశారదః,
శ్రుత్వా చ వచనం ధర్మ్యం మహ్యం కర్తు మిహార్హసి. 5

భీష్మా! నీవు ధర్మ మెరిగినవాడవు. సర్వశాస్త్రములలో నిండైన పాండిత్యము కలవాడవు. నా మాట విని ధర్మము తప్పని పని నాకై చేయదగును.

మయా శాల్వపతిః పూర్వం మనసాఽభివృతో వరః,
తేన చాస్మి వృతా పూర్వం రహ స్యవిదితే పితుః. 6

నేను శాల్వరాజును మున్ను మనసులో వరించితిని. ఆతడును నన్ను వరించెను. ఇది మా తండ్రికి తెలియకుండ రహస్యముగా జరిగినది.

కథం మా మన్యకామాం త్వం రాజధర్మ మతీత్య వై,
వాసయేథా గృహే భీష్మ కౌరవః సన్ విశేషతః. 7

రాజధర్మము నతిక్రమించి, విశేషించి, కురువంశమువాడవై ఇతరుని కామించిన నన్ను ఎట్లు నీ గృహమున నిలుపుకొందువు?

ఏతద్బుద్ధ్యా వినిశ్చిత్య మనసా భరతర్షభ,
యత్ క్షమం తే మహాబాహో తదిహారబ్ధు మర్హసి. 8

దీనిని చక్కగా బుద్ధితో మనసుతో విచారించి యేది యోగ్యమో అది చేయదగును.

స మాం ప్రతీక్షతే వ్యక్తం శాల్వరాజో విశాంపతే,
తస్మాన్మాం త్వం కురుశ్రేష్ఠ సమనుజ్ఞాతు మర్హసి. 9

ఆ శాల్వరాజు నాకై యెదురు చూచుచుండును. కావున ఓ రాజా! నా కనుమతి నొసగవలయును.

కృపాం కురు మహాబాహో మయి ధర్మభృతాం వర,
త్వం హి సత్యవ్రతో వీర పృథివ్యా మితి నః శ్రుతమ్. 10

ఓ మహాబాహూ! ధర్మపాలకులలో శ్రేష్ఠుడా! నాయందు కృప చేయుము. నీవు భూమిపై సత్యవ్రతుడ వని మేము వినియుంటిమి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
అమ్బావాక్యే చతుఃసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
అంబవాక్యముగల నూటడెబ్బదినాలుగవ అధ్యాయము.

—: ౦ :—

10. సత్యవ్రతః - సత్యమునందు - చెడని బ్రహ్మచర్యమునందు నిష్ఠ గలవాడవు.

## పఞ్చసప్తత్యధికశతతమోఽధ్యాయః

## నూటడెబ్బదియైదవ అధ్యాయము

**శాల్వసమీపం గత్వా తతః పరిత్యక్తాయా అమ్బాయా స్తాపసాశ్రమే గమనం, శైఖావత్యేన సహ తస్యాః సంవాదశ్చ,**

**శాల్వునికడ కరిగి యాతడు తిరస్కరింపగా అంబ తాపసాశ్రమమున కరుగుట. శైఖావత్యునితో ఆమె సంవాదము చేయుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

తతోఽహం సమనుజ్ఞాప్య కాలీం గన్ధవతీం తదా,
మన్త్రిణ శ్చర్త్విజశ్చైవ తథైవ చ పురోహితాన్. 1
సమనుజ్ఞాసిషం కన్యా మమ్బాం జ్యేష్ఠాం నరాధిప,
అనుజ్ఞాతా యయౌ సా తు కన్యా శాల్వపతేః పురమ్. 2

అంత నేను గంధవతిని, మంత్రులను, ఋత్విక్కులను, పురోహితులను ఒప్పించి కాశిరాజు పెద్దకూతురు అంబ యను కన్యను శాల్వునికడ కరుగుట కనుమతించితిని. అట్లనుమతి గొన్న యా యమ శాల్వరాజుపురమున కరిగెను.

వృద్ధై ర్ద్విజాతిభి ర్గుప్తా ధాత్ర్యా చానుగతా తదా,
అతీత్య చ తమధ్వాన మాసాద్య నృపతిం తథా. 3

వృద్ధులగు బ్రాహ్మణులు కాపాడుచుండగా దాది వెంటనంటి రాగా ఆమె దారి కడను ఆ రాజును చేరుకొనెను.

సా తమాసాద్య రాజానం శాల్వం వచన మబ్రవీత్,
ఆగతాఽహం మహాబాహో త్వా ముద్దిశ్య మహామతే. 4

ఆ రాజును చేరుకొని ఆమె అతనితో 'ఓ మహామతీ! మహాబాహూ! నిన్ను గూర్చి వచ్చిన దానను' అని పలికెను.

[అభినన్దస్వ మాం రాజన్ సదా ప్రియహితే రతామ్,
ప్రతిపాదయ మాం రాజన్ ధర్మార్థం చైవ ధర్మతః,
త్వం హి మే మనసా ధ్యాత స్త్వయా చాప్యుపమన్త్రితా.

రాజా! నన్నిష్టపడుము. ఎల్లవేళల నీ హితప్రియములయందు ఆసక్తితో నుందును. ధర్మమునుబట్టి నన్ను ధర్మముకొరకు నియోగింపుము. నా మనస్సున నిన్నే ధ్యానించితిని. నీవును నాతో ప్రియముగా పలికియుంటివి.]

తామబ్రవీ చ్ఛాల్వపతిః స్మయన్నివ విశాంపతే,
త్వయాఽన్యపూర్వయా నాహం భార్యార్థీ వరవర్ణిని. 5

శాల్వరాజామెను చూచి నవ్వుచు ఇట్లనెను. నీవు మరియొకరిదానవు. నేను నిన్ను భార్యగా అభిలషింపను.

గచ్ఛ భద్రే పునస్తత్ర సకాశం భీష్మకస్య వై,
నాహమిచ్ఛామి భీష్మేణ గృహీతాం త్వాం ప్రసహ్య వై. 6

ఓ కాంతా! నీ వా భీష్మునికడకే తిరిగిపొమ్ము. బలాత్కారముగా భీష్ముడు పట్టుకొన్న నిన్ను నేను వాంఛింపను.

త్వం హి భీష్మేణ నిర్జిత్య నీతా ప్రీతిమతీ తదా,
పరామృశ్య మహాయుద్ధే నిర్జిత్య పృథివీపతీన్. 7

'భీష్ముడు మహాయుద్ధమున రాజుల నందరిని ఓడించి ప్రీతిగల నిన్ను తాకికొని పోయెను'.

నాహం త్వయ్యన్యపూర్వాయాం భార్యార్థీ వరవర్ణిని.
కథ మస్మద్విధో రాజా పరపూర్వాం ప్రవేశయేత్, 8
నారీం విదితవిజ్ఞానః పరేషాం ధర్మ మాదిశన్,

మునుపు మరియొకడు గొన్న నిన్ను నేను భార్యగా వాంఛింపను. విజ్ఞాన మెరిగి యితరులకు ధర్మము నుపదేశించు నా వంటి రాజు మరియొకనికి ముందే అర్పితయైన స్త్రీని ఎట్లు ఇల్లు చొరనిచ్చును?

---

7. పరామృశ్య - చేతితో పట్టుకొని.

యథేష్టం గమ్యతాం భద్రే మా త్వాం కాలోఽత్యగా దయమ్. 9

ఓ కాంతా! నీ యిచ్చ వచ్చిన చోటి కరుగుము. ఇంకను నీకు కాలము మించి పోలేదు.

అమ్బా తమబ్రవీ ద్రాజ న్ననఙ్గశరపీడితా,
నైవం వద మహీపాల నైతదేవం కథఞ్చన. 10

అంబ మన్మథుని బాణములకు నొచ్చినదై యాతనితో నిట్లు పలికెను: రాజా! నీ విట్లు పలుకవలదు. ఇది యెన్నటికిని ఇట్లు కాదు.

నాస్మి ప్రీతిమతీ నీతా భీష్మేణామిత్రకర్శన,
బలా న్నీతాస్మి రుదతీ విద్రావ్య పృథివీపతీన్. 11

భీష్ముడు ప్రీతి గలిగిన నన్ను కొనిపోలేదు. రాజుల నందరను పార ద్రోలి ఏడ్చుచున్న నన్ను బలాత్కారముగా లాగుకొనిపోయెను.

భజస్వ మాం శాల్వపతే భక్తాం బాలా మనాగసమ్,
భక్తానాం హి పరిత్యాగో న ధర్మేషు ప్రశస్యతే. 12

ఓ శాల్వరాజా! నీయందు భక్తి గలదానను, చిన్నదానను, ఏ పాపము ఎరుగనిదానను. నన్ను కైకొనుము. భక్తులను విడనాడుటను ధర్మశాస్త్రములు మెచ్చవు.

సాఽహ మామన్త్ర్య గాఙ్గేయం సమరే ష్వనివర్తినమ్,
అనుజ్ఞాతా చ తేనైవ తతోఽహం భృశ మాగతా. 13

అట్టి నేను పోరులలో తిరుగులేని గంగానందనుని వీడ్కొని, అతడే అనుమతింపగా తొందరగా నీకడకు వచ్చితిని.

న స భీష్మో మహాబాహు ర్మా మిచ్ఛతి విశామ్పతే,
భ్రాతృహేతోః సమారమ్భో భీష్మ స్యేతి శ్రుతం మయా. 14

రాజా! మహాబాహు వగు భీష్మునకు నాపై కోరికలేదు భీష్ముని ఈ ఆర్భాట మంతయు తమ్మునికొరకు అని నేను వింటిని.

భగిన్యౌ మమ యే నీతే అమ్బికామ్బాలికే నృప,
ప్రాదా ద్విచిత్రవీర్యాయ గాఙ్గేయో హి యవీయసే. 15

గంగాతనయుడు నా చెల్లెండ్రు అంబిక, అంబాలిక అను వారిని తన తమ్ముడు విచిత్రవీర్యున కొసగెను.

యథా శాల్వపతే నాన్యం వరం ధ్యామి కథఞ్చన,
త్వామృతే పురుషవ్యాఘ్ర తథా మూర్ధాన మాలభే. 16

రాజా! శాల్వపతీ! నిన్ను గాక వేరొక వరుని మనసులో కూడా తలప లేదని తల అంటి ప్రమాణము చేయుదును

న చాన్యపూర్వా రాజేన్ద్ర త్వా మహం సముపస్థితా,
సత్యం బ్రవీమి శాల్వైతత్ సత్యే నాత్మాన మాలభే. 17

రాజేంద్రా! శాల్వా! నేను పరకీయనై నీకడకు రాలేదు. సత్యము పలుకుచున్నాను. సత్యముపై ఒట్టువేసి చెప్పుచున్నాను.

భజస్వ మాం విశాలాక్ష స్వయం కన్యా ముపస్థితామ్,
అనన్యపూర్వాం రాజేన్ద్ర త్వత్ప్రసాదాభికాఙ్క్షిణీమ్. 18

విశాలాక్షా! కన్యను స్వయముగా వచ్చినదానను, మరియొకపురుషు నెరుగనిదానను, నీ అనుగ్రహము కోరుచున్నదానను అగు నన్ను చేకొనుము.

తా మేవం భాషమాణాం తు శాల్వః కాశిపతేః సుతామ్,
అత్యజద్ భరతశ్రేష్ఠ జీర్ణాంత్వచ మివోరగః. 19

ఇట్లు పలుకుచున్న కాశిరాజసుత నా శాల్వుడు ఎండిన కుబుసమును పాము వదలినట్లు వదలి వైచెను.

ఏవం బహువిధై ర్వాక్యై ర్యాచ్యమాన స్తయా నృపః,
నాశ్రద్దధా చ్ఛాల్వపతిః కన్యాయాం భరతర్షభ. 20

భరతర్షభా! ఇట్లు పలుపలుకులతో ఎంతగా వేడికొన్నను ఆ రాజు ఆ కన్యయందు నమ్మకము పెట్టలేదు.

తతః సా మన్యునాఽవిష్టా జ్యేష్ఠా కాశిపతేః సుతా,
అబ్రవీత్ సాశ్రునయనా బాష్పవిప్లుతయా గిరా. 21

అంత కాశిరాజు పెద్దబిడ్డ కోపము పైకొనగా కన్నీటితో, దుఃఖముతో చిందర వందరయైన వాక్కుతో ఇట్లు పలికెను.

త్వయా త్యక్తా గమిష్యామి యత్ర తత్ర విశాంపతే,
తత్ర మే గతయః సన్తు సన్తః సత్యం యథా ధ్రువమ్. 22

రాజా ! నీవు విడనాడగా నేను ఎందు బోయెదనో అందు నాకు సాధు జనులే సంరక్షకు లగుదురుగాక. సత్యము స్థిరమై నిలుచుగాక !

ఏవం తాం భాషమాణాం తు కన్యాం శాల్వపతి స్తదా,
పరితత్యాజ కౌరవ్య కరుణం పరిదేవతీమ్. 23

ఇట్లు పలుకుచు జాలిగా ఏడ్చుచున్న ఆమెను శాల్వపతి వదలివైచెను.

గచ్ఛ గచ్ఛేతి తాం శాల్వః పునః పున రభాషత,
బిభేమి భీష్మాత్ సుశ్రోణి త్వం చ భీష్మపరిగ్రహః. 24

ఓ యమ్మా ! వెళ్ళు వెళ్ళు. నాకు భీష్ముడన్న భయము. నీ వేమో అతడు చేపట్టినదానవు అని పెక్కుమారులు పలికెను.

ఏవ ముక్తా తు సా తేన శాల్వే నాదీర్ఘదర్శినా,
నిశ్చక్రామ పురాద్దీనా రుదతీ కురరీ యథా. 25

దూరపుచూపులేని శాల్వు డట్లు పలుకగా ఆమె జాలిగా గొర్జెవలె ఏడ్చుచు ఆ పురము నుండి వెలువడెను.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

నిష్క్రామన్తీ తు నగరా చ్చిన్తయామాస దుఃఖితా,
పృథివ్యాం నాస్తి యువతి ర్విషమస్థతరా మయా. 26

అట్లేడ్చుచు నగరమునుండి వెలువడుచున్న ఆమె యిట్లు చింతించెను; ఇంతటి ఘోరావస్థలో ఉన్న నావంటి యువతి వేరొకతె భూమిపై నుండదు.

---

22. సన్తః - సాధుజనులు; గతయః - రక్షకులు-సాధుజనులు రక్షకులుగా నున్నచోటికి అనగా తాపసాశ్రమముల వంటి తావులకు అని యర్థము-అనగా, సంసారసుఖము లభింపని తావునకు బోవుచున్నదాన నని సూచన.

23. కరుణం - జాలిగా; పరిదేవతీమ్ - ఏడ్చుచున్నదానిని.

25. అదీర్ఘదర్శినా - చక్కనివిచారము లేని - ధర్మపరుడు కాని అని తాత్పర్యము.

బన్ధుభి ర్విప్రహీణాఽస్మి శాల్వేన చ నిరాకృతా,
న చ శక్యం పునర్గన్తుం మయా వారణసాహ్వయమ్. 27

చుట్టములు లేనిదాననైతిని. శాల్వుడేమో నిరాకరించెను. తిరిగి కరిపురమున కరుగజాలను.

అనుజ్ఞాతా తు భీష్మేణ శాల్వ ముద్దిశ్య కారణమ్,
కిం ను గర్హా మ్యథాత్మాన మథ భీష్మం దురాసదమ్. 28

శాల్వుని కారణముగా పేర్కొని భీష్ముని అనుమతి పొంది వచ్చితిని. ఇందు నన్ను నేనే నిందించుకొందునా? మహావీరుడగు భీష్ముని నిందింతునా?

అథవా పితరం మూఢం యో మేఽకార్షీత్ స్వయంవరమ్.

లేక నాకు స్వయంవరము చేసిన తెలివితక్కువ తండ్రిని నిందింతునా?

మయాఽయం స్వకృతో దోషో యాఽహం భీష్మరథా త్తదా. 29
ప్రవృత్తే దారుణే యుద్ధే శాల్వార్థం నాపతం పురా.

ఇది యంతయు నేను చేతులార చేసిన తప్పు. ఘోరమగు పోరు జరుగుచుండగా అప్పుడే శాల్వునికొరకు భీష్మ రథమునుండి దూకనైతిని.

తస్యేయం ఫలనిర్వృత్తి ర్యదాపన్నాస్మి మూఢవత్. 30

దాని కిదిగో ఫలపాకము. మూఢురాలివలె ఘోరమగు ఆపద నందితిని.

ధిగ్భీష్మం ధిక్చ మే మన్దం పితరం మూఢచేతసమ్.
యేనాహం వీర్యశుల్కేన పణ్యస్త్రీవ ప్రచోదితా. 31

ఛీ! భీష్ము డెంత నీచుడు! ఛీ నా తండ్రి ఎంత తెలివితక్కువ వాడు! వీర్యశుల్కము పేర ఆతడు నన్నొక వెలయాలుగా తోలినాడు.

ధిఙ్మాం ధిక్ శాల్వరాజానం ధిగ్ ధాతార మథాపి వా,
యేషాం దుర్నీతభావేన ప్రాప్తాఽస్మ్యాపద ముత్తమామ్. 31

ఛీ! నే నెంత నీచురాలను! ఛీఛీ! శాల్వు డెంత దుష్టుడు! ఛీ! బ్రహ్మ యెంత కఠినుడు. వీరందరి దుష్టనీతివలన ఘోరమగు ఆపద పొందితిని.

---

27. వారణసాహ్వయమ్ - వారణముతో హస్తితో సమానమగు పేరుగల నగరము - హస్తినాపురము.

సర్వథా భాగధేయాని స్వాని ప్రాప్నోతి మానవః,
అనయ స్యాస్య తు ముఖం భీష్మః శాన్తనవో మమ. 33

మానవుడు అన్ని విధముల తన కర్మఫలములను పొందుచుండును. ఈ నీతిమాలిన పనికి ప్రారంభకుడు శంతనుకుమారుడు భీష్ముడు.

సా భీష్మే ప్రతికర్తవ్య మహం పశ్యామి సాంప్రతమ్,
తపసా వా యుధా వాఽపి దుఃఖహేతుః స మే మతః. 34

ఇప్పుడు నేను భీష్మునిపై పగదీర్చుకొను దారి చూడవలయును. అది తపస్సుచేతనో, యుద్ధముచేతనో కావలెను. నా దుఃఖమునకు కారణ మాతడే యని నా అభిప్రాయము.

కో ను భీష్మం యుధా జేతు ముత్సహేత మహీపతిః,
ఏవం సా పరినిశ్చిత్య జగామ నగరా ద్బహిః. 35

భీష్ముని యుద్ధమున గెలువ నుంకించు రాజెవ్వడు ? ఇట్లామె చింతించి ఒక నిశ్చయమునకు వచ్చి నగరము వెలుపలి కరిగెను.

ఆశ్రమం పుణ్యశీలానాం తాపసానాం మహాత్మనామ్,
తతస్తా మవస ద్రాత్రిం తాపసైః పరివారితా. 36

పుణ్యశీలురు, మహాత్ములు అగు తాపసుల ఆశ్రమము చేరుకొని ఆ రాత్రి తాపసుల నడుమ నివసించెను.

ఆచఖ్యౌ చ యథావృత్తం సర్వ మాత్మని భారత,
విస్తరేణ మహాబాహో నిఖిలేన శుచిస్మితా.
హరణం చ విసర్గం చ శాల్వేన చ విసర్జనమ్. 37

ఆ శుచిస్మిత వారికి భీష్ము డపహరించుట, శాల్వునికడ కంపుట, శాల్వుడు పరిత్యజించుట - అను జరిగిన వృత్తాంత మంతయు వివరించి చెప్పెను.

తత స్తత్ర మహా నాసీద్ బ్రాహ్మణః సంశితవ్రతః,
శైఖావత్య స్తపోవృద్ధః శాస్త్రే చారణ్యకే గురుః. 38

---

38. శైఖావత్యః - శిఖావంతు డనగా వహ్ని (జ్వాలలు కలవాడు). దానితో సాధింపదగిన శ్రౌతస్మార్తకర్మములు శైఖావతములు. వానియందు నిపుణుడు శైఖావత్యుడు; ఆరణ్యకే - ఉపనిషత్తునందు; గురుః-బ్రహ్మవేత్త యని యర్థము.

అందు నిష్ఠగా వ్రతములు చేయువాడు, తపస్సు పండినవాడు, శాస్త్రము నందును, అరణ్యకమునందును గురువు, శైఖావత్యుడను గొప్ప బ్రాహ్మణు డొక డుండెను.

ఆర్తాం తా మాహ స మునిః శైఖావత్యో మహాతపాః,
నిఃశ్వసన్తీం సతీం బాలాం దుఃఖశోకపరాయణామ్. 39

దుఃఖముతో దురపిల్లుచున్న ఆ చిన్నదానితో మహాతపస్వియగు ఆ శైఖా వత్యముని యిట్లు పలికెను.

ఏవం గతే తు కిం భద్రే శక్యం కర్తుం తపస్విభిః,
ఆశ్రమస్థై ర్మహాభాగే తపోయుక్తై ర్మహాత్మభిః. 40

అమ్మా! ఇది యిట్లు కాగా ఆశ్రమవాసులగు తాపసులైన మహాత్ములు చేయగలిగినదేమి గలదు?

సా త్వేన మబ్రవీ ద్రాజన్ క్రియతాం మదనుగ్రహః,
ప్రావ్రాజ్య మహ మిచ్ఛామి తప స్తప్స్యామి దుశ్చరమ్. 41

రాజా! అంత నామె ఆతనితో ఇట్లు పలికెను. అయ్యా! నాయందు అను గ్రహము చూపుము. నేను సన్న్యాసమును కోరుచున్నాను. ఎవరికిని చేయశక్యము కాని తపము చేయుదును.

మయైవ యాని కర్మాణి పూర్వదేహే తు మూఢయా,
కృతాని నూనం పాపాని తేషా మేతత్ ఫలం ధ్రువమ్. 42

బుద్ధిహీనురాల నగు నేను పూర్వదేహమున చేసిన పాపకర్మముల ఫలమే యిది. నిక్కము.

నోత్సహే తు పునర్గన్తుం స్వజనం ప్రతి తాపసాః,
ప్రత్యాఖ్యాతా నిరానన్దా శాల్వేన చ నిరాకృతా. 43

తాపసులారా! శాల్వుడు నన్ను నిరాకరించెను. అట్లు అతడు కాదన్న నేను మా బంధువులకడకు తిరిగి పోనిష్టపడను.

---

41. ప్రావ్రాజ్యమ్ - ప్రవ్రజ్య అనగా సన్న్యాసము-అందు తగిన కర్మము- ప్రావ్రాజ్యము.

ఉపదిష్ట మిహేచ్ఛామి తాపస్యం వీతకల్మషాః,
యుష్మాభి ర్దేవసంకాశైః కృపా భవతు వో మయి. 44

పాపరహితులారా! తపస్సు విధానము మీరు నా కుపదేశింపగోరుచున్నాను. దేవతలవంటి మీరు నాయందు దయచూపవలయును.

స తా మాశ్వాసయత్ కన్యాం దృష్టాన్తాగమహేతుభిః,
సాన్త్వయామాస కార్యం చ ప్రతిజజ్ఞే ద్విజైః సహ. 45

ఆ మహర్షి దృష్టాంతములను, లేదా ప్రమాణములను, యుక్తులను చూపి ఆ కన్యను ఊరడించెను. అచటి బ్రాహ్మణులతో కూడి చేయదగిన కార్యమును గూడ తెలియజేసెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
శైఖావత్యాంబాసంవాదే పఞ్చసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
శైఖావత్యుడు అంబయు సంవాదము చేసిన నూటడెబ్బదియయిదవ
అధ్యాయము.

—: o :—

44. తాపస్యమ్ - తపస్సునకు హితమైనది. ధర్మసముదాయము.

45. దృష్టాంతాగమహేతుభిః - దృష్టాంత మనగా లోకసంబంధమైన ఉదాహరణము, ఆగమ మనగా వేదము: హేతు వనగా యుక్తి. వానితో - ప్రారబ్ధకర్మభోగ మనుభవింపక తప్పదని తెలిపి ఊరడిల్లు మని బోధించె నని భావము.

## షట్సప్తత్యధికశతతమోఽధ్యాయః

## నూటడెబ్బదియారవ అధ్యాయము.

**తాపసానా మాశ్రమే రాజర్షే ర్హోత్రవాహనస్య అకృతవ్రణస్య చాగమనం, తాభ్యాం సహాఽమ్బయా వార్తాలాపశ్చ**

**తాపసాశ్రమమునకు రాజర్షి హోత్రవాహనుడును అకృతవ్రణుడును వచ్చుట, వారితో అంబ సంభాషించుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

తతస్తే తాపసాః సర్వే కార్యవన్తోఽభవం స్తదా,
తాం కన్యాం చిన్తయన్తస్తే కిం కార్యమితి ధర్మిణః. 1

అంత నా తపస్వు లందరు ధర్మ మెరిగినవారు కావున ఆ కన్నియను గూర్చి ఆలోచించుచు చేయదగిన దేమి? అని విచారించుచుండిరి.

కేచి దాహుః పితుర్వేశ్మ నీయతా మితి తాపసాః,
కేచి దస్మదుపాలంభే మతిం చక్రు ర్హి తాపసాః. 2

కొందరు తాపసు లామెను ఆమె తండ్రి యింటికి కొనిపోవలయునని పలికిరి. మరికొందరు నన్ను నిందింప బూనుకొనిరి.

కేచి చ్ఛాల్వపతిం గత్వా నియోజ్య మితి మేనిరే,
నేతి కేచి ద్వ్యవస్యన్తి ప్రత్యాఖ్యాతా హి తేన సా. 3

కొందరు శాల్వపతికడ కరిగి అతనినే ఒప్పింపనగునని తలంచిరి. మరి కొంద రట్లు కాదు. అత డింతకుముందే యామెను కాదనెను గదా యని నిశ్చయించిరి.

ఏవం గతే తు కిం శక్యం భద్రే కర్తుం మనీషిభిః,
పున రూచుశ్చ తాం సర్వే తాపసాః సంశితవ్రతాః. 4

చక్కని అనుష్ఠానముగల ఆ తాపసులు 'అమ్మా! ఎంత బుద్ధికుశలు లైనను ఏమి చేయగలరు? అని పలికి పరల ఆమెతో ఇట్లనిరి.

అలం ప్రవ్రజితే నేహ భద్రే శృణు హితం వచః,
ఇతో గచ్ఛస్వ భద్రం తే పితురేవ నివేశనమ్. 5

అమ్మా! సన్న్యాస మింక చాలును. మా హిత వాక్య మాలకింపుము. ఇట నుండి నీ తండ్రి యింటికే పొమ్ము.

ప్రతిపత్స్యసి రాజా స పితా తే యదనన్తరమ్,
తత్ర వత్స్యసి కల్యాణి సుఖం సర్వగుణాన్వితా. 6

ఆ రాజు నీ తండ్రియే చేయదగినది నిర్ణయించును. నీవు మేలు గుణము లతో గూడి అక్కడనే సుఖముగా నివసింపగలవు.

న చ తేఽన్యా గతి ర్న్యాయ్యా భవే ద్భద్రే యథా పితా,
పతిర్వాఽపి గతి ర్నార్యాః పితా వా వరవర్ణిని. 7

నీకు మరియొకగతి న్యాయసమ్మతమైనది లేదు. నీ తండ్రియే నీకు గతి. స్త్రీకి భర్తయో తండ్రియో మాత్రమే దిక్కు.

గతిః పతిః సమస్థాయా విషమే చ పితా గతిః,
ప్రవ్రజ్యా హి సుదుఃఖేయం సుకుమార్యా విశేషతః. 8

అన్నియు చక్కగా నున్న యింటికి పతియే దిక్కు. స్థితి తప్పినచో తండ్రియే గతి. ఈ సంన్యాసపద్ధతి చాల దుఃఖకరమైనది. అందును నీవంటి సుకుమారికి బొత్తిగా సాధ్యము కాదు.

రాజపుత్ర్యాః ప్రకృత్యా చ కుమార్యా స్తవ భామిని,
భద్రే దోషా హి విద్యన్తే బహవో వరవర్ణిని, 9
ఆశ్రమే వై వసన్త్యాస్తే న భవేయుః పితుర్గృహే.

రాజపుత్రికవు. సహజముగా సుకుమారివి. అట్టి నీవు ఆశ్రమములో నివసించుచుండగా ఎన్నో కీడులు సంభవించును. తండ్రియింట నట్టివి కలుగవు.

తత స్త్వన్యే౽బ్రువన్ వాక్యం తాపసాస్తాం తపస్వినీమ్, 10
త్వామి హైకాకినీం దృష్ట్వా నిర్జనే గహనే వనే,
ప్రార్థయిష్యన్తి రాజాన స్తస్మాన్మైవం మనః కృథాః. 11

అంత మరికొందరు తాపసులు ఆ తపస్వినితో 'అమ్మా! నీవు ఒంటరిదానవై యీ జనసంచారము లేని దట్టమైన అడవిలో ఉండుట గాంచి రాజులు నిన్ను అపేక్షింపవచ్చును. కావున నీవు ఈ తపసుపై మనసు నిలుపకుము' అని పలికిరి.

అమ్బోవాచ - అంబ యిట్లనెను.

న శక్యం కాశినగరం పునర్గన్తుం పితుర్గృహాన్,
అవజ్ఞాతా భవిష్యామి బాన్ధవానాం న సంశయః. 12

నే నిప్పుడు తండ్రి యింటినిగూర్చి కాశికానగరమునకు పోవుట సాధ్యము కాదు. అందు బంధువులందరు నన్ను తప్పక చులకనగా చూతురు.

ఉషితాస్మి తథా బాల్యే పితు ర్వేశ్మని తాపసాః,
నాహం గమిష్యే భద్రం వ స్తత్ర యత్ర పితా మమ.

పసితనమునుండియు తండ్రియింట ఎంతో మన్ననతో ఉన్నదానను. మీకు పుణ్యమాయె. నా తండ్రి యింటికి నేను పోను.

తప స్తప్తు మభీప్సామి తాపసైః పరిరక్షితా. 13
యథా పరే౽పి మే లోకే న స్యాదేవం మహాత్యయః,
దౌర్భాగ్యం తాపసశ్రేష్ఠా స్తస్మా త్తప్స్యామ్యహం తపః. 14

---

10. ఆశ్రమములో సన్న్యాసము నవలంబించుటలో ఏ దోషములు కలుగునో అవి తండ్రియింట కలుగవని తాత్పర్యము. అందక త్తెవు, వయసున నున్నదానవు అగు నిన్ను చూచి మునులు కూడ మోహము పొంద వచ్చును. లేదా నీవే ధర్మమునుండి జారవచ్చును - అని భావము.

14. మహాత్యయః - మహ మనగా ఉత్సవము-సంతోషము. అత్యయ మనగా దాని నాశము - సుఖము నశించుట.

తాపసులగు మీరందరు కాపాడుచుండగా ఇక్కడనే తపస్సు చేయగోరు దును. తాపసశ్రేష్ఠులారా! ఇట్టి దౌర్భాగ్యము, ఇంత దుఃఖము నాకు పర లోకమునందును కలుగకుండుగాక. దాకై తపము చేయుదును.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

ఇత్యేవం తేషు విప్రేషు చిన్తయత్సు యథాతథమ్,
రాజర్షి స్తద్వనం ప్రాప్త స్తపస్వీ హోత్రవాహనః. 15

ఇట్లు ఆ విప్రులందరు తోచిన విధముగా ఆలోచనలు చేయుచుండగా తాపసియు, రాజర్షియు నగు హోత్రవాహను డా అడవికి వచ్చెను.

తత స్తే తాపసాః సర్వే పూజయన్తి స్మ తం నృపమ్,
పూజాభిః స్వాగతాద్యాభి రాసనే నోదకేన చ. 16

అంత నా తాపసులందరు సత్కారములతో స్వాగతమర్యాదలతో ఆసనముతో, అర్ఘ్యపాద్యములతో ఆ రాజును పూజించిరి.

తస్యోపవిష్టస్య సతో విశ్రాన్త స్యోపశృణ్వతః,
పునరేవ కథాం చక్రుః కన్యాం ప్రతి వనౌకసః. 17

అతడు కొంతతడవు కూర్చుండి, విశ్రాంతి గైకొని, ఆ యా మంచి విషయములు వినుచున్న సమయమున ఆ తాపసులు ఆ కన్యనుగూర్చి ప్రసం గము చేసిరి.

అమ్బాయా స్తాం కథాం శ్రుత్వా కాశిరాజ్ఞశ్చ భారత,
రాజర్షిః స మహాతేజా బభూ వోద్విగ్నమానసః. 18

అంబ కథను కాశిరాజు వృత్తాంతమును విన్న మహాతేజస్వి యగు ఆ రాజర్షి మనసులో కుతకుతలాడెను.

తాం తథా వాదినీం శ్రుత్వా దృష్ట్వా చ స మహాతపాః,
రాజర్షిః కృపయాఽఽవిష్టో మహాత్మా హోత్రవాహనః. 19

అట్లు చెప్పుచున్న ఆమెనుగూర్చి వినియు, చూచియు, మహాతపస్వి యగు ఆ మహాత్ముడు హోత్రవాహనుడు జాలితో నిండిపోయెను.

స వేపమాన ఉత్థాయ మాతు స్తస్యాః పితా తదా,
తాం కన్యా మఙ్క మారోప్య పర్యాశ్వాసయత ప్రభో. 20

ఆ కన్య తల్లికి తండ్రియగు ఆ హోత్రవాహనుడు ఊగిపోవుచు లేచి ఆకన్యను ఒడిలో పెట్టుకొని ఊరడించెను.

స తా మపృచ్ఛత్ కార్త్స్న్యేన వ్యసనోత్పత్తి మాదితః,
సా చ తస్మై యథావృత్తం విస్తరేణ న్యవేదయత్. 21

అత డామెను ఆమెకు వచ్చిన దుఃఖమును మొదటినుండియు మొత్తముగా చెప్పు మని యడిగెను. ఆమెయు జరిగినదెల్ల వివరములతో తెలియజేసెను.

తతః స రాజర్షి రభూ ద్దుఃఖశోకసమన్వితః,
కార్యం చ ప్రతిపేదే త న్మనసా సుమహాతపాః. 22

అంత రాజర్షి పెనుశోకము పొందెను. మహాతపస్వియగు నతడు చేయ దగిన దానిని గూర్చి మనసున ఒక నిశ్చయమునకును వచ్చెను.

అబ్రవీ ద్వేపమానశ్చ కన్యా మార్తాం సుదుఃఖితః,
మా గాః పితుర్గృహం భద్రే మాతుస్తే జనకో హ్యహమ్. 23

కుమిలిపోవుచున్న ఆ కన్యను చూచి దుఃఖముతో కంపించిపోవుచు ఆ రాజర్షి యిట్లు పలికెను. అమ్మా! నీ తండ్రియింటి కేగవలదు. నేను నీ తల్లి తండ్రిని.

దుఃఖం ఛిన్ద్యా మహం తే వై మయి వర్తస్వ పుత్రికే,
పర్యాప్తం తే మనో వత్సే యదేవం పరిశుష్యసి. 24

బిడ్డా! నీ దుఃఖమును చీల్చివైచెదను. నాకడ నుండుము. తల్లీ! నీ హృదయము పూర్తిగా కుమిలిపోయినది. ఎంత చిక్కితివో చూడు.

గచ్ఛ మద్వచనా ద్రామం జామదగ్న్యం తపస్వినమ్,
రామస్తే సుమహా ద్దుఃఖం శోకం చైవాపనేష్యతి. 25

నామాటమీద జమదగ్ని కుమారుడు, తపస్వియు నగు పరశురామునికడ కరుగుము. ఆ రాముడు నీ యీ పెనుదుఃఖమును, దీనభావమును తప్పక తొలగించివేయును.

హనిష్యతి రణే భీష్మం న కరిష్యతి చేద్వచః,
తం గచ్ఛ భార్గవశ్రేష్ఠం కాలాగ్నిసమతేజసమ్. 26

తనమాట పాటింపని యెడల భీష్ముని యుద్ధమున చావగొట్టును. కాలాగ్ని వలె మండిపోవు భృగువంశశ్రేష్ఠుడు పరశురాముని కడ కరుగుము.

ప్రతిష్ఠాపయితా స త్వాం సమే పథి మహాతపాః.

ఆ మహాతాపసుడు నిన్ను నే నూహించు మంచి దారిలో నెలకొల్పును.

తతస్తు సుస్వరం బాష్ప ముత్సృజన్తీ పునః పునః, 27
అబ్రవీత్ పితరం మాతుః సా తదా హోత్రవాహనమ్.

అంత నామె పైపైని కన్నీరు విడుచుచు తల్లి తండ్రియగు హోత్రవాహనునితో నిట్లు పలికెను.

అభివాదయిత్వా శిరసా గమిష్యే తవ శాసనాత్. 28
అపి నామాద్య పశ్యేయ మార్యం తం లోకవిశ్రుతమ్.

తలతో మ్రొక్కి నీ యాజ్ఞప్రకారము పరశురామునికడ కరుగుదును. లోకములలో విఖ్యాతి నొందిన ఆ ఆర్యుని నేనిపుడు చూడగలుగుదునా?

కథం చ తీవ్రం దుఃఖం మే నాశయిష్యతి భార్గవః,
ఏత దిచ్ఛా మ్యహం జ్ఞాతుం యథా యాస్యామి తత్ర వై.

ఆ భార్గవుడు నా తీవ్రదుఃఖము నెట్లు రూపుమాపును? ఆతనికడ కెట్లరుగుదును? ఇది తెలియగోరుచున్నాను.

హోత్రవాహన ఉవాచ - హోత్రవాహను డిట్లు పలికెను.

రామం ద్రక్ష్యసి భద్రే త్వం జామదగ్న్యం మహావనే,
ఉగ్రే తపసి వర్తన్తం సత్యసన్ధం మహాబలమ్. 30

అమ్మా! జమదగ్ని కుమారుడు మిక్కిలి భయంకరమగు తపస్సున ఉన్నవాడు, సత్యసంధుడు, మహాబలుడు అగు ఆ పరశురాముని మహారణ్యమున నీవు చూచెదవు.

మహేన్ద్రం వై గిరిశ్రేష్ఠం రామో నిత్య ముపాస్తి హ,
ఋషయో వేదవిద్వాంసో గన్ధర్వాప్సరస స్తథా. 31

ఆ రాముడు మహేంద్ర మనెడు పర్వతమున నిత్యనివాస మొనర్చును. ఆతనితోపాటు ఋషులు, వేదవేత్తలు, గంధర్వులు, అప్సరసలు అట నుందురు.

తత్ర గచ్ఛస్వ భద్రం తే బ్రూయాశ్చైనం వచో మమ,
అభివాద్య చ తం మూర్ధ్నా తపోవృద్ధం దృఢవ్రతమ్. 32

అమ్మా! అట కరుగుము. నా మాటగా తపస్సు పండినవాడు, చెదరని వ్రతము కలవాడు అగు ఆతనికి తలతో ప్రణమిల్లుము.

బ్రూయాశ్చైనం పునర్భద్రే యత్తే కార్యం మనీషితమ్,
మయి సంకీర్తితే రామః సర్వం తత్తే కరిష్యతి. 33

మంచిదానా! అటుపై ఆ మహర్షికి నీ కోరిక యేమో చెప్పుము. నన్ను గురించి చెప్పినచో ఆ పరశురాముడు నీవు కోరినదెల్ల నెరవేర్చును.

మమ రామః సఖా వత్సే ప్రీతియుక్తః సుహృచ్చ మే,
జమదగ్నిసుతో వీరః సర్వశస్త్రభృతాం వరః. 34

బిడ్డా! జమదగ్ని కుమారుడు వీరుడు, ఆయుధధారు లందరిలో మేటి అగు ఆ రాముడు నాను ప్రాణతుల్యుడు, నాపై మిక్కిలి మక్కువ గలవాడు, మంచి హృదయము కలవాడు.

ఏవం బ్రువతి కన్యాం తు పార్థివే హోత్రవాహనే,
అకృతవ్రణః ప్రాదురాసీద్రామస్యానుచరః ప్రియః. 35

ఇట్లా హోత్రవాహనమహారాజు ఆ కన్యతో పలుకుచుండగా పరశురాముని ప్రియశిష్యుడు అకృతవ్రణుడు అచటి కరుదెంచెను.

తతస్తే మునయ స్సర్వే సముత్తస్థుః సహస్రశః,
స చ రాజా వయోవృద్ధః సృఞ్జయో హోత్రవాహనః. 36

అంత వేలకొలదిగా నున్న అచటి మునులందరు లేచి నిలిచిరి. పెద్ద వయస్సువాడు సృంజయవంశమువాడు నగు హోత్రవాహనరాజు కూడ భక్తితో నిలిచియుండెను.

తతో దృష్ట్వా కృతాతిథ్య మన్యోన్యం తే వనౌకసః,
సహితా భరతశ్రేష్ఠ నిషేదుః పరివార్య తమ్. 37

అంత నా రాజును అకృతవ్రణుడును ఒకరి కొకరు అతిథిమర్యాదలు సల్పుకొనగా చూచిరి. ఋషు లందరు అతని చుట్టివచ్చి కూర్చుండిరి.

తతస్తే కథయామాసుః కథా స్తా స్తా మనోరమాః,
ధన్యా దివ్యాశ్చ రాజేన్ద్ర ప్రీతిహర్షముదాయుతాః. 38

అంత వారందరు హృదయమున కింపైన దివ్యములగు పుణ్యకథలు చెప్పుకొని పరమానందభరితు లైరి.

తతః కథాన్తే రాజర్షి ర్మహాత్మా హోత్రవాహనః,
రామం శ్రేష్ఠం మహర్షీణా మపృచ్ఛ దకృతవ్రణమ్. 39

అట్లు ప్రసంగములు ముగిసిన పిదప దొడ్డబుద్ధిగల హోత్రవాహనుడు మహర్షిశ్రేష్ఠుడగు పరశురామునిగూర్చి ప్రశ్న చేసెను.

క్వ సంప్రతి మహాబాహో జామదగ్న్యః ప్రతాపవాన్,
అకృతవ్రణ శక్యో వై ద్రష్టుం వేదవిదాం వర. 40

మహాబాహూ ! అకృతవ్రణా ! మహాప్రతాపము గల పరశురాము డిప్పు డెక్కడ ? అతనిని చూడనగునా ?

అకృతవ్రణ ఉవాచ - అకృతవ్రణు డిట్లు పలికెను.

భవ న్తమేవ సతతం రామః కీర్తయతి ప్రభో,
సృఞ్జయో మే ప్రియసఖో రాజర్షిరితి పార్థివ. 41

రాజా ! ఆ సృంజయుడు రాజర్షి హోత్రవాహనుడు నా ప్రియసఖుడు అని పరశురాము డెల్ల వేళల నిన్నే చెప్పుచుండును.

ఇహ రామః ప్రభాతే శ్వో భవితేతి మతిర్మమ,
ద్రష్టాస్యేన మిహాయాన్తం తవ దర్శనకాఙ్క్షయా. 42

రాము డిటకు రేపు ఉదయమున రాగలడని నా కనిపించుచున్నది. నిన్ను చూచు కోరికతో ఇటకు వచ్చు ఆతనిని రేపు నీవు చూడగలవు.

ఇయం చ కన్యా రాజర్షే కిమర్థం వన మాగతా,
కస్య చేయం తవ చ కా భవతీచ్ఛామి వేదితుమ్. 43

రాజర్షీ ! ఈ కన్య అడవికి ఏల వచ్చెను ? ఎవ్వరి బిడ్డ ? నీ కేమగును ? తెలియగోరుదును.

హోత్రవాహన ఉవాచ - హోత్రవాహను డిట్లు పలికెను.

దౌహిత్రీయం మమ విభో కాశిరాజసుతా ప్రియా,
జ్యేష్ఠా స్వయంవరే తస్థౌ భగినీభ్యాం సహానఘ. 44

స్వామీ! ఈమె నా కూతుబిడ్డ. కాశిరాజు కుమార్తె. నాకు మిక్కిలి యిష్టమైనది. తన చెల్లెండ్రిద్దరితో పెద్దది యగు ఈమె స్వయంవరమున నిలిచినది.

ఇయ మమ్బేతి విఖ్యాతా జ్యేష్ఠా కాశిపతేః సుతా,
అమ్బికామ్బాలికే కన్యే కనీయస్యౌ తపోధన. 45

ఈమె కాశిరాజు పెద్దబిడ్డ. అంబ అని పేరు. చెల్లెండ్రిద్దరు అంబిక, అంబాలిక అనువారు.

సమేతం పార్థివం క్షత్రం కాశిపుర్యాం తతోఽభవత్,
కన్యానిమిత్తం విప్రర్షే తత్రాసీ దుత్సవో మహాన్. 46

నేల నేలు రాజు లందరు కాశిపురములో కూడుకొనిరి. కన్యల నిమిత్తముగా ఓ విప్రర్షీ! అట పెద్ద వేడుక జరిగెను.

తతః కిల మహావీర్యో భీష్మః శాన్తనవో నృపాన్,
అధిక్షిప్య మహాతేజా స్తిస్రః కన్యా జహార తాః. 47

అంత మహాపరాక్రమవంతుడు, శాంతనుకుమారుడు భీష్ముడు రాజుల నందరిని తోలివైచి ముగ్గురు కన్యలను అపహరించెనట.

నిర్జిత్య పృథివీపాలా నథ భీష్మో గజాహ్వయమ్,
ఆజగామ విశుద్ధాత్మా కన్యాభిః సహ భారతః. 48

భరతవంశమువాడు, నిర్మలచిత్తుడు నగు ఆ భీష్ముడు రాజుల నందరిని ఓడించి కన్యలతో కూడి కరిపురమునకు వచ్చెను.

సత్యవత్యై నివేద్యాథ వివాహం సమనన్తరమ్,
భ్రాతు ర్విచిత్రవీర్యస్య సమాజ్ఞాపయత ప్రభుః. 49

అంత వారిని తల్లి సత్యవతికి అప్పగించి తమ్ముడగు విచిత్రవీర్యునకు ఇచ్చి వివాహము చేయు మని విన్నవించెను.

తం తు వైవాహికం దృష్ట్వా కన్యేయం సముపార్జితమ్,
అబ్రవీత్తత్ర గాఙ్గేయం మన్త్రిమధ్యే ద్విజర్షభ. 50

బ్రాహ్మణప్రవరా! పెండ్లికొఱకు సిద్ధముగా నుండి తోరపుముడి మొదలగు సంస్కారములు పొందియున్న విచిత్రవీర్యుని గాంచి యీ కన్య మంత్రులతో కూడియున్న భీష్మునితో నిట్లు పలికెను.

మయా శాల్వపతి ర్వీరో మనసాఽభివృతః పతిః,
న మా మర్హసి ధర్మజ్ఞ దాతుం భ్రాత్రేఽన్యమానసామ్. 51

వీరుడా! నేను శాల్వపతిని మనఃపూర్వకముగా వరించితిని. ధర్మజ్ఞా! ఇతరునకు మనసిచ్చిన నన్ను నీతమ్మున కీయదగదు.

తచ్ఛ్రుత్వా వచనం భీష్మః సంమన్త్ర్య సహ మన్త్రిభిః,
నిశ్చిత్య విససర్జేమాం సత్యావత్యా మతే స్థితః. 52

ఆ మాట విని భీష్ముడు మంత్రులతో ఆలోచించి ఒక నిశ్చయమునకు వచ్చి సత్యవతి అనుమతి గొని యీమెను శాల్వుని కడకు పంపివైచెను.

అనుజ్ఞాతా తు భీష్మేణ శాల్వం సౌభపతిం తతః,
కన్యేయం ముదితా తత్ర కాలే వచన మబ్రవీత్. 53

భీష్ముని అనుమతితో సౌభపతి యగు శాల్వునికడ కరిగి యీ కన్య ఆనందపడుచు అతనితో ఆ సమయమున నిట్లు పలికెను.

విసర్జితాఽస్మి భీష్మేణ ధర్మం మాం ప్రతిపాదయ,
మనసాభివృతం పూర్వం మయా త్వం పార్థివర్షభ. 54

అయ్యా! భీష్ముడు నన్ను పంపివైచెను. నాకు ధర్మము ననుగ్రహింపుము. నేను నిన్ను మున్నే మనసున వరించియుంటిని గదా!

---

50. తమ్ - ఆ విచిత్రవీర్యుని; వైవాహికమ్ - పెండ్లికొఱకు సిద్ధముగా నున్నవానిని; సముపార్జితమ్ - మంగళస్నానము, తోరణము ధరించుట మున్నగు సంస్కారములను పొందియున్నవానిని చూచి యీ కన్య భీష్మునితో ఇట్లు పలికెనని వాక్యాన్వయము.

ప్రత్యాచఖ్యౌ చ శాల్వోఽస్యాశ్చారిత్ర స్యాభిశఙ్కితః,
సేయం తపోవనం ప్రాప్తా తాపస్యేఽభిరతా భృశమ్. 55

ఈమె నడవడిని శంకించిన శాల్వు డీమెను నిరాకరించెను. తపస్సునందు మిక్కిలిగా మనసుపెట్టి యీమె తపోవనమున కరుదెంచెను.

మయా చ ప్రత్యభిజ్ఞాతా వంశస్య పరికీర్తనాత్,
అస్య దుఃఖస్య చోత్పత్తిం భీష్మ మేవేహ మన్యతే. 56

వంశమును పేర్కొనుటవలన నేనీమెను గుర్తుపట్టితిని. ఈమె తన దుఃఖమునకు భీష్మడే కారణ మని తలచుచున్నది.

అంబోవాచ - అంబ యిట్లు పలికెను.

భగవ న్నేవ మే వేహ యథాఽహ పృథివీపతిః,
శరీరకర్తా మాతుర్మే సృఞ్జయో హోత్రవాహనః. 57

భగవానుడా! మా అమ్మకు శరీర మిచ్చిన యీ సృంజయుడు హోత్రవాహనుడు పలికినది నిజమే.

న హ్యుత్సహే స్వనగరం ప్రతియాతుం తపోధన,
అపమానభయా చ్చైవ వ్రీడయా చ మహామునే. 58

మహామునీ! తపోధనా! అవమానము కలుగునను భయముచేతను, సిగ్గువలనను మాయూరికి తిరిగిపో నిష్టపడను.

యత్తు మాం భగవాన్ రామో వక్ష్యతి ద్విజసత్తమ,
తన్మే కార్యతమం కార్యమితి మే భగవన్మతిః. 59

పరశురామభగవానుడు నా కేది యుపదేశించునో అదియే నేను తప్పక చేయదగినపని యని నా నిశ్చయము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
హోత్రవాహనామ్బాసంవాదే షట్సప్తత్యధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
హోత్రవాహనాంబాసంవాదముగల నూటడెబ్బదియారవ అధ్యాయము.

—: ౦ :—

56. ఉత్పత్తిమ్ - కారణమును.

## సప్తసప్తత్యధికశతతమోఽధ్యాయః
## నూటడెబ్బదియేడవ అధ్యాయము

**అకృతవ్రణపరశురామయో రమ్బయా సహ వార్తాలాపః.**
**అకృతవ్రణపరశురాములు అంబతో సంభాషించుట.**

అకృతవ్రణ ఉవాచ - అకృతవ్రణు డిట్లు పలికెను.

దుఃఖద్వయ మిదం భద్రే కతరస్య చికీర్షసి,
ప్రతికర్తవ్య మబలే తత్త్వం వత్సే వదస్వ మే. 1

బిడ్డా! ఈ రెండు దుఃఖములలో దేనికి ప్రతిక్రియ చేయగోరుదువో నాకు నిజముగా తెలుపుము.

యది సౌభపతి ర్భద్రే నియోక్తవ్యో మత స్తవ,
నియోక్ష్యతి మహాత్మా స రామ స్త్వద్ధితకామ్యయా. 2

ఒకవేళ సౌభపతిని కట్టడిచేయుట నీ కిష్టమేని మహాత్ముడగు రాముడు నీమేలుకోరి ఆతనిని దారికి తెచ్చును.

---

1. దుఃఖద్వయమ్ - దుఃఖము కలిగించిన జంట. భీష్ముడు, శాల్వుడు - అనువానిని; లేదా-పెనిమిటి లేకపోవుట ఒక దుఃఖము, తాపసులకు నీ శత్రువును నాశనము చేయవలసివచ్చుట అను రెండవ దుఃఖము - అయినను శత్రువు లిద్దరిలో; కమ్ - ఎవనిని; ప్రతికర్తవ్యమ్ - చంప గోరుదువు; లేదా - ఒక్కొక్కనికి గతి లేకుండుట, మరణము అను దుఃఖద్వయము.
2. నియోక్తవ్యః - లొంగదీసికొనదగినవాడు - నీ పాణిగ్రహణముకొఱకు అనుదానిని సంభావింపవలయును.

అథాపనేయం భీష్మం త్వం రామేణేచ్ఛసి ధీమతా,
రణే వినిర్జితం ద్రష్టుం కుర్యా త్తదపి భార్గవః. 3

మరియు నదీకుమారుడగు భీష్ముని ధీశాలియగు రాముడు రణమున ఓడించుట నీ కభిమతమైనచో భార్గవు డదియైన చేయును.

సృఞ్జయస్య వచః శ్రుత్వా తవ చైవ శుచిస్మితే,
యదత్ర తే భృశం కార్యం తదద్యైవ విచిన్త్యతామ్. 4

సృంజయుని మాటను నీ మాటను విని అతడు నీకేమి చేయవలయునో అది యిప్పుడే ఆలోచించుకొనుము.

అమ్బోవాచ - అంబ పలికెను.

అపనీతాఽస్మి భీష్మేణ భగవన్నవజానతా,
నాభిజానాతి మే భీష్మో బ్రహ్మన్ శాల్వగతం మనః. 5

భగవానుడా! భీష్ముడు తెలియక నన్నెత్తుకొనిపోయెను. నా మనస్సు శాల్వునిపై నున్నదని భీష్ము డెరుగడు.

ఏత ద్విచార్య మనసా భవా నేత ద్వినిశ్చయమ్,
విచినోతు యథాన్యాయం విధానం క్రియతాం తథా. 6

ఇది నా మనసులో తమరే చక్కగా విచారించి న్యాయము తప్పని విధానము నిశ్చయింపవలయును.

భీష్మే వా కురుశార్దూలే శాల్వరాజేఽథవా పునః,
ఉభయోరేవ వా బ్రహ్మన్ యుక్తం యత్తత్ సమాచర. 7

కురుశ్రేష్ఠుడైన భీష్మునియందో, శల్వరాజునందో లేక యిరువురియందో యేది తగిన ప్రతిక్రియయో అది చేయుడు.

---

3. భీష్మునియందు ప్రతీకారమున్నచో ఊరక అతనిని గెలుచుట మాత్రమే సంభవింపవచ్చును. అంతమాత్రముచేత నీ కయ్యెడు మేలేదియు ఉండదు. అతడు బ్రహ్మచర్యవిషయమున ప్రతిజ్ఞతప్పనివాడుకదా అను భావముతో చెప్పుచున్నారు.

6. విధానం - ప్రతీకారము.

నివేదితం మయా హ్యేత ద్దుఃఖమూలం యథాతథమ్,
విధానం తత్ర భగవన్ కర్తు మర్హసి యుక్తితః 8

నా దుఃఖమునకు మూలకారణమును ఉన్న దున్నట్లు స్వామీ! తమ కెరిగించితిని. ప్రతిక్రియను తామె యుక్తితో నిర్ణయింపవలయును.

అకృతవ్రణ ఉవాచ - అకృతవ్రణుడు పలికెను.

ఉపపన్న మిదం భద్రే యదేవం వరవర్ణిని,
ధర్మం ప్రతి వచో బ్రూయాః శృణు చేదం వచో మమ. 9

అమ్మా! ఉత్తమకాంతా! నీ వన్నది చక్కని మాట. ధర్మమునకు సంబంధించిన పలుకు పలుకుచున్నావు. ఈ నామాట కూడ వినుము.

యది త్వా మాపగేయో వై న నయే ద్గజసాహ్వయమ్,
శాల్వస్త్వాం శిరసా భీరు గృహ్ణీయా ద్రామచోదితః. 10

గంగాతనయుడు నిన్ను కరిపురమునకు కొనిపోవనిచో శాల్వుడు రాముని మాటపై నిన్ను తలపై పెట్టుకొని తనకడకు కొనిపోవును.

తేన త్వం నిర్జితా భద్రే యస్మా న్నీతాఽసి భావిని,
సంశయః శాల్వరాజస్య తేన త్వయి సుమధ్యమే. 11

ఆ భీష్ముడు నిన్నోడుచుకొనెను. నిన్ను తన పట్టణమునకు తీసికొనిపోయెను. ఆ కారణముగా శాల్వునకు నీయందు సంశయము కలిగెను.

భీష్మః పురుషమానీ చ జితకాశీ తథైవ చ,
తస్మాత్ ప్రతిక్రియా యుక్తా భీష్మే కారయితుం తవ. 12

భీష్ముడు పౌరుషమునం దభిమానము కలవాడు జయము గొని విఱ్ఱవీగుచున్నాడు. కావున నీకు ఆతనియెడల ప్రతీకారము చేయించుటయే సరియైనది.

అమ్బోవాచ - అంబ యిట్లు పలికెను.

మమాప్యేష సదా బ్రహ్మన్ హృది కామోఽభివర్తతే,
ఘాతయేయం యది రణే భీష్మ మిత్యేవ నిత్యదా. 13

మహర్షీ! నాకును యుద్ధమున భీష్ముని చంపింపవలయుననియే దృఢమైన కోరిక విడువక ఎదలో మెదలుచున్నది.

భీష్మం వా శాల్వరాజం వా యం వా దోషేణ గచ్ఛసి,
ప్రశాధి తం మహాబాహో యత్కృతేఽహం సుదుఃఖితా. 14

ఓయీ మహాబాహూ! భీష్మునో, శాల్వరాజునో నీదృష్టిలో తప్పెవనియందున్నదో - వానిని శాసింపుము. వారివలన నేనింత దుఃఖము పొందితిని.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

ఏవం కథయతా మేవ తేషాం స దివసో గతః,
రాత్రిశ్చ భరతశ్రేష్ఠ సుఖశీతోష్ణమారుతా. 15

ఇట్లు చెప్పుకొనుచుండగా వారి కా పగలెల్ల గడచెను. సుఖ మొసగు చల్లదనము వెచ్చదనము కలిసిన గాలిగల రాత్రియు గడచెను.

తతో రామః ప్రాదురాసీత్ ప్రజ్వలన్నివ తేజసా,
శిష్యైః పరివృతో రాజన్ జటాచీరధరో మునిః. 16

అంత తేజస్సుతో వెలుగొందుచు జడలు నారబట్టలు ధరించిన ముని పరశురాముడు శిష్యులు చుట్టి రాగా అటకు వచ్చెను.

ధనుష్పాణి రదీనాత్మా ఖడ్గం బిభ్రత్ పరశ్వధీ,
విరజా రాజశార్దూల సృఞ్జయం సోఽభ్యయా న్నృపమ్. 17

మొగమున బింకము కలవాడు, వింటిని, ఖడ్గమును, గండ్రగొడ్డలిని ధరించినవాడు, పరిశుద్ధుడు నగు పరశురాముడు సృంజయరాజును చేరవచ్చెను.

తత స్తం తాపసా దృష్ట్వా స చ రాజా మహాతపాః,
తస్థుః ప్రాఞ్జలయో రాజన్ సా చ కన్యా తపస్వినీ. 18

అంత నా తాపసులును, గొప్ప తపస్సుగల ఆ రాజును, తపస్విని యగు ఆ కన్యయును అతని గాంచి చేతులు మోడ్చి నిలువబడిరి.

పూజయామాసు రవ్యగ్రా మధుపర్కేణ భార్గవమ్,
అర్చితశ్చ యథాన్యాయం నిషసాద సహైవ తైః. 19

చెదరని హృదయముతో వారందరు ఆతనికి మధుపర్కముతో పూజలు సల్పిరి. అట్లు శాస్త్రము ప్రకారము పూజలొందిన ఆతడు వారందరితో పాటు కూర్చుండెను.

తతః పూర్వవ్యతీతాని కథయన్తౌ స్మ తావుభౌ,
ఆసాతాం జామదగ్న్యశ్చ సృఞ్జయ శ్చైవ భారత. 20

అంత జమదగ్నికుమారుడును, సృంజయరాజును గడచిన వృత్తాంతము లన్నియు చెప్పుకొనుచు నుండిరి.

తథా కథా న్తే రాజర్షి ర్భృగుశ్రేష్ఠం మహాబలమ్,
ఉవాచ మధురం కాలే రామం వచన మర్థవత్. 21

అట్లు ప్రసంగము ముగిసిన పిదప ఆ రాజర్షి మహాబలముగల రామునితో అదను చూచుకొని అర్థవంతమగు పలుకు నిట్లు పలికెను.

రామేయం మమ దౌహిత్రీ కాశిరాజసుతా ప్రభో,
అస్యాః శృణు యథాతత్త్వం కార్యం కార్యవిశారద। 22

రామా! ప్రభూ! కార్యవిశారదా! ఈమె నా కూతుబిడ్డ; కాశిరాజు కొమారిత. ఈమె పని యొకటి కలదు. దాని తత్త్వ మెరుగుచు వినుము.

వరమం కథ్యతాం చేతి తాం రామః ప్రత్యభాషత,
తతః సాఽభ్యవద ద్రామం జ్వలన్త మివ పావకమ్. 23

మంచిది, చెప్పుమని రాము డామెతో పలికెను. అంత నామె అగ్నివలె విరాజల్లుచున్న రామునితో నిట్లు చెప్పదొడగెను.

తతోఽభివాద్య చరణౌ రామస్య శిరసౌ శుభౌ,
స్పృష్ట్వా పద్మదళాభాభ్యాం పాణిభ్యా మగ్రతః స్థితా. 24

---

23. వరమమ్ - నీవు చెప్పదలచినది తప్పక చెప్పుమను ప్రచోదనను తెలియ జేయుపద మియ్యది.

24. శిరసౌ - శ్రేష్ఠములు - 'శిరః ప్రధానే సేనాగ్రే' అని మేదిని-పుంలింగ ప్రయోగము ఆర్షము.

ఆమె శ్రేష్ఠములు, మంగళదాయకములు నగు రాముని పాదములను పద్మపురేకులవంటి చేతులతో స్పృశించి యెదుట నిలిచి యుండెను.

రురోద సా శోకవతీ బాష్పవ్యాకులలోచనా,
ప్రపేదే శరణం చైవ శరణ్యం భృగునన్దనమ్. 25

కన్నీటితో అలికినట్లైన కన్నులు గలదియై లోపల కుమిలిపోవుచున్న ఆ అంబ పెద్దగా ఏడ్చెను. తనకు రక్షకుడైన భృగునందనుని శరణు వేడెను.

రామ ఉవాచ - రాము డిట్లు పలికెను.

యథా త్వం సృఞ్జయ స్యాస్య తథా త్వం మే నృపాత్మజే,
బ్రూహి యత్తే మనోదుఃఖం కరిష్యే వచనం తవ. 26

రాజకుమారీ! నీవు ఈ సృంజయున కెట్టి దానవో నాకును అట్టి దానవే. నీ గుండెలోపలి దుఃఖ మేమో చెప్పుము. నీవడిగినది చేయుదును.

అమ్బోవాచ - అంబ యిట్లు పలికెను.

భగవన్ శరణం త్వాఽద్య ప్రపన్నాస్మి మహావ్రతమ్,
శోకపఙ్కార్ణవా న్మగ్నాం ఘోరా ముద్ధర మాం విభో. 27

గొప్ప వ్రతమున నున్న నిన్ను ఓ ప్రభూ! శరణు చొచ్చితిని. ఘోరముగా మునిగిన నన్ను దుఃఖ మనెడు బురదగల సముద్రము నుండి ఉద్ధరింపుము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

తస్యాశ్చ దృష్ట్వా రూపం చ వపు శ్చాభినవం పునః,
సౌకుమార్యం పరం చైవ రామ శ్చిన్తాపరోఽభవత్. 28

ఆమె రూపమును, క్రొత్తయౌవనము గల దేహమును, అన్నింటిని మించిన సౌకుమార్యమును గాంచి రాముడు గుండెలో కుమిలిపోయెను.

కిమియం వక్ష్యతీత్యేవం విమమర్శ భృగూద్వహః,
ఇతి దధ్యౌ చిరం రామః కృపయాఽభిపరిప్లుతః. 29

ఆ భృగువరేణ్యుడు ఈమె యేమి చెప్పునో యని తలచుచుండెను. జాలి నిలువెల్ల క్రమ్ముకొనగా అదే విషయమున చాలసేపు మనసుంచెను.

కథ్యతా మితి సా భూయో రామేణోక్తా శుచిస్మితా,
సర్వమేవ యథాతత్త్వం కథయామాస భార్గవే. 30

మరల ఆమెను చెప్పుమని అడిగెను. ఆమె భార్గవునకు జరిగిన దంతయు ఉన్నదున్నట్లు చెప్పెను.

తచ్ఛ్రుత్వా జామదగ్న్యస్తు రాజపుత్ర్యా వచ స్తదా,
ఉవాచ తాం వరారోహాం నిశ్చిత్యార్థవినిశ్చయమ్. 31

జమదగ్నికుమారుడు ఆ రాజపుత్రి మాట విని చేయదగిన దానిని గూర్చి ఒక నిశ్చయమునకు వచ్చి ఆమెతో నిట్లనెను.

రామ ఉవాచ - రాము డిట్లు పలికెను.

ప్రేషయిష్యామి భీష్మాయ కురుశ్రేష్ఠాయ భావిని,
కరిష్యతి వచో మహ్యం శ్రుత్వా చ స నరాధిపః. 32

అమ్మా ! కురుశ్రేష్ఠుడగు భీష్మునకు కబురంపెదను. ఆ రాజు నేను చెప్పినది విని చేయును.

న చే త్కరిష్యతి వచో మయోక్తం జాహ్నవీసుతః,
ధక్ష్యామ్యహం రణే భద్రే సామాత్యం శస్త్రతేజసా. 33

ఆ జాహ్నవి కొడుకు నేను చెప్పినది చేయడో, యుద్ధమున శస్త్రముల మంటతో మంత్రులతో పాటు వానిని మాడ్చివేయుదును.

అథవా తే మతి స్తత్ర రాజపుత్రి న వర్తతే,
యావ చ్ఛాల్వపతిం వీరం యోజయా మ్యత్ర కర్మణి. 34

అట్లుకాక అందు నీ బుద్ధి ప్రవర్తింపనిచో ఈ కార్యమునందు వీరుడగు శాల్వరాజును నియోగింతును.

అమ్బోవాచ - అంబ యిట్లనెను.

విసర్జితాఽహం భీష్మేణ శ్రుత్వైవ భృగునన్దన,
శాల్వరాజగతం భావం మమ పూర్వం మనీషితమ్. 35

---

33. జాహ్నవీసుతః - గంగకొడుకు - భీష్ముడు.

34. అత్ర కర్మణి - ఈ పనియందు - పెండ్లి చేసికొనుటయం దని భావము.

భార్గవరామా! నాకు మున్నే భావము శాల్వరాజుపై గలదని విన్నంతనే భీష్ముడు నన్నటకు పంపివైచెను.

సౌభరాజ ముపేత్యాహ మవోచం దుర్వచం వచః,
న చ మాం ప్రత్యగృహ్ణాత్ స చారిత్ర్యపరిశఙ్కితః. 36

నేను శాల్వరాజును సమీపించి పలుకశక్యముకాని మాట పలికితిని. అతడు నా నడవడిని శంకించి నన్ను కైకొనడాయెను!

ఏతత్సర్వం వినిశ్చిత్య స్వబుద్ధ్యా భృగునన్దన,
యదత్రౌపయికం కార్యం తచ్చిన్తయితు మర్హసి. 37

భార్గవమునీ! ఇది యెల్లయు నీ బుద్ధితో చక్కగా ఆలోచించి యిందు తగినదేమో దానిని నిర్ణయింపదగును.

మమ తు వ్యసన స్యాస్య భీష్మో మూలం మహావ్రతః,
యే నాహం వశమానీతా సముత్క్షిప్య బలాత్తదా. 38

నాకుమాత్రము నా యీ కష్టమునకు, బ్రహ్మచర్య మను మహావ్రతము పూనిన భీష్ముడే మూలకారణ మనిపించుచున్నది. నన్నాతడు బలాత్కారముగా ఎత్తికొనివచ్చి తన వశము చేసికొనెను.

భీష్మం జహి మహాబాహో యత్కృతే దుఃఖ మీదృశమ్,
ప్రాప్తాఽహం భృగుశార్దూల చరా మ్యప్రియ ముత్తమమ్. 39

ఓ మహాబాహూ! ఎవనివలన నా కింత దుఃఖము కలిగెనో ఆ భీష్ముని వధింపుము. ఇంత ఘోరమైన కీడు పొంది తిరుగుచున్నాను.

స హి లుబ్ధశ్చ నీచశ్చ జితకాశీ చ భార్గవ,
తస్మాత్ ప్రతిక్రియా కర్తుం యుక్తా తస్మై త్వయాఽనఘ. 40

---

37. ఔపయికమ్ - యుక్తమైనది.

40. లుబ్ధః - లోభి - నన్నపహరించెను కనుక;
నీచః - నీచుడు. ఏలయన తానై నన్ను అంగీకరింపలేదు. కామవాంఛ లేనివాడు కన్యను ఎత్తుకొనిపోవుట దోషమని భావము.

ఆతడు లోభి, నీచుడు, గెలిచి కులుకుచున్నాడు కావున ప్రతిక్రియ నీ వాతనికే చేయుట యుక్తము.

ఏష మే క్రియమాణాయా భారతేన తదా విభో!,
అభవ ద్ధృది సంకల్పో ఘాతయేయం మహావ్రతమ్. 41

ఆ భరతవంశరాజు నన్నట్లు హింసించుచుండగా నా మదిలో ఈ బ్రహ్మచారివ్రతమువానిని చంపవలయునన్న సంకల్పము పుట్టెను.

తస్మాత్ కామం మమాద్యేమం రామ సంపాదయానఘ,
జహి భీష్మం మహాబాహో యథా వృత్రం పురందరః. 42

పుణ్యాత్మా! రామా! కావున నాకోరిక నీదేర్చుము. దేవేంద్రుడు వృత్రుని చంపినట్లో మహాబాహూ! భీష్ముని చంపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
రామామ్బాసంవాదే సప్తసప్తత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
రాముదును అంబయు సంభాషించుటయను నూటడెబ్బదియేడవ
అధ్యాయము.

---: o :---

42. క్రియమాణాయాః - బలాత్కారముగా కొనివచ్చుచున్నపుడు హింసింపబడినదాన నగు - కృఞ్ 'హింసాయామ్' అను ధాతు వియ్యది. స్వాది గణములోనిది.

# అష్టసప్తత్యధికశతతమోఽధ్యాయః
# నూటడెబ్బదియెనిమిదవ అధ్యాయము

**అమ్బాపరశురామయోః సంవాదః, అకృతవ్రణస్య సంమతిః,**
**పరశురామభీష్మయో రోషపూర్ణో వార్తాలాప స్తయోర్యుద్ధాయ**
**కురుక్షేత్రే గమనం చ.**

**అంబాపరశురాముల సంవాదము, అకృతవ్రణుడు సమ్మతించుట,**
**పరశురాముడును భీష్ముడును రోషము నిండిన మాటలు పలికికొనుట,**
**యుద్ధమునకై కురుక్షేత్రమున కరుగుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

ఏవముక్త స్తదా రామో జహి భీష్మమితి ప్రభో,
ఉవాచ రుదతీం కన్యాం చోదయన్తీం పునః పునః. 1

ఏడ్చుచు తన్ను మాటిమాటికి భీష్ముని చంపుమని పురికొల్పుచున్న ఆ కన్యను చూచి రాము డిట్లనెను.

కాశ్యే న కామం గృహ్ణామి శస్త్రం వై వరవర్ణిని,
ఋతే బ్రహ్మవిదాం హేతోః కిమన్యత్ కరవాణి తే. 2

ఓ కాశిరాజపుత్రీ! బ్రహ్మవేత్తల కారణముగా తప్ప నేను నా ఇచ్ఛ ననుసరించి ఆయుధము చేపట్టను. మరియొకటి యేదైన నీకు చేయుదునా ?

వాచా భీష్మశ్చ శాల్వశ్చ మమ రాజ్ఞి వశానుగౌ,
భవిష్యతోఽనవద్యాఙ్గి తత్ కరిష్యామి మా శుచః. 3

భీష్ముడును, శాల్వుడును నామాటను బట్టి పోవువారే; కాబట్టి ఆపని చేయుదును. శోకింపకుము

---

2. కాశ్యే - కాశిరాజకన్యక కాశ్య - ఆ శబ్దముపై సంబోధన; కామమ్ - ఇచ్ఛ ననుసరించి.

న తు శస్త్రం గ్రహీష్యామి కథఞ్చిదపి భావిని,

ఋతే నియోగా ద్విప్రాణా మేష మే సమయః కృతః. 4

కాని గొప్ప విద్యావేత్తలగు బ్రాహ్మణుల ఆదేశము లేక ఎన్నటికి ఆయుధము పట్టనని నేను ప్రతిజ్ఞ చేసితిని. కావున శస్త్రము చేతబట్టను.

అమ్బోవాచ - అంబ యిట్లు పలికెను.

మమ దుఃఖం భగవతా వ్యపనేయం యత స్తతః,

తచ్చ భీష్మప్రసూతం మే తం జహీశ్వర మా చిరమ్. 5

స్వాములు నా దుఃఖము నెట్లైనను పోగొట్టనే వలయును. అదియు భీష్ముని వలన పుట్టినది. ప్రభూ! వానిని చంపుడు. ఆలసింపకుడు.

రామ ఉవాచ - రాము డిట్లనెను.

కాశికన్యే పున ర్బ్రూహి భీష్మ స్తే చరణా వుభౌ,

శిరసా వన్దనార్హోఽపి గ్రహీష్యతి గిరా మమ. 6

ఓ కాశిరాజకుమారీ! మరల పలుకుము. భీష్ముడు నీ మ్రొక్కులు పొంద దగువాడయ్యు నామాటపై నీ రెండుకాళ్ళు తలతో పట్టుకొనును.

అమ్బోవాచ - అంబ యిట్లు పలికెను.

జహి భీష్మం రణే రామ గర్జ న్త మసురం యథా,

సమాహూతో రణే రామ మమ చేదిచ్ఛసి ప్రియమ్,

ప్రతిశ్రుతం చ యదపి తత్ సత్యం కర్తు మర్హసి. 7

రామా! నీవు నాప్రియము కోరుదువేని యుద్ధమున నీ వాతనిని ఉసికొల్ప వలయును. బొబ్బలిడుచున్న రక్కసుని చంపిన తీరున ఆ భీష్ముని చంప వలయును. నాకిచ్చిన మాట యేదైన నున్నచో అది అవిధముగా సత్యము చేయ వలయును.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తయోః సంవదతో రేవం రాజన్ రామామ్బయో స్తదా,

ఋషిః పరమధర్మాత్మా ఇదం వచన మబ్రవీత్. 8

8. ఋషిః - అకృతవ్రణుడు.

అట్లు రాముడును అంబయు సంవాదము చేయుచుండగా పరమధర్మాత్ము డైన ఆకృతవ్రణమహర్షి యిట్లు పలికెను.

శరణాగతాం మహాబాహో కన్యాం న త్యక్తు మర్హసి,
యది భీష్మో రణే రామ సమాహూత స్త్వయా మృధే. 9
నిర్జితోఽస్మీతి వా బ్రూయాత్ కుర్యా ద్వా వచనం తవ,
కృత మస్యా భవేత్ కార్యం కన్యాయా భృగునన్దన. 10

ఓ మహాబాహూ! శరణు పొందిన కన్యను నీవు విడిచివేయదగదు. రామా! నీవు భీష్ముని యుద్ధమునకు పిలిచినచో ఓడితినని యేని పలుకును. లేదా నీ మాటను పాటించును. అంత నీమెపని తీరును.

వాక్యం సత్యం చ తే వీర భవిష్యతి కృతం విభో.

ప్రభూ! మహామునీ! వీరా! నీవు పలికిన మాటయు సత్యమగును.

ఇయం చాపి ప్రతిజ్ఞా తే తదా రామ మహామునే, 11
జిత్వా వై క్షత్రియాన్ సర్వాన్ బ్రాహ్మణేషు ప్రతిశ్రుతా.

రామా! మహామునీ! నీవు క్షత్రియుల నందరిని గెలిచి బ్రాహ్మణులకు ఈ ప్రతిజ్ఞ వినిపించితివి గదా!

బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చైవ రణే యది, 12
బ్రహ్మద్వి డ్భవితా తం వై హనిష్యామీతి భార్గవ.

బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని, వైశ్యుడు గాని, శూద్రుడు గాని, బ్రహ్మ ద్వేషి యైనచో వానిని యుద్ధమున చంపుదు నని ప్రతిజ్ఞ చేసితివి.

శరణార్థే ప్రపన్నానాం భీతానాం శరణార్థినామ్, 13
న శక్ష్యామి పరిత్యాగం కర్తుం జీవన్ కథఞ్చన.

శరణము కోరి ఆశ్రయించిన భీతులను బ్రదికియుండగ నెన్నటికిని విడువజాల ననియు పలికితివి.

యశ్చ కృత్స్నం రణే క్షత్రం విజేష్యతి సమాగతమ్, 14
దీప్తాత్మాన మహం తం చ హనిష్యామీతి భార్గవ.

మరియు కూడివచ్చిన క్షత్రియసముదాయము నెవ్వడు పోరున గెలుచునో యట్టి పొగరుగుండె వానిని కూడ చంపుదు ననియు ప్రతిజ్ఞ చేసితివి.

స ఏవం విజయీ రామ భీష్మః కురుకులోద్వహః,
తేన యుద్ధ్యస్వ సఙ్గ్రామే సమేత్య భృగునన్దన. 15

రామా! భృగునందనా! కురుకులమున శ్రేష్ఠుడగు ఆ భీష్ము డట్లు విజయము పొందినవాడు. యుద్ధమున వానితో తలపడి పోరుము.

రామ ఉవాచ - రాము డిట్లు పలికెను.

స్మరామ్యహం పూర్వకృతాం ప్రతిజ్ఞాం మృషిసత్తమ.
ఋషిసత్తమా! మునుపు చేసిన ప్రతిజ్ఞను స్మరించుచునే యున్నాను. 16
తథైవ చ చరిష్యామి యథా సామ్నైవ లప్స్యతే,
కార్య మేత న్మహ ద్బ్రహ్మన్ కాశికన్యామనోగతమ్,
గమిష్యామి స్వయం తత్ర కన్యా మాదాయ యత్ర సః. 17

బ్రాహ్మణోత్తమా! ఈ కాశికన్య మదిలో నున్న మహాకార్యము సామోపాయముచేతనే సాధ్యమగునట్లు ప్రయత్నింతును. ఈ కన్యను తీసికొని యా భీష్ము డున్నచోటికి స్వయముగా పోవుదును.

యది భీష్మో రణశ్లాఘీ న కరిష్యతి మే వచః,
హనిష్యా మ్యేన ముద్రిక్త మితి మే నిశ్చితా మతిః. 18

భీష్ముడు రణమునే కొనియాడుచు నామాట వినకుండెనో పొగరెక్కిన యాతనిని చంపివైచెదను. ఇది నా నిశ్చితమగు అభిప్రాయము.

నహి బాణా మయోత్సృష్టాః సజ్జన్తీహ శరీరిణామ్,
కాయేషు విదితం తుభ్యం పురా క్షత్రియ సఙ్గరే. 19

---

19. ఇహ - ఈ లోకమున; శరీరిణామ్ - శరీరము కలవారై యుండగా; మయా-నాచేత; ఉత్సృష్టాః - వదలబడిన; బాణాః-బాణములు; న సజ్జన్తి తగులవు - అనగా నా బాణములు తగిలిన తరువాత వారు శరీరము కల వారగుట అసంభవమని తాత్పర్యము.

నేను వదలిన బాణములు ఈ లోకమున శరీరముగలవారి దేహముల యందు తగుల్కొనవు మునుపు క్షత్రియులలో నైన వీరునందు నీకిది తెలిసిన విషయమే.

ఏవముక్త్వా తతో రామః సహ తై ర్బ్రహ్మవాదిభిః,
ప్రయాణాయ మతిం కృత్వా సముత్తస్థౌ మహాతపాః. 20

అంత నా రాముడు వేదవేత్తలగు ఆ ఋషులతో నట్లు పలికి ప్రయాణము నకు నిర్ణయించి బయలు దేరెను.

తతస్తే తా ముషిత్వా తు రజనీం తత్ర తాపసాః,
హుతాగ్నయో జప్తజప్యాః ప్రతస్థు ర్మజ్జిఘాంసయా. 21

అంత నా తాపసులందరు ఆ రాత్రి అచటనే గడపి అగ్నులను వ్రేల్చి జపము లొనర్చి నన్ను చంపు కోరికతో బయలుదేరిరి.

అభ్యాగచ్ఛ త్తతో రామః సహ తై ర్బ్రహ్మవాదిభిః,
కురుక్షేత్రం మహారాజ కన్యయా సహ భారత. 22

అంత పరశురాముడు వేదవేత్తలగు వారితో కూడి, ఆ కన్యతో పాటు కురుక్షేత్రమునకు వచ్చెను.

న్యవిశన్త తతః సర్వే పరిగృహ్య సరస్వతీమ్,
తాపసా స్తే మహాత్మానో భృగుశ్రేష్ఠపురస్కృతాః. 23

అంత నా మహాత్ములగు తాపసు లందరు భృగువంశవరేణ్యుని ముందిడు కొని సరస్వతి నది తీరమున బస చేసియుండిరి.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతస్తృతీయే దివసే సందిదేశ వ్యవస్థితః,
కురు ప్రియం స మే రాజన్ ప్రాప్తోఽస్మీతి మహావ్రతః. 24

అంత మూడవ దినమున చక్కగా కుదురుకొని ఆ మహావ్రతుడు, రాజా నేను వచ్చితిని, నాకు ప్రియ మొనరింపుము - అని వార్త పెట్టెను.

తమాగత మహం శ్రుత్వా విషయాన్తం మహాబలమ్,
అభ్యగచ్ఛం జవే నాశు ప్రీత్యా తేజోనిధిం ప్రభుమ్. 25

అట్లా మహాబలుడు, తేజోనిధి, ప్రభువు పరశురాముడు నా దేశము పొలిమేరలలోనికి వచ్చి యుండెనని విని ప్రీతితో వెంటనే వడివడిగా ఎదురేగితిని.

గాం పురస్కృత్య రాజేన్ద్ర బ్రాహ్మణైః పరివారితః,
ఋత్విగ్భి ర్దేవకల్పైశ్చ తథైవ చ పురోహితైః. 26

రాజేంద్రా ! గోవును ముందుంచుకొని, బ్రాహ్మణులు చుట్టిరాగా, దేవతల వంటి ఋత్విక్కులతో పురోహితులతో ఆ మహర్షి కెదురేగితిని.

స మా మభిగతం దృష్ట్వా జామదగ్న్యః ప్రతాపవాన్,
ప్రతిజగ్రాహ తాం పూజాం వచనం చేద మబ్రవీత్. 27

ప్రతాపవంతుడగు ఆ పరశురాముడు అట్లెదురుగా వచ్చిన నన్ను గని నా పూజను స్వీకరించెను. మరియు నిట్లు పలికెను.

రామ ఉవాచ - రాము డిట్లనెను.

భీష్మ కాం బుద్ధి మాస్థాయ కాశిరాజసుతా తదా,
అకామేన త్వయాఽఽనీతా పునశ్చైవ విసర్జితా. 28

భీష్మా ! నీ వానాడు కోరిక లేకయే ఏ బుద్ధితో ఈ కాశిరాజకన్యను తెచ్చితివి ? మరల ఏల వదలి వైచితివి.

విభ్రంశితా త్వయా హీయం ధర్మా దాస్తే యశస్వినీ,
పరామృష్టాం త్వయా హీమాం కో హి గన్తు మిహార్హతి. 29

ఏ పాప మెరుగని యీయమ నీ వలన ధర్మమునుండి భ్రష్టురాలైనది. నీవు స్పృశించిన ఈమెను మరి యెవ్వడుగాని స్వీకరింపనగునా?

ప్రత్యాఖ్యాతా హి శాల్వేన త్వయాఽఽనీతేతి భారత,
తస్మా దిమాం మన్నియోగాత్ ప్రతిగృహ్ణీష్వ భారత. 30

నీవు తెచ్చితివని శాల్వు డీమెను త్రోసివైచెను. కావున నామాటపై ఈమెను నీవే పరిగ్రహింపుము.

స్వధర్మం పురుషవ్యాఘ్ర రాజపుత్రీ లభ త్వియమ్,
న యుక్త మవమానోఽయం రాజ్ఞాం కర్తుం త్వయానఘ. 31

పుణ్యాత్ముడా! పురుషశ్రేష్ఠుడా! ఈ రాజపుత్రి తన ధర్మమును తాను పొందుగాక! నీవిట్లు రాజులకు అవమానము చేయుట కానిపని.

తత స్తం వై విమనస ముదీక్ష్యాహ మథాబ్రువమ్,
నాహ మేనాం పున ర్దద్యాం బ్రహ్మన్ భ్రాత్రే కథఞ్చన. 32

అంత నేను మనసు సరిగా లేని ఆ మహర్షిని చూచి యిట్లు పలికితిని : బ్రాహ్మణోత్తమా! మరల నే నీమెను ఎన్నటికిని నా తమ్మున కొనజాలను.

శాల్వస్యాహ మితి ప్రాహ పురా మామేవ భార్గవ,
మయా చైవాభ్యనుజ్ఞాతా గతేయం నగరం ప్రతి. 33

ఈమె మునుపు నేను శాల్వునిదాన నని నాతోడనే యెత్తి పలికెను. నే ననుమతించితిని. ఆమె యాతని నగరమునకు వెళ్ళిపోయెను.

న భయా న్నాప్యనుక్రోశా న్నార్థలోభా న్న కామ్యయా,
క్షాత్రం ధర్మ మహం జహ్యా మితి మే వ్రత మాహితమ్. 34

భయమువలననో, జాలివలననో, ధనలోభమువలననో, కామదృష్టివలననో క్షత్రియధర్మమును విడనాడ ననునది నేను పట్టిన వ్రతము.

అథ మా మబ్రవీ ద్రామః క్రోధపర్యాకులేక్షణః,
న కరిష్యసి చేదేత ద్వాక్యం మే నరపుఙ్గవ. 35
హనిష్యామి సహామాత్యం త్వా మద్యేతి పునః పునః,
సంరంభా దబ్రవీ ద్రామః క్రోధపర్యాకులేక్షణః. 36

అంత నా రాముడు క్రోధముతో తిరుగుళ్ళు పడుచున్న కనులతో 'ఓయీ! నా ఈ మాటను పాటింపవేని నిన్ను నీ వారితో పాటు ఇప్పుడు చంపివైచెద నని మరల మరల క్రోధావేశముతో పలికెను.

తమహం గీర్భి రిష్టాభిః పునః పున రరిన్దమ,
అయాచయం భృగుశార్దూలం న చైవ ప్రశశామ సః. 37

భృగువంశవరేణ్యుడగు నతనిని పలుమారులు ప్రీతిపాత్రములగు మాటలతో వేడుకొంటిని. అతడు శాంతి పొందనే లేదు.

ప్రణమ్య తమహం మూర్ధ్నా భూయో బ్రాహ్మణసత్తమమ్,
అబ్రువం కారణం కిం తద్యత్త్వం యుద్ధం మయేచ్ఛసి. 38

మరల ఆ బ్రాహ్మణసత్తమునకు తలతో మ్రొక్కి పలికితిని - స్వామీ! నాతో యుద్ధమేల కోరుచున్నావో కారణము చెప్పుము.

ఇష్వస్త్రం మమ బాలస్య భవతైవ చతుర్విధమ్,
ఉపదిష్టం మహాబాహో శిష్యోఽస్మి తవ భార్గవ. 39

నేను బాల్యమున నీ వలననే నాల్గు విధముల ధనుర్విద్య నేర్చితిని. భార్గవా! మహాబాహూ! నేను నీ శిష్యుడను గదా!

తతో మా మబ్రవీ ద్రామః క్రోధసంరక్తలోచనః,
జానీషే మాం గురుం భీష్మ గృహ్ణాసీమాం న చైవ హ. 40
సుతాం కాశ్యస్య కౌరవ్య మత్ప్రియార్థం మహామతే.

అంత క్రోధముతో ఎరుపెక్కిన కనులు గల రాముడిట్లు పలికెను: భీష్మా! నన్ను గురువుగా నెరుగుదువు. కాని నా ప్రియము కొరకు కాశిరాజు కూతురగు ఈమెను, ఓ మహామతీ! గ్రహింపకున్నావు.

న హి తే విద్యతే శాన్తి రన్యథా కురునన్దన. 41

కురుకుమారా! వేరు విధముగా నీకు శాంతిలేదు.

గృహాణేమాం మహాబాహో రక్షస్వ కుల మాత్మనః,
త్వయా విభ్రంశితా హీయం భర్తారం నాధిగచ్ఛతి. 42

మహాబాహూ! ఈమెను గ్రహింపుము. నీ కులమును రక్షించుకొనుము. నీచే భ్రష్టురాలైన యీమె భర్తను పొందకున్నది.

తథా బ్రువన్తం తమహం రామం పరపురఞ్జయమ్,
నైతదేవం పునర్భావి బ్రహ్మర్షే కిం శ్రమేణ తే. 43

అట్లు పలుకుచున్న శత్రుసంహారకుడగు ఆ రామునితో నిట్లంటిని బ్రహ్మర్షీ! ఇది యెన్నటికిని సంభవింపదు. నీకు శ్రమ ఏల?

గురుత్వం త్వయి సంప్రేక్ష్య జామదగ్న్య పురాతనమ్,
ప్రసాదయే త్వాం భగవం స్త్యక్తైషా తు పురా మయా. 44

జమదగ్నితనయా! ప్రారంభ యగు నీ గురుత్వమును చక్కగా భావించి నిన్ను బ్రతిమాలుకొనుచున్నాను. ఈమెను నేనెన్నడో విడచివైచితిని.

కో జాతు పరభావాం తు నారీం వ్యాలీ మివ స్థితామ్,
వాసయేత గృహే జానన్ స్త్రీణాం దోషో మహాత్యయః. 45

ఇతరునియందు మనస్సుగల యింతిని, త్రాచుపామువంటి దానిని ఎరిగి ఎవ్వడైన నింట నిలుపుకొనునా? స్త్రీల తప్పు ప్రాణసంకటము కలిగించునట్టిది.

న భయా ద్వాసవ స్యాపి ధర్మం జహ్యాం మహావ్రత,
ప్రసీద మా వా యద్వా తే కార్యం తత్కురు మా చిరమ్. 46

ఇంద్రునివలన భయము కలిగినను నేను ధర్మమును విడనాడను. దయ చూడుము. కాదా! నీవు చేయదలచిన దేమో త్వరగా చేయుము.

అయం చాపి విశుద్ధాత్మన్ పురాణే శ్రూయతే విభో,
మరుత్తేన మహాబుద్ధే గీతః శ్లోకో మహాత్మనా. 47

మహాత్ముడగు మరుత్తుడు పాడిన శ్లోక మొకటి, ప్రభూ! విశుద్ధాత్ముడా! మహాబుద్ధీ! పురాణమున వినవచ్చుచున్నది.

"గురో౽ర వ్యవలిప్తస్య కార్యాకార్య మజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే". 48

"మదించినవాడు, కార్యమేదో, అకార్య మేదో యెఱుగనివాడు, చెడుదారి పట్టినవాడు నగు గురువునైనను వదలుట కర్తవ్యము."

స త్వం గురు రితి ప్రేమ్ణా మయా సంమానితో భృశమ్,
గురువృత్తిం న జానీషే తస్మా ద్యోత్స్యామి వై త్వయా. 49

ఆ నిన్ను గురుడ వని ప్రేమతో ఇంతవరకు ఎంతో మన్నించితిని. గురువు తీరెట్టిదో తెలియకున్నావు. కాన నీతో నింక పోరెదను.

గురుం న హన్యాం సమరే బ్రాహ్మణం చ విశేషతః,
విశేషత స్తపోవృద్ధ మేవం క్షాన్తం మయా తవ. 50

---

48. అవలిప్తస్య - గర్వము గలవానియొక్క;

నేను సమరమున గురుపును; అందును బ్రాహ్మణుని, మీరు మిక్కిలి తపస్సు పండినవానిని చంపను. కావుననే నీ చేష్టితమును ఇంతవరకు క్షమించితిని.

ఉద్యతేషు మథో దృష్ట్వా బ్రాహ్మణం క్షత్రబన్ధువత్,
యో హన్యాత్ సమరే క్రుద్ధం యుధ్యన్త మపలాయినమ్, 51
బ్రహ్మహత్యా న తస్య స్యాదితి ధర్మేషు నిశ్చయః.

క్షత్రియునివలె బాణమెత్తి పట్టుకొని పోరుచున్న క్రుద్ధుడు, పారిపోనివాడు నగు బ్రాహ్మణుని చంపినవానికి బ్రహ్మహత్య అను పాపము కలుగదని ధర్మశాస్త్రముల నిర్ణయము.

క్షత్రియాణాం స్థితో ధర్మే క్షత్రియోఽస్మి తపోధన, 52
యో యథా వర్తతే యస్మిం స్తస్మిన్నేవ ప్రవర్తయన్,
నాధర్మం సమవాప్నోతి న చాశ్రేయశ్చ విన్దతి. 53

నేను క్షత్రియుల ధర్మమునందు నెలకొనియున్నవాడను. తపోధనా! క్షత్రియుడను. ఏ పురుషుడు ఏ పురుషునియందు ఎట్టి భావముతో మెలగునో ఆ పురుషుడు ఆ నరునియందు అట్టిభావమునే ప్రవర్తింపజేయుచు అధర్మమును, అశుభమును పొందడు.

అర్థే వా యది వా ధర్మే సమర్థో దేశకాలవిత్,
అర్థసంశయ మాపన్నః శ్రేయా న్నిస్సంశయో నరః. 54

---

53. యః - ఏ మనుజుడు; యస్మిన్ - ఏ నరునియందు; యథా - ఎట్లు - ప్రీతితోడనో, ద్వేషముతోడనో; వర్తతే - మెలగునో; స నరః - ఆ నరుడు, తస్మిన్ - ఆ నరునియందు; తథైవ - అట్లే; ప్రవర్తయన్ - ప్రీతినో, ద్వేషమునో వెలయించుచు; అధర్మమ్ - అధర్మమును, న సమవాప్నోతి - పొందడు; అశ్రేయశ్చ - అశుభమును; న విన్దతి - పొందడు. నీవు నన్ను ద్వేషించుచున్నావు కాన నేను నిన్ను ద్వేషించుట అధర్మము కాజాలదు. దానివలన నేను అశుభమును పొందను అని భావము.

54. అర్థవిషయమున ఇదియా అదియా అను సంశయము కలిగినపుడు సంశయము సంశయముగా నున్నను ప్రమాదము లేదు. ధర్మవిషయ

దేశతత్త్వమును, కాలతత్త్వమును ఎరిగిన వివేకవంతునకు అర్థవిషయమున గాని ధర్మవిషయమునగాని సంశయము కలిగినపుడు అర్థవిషయమున మాత్రమే సంశయము పొందినచో ఆతడు నిస్సంశయముగా గొప్పవాడు.

యస్మాత్ సంశయితేఽవ్యర్థేఽయథాన్యాయం ప్రవర్తసే,
తస్మాద్ యోత్స్యామి సహిత స్త్వయా రామ మహాహవే. 55

సంశయింపదగిన అర్థవిషయమున కూడ నీవు న్యాయము తప్పియే మెలగుచున్నావు. కావున రామా! మహాయుద్ధమున నీతో పోరే సలుపుదును.

పశ్య మే బాహువీర్యం చ విక్రమం చాతిమానుషమ్,
ఏవం గతేఽపి తు మయా యచ్ఛక్యం భృగునన్దన. 56
తత్కరిష్యే కురుక్షేత్రే యోత్స్యే విప్ర త్వయా సహ,
ద్వన్ద్వే రామ యథేష్టం మే సజ్జీభవ మహాద్యుతే. 57

---

మున సంశయము కలిగినపుడు నిశ్చయము పొంది ధర్మమే ఆచరించుట కర్తవ్యమని తాత్పర్యము.

నిన్ను అర్థవిషయమున ప్రచోదన చేయుచు నీకు ప్రీతినే కూర్చుచున్నాను గదా! అని అందువేమో ఓ రామా! అది సరికాదు. అని భీష్ముడీ శ్లోకార్థమును తెలుపుచున్నాడు.

ఇట అర్థ మనగా గురువుమాట విని భార్యను స్వీకరించుట. ధర్మమనగా తండ్రి ప్రీతికై స్వీకరించిన బ్రహ్మచర్యము. ఈ రెంటిలో గురువాక్యమును త్రోసిరా జన్నచో పాపమేమో పాపము కాదేమో అని సంశయించుట మంచిది. కాని ధర్మమగు బ్రహ్మచర్యమును విడనాడుట మంచిదా? అని సంశయము పొందరాదు-ధర్మమును విడనాడకుండుటయే మంచిదని భావము. అర్థే సంశయ మాపన్నః - అనగా అర్థమునందు సంశయము పొందినవాడు - అర్థవిషయము నాచరింపని వాడని తాత్పర్యము. శ్రేయాన్ - ఉత్తముడు; పరిశేషన్యాయము ననుసరించి ధర్మమున సంశయము పొందినవాడు నీచుడని భావము.

55. అయథాన్యాయమ్ - అని పదవిభాగము - న్యాయము నతిక్రమించి నన్ను ప్రవర్తింపజేయుచున్నావని భావము;

నా బాహువుల శక్తిని, మనుష్యులకు సాధారణము కాని పరాక్రమమును చూడుము. భార్గవా! నీ విట్టివాడవు కాగా నేను చేయగలది యేదో యది కురుక్షేత్రమున చేసెదను. ఓయి విప్రుడా! నీతో నీ యిష్టమును బట్టియే ద్వంద్వ యుద్ధమున పోరుదును. ఓ మహాద్యుతీ! సిద్ధము కమ్ము.

తత్ర త్వం నిహతో రామ మయా శరశతార్దితః,
ప్రాప్స్యసే నిర్జితా న్లోకాన్ శస్త్రపూతో మహారణే. 58

నూర్లకొలదిగా వచ్చు నా బాణములకు నొచ్చి నీవందు చత్తువేసి శస్త్రములతో పవిత్రుడవై నీవు సాధించిన ఉత్తమలోకములను పొందెదవు.

స గచ్ఛ వినివర్తస్వ కురుక్షేత్రం రణప్రియ,
తత్రైష్యామి మహాబాహో యుద్ధాయ త్వాం తపోధన. 59

ఓయి రణప్రియా! మరలుము. కురుక్షేత్రమునకు పద. తపోధనా! మహాబాహూ! పోరునకై నిన్నందు కలిసికొందును.

అపి యత్ర పురా రామ కృతం శౌచం పురా పితుః,
తత్రాహమపి హత్వా త్వాం శౌచం కర్తాఽస్మి భార్గవ. 60

రామా! ఎందు మునుపు నీవు నీ తండ్రికి శౌచ మాచరించితివో అందే నిన్ను చంపి నీకు నేను శౌచము నాచరింతును.

తత్ర రామ సమాగచ్ఛ త్వరితం యుద్ధదుర్మద,
వ్యపనేష్యామి తే దర్పం పౌరాణం బ్రాహ్మణబ్రువ. 61

రామా! పేరునకు మాత్రము బ్రాహ్మణుడైనవాడా! కయ్యమునకు కాలు దువ్వువాడా! త్వరగా రమ్ము! తొల్లింటి నీ గర్వమును తొలగించెదను.

---

60. తండ్రి మరణమునందువలె గురుమరణమునందు కూడ ఆశౌచము - (మైల) రాగా ఆ తీర్థమునందే నేను కట్టుబట్టతో స్నాన మాచరించుట మొదలగు కార్యము లాచరించి పదియవదినమున శుద్ధిచేసికొందును. అని తాత్పర్యము. శౌచ మనగా నెత్తుటితో తర్పణము చేయుట అని ఒక యిటీవలి వ్యాఖ్యాత వ్రాసెను.

61. పౌరాణమ్ - పూర్వకాలమునకు సంబంధించిన - ప్రాతది యగు.

యచ్చాపి కత్థసే రామ బహుశః పరివత్సరే,
నిర్జితాః క్షత్రియా లోకే మయైకేనేతి తచ్ఛృణు. 62

రామా! నీవు పలుమారులు పెక్కేండ్లు నే నొక్కడనై క్షత్రియుల నందరిని గెలిచితినని నిన్ను నీవు పొగడుకొనుచుందువు. దాని సంగతి చెప్పెదను; వినుము.

న తదా జాతవాన్ భీష్మః క్షత్రియో వాఽపి మద్విధః,
పశ్చా జ్జాతాని తేజాంసి తృణేషు జ్వలితం త్వయా. 63

అప్పుడు భీష్ముడు పుట్టియుండలేదు. కాక నావంటి క్షత్రియుడును లేడు. గొప్ప వెలుగు లన్నియు తరువాత పుట్టినవి. నీవు గడ్డిపరకలయందు మండితివి.

యస్తే యుద్ధమయం దర్పం కామం చ వ్యపనాశయేత్,
సోఽహం జాతో మహాబాహో భీష్మః పరపురఞ్జయః,
వ్యపనేష్యామి తే దర్పం యుద్ధే రామ న సంశయః. 64

నీ యుద్ధసంబంధమగు గర్వమును కోరికను రూపుమాపగల భీష్ముదను, శత్రుసంహారకుడను ఇదిగో పుట్టితిని. రామా! పోరున నీ దర్పమును తొలగింతును. సంశయము లేదు.

భీష్మ ఉవాచ – భీష్ము డిట్లు పలికెను.

తతో మా మబ్రవీద్రామః ప్రహసన్నివ భారత,
దిష్ట్యా భీష్మ మయా సార్ధం యోద్ధు మిచ్ఛసి సఙ్గరే. 65

అంత పరశురాముడు వేళాకోళముగా నవ్వుచు నిట్లనెను : భీష్మా! అదృష్టము. నాతో రణరంగమున పోరగోరుచున్నావు.

అయం గచ్ఛామి కౌరవ్య కురుక్షేత్రం త్వయా సహ,
భాషితం తే కరిష్యామి తత్రాగచ్ఛ పరన్తప. 66

ఇదిగో నీతో కలిసియే కురుక్షేత్రమునకు కదలుచున్నాను. నీమాట చెల్లింతును. శత్రువులను కాల్చివేయువాడా; అటకు రమ్ము.

తత్ర త్వాం నిహతం మాతా మయా శరశతాచితమ్,
జాహ్నవీ పశ్యతాం భీష్మ గృధ్రకఙ్కబలాశనమ్. 67

నా బాణములు నూర్లకొలది దేహములో గ్రుచ్చుకొని చచ్చిపడియున్న నిన్ను, గ్రద్దలు, రాబందులు, కాకులు తినుచున్న నిన్ను మీయమ్మ గంగమ్మ చూచుగాక!

కృపణం త్వా మభిప్రేక్ష్య సిద్ధచారణసేవితా,
మయా వినిహతం దేవీ రోదతా మద్య పార్థివ. 68

నాచే చచ్చిన దీనుని నిన్ను గని సిద్ధులు, చారణులు సేవించుచున్న ఆ దేవి నే డేడ్చుగాక!

అతదర్హా మహాభాగా భగీరథసుతాఽనఘా,
యా త్వా మజీజన న్మన్దం యుద్ధకాముక మాతురమ్. 69

పాప మామె కట్టి దుఃఖము రారాదు. ఆ భగీరథుని బిడ్డ, ఏ పాప మెరుగనిది, బుద్ధిలేనివాడవు, యుద్ధమునకు సిద్ధపడువాడవు, జాడ్యము పొందినవాడవు నగు నిన్ను కన్నతల్లి యీరోజు విలపించును.

ఏహి గచ్ఛ మయా భీష్మ యుద్ధకాముక దుర్మద,
గృహాణ సర్వం కౌరవ్య రథాది భరతర్షభ. 70

యుద్ధకాముకుడా! పొగరుపట్టినవాడా! కౌరవ్యా! రా! నాతో రమ్ము! రథము మొదలగు దానినెల్ల కైకొనుము.

ఇతి బ్రువాణం తమహం రామం పరపురఞ్జయమ్,
ప్రణమ్య శిరసా రామ మేవమస్త్విత్యథాబ్రువమ్. 71

ఇట్లు పలుకుచున్న ఆ శత్రుహంత యగు రామునికి తలతో ప్రణమిల్లి అది యట్లే అగుగాక అని పలికితిని.

ఏవ ముక్త్వా యయౌ రామః కురుక్షేత్రం యుయుత్సయా,
ప్రవిశ్య నగరం చాహం సత్యవత్యై న్యవేదయమ్. 72

---

67. గృధ్ర, కఙ్క, బల, అశనమ్-గ్రద్దలకు, రాబందులకు, బలము లనగా - కాకులు - వాని కాహారమైన వానిని;

ఇట్లు పలికి రాముడు యుద్ధమాడు కోరికతో కురుక్షేత్రమున కరిగెను. నేను పురమున ప్రవేశించి సత్యవతి కంతయు నివేదించితిని.

తతః కృతస్వస్త్యయనో మాత్రా చ ప్రతినన్దితః,
ద్విజాతీన్ వాచ్య పుణ్యాహం స్వస్తి చైవ మహాద్యుతే. 73

అంత తల్లి మంగళవాక్యములు పలికి నన్ను కొనియాడెను. బ్రాహ్మణులు పుణ్యాహవచనమును, స్వస్తిని పలికిరి.

రథ మాస్థాయ రుచిరం రాజతం పాణ్డురై ర్హయైః,
సూపస్కరం స్వధిష్ఠానం వైయాఘ్రపరివారణమ్. 74
ఉపపన్నం మహాశస్త్రైః సర్వోపకరణాన్వితమ్,
తత్కులీనేన వీరేణ హయశాస్త్రవిదా రణే. 75
యత్తం సూతేన శిష్టేన బహుశో దృష్టకర్మణా,
దంశితః పాణ్డురేణాహం కవచేన వపుష్మతా, 76
పాణ్డురం కార్ముకం గృహ్య ప్రాయాం భరతసత్తమ.

చక్కనిది, వెండిది, తెల్లని గుఱ్ఱములు పూన్చినది, చక్కని సంబారములు కలది, ఓటవైన చక్రములు గలది, పులితోలు కప్పు కలది, గొప్ప ఆయుధములతో సాధనము లన్నింటితో కూడినది. మంచికులమున పుట్టినవాడు, వీరుడు, అశ్వశాస్త్రమున పండితుడు, యోగ్యుడు పలుయుద్ధములలో నేర్పు చూపినవాడు నగు సారథిచేత సిద్ధము చేయబడినదియు నగు రథమెక్కి చక్కని విరివిగల తెల్లని కవచము తొడిగినవాడనై, తెల్లని ధనువు చేతబట్టి బయలు దేరితిని.

పాణ్డురే ణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని, 77
పాణ్డురై శ్చాపి వ్యజనై ర్వీజ్యమానో నరాధిప.

నా శిరస్సుపై తెల్లనిగొడుగు పట్టబడినది. తెల్లని వింజామరలతో నాకు వీచుచుండిరి.

---

74. సు, ఉపస్కరమ్ - చక్కని యుద్ధమునకు వలయు సామగ్రి కలది; స్వధిష్ఠానమ్ - గట్టి యాధారములు - చక్రములు గలది; వైయాఘ్రమ్- పులితోలు, పరివారణమ్ - అచ్ఛాదనము - పులితోలుతో కప్పబడినది.

శుక్లవాసాః సితోష్ణీషః సర్వశుక్లవిభూషణః, 78
స్తూయమానో జయాశీర్భి ర్నిష్క్రమ్య గజసాహ్వయాత్,
కురుక్షేత్రం రణక్షేత్ర ముపాయాం భరతర్షభ. 79

తెల్లని వస్త్రములు, తెల్లని తలపాగ, తెల్లని భూషణములు ధరించి జయ జయ అను ఆశీస్సులతో కూడిన స్తుతు లందుకొనుచు కరిపురినుండి వెలువడి రణమురాలైన కురుక్షేత్రమును చేరుకొంటిని.

తే హయా శ్చోదితా స్తేన సూతేన పరమాహవే,
అవహ న్మాం భృశం రాజన్ మనోమారుతరంహసః. 80

ఆ సూతుడు మహాయుద్ధమున తోలుచున్న ఆ గుఱ్ఱములు మనస్సుతో, మారుతముతో సాటియగు వేగము గలవియై నన్ను గొనిపోయెను.

గత్వాఽహం తత్ కురుక్షేత్రం స చ రామః ప్రతాపవాన్,
యుద్ధాయ సహసా రాజన్ పరాక్రాన్తౌ పరస్పరమ్. 81

అట్లు నేనును, ప్రతాపవంతుడగు ఆ రాముడును కురుక్షేత్రమున కరిగి యుద్ధమునకు పరాక్రమముతో తలపడితిమి.

తతః సందర్శనేఽతిష్ఠం రామ స్యాతితపస్వినః,
ప్రగృహ్య శఙ్ఖప్రవరం తతః ప్రాధమ ముత్తమమ్. 82

మహాతపస్వి యగు రాముని యెదుట నిలిచి శ్రేష్ఠమగు శంఖమును గైకొని పెద్దగా మొరయించితిని.

తత స్తత్ర ద్విజా రాజం స్తాపసాశ్చ వనౌకసః,
అపశ్య న్త రణం దివ్యం దేవాః సేన్ద్రగణా స్తదా. 83

రాజా! అంత నటనున్న బ్రాహ్మణులు, వనమున వసించు తాపసులు, ఇంద్రునితో పాటు దేవతల సముదాయములు ఆ దివ్యరణము చూచుచుండిరి.

తతో దివ్యాని మాల్యాని ప్రాదురాసం స్తత స్తతః,
వాదిత్రాణి చ దివ్యాని మేఘవృన్దాని చైవ హ. 84

అంత దేవలోకపు మాల్యములు, వాద్యములు, మేఘముల సముదాయములు ఆ యా తావులనుండి అచటకు వచ్చి నిలిచినవి.

తతస్తే తాపసాః సర్వే భార్గవ స్యానుయాయినః,
ప్రేక్షకాః సమపద్యన్త పరివార్య రణాజిరమ్. 85

పరశురాముని వెంట వచ్చిన ఆ తాపసు లందరు యుద్ధభూమిని చుట్టి వచ్చి ప్రేక్షకులై నిలిచిరి.

తతో మా మబ్రవీ ద్దేవీ సర్వభూతహితైషిణీ,
మాతా స్వరూపిణీ రాజన్ కిమిదం తే చికీర్షితమ్. 86

అంత నా తల్లి గంగాదేవి ప్రాణు లన్నింటి మేలు కోరునది కావున స్త్రీ స్వరూపముతో వచ్చి నాతో నిట్లనెను - ఏమయ్యా ! నీవు చేయదలచినది ?

గత్వాఽహం జామదగ్న్యం తు ప్రయాచిష్యే కురూద్వహ,
భీష్మేణ సహ మా యోత్సీః శిష్యేణేతి పునః పునః. 87

నే నా జమదగ్ని కొడుకుకడ కరిగి నీ శిష్యుడగు భీష్మునితో పోరవల దని మరల మరల ప్రార్థించెదను.

మా మైవం పుత్ర నిర్బన్ధం కురు విప్రేణ పార్థివ,
జామదగ్న్యేన సమరే యోద్ధు మిత్యేవ భర్త్సయత్. 88

కొడుకా ! విప్రుడైన జమదగ్ని కొడుకుతో యుద్ధమున తలపడుటకు పట్టుపట్టకుము - అని ఆమె మందలించెను.

కిన్న వై క్షత్రియహణో హరతుల్యపరాక్రమః,
విదితః పుత్ర రామస్తే యతస్తం యోద్ధు మిచ్ఛసి. 89

ఆతడు రుద్రునకు సాటివచ్చు పరాక్రమము గలవాడు. క్షత్రియుల నందరను చంపినవాడు కదా ? ఆతని సంగతి నీకు తెలిసినదే గదా ! అయినను ఆతనితో పోరగోరుచున్నావు - అని పలికెను.

తతోఽహ మబ్రువం దేవీ మభివాద్య కృతాఞ్జలిః,
సర్వం తద్భరతశ్రేష్ఠ యథావృత్తం స్వయంవరే. 90

అంత నే నా దేవికి చేతులు జోడించి మ్రొక్కి స్వయంవరమున జరిగిన దెల్ల జరిగినట్లు వివరించితిని.

యథా చ రామో రాజేన్ద్ర మయా పూర్వం ప్రచోదితః,
కాశిరాజసుతాయాశ్చ యథాకర్మ పురాతనమ్. 91

89. క్షత్రియహణః - క్షత్రియులను చంపినవాడు;

రాముడు నన్నెట్లు మున్ను (అంబను గ్రహించుటకై) పురికొల్పెనో, కాశిరాజుకూతురు మున్నేమి చేసెనో యది యంతయు వివరించితిని.

తతః సా రామ మభ్యేత్య జననీ మే మహానదీ,
మదర్థం తమృషిం వీక్ష్య క్షమయామాస భార్గవమ్. 92

అంత నా తల్లి మహానది రామునికడ కరిగి ఆ మహర్షిని భార్గవుని పరికించి నాకై బ్రతిమాఁజొచ్చెను.

భీష్మేణ సహ మా యోత్సీః శిష్యేణేతి వచోఽబ్రవీత్,
స చ తామాహ యాచన్తీం భీష్మమేవ నివర్తయ,
న చ మే కురుతే కామ మిత్యహం తముపాగమమ్. 93

అయ్యా! నీ శిష్యుడు భీష్మునితో యుద్ధ మాడకు మని పలికెను. అతడును అట్లు బ్రతిమాలుచున్న ఆమెతో 'భీష్మునే మరలింపుము. అతడు నా కోరిక తీర్పకున్నా డనియే కదా నేను వానితో పోరవచ్చితిని' అని పలికెను.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో గఙ్గా సుతస్నేహా ద్భీష్మం పున రుపాగమత్,
న చాస్యా శ్చాకరో ద్వాక్యం క్రోధపర్యాకులేక్షణః. 94

అంత గంగ కొడుకుమీది ప్రేమతో మరల భీష్మునికడకు వచ్చెను. అతడును క్రోధముతో తిరుగుచు పడుచున్న కనులతో ఆమెమాటను పాటింపలేదు.

అథాదృశ్యత ధర్మాత్మా భృగుశ్రేష్ఠో మహాతపాః,
ఆహ్వయామాస చ తదా యుద్ధాయ ద్విజసత్తమః. 95

పిమ్మట గొప్ప తపస్వియు భృగువరేణ్యుడును ధర్మాత్ముడు నగు రాముడు కానవచ్చి యుద్ధమునకై కవ్వించెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
పరశురామభీష్మయోః కురుక్షేత్రావతరణే
అష్టసప్తత్యుత్తరశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
పరశురామభీష్మలు కురుక్షేత్రమున వ్రాలుట యను
నూటడెబ్బదియెనిమిదవ అధ్యాయము.

—: ౦ :—

# ఊనాశీత్యధికశతతమోఽధ్యాయః
# నూటడెబ్బదితొమ్మిదవ అధ్యాయము

**సంకల్పనిర్మితరథ మారూఢేన పరశురామేణ సహ**
**భీష్మకర్తృకో యుద్ధారమ్భః.**
**సంకల్పముతో ఏర్పరచుకొన్న రథము నెక్కిన పరశురామునితో**
**భీష్ముడు యుద్ధమునకు తలపడుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

తమహం స్మయన్నివ రణే ప్రత్యభాషం వ్యవస్థితమ్,
భూమిష్ఠ నోత్సహే యోద్ధుం భవన్తం రథ మాస్థితః. 1

అంత నేను యుద్ధమునకు సిద్ధమైయున్న ఆతనితో గర్వము తోచునట్లుగా నిట్లంటిని. రథముపై నున్నవాడనై నేలపై నున్న నీతో పోర నుంకింపను.

ఆరోహ స్యన్దనం వీర కవచం చ మహాభుజ,
బధాన సమరే రామ యది యోద్ధుం మయేచ్ఛసి. 2

వీరా! రామా! నాతో యుద్ధము చేయగోరుదువేని రథ మెక్కుము. కవచము తాల్పుము.

తతో మా మబ్రవీ ద్రామః స్మయమానో రణాజిరే,
రథో మే మేదినీ భీష్మ వాహా వేదాః సదశ్వవత్. 3

అంత రాముడు నవ్వుచు నాతో నిట్లనెను. భీష్మా! ఈ నేలయే నా రథము వేదములే మంచి గుఱ్ఱముల వంటి నా వాహనములు.

సూతశ్చ మాతరిశ్వా వై కవచం వేదమాతరః,
సుసంవీతో రణే తాభి ర్యోత్స్యేఽహం కురునన్దన. 4

---

4. వేదమాతరః- గాయత్రి, సావిత్రి, సరస్వతి అనువారు.

నా సారథి వాయుదేవుడు. కవచము వేదమాతలు. వారు నన్ను చుట్టి వచ్చి కాపాడుచుండగా నేను యుద్ధ మొనర్తును.

ఏవం బ్రువాణో గాన్ధారే రామో మాం సత్యవిక్రమః,
శరవ్రాతేన మహతా సర్వతః ప్రత్యవారయత్. 5

గాంధారీకుమారా! సత్యమగు పరాక్రమము గల రాము డిట్లు పలుకుచునే గొప్పది యగు బాణముల సముదాయముతో అన్నివైపుల నిరోధించెను.

తతోఽపశ్యం జామదగ్న్యం రథమధ్యే వ్యవస్థితమ్,
సర్వాయుధవరే శ్రీమత్యద్భుతోపమదర్శనే. 6

అంత అన్నివిధములగు ఆయుధములతో ఉత్తమము, శోభతో నిండినదియు, అచ్చెరువుగొలుపు దర్శనము కలదియు నగు రథము నడుమ నిలిచి యున్న పరశురాముని గాంచితిని.

మనసా విహితే పుణ్యే విస్తీర్ణే నగరోపమే,
దివ్యాశ్వయుజి సన్నద్ధే కాఞ్చనేన విభూషితే. 7

మరియు నా రథము నాతడు సంకల్పముతోడనే కూర్చుకొనినది. పుణ్యమైనది. మిక్కిలి విస్తీర్ణముగల నగరమును బోలియున్నది. దివ్యములగు గుఱ్ఱములు పూన్చినది. సువర్ణముతో అలంకరింపబడినది. సిద్ధముగా నున్నది.

కవచేన మహాబాహో సోమార్కకృతలక్ష్మణా,
ధనుర్ధరో బద్ధతూణో బద్ధగోధాఙ్గులిత్రవాన్. 8

చంద్రసూర్యుల గుర్తులు గల కవచము నాతడు ధరించి యుండెను. విల్లు తాల్చియుండెను. అంపపొదులు కట్టుకొని యుండెను వ్రేళ్ళకు తొడుగులు తాల్చి యుండెను.

సారథ్యం కృతవాం స్తత్ర యుయుత్సో రకృతవ్రణః,
సఖా వేదవి దత్యంతం దయితో భార్గవస్య హ. 9

---

5. సత్యవిక్రమః అనుదానికి స వ్యతిక్రమః - అని పాఠాంతరము. ఆ పాఠమునకు క్రమము తప్పినవాడై యని యర్థము.
6. అద్భుతోపమదర్శనే - పోలిక చెప్పరాని దర్శనము గల;

వేదవేత్తయు, భార్గవునకు మిక్కిలి ప్రియసఖుడును అగు అకృతవ్రణుడు యుద్ధమాడగోరు రామునకు సారథ్యము చేయుచుండెను.

ఆహ్వయానః స మాం యుద్ధే మనో హర్షయతీవ మే,
పునః పున రభిక్రోశ న్నభియాహీతి భార్గవః. 10

నా మనస్సును మురిపింపజేయుచు అ భార్గవుడు రావోయీ! రా। అని నన్ను మాటిమాటికి కవ్వించుచు గర్జిలిడుచు పిలుచుచుండెను.

త మాదిత్య మివోద్యన్త మనాధృష్యం మహాబలమ్,
క్షత్రియాన్తకరం రామ మేక మేకః సమాసదమ్. 11

పైకెగయుచున్న సూర్యుని వలె ఎవ్వరికిని లొంగనివాడును, మహాబలుడును, క్షత్రియులను నాశనము చేసినవాడును ఒక్కడుగు అగు రాముని నేను ఒంటరిగా మార్కొంటిని.

తతోఽహం బాణపాతేషు త్రిషు వాహాన్ నిగృహ్య వై,
అవతీర్య ధను ర్న్యస్య పదాతి రృషిస త్తమమ్. 12
అభ్యాగచ్ఛం తదా రామ మర్చిష్యన్ ద్విజస త్తమమ్,
అభివాద్య చైనం విధివ దబ్రువం వాక్య ము త్తమమ్. 13

అంత నేను మూడు బాణములు వచ్చిపడగా గుఱ్ఱములను నిలిపి, రథము దిగి, వింటిని ప్రక్కకు పెట్టి కాలినడకతో ఋషులలో ఉత్తముడు, బ్రాహ్మణులలో శ్రేష్ఠుడు నగు రామునికడ కరిగి శాస్త్రమర్యాదతో మ్రొక్కి మేలైన పలుకు నిట్లు పలికితిని.

యోత్స్యే త్వయా రణే రామ సదృశేనాధికేన వా,
గురుణా ధర్మశీలేన జయ మాశాస్వ మే విభో. 14

రామా! నీవు నాకు సాటివాడవో నాకంటె గొప్పవాడవో గురుడవు, ధర్మశీలుడవు. నీతో పోరుచున్నాను. ప్రభూ! నాకు జయమును ఆకాంక్ష చేయుము.

రామ ఉవాచ - రాము డిట్లు పలికెను.

ఏవ మేతత్ కురుశ్రేష్ఠ కర్తవ్యం భూతి మిచ్ఛతా,
ధర్మో హ్యేష మహాబాహో విశిష్టైః సహ యుధ్యతామ్. 15

కురుశ్రేష్ఠా! శుభము కోరువాడిట్లే చేయవలయును. గొప్పవారితో పోరు వారి కిదియే ధర్మము.

శపేయం త్వాం న చేదేవ మాగచ్ఛేథా విశాంపతే,
యుధ్యస్వ త్వం రణే యత్తో ధైర్య మాలమ్బ్య కౌరవ. 16

రాజా! కురుపతీ! నీ విట్లు రాకుండినచో నిన్ను శపించి యుండెడివాడను. రణమున ధైర్య మవలంబించి స్థిరముగా నిలిచి పోరుము.

న తు తే జయ మాశాసే త్వాం విజేతు మహం స్థితః,
గచ్ఛ యుద్ధ్యస్వ ధర్మేణ ప్రీతోఽస్మి చరితేన తే. 17

కాని నేను నీకు జయము కోరను. నిన్ను గెలుచుటకు కదా నేను నిలిచినది. పద! ధర్మము తప్పక పోరుము. నీ నడవడికి ప్రీతుడ నైతిని.

తతోఽహం తం నమస్కృత్య రథ మారుహ్య సత్వరః,
ప్రాధ్మాపయం రణే శఙ్ఖం పునర్హేమపరిష్కృతమ్. 18

అంత నే నాతనికి మ్రొక్కి వడివడిగా బంగారు తొడవులు గల రథ మెక్కి శంఖ మూదితిని.

తతో యుద్ధం సమభవ న్మమ తస్య చ భారత,
దివసాన్ సుబహూన్ రాజన్ పరస్పరజిగీషయా. 19

అంత ఒకరినొకరు గెలుచు కోరికతో మా కిరువురకు పెక్కు దినములు యుద్ధ మాయెను.

స మే తస్మిన్ రణే పూర్వం ప్రాహరత్ కఙ్కపత్రిభిః,
షష్ట్యా శతైశ్చ నవభిః శరాణాం నతపర్వణామ్. 20

17. న తు తే జయ మాశాసే - నేను నీకు జయమును మాత్రము కోరను - అనుటలో జయము కాంక్షించి నీవు మున్నే నాకు అభివందనము చేసితివి కదా! ఇంక నేను ప్రత్యేకముగా కోర నేల? అని భావము. 15వ శ్లోకములో శుభము కోరువాడిట్లే చేయును అని అభినందించి యున్నందువలన ఈ అర్థము ప్రతీయమాన మగుచున్నది.

అతడు ముందుగా నొక్కులు గల బాణము లరువదింటితో, నూటితో, తొమ్మిదింటితో నన్ను కొట్టెను.

చత్వారస్తేన మే వాహాః సూతశ్చైవ విశామ్పతే,
ప్రతిరుద్ధా స్తథైవాహం సమరే దంశితః స్థితః. 21

నా నాలుగు గుఱ్ఱములు, సూతుడు, కవచము తాల్చి రణరంగమున నిలిచిన నేనును ఆ దెబ్బకు కదలిక లేనివార మైతిమి.

నమస్కృత్య చ దేవేభ్యో బ్రాహ్మణేభ్యో విశేషతః,
తమహం స్మయ న్నివ రణే ప్రత్యభాషం వ్యవస్థితమ్. 22

దేవతలకు, విశేషించి బ్రహ్మజ్ఞానసంపన్నులకు నమస్కరించి విలాసముగా నవ్వుచు నేను ధృఢముగా నిలిచియున్న ఆతనితో నిట్లు పలికితిని.

ఆచార్యతా మానితా మే నిర్మర్యాదే హ్యపి త్వయి,
భూయశ్చ శృణు మే బ్రహ్మన్ సంపదం ధర్మసంగ్రహే. 23

బ్రాహ్మణోత్తమా! నీవు మర్యాద పాటింపనివాడ వైనను నేను నీ ఆచార్యత్వమును మన్నించితిని. నా ధర్మజ్ఞానసంపదను మరల విన్నవించెదను. వినుము.

యే తే వేదాః శరీరస్థా బ్రహ్మణ్యం యచ్చ తే మహత్,
తపశ్చ తే మహ త్తప్తం న తేభ్యః ప్రహరా మ్యహమ్. 24

నీ శరీరమునందున్న వేదము లేవి కలవో, గొప్పది యగు నీ బ్రహ్మజ్ఞానసంపద యేది కలదో, నీవు మిక్కుటముగా సాధించిన తప మేది కలదో వానిని నేను కొట్టను.

ప్రహరే క్షత్రధర్మస్య యం రామ త్వం సమాశ్రితః,
బ్రాహ్మణః క్షత్రియత్వం హి యాతి శస్త్రసముద్యమాత్. 25

రామా! నీ వాశ్రయించిన క్షత్రధర్మమును మాత్రము కొట్టెదను. బ్రాహ్మణుడు ఆయుధము చేత బట్టుకొనుటవలన క్షత్రియభావమును పొందును గదా!

పశ్య మే ధనుషో వీర్యం పశ్య బాహో ర్బలం మమ,
ఏష మే కార్ముకం వీర ఛినద్మి నిశితేషుణా. 26

నా వింటి సత్తువను చూడుము. నా చేతుల లావు కనుగొనుము. ఇదిగో వీరుడా! వాడి బాణముతో నీ వింటిని విరుగగొట్టుచున్నాను.

తస్యాహం నిశితం భల్లం చిక్షేప భరతర్షభ,
తేనాస్య ధనుషః కోటిం ఛిత్త్వా భూమా వపాతయమ్. 27

అంత ఆతనిపై వాడి బాణమును లీలగా విసరివైచితిని. దానిచే నాతని వింటికొప్పు విరచి నేలగూల్చితిని.

తథైవ చ పృషత్కానాం శతాని నతపర్వణామ్,
చిక్షేప కఙ్కపత్రాణాం జామదగ్న్యరథం ప్రతి. 28

అట్లే వంగిన కణుపులు, రాబందుఱెకలు గల బాణములను నూర్లకొలదిగా పరశురాముని రథముపైకి గుప్పించితిని.

కాయే విషక్తాస్తు తదా వాయునా సముదీరితాః,
చేలుః క్షరన్తో రుధిరం నాగా ఇవ చ తే శరాః. 29

గాలిచే ఊపందుకొనిన ఆ బాణములు దేహమునందు తాకి పాములవలె రక్తము క్రక్కుచు కదలసాగినవి.

క్షతజోక్షితసర్వాఙ్గః క్షరన్ స రుధిరం రణే,
బభౌ రామస్తదా రాజన్ మేరు ర్ధాతు మివోత్సృజన్. 30

నిలువెల్ల రక్తము మరకలు గల ఆ పరశురాముడు రక్తము స్రవించుచుండగా ధాతురసములను వెలిగ్రక్కుచున్న మేరుపర్వతము వలె విరాజిల్లెను.

---

28. చిక్షేప - ఇది తనకు ప్రత్యక్షము కాని విషయమును చెప్పునపుడు వాడవలసిన భూతకాలక్రియ. కాని బాణములు విసరుట యను పని ఎవ్వడో ఎప్పుడో విలాసముగా నిర్వహించినది వలె జరిగె నను నర్థమును సూచించుచు నిట ప్రయుక్తమైనది.

హేమన్తేఽశోక ఇవ రక్తస్తబకమణ్డితః,
బభౌ రామ స్తథా రాజన్ ప్రఫుల్ల ఇవ కింశుకః. 31

హేమంతమున ఎఱ్ఱని పూగుత్తులు గలిగిన అశోకవృక్షమువలెను, విరుగఁబూచిన మోదుగచెట్టువలెను ఆ రాముడు రాజిల్లెను.

తతోఽన్య ద్ధను రాదాయ రామః క్రోధసమన్వితః,
హేమపుఙ్ఖాన్ సునిశితాన్ శరాంస్తాన్ హి వవర్ష సః. 32

అంత రాముడు తీవ్రకోపము గలవాడై మరొక వింటి నందుకొని మిక్కిలి వాడియైన బంగారు పిడులు గల బాణములను గ్రుమ్మరించెను.

తే సమాసాద్య మాం రౌద్రా బహుధా మర్మభేదినః,
అకమ్పయన్ మహావేగాః సర్పానలవిషోపమాః. 33

ఆయువుపట్టులను చీల్చునట్టి రౌద్రము లగు ఆ బాణములు పాముల వలె, అగ్నిజ్వాలల వలె, విషము వలె మిక్కిలి వేగము కలవియై నన్నూగించివైచెను.

తమహం సమవష్టభ్య పున రాత్మాన మాహవే,
శతసంఖ్యైః శరైః క్రుద్ధ స్తదా రామ మవాకిరమ్. 34

అంత తిరిగి నన్ను నేను నిలువద్రొక్కుకొని మిక్కిలి క్రుద్ధుడనై నూర్ల కొలది యగు బాణములను రాముని పై గుప్పించితిని.

స తై రగ్న్యర్కసంకాశైః శరై రాశీవిషోపమైః,
శితై రభ్యర్దితో రామో మన్దచేతా ఇవాభవత్. 35

అగ్నిసూర్యులవంటివియు, నాగుపాములవంటివియు పదునైనవియు నగు నా బాణములతో బాగుగా నుగ్గయిన రాముడు స్పృహ కోల్పోయినట్లాయెను.

తతోఽహం కృపయావిష్టో విష్టభ్యాత్మాన మాత్మనా,
ధిగ్ధి గిత్యబ్రువం యుద్ధం క్షత్రధర్మం చ భారత. 36

అంత నేను జాలి పైకొనగా నన్ను నేను నిగ్రహించుకొని ఛీ! ఛీ! ఇది యేమి యుద్ధము! ఈ క్షత్రధర్మ మెంత నీచమైనది అనుకొంటిని.

అసకృ చ్చాబ్రువం రాజన్ శోకవేగపరిప్లుతః,
అహో బత కృతం పాపం మయేదం క్షత్రధర్మణా. 37

గుండె దుఃఖముతో కుమిలిపోవగా పలుమా రిట్లు అనుకొంటిని: అయ్యో! ఛీ! క్షత్రధర్మము నవలంబించిన నే నీ పాపము చేసితిని.

గురు ర్ద్విజాతి ర్ధర్మాత్మా యదేవం పీడితః శరైః,
తతో న ప్రాహరం భూయో జామదగ్న్యాయ భారత. 38

గురువు, బ్రాహ్మణుడు, ధర్మాత్ముడు, పాపము నా బాణముల కెంతగా నొచ్చెనో! అని తలచి మరల పరశురామునిపై బాణములతో కొట్టకుంటిని.

అథావతాప్య పృథివీం పూషా దివససంక్షయే,
జగామాస్తం సహస్రాంశు స్తతో యుద్ధ ముపారమత్. 39

అంత నేలనంతయు నుడుకబెట్టి వేయి కిరణములు గల సూర్యుడు పగలు చెల్లిన పిమ్మట అస్తమించెను. అప్పుడు యుద్ధ మాగిపోయెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
రామభీష్మయుద్ధే ఊనాశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
రామభీష్మయుద్ధఘట్టమున నూటడెబ్బదితొమ్మిదవ అధ్యాయము.

—:o:—

# అశీత్యధికశతతమోఽధ్యాయః
# నూటయెనుబదియవ అధ్యాయము.

## భీష్మపరశురామయో ర్ఘోరః సంగ్రామః
## భీష్మ పరశురాముల ఘోరసంగ్రామము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

ఆత్మనస్తు తతః సూతో హయానాం చ విశాంపతే,
మమ చాపనయామాస శల్యాన్ కుశలసమ్మతః. 1

అంత నా సారథి గొప్ప నేర్పుకాడై తనయొక్కయు, గుఱ్ఱములయు నాయొక్కయు, దేహమున గ్రుచ్చుకొన్న బాణపు ములుకులను తొలగించెను.

స్నాతాపవృత్తై స్తురగై ర్లబ్ధతోయై రవిహ్వలైః,
ప్రభాతే చోదితే సూర్యే తతో యుద్ధ మవర్తత. 2

నీలాడి తిరిగి వచ్చినవియు, నీరు త్రావియున్నవియు, నిబ్బరముగా నున్నవియు నగు గుఱ్ఱములతో కూడియున్న మాకు, తెలవారిన పిదప సూర్యు డుదయించినంత తిరిగి యుద్ధము జరిగెను.

దృష్ట్వా మాం తూర్ణ మాయాన్తం దంశితం స్యన్దనే స్థితమ్,
అకరో ద్రథ మత్యర్థం రామః సజ్జం ప్రతాపవాన్. 3

కవచము తొడిగికొని, రథమున కుదురుకొని వడివడిగా వచ్చుచున్న నన్ను జూచి ప్రతాపవంతుడగు రాముడు రథమును వెనువెంటనే సిద్ధము చేసెను.

తతోఽహం రామ మాయాన్తం దృష్ట్వా సమరకాఙ్క్షిణమ్,
ధనుఃశ్రేష్ఠం సముత్సృజ్య సహసాఽవతరం రథాత్. 4

యుద్ధ మాడగోరి వచ్చుచున్న రాముని గాంచి నేను వడివడిగా శ్రేష్ఠమగు ధనువును వదలి రథమునుండి దిగితిని.

---

2. స్నాత, అపవృత్తైః- స్నానమాడి తిరిగివచ్చినట్టి;

అభివాద్య తథైవాహం రథ మారుహ్య భారత,
యుయుత్సు ర్జామదగ్న్యస్య ప్రముఖే వీతభీః స్థితః. 5

మునుపటివలెనే మ్రొక్కి తిరిగి రథమెక్కి పోరాడగోరినవాడనై జమదగ్ని కుమారుని యెట్టయెదుట భయములేక నిలిచితిని.

తతోఽహం శరవర్షేణ మహతా సమవాకిరమ్,
స చ మాం శరవర్షేణ వర్షన్తం సమవాకిరత్. 6

అంత నేను పెద్ద బాణవర్షము నాతనిపై గుప్పించితిని. ఆతడును అట్లు బాణవర్షము కురియుచున్న నాపై బాణములను విరజిమ్మెను.

సంక్రుద్ధో జామదగ్న్యస్తు పునరేవ సుతేజితాన్,
సంప్రైషీ న్మే శరాన్ ఘోరాన్ దీప్తాస్యా నురగా నివ. 7

కోపము పెల్లురేగిన పరశరాముడు మిక్కిలి పదునుదేరిన ఘోరములగు బాణములను, మంటలు చిమ్ముచున్న పాములవలె ఉన్నవానిని నాపై ప్రయోగించెను.

తతోఽహం నిశితై ర్భల్లైః శతశోఽథ సహస్రశః,
అచ్ఛిదం సహసా రాజన్నన్తరిక్షే పునః పునః. 8

అంత నేను వాడి బల్లెములను నూర్లకొలదిగా ప్రయోగించి ఆతని బాణములను నేల వ్రాలకముందే ముక్కలు గొట్టితిని.

తత స్త్వస్త్రాణి దివ్యాని జామదగ్న్యః ప్రతాపవాన్,
మయి ప్రయోజయామాస తాన్యహం ప్రత్యషేధయమ్. 9

అంత గొప్ప ప్రతాపముగల పరశరాముడు దివ్యములగు అస్త్రములను నాపై ప్రయోగించెను. నేను వాని నన్నింటిని త్రిప్పికొట్టితిని.

అస్త్రైరేవ మహాబాహో చికీర్ష న్నధికాం క్రియామ్,
తతో దివి మహాన్నాదః ప్రాదురాసీత్ సమన్తతః. 10

మహాకార్యము చేయగోరి అస్త్రములతోడనే నేనును ఆతని యస్త్రములను త్రిప్పికొట్టితిని. అంత నాకసమున అన్ని వైపుల గొప్పనాదముఉప్పతిల్లెను.

---

7. సుతేజితాన్ - మిక్కిలిగా పదును పెట్టబడినవానిని;

తతోఽహ మస్త్రం వాయవ్యం జామదగ్న్యే ప్రయుక్తవాన్,
ప్రత్యాజఘ్నే చ తద్రామో గుహ్యకాస్త్రేణ భారత. 11

అంత నేను జమదగ్ని కొడుకుపై వాయవ్యాస్త్రమును ప్రయోగించితిని. రాముడు దానిని కౌబేరాస్త్రముతో మరలించెను.

తతోఽహ మస్త్ర మాగ్నేయ మనుమన్త్ర్య ప్రయుక్తవాన్,
వారుణే నైవ తద్రామో వారయామాస మే విభుః. 12

అటుపై నేను అగ్నేయాస్త్రమును మంత్రించి ప్రయోగించితిని. దానిని రాముడు వారుణాస్త్రముతో త్రిప్పికొట్టెను.

ఏవ మస్త్రాణి దివ్యాని రామస్యాహ మవారయమ్,
రామశ్చ మమ తేజస్వీ దివ్యాస్త్రవి దరిన్దమః. 13

ఇట్లు నేను రాముని దివ్యాస్త్రములను మరలించితిని. తేజస్వి, దివ్యాస్త్రములను చక్కగా ఎరిగినవాడు, శత్రుమర్దనుడు అగు రాముడు నా అస్త్రములను నివారించెను.

తతో మాం సవ్యతో రాజన్ రామః కుర్వన్ ద్విజోత్తమః,
ఉర స్యవిధ్యత్ సంక్రుద్ధో జామదగ్న్యః ప్రతాపవాన్. 14

అంత ఉత్తమబ్రాహ్మణుడు, ప్రతాపవంతుడు అగు జమదగ్ని కుమారుడైన రాముడు నన్ను ఎడమవైపుగా నుంచుకొని మిక్కిలి కోపముతో రొమ్మున కొట్టెను.

తతోఽహం భరతశ్రేష్ఠ సంన్యషీదం రథోత్తమే,
తతో మాం కశ్మలావిష్టం సూత స్తూర్ణ ముదావహత్. 15

భరతవరేణ్యా! అంత నేను గొప్ప రథమున కూలబడితిని. మూర్ఛపోయిన నన్ను సారథి వడిగా ఆవలకు కొనిపోయెను.

గ్లాయన్తం భరతశ్రేష్ఠ రామబాణప్రపీడితమ్,
తతో మా మపయాన్తం వై భృశం విద్ధ మచేతసమ్. 16

---

14. సవ్యతః కుర్వన్ - ఎడమవైపుగా పెట్టుకొని - ఇట్లు చేయుట పరాజయము సూచించును.

16. సంన్యషీదమ్ - కూలబడితిని; కశ్మలః - మోహము, మూర్ఛ.

రామస్యానుచరా హృష్టాః సర్వే దృష్ట్వా విచుక్రుశుః,
అకృతవ్రణప్రభృతయః కాశికన్యా చ భారత. 17

రాముని బాణములకు మిక్కిలి నొచ్చి వాడి వత్తలైన నన్ను, బాగుగా దెబ్బతిని, ఒడ లెరుగని నన్ను, తొలగిపోవుచున్న నన్ను గాంచి రాముని అనుచరు లందరు-అకృతవ్రణుడు మొదలగు వారును, కాశికన్య యగు అంబయు - ఉత్సాహముతో పొంగిపోవుచు పెద్దగా అరవజొచ్చిరి.

తతస్తు లబ్ధసంజ్ఞోఽహం జ్ఞాత్వా సూత మథాబ్రువమ్,
యాహి సూత యతో రామః సజ్జోఽహం గతవేదనః. 18

అంత తెలివినొందిన నేను సూతునితో 'సూతా! రాముడున్నచోటికి పద! నేను వేదన తీరి సిద్ధముగా నున్నాను' అని పలికితిని.

తతో మా మవహత్ సూతో హయైః పరమశోభితైః,
నృత్యద్భి రివ కౌరవ్య మారుతప్రతిమై ర్గతౌ. 19

అపుడు సూతుడు చక్కగా అందములు చిమ్ముచున్న నృత్యము చేయుచున్నట్లున్న గమనముతో గాలికి దీటైన గుఱ్ఱములతో నన్ను అటకు కొంపోయెను.

తతోఽహం రామ మాసాద్య బాణవర్షైశ్చ కౌరవ,
అవాకిరం సుసంరబ్ధః సంరబ్ధం చ జిగీషయా. 20

నేను మిక్కిలి చెలరేగి అంపవాన కురియుచు తీవ్రకోపముతో నున్న రాముని సమీపించి గెలిచి తీరవలయునన్న కోరికతో బాణములు గుప్పించితిని

తానాపతత ఏవాసౌ రామో బాణా నజిహ్మగాన్,
బాణైరే వాచ్చినత్తూర్ణ మేకైకం త్రిభి రాహవే. 21

అట్లు సూటిగా వచ్చి పడుచున్న బాణములు వచ్చుచుండగనే ఒక్కొక్క బాణమునకు మూడేసి బాణములు ప్రయోగించుచు ఒక్కపెట్టున వానిని ముక్కలుగా కొట్టెను.

తతస్తే సూదితాః సర్వే మమ బాణాః సుసంశితాః,
రామబాణై ర్ద్విధా ఛిన్నాః శతశోఽథ సహస్రశః. 22

మిక్కిలి వాడియైన ఆ నా బాణము లన్నియు రామబాణములతో రెండు ముక్కలై వందలుగా వేలుగా పడినవి.

తతః పునః శరం దీప్తం సుప్రభం కాలసమ్మితమ్,
అసృజం జామదగ్న్యాయ రామాయాహం జిఘాంసయా. 23

అంత నేను మంటలు గ్రక్కుచున్న కాంతులు గల యమునివంటి బాణమును రాముని చంపుటకై వదలితిని.

తేన త్వభిహతో గాఢం బాణవేగవశం గతః,
ముమోహ సమరే రామో భూమౌ చ నిపపాత హ. 24

బాణవేగమునకు తట్టుకొనలేక రాముడు దానితో దెబ్బతిని, రణరంగమున మూర్ఛపోయి నేలఁ గూలెను.

తతో హాహాకృతం సర్వం రామే భూతల మాశ్రితే,
జగద్ భారత సంవిగ్నం యథార్కపతనే భవేత్. 25

అత డట్లు నేల వ్రాలగా సూర్యుడు పడినచో ఎట్లగునో యట్లు జగత్తం తయు హాహాకారములు చేయుచు దుఃఖముతో ఉడికిపోయెను.

తత ఏనం సముద్విగ్నాః సర్వ ఏవాభిదుద్రువుః,
తపోధనా స్తే సహసా కాశ్యా చ కురునన్దన. 26

అంత నా తపోధను లందరు దుఃఖముతో కుమిలిపోవుచు, కాశిపుత్రితో పాటు అతనికడకు పరుగున వచ్చిరి.

తత ఏనం పరిష్వజ్య శనై రాశ్వాసయం స్తదా,
పాణిభి ర్జలశీతైశ్చ జయాశీర్భిశ్చ కౌరవ. 27

అంత వారందరు నీటితో చల్లనైన చేతులతో జయము పొందు మని ఆశీర్వాక్కులతో అతని కౌగలించుకొని ఊరడించిరి.

తతః స విహ్వలం వాక్యం రామ ఉత్థాయ చాబ్రవీత్,
తిష్ఠ భీష్మ హతోఽసీతి బాణం సన్ధాయ కార్ముకే. 28

అంత నా రాముడు లేచి తడబడుచున్న మాటలతో 'భీష్మా! నిలుము! చచ్చితివి' అని పలుకుచు వింట బాణమును సంధించెను.

స ముక్తో న్యపత త్తూర్ణం సవ్యే పార్శ్వే మహాహవే,
యేనాహం భృశ ముద్విగ్నో వ్యాఘూర్ణిత ఇవ ద్రుమః. 29

అతడు వదలిన ఆ బాణము ఒక్కపెట్టున వచ్చి నా కుడివైపు తాకెను. దానితో మిక్కిలిగా చెదరిపోయినవాడనై దొరలిపడిన చెట్టువలె నయితిని.

హత్వా హయాం స్తతో రామః శీఘ్రాస్త్రేణ మహాహవే,
అవాకిరన్ మాం విస్రబ్ధో బాణై స్తై ర్లోమవాహిభిః. 30

అంత రాముడు వడిగల అస్త్రములతో నా గుఱ్ఱములను చంపి గుండె నిబ్బరముతో ఈకలతో దూసికొనివచ్చు బాణములను నాపై విరజిమ్మెను.

తతోఽహ మపి శీఘ్రాస్త్రం సమరప్రతివారణమ్,
అవాసృజం మహాబాహో తేఽన్తరాధిష్ఠితాః శరాః. 31

నేనును వడిగల అస్త్రమును అతని అస్త్రమును నిలువరింపగలదానిని విసరితిని. ఆ మా యిరువురి బాణములు మా యిరువురి నడుమ నిలిచిపోయినవి.

రామస్య మమ చైవాశు వ్యోమావృత్య సమన్తతః,
న స్మ సూర్యః ప్రతపతి శరజాలసమావృతః. 32

రాముడు నేనును వదలిన బాణములు ఆకసమున అన్నివైపుల వ్యాపించి యుండెను. బాణముల వెల్లువ కప్పివేయగా సూర్యుడు ప్రకాశింపకుండెను.

మాతరిశ్వా తత స్తస్మిన్ మేఘరుద్ధ ఇవాభవత్,
తతో వాయోః ప్రకమ్పాచ్చ సూర్యస్య చ గభస్తిభిః. 33
అభిఘాతప్రభావాచ్చ పావకః సమజాయత.

ఆ బాణముల వెల్లువలో మేఘము అడ్డుకొన్నట్లుగా గాలి కదలకుండెను. ఆ వెనుక తీవ్రమైన వాయువు చెలరేగుటవలనను, సూర్యుని కిరణములచేతను బాణముల రాపిడివలనను పెద్దమంట బయలుదేరెను.

తే శరాః స్వసముత్థేన ప్రదీప్తా శ్చిత్రభానునా, 34
భూమౌ సర్వే తదా రాజన్ భస్మభూతాః ప్రపేదిరే.

---

34. చిత్రభానునా - అగ్నిచేత.

ఆ బాణములు తమవలన పుట్టిన ఆ అగ్నితో భగ్గున మండి బూడిదయై రాలిపోయెను.

తదా శతసహస్రాణి ప్రయుతా న్యర్బుదాని చ, 35
అయుతా న్యథ ఖర్వాణి నిఖర్వాణి చ కౌరవ,
రామః శరాణాం సంక్రుద్ధో మయి తూర్ణం న్యపాతయత్. 36

అంత రాముడు కోపముతో పెల్లురేగి మిక్కిలి వేగముతో వందల, వేల, పదివేల, కోట్ల, ఖర్వముల, నిఖర్వముల సంఖ్యలో బాణములను నాపై ప్రయోగించెను.

తతోఽహం తానపి రణే శరై రాశీవిషోపమైః,
సంఛిద్య భూమౌ నృపతే పాతయేయం నగానివ. 37

నేనును త్రాచులవంటి శరములతో వానిని ముక్కలు చేసి నేలపై కొండలవలె ప్రోవులు పెట్టితిని.

ఏవం తదభవద్యుద్ధం తదా భరతసత్తమ,
సన్ధ్యాకాలే వ్యతీతే తు వ్యపాయాత్ స చ మే గురుః. 38

భరతసత్తమా! ఆ యుద్ధ మట్లుగా సాగెను. సంధ్యాకాలము గడువగా ఆ నా గురువు యుద్ధభూమి నుండి తొలగి చనెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
రామభీష్మయుద్ధే అశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
రామభీష్మల యుద్ధముగల నూటయెనుబదియవ అధ్యాయము.

—: o :—

35. ప్రయుత మనగా పది లక్షల సంఖ్య; అర్బుద మనగా పదికోట్ల సంఖ్య- (కోటి యని కొందరు);

36. అయుత మనగా పదివేలు; ఖర్వము, నిఖర్వము అనునవి సంఖ్యా మానములో ఒక దశలు.

## ఏకాశీత్యధికశతతమోఽధ్యాయః

## నూటయెనుబది యొకటవ అధ్యాయము.

### భీష్మపరశురామయో ర్యుద్ధమ్

### భీష్మపరశురాముల యుద్ధము

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

సమాగతస్య రామేణ పునరే వాతిదారుణమ్,
అన్యేద్యు స్తుములం యుద్ధం తదా భరతసత్తమ. 1

మరునాడు రామునితో తలపడిన నాకు మహాభయంకరమగు దొమ్మి కయ్యము జరిగెను.

తతో దివ్యాస్త్రవి చ్ఛూరో దివ్యాన్యస్త్రా ణ్యనేకశః,
అయోజయత్ స ధర్మాత్మా దివసే దివసే విభుః. 2

దివ్యాస్త్రము లెరిగిన ఆ శూరుడు ఆ ధర్మాత్ముడు రోజురోజుకు పెక్కు విధములుగా దివ్యాస్త్రములను కూర్చుకొనుచుండెను.

తా న్యహం తత్ప్రతీఘాతై ర స్త్రై ర స్త్రాణి భారత,
వ్యధమం తుములే యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా సుదు స్త్యజాన్. 3

సులభముగా వదలరాని ప్రాణములందు కూడ తెగించి నేనా అస్త్రముల నన్నింటిని విరుగుడు అస్త్రములతో కూల్చి వైచితిని.

అస్త్రై ర స్త్రేషు బహుధా హతేష్వేవ చ భారత,
అక్రుధ్యత మహాతేజా స్త్యక్తప్రాణః స సంయుగే. 4

ఇట్లు తన అస్త్రములు నా అస్త్రములతో నశించుపోవుచుండగా ఆ మహా తేజస్వి ప్రాణములకు తెగించి తీవ్రకోపము గలవాడై విజృంభించెను.

తతః శక్తిం ప్రాహిణోద్ ఘోరరూపా-
మస్త్రే రుద్ధే జామదగ్న్యో మహాత్మా,
కాలోత్సృష్టాం ప్రజ్వలితా మివోల్కాం
సందీప్తాగ్రాం తేజసా వ్యాప్య లోకమ్. 5

అంత మహాత్ముఁడగు జామదగ్న్యుఁడు తన అస్త్రము నిలిచిపోగా మహాఘోరమగు శక్తిని నాపై విసరెను. అది సాక్షాత్తు యముఁడే విసరెనా యన్నట్లుండెను. మంటలు గ్రక్కుచున్న ఉల్కవలె తేజస్సుతో లోకము లన్నింటిని వ్యాపించి నిప్పు లుమియుచున్న అగ్రభాగముతో విరాజిల్లెను.

తతోఽహం తా మిషుభి ర్దీప్యమానాం
సమయాన్తీ మన్తకాలార్కదీప్తామ్,
ఛిత్వా త్రిధా పాతయామాస భూమౌ
తతో వవౌ పవనః పుణ్యగన్ధిః. 6

అట్లు మంట లుమియుచు ప్రళయకాలమునాటి సూర్యునివలె వెలుఁగొందుచు వచ్చుచున్న ఆశక్తిని నా బాణములతో మూఁడు ముక్కలు చేసి నేల గూల్చితిని. అపుడు పుణ్యమైన వాసనగల వాయువు వీచెను.

తస్యాం ఛిన్నాయాం క్రోధదీప్తోఽథ రామః
శక్తీ ర్ఘోరాః ప్రాహిణో ద్ద్వాదశాన్యాః,
తాసాం రూపం భారత నోత శక్యం
తేజస్విత్వా ల్లాఘవా చ్చైవ వక్తుమ్. 7

ఆ శక్తి యట్లు ముక్కలుకాఁగా క్రోధముతో మంటలు గ్రక్కుచున్న రాముఁడు అతిఘోరములగు పండ్రెండు శక్తులను నాపై ప్రయోగించెను. మిరుమిట్లు గొలుపు దీప్తివలనను, దూసికొనిపోవు వేగము వలనను వాని రూపమును వక్కాణించుటకు వీలు కాకుండెను.

కిం త్వేవాహం విహ్వలః సమ్ప్రదృశ్య
దిగ్భ్యః సర్వా స్తా మహోల్కా ఇవాగ్నేః,
నానారూపా స్తేజసోఽగ్రేణ దీప్తా
యథాఽదిత్యా ద్వాదశ లోకసంక్షయే. 8

ఆ శక్తులు అన్నిదిక్కులనుండియు నిప్పులుమియు ఉల్కలవలె వచ్చి పడుచుండెను. పెక్కురూపములు దాల్చి యుండెను. మహాతేజస్సుతో విరాజిల్లు చుండెను. ప్రళయకాలమునందలి పన్నిద్దరు సూర్యులవలె వెలిగిపోవుచుండెను. అట్టివానిని చూచి నాగుండె కొంచెము చెదరినది.

తతో జాలం బాణమయం వివృత్తం
సన్దృశ్య భిత్త్వా శరజాలేన రాజన్,
ద్వాదశేషూన్ ప్రాహిణవం రణేఽహం
తతః శక్తీ రవ్యధమం ఘోరరూపాః. 9

అంత బాణములతో ఒక పెద్ద వల విస్తరిల్లి యేర్పడెను. దానిని చూచి నేను శరపరంపరతో దానిని ఛేదించివైచి పండ్రెండు బాణములను ప్రయోగించి ఆ ఘోరరూపము గల శక్తులను ప్రేల్చివైచితిని.

తతో రాజన్ జామదగ్న్యో మహాత్మా
శక్తీ ర్ఘోరా వ్యాక్షిప ద్హేమదణ్డాః,
విచిత్రితాః కాఞ్చనపట్టనద్ధా
యథా మహోల్కా జ్వలితా స్తథా తాః. 10

పిదప జామదగ్న్యుడు బంగారు పిడికట్టులు గల ఘోరములగు శక్తులను విసరెను. అవి చిత్రవిచిత్రములుగా నుండెను. బంగారు తొడుగులు కలిగి యుండెను. మండుచున్న ఉల్కవలె నుండెను.

తాశ్చా ప్యుగ్రా శ్చర్మణా వారయిత్వా
ఖడ్గేనాజౌ పాతయిత్వా నరేన్ద్ర,
బాణై ర్దివ్యై ర్జామదగ్న్యస్య సంఖ్యే
దివ్యా నశ్వా నభ్యవర్షం ససూతాన్. 11

ఆ యన్నింటిని డాలుతో వారించి ఖడ్గముతో పడవైచి, దివ్యములగు బాణములతో రణరంగమున పరశురాముని దివ్యములగు గుఱ్ఱములపై సూతునితో పాటు బాణవర్షము ముంచి యెత్తితిని.

---

11. చర్మణా - డాలుతో

నిర్ముక్తానాం పన్నగానాం సరూపా
ధృష్ట్వా శక్తీ ర్హేమచిత్రా నికృత్తాః,
ప్రాదుశ్చక్రే దివ్య మస్త్రం మహాత్మా
క్రోధావిష్టో హైహయేశప్రమాథీ. 12

హైహయరాజును చావగొట్టిన ఆ పరశురాముడు కుబుసము వదలిన పాము వలె బంగారుభూషణములు గలిగి ముక్కలై పడియున్న శక్తులను గాంచి క్రోధము పెల్లురేగగా దివ్యాస్త్రమును నాపై ప్రయోగించెను.

తతః శ్రేణ్యః శలభానా మివోగ్రాః
సమాపేతు ర్విశిఖానాం ప్రదీప్తాః,
సమాచినో చ్చాపి భృశం శరీరం
హయాన్ సూతం సరథం చైవ మహ్యమ్. 13

అంత మిడుతల దండువలె భయంకరములగు, మంటలు గ్రక్కుచున్న బాణముల వరుసలు వచ్చిపడినవి. మరియు నా గుఱ్ఱములను, సూతుని, రథమును నాశరీరమును గ్రుచ్చివైచినవి.

రథః శరై ర్మే నిచితః సర్వతోఽభూ
త్తథా వాహాః సారథిశ్చైవ రాజన్,
యుగం రథేషాం చ తథైవ చక్రే
తథైవాక్షః శరకృత్తోఽథ భగ్నః. 14

నా రథము నిలువెల్ల బాణములు గ్రుచ్చుకొనియుండెను. గుఱ్ఱములును, సారథియు నట్లే యుండెను. బండికాడియు, పోలుకర్రయు, చక్రములును, ఇరుసును బాణములకు చీలుకొనిపోయి విరిగినవి.

తత స్తస్మిన్ బాణవర్షే వ్యతీతే
శరౌఘేణ ప్రత్యవర్షం గురుం తమ్,

---

12. నికృత్తాః - విరుగగొట్టబడినవి; హైహయ - ఈశ, ప్రమాథీ - హైహయుల రాజగు కార్తవీర్యార్జునుని చంపినవాడు.

14. శరకృత్తః - బాణములకు విరిగినది.

స విక్షతో మార్గణై ర్బ్రహ్మరాశి
ర్దేహా దసక్తం ముముచే భూరి రక్తమ్. 15

ఆ బాణవర్షము ముగిసిన పిదప నేను అంపవెల్లువతో ఆ నా గురువును ముంచి యెత్తితిని. నా బాణములతో పెద్ద గాయములు పొందిన ఆ బ్రహ్మరాశి దేహమునుండి పెనురక్తమును ఏమియు పట్టనివానివలె వదలెను.

యథా రామో బాణజాలాభితప్త-
స్తథైవాహం సుభృశం గాఢవిద్ధః,
తతో యుద్ధం వ్యరమ చ్చాపరాహ్ణే
భానావస్తం ప్రతియాతే మహీధ్రమ్. 16

ఆ రాము డెంతగా బాణములకు నొచ్చెనో నేను అట్లే చాల ఎక్కువగా దెబ్బతినియుంటిని. ప్రొద్దువాటారుచుండగా సూర్యుడు అస్తగిరికి వ్రాలుచుండగా యుద్ధము ఆగిపోయెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
ఏకాశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
నూటయెనుబదియొకటవ అధ్యాయము.

—: o :—

16. అస్తం మహీధ్రమ్ - అస్తపర్వతమును

## ద్వ్యశీత్యధికశతతమోఽధ్యాయః
## నూటయెనుబదిరెండవ అధ్యాయము.

### భీష్మపరశురామయో ర్యుద్ధమ్
### భీష్మపరశురాముల యుద్ధము

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతః ప్రభాతే రాజేన్ద్ర సూర్యే విమలతాం గతే,
భార్గవస్య మయా సార్ధం పునర్యుద్ధ మవర్తత. 1

అంత తెలవారిన పిదప సూర్యుడు తెలుపు తేరిన తరువాత భార్గవునకు నాతో మరల యుద్ధము సాగెను.

తతోఽభ్రాన్తే రథే తిష్ఠన్ రామః ప్రహరతాం వరః,
వవర్ష శరజాలాని మయి మేఘ ఇవాచలే. 2

అంత యుద్ధవీరుడగు పరశురాముడు మేఘమండలముకడ నున్న రథమునం దుండి, మేఘము పర్వతమునందు క్రుమ్మరించునట్లు నాపై బాణముల వెల్లువను క్రుమ్మరించెను.

తతః సూతో మమ సుహృ చ్ఛరవర్షేణ తాడితః,
అపయాతో రథోపస్థా న్మనో మమ విషాదయన్. 3

అంత నాకు మిక్కిలి చెలికాడైన సారథి అంపవానకు దెబ్బతిని నా హృదయమును నొవ్వజేయుచు రథము నొగలనుండి తొలగి చనెను.

తతః సూతో మమాత్యర్థం కశ్మలం ప్రావిశన్మహత్,
పృథివ్యాం చ శరాఘాతా న్నిపపాత ముమోహ చ. 4

అంత నాకు పెద్దగా గుండెదిగులు కలుగజేయుచు సారథి బాణపు దెబ్బకు నొచ్చి నేల గూలెను. మూర్ఛ పోయెను.

---

2. అభ్ర + అన్తే - మేఘమండలముకడ;

తతః సూతోఽజహాత్ ప్రాణాన్ రామబాణప్రపీడితః,
ముహూర్తాదివ రాజేన్ద్ర మాం చ భీ రావిశ త్తదా. 5

రాముని బాణములకు మిక్కిలి నొచ్చిన సూతుడు ప్రాణములను వదలెను. ఒక్క క్షణకాలము నాకును భయము పైకొనెను.

తతః సూతే హతే తస్మిన్ క్షిపత స్తస్య మే శరాన్,
ప్రమత్తమనసో రామః ప్రాహిణో న్మృత్యుసంమితమ్. 6

ఆ సూతు డట్లు చావగా, ఆ రాము డట్లు నాపై బాణములు విరజిమ్ముచుండగా నేను భయ మొందితిని. మరియు ఒడలెరుగని రాముడు మృత్యువునకు సాటివచ్చు బాణమును నాపై వదలెను.

తతః సూతవ్యసనినం విప్లుతం మాం స భార్గవః,
శరేణాభ్యహన ద్గాఢం వికృష్య బలవ ద్ధనుః. 7

సూతుని పాటుతో మనసు చెదరిన నన్నా భార్గవుడు విల్లు గట్టిగా వంచి ఒక బాణముతో దిమ్మదిరుగునట్లు కొట్టెను.

స మే భుజాన్తరే రాజ న్నిపత్య రుధిరాశనః,
మయైవ సహ రాజేన్ద్ర జగామ వసుధాతలమ్. 8

ఆ బాణము నా భుజములనడుమ తాకి నెత్తురు త్రావి నాతోపాటు నేల కొరిగెను.

మత్వా తు నిహతం రామ స్తతో మాం భరతర్షభ,
మేఘవ ద్విననాదోచ్చై ర్జహృషే చ పునః పునః.

నేను చచ్చితిని అనుకొని రాముడు మేఘమువలె బొబ్బలిడ దొడగెను. ఆనందముతో మరల మరల పొంగిపోయెను.

తథా తు పతితే రాజన్ మయి రామో ముదా యుతః,
ఉదక్రోశ న్మహానాదం సహ తై రనుయాయిభిః. 9

నేనట్లు కూలిపోగా రాము డానందపడుచు తన వెంటనున్న వారితోపాటు పెద్దగా సింహనాద మొనర్చెను.

మమ తత్రాభవన్ యే తు కురవః పార్శ్వతః స్థితాః,
అగతా అపి యుద్ధం తజ్జనా స్తత్ర దిదృక్షవః,
ఆర్తిం పరమికాం జగ్ము స్తే తదా పతితే మయి. 11

మా ఆ యుద్ధమును జూడగోరి వచ్చి యచట నా ప్రక్కలనున్న కౌరవులు నేనట్లు కూలిపోగా పరమార్తిని పొందిరి.

తతోఽపశ్యం పతితో రాజసింహ
ద్విజా నష్టౌ సూర్యహుతాశనాభాన్,
తే మాం సమన్తాత్ పరివార్య తస్థుః
స్వబాహుభిః పరిధార్యాజిమధ్యే. 12

రాజవరేణ్యా! అంత నేనట్లు పడియుండ, నా చుట్టును చేరి తమ చేతులతో పొదివి పట్టుకొనియున్న విప్రుల నెనమండ్రను - సూర్యునివంటి, అగ్నివంటి తేజస్సుగల వారిని - చూచితిని.

రక్ష్యమాణైశ్చ తై ర్విప్రై ర్నాహం భూమి ముపాస్పృశమ్,
అన్తరిక్షే ధృతో హ్యస్మి తై ర్విప్రై ర్బాన్ధవై రివ. 13

ఆ విప్రులు నన్ను రక్షించుచుండగా నేను నేలకు తాకక యుంటిని. ఆ బ్రాహ్మణులు చుట్టములవలె నన్ను పైనే నిలిపియుంచిరి.

శ్వస న్నివా న్తరిక్షే చ జలబిన్దుభి రుక్షితః,
తత స్తే బ్రాహ్మణా రాజన్నబ్రువన్ పరిగృహ్య మామ్. 14

నా మొగమున నీళ్ళు చల్లిరి. నేను గగనమునందే ఊపిరి తీసికొనుచున్న ట్లుంటిని. అంత నా బ్రాహ్మణులు నన్ను గట్టిగా పట్టుకొని యిట్లు పలికిరి.

మాభై రితి సమం సర్వే స్వస్తి తేఽస్త్వితి చాసకృత్,
తత స్తేషా మహం వాగ్భి స్తర్పితః సహ సోత్థితః,
మాతరం సరితాం శ్రేష్ఠా మపశ్యం రథ మాస్థితామ్. 15

నాయనా! భయపడకుమని అందరు నొక్కపెట్టున నన్నూరడించిరి. నీకు స్వస్తియగుగాక అని పలుమారులు పలికిరి. ఆ మాటలు నన్ను తృప్తి పరుపగా ఒక్క పెట్టున లేచి నిలిచితిని. రథముపై నున్న నా తల్లిని, నదులలో మిన్నయగు గంగను గాంచితిని.

హయాశ్చ మే సంగృహీతా స్తయాఽఽసన్
మహానద్యా సంయతి కౌరవేన్ద్ర,
పాదౌ జనన్యాః ప్రతిగృహ్య చాహం
తథా పితౄణాం రథ మభ్యరోహమ్. 16

ఆ మహానది యుద్ధరంగమున గుఱ్ఱములను నిలువరించి యుండెను. అంత నేను నాతల్లి పాదములు పట్టుకొని, తండ్రులవంటి ఆ బ్రాహ్మణుల పాదములకు మ్రొక్కి పరల రథ మెక్కితిని.

రరక్ష సా మాం సరథం హయాం శ్చోపస్కరాణి చ,
తా మహం ప్రాఞ్జలి ర్భూత్వా పునరేవ వ్యసర్జయమ్. 17

నన్ను, నా రథముతో పాటు గుఱ్ఱములను, నా సాధనములను ఆమె రక్షించి యుండెను. ఆమెకు నేను దోసిలియొగ్గి నమస్కరించి వీడుకొలిపితిని.

తతోఽహం స్వయ ముద్యమ్య హయాంస్తాన్ వాతరంహసః,
అయుధ్యం జామదగ్న్యేన నివృత్తేఽహని భారత. 18

అంత నాకు నేనై వాయువేగముగల గుఱ్ఱములను నిలుపరించుకొనుచు, మరునాడు పరశురామునితో పోరాడితిని

తతోఽహం భరతశ్రేష్ఠ వేగవన్తం మహాబలమ్,
అముఞ్చం సమరే బాణం రామాయ హృదయచ్ఛిదమ్. 19

అటుపై నేను మిక్కిలి వేగము, గొప్పబలము గల గుండెలను చీల్చివైచు బాణము నొకదానిని రామునిపై వదలితిని.

తతో జగామ వసుధాం మమ బాణప్రపీడితః,
జానుభ్యాం ధను రుత్సృజ్య రామో మోహవశం గతః. 20

అంత నా బాణము దెబ్బకు మిగుల నొచ్చి పరశురాముడు వింటి పట్టు దక్కి మోకాళ్ళతో నేల తాకుచు కూలిపడి మూర్ఛ నొందెను.

తత స్తస్మి న్నిపతితే రామే భూరిసహస్రదే,
ఆవవ్రు ర్జలదా వ్యోమ క్షరన్తో రుధిరం బహు. 21

వేలకొలది బంగారు నాణెములు దాన మొసగిన ఆ రాము డట్లు నేల గూలగా మేఘములు పెల్లుగా నెత్తురులు కురియుచు ఆకసమును క్రమ్మివైచినవి

ఉల్కాశ్చ శతశః పేతుః సనిర్ఘాతాః సకమ్పనాః,
అర్కం చ సహసా దీప్తం స్వర్భాను రభిసంవృణోత్. 22

పిడుగులతో ఉరుములతో కూడిన ఉల్కలు వేలకొలదిగా రాలినవి. గొప్పగా వెలుగొందుచున్న సూర్యుని రాహువు క్రమ్మివైచెను.

వవుశ్చ వాతాః పరుషా శ్చలితా చ వసున్ధరా,
గృధ్రా బలాశ్చ కఙ్కాశ్చ పరిపేతు ర్ముదాయుతాః. 23

తీవ్రములగు గాలులు వీచెను. భూమి కంపించెను. గ్రద్దలు, కొంగలు, రాబందులు ఉత్సాహముతో తిరుగాడెను.

దీప్తాయాం దిశి గోమాయు ర్దారుణం ముహు రున్నదత్,
అనాహతా దున్దుభయో వినేదు ర్భృశనిఃస్వనాః. 24

దిక్కులు ఎర్రవడగా నక్కలు ఘోరముగా ఊళలు వైచినవి. మ్రోగింపకయే ఘోరరావములతో దుందుభులు మ్రోగజొచ్చినవి.

ఏత దౌత్పాతికం సర్వం ఘోర మాసీ ద్భయంకరమ్,
విసంజ్ఞకల్పే ధరణీం గతే రామే మహాత్మని. 25

మహాత్ముడగు రాముడు చేష్టలు దక్కి నేలగూలి యుండగా నిట్లు దారుణము, భయంకరము అగు చెడుశకునములు కానవచ్చెను.

---

21. భూరిసహస్రదే-బంగారు నాణెములు వేలకొలదిగా దానమొసర్చినవాడగు; 'భూరి ర్నా వాసుదేవేచ హరే చ పరమేష్ఠిని, నపుంసకం సువర్ణే చ ప్రాజ్యే స్యాద్వాచ్యలింగకే' అని మేదినీనిఘంటువు. భూరిశబ్దము విష్ణువు, శివుడు, బ్రహ్మ అను నర్థములందు పుంలింగము. బంగారము అను నర్థమున నపుంసకలింగము; విశేషణమైనపుడు గొప్పది అని అర్థము.
22. సకమ్పనాః - మెరపులతో కూడిన;
23. బలాః - బలాకలు - ఒక విధమగు కొంగలు.

తతో వై సహసోత్థాయ రామో మా మభ్యవర్తత,
పునర్యుద్ధాయ కౌరవ్య విహ్వలః క్రోధమూర్ఛితః. 26

అంత రాము డొక్కపెట్టున లేచి, క్రోధముతో ఊగిపోవుచు మరల యుద్ధమునకు నావైపునకు మరలెను.

ఆదదానో మహాబాహుః కార్ముకం బలసన్నిభమ్,
తతో మయ్యాదదానం తం రామమేవ న్యవారయన్. 27
మహర్షయః కృపాయుక్తాః క్రోధావిష్టోఽథ భార్గవః,
స మేఽహర దమేయాత్మా శరం కాలానలోపమమ్. 28

గంధకమువంటి వింటి నొకదాని నా మహాబాహువు కైకొనుచు నాపై మహాతీవ్రమగు బాణమును ప్రయోగింప బోవుచున్న రాముని, జాలి కలిగిన మహర్షులు వారించిరి. అంత నా మహానుభావుడు పెనుకోపముతో ఒదలెరుగని వాడయ్యు కాలాగ్నివంటి ఆ బాణమును నా విషయమున ఉపసంహరించెను.

తతో రవి ర్మంత్రమరీచిమణ్డలో
జగామాస్తం పాంసుపుఞ్జావగూఢం,
నిశా వ్యగాహత్ సుఖశీతమారుతా
తతో యుద్ధం ప్రత్యవహారయావః. 29

---

26. విహ్వలః - కలతనొందిన హృదయము గలవాడు; క్రోధవశముననే విజృంభించినా డని భావము.
27. బలసన్నిభమ్ - బల మనగా నిట గంధకరసము, దాని వంటిది; 'బలం గన్ధరసే రూపే' అని మేదినీనిఘంటువు; మయి, ఆదదానమ్ - నా నిమిత్తముగా కైకొనుచున్న 'శరమ్' అని కలుపుకొనవలయును.
28. మే - నాయందు; అహరత్ - వెనుకకు తీసికొనెను - 'మునుల వాక్యము వలన' అని భావము.
29. మంత్రమరీచిమండలః - మంత్రమయము లగు కిరణముల సముదాయము గలవాడు - వేదము కూడ "సైషా త్రయ్యేవ విద్యా తపతి"-త్రయీ-వేదరూపమైన ఆ యీ విద్య తాపము కలిగించుచున్నది అని చెప్పుచున్నది. ప్రత్యవహారయావః-సమాప్త మొనరించితిమి. 'మేమిరువురము' అని కలుపుకొనవలయును.

అంత మంత్రమయములగు కిరణముల మండలముగల సూర్యుడు, ధూళిదుప్పతో కప్పబడినవాడై అస్తమించెను. చల్లని సుఖకరమగు గాలిగల రాత్రి సమయము వచ్చెను. అంత మేమిరువురము యుద్ధము విరమించితిమి.

ఏవం రాజ న్నవహారో బభూవ
తతః పున ర్విమలేఽభూత్ సుఘోరమ్,
కల్యం కల్యం వింశతిం వై దినాని
తథైవ చాన్యాని దినాని త్రీణి. 30

రాజా! ఈవిధముగా ఈ వ్యవహారము ప్రతిదినము ప్రాతఃకాలమున పట్టి పగలు మిక్కిలి ఘోరముగా ఇరువది మూడుదినములు జరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
రామభీష్మయుద్ధే ద్వ్యశీత్యధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
రామభీష్మయుద్ధము గల నూటయెనుబదిరెండవ అధ్యాయము.

—: ౦ :—

30. అవహారః- జూదము, యుద్ధము మున్నగువానియందు కైకొను విశ్రాంతి, కల్యం కల్యమ్ - ప్రతి ప్రాతఃకాలము; విమలే - దినభాగమున - రాత్రులందు మానితి మని భావము.

# త్ర్యశీత్యధికశతతమోఽధ్యాయః
# నూటయెనుబదిమూడవ అధ్యాయము

### అష్టవసుభ్యో భీష్మస్య ప్రస్వాపనాస్త్రప్రాప్తిః
### భీష్ముడు అష్టవసువులనుండి ప్రస్వాపన మను అస్త్రమును పొందుట.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతోఽహం నిశి రాజేన్ద్ర ప్రణమ్య శిరసా తదా,
బ్రాహ్మణానాం పితౄణాం చ దేవతానాం చ సర్వశః. 1
నక్తంచరాణాం భూతానాం రాజన్యానాం విశామ్పతే,
శయనం ప్రాప్య రహితే మనసా సమచిన్తయమ్. 2

రాజేంద్రా! అటుపై నేను రాత్రియందు బ్రాహ్మణులకు, పితృదేవతలకు, అన్నివైపుల గల దేవతలకు, రాక్షసులకు, భూతములకు, గొప్పరాజులకు తలతో ప్రణమిల్లి యేకాంతమున శయ్యను చేరి మనసున నిట్లు చింతించితిని.

జామదగ్న్యేన మే యుద్ధ మిదం పరమదారుణమ్,
అహాని చ బహూ న్యద్య వర్తతే సుమహాత్యయమ్. 3

ఇదిగో పరశురామునితో నాకు మిక్కిలి దారుణమగు యుద్ధము ప్రాప్తించినది. పెక్కుదినములుగా ఇది మిక్కిలి వినాశకరముగా సాగుచున్నది.

న చ రామం మహావీర్యం శక్నోమి రణమూర్ధని,
విజేతుం సమరే విప్రం జామదగ్న్యం మహాబలమ్. 4

గొప్పశక్తి గల ఆ రాముని యుద్ధభూమిలో తట్టుకొనజాలకున్నాను. మహాబలుడు, ఉత్తమజ్ఞానసంపన్నుడు అగు ఆ పరశురాముని సమరమున గెలువజాలకున్నాను.

యది శక్యో మయా జేతుం జామదగ్న్యః ప్రతాపవాన్,
దైవతాని ప్రసన్నాని దర్శయన్తు నిశాం మమ. 5

ఆ ప్రతాపవంతుడగు పరశురాముని నేను గెలువగలుగుదు నేని యీ రాత్రి నాకు ప్రసన్నులైన దేవతలు సాక్షాత్కరింతురుగాక!

తతో నిశి చ రాజేన్ద్ర ప్రసుప్తః శరవిక్షతః,
దక్షిణేనేహ పార్శ్వేన ప్రభాతసమయే తదా. 6

అంత నారాత్రివేళ ములుకుల గాయములతో నిద్రించియుంటిని. అంత తెల్లవారుసమయమున నాకుడిప్రక్కగా -

తతోఽహం విప్రముఖ్యైస్తై ర్యైరస్మి పతితో రథాత్,
ఉత్థాపితో ధృత శ్చైవ మాభై రితి చ సాన్త్వితః. 7

నన్ను రథమునుండి పడినపుడు లేవదీసి పట్టుకొని భయపడకు మని ఊరడించి నిలిపిన విప్రముఖ్యులు నిలిచియుండిరి.

త ఏవ మాం మహారాజ స్వప్నదర్శన మేత్య వై,
పరివార్యాబ్రువన్ వాక్యం తన్నిబోధ కురూద్వహ. 8

వారే నాకు కలలో దర్శన మిప్పించి నలువైపుల నిలిచి యిట్లని పలికిరి. సుయోధనా! ఆ మాట వినుము.

ఉత్తిష్ఠ మాభై ర్గాఙ్గేయ న భయం తేఽస్తి కిఞ్చన,
రక్షామహే త్వాం కౌరవ్య స్వశరీరం హి నో భవాన్. 9

గంగాకుమారా! లెమ్ము; భయపడకుము. నీ కిసుమంతయు భయము లేదు. మేము నిన్ను రక్షింతుము. నీవు మాకు మా దేహమే అన్నట్టి వాడవు గదా!

న త్వాం రామో రణే జేతా జామదగ్న్యః కథఞ్చన,
త్వమేవ సమరే రామం విజేతా భరతర్షభ. 10

జమదగ్నికుమారుడు రాముడు నిన్నెన్నటికిని పోరున గెలువజాలడు. నీవే రాముని యుద్ధమున గెలుతువు.

---

5. నిశామ్ - నిశి - రాత్రియందు; దర్శయన్తు - తమ్ముచూపుకొందురుగాక - నాకు కన్పట్టుదురు గాక!

ఇదమస్త్రం సుదయితం ప్రత్యభిజ్ఞాస్యతే భవాన్,
విదితం హి తవాప్యేతత్ పూర్వస్మిన్ దేహధారణే. 11

ఇదిగో నీకు మిక్కిలి ప్రియమైన ఈ అస్త్రమును నీవు గుర్తుపట్టగలవు. నీ పూర్వదేహమునాటి దీనిని నీ వెరుగుదువు కదా!

ప్రాజాపత్యం విశ్వకృతం ప్రస్వాపం నామ భారత,
న హీదం వేద రామోఽపి పృథివ్యాం వా పుమాన్ క్వచిత్. 12

ఇది ప్రజాపతి దేవతగా గలది. విశ్వకర్మ నిర్మించినట్టిది. దీనిని ప్రస్వాప మందురు. పరశురాముడే కాదు భూమిలో ఏ ఇతర మనుజుడు దీని నెరుగడు.

తత్ స్మరస్వ మహాబాహో భృశం సంయోజయస్వ చ,
ఉపస్థాస్యతి రాజేన్ద్ర స్వయమేవ తవానఘ. 13

ఓ మహాబాహూ! దానిని స్మరింపుము. దానిని దగ్గరకు తెచ్చుకొనుము. పుణ్యాత్ముడా! అదియే వచ్చి నీకడ చేరును.

యేన సర్వాన్ మహావీర్యాన్ ప్రశాసిష్యసి కౌరవ,
న చ రామః క్షయం గన్తా తేనాస్త్రేణ నరాధిప. 14

దానితో నీవు గొప్ప దేహబలసంపద గలవారి నందరిని లోగొనగలవు. అంతే కాదు. ఆ అస్త్రముతో పరశురాముడును నాశనము పొందడు.

ఏనసా న తు సంయోగం ప్రాప్స్యసే జాతు మానద,
స్వప్స్యతే జామదగ్న్యోఽసౌ త్వద్బాణబలపీడితః. 15

మానవంతుడా! నీకు పాపము ఎన్నటికిని చుట్టుకొనదు. ఈ పరశురాముడు నీ బాణము బలమునకు నొచ్చి ఊరక నిద్రపోవును.

---

11. ప్రత్యభిజ్ఞాస్యతే - ప్రత్యభిజ్ఞ యనగా మునుపటి పరిచయము గుర్తునకు వచ్చుట - అది పొందెదవు.

15. మానద-గురువు కీవలసిన గౌరవము నిచ్చువాడా! అని యిది సందర్భమున కనుగుణముగ చెప్పుకొనదగును.

తతో జిత్వా త్వమే వైనం పున రుత్థాపయిష్యసి,
అస్త్రేణ దయితే నాజౌ భీష్మ సంబోధనేన వై. 16

గెలిచిన పిమ్మట నీవే నీ ప్రియమైన అస్త్రముతో ఆతనిని మేలుకొలిపి లేవదీయుదువు.

ఏవం కురుష్వ కౌరవ్య ప్రభాతే రథ మాస్థితః,
ప్రసుప్తం వా మృతం వేతి తుల్యం మన్యామహే వయమ్. 17

రేపు ప్రొద్దుపొడిచిన పిదప రథ మెక్కి యిట్లు చేయుము. నిద్రించి యున్నవానిని మరణించివానిని మేము సమానముగా సంభావింతుము.

న చ రామేణ మర్తవ్యం కదాచిదపి పార్థివ,
తతః సముత్పన్న మిదం ప్రస్వాపం యుజ్యతా మితి. 18

ఎట్టి పరిస్థితులలో రాముడు మరణింపరాదు. దానికై యిదిగో ఈ ప్రస్వాప మను నస్త్రము సమకూడినది. దీని నుపయోగింపుము.

ఇత్యుక్త్వాన్తర్హితా రాజన్ సర్వ ఏవ ద్విజోత్తమాః,
అష్టౌ సదృశరూపాస్తే సర్వే భాసురమూర్తయః. 19

రాజా! వెలుగొందు ఆకారములు, సమానమగు రూపములు గల ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు ఎనమండుగురు ఇట్లు పలికి అంతర్ధానము చెందిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
భీష్మప్రస్వాపనాస్త్రలాభే త్ర్యశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున భీష్ముడు ప్రస్వాపనాస్త్రలాభ మందుట యను నూటయెనుబదిమూడవ అధ్యాయము.

—: o :—

# చతురశీత్యధికశతతమోఽధ్యాయః
# నూటయెనుబదినాలుగవ అధ్యాయము

**భీష్మపరశురామయో రన్యోన్యం ప్రతిశక్తిబ్రహ్మాస్త్రయో ప్రయోగః**
**భీష్మపరశురాము లొకరిపై నొకరు శక్తులను బ్రహ్మాస్త్రములను ప్రయోగించుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతో రాత్రౌ వ్యతీతాయాం ప్రతిబుద్ధోఽస్మి భారత,
తతః సఞ్చిన్త్య వై స్వప్న మవాపం హర్షముత్తమమ్. 1

అంత నా రాత్రి గడువగా మేల్కొంటిని. వచ్చిన కలను తలచుకొని గొప్ప ఆనందము నందితిని.

తతః సమభవ ద్యుద్ధం మమ తస్య చ భారత,
తుములం సర్వభూతానాం లోమహర్షణ మద్భుతమ్. 2

పిదప మా యిరువురకు మహాఘోరమగు యుద్ధము జరిగెను. సర్వభూతములును దానితో పరమాశ్చర్యము పొందెను.

తతో బాణమయం వర్షం వవర్ష మయి భార్గవః,
న్యవారయ మహం తచ్చ శరజాలేన భారత. 3

అంత భార్గవుడు నాపై బాణవర్షము కురిపించెను. నేను నా బాణముల సముదాయముతో దానిని వారించితిని.

తతః పరమసంక్రుద్ధః పునరేవ మహాతపాః,
హ్యస్తనేన చ కోపేన శక్తిం వై ప్రాహిణోన్మయి. 4

ఆ మహాతాపసుడు పట్టరాని కోపముతో నిన్నటి కోపము తోడుకాగా నాపై శక్తిని విసరెను.

ఇన్ద్రాశనిసమస్పర్శాం యమదణ్డసమప్రభామ్,
జ్వలన్తీ మగ్నివత్సంఖ్యే లేలిహానాం సమన్తతః. 5

ఆ శక్తి యింద్రుని పిడుగువలె నుండెను. యమదండమువంటి కాంతితో అలరారెను. అగ్నివలె మండుచుండెను. అన్నివైపులకు నాలుకలు చాచుకొనుచు విహరించుచుండెను.

తతో భరతశార్దూల. ధిష్ణ్య మాకాశగం యథా,
స మా మభ్యవధీ త్తూర్ణం జత్రుదేశే కురూద్వహ. 6

భరతశార్దూలా ! అంత నది గగనమునందలి నక్షత్రమువలె అతి వేగముగా వచ్చి నామెడక్రింద గట్టిగా తాకెను.

అథాస్త్ర మస్రవ ద్ఘోరం గిరే ర్గైరికధాతువత్,
రామేణ సుమహాబాహో క్షతస్య క్షతజేక్షణః. 7

ఓ మహాబాహూ! ఎఱుపెక్కిన కనులు గల ఓయి సుయోధనా! కొండ నుండి ధాతురసము కారినట్లు రాముడు చేసిన గాయమునుండి నెత్తురు మహా ఘోరముగా పొడుచుకొని వచ్చెను.

తతోఽహం జామదగ్న్యాయ భృశం క్రోధసమన్వితః,
చిక్షేప మృత్యుసంకాశం బాణం సర్పవిషోపమమ్. 8

అంత పట్టపగ్గములు లేని కోపముతో నేను నాగుబాము విషమువంటిదియు, మృత్యువే అనదగినదియు నగు ఒక బాణమును పరశురామునిపై విసరితిని.

స తేనాభిహతో వీరో లలాటే ద్విజసత్తమః,
అశోభత మహారాజ సశృంగ ఇవ పర్వతః. 9

ఆ బాణము సూటిగా నొసటిపై గ్రుచ్చుకొనగా ఆ వీరుడగు బ్రాహ్మణోత్తముడు శిఖరముతో కూడిన కొండవలె విరాజిల్లెను.

---

7. ధిష్ణ్యమ్ - నక్షత్రము - "ధిష్ణ్యం స్థానాగ్ని సద్మసు, శక్త్యావృక్షే చ" అని మేదిని; జత్రుదేశే - మూపులయొక్క సంధియెముకలున్న ప్రదేశమున;
8. అస్రమ్ - రక్తము; పాఠాంతరమున అసృక్ అన్నను అదే యర్థము.

స సంరబ్ధః సమావృత్య శరం కాలాన్తకోపమమ్,
సన్దధే బలవత్కృష్య ఘోరం శత్రునిబర్హణమ్. 10

అతడు తీవ్రకోపముతో నూగిపోవుచు కాలయమునివంటిదియు, శత్రువులను రూపుమాపునట్టిదియు నగు నొక బాణమును బలమంతయు నుపయోగించి లాగి వదలెను.

స వక్షసి పపాతోగ్రః శరో వ్యాల ఇవ శ్వసన్,
మహీం రాజం స్తతశ్చాహ మగమం రుధిరావిలః. 11

రాజా! ఆ బాణము బుసకొట్టుచున్న పాము వలె వచ్చి నా యెదురొమ్మున గట్టిగా తాకెను. అంత నేను నెత్తుటిలో మునిగితేలుచు నేల కూలితిని.

సంప్రాప్య తు పునః సంజ్ఞాం జామదగ్న్యాయ ధీమతే,
ప్రాహిణ్వం విమలాం శక్తిం జ్వలన్తీ మశనీ మివ. 12

కొంతవడికి తెలివి తెచ్చుకొని నేను పరశురామునిపై పిడుగువలె నిప్పులు కురియుచున్న తెల్లనిశక్తిని విసిరితిని.

సా తస్య ద్విజముఖ్యస్య నిపపాత భుజాంతరే,
విహ్వల శ్చాభవ ద్రాజన్ వేపథుశ్చైన మావిశత్. 13

ఆ శక్తి ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని గుండెపై దూకెను. ఆతడు తిరుగుపడిపోయెను. ఆతనికి వణకుపుట్టెను.

తత ఏనం పరిష్వజ్య సఖా విప్రో మహాతపాః,
అకృతవ్రణః శుభై ర్వాక్యై రాశ్వాసయ దనేకధా. 14

మహాతపస్వియు, ప్రాణమిత్రము నగు విప్రుడు అకృతవ్రణుడు ఆతనిని కౌగిలించుకొని మంచిమాటలతో పెక్కువిధముల నూరడించెను.

సమాశ్వస్త స్తతో రామః క్రోధామర్షసమన్వితః,
ప్రాదుశ్చక్రే తదా బ్రాహ్మం పరమాస్త్రం మహావ్రతః. 15

---

10. కృష్య - బాగుగా లాగి;

తెప్పరిల్లిన రాముడు పట్టరానికోపముతో తిరుగు లేని దగు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను.

తత స్తత్ప్రతిఘాతార్థం బ్రాహ్మమేవాస్త్ర ముత్తమమ్,
మయా ప్రయుక్తం జజ్వాల యుగాన్తమివ దర్శయత్. 16

దానిని త్రిప్పికొట్టుటకై నేనును ఉత్తమమగు బ్రహ్మాస్త్రమునే ప్రయోగించితిని. అది ప్రళయకాలమును చూపుచున్నదో యన్నట్లుండెను.

తయో ర్బ్రహ్మాస్త్రయో రాసీ దన్తరా వై సమాగమః,
అసంప్రాప్యైవ రామం చ మాం చ భారతసత్తమ. 17

ఆ రెండు బ్రహ్మాస్త్రములును రామునిగాని నన్నుగాని తాకక నడుమనే కలియబడినవి.

తతో వ్యోమ్ని ప్రాదురభూ త్తేజ ఏవ హి కేవలమ్,
భూతాని చైవ సర్వాణి జగ్ము రార్తిం విశామ్పతే. 18

రాజా! అంత ఆకాశమున కేవల మొక పెద్దవెలుగు పుట్టెను. భూతము లన్నియు ఆర్తి పొందినవి.

ఋషయశ్చ సగన్ధర్వా దేవతాశ్చైవ భారత,
సంతాపం పరమం జగ్ము రస్త్రతేజోఽభిపీడితాః. 19

ఆ అస్త్రముయొక్క దీప్తికి మిక్కిలి నొచ్చిన ఋషులు, గంధర్వులు, దేవతలును మహాసంతాపము పొందిరి.

ప్రజజ్వాల నభో రాజన్ ధూమాయన్తే దిశో దశ,
న స్థాతు మన్తరిక్షే చ శేకు రాకాశగా స్తదా. 20

ఆకాశము మండిపోయెను. దిక్కులు పొగచూరినవి. గగనమున తిరుగు ప్రాణులకు నిలువనీడ లేకపోయెను.

తతో హాహాకృతే లోకే సదేవాసురరాక్షసే,
ఇద మన్తర మిత్యేవం మోక్తుకామోఽస్మి భారత. 21
ప్రస్వాప మస్త్రం త్వరితో వచనా ద్బ్రహ్మవాదినామ్,

దేవతలతో, అసురులతో, రాక్షసులతో కూడిన లోక మంతయు హాహా కారములు చేయుచుండగా ఇదియే తగిన సమయమని ఆ వేదవేత్తలు చెప్పిన ప్రస్వాపనాస్త్రమును పదివడిగా వదలగోరితిని.

విచిత్రం చ తదస్త్రం మే మనసి ప్రత్యభా త్తదా. 22

విచిత్రముగా ఆ అస్త్రము నా మదిలో మెదలసాగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
పరస్పరబ్రహ్మాస్త్రప్రయోగే చతురశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
పరస్పరబ్రహ్మాస్త్రప్రయోగము గల నూటయెనుబదినాలుగవ అధ్యాయము.

—: o :—

## పఞ్చాశీత్యధికశతతమోఽధ్యాయః

## నూటయెనుబదియైదవ అధ్యాయము

దేవై ర్నిషిద్ధేన భీష్మేణ ప్రస్వాపనాస్త్రస్యాప్రయోగః, పితౄణాం దేవానాం గఙ్గాయాశ్చాగ్రహేణ భీష్మపరశురామయో ర్యుద్ధస్య సమాప్తిః.

**దేవతలు వల దనగా భీష్ముడు ప్రస్వాపనాస్త్రమును ప్రయోగింపకుండుట, పితృదేవతలు, దేవతలు, గంగయు పట్టుపట్టుగా భీష్మపరశురాములు యుద్ధమును మానుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతో హలహలాశబ్దో దివి రాజన్ మహా నభూత్,
ప్రస్వాపం భీష్మ మా స్రాక్షీ రితి కౌరవనన్దన. 1

రాజా! అంత అయ్యో అయ్యో అను నాదములు గగనమున పిక్కటిల్లెను. భీష్మా! ప్రస్వాపమును వదలకు మనియు అరపులు వినవచ్చెను.

అయుఞ్జ మేవ చైవాహం తదస్త్రం భృగునన్దనే,
ప్రస్వాపం మాం ప్రయుఞ్జానం నారదో వాక్య మబ్రవీత్. 2

నే నా అస్త్రమును భృంగునందనునిపై వదలుటకు సిద్ధముగా నుంటిని. అట్లు ప్రస్వాపమును ప్రయోగింపనున్న నాతో నారదు డిట్లాడెను.

ఏతే వియతి కౌరవ్య దివి దేవగణాః స్థితాః,
తే త్వాం నివారయ న్త్యద్య ప్రస్వాపం మా ప్రయోజయ. 3

కురుపుత్రా! ఇదిగో గగనమున దేవతలు గుంపులు గుంపులై నిలబడి యున్నారు. వారు నిన్ను వలదనుచున్నారు. ప్రస్వాపమును ప్రయోగింపకుము.

రామ స్తపస్వీ బ్రహ్మణ్యో బ్రాహ్మణశ్చ గురుశ్చ తే,
తస్యావమానం కౌరవ్య మా స్మ కార్షీః కథఞ్చన. 4

రాముడు తపస్వి; వేదవేత్త, బ్రాహ్మణుడు, మరియు నీ గురువు. అట్టి వాని కెన్నడును నీ వవమానము చేయరాదు.

తతోఽపశ్యం దివిష్ఠాన్ వై తానష్టౌ బ్రహ్మవాదినః,
తే మాం స్మయన్తో రాజేన్ద్ర శనకై రిద మబ్రువన్. 5

అంత నేను గగనమున నిలిచియున్న ఆ వేదవేత్తల నెనిమిదిమందిని చూచితిని. వారు చిన్నగా నవ్వుచు మెల్లగా నాతో నిట్లు పలికిరి.

యథాహ భరతశ్రేష్ఠ నారద స్తత్తథా కురు,
ఏతద్ధి పరమం శ్రేయో లోకానాం భరతర్షభ. 6

భరతశ్రేష్ఠా! నారదుడు చెప్పినట్లు చేయుము. ఇది లోకమునకు గొప్ప మేలు గదా!

తతశ్చ ప్రతిసంహృత్య తదస్త్రం స్వాపనం మహత్,
బ్రహ్మాస్త్రం దీపయాంచక్రే తస్మిన్ యుధి యథావిధి. 7

అంత నే నా ప్రస్వాపమును వెనుకకు తీసికొంటిని. తగువిధముగా ఆ బ్రహ్మాస్త్రమును ప్రజ్వలింపజేసితిని.

తతో రామో హృషితో రాజసింహ
దృష్ట్వా తదస్త్రం వినివర్తితం వై,
జితోఽస్మి భీష్మేణ సుమన్దబుద్ధి
రిత్యేవ వాక్యం సహసా వ్యముఞ్చత్. 8

అంత రాముడు సంతోషము పొందినవాడై మరలింపబడిన ఆ అస్త్రమును చూచి 'తెలివిమాలిన నేను భీష్మున కోడితిని' అను మాట వెనువెంటనే పలికెను.

తతోఽపశ్యత్ పితరం జామదగ్న్యః
పితు స్తథా పితరం చాస్య మాన్యమ్,
తే తత్ర చైనం పరివార్య తస్థు-
రూచుశ్చైనం సాన్త్వపూర్వం తదానీమ్. 9

అంత జమదగ్ని కుమారుడు తన తండ్రిని, తండ్రి తండ్రిని, మాన్యు డగు తాతతండ్రిని అచట గాంచెను. వారతనికి దగ్గరజేరి నిలిచియుండిరి. అతని ననునయించుచు వారిట్లు పలికిరి.

పితర ఊచుః - పితరు లిట్లు పలికిరి.

మా స్మైవం సాహసం తాత పునః కార్షీః కథఞ్చన,
భీష్మేణ సంయుగం గన్తుం క్షత్రియేణ విశేషతః. 10

నాయనా! మరల నెప్పుడు ఇట్టి సాహసము చేయకుము. అందును ఉత్తమ క్షత్రియుడగు భీష్మునితో పోరాడనే వలదు.

క్షత్రియస్య తు ధర్మోఽయం యద్యుద్ధం భృగునందన,
స్వాధ్యాయో వ్రతచర్యాథ బ్రాహ్మణానాం పరం ధనమ్. 11

యుద్ధ మనునది క్షత్రియుని ధర్మము. వేదము నధ్యయనము చేయుట, బ్రహ్మచర్యము మొదలగు వ్రతములను పాటించుట యనునది బ్రాహ్మణుల గొప్ప సొత్తు.

ఇదం నిమిత్తే కస్మింశ్చి దస్మాభిః ప్రాగుదాహృతమ్,
శస్త్రధారణ మత్యుగ్రం తచ్చాకార్యం కృతం త్వయా. 12

ఒకానొక సమయమున మేము ఈ మహాఘోరమగు శస్త్రధారణమును గూర్చి నీకు చెప్పియుంటిమి. అయినను నీ వా కాని పనిని చేసితివి.

వత్స పర్యాప్త మేతావ ద్భీష్మేణ సహ సంయుగే,
విమర్దస్తే మహాబాహో వ్యపయాహి రణాదితః. 13

నాయనా! భీష్మునితో నీ కీమాత్రము త్రొక్కిసలాట చాలును. ఇకపై రణమునుండి మరలుము.

పర్యాప్త మేత ద్భద్రం తే తవ కార్ముకధారణమ్,
విసర్జయైత ద్దుర్ధర్షం తప స్తప్యస్వ భార్గవ. 14

భృగుకుమారా! నీకు మేలయ్యెడు. విల్లుపట్టుట నీకింక చాలును. దానిని విడిచివేయుము. ఎవ్వరికి లొంగని దగు తప మాచరింపుము.

ఏష భీష్మః శాన్తనవో దేవైః సర్వై ర్నివారితః,
నివర్తస్వ రణా దస్మా దితి చైవ ప్రసాదితః. 15

దేవత లందరు కూడి నాయనా! భీష్మా! ఈ పోరునుండి మరలుమని బ్రతిమాలి శంతనుకుమారుడగు భీష్ముని నిలువరించిరి.

రామేణ సహ మా యోత్సీ ర్గురుణేతి పునః పునః,
న హి రామో రణే జేతుం త్వయా న్యాయ్యః కురూద్వహ! 16

'నాయనా! నీవు యుద్ధమున రాముని గెలుచుట న్యాయబద్ధమగు విషయము కాదు నీవు గురువగు రామునితో పోరవలదు' అని పెద్దమూరులు చెప్పిరి.

మానం కురుష్వ గాఙ్గేయ బ్రాహ్మణస్య రణాజిరే,
వయం తు గురవ స్తుభ్యం తస్మా త్త్వాం వారయామహే. 17

'గంగాతనయా! రణరంగమున బ్రాహ్మణుని గౌరవము కాపాడుము. మేము నీ గురువులము. కావున నిన్ను వారించుచున్నాము' అని పలికిరి.

భీష్మో వసూనా మన్యతమో దిష్ట్యా జీవసి పుత్రక!
గాఙ్గేయః శాన్తనోః పుత్రో వసురేష మహాయశాః. 18

పసివాడా! భీష్ముడు వసువులలో ఒకడు. అదృష్టవశమున బ్రదికితివి. గంగకు శాంతనునకు పుట్టిన ఈతడు గొప్పకీర్తి గల వసువు.

కథం శక్య స్త్వయా జేతుం నివర్తస్వేహ భార్గవ,
భార్గవా! నీకు అతని నెట్లు గెలువనగును? ఇటనుండి మరలుము.

అర్జునః పాణ్డవశ్రేష్ఠః పురన్దరసుతో బలీ, 19
నరః ప్రజాపతి ర్వీరః పూర్వదేవః సనాతనః,
సవ్యసాచీతి విఖ్యాత స్త్రిషు లోకేషు వీర్యవాన్,
భీష్మమృత్యు ర్యథాకాలం విహితో వై స్వయంభువా. 20

పాండవులలో శ్రేష్ఠుడు, ఇంద్రుని కుమారుడు, గొప్పబలము గలవాడు, నరుడను సనాతనమహర్షి, ప్రజాపతి, అతిప్రాచీనదైవము, మూడులోకములలో సవ్యసాచి అని ప్రసిద్ధి కెక్కినవాడు, వీర్యవంతుడు అగు అర్జునుడు సమయము వచ్చినపుడు భీష్మునకు మృత్యువుగా బ్రహ్మ నిర్దేశించెను.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

ఏవ ముక్తః స పితృభిః పితౄన్ రామోఽబ్రవీ దిదమ్,
నాహం యుధి నివర్తేయ మితి మే వ్రత మాహితమ్. 21

పితృదేవత లిట్లు పలుకగా రాముడు వారితో నిట్లు పలికెను. నేను యుద్ధమున వెనుదిరుగనని వ్రతము పూనితిని.

న నివర్తితపూర్వశ్చ కదాచి ద్రణమూర్ధని,
నివర్త్యతా మాపగేయః కామం యుద్ధాత్ పితామహాః. 22

తాతాలారా! మును పెన్నడు నేను యుద్ధమునుండి మరలినది లేదు. కావున భీష్ము నే యుద్ధమునుండి మరలింపుడు.

న త్వహం వినివర్తిష్యే యుద్ధా దస్మాత్ కథఞ్చన.

నే నెన్నటికిని ఈ యుద్ధమునుండి మరలునది లేదు.

తతస్తే మునయో రాజ న్నృచీకప్రముఖా స్తదా. 23
నారదేనైవ సహితాః సమాగమ్యేద మబ్రువన్,
నివర్తస్వ రణా త్తాత మానయస్వ ద్విజోత్తమమ్. 24

అంత ఋచీకుడు మొదలగు నా ఋషు లందరు నారదునితో కూడి నాకడ కరుగుదెంచి "నాయనా! పోరు మానుము. బ్రాహ్మణుని మన్నింపుము" అని పలికిరి.

ఇత్యవోచ మహం తాంశ్చ క్షత్రధర్మవ్యపేక్షయా.

నేనును క్షత్రియధర్మమును దృష్టిలో పెట్టుకొని వారితో నిట్లు పలికితిని.

మమ వ్రత మిదం లోకే నాహం యుద్ధాత్ కదాచన. 25
విముఖో వినివర్తేయం పృష్ఠతోఽభ్యాహతః శరైః.

మహర్షులారా! ఇది నావ్రతము. వెనుకనుండి బాణములు తగులుచుండగా నే నెన్నటికి యుద్ధమునకు పెడమొగము పెట్టి మరలను.

నాహం లోభా న్న కార్పణ్యా న్న భయా న్నార్థకారణాత్, 26
త్యజేయం శాశ్వతం ధర్మ మితి మే నిశ్చితా మతిః.

లోభమువలననో, దీనతవలననో, భయమువలననో ధనాశవలననో శాశ్వతమగు ధర్మమును వదలజాలను. ఇది నా చెదరని బుద్ధి.

తతస్తే మునయః సర్వే నారదప్రముఖా నృప, 27
భాగీరథీ చ మే మాతా రణమధ్యం ప్రపేదిరే.

అంత నారదుడు మున్నగు మునులందరును, నా తల్లియగు గంగయు మా యిరువురి నడుమ వచ్చి నిలిచిరి.

తథై వాత్తశరో ధన్వీ తథైవ దృఢనిశ్చయః,
స్థిరోఽహ మాహవే యోద్ధుం తత స్తే రామ మబ్రువన్. 28
సమేత్య సహితా భూయః సమరే భృగునందనమ్.

అట్లే బాణము పట్టి, విల్లు దాల్చి చెదరని నిశ్చయముతో రణరంగమున దృఢముగా నిలిచియుంటిని. అంత నా మునులు అందరు కలసి పరశురాముని చుట్టు ముట్టి యిట్లు పలికిరి.

నావనీతం హి హృదయం విప్రాణాం శామ్య భార్గవ. 29

భార్గవా! విప్రుల హృదయము వెన్నముద్ద. శాంతి పొందుము.

రామ రామ నివర్తస్వ యుద్ధా దస్మా ద్ద్విజోత్తమ,
అవధ్యో వై త్వయా భీష్మ స్త్వం చ భీష్మస్య భార్గవ. 30

రామా! రామా! ద్విజోత్తమా! ఈ యుద్ధమునుండి మరలుము. నీకు భీష్ముడును, నీవు భీష్మునకును చంపదగినవారుకారు.

ఏవం బ్రువన్త స్తే సర్వే ప్రతిరుధ్య రణాజిరమ్,
న్యాసయాంచక్రిరే శస్త్రం పితరో భృగునన్దనమ్. 31

ఇట్లు పలుకుచు వారు యుద్ధభూమిలో అడ్డముగా నిలబడి పితృదేవతలు పరశురామునిచేత ఆయుధమును వదలజేసిరి.

తతోఽహం పునరేవాథ తానష్టౌ బ్రహ్మవాదినః,
అద్రాక్షం దీప్యమానాన్ వై గ్రహానష్టా విహోదితాన్. 32

అంత మరల నేను తేజస్సుతో వెలుగొందుచు ఉదయించిన ఎనిమిది గ్రహములవలె నున్న ఆ బ్రహ్మవాదుల నెనమండ్రను చూచితిని.

తే మాం సప్రణయం వాక్య మబ్రువన్ సమరే స్థితమ్,
ప్రైహి రామం మహాబాహో గురుం లోకహితం కురు. 33

---

31. న్యాసయాంచక్రిరే - వదలునట్లు చేసిరి.

వారు మెత్తని ప్రేమజాలువారు పలుకులతో యుద్ధరంగమున నిలిచిన నాతో 'మహాబాహూ! నీ గురువగు రామునికడ కరుగుము. లోకములకు మేలొనరింపుము' - అని పలికిరి.

దృష్ట్వా నివర్తితం రామం సుహృద్వాక్యేన తేన వై,
లోకానాం చ హితం కుర్వ న్నహమ ప్యాదదే వచః. 34

రాముడు వెనుదిరుగుటను చూచిన నేను ఆ మేలుకోరువారి మాటను స్వీకరించితిని.

తతోఽహం రామ మాసాద్య వవన్దే భృశవిక్షతః,
రామ శ్చాభ్యుత్స్మయన్ ప్రేమ్ణా మామువాచ మహాతపాః. 35

ఒడలెల్ల గాయములుగల నేను రాముని సమీపించి వందన మొనరించితిని. మహాతపస్వి యగు రాముడును ప్రేమతో నన్ను చూచి చిన్నగా నవ్వుచు నిట్లు పలికెను.

త్వత్సమో నాస్తి లోకేఽస్మిన్ క్షత్రియః పృథివీచరః,
గమ్యతాం భీష్మ యుద్ధేఽస్మిం స్తోషితోఽహం భృశం త్వయా. 36

భీష్మా! ఈ లోకమున భూమిపై తిరుగువారిలో నీ కీడైన క్షత్రియుడు లేడు. ఈ యుద్ధమున నీవలన పరమానందము పొందితిని. నీ వింక నీ స్థానమునకు పొమ్ము.

మమ చైవ సమక్షం తాం కన్యామాహూయ భార్గవః,
ఉక్తవాన్ దీనయా వాచా మధ్యే తేషాం మహాత్మనామ్. 37

నా యెదురుగనే భార్గవుడా కన్యను పిలిచి ఆ మహాత్ముల నడుమ జాలి గొలుపు మాటలతో నిట్లు పలికెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
యుద్ధనివృత్తౌ పఞ్చాశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
యుద్ధము ముగియుట యను నూటయెనుబదియైదవ అధ్యాయము.

—: ౦ :—

# షడశీత్యధికశతతమోఽధ్యాయః

# నూటయెనుబదియారవ అధ్యాయము

## అమ్బాయా ఉగ్రతపస్యా.

## అంబచేసిన ఘోరతపస్సు.

రామ ఉవాచ - పరశురాము డిట్లనెను.

ప్రత్యక్ష మేత ల్లోకానాం సర్వేషా మేవ భావిని,
యథాశక్త్యా మయా యుద్ధం కృతం వై పౌరుషం పరమ్. 1

అమ్మా ! లోకు లందరకు ఇది ప్రత్యక్షమే కదా! నేను శక్తివంచన చేయకుండ గొప్ప పౌరుషము చూపి పోరు సల్పితిని.

న చైవమపి శక్నోమి భీష్మం శస్త్రభృతాం వరం,
విశేషయితు మత్యర్థ ముత్తమాస్త్రాణి దర్శయన్. 2

అయినను ఆయుధధారులలో శ్రేష్ఠుడగు భీష్ముని, మహాస్త్రములు చూపియు, మీరజాలనైతిని.

ఏషా మే పరమా శక్తి రేతన్మే పరమం బలమ్,
యథేష్టం గమ్యతాం భద్రే కిమన్య ద్వా కరోమి తే. 3

ఇదియే నా పరమశక్తి. ఇదియే నా గొప్పబలము. ఇక నీ యిచ్చవచ్చిన చోటి కరుగుము. లేక నీకు మరేదైన ఉపకారము చేయుదునా?

భీష్మ మేవ ప్రపద్యస్వ న తేఽన్యా విద్యతే గతిః,
నిర్జితో హ్యస్మి భీష్మేణ మహాస్త్రాణి ప్రముఞ్చతా. 4

నీవు భీష్మునే శరణు పొందుము. మరియొక దారి లేదు. మహాస్త్రములు ప్రయోగించెడు అతనికి ఓడితిని గదా!

ఏవ ముక్త్వా తతో రామో వినిఃశ్వస్య మహామనాః,
తూష్ణీ మాసీ త్తతః కన్యా ప్రోవాచ భృగునన్దనమ్. 5

ఇట్లు పలికి దొడ్డబుద్ధిగల రాముదు నిట్టూర్చి ఊరకుండెను. అంత నా కన్య భృగునందనునితో నిట్లు పలికెను.

భగవ న్నేవ మేవైత ద్యథాఽహం భగవాం స్తథా,
అజేయో యుధి భీష్మోఽయ మపి దేవై రుదారధీః. 6

భగవానుడా! ఇది యిట్టిదే. నే నెట్లో పూజ్యులైన తమరును అట్లే అయిరి. దొడ్డబుద్ధిగల ఈ భీష్ముడు యుద్ధమున దేవతలకును గెలువజాలని వాడు.

యథాశక్తి యథోత్సాహం మమ కార్యం కృతం త్వయా,
అనివార్యం రణే వీర్య మస్త్రాణి వివిధాని చ. 7

శక్తిమేరకు, ఉత్సాహమున్నంతవరకు తమరు నాపని చేసి పెట్టితిరి. భీష్ముని శక్తియు, వేర్వేరు అస్త్రములును నివారింప శక్యము కానివాయెను.

న చైవ శక్యతే యుద్ధే విశేషయితు మన్తతః,
న చాహ మేనం యాస్యామి పునర్భీష్మం కథఞ్చన. 8

ఆతని మించుట మొత్తము మీద అసాధ్యమే యాయెను. అయినను నేను ఎన్నటికిని తిరిగి భీష్మునికడకు పోను.

గమిష్యామి తు తత్రాహం యత్ర భీష్మం తపోధన,
సమరే పాతయిష్యామి స్వయమేవ భృగూద్వహ. 9

నాయంత నేను భీష్ముని యుద్ధమున కూల్పగల చోటికి అరుగుదును.

ఏవ ముక్త్వా యయౌ కన్యా రోషవ్యాకులలోచనా,
తాపస్యే ధృతసంకల్పా సా మే చిన్తయతీ వధమ్. 10

రోషముతో తిరిగి పోవుచున్న కనులుగల ఆ కన్య అట్లు పలికి, తపస్సున బుద్ధిని గట్టిగా నిలిపి, నావధనే చింతించుచు వెడలిపోయెను.

తతో మహేన్ద్రం సహితై ర్మునిభి ర్భృగుసత్తమః,
యథాగతం తథా సోఽగా న్మాముపామన్త్ర్య భారత. 11

అంత నా భృగువంశవరుడు మునులతో కలిసి నన్ను వీడ్కొని మహేంద్రపర్వతమునకు వచ్చిన తీరున అరిగెను.

తతో రథం సమారుహ్య స్తూయమానో ద్విజాతిభిః,
ప్రవిశ్య నగరం మాత్రే సత్యవత్యై న్యవేదయమ్. 12

అంత రథమెక్కి నేను బ్రాహ్మణులు స్తోత్రపాఠములు చేయుచుండగా నగరము ప్రవేశించి మాయమ్మ యగు సత్యవతికి విషయమంతయు నివేదించితిని.

యథావృత్తం మహారాజ సా చ మాం ప్రత్యనన్దత,
పురుషాంశ్చాదిశం ప్రాజ్ఞాన్ కన్యావృత్తాన్తకర్మణి. 13

ఆమెయు జరిగినదానిని తెలిసికొని నన్ను కొనియాడెను. ఆ కన్య వృత్తాంత మెరిగివచ్చుటకై తెలివిగల మనుజులను నియోగించితిని.

దివసే దివసే హ్యస్యా గతిజల్పితచేష్టితమ్,
ప్రత్యాహరంశ్చ మే యుక్తాః స్థితాః ప్రియహితే సదా. 14

నా ఉద్యోగులు నా ప్రియమునందును, హితమునందును ఎల్లవేళల స్థిరముగా నిలిచినవారై యేనాటి కానాడు ఆమెగతిని, మాటలను చేష్టలను తెలిసికొని చెప్పుచుండిరి.

యదైవ హి వనం ప్రాయాత్ సా కన్యా తపసే ధృతా,
తదైవ వ్యథితో దీనో గతచేతా ఇవాభవమ్. 15

ఆమె తపసున మదిని గట్టిగా నిలిపి ఎప్పుడు వెళ్లెనో యప్పుడే నేను దుఃఖపడితిని. దీనుడనైతిని.

న హి మాం క్షత్రియః కశ్చిద్వీర్యేణ వ్యజయద్యుధి,
ఋతే బ్రహ్మవిద స్తాత తపసా సంశితవ్రతాత్. 16

వేదవేత్తయు, తపస్సునందు తీవ్రనిష్ఠ కలవాడును తప్ప మరియొక క్షత్రియుడు బలముతో నన్ను యుద్ధమున గెలువడు.

అపి చైత న్మయా రాజ న్నారదేఽపి నివేదితమ్,
వ్యాసే చైవ తథా కార్యం తౌ చోభౌ మా మవోచతామ్. 17

నే నీ సంగతి నారదునకు వ్యాసభగవానునికిని నివేదించితిని. వారిరువురు నాతో నిట్లు పలికిరి.

---

14. అస్యాః - కాశిరాజకన్యయొక్క.

న విషాద స్త్వయా కార్యో భీష్మ కాశిసుతాం ప్రతి,
దైవం పురుషకారేణ కో నివర్తితు ముత్సహేత్. 18

భీష్మా ! కాశిరాజతనయనుగూర్చి నీవు విషాదము పొందవలదు. పురుషకారముతో దైవమును మరలింప నెవ్వడు చాలును ?

సా కన్యా తు మహారాజ ప్రవిశ్యాశ్రమమణ్డలమ్,
యమునాతీర మాశ్రిత్య తపస్తేపేఽతిమానుషమ్. 19

మహారాజా ! ఆ కన్య ఆశ్రమములోనికి ప్రవేశించి, యమున ఒడ్డును జేరి మనుష్యులకు చేయశక్యముగాని తపస్సుచేసెను.

నిరాహారా కృశా రుషా జటిలా మలపఙ్కినీ,
షణ్మాసాన్ వాయుభక్షా చ స్థాణుభూతా తపోధనా. 20

ఆయమ ఆహారము మానివైచెను. సన్నగిల్లిపోయెను. తీవ్ర స్వభావము గలది యాయెను. జడలు కట్టిన తల గలదై యుండెను. ఒడలంతయు మట్టి గొట్టుకొని యుండెను, ఆరు నెలలు గాలి మాత్రమే భుజించి యుండెను. కదలిక లేని మొద్దువలె నుండెను. అట్లు తపము చేసెను.

యమునాజల మాశ్రిత్య సంవత్సర మథాపరమ్,
ఉదవాసం నిరాహారా పారయామాస భావినీ. 21

తరువాత ఒక్కయేడు యమున నీటిలో చొరబారి, అన్నము ముట్టక నీటిలో నిలిచి తప మాచరించుచు గడపెను.

శీర్ణ పర్ణేన చైకేన పారయామాస సా పరమ్,
సంవత్సరం తీవ్రకోపా పాదాఙ్గుష్ఠాగ్రధిష్ఠితా. 22

పిదప ఒక్క సంవత్సరకాలము తీవ్రకోపము గల ఆయమ పాదము బొట్టనవేలిపై నిలిచి రాలిన ఒక్క ఆకు తినుచు గడపెను.

ఏవం ద్వాదశ వర్షాణి తాపయామాస రోదసీ,
నివర్త్యమానాఽపి చ సా జ్ఞాతిభి ర్న చ శక్యతే. 23

ఇట్లాకన్య పండ్రెండేడులు భూమ్యాకాశములను మాడ్చివైచెను. బంధువులు కామెను మరలించుట సాధ్యము కాలేదు.

తతోఽగమ ద్వత్సభూమిం సిద్ధచారణసేవితామ్,
ఆశ్రమం పుణ్యశీలానాం తాపసానాం మహాత్మనామ్. 24

పిమ్మట ఆయమ పుణ్యశీలురు, మహాత్ములు అగు తాపసుల ఆశ్రమము, సిద్ధులు, చారణులు నివసించునదియు నగు వత్సభూమి కరిగెను.

తత్ర పుణ్యేషు తీర్థేషు సాఽఽప్లుతాఙ్గీ దివానిశమ్,
వ్యచరత్ కాశికన్యా సా యథాకామవిచారిణీ. 25

అందు పుణ్యతీర్థములలో రాత్రింబవళ్ళు మునుగుచు ఆ కాశికన్య యిచ్ఛ వచ్చిన చొప్పున తిరుగాడెను.

నన్దాశ్రమే మహారాజ తథోలూకాశ్రమే శుభే,
చ్యవన స్యాశ్రమే చైవ బ్రహ్మణః స్థాన ఏవ చ, 26
ప్రయాగే దేవయజనే దేవారణ్యేషు చైవ హ,
భోగవత్యాం మహారాజ కౌశిక స్యాశ్రమే తథా. 27
మాణ్డవ్యస్యాశ్రమే రాజన్ దిలీపస్యాశ్రమే తథా,
రామహ్రదే చ కౌరవ్య పైలగర్గస్య చాశ్రమే, 28
ఏతేషు తీర్థేషు తదా కాశికన్యా విశాంపతే,
ఆప్లావయత గాత్రాణి వ్రత మాస్థాయ దుష్కరమ్. 29

మహారాజా! నందాశ్రమము, ఉలూకాశ్రమము, చ్యవనాశ్రమము, బ్రహ్మస్థానము, ప్రయాగ, దేవయజనము, దేవారణ్యములు, భోగవతి, కౌశికాశ్రమము, మాండవ్యాశ్రమము, దిలీపాశ్రమము, రామహ్రదము, పైల గర్గుని ఆశ్రమము అను నీ తీర్థములందు ఆ కాశికన్య చేయనలవికాని వ్రతము పూని అవయవములను నీట దోగించెను.

తా మబ్రవీచ్చ కౌరవ్య మమ మాతా జలే స్థితా,
కిమర్థం క్లిశ్యసే భద్రే తథ్యమేవ వదస్వ మే. 30

నీటనున్న నాతల్లి గంగ, "ఓయమ్మా! నీవేల ఇట్లు కష్టపడుచున్నావు? నాకు నిజము చెప్పు"మని యడిగెను.

సైనా మథాబ్రవీ ద్రాజన్ కృతాఞ్జలి రనిన్దితా,
భీష్మేణ సమరే రామో నిర్జిత శ్చారులోచనే. 31

పవిత్రురాలగు ఆయమ ఈయమతో నిట్లు పలికెను : ''అమ్మా! పరశు రాముడు యుద్ధమున భీష్ముని కోడెను.''

కోఽన్య స్తముత్సహే జ్జేతు ముద్యతేషుం మహీపతిః,
సాఽహం భీష్మవినాశాయ తప స్తప్స్యే సుదారుణమ్. 32

''బాణమెత్తికొని వచ్చు నాతనిని గెలువగోరు రాజెవ్వడు గలడు? కావున ఆ నేను భీష్ముని వినాశమునకై మహాఘోరమగు తపస్సు చేయుచున్నాను.''

విచరామి మహీం దేవి యథా హన్యా మహం నృపమ్,
ఏత ద్వ్రతఫలం దేవి పర మస్మిన్యథా హి మే. 33

దేవీ! ఆ రాజు నెట్లు చంపుదునా యని భూమియంతయు తిరుగుచున్నాను. ఇట్లు శ్రమపడుటలో నా వ్రతమునకు ఫల మయ్యదియే.

తతోఽబ్రవీ త్సాగరగా జిహ్మం చరసి భావిని,
నైష కామోఽనవద్యాఙ్గి శక్యః ప్రాప్తుం త్వయాఽబలే. 34

అంత ఆ గంగాదేవి ఆమెతో నిట్లనెను: 'ఓసి బుద్ధిగలదానా! నీవు కుటిల బుద్ధితో తిరుగుచున్నావు. చక్కని దేహముగల ఓ అబలా! ఈ నీ కోరికను నీవు పొందజాలవు'.

యది భీష్మవినాశాయ కాశ్యే చరసి వై వ్రతమ్,
వ్రతస్థా చ శరీరం త్వం యది నామ విమోక్ష్యసి. 35
నదీ భవిష్యసి శుభే కుటిలా వార్షికోదకా,
దుస్తీర్థా న తు విజ్ఞేయా వార్షికీ నాష్టమాసికీ. 36

---

34. సాగరగా - సముద్రమును జేరునది - నది.
35. వార్షికీ - వర్షాకాలమునందు మాత్రమే నీటి ప్రవాహము గలది; అష్ట మాసికీ-ఎనిమిదినెలలు ప్రవాహము గలది.

'కాశిరాజపుత్రీ! నీ విట్లే భీష్ముని వినాశమునకై వ్రతము పూని తిరుగుచు, ఆ వ్రతమున నుండినపుడే శరీరమును వదలుదువేని, ఓసి మంచిదానా! నీవు వంకరటింకరగా నున్న నది వగుదువు. వర్షకాలమునందే నీరు గలదాన వగుదువు. పాడుపడిన తీర్థమ వగుదువు నిన్నెవ్వరు గుర్తింపరు. వర్షకాలము నాలుగునెలలే నీయందు నీ రుండును. మిగిలిన యెనిమిదినెలలలో నీరుండదు'.

భీమగ్రాహవతీ ఘోరా సర్వభూతభయంకరీ,
ఏవ ముక్త్వా తతో రాజన్ కాశికన్యాం న్యవర్తత. 37

'భయంకరమగు మొసళ్ళు గలదానవై, సమస్తప్రాణులకు భయము కలిగించుదానవై నికృష్టవగుదువు'-అని పలికి గంగ ఆ కాశికన్యను మరలించెను.

మాతా మమ మహాభాగా స్మయమానేవ భావినీ.

దొడ్డబుద్ధి కుశలత గల నాతల్లి చిన్నగా నవ్వుచు నామెను మరలించెను.

కదాచి దష్టమే మాసి కదాచి ద్దశమే తథా,
న ప్రాశ్నీ తోదకమపి పునః సా వరవర్ణినీ. 38

ఒక్కొక్కప్పుడు ఎనిమిదినెలలు, ఒక్కొక్కప్పుడు పదినెలలు ఆమె నీటినికూడ త్రావలేదు.

సా వత్సభూమిం కౌరవ్య తీర్థలోభా త్తత స్తతః,
పతితా పరిధావన్తీ పునః కాశిపతేః సుతా. 39

ఆమె ఆ వత్సభూమిలో అందందు తీర్థములను వెదకికొనుచు నేలపై బడి పరువులు తీసెను.

సా నదీ వత్సభూమ్యాం తు ప్రథితామ్బేతి భారత,
వార్షికీ గ్రాహబహులా దుస్తీర్థా కుటిలా తథా. 40

ఆమె ఆ వత్సభూమిలో 'అంబ' అను పేరొంది నదియై ప్రవహించెను. ఆ నదిలో వర్షకాలమునందే నీరుండును. మొసళ్ళు పెద్దసంఖ్యలో నుండును. నీరు దుష్టమైనది. వంకరగా ప్రవహించును.

---

38. ప్రాశ్నీత - భుజించెను.
39. పతితా - నేలపై బడి నడచినదై.

సా కన్యా తపసా తేన దేహార్ధేన వ్యజాయత,
నదీ చ రాజన్ వత్సేషు కన్యా చైవాభవ త్తదా. 41

ఇట్లా కన్య తపోమహిమతో సగము దేహముతో వత్సదేశమునందు నది యాయెను. మరియు నామె కన్యాస్వరూప మట్లే యుండెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
అమ్బాతపస్యాయాం షడశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
అంబతపస్సుగల నూటయెనుబదియారవ అధ్యాయము.

—: o :—

41. వత్సేషు - వత్సదేశమునందు.

# సప్తాశీత్యధికశతతమోఽధ్యాయః

# నూటయెనుబదియేడవ అధ్యాయము

**అమ్బయా ద్వితీయజన్మని పున స్తపస్యా, మహాదేవా**
**దభీష్టవరప్రాప్తి శ్చితాగ్నౌ ప్రవేశశ్చ.**

**అంబ మరుసటి జన్మమున మరల తప మొనర్చుట, మహాదేవునివలన**
**వరము పొందుట, చితాగ్నిలో ప్రవేశించుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తత స్తే తాపసాః సర్వే తపసే ధృతనిశ్చయామ్,
దృష్ట్వా న్యవర్తయం స్తాత కిం కార్యమితి చాబ్రువన్. 1

తపస్సునకు గట్టి పూనిక గల ఆమెను గాంచి తాపసు లందరు మరలించిరి. నీ పని యేమి యని పలికిరి.

తా నువాచ తతః కన్యా తపోవృద్ధా నృషీం స్తదా,
నిరాకృతాఽస్మి భీష్మేణ భ్రంశితా పతిధర్మతః. 2

అంత నా కన్య తపము పండిన పెద్దలగు ఆ ఋషులతో నిట్లు పలికెను: నన్ను భీష్ముడు నిరాకరించెను. పతిధర్మమునుండి భ్రష్టురాల నయితిని.

వధార్థం తస్య దీక్షా మే న లోకార్థం తపోధనాః,
నిహత్య భీష్మం గచ్ఛేయం శాన్తి మిత్యేవ నిశ్చయః. 3

తపోధనులారా! ఆతనిని చంపుటకే నా యీ దీక్ష. నా కేమియు ఉత్తమ లోకము లక్కరలేదు. భీష్ముని చంపి శాంతి పొందవలయునని నా నిశ్చయము.

యత్కృతే దుఃఖవసతి మిమాం ప్రాప్తాఽస్మి శాశ్వతీమ్,
పతిలోకా ద్విహీనా చ నైవ స్త్రీ న పుమా నిహ. 4

నాహత్వా యుధి గాఙ్గేయం నివర్తిష్యే తపోధనాః,
ఏష మే హృది సంకల్పో యదిదం కథితం మయా. 5

ఎవనివలన శాశ్వతమగు ఈ దుఃఖదశను పొందితినో, మగదన్నవాడు లేనిదాన నైతినో, ఆడుదానను మగవాడను కాక ప్రుగ్గుమంటినో, ఆ భీష్ముని యుద్ధమున రూపు మాపక నేను వెను దిరుగను. ఇది యెదలో చేసికొన్న నిశ్చయము. మునులారా! దీనిని మీకు చెప్పితిని.

స్త్రీభావే పరినిర్విణ్ణా పుంస్త్వార్థే కృతనిశ్చయా,
భీష్మే ప్రతిచికీర్షామి నాస్మి వార్యేతి వై పునః. 6

ఆడుదాననై పరమదుఃఖము నొందితిని. మగతనముకొరకు గట్టి నిశ్చయము చేసికొంటిని. ఆ విధముగా భీష్మునియందు ప్రతీకారము చేయగోరుచున్నాను. నన్ను మీరు మరల వారింపవలదు.

తాం దేవో దర్శయామాస శూలపాణి రుమాపతిః,
మధ్యే తేషాం మహర్షీణాం స్వేన రూపేణ తాపసమ్. 7

అంత నా మహర్షుల నడుమనుండి శూలము చేతదాల్చినవాడు, ఉమాపతి యగు మహాదేవుడు స్వరూపముతో ఆ తాపసికి కానవచ్చెను.

ఛన్ద్యమానా వరేణాథ సా వవ్రే మత్పరాజయమ్,
హనిష్యసీతి తాం దేవః ప్రత్యువాచ మనస్వినీమ్. 8

ఇష్టమైన వరము కోరుకొమ్మని మహాదేవు డడుగగా ఆమె నా పరాజయమును వరించెను. ఆ మానవతితో పరమేశ్వరుడు 'చంపుదు' వని పలికెను.

తతః సా పునరేవాథ కన్యా రుద్ర మువాచ హ,
ఉపపద్యేత్ కథం దేవ స్త్రియా యుధి జయో మమ. 9

అంత నా కన్య మరల రుద్రునితో నిట్లు పలికెను. దేవా! స్త్రీనగు నాకు యుద్ధమున జయ మెట్లు సమకూడును?

స్త్రీభావేన చ మే గాఢం మనః శాన్త ముమాపతే,
ప్రతిశ్రుతశ్చ భూతేశ త్వయా భీష్మపరాజయః. 10

ఉమాపతీ! నేను స్త్రీనగుటచే నా మనస్సు మిక్కిలి గట్టిగా శాంతమై యున్నది. నీవేమో భీష్ముని ఓటమిని గూర్చి మాట యిచ్చితివి.

---

10. శాన్తమ్ - శౌర్యము ధైర్యము లేనిది;

యథా స సత్యో భవతి తథా కురు వృషధ్వజ,
యథా హన్యాం సమాగమ్య భీష్మం శాన్తనవం యుధి. 11

వృషధ్వజా! నీ మాట యెట్లు సత్యమగునో, శాంతను కుమారుడగు భీష్మని నెదుర్కొని నేనెట్లు చంపుదునో యట్లనుగ్రహింపుము.

తా మువాచ మహాదేవః కన్యాం కిల వృషధ్వజః,
న మే వాగనృతం ప్రాహ సత్యం భద్రే భవిష్యతి. 12

అంత మహాదేవు డా కన్యతో నిట్లు పలికెను. అమ్మా! నా వాక్కు అనృతము పలుకదు. అది తప్పక సత్య మగును.

హనిష్యసి రణే భీష్మం పురుషత్వం చ లప్స్యసే,
స్మరిష్యసి చ తత్ సర్వం దేహ మన్యం గతా సతీ. 13

రణమున భీష్మని చంపుదువు. మగతనమును కూడ పొందుదువు. మరియొక దేహమును పొందియును అది యంతయు స్మరింతువు.

ద్రుపదస్య కులే జాతా భవిష్యసి మహారథః,
శీఘ్రాస్త్ర శ్చిత్రయోధీ చ భవిష్యసి సుసంమతః. 14

నీవు ద్రుపదుని కులమున మహారథుడవై పుట్టుదువు. అస్త్ర ప్రయోగములో చేతియొడుపుకలవాడ వగుదువు. చిత్రచిత్రములుగా పోరెడు వీరుడుగా నిన్నందరు గుర్తింతురు.

యథోక్తమేవ కల్యాణి సర్వ మేత ద్భవిష్యతి,
భవిష్యసి పుమాన్ పశ్చాత్ కస్మాచ్చిత్కాలపర్యయాత్. 15

కల్యాణీ! నేను పలికినట్లే సర్వము జరుగును. కాలము గడచిన పిదప నీవు పురుషుడ వగుదువు.

ఏవ ముక్త్వా మహాదేవః కపర్దీ వృషభధ్వజః,
పశ్యతా మేవ విప్రాణాం తత్రైవా న్తరధీయత. 16

కపర్ద మను కేశసంపద కలవాడు, వృషభధ్వజుడు అగు మహాదేవుడు ఇట్లు పలికి ఆ విప్రులు చూచుచుండగనే అక్కడనే అంతర్ధానము చెందెను.

తతః సా పశ్యతాం తేషాం మహర్షీణా మనిన్దితా,
సమాహృత్య వనా త్తస్మాత్ కాష్ఠాని వరవర్ణినీ. 17
చితాం కృత్వా సుమహతీం ప్రదాయ చ హుతాశనమ్,
ప్రదీప్తేఽగ్నౌ మహారాజ రోషదీప్తేన చేతసా. 18
ఉక్త్వా భీష్మవధాయేతి ప్రవివేశ హుతాశనమ్,
జ్యేష్ఠా కాశిసుతా రాజన్ యమునా మభితో నదీమ్. 19

అంత నా శుభాంగి కాశిరాజు పెద్దబిడ్డ ఆ మహర్షులందరు చూచుచుండగా యమునాద్వీపమున, అడవినుండి కట్టెలను కొనివచ్చి చితిపేర్చుకొని నిప్పం టించి అది మండగా రోషముతో మండుచున్న మనస్సుతో 'భీష్ముని వినాశము కొరకు' అని పలికి అగ్నిలో ప్రవేశించెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
అమ్బాహుతాశనప్రవేశే సప్తాశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున అంబ అగ్నిలో ప్రవేశించుట యను నూటయెనుబదియేడవ అధ్యాయము.

—: o :—

19. యమునా మభితః - యమునానది ద్వీపమందని భావము.

## అష్టాశీత్యధికశతతమోఽధ్యాయః
## నూటయెనుబదియెనిమిదవ అధ్యాయము

**అమ్బాయా ద్రుపదగృహే కన్యారూపేణ జన్మ, రాజ్ఞో రాజ్ఞ్యాశ్చ తస్యాః పుత్రరూపతయా ప్రఖ్యాపనం, శిఖణ్డీ ఇతి తదాఖ్యాకరణం చ.**

**అంబ ద్రుపదునింట కన్యగా పుట్టుట, రాజును రాణియు ఆమెను పుత్రునిగా ప్రకటించుట, శిఖండి యని పేరు పెట్టుట.**

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

కథం శిఖణ్డీ గాఙ్గేయ కన్యా భూత్వా పురా తదా,
పురుషోఽభూ ద్యుధి శ్రేష్ఠ తన్మే బ్రూహి పితామహ. 1

తాతా! గంగాతనయా! శిఖండి మునుపు స్త్రీ అయియుండి మగవా డెట్లా యెను? ఆ విషయము నాకు చెప్పుము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

భార్యా తు తస్య రాజేన్ద్ర ద్రుపదస్య మహీపతేః,
మహిషీ దయితా హ్యాసీ దపుత్రా చ విశాంపతే. 2

రాజా! ద్రుపదమహారాజు భార్య, పట్టమహిషి, ఆయనకు ప్రియమైనది సంతానము లేనిదై యుండెను.

ఏతస్మిన్నేవ కాలే తు ద్రుపదో వై మహీపతిః,
అపత్యార్థే మహారాజ తోషయామాస శఙ్కరమ్. 3

అదేకాలమున ద్రుపదమహారాజు సంతానముకొరకు శంకరుని సంతోష పెట్టెను.

అస్మద్వధార్థం నిశ్చిత్య తపో ఘోరం సమాస్థితః,
ఋతే కన్యాం మహాదేవ పుత్రో మే స్యాదితి బ్రువన్. 4

నన్ను వధించుటను నిశ్చయించి 'మహాదేవా! కన్య వలదు. నాకు పుత్రుడు కావలయును' అని పలుకుచు ఘోరమగు తపము నాచరించుచుండెను.

భగవన్ పుత్ర మిచ్ఛామి భీష్మం ప్రతిచికీర్షయా,
ఇత్యుక్తో దేవదేవేన స్త్రీపుమాంస్తే భవిష్యతి. 5
నివర్తస్వ మహీపాల నైత జ్జాత్వన్యథా భవేత్,

'మహాదేవా! భీష్మనిపై కసి తీర్చుకొనవలయును. నాకు కొడుకు కావలయును'. అని శంకరునితో పలుకగా దేవదేవుడు 'నీకు స్త్రీపురుషుడు పుట్టును. రాజా! మరలుము. ఇది ఎన్నటికిని మరియొక విధముగా జరుగదు' అని పలికెను.

స తు గత్వా చ నగరం భార్యామిద మువాచ హ. 6

అతడు నగరమున కరిగి భార్యతో ఇట్లు చెప్పెను.

కృతో యత్నో మహాదేవ స్తపసాఽఽరాధితో మయా,
కన్యా భూత్వా పుమాన్ భావీ ఇతి చోక్తోఽస్మి శంభునా. 7

'నేను యత్నము చేసితిని. మహాదేవుని గొప్పగా ఆరాధించితిని. ఆ శంభుడు మొదట కన్య పుట్టును. పిదప మగవా డగునని పలికెను'.

పునః పున ర్యాచ్యమానో దిష్టమి త్యబ్రవీ చ్ఛివః,
న తదన్యచ్చ భవితా భవితవ్యం హి తత్తథా. 8

మరల మరల వేడుకొనగా ఇదియే నీ భాగ్యమని శివుడు పలికెను. దీనికి తిరుగు లేదనియు ననెను. జరుగవలసినది జరుగక మానదు గదా!

తతః సా నియతా భూత్వా ఋతుకాలే మనస్వినీ,
పత్నీ ద్రుపదరాజస్య ద్రుపదం ప్రవివేశ హ. 9

అంత ద్రుపదరాజు పత్ని దొడ్డమనసు గలదై ఋతుకాలమున మనస్సు కుదుటపరచుకొని ద్రుపదుని చేరుకొనెను.

---

5. స్త్రీపుమాన్ - మొదట స్త్రీగా పుట్టి, పిదప మగవాడు అగువాడు; - పూర్వకాలైకసర్వ' - ఇత్యాది సూత్రముతో సమాసము.

9. ద్రుపదం ప్రవివేశ హ - ద్రుపదునితో దాంపత్యధర్మమును పొందెనని భావము.

తేభే గర్భం యథాకాలం విధిదృష్టేన కర్మణా,
పార్షతస్య మహీపాల యథా మాం నారదోఽబ్రవీత్. 10

శాస్త్రము విధించిన తీరున ఆమె గర్భాధానమను సంస్కారమును పొంది ద్రుపదునివలన గర్భమును ధరించెను. ఈ విషయమును నాకు నారదు డెరిగించెను.

తతో దధార సా దేవీ గర్భం రాజీవలోచనా,
తాం స రాజా ప్రియాం భార్యాం ద్రుపదః కురునన్దన. 11
పుత్రస్నేహా న్మహాబాహూాం సుఖం పర్యచర త్తదా,
సర్వా నభిప్రాయకృతాన్ భార్యాలభత కౌరవ, 12
అపుత్రస్య సతో రాజ్ఞో ద్రుపదస్య మహీపతే.

అంత కమలములవంటి కన్నులుగల ఆ దేవి గర్భమును ధరించెను. ఆ ద్రుపదుడు పుత్రునిపై ప్రేమతో ఆమెకు చక్కని సేవలు చేసెను. గర్భవతి యగు ఆమె పుత్రుడు లేని ద్రుపదమహారాజువలన కోరిక కోర్కెల నన్నింటిని తీర్చుకొనెను.

యథాకాలం తు సా దేవీ మహిషీ ద్రుపదస్య హ, 13
కన్యాం ప్రవరరూపాం తు ప్రాజాయత నరాధిప.

రాజా ! ఆ ద్రుపదుని పట్టపురాణి తగు కాలమున చక్కని రూపము గల కన్యను ప్రసవించెను.

అపుత్రస్య తు రాజ్ఞః సా ద్రుపదస్య మనస్వినీ, 14
ఖ్యాపయామాస రాజేన్ద్ర పుత్రో హ్యేష మమేతి వై.

కొడుకులు లేని ఆ ద్రుపదుని యిల్లాలు ముచ్చటపడి 'వీడు నా కొమరు' డనియే వెల్లడించెను.

---

10. విధిదృష్టేన కర్మణా - శాస్త్ర ముపదేశించిన గర్భాధానము అను కర్మముతో; పార్షతస్య - పార్షతుడు నిక్షేపించిన గర్భమును ధరించెనని ముందుశ్లోకముతో అన్వయము.
12. అభిప్రాయకృతాన్ - మనసున పుట్టిన వాంఛలను;
14. ప్రాజాయత - ప్రసవించెను.

తతః స రాజా ద్రుపదః ప్రచ్ఛన్నాయా నరాధిప, 15
పుత్రవత్ పుత్రకార్యాణి సర్వాణి సమకారయత్.

అంత నా ద్రుపదుడు గూఢపు బిడ్డకు కొడుకునకు వలెనే అన్ని కార్యములు చేయించెను.

రక్షణం చైవ మన్త్రస్య మహిషీ ద్రుపదస్య సా, 16
చకార సర్వయత్నేన బ్రువాణా పుత్ర ఇత్యుత.

ద్రుపదుని పట్టపురాణి కొడుకు అని పలుకుచు ఆ రహస్యమును అన్ని యత్నములతో కాపాడెను.

న చ తాం వేద నగరే కశ్చి దన్యత్ర పార్షతాత్, 17
శ్రద్ధధానో హి తద్వాక్యం దేవ స్యాచ్యుతతేజసః,
ఛాదయామాస తాం కన్యాం పుమానితి చ సోఽబ్రవీత్. 18

ద్రుపదుడు కాక మరి యెవ్వడును ఆమె స్త్రీ యని యెరుగకుండెను. ద్రుపదుడును జారుపాటులేని తేజముగల మహాదేవుని ఆ మాటను నమ్మి ఆ కన్యను కప్పిపుచ్చెను, మగవాడని పలుకుచుండెను.

జాతకర్మాణి సర్వాణి కారయామాస పార్థివః,
పుంవద్విధానయుక్తాని శిఖణ్డీతి చ తాం విదుః. 19

మగవానికి చేయదగిన జాతకర్మ మొదలగు కార్యము లన్నియు రాజు ఆమెకు చేయించెను. జను లందరు ఆమెను 'శిఖండి' యనజొచ్చిరి.

అహ మేకస్తు చారేణ వచనా న్నారదస్య చ,
జ్ఞాతవాన్ దేవవాక్యేన అమ్బాయా స్తపసా తథా. 20

నేను మాత్రము ఒక గూఢచారుని వలనను, నారదుని మాటను బట్టియు, అంబయొక్క తపస్సును బట్టియు, దేవవాక్యము చేతను ఈ వృత్తాంతమంతయు నెరిగితిని.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
శిఖణ్ద్యుత్పత్తౌ అష్టాశీత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
శిఖండి పుట్టుకగల నూటయెనుబదియెనిమిదవ అధ్యాయము.

—:o:—

# ఊనసవత్యధికశతతమోఽధ్యాయః

# నూటయెనుబదితొమ్మిదవ అధ్యాయము

**శిఖణ్డినో వివాహః, తస్య స్త్రీత్వ మాకర్ణ్య శ్వశురస్య దశార్ణరాజస్య మహాన్ కోపః.**

**శిఖండి పెండిలి; అతడు ఆడుది యని యెరిగి మామ దశార్ణరాజు మండిపడుట.**

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

చకార యత్నం ద్రుపదః సుతాయాః సర్వకర్మసు,
తతో లేఖ్యాదిషు తథా శిల్పేషు చ పరంతప. 1

ద్రుపదుడు చిత్రలేఖనము, శిల్పము మున్నగు అన్నికళలయందును బిడ్డకు నేర్పు కలుగునట్లు కృషి చేసెను.

ఇష్వస్త్రే చైవ రాజేన్ద్ర ద్రోణశిష్యో బభూవ హ.

విలువిద్యయందును ఆ శిఖండి ద్రోణశిష్యు డాయెను.

తస్య మాతా మహారాజ రాజానం వరవర్ణినీ, 2
చోదయామాస భార్యార్థం కన్యాయాః పుత్రవత్తదా.

శిఖండి తల్లి రాజును ఆ కన్యకకు కొడుకునకు వలెనే భార్యకొరకు తొందరచేయ మొదలిడెను.

తతస్తాం పార్షతో దృష్ట్వా కన్యాం సంప్రాప్తయౌవనామ్,
స్త్రియం మత్వా తతశ్చిన్తాం ప్రపేదే సహ భార్యయా. 3

యౌవనము పొందిన ఆ కన్యను చూచి పృషతుని పుత్రుడగు ద్రుపదుడు భార్యతోపాటు ఈమె ఆడుదిగదా యని చింత పొందెను.

ద్రుపద ఉవాచ - ద్రుపదు డిట్లనెను.

కన్యా మమేయం సంప్రాప్తా యౌవనం శోకవర్ధినీ,
మయా ప్రచ్ఛాదితా చేయం వచనా చ్ఛూలపాణినః. 4

నా యీ బిడ్డకు యౌవనము వచ్చినది. ఈమె నాకు దుఃఖమును పెంచుచున్నది. శివునిమాటపై ఈమెను నేను కప్పిపుచ్చితిని.

భార్యోవాచ - భార్య యిట్లు పలికెను.

న తన్మిథ్యా మహారాజ భవిష్యతి కథఞ్చన,
త్రైలోక్యకర్తా కస్మాద్ధి వృథా వక్తు మిహార్హతి. 5

మహారాజా! ఆ ఈశ్వరుని మాట ఎన్నటికిని పొల్లు పోదు. మూడు లోకములకు కర్తయగు ఆతడు ఊరక వట్టి పలు కేల పలుకును?

యది తే రోచతే రాజన్ వక్ష్యామి శృణు మే వచః,
శ్రుత్వేదానీం ప్రపద్యేథాః స్వాం మతిం పృషతాత్మజ. 6

రాజా! నీకు రుచించినచో నే నొకమాట చెప్పెదను. వినుడు. విని యటుపై నీ బుద్ధిని బట్టి ప్రవర్తింపుము.

క్రియతా మస్య యత్నేన విధివ ద్దారసంగ్రహః,
భవితా తద్వచః సత్య మితి మే నిశ్చితా మతిః. 7

విధిప్రకారముగా వీనికి పెండిలి చేయుము. అటుపై ఆ శివునిమాట సత్యమగు నని నా బుద్ధికి నిశ్చయముగా తోచుచున్నది.

తతస్తౌ నిశ్చయం కృత్వా తస్మిన్ కార్యేఽథ దంపతీ,
వరయాంచక్రతుః కన్యాం దశార్ణాధిపతేః సుతామ్. 8

అంత నా ఆలుమగలు ఆ పనియందు నిశ్చయము చేసికొని దశార్ణరాజు కూతును వధువుగా ఎన్నుకొనిరి.

---

4. శూలపాణినః - శూలముతో కూడిన పాణి - శూలపాణి - శూలపాణి కలవాడు శూలపాణి (న్). ఇది మత్వర్థమున 'ఇని' ప్రత్యయము చేరిన రూపము.

తతో రాజా ద్రుపదో రాజసింహః
సర్వాన్ రాజ్ఞః కులతః సన్నిశామ్య,
దాశార్ణకస్య నృపతే స్తనూజాం
శిఖణ్డినే వరయామాస దారాన్. 9

రాజసింహుడగు ద్రుపదు డంత కులమును బట్టి రాజులందరకు ఆ విషయ మెరిగించి దశార్ణరాజు బిడ్డను శిఖండికి భార్యగా వరించెను.

హిరణ్యవర్మేతి నృపో యోఽసౌ దాశార్ణకః స్మృతః,
స చ ప్రాదా న్మహీపాలః కన్యాం తస్మై శిఖణ్డినే. 10

హిరణ్యవర్మ అను పేరుగల దశార్ణదేశరాజు ఆ శిఖండికి తన కూతు నిచ్చెను.

స చ రాజా దశార్ణేషు మహానాసీత్ సుదుర్జయః,
హిరణ్యవర్మా దుర్ధర్షో మహాసేనో మహామనాః. 11

ఆ హిరణ్యవర్మ దశార్ణదేశములందు చాల గొప్పవాడు. ఎవ్వరికిని గెలువ శక్యము కానివాడు. గొప్పసేన కలవాడు. గట్టి మనస్సు కలవాడు.

కృతే వివాహే తు తదా సా కన్యా రాజసత్తమ,
యౌవనం సమనుప్రాప్తా సా చ కన్యా శిఖణ్డినీ. 12

వివాహము చేయగా నంత నా కన్య యౌవనమును పొందెను. అట్లే శిఖండినియు యౌవనమును పొందెను.

కృతదారః శిఖణ్డీ చ కామ్పిల్యం పునరాగమత్,
తతః సా వేద తాం కన్యాం కఞ్చిత్కాలం స్త్రియం కిల. 13

శిఖండి పెండ్లి చేసికొని కాంపిల్యనగరమునకు తిరిగి వచ్చెను. అంత నా కన్య శిఖండి ఆడుది యని కొంత కాలమునకే యెరిగెను.

హిరణ్యవర్మణః కన్యా జ్ఞాత్వా తాం తు శిఖణ్డినీమ్,
ధాత్రీణాం చ సఖీనాం చ వ్రీడయానా న్యవేదయత్. 14
కన్యాం పాంచాలరాజస్య సుతాం తాం వై శిఖణ్డినీమ్.

హిరణ్యవర్మ బిడ్డ ఆమె శిఖండిని యని యెరిగి తన దాదులకును చెలుల కును సిగ్గుపడుచు పాంచాలరాజకన్య యగు శిఖండిని ఆడుది యని యెరిగించెను.

తతస్తా రాజశార్దూల ధాత్ర్యో దాశార్ణికా స్తదా,
జగ్ము ర్దార్తిం పరాం ప్రేష్యాః ప్రేషయామాసు రేవ చ. 15

అంత దశార్ణదేశమునుండి వచ్చిన ఆ దాదులు ఆ విషయమెరిగి మిక్కిలి దుఃఖము నొందిరి. దాసీజనముతో దశార్ణరాజునకు కబురు పెట్టిరి.

తతో దశార్ణాధిపతేః ప్రేష్యాః సర్వా న్యవేదయన్,
విప్రలమ్భం యథావృత్తం స చ చుక్రోధ పార్థివః. 16

అంత దశార్ణరాజునకు దాసీజనులు జరిగిన మోసము నంతటిని ఎరిగించిరి. ఆ రాజునకును క్రోధము కలిగెను.

శిఖణ్డ్యపి మహారాజ పుంవ ద్రాజకులే తదా,
విజహార ముదా యుక్తః స్త్రీత్వం నైవాతిరోచయన్. 17

శిఖండియు మగతనము కలవానివలె రాజకులమున పొంగిపోవుచు తిరుగ జొచ్చెను. అతనికి ఆడుతనము నచ్చలేదు.

తతః కతిపయాహస్య తచ్ఛ్రుత్వా భరతర్షభ,
హిరణ్యవర్మా రాజేన్ద్ర రోషా దార్తిం జగామ హ. 18

పిదప కొంతకాలమున కామాట విని హిరణ్యవర్మ రోషముతో మిక్కిలిగా ఆర్తి పొందెను.

తతో దాశార్ణకో రాజా తీవ్రకోపసమన్వితః,
దూతం ప్రస్థాపయామాస ద్రుపదస్య నివేశనమ్. 19

అటుపై దశార్ణరాజు పట్టరానికోపముతో ద్రుపదు నింటికి ఒక దూతను పంపెను.

---

15. ధాత్ర్యః - ఆ దాదులు; ప్రేష్యాః - తమ సేవకురాండ్రను; ప్రేషయా మాసుః - (దశార్ణదేశమునకు) పంపిరి.

6. విప్రలమ్భమ్ - వంచనను .

తతో ద్రుపద మాసాద్య దూతః కాఞ్చనవర్మణః,
ఏక ఏకాన్త ముత్సార్య రహో వచన మబ్రవీత్. 20

హిరణ్యవర్మ దూత ద్రుపదుని సమీపించి ఏకాంతమునకు కొనిపోయి ఎవ్వరులేని సమయమున నిట్లు పలికెను.

దశార్ణరాజో రాజం స్త్వా మిదం వచన మబ్రవీత్,
అభిషఙ్గాత్ ప్రకుపితో విప్రలబ్ధ స్త్వయానఘ. 21

పుణ్యాత్ముడా! మా దశార్ణరాజు నీవు చేసిన వంచనవలన పరాభవము పొంది మిక్కిలి కోపించినవాడై నీకు ఈమాట చెప్పు మనెను.

అవమన్యసే మాం నృపతే నూనం దుర్మన్త్రితం తవ,
యన్మే కన్యాం స్వకన్యార్థే మోహా ద్యాచితవానసి. 22

రాజా! న న్నవమానించితివి. ఇది నిక్కముగా నీ దురాలోచన. నాబిడ్డను నీ బిడ్డకై పిచ్చిప్రేమతో కోరితివి.

తస్యాద్య విప్రలమ్భస్య ఫలం ప్రాప్నుహి దుర్మతే,
ఏష త్వాం స్వజనామాత్య ముద్ధరామి స్థిరో భవ. 23

ఓయి దుర్మతీ! ఆ మోసమునకు తగిన ఫలము ఇప్పు డనుభవింపుము. ఇదిగో నిన్ను నీ జనులతో, మంత్రులతో పెకలించివైతును. చక్క నిలువుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
హిరణ్యవర్మదూతాగమనే ఊననవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
హిరణ్యవర్మ దూత వచ్చుట యను నూటయెనుబదితొమ్మిదవ అధ్యాయము

—: ౦ :—

20. ఉత్సార్య - రావించి;
21. అభిషఙ్గాత్ - పరాభవమువలన;
23. ఉద్ధరామి - పెకలించి వైచెదను.

# నవత్యధికశతతమోఽధ్యాయః
# నూటతొంబదియవ అధ్యాయము.

హిరణ్యవర్మణ ఆక్రమణభియోద్విగ్నచేతసో ద్రుపదస్య
మహారాజ్ఞీం ప్రతి సంకటనివారణోపాయజిజ్ఞాసా.
హిరణ్యవర్మ వచ్చిపడునను భయముతో గుండె చెదిరిన ద్రుపదుడు
మహారాజ్ఞిని ఆపద గడచు నుపాయము నడుగుట.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

ఏవ ముక్తస్య దూతేన ద్రుపదస్య తదా నృప,
చోరస్యేవ గృహీతస్య న ప్రావర్తత భారతీ. 1

దూత యిట్లు పలుకగా పట్టుపడిన దొంగకువలె ద్రుపదునకు నోట మాట పెగలలేదు.

స యత్న మకరో త్తీవ్రం సంబన్ధి న్యనుమాననే,
దూతై ర్మధురసంభాషైర్నతద స్తీతి సందిశన్. 2

అతడు తీయనిపలుకులు గల దూతలద్వారా కబురంపుచు చుట్టరికమున నందలి అనుమానవిషయమున నట్టిదేమియు లేదని నమ్మించుటకు తీవ్రప్రయత్నము చేసెను.

స రాజా భూయ ఏవాథ జ్ఞాత్వా తత్త్వ మథాగమత్,
కన్యేతి పాఞ్చాలసుతాం త్వరమాణో వినిర్యయౌ. 3

కాని ఆ దశార్ణరాజు మరల గట్టిగా పాంచాలసుత కన్యయే యని నిశ్చయించుకొని వడివడిగా యుద్ధమునకు బయలుదేరెను.

తతః సంప్రేషయామాస మిత్రాణా మమితౌజసామ్,
దుహితు ర్విప్రలంభం తం ధాత్రీణాం వచనా త్తదా. 4

---

౪. అగమత్ - తెలిసికొనెను.

పిదప దాదుల మాటలనుబట్టి తన బిడ్డకు జరిగిన వంచనను గొప్ప దేహ శక్తిగల మిత్రముంకు తెలియజేసెను.

తతః సముదయం కృత్వా బలానాం రాజసత్తమః,
అభియానే మతిం చక్రే ద్రుపదం ప్రతి భారత. 5

అంత నా రాజవరేణ్యుడు సేనలను కూడగట్టుకొని ద్రుపదునిపై దండెత్తుటకు నిశ్చయించెను.

తతః సంమన్త్రియామాస మన్త్రిభిః స మహీపతిః,
హిరణ్యవర్మా రాజేన్ద్రి పాఞ్చాల్యం పార్థివం ప్రతి. 6

అంత రాజైన హిరణ్యవర్మ మంత్రులతో పాంచాలరాజును గూర్చి చర్చలు జరిపెను.

తత్ర వై నిశ్చితం తేషా మభూ ద్రాజ్ఞాం మహాత్మనామ్,
తథ్యం భవతి చేదేతత్ కన్యా రాజన్ శిఖణ్డినీ, 7
బద్ధ్వా పఞ్చాలరాజాన మానయిష్యామహే గృహమ్.

అంత నా దొడ్డరాజు లందరు ఇట్లు తీరుమానము గావించిరి; శిఖండి కన్య యను విషయము నిజమైనచో పాంచాలరాజును బంధించి మన యింటికి తెత్తము.

అన్యం రాజాన మాధాయ పఞ్చాలేషు నరేశ్వరమ్, 8
ఘాత యిష్యామ నృపతిం పాఞ్చాలం సశిఖణ్డినమ్. 9

పాంచాలదేశమున మరియొకనిని రాజుగా నేర్పరచి పాంచాలుని, శిఖండితో పాటు చంపివైచెదము.

తత్తదానృత మాజ్ఞాయ పునర్దూతా న్నరాధిపః,
ప్రాస్థాపయత్ పార్షతాయ నిహన్మీతి స్థిరో భవ. 10

అంత హిరణ్యవర్మ ద్రుపదుని మాట అబద్ధమని తెలిసికొని మరల నాతనికడకు 'రాజా! నిన్ను చంపెదను. స్థిరుడ వగుము అని వార్త చెప్పుటకు దూతలను బయలుదేరదీసెను.

---

5. సముదయమ్ - సముదాయమును;

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

స హి ప్రకృత్యా వై భీతః కిల్బిషీ చ నరాధిపః,
భయం తీవ్ర మనుప్రాప్తో ద్రుపదః పృథివీపతిః. 11

ఆ ద్రుపదమహారాజు సహజముగనే పిరికివాడు, మరియు తప్పుచేసి యున్నవాడు. కావున తీవ్రమగు భయము పొందెను.

విసృజ్య దూతాన్ దాశార్ణే ద్రుపదః శోకమూర్ఛితః,
సమేత్య భార్యాం రహితే వాక్యమాహ నరాధిపః. 12

దూతలను దశార్ణదేశమునకు పంపి ద్రుపదుడు శోకముచేత వశము తప్పినవాడై భార్యను సమీపించి ఏకాంతమున నామెతో నిట్లనెను.

భయేన మహతాఽఽవిష్టో హృది శోకేన చాహతః,
పాఞ్చాలరాజో దయితాం మాతరం వై శిఖణ్డినః. 13

పెనుభయ మావరింపగా దుఃఖము గుండె కెగదట్టగా పాంచాలరాజు శిఖండిని కన్నతల్లి యగు తన భార్యతో నిట్లు పలికెను.

అభియాస్యతి మాం కోపాత్ సంబన్ధీ సుమహాబలః,
హిరణ్యవర్మా నృపతిః కర్షమాణో వరూథినీమ్. 13

మన వియ్యము, దొడ్డబలము కలవాడు, హిరణ్యవర్మ పెనుసేనను కూర్చుకొని కోపముతో నామీదికి వచ్చుచున్నాడు.

కిమిదానీం కరిష్యావో మూఢౌ కన్యామిమాం ప్రతి.

బుద్ధిలేని మన మిప్పుడు ఈ కన్య విషయమున నేమి చేయుదుము?

శిఖణ్డీ కిల పుత్రస్తే కన్యేతి పరిశఙ్కితః. 15
ఇతి సఞ్చిన్త్య యత్నేన సమిత్రః సబలానుగః,
వఞ్చితోఽస్మీతి మన్వానో మాం కిలోద్ధర్తు మిచ్ఛతి. 16

ఈ నీ కొడుకు శిఖండి కన్య యని గట్టిగా అతడు శంకించెను. తనవారితో విచారించి మిత్రములతో సేవకులతో సైనికులతో కూడి, అహా! నన్ను వంచించెను గదా యని తలచుచు నన్నె రూపుమాపగోరుచున్నాడు.

కిమత్ర తథ్యం సుశ్రోణి మిథ్యా కిం బ్రూహి శోభనే,
శ్రుత్వా త్వత్తః శుభం వాక్యం సంవిధాస్యా మ్యహం తథా. 17

ఓ కాంతా! ఇది నిజమా! కల్లయా? పలుకుము. నీనుండి సరియగు మాట విని చేయవలసినది చేసెదను.

అహం హి సంశయం ప్రాప్తో బాలా చేయం శిఖణ్డినీ,
త్వం చ రాజ్ఞి మహత్ కృచ్ఛ్రం సంప్రాప్తా వరవర్ణిని. 18

రాణీ! ఈ శిఖండి బాలయా అని నేనును సంశయము పొందితిని. నీకును పెను కష్టము వచ్చిపడినది.

సా త్వం సర్వవిమోక్షాయ తత్త్వ మాఖ్యాహి పృచ్ఛతః,
తథా విదధ్యాం సుశ్రోణి కృత్యమాశు శుచిస్మితే. 19

మన మందరము ఈ ఆపదనుండి బయటపడుటకు నిజము చెప్పుము. అడుగుచున్నాను. అటుపై ఏది చేయవలయునో అది వెంటనే చేయుదును.

శిఖణ్డిని చ మా భైస్త్వం విధాస్యే తత్ర తత్త్వతః,
కృపయాఽహం వరారోహే వఞ్చితః పుత్రధర్మతః. 20

ఓ వనితా! పుత్రధర్మమున నీవు నన్ను వంచించినను శిఖండి విషయమున నీవు భయపడకుము. కృపతో నేను మీయందు తగు విధముగనే ప్రవర్తించెదను.

---

20. భార్య దోషము లేనిదని యెరిగియు తప్పు తమ యిరువురిదియు నైనను నలుగురిలో తన దోషిత్వమును కప్పిపుచ్చుకొనుటకై, భార్యదే దోష మన్నట్లు నమ్మించుటకై యిట్లు పలుకుచున్నాడు. వఞ్చితః - నేను శిఖండి విషయమున నీచేతను, శిఖండిచేతను వంచింపబడినవాడ నైనను; మాభైః - భయపడకుము; శిఖణ్డిని విధాస్యే - శిఖండి విషయమున యోగ్యమగు పనినే చేసెదను - అనగా మీ యిరువురను హింసింపను - అని భావము - లేదా; శిఖణ్డిని - ఓ శిఖండినీ; మాభైః - భయపడకుము; హే వరారోహే - ఓ కాంతా - ఇల్లాలా! మా భైః - భయపడకుము - అని యిరువురకు జనులనడుమ అభయ మిచ్చి అడుగుచున్నా డనియు నర్థము;

మయా దాశార్ణకో రాజా వఞ్చితః స మహీపతిః,
తదాచక్ష్వ మహాభాగే విధాస్యే తత్ర యద్ధితమ్. 21

పాపము నే నా దశార్ణరాజును వంచించితిని. కావున నిజము చెప్పుము. ఇందేది మేలో యది చేయుదును.

జానతా హి నరేన్ద్రేణ ఖ్యాపనార్థం పరస్య వై,
ప్రకాశం చోదితా దేవీ ప్రత్యువాచ మహీపతిమ్. 22

రా జంతయు నెరిగినవాడయ్యు ఇతరులకు తెలియకుండుటకై భార్య చోదనము చేయగా ఆమె రాజున కిట్లు మారుపల్కెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
ద్రుపదప్రశ్నే నవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
ద్రుపదుని ప్రశ్న మను నూటతొంబదియవ అధ్యాయము.

—:०:—

## ఏకనవత్యధికశతతమోఽధ్యాయః

## నూటతొంబదియొకటవ అధ్యాయము.

మహారాజ్ఞ్యా ఉత్తరం, ద్రుపదేన నగరరక్షావ్యవస్థాకరణం,
దేవారాధనం, శిఖణ్డిన్యా వనం గత్వా స్థూణాకర్ణం
ప్రతి స్వదుఃఖనివారణాయ ప్రార్థనమ్.

మహారాజ్ఞి సమాధానము, ద్రుపదుడు నగరరక్ష కేర్పాటు గావించుట,
దేవారాధనము, శిఖండిని వనమున కరిగి స్థూణాకర్ణుని
తన దుఃఖమును పోగొట్టుమని వేడుకొనుట

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

తతః శిఖణ్డినో మాతా యథాతత్త్వం నరాధిప,
ఆచచక్షే మహాబాహో భర్త్రే కన్యాం శిఖణ్డినీమ్. 1

అంత శిఖండితల్లి తన మగనికి శిఖండినిని గూర్చిన విషయ మున్న దున్నట్లు ఇట్లు చెప్పెను.

అపుత్రాయా మయా రాజన్ సపత్నీనాం భయాదిదమ్,
కన్యా శిఖణ్డినీ జాతా పురుషో వై నివేదితా. 2

రాజా! కొడుకులు లేని నేను సవతుల భయమువలన శిఖండిని ఆడుదియై పుట్టగా మగవాడని ప్రకటించితిని.

త్వయా చైవ నరశ్రేష్ఠ తన్మే ప్రీత్యానుమోదితమ్,
పుత్రకర్మ కృతం చైవ కన్యాయాః పార్థివర్షభ. 3

నరవరా! నీవును దానిని ప్రీతితో ఒప్పుకొంటివి. ఈ కన్యకకు పుత్రునకువలె సంస్కారములు గావించితివి.

భార్యా చోఢా త్వయా రాజన్ దశార్ణాధిపతేః సుతా,
మయా చ ప్రత్యభిహితం దేవవాక్యార్థదర్శనాత్,
కన్యా భూత్వా పుమాన్ భావీ త్యేవం చైత దుపేక్షితమ్. 4

నీవే దశార్ణరాజు బిడ్డను తెచ్చి పెండ్లియు చేసితివి. దేవవాక్యము తప్పునా అని యెదురుచూచుచు నేనును దాని కంగీకరించితిని. కన్య అయినను పురుషుడు కాకుండునా యని నేను దీనిని ఉపేక్షించితిని.

ఏతచ్ఛ్రుత్వా ద్రుపదో యజ్ఞసేనః
సర్వం తన్త్రం మన్త్రవిద్భ్యో నివేద్య,
మన్త్రం రాజా మన్త్రయామాస రాజన్
యథాయుక్తం రక్షణే వై ప్రజానామ్. 5

యజ్ఞసేనుడగు ద్రుపదు డామాట విని వ్యవహారము నంతటిని మంత్రులకు ఎరిగించి ప్రజల రక్షణకై తగు ఆలోచనలు గావించెను.

సంబన్ధకం చైవ సమర్థ్య తస్మిన్
దాశార్ణకే వై నృపతౌ నరేన్ద్ర,
స్వయం కృత్వా విప్రలమ్భం యథావ-
న్మన్త్రైకాగ్రో నిశ్చయం వై జగామ. 6

ఆ దశార్ణరాజు విషయమున చేసిన సంబంధమును సమర్థించుకొని, అప్పటి కేదో తగిన వంచనను గావించి ఆలోచనయందు మనసు నిలిపి ఒక నిశ్చయమునకు వచ్చెను.

స్వభావగుప్తం నగర మాపత్కాలే తు భారత,
గోపయామాస రాజేన్ద్ర సర్వతః సమలంకృతమ్. 7

అన్నియెడల చక్కని అలంకారములు గలిగి సహజముగనే రక్షణ గల తన నగరమునకు విశేషముగా రక్షణ కల్పించెను.

ఆర్తిం చ పరమాం రాజా జగామ సహ భార్యయా,
దశార్ణపతినా సార్ధం విరోధే భరతర్షభ. 8

దశార్ణరాజుతో విరోధము కలిగెనని భార్యతోకూడి దుఃఖించెను.

6. సమ్బన్ధకం సమర్థ్య - మంచితలపుతోడనే నేను చుట్టరికము చేసితిని కాని వంచనకొరకు కాదని ప్రతిపాదించి;

కథం సమ్బన్ధినా సార్ధం న మే స్యా ద్విగ్రహో మహాన్,
ఇతి సఞ్చిన్త్య మనసా దేవతా మర్చయ త్తదా. 9

చుట్టముతో పెను విరోధ మెట్లు కలుగకుండునా అని గట్టిగా చింతించి, దేవతను గొలువ నారంభించెను.

తం తు దృష్ట్వా తదా రాజన్ దేవీ దేవవరం తదా,
అర్చాం ప్రయుఞ్జాన మథో భార్యా వచన మబ్రవీత్. 10

అప్పు డాతని దేవి దైవమును నమ్మి అర్చన చేయుచున్న ఆ రాజుతో నిట్లు పలికెను.

దేవానాం ప్రతిపత్తిశ్చ సత్యం సాధుమతా సతామ్,
కిము దుఃఖార్ణవం ప్రాప్య తస్మా దర్చయతాం గురూన్. 11

శుభపరంపరలు కలవాడు కూడ ఉత్తమదేవతలను ఆరాధన చేయుచునే యుండును. దుఃఖ మను సముద్రమున బడినవాని సంగతి చెప్ప నేల? కావున నీవు గురువుల నారాధింపుము.

దైవతాని చ సర్వాణి పూజ్యన్తాం భూరిదక్షిణమ్,
అగ్నయ శ్చాపి హూయన్తాం దారార్థప్రతిషేధనే. 12

---

10. దేవీ - రాణి.

11. సాధుమతా - శుభములు కలవానిచేతను; సతామ్, దేవానామ్ - ఉత్తమ దేవతలయొక్క; ప్రతిపత్తిః - పూజ; (కర్తవ్యా - చేయదగినది). సత్యమ్ - సత్యము - ఏ ఆపదలు లేనివాడును నిజముగా దేవతలను పూజ చేయవలయు ననగా; దుఃఖార్ణవమ్ - దుఃఖ మను సముద్రమును; ప్రాప్య - పొంది; కిము - చెప్పనేల? - ఆపదలో ఉన్నవాడు దేవపూజలు చేయవలయునని వేరుగా చెప్పవలయునా? అని భావము; తస్మాత్ - ఆ కారణమున; గురూన్ - (దేవతారాధనను గూర్చి బోధించు) గురువులను; అర్చయతామ్ - పూజింపుము;

12. భూరిదక్షిణమ్ - గొప్ప దక్షిణలు కలుగునట్లుగా; ప్రతిషేధనే - మరలించుటకు;

దశార్ణరాజును త్రిప్పికొట్టుటకై పెద్ద దక్షిణలతో దైవతములను పూజింపుము. అగ్నులను వ్రేల్వుము.

అయుద్ధేన నివృత్తిం చ మనసా చిన్తయ ప్రభో,
దేవతానాం ప్రసాదేన సర్వ మేత ద్భవిష్యతి. 13

ప్రభూ! యుద్ధము కాకుండా నతడు తిరిగిపోవు మార్గమును మనసున తలపోయుము. దేవతల యనుగ్రహముతో ఇది యెల్ల కాగలదు.

మన్త్రిభి ర్మన్త్రితం సార్ధం త్వయా పృథులలోచన,
పురస్యాస్యావినాశాయ యచ్చ రాజం స్తథా కురు. 14

విశాలదృష్టి గల ఓ రాజా! మంత్రులతో నాలోచించి యీ పురమునకు చేటు మూడని విధానము కావింపుము.

దైవం హి మానుషోపేతం భృశం సిద్ధ్యతి పార్థివ,
పరస్పరవిరోధాద్ధి సిద్ధి రస్తి న చైతయోః. 15

మనుష్యయత్నముతో కూడిన దైవము మిక్కిలిగా సిద్ధి కూర్చును. ఒకరి కొకరు పగగొన్నచో ఇరువురకు సిద్ధియుండదు.

తస్మా ద్విధాయ నగరే విధానం సచివైః సహ,
అర్చయస్వ యథాకామం దైవతాని విశామ్పతే. 16

రాజా! ఆ కారణమున నగరమున చేయదగినదానిని మంత్రులతో కలసి చేసి ఇచ్చవచ్చినట్లు దేవతల నారాధింపుము.

ఏవం సంభాషమాణౌ తు దృష్ట్వా శోకపరాయణౌ,
శిఖణ్డినీ తదా కన్యా వ్రీడితేవ తపస్వినీ. 17

ఇట్లు వారిరువురు కుమిలిపోవుచు మాటాడుకొనుచుండగా చూచి అప్పుడు శిఖండిని యను నాకన్య దీనురాలై సిగ్గుతో దుఃఖపడెను.

తతః సా చిన్తయామాస మత్కృతే దుఃఖితా వుభౌ,
ఇమా వితి తతశ్చక్రే మతిం ప్రాణవినాశనే. 18

నా కొరకుగా వీరిరువురకు దుఃఖము కలిగెనని ఆమె ప్రాణములు తీసికొన నెంచెను.

ఏవం సా నిశ్చయం కృత్వా భృశం శోకపరాయణా,
నిర్జగామ గృహం త్యక్త్వా గహనం నిర్జనం వనమ్. 19

ఇట్లు నిశ్చయము చేసికొని లోలోపల మిక్కిలిగా కుమిలిపోవుచు ఇల్లు వదలి జనసంచారము లేని ఘోరారణ్యమునకు పోయెను.

యక్షేణర్ధిమతా రాజన్ స్థూణాకర్ణేన పాలితమ్,
తద్భయా దేవ చ జనో విసర్జయతి తద్వనమ్. 20

స్థూణాకర్ణుడను యక్షు డా వనమును పాలించుచుండెను. అతని భయము వలననే జనులు ఆ వనము పొంత పోరు.

తత్ర చ స్థూణభవనం సుధామృత్తికలేపనమ్,
లాజోల్లాపికధూమాఢ్య ముచ్చప్రాకారతోరణమ్. 21
తత్ ప్రవిశ్య శిఖణ్డీ సా ద్రుపదస్యాత్మజా నృప,
అనశ్నానా బహుతిథం శరీర ముదశోషయత్. 22

ఆ వనమున సున్నపుపూత కలదియు, వట్టివేళ్ళ పరిమళమును సూచించు సువాసనతో ఒప్పారునదియు, ఎత్తైన ప్రాకారములు, తోరణములు కలదియు నగు స్థూణాకర్ణుని భవనము కలదు. ద్రుపదుని కూతురగు ఆ శిఖండి దానిలో ప్రవేశించి ఆహారము కైకొనక పెక్కుదినములు దేహమును శుష్కింపజేసెను.

దర్శయామాస తాం యక్షః స్థూణో మార్దవసంయుతః,
కిమర్థోఽయం తవారమ్భః కరిష్యే బ్రూహి మా చిరమ్. 23

యక్షుడగు స్థూణు డామెను చూచి మెత్తదనముతో నీ యీ ప్రయత్న మేమి? చెప్పుము. నెరవేర్చెదను. ఆలసింపకు మని పలికెను.

అశక్య మితి సా యక్షం పునః పునరువాచ హ,
కరిష్యామీతి వై క్షిప్రం ప్రత్యువాచాఽథ గుహ్యకః. 24

---

21, సుధామృత్తిక లేపనమ్ - సుధ యనగా సున్నము. అదే మృత్తిక-మట్టి-దాని పూతకలది. లాజ-ఉల్లాపికధూమాఢ్యమ్-లాజము అనగా వట్టివేళ్ళు-ఉల్లాపన మనగా సూచించుట-వట్టివేళ్ళ సువాసనను సూచించు ధూపములతో మేలైనది - "ఉశీరే లాజ ముద్దిష్టమ్" అని విశ్వకోశము.

'అది సాధ్యము కాదులే' అని యామె మరల మరల యక్షునితో పలుక జొచ్చెను. యక్షుడు 'నేను శీఘ్రముగా చేయుదును' అని బదులు పలికెను.

ధనేశ్వరస్యానుచరో వరదోఽస్మి నృపాత్మజే,
అదేయ మపి దాస్యామి బ్రూహి యత్తే వివక్షితమ్. 25

ఓ రాజకుమారీ! నేను ధనాధిపతి కుబేరుని సేవకుడను. వరముల నీయగలవాడను. ఈయరాని దానినైనను ఇత్తును. నీవు చెప్పగోరెడి దేమో చెప్పుము - అనెను.

తతః శిఖణ్డీ తత్ సర్వ మఖిలేన న్యవేదయత్,
తస్మై యక్షప్రధానాయ స్థూణాకర్ణాయ భారత. 26

అంత నా శిఖండి ఆ యక్షముఖ్యుడగు స్థూణాకర్ణునకు తన వృత్తాంత మంతయు నెరిగించెను.

శిఖణ్డ్యు వాచ - శిఖండి యిట్లు పలికెను.

అపుత్రో మే పితా యక్ష న చిరా న్నాశ మేష్యతి,
అభియాస్యతి సక్రోధో దశార్ణాధిపతి ర్హి తమ్. 27

యక్షా! కొడుకులు లేని నా తండ్రి కొలదికాలములో చావనున్నాడు. దశార్ణరాజు పట్టరాని కోపముతో నాతనిపై దండెత్తి రానున్నాడు.

మహాబలో మహోత్సాహః సహేమకవచో నృపః,
తస్మా ద్రక్షస్వ మాం యక్ష మాతరం పితరం చ మే. 28

బంగారుకవచము గల ఆ రాజు గొప్పబలము కలవాడు, గొప్ప ఉత్సాహము కలవాడు. కావున నన్ను, నా తల్లిని, నా తండ్రిని కాపాడుము.

ప్రతిజ్ఞాతో హి భవతా దుఃఖప్రతిశమో మమ,
భవేయం పురుషో యక్ష త్వత్ప్రసాదా దనిన్దితః. 29

యక్షా! నా దుఃఖమునకు విరుగుడును గూర్చి నీవు మాట యిచ్చితివి. నీ దయవలన నేను మగవాడనై నిందలేనివాడ నగుదును.

యావదేవ స రాజా వై నోపయాతి పురం మమ,
తావదేవ మహాయక్ష ప్రసాదం కురు గుహ్యక. 30

ఆ రాజు మా పురమును ముట్టడింపకమున్ను మహాయక్షా! నాపై అనుగ్రహము చూపుము..

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
స్థూణాకర్ణసమాగమే ఏకనవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
స్థూణాకర్ణుని కలయిక యను నూటతొంబదియొకటవ అధ్యాయము.

—: o :—

# ద్వినవత్యధికశతతమోఽధ్యాయః

# నూటతొంబదిరెండవ అధ్యాయము

శిఖణ్డినః పురుషత్వప్రాప్తిర్ద్రుపదహిరణ్యవర్మణోర్హర్షః, స్థూణాకర్ణం ప్రతి కుబేరస్య శాపో భీష్మస్య 'శిఖణ్డినం న హనిష్యామి' ఇతి ప్రతిజ్ఞా.

శిఖండికి మగతనము వచ్చుట, ద్రుపదహిరణ్యవర్మలు సంతసించుట, స్థూణాకర్ణునికి కుబేరుడు శాపమొసగుట, భీష్ముడు శిఖండిని చంపనని ప్రతిజ్ఞచేయుట.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

శిఖణ్డివాక్యం శ్రుత్వాఽథ స యక్షో భరతర్షభ,
ప్రోవాచ మనసా చిన్త్య[1] దైవేనోపనిపీడితః. 1

ఆ యక్షుడు శిఖండిమాట విని మనసున చింతించి, దైవము నెత్తిపై మొత్తుచుండగా, నిట్లు పలికెను.

భవితవ్యం తథా తద్ధి మమ దుఃఖాయ కౌరవ,
భద్రే కామం కరిష్యామి సమయం తు నిబోధ మే. 2

నాయనా! కురుకుమారా! నన్ను దుఃఖపెట్టుటకై జరుగవలసినది యట్లున్నది కనుక ఆ యక్షుడు ఆ శిఖండితో ఇట్లు పలికెను. ఓ కాంతా! నీకోరిక నెరవేర్చెదను. కాని దీనికొక కట్టుబా టున్నది. వినుము.

కిఞ్చిత్ కాలాన్తరే దాస్యే పుంలింగం స్వమిదం తవ,
ఆగన్తవ్యం త్వయా కాలే సత్యం చైవ వదస్వ మే. 3

నీకు కొంతకాలము అవధిగా నా మగతనము నొసగెదను. ఆ కాలము ముగిసినపిదప నీవు రావలయును. ఈ సత్యమును పాటింతునని చెప్పుము.

---

1. చిన్త్య - ఇది 'చిన్తయిత్వా' అనుదానికి ఆర్షప్రయోగము.

ప్రభుః సంకల్పసిద్ధోఽస్మి కామచారీ విహఙ్గమః,
మత్ప్రసాదాత్ పురం చైవ త్రాహి బన్ధూంశ్చ కేవలమ్. 4

నేను ఏపనికైనను సమర్థుడను, సంకల్ప సిద్ధుడను. కోరినచోటిన పోగల వాడను. ఆకసమున తిరుగుదును. నా అనుగ్రహముతో నీపురమును బంధువులను కాపాడుకొనుము.

స్త్రీలిఙ్గం ధారయిష్యామి తదేవం పార్థివాత్మజే,
సత్యం తే ప్రతిజానీహి కరిష్యామి ప్రియం తవ. 5

ఓ రాచబిడ్డా! నీ స్త్రీలింగమును నేను ధరింతును. సత్యమును నిలబెట్టుకొనుము. నీకు ప్రియ మొనరింతును.

శిఖణ్డ్యువాచ - శిఖండి యిట్లనెను.

ప్రతిదాస్యామి భగవన్ పుంలిఙ్గం తవ సువ్రత,
కిఞ్చిత్కాలాన్తరం స్త్రీత్వం ధారయస్వ నిశాచర. 6

ఓ భగవానుడా! నీ పుంలింగమును నీకు తిరిగి యిచ్చెదను. కొంచెము కాలము నా ఆడుదనము నీవు వహింపుము.

ప్రతియాతే దశార్ణే తు పార్థివే హేమవర్మణి,
కన్యైవ హి భవిష్యామి పురుషస్త్వం భవిష్యసి. 7

దశార్ణరాజు హేమవర్మ మరలిపోయిన వెనుక నేను కన్యనే యగుదును. నీవు పురుషుడ వగుము.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా సమయం తత్ర చక్రాతే తావుభౌ నృప.
అన్యోన్యస్యాభిసందేహే తౌ సంక్రామయతాం తతః. 8

---

4. ఇందలి విశేషణము లన్నియు 'నీవు మోసగించినచో తప్పించుకొనలేవు సుమా!' అను, హెచ్చరికను సూచించుచున్నవి. విహఙ్గమః-ఆకాశమున సంచరించువాడు.

8. అభిసందేహే - ఇచట సందేహము లనగా లింగములు - రతికాలమున వృద్ధిపొందునవి అని యర్థము. దిహ ధాతువునకు వృద్ధిపొందుట అర్థము. 'అభిసందోహే' అను పాఠమున "సందుహ్యతే ప్రజా ఆభ్యామ్"-సంతానము వీనివలన ఉత్పత్తి యగునను వ్యుత్పత్తితో లింగము లనియే యర్థము.

ఇట్లు పలికికొని వారిరువురు నియమ మేర్పరచుకొనిరి. పిదప వారిరువురు లింగములను మార్చుకొనిరి.

స్త్రీలిఙ్గం ధారయామాస స్థూణాయక్షోఽథ భారత,
యక్షరూపం చ తద్దీప్తం శిఖణ్డీ ప్రత్యపద్యత. 9

అంత స్థూణాకర్ణుడు స్త్రీలింగమును ధరించెను. అతనిదగు దీప్తమైన యక్షరూపమును శిఖండి పొందెను.

తతః శిఖణ్డీ పాఞ్చాల్యః పుంస్త్వ మాసాద్య పార్థివ,
వివేశ నగరం హృష్టః పితరం చ సమాసదత్. 10

అంత పాంచాలుని కొడుకు శిఖండి మగతనము పొంది పొంగిపోవుచు పురము చేరెను. తండ్రికడ కరిగెను.

యథావృత్తం తు తత్సర్వ మాచఖ్యౌ ద్రుపదస్య తత్,
ద్రుపద స్తస్య తచ్ఛ్రుత్వా హర్ష మాహారయత్ పరమ్. 11

ద్రుపదున కా విషయమంతయు ఉన్నదున్నట్లు చెప్పెను. ద్రుపదు డది విని పరమసంతోషము పొందెను.

సభార్య స్తచ్చ సస్మార మహేశ్వరవచ స్తదా,
తతః సంప్రేషయామాస దశార్ణాధిపతే ర్నృపః. 12

భార్యతోపాటు మహేశ్వరుని వచనము నప్పుడు తలపునకు తెచ్చుకొనెను. పిదప ఆ రాజు దశార్ణరాజునకు కబురు పెట్టెను.

పురుషోఽయం మమ సుతః శ్రద్ధత్తాం మే భవానితి,
అథ దాశార్ణకో రాజా సహసాఽభ్యగమ త్తదా. 13

నా కొడుకు మగవాడే. నీవు నిరూపించుకొనవచ్చును అని వార్త పెట్టగా దశార్ణరాజు వడివడిగా అక్కడకు వచ్చెను.

పఞ్చాలరాజం ద్రుపదం దుఃఖశోకసమన్వితః,
తతః కామ్పిల్య మాసాద్య దశార్ణాధిపతి స్తతః. 14

దశార్ణరాజు పెనుదుఃఖముతో క్రుంగి పోవుచు కాంపిల్య నగరమునకు వచ్చి ద్రుపదరాజుకడ కరిగెను.

ప్రేషయామాస సత్కృత్య దూతం బ్రహ్మవిదాం వరమ్,
బ్రూహి మద్వచనా ద్దూత పాఞ్చాల్యం తం నృపాధమమ్. 15
యన్మే కన్యాం స్వకన్యార్థే వృతవానసి దుర్మతే,
ఫలం తస్యావలేపస్య ద్రక్ష్యస్యద్య న సంశయః. 16

ఆ రాజు వేదవేత్తలలో శ్రేష్ఠుడగు దూతను ద్రుపదుని కడకు పంపెను. 'ఓయీ! రాజాధముడగు ద్రుపదునితో - ఓయి దుర్బుద్ధీ! నా కన్యను నీ కన్య కొరకు వరించితివి. ఆ పొగరుబోతుతనమునకు ఇప్పుడే ఫల మనుభవించెదవు. సందియము లేదు'- అని పాంచాలరాజుతో చెప్పు మనెను.

ఏవముక్తశ్చ తేనాసౌ బ్రాహ్మణో రాజసత్తమ,
దూతః ప్రయాతో నగరం దాశార్ణనృపచోదితః. 17

దశార్ణరా జిట్లు చెప్పి పంపగా ఆ బ్రాహ్మణుడు పాంచాలరాజు నగరమునకు బయలుదేరెను.

తత ఆసాదయామాస పురోధా ద్రుపదం పురే.

అంత నా పురోహితుడు ద్రుపదుని పురమున నాతనిని చేరుకొనెను.

తస్మై పాఞ్చాలకో రాజా గామర్ఘ్యం చ సుసత్కృతమ్, 18
ప్రాపయామాస రాజేన్ద్ర సహ తేన శిఖణ్డినా.

పాంచాలరాజు శిఖండితో కలిసి ఆ బ్రాహ్మణునకు మంచి మన్ననగల ఆవును, పూజాద్రవ్యములను అందించెను.

తాం పూజాం నాభ్యనన్దత్ స వాక్యం చేద ముదాచ హ. 19

ఆ బ్రాహ్మణుడు ఆపూజ నంగీకరింపక యిట్లు పలికెను.

యదుక్తం తేన వీరేణ రాజ్ఞా కాఞ్చనవర్మణా,
యత్తేఽహ మధమాచార దుహిత్రాఽస్మ్యభివఞ్చితః. 20

ఆ రాజు కాంచనవర్మ చెప్పిన దానినే యిట్లు చెప్పెను: ఓయీ! అధమాచారా! నీ కూతుతో నన్ను వంచించితివి.

తస్య పాపస్య కరణాత్ ఫలం ప్రాప్నుహి దుర్మతే,
దేహి యుద్ధం నరపతే మమాద్య రణమూర్ధని. 21

దుర్మతీ! ఆ పాపము చేసిన దానికి ఫల మనుభవింపుము. నేడు రణ రంగమున నాతో పోరు సల్పుము.

ఉద్ధరిష్యామి తే సద్యః సామాత్యసుతబాన్ధవమ్,
తదుపాలమ్భసంయుక్తం శ్రావితః కిల పార్థివః. 22
దశార్ణపతినా చోక్తో మన్త్రిమధ్యే పురోధసా.

నిన్ను నీమంత్రులతో కొడుకులతో చుట్టములతో నాశనము చేసి వైచెదను-అని దశార్ణరాజు నిందతో కూడిన పలుకులను ఆ పురోహితుడు మంత్రుల నడుమ రాజునకు వినిపించెను.

అభవద్ భరతశ్రేష్ఠ ద్రుపదః ప్రణయానతః. 23

భరతశ్రేష్ఠా! ద్రుపదు డా బ్రాహ్మణునకు మక్కువతో వినయము చూపిన వాడాయెను.

యదాహ మాం భవాన్ బ్రహ్మన్ సమ్బన్ధివచనా ద్వచః,
అస్యోత్తరం ప్రతివచో దూతో రాజ్ఞే వదిష్యతి. 24

బ్రాహ్మణా! నా చుట్టము మాటను నీవు నాకు చెప్పితివి. దానికి బదులైన మేలుమాట నా దూత రాజునకు తెలుపును.

తతః సంప్రేషయామాస ద్రుపదోఽపి మహాత్మనే,
హిరణ్యవర్మణే దూతం బ్రాహ్మణం వేదపారగమ్. 25

పిదప ద్రుపదుడు మహాత్ముడగు హిరణ్యవర్మకడకు వేదములం దారి తేరిన ఒక బ్రాహ్మణుని దూతగా పంపెను.

త మాగమ్య తు రాజానం దశార్ణాధిపతిం తదా,
తద్వాక్య మాదదే రాజన్ యదుక్తం ద్రుపదేన హ. 26

అతడా దశార్ణరాజు కడ కరిగి ద్రుపదుడు చెప్పిన వాక్యమును తెలిపెను.

ఆగమః క్రియతాం వ్యక్తః కుమారోఽయం సుతో మమ,
మిథ్యైత దుక్తం కేనాపి తదశ్రద్ధేయ మిత్యుత. 27

---

24. ఉత్తరమ్ - మిక్కిలి మేలైన; ప్రతివచః - బదులు మాట;
27. ఆగమః - పరీక్ష.

అయ్యా! పరీక్ష సేయింపుము. నా కొడుకు స్పష్టముగా మగవాడే. ఎవరో కానిమాట పలికిరి. దానిని నమ్మవలదు. అని చెప్పెను.

తతః స రాజా ద్రుపదస్య శ్రుత్వా
విమర్శయుక్తో యువతీ ర్వరిష్ఠాః,
సంప్రేషయామాస సుచారురూపాః
శిఖణ్డినం స్త్రీ పుమా న్వేతి వేత్తుమ్. 28

అంత నారాజు మెలకువగా ఆలోచించి చక్కని అందచందములు గల మేలుజాతి యువతులను శిఖండి ఆడుదియో మగవాడో నిర్ణయించుటకు ద్రుపదుని కడకు పంపెను.

తాః ప్రేషితా స్తత్త్వభావం విదిత్వా
ప్రీత్యా రాజ్ఞే తచ్ఛశంసు ర్హి సర్వమ్,
శిఖణ్డినం పురుషం కౌరవేన్ద్ర
దాశార్ణరాజాయ మహానుభావమ్. 29

అట్లు దశార్ణరాజు పంపిన స్త్రీలు నిజము పరికించి శిఖండి మహానుభావు డగు మగవాడని దశార్ణరాజునకు తెలియజేసిరి.

తతః కృత్వా తు రాజా స ఆగమం ప్రీతిమానథ,
సమ్బన్ధినా సమాగమ్య హృష్టో వాస మువాస హ. 30

అంత నా రాజు అట్లు పరీక్ష కావించి ప్రీతినొంది వియ్యమువానితో కలిసి సంతోషపడి యచట కొన్ని నాళ్లు నిలిచియుండెను.

శిఖణ్డినే చ ముదితః ప్రాదా ద్విత్తం జనేశ్వరః,
హస్తినోఽశ్వాంశ్చ గాశ్చైవ దాస్యోఽథ బహులా స్తథా. 31

మరియు నారాజు శిఖండికి గొప్పధనము, ఏనుగులు, గుఱ్ఱము, పాడి బఱ్ఱెలు పెల్లుగా నిచ్చెను.

పూజితశ్చ ప్రతియయౌ నిర్భర్త్స్య తనయాం కిల.

---

31. బహులాః - మంచిపాలు గలవి;

వారిచేత మన్ననలు గొని దశార్ణరాజు కూతును కోపపడి తన నగర
మున కరిగెను.

విసీతకల్బిషే ప్రీతే హేమవర్మణి పార్థివే, 32
ప్రతియాతే దశార్ణే తు హృష్టరూపా శిఖణ్డినీ.

దశార్ణరాజు హేమవర్మ కోపము తీరి తిరిగి పోగా శిఖండి సంతసించెను.

కస్యచిత్త్వథ కాలస్య కుబేరో నరవాహనః,
లోకయాత్రాం ప్రకుర్వాణః స్థూణస్యాగా న్నివేశనమ్. 33

అట్లు కొంతకాలము గడువగా నరవాహనుడగు కుబేరుడు లోకయాత్ర
చేయుచు స్థూణుని నెలవునకు వచ్చెను.

స తద్గృహ స్యోపరి వర్తమాన
ఆలోకయామాస ధనాధిగోప్తా,
స్థూణస్య యక్షస్య వివేశ వేశ్మ
స్వలంకృతం మాల్యగుణై ర్విచిత్రైః. 34

ధనాధిపతి అతని ఇంటిపై తిరుగుచు చక్కని పూలమాలలతో విరాజిల్లు
చున్న అతని భవనమును ప్రవేశించెను.

లాజైశ్చ గన్ధైశ్చ తథా వితానై
రభ్యర్చితం ధూపనధూపితం చ,
ధ్వజైః పతాకాభి రలంకృతం చ
భక్ష్యాన్న పేయామిషద న్తహోమమ్. 35

---

35 లాజైః - వడ్లి వ్రేళ్లనుండి పుట్టిన; భక్ష్యము లనగా లడ్డుకముల వంటి పదార్థములు. అన్నము లనగా నమిలి మ్రింగదగిన ఓదనములు; పేయము లనగా ద్రవరూపమున నున్న మద్యపదార్థములు; ఆమిష మనగా మాంసపదార్థములు; నిజమున కివి భక్ష్యములలో చేర్చదగినవే అయినను, వానికంటె వెలగలవి యగుటచే వేరుగా చెప్పుట జరిగినది; దంతహోమము లనగా దంతములతో తినదగిన వను నర్థమున తినుటకు యోగ్యమైన సర్వపదార్థములు - ఇవి యెందు కలవో అది భక్ష్యాన్న పేయామిషదంతహోమము.

ఆయింట వట్టివ్రేళ్ల సుగంధముగల ధూపములు అలరారుచుండెను. ధ్వజ స్తంభములపై పతాకలు విరాజిల్లుచుండెను. భక్ష్యములు, అన్నములు, పానీయములు, మాంస భోజనములు, మొదలగు దంతహోమములు కానవచ్చుచుండెను.

తత్స్థానం తస్య దృష్ట్వా తు సర్వతః సమలఙ్కృతమ్,
మణిరత్నసువర్ణానాం మాలాభిః పరిపూరితమ్. 36
నానాకుసుమగన్ధాఢ్యం సిక్తసమ్మృష్టశోభితమ్,
అథాబ్రవీ ద్యక్షపతి స్తాన్ యక్షా ననుగాం స్తదా. 37

అట్లు అన్నివైపుల చక్కని అలంకారములు గలదియు మణుల రత్నముల సువర్ణముల మాలలతో నిండినదియు, పెక్కు విధములగు పూలవాసనలతో ఒప్పుచున్నదియు, మేలైన పూతలతో విరాజిల్లునదియు నగు ఆ గృహమును జూచి యక్షరాజు కుబేరుడు తనవెంట వచ్చిన సేవకులతో నిట్లనెను:

స్వలంకృత మిదం వేశ్మ స్థూణ స్యామితవిక్రమాః,
నోపసర్పతి మాం చైవ కస్మా దద్య స మన్దధీః. 38

మహావీరులారా! స్థూణుని యీ భవనము చక్కని అలంకారముతో నొప్పుచున్నది. కాని ఆ బుద్ధిహీనుడు ఇపుడే కారణమున నా కడకు రాకున్నాడు?

యస్మా జ్జానన్ స మన్దాత్మా మామసౌ నోపసర్పతి,
తస్మా త్తస్మై మహాదణ్డో ధార్యః స్యాదితి మే మతిః. 39

తెలిసి తెలిసి ఆ బుద్ధి తక్కువవాడు నాకడకు రాకున్నాడు. అందువలన వానికి పెద్దశిక్ష వేయవలయునని నాకనిపించుచున్నది.

యక్షా ఊచుః - యక్షు లిట్లు పలికిరి.

ద్రుపదస్య సుతా రాజన్ రాజ్ఞో జాతా శిఖణ్డినీ,
తస్యా నిమిత్తే కస్మింశ్చిత్ ప్రాదాత్ పురుషలక్షణమ్. 40

రాజా! ద్రుపదునికి శిఖణ్డిని యను నొక కన్య పుట్టినది. ఒకానొక కారణమున నీత డామెకు తన మగతన మిచ్చెను.

---

''అమిష మప్రమేయమ్'' అని యొక పాఠము - అది అర్థరహిత మగుటచే మూర్ఖకల్పిత మని నీలకంఠుడు.

అగ్రహీ ల్లక్షణం స్త్రీణాం స్త్రీభూత స్తిష్ఠతే గృహే,
నోపసర్పతి తేనాసౌ సవ్రీడః స్త్రీసరూపవాన్. 41

ఇతడు ఆడు లక్షణములు గ్రహించెను. అట్లు స్త్రీయై సిగ్గుతో ఇంటనే నిలిచి నీకడ కతడు రాకున్నాడు.

ఏతస్మాత్ కారణా ద్రాజన్ స్థూణో న త్వాద్య సర్పతి,
శ్రుత్వా కురు యథాన్యాయం విమాన మిహ తిష్ఠతామ్. 42

రాజా! ఈ కారణమున స్థూణుడు నీకడకు రాకున్నాడు. ఈ విషయము విని తగినట్లు చేయుము. విమాన మిచట నిలుచునుగాక!

ఆనీయతాం స్థూణ ఇతి తతో యక్షాధిపోఽబ్రవీత్,
కర్తాస్మి నిగ్రహం తస్య ప్రత్యువాచ పునః పునః. 43

అంత యక్షరాజు కుబేరుడు 'ఆ స్థూణుని నాకడకు తీసికొని రండు. వానిని శిక్షించెదను— అని మరల మరల పలుకజొచ్చెను.

సోఽభ్యగచ్ఛత యక్షేన్ద్ర మాహూతః పృథివీపతే,
స్త్రీసరూపో మహారాజ తస్థౌ వ్రీడాసమన్వితః. 44

అంత స్థూణుడు ఆడంగిరూపముతో సిగ్గు పడుచు కుబేరుని పిలుపుపై అతనికడకు వచ్చెను.

తం శశాపాథ సంక్రుద్ధో ధనదః కురునన్దన,
ఏవమేవ భవత్వద్య స్త్రీత్వం పాపస్య గుహ్యకాః. 45

పెల్లురేగిన కోపముతో ధనాధిపతి 'యక్షులారా! ఈ పాపికి ఈ ఆడుతన మిట్లే యుండుగాక'— అని శపించెను.

తతోఽబ్రవీ ద్యక్షపతి ర్మహాత్మా
యస్మా దదా స్త్వవమన్యేహ యక్షాన్,
శిఖణ్డినో లక్షణం పాపబుద్ధేః
స్త్రీలక్షణం చాగ్రహీః పాపకర్మన్. 46

---

41. తిష్ఠతే గృహే - ఇచటనే కదలకున్నాడు.
42. త్వాఽద్య - త్వా - త్వామ్ - నిన్ను;

అంత యక్షరాజు స్థూణునితో ఇట్లు పలికెను. ఓరీ పాపకర్ముడా! నీవు యక్షులను అవమానించి పాపబుద్ధి యగు ఆ శిఖండికి నీ మగలక్షణ మొసగితివి. వాని ఆడులక్షణము కొంటివి.

అప్రవృత్తం సుదుర్బుద్ధే యస్మా దేత త్త్వయా కృతమ్,
తస్మా దద్యప్రభృత్యేవ స్త్రీ త్వం సా పురుష స్తథా. 47

ఓరీ బుద్ధిలేనివాడా ! నీ విట్లు జరుగరాని దానిని చేసితివి కనుక నేటి నుండి నీవు ఆడుదానవే యగుము ఆది పురుషుడే యగును.

తతః ప్రసాదయామాసు ర్యక్షా వైశ్రవణం కిల,
స్థూణ స్యార్థే కురుష్వా న్తం శాప స్యేతి పునః పునః. 48

అంత యక్షులు కుబేరుని స్థూణుని విషయమున శాపమునకు అంతము ననుగ్రహింపుమని మరల మరల బ్రతిమాలిరి.

తతో మహాత్మా యక్షేన్ద్రః ప్రత్యువా చానుగామినః,
సర్వాన్ యక్షగణాం స్తాత శాపస్యా న్తచికీర్షయా. 49

అంత మహాత్ము డగు యక్షరాజు అటనున్న తన అనుచరులగు యక్షుల నందరిని చూచి శాపమునకు హద్దు చేయగోరినవాడై యిట్లు పలికెను.

శిఖణ్డిని హతే యక్షాః స్వం రూపం ప్రతిపత్స్యతే,
స్థూణో యక్షో నిరుద్వేగో భవత్వితి మహామనాః. 50

యక్షులారా ! శిఖండి చచ్చినపుడు ఈ స్థూణుడు తన రూపమును తిరిగి పొందును. వాడు కలత పడవలదు- అని పెద్ద మనసు పెట్టి పలికెను.

ఇత్యుక్త్వా భగవాన్ దేవో యక్షరాజః సుపూజితః,
ప్రయయౌ సహితః సర్వై ర్నిమేషా న్తరచారిభిః. 51

ఇట్లు పలికి యక్షరాజగు కుబేరభగవానుడు వారి పూజలు గొని తన యనుచరులతో కలిసి వెడలిపోయెను.

స్థూణస్తు శాపం సంప్రాప్య తత్రైవ న్యవస త్తదా,
సమయే చాగమ త్తూర్ణం శిఖణ్డీ తం క్షపాచరమ్. 52

ఇట స్థూణుడు శాపము పొంది అందే నివసింపుచుండెను. తగు సమయమున శిఖండియు వడిగా ఆ యక్షుని కడకు వచ్చెను.

సోఽభిగమ్యాబ్రవీ ద్వాక్యం ప్రాప్తోఽస్మి భగవన్నితి,
తమబ్రవీ త్తతః స్థూణః ప్రీతోఽస్మీతి పునః పునః. 53

అట్లు వచ్చి పూజ్యుడా! నేను వచ్చితి నని పలికెను. స్థూణుడును ప్రీతుడనైతి నని మరల మరల పలికెను.

ఆర్జవే నాగతం దృష్ట్వా రాజపుత్రం శిఖణ్డినమ్,
సర్వమేవ యథావృత్త మాచచక్షే శిఖణ్డినే. 54

మాటకు కట్టుబడి వచ్చిన రాజపుత్రుని శిఖండిని చూచి యక్షుడు అతనికి జరిగినదంతయు చెప్పెను.

యక్ష ఉవాచ : యక్షు డిట్లు పలికెను.

శప్తో వైశ్రవణే నాహం త్వత్కృతే పార్థివాత్మజ,
గచ్ఛేదానీం యథాకామం చర లోకాన్ యథాసుఖమ్. 55

రాజకుమారా! నీవు కారణముగా నేను కుబేరునివలన శాప మొందితిని. ఇప్పుడు నీయిచ్చవచ్చిన చొప్పున నరుగుము. సుఖముగా లోకములందు తిరుగుము.

దిష్ట మేతత్ పురా మన్యే న శక్య మతివర్తితుమ్,
గమనం తవ చేతో హి పౌలస్త్యస్య చ దర్శనమ్. 56

నీ విటనుండి వెడలుట, అటు కుబేరుడు కానవచ్చుట ఇది యంతయు దాటశక్యము కాని భాగధేయ మనుకొందును.

భీష్మ ఉవాచ – భీష్మ డిట్లు చెప్పెను.

ఏవ ముక్తః శిఖణ్డీ తు స్థూణయక్షేణ భారత,
ప్రత్యాజగామ నగరం హర్షేణ మహతా తవ. 57

స్థూణయక్షుడు శిఖండితో నిట్లు పలుకగా అతడు గొప్ప ఆనందముతో తన నగరమునకు తిరిగివచ్చెను.

పూజయామాస వివిధై ర్గన్ధమాల్యై ర్మహాధనైః,
ద్విజాతీన్ దేవతాశ్చైవ చైత్యానథ చతుష్పథాన్. 58

గంధములతో, మాల్యములతో, గొప్పధనముతో బ్రాహ్మణులను దేవతలను, భిక్షుకులను, చప్పరము అందలి జనులను పూజించెను.

ద్రుపదః సహపుత్రేణ సిద్ధార్థేన శిఖణ్డినా,
ముదం చ పరమాం లేభే పాఞ్చాల్యః సహ బాన్ధవైః. 59

ద్రుపదుడు కార్యము నెరవేరిన కొడుకుతో బంధువులతో కలసి పరమానంద మందెను.

శిష్యార్థం ప్రదదౌ చాథ ద్రోణాయ కురుపుఙ్గవ,
శిఖణ్డినం మహారాజ పుత్రం స్త్రీపూర్విణం తథా. 60

కుమారుడగు శిఖండి ముందు ఆడుదిగా నున్న వానిని శిష్యునిగా కైకొనవలసినదిగా కోరి ద్రోణున కప్పగించెను.

ప్రతిపేదే చతుష్పాదం ధనుర్వేదం నృపాత్మజః,
శిఖణ్డీ సహ యుష్మాభి ర్ధృష్టద్యుమ్నశ్చ పార్షతః. 61

ఆ రాజకుమారుడు మీ యందరితోపాటు నాలుగుపాదములు గల ధనుర్వేదమును సాధించెను. అట్లే ద్రుపదుని మరియొక కుమారుడు ధృష్టద్యుమ్నుడును నేర్చెను.

మమ త్వేత చ్చరా స్తాత యథావత్ ప్రత్యవేదయన్,
జడాన్ధబధిరాకారా యే ముక్తా ద్రుపదే మయా. 62

జడులవలె, గ్రుడ్డివారివలె, చెవిటివారివలె రూపములు ధరించిన నా గూఢచారులు నేను ద్రుపదపురమునకు పంపగా నీ వృత్తాంత మంతయు ఉన్నదున్నట్లు నా కెరిగించిరి.

ఏవ మేష మహారాజ స్త్రీపుమాన్ ద్రుపదాత్మజః,
స సంభూతః కురుశ్రేష్ఠ శిఖణ్డీ రథసత్తమః. 63

---

61. చతుష్పాదమ్ - విద్యను గ్రహించుట, దానిని హృదయమున జారిపోకుండ పట్టుకొనుట, ప్రయోగించుట, ఇతరులు ప్రయోగింపగా త్రిప్పికొట్టుట అనునవి ధనుర్విద్యలో నాలుగు పాదములు - అవి కలడి.

మహారాజా! దుర్యోధనా! ఇట్లు స్త్రీ పురుషుడైన ఈ శిఖండి రథికులలో శ్రేష్ఠుడాయెను.

జ్యేష్ఠా కాశిపతేః కన్యా అమ్బా నామేతి విశ్రుతా,
ద్రుపదస్య కులే జాతా శిఖణ్డీ భరతర్షభ. 64

ఇట్లు కాశిరాజుకన్య అంబ యను పేరు గలది ద్రుపదుని యింట శిఖండిగా బుట్టెను.

నాహమేనం ధనుష్పాణిం యుయుత్సుం సముపస్థితమ్,
ముహూర్త మపి పశ్యేయం ప్రహరేయం న చాప్యుత. 65

ఈతడు యుద్ధమాదగోరి విల్లు చేతగొని నా యెదుట నిలిచినచో క్షణమేని వానిని చూడను. వానిపై బాణము ప్రయోగింపను.

వ్రత మేత న్మమ సదా పృథివ్యామపి విశ్రుతమ్,
స్త్రియా స్త్రీపూర్వకే చైవ స్త్రీనామ్ని స్త్రీసరూపిణి. 66
న ముఞ్చేయ మహం బాణ మితి కౌరవనన్దన,
న హన్యామహ మేతేన కారణేన శిఖణ్డినమ్. 67

రాజా! లోకము లెల్ల బాగుగా ఎరిగిన నా వ్రతమును ఇట్టిదియే కదా! స్త్రీయందు, ముందు స్త్రీయై పిదప మగవాడైన వానియందు, స్త్రీపేరు కలవాని యందు, స్త్రీవంటి రూపము కలవానియందు నేను బాణము వదలను. ఈ కారణము చేత నేను శిఖండిని చంపను.

ఏత త్తత్త్వ మహం వేద జన్మ తాత శిఖణ్డినః,
తతో నైనం హనిష్యామి సమరే ష్వాతతాయినమ్. 68

ఆ శిఖండి జననమును గూర్చి నేను సత్యమంతయు నెరిగితిని. కావున నాతడు యుద్ధములలో నెన్ని ఘోరములు చేసినను వానిని చంపను.

యది భీష్మః స్త్రియం హన్యాత్ సన్తః కుర్యు ర్విగర్హణమ్,
నైనం తస్మా ద్ధనిష్యామి దృష్ట్వాఽపి సమరే స్థితమ్. 69

భీష్ముడొక ఆడుదానిని చంపినచో సజ్జనులు నిందితురు. కావున యుద్ధమున నిలిచిన అతనిని చూచియు వానిని నేను చంపను.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏత చ్ఛ్రుత్వా తు కౌరవ్యో రాజా దుర్యోధన స్తదా,
ముహూర్త మివ స ధ్యాత్వా భీష్మే యుక్త మమన్యత. 70

కురువంశమువా డగు రాజు దుర్యోధను డిది విని ఒక్కక్షణ మాలోచించి భీష్ముని విషయమున నది తగినదే యని తలపోసెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
శిఖణ్డిపుం స్త్వప్రాప్తౌ ద్వినవత్యధికశతతమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
శిఖండికి మగతనము కలుగుట యను నూటతొంబదిరెండవ
అధ్యాయము.

—:o:—

70. యుక్తమ్ - స్త్రీలతో యుద్ధము చేయకుండుట అనునది తగినదని భావము.

## త్రినవత్యధికశతతమోఽధ్యాయః
## నూటతొంబదిమూడవ అధ్యాయము

దుర్యోధనేన పృష్టై ర్భీష్మప్రభృతిభిః స్వశక్తీనాం వర్ణనమ్.

దుర్యోధను డడుగగా భీష్ముడు మొదలగువారు తమ శక్తులను వివరించుట.

సంజయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

ప్రభాతాయాం తు శర్వర్యాం పునరేవ సుత స్తవ,
మధ్యే సర్వస్య సైన్యస్య పితామహ మపృచ్ఛత. 1

రాత్రి గడచిన పిమ్మట నీ కొడుకు మరల సర్వసైన్యము నడుమ తాత నిట్లడిగెను.

పాణ్డవేయస్య గాఙ్గేయ యదేతత్ సైన్య ముద్యతమ్,
ప్రభూతనరనాగాశ్వం మహారథసమాకులమ్. 2

గంగాతనయా! ఇదిగో ఈ పాండవుని సైన్యము యుద్ధమునకు సిద్ధమై యున్నది. పెద్ద సంఖ్యలో నరులు, ఏనుగులు, గుఱ్ఱములు కలిగి మహారథులతో నిండియున్నది.

భీమార్జునప్రభృతిభి ర్మహేష్వాసై ర్మహాబలైః,
లోకపాలసమై ర్గుప్తం ధృష్టద్యుమ్నపురోగమైః. 3

మరియు లోకపాలురవంటి గొప్ప ధానుష్కులు మహాబలులు ధృష్టద్యుమ్నుని ముందిడుకొనినవారు నగు భీముడు, అర్జునుడు మొదలగువారు దానిని కాపాడుచున్నారు.

అప్రధృష్య మనావార్య ముద్ధూత మివ సాగరమ్,
సేనాసాగర మక్షోభ్య మపి దేవై ర్మహాహవే. 4

ఈ సేన యనెడు సముద్రము అల్లకల్లోలముగా విజృంభించిన మహాసముద్రము వలె అణపరానిదై, నిలువరింపరానిదై యున్నది. మహాయుద్ధమున దేవతలుకూడ దీనికి క్షోభ కలిగింప జాలరు.

కేన కాలేన గాఙ్గేయ క్షపయేథా మహాద్యుతే,
ఆచార్యో వా మహేష్వాసః కృపో వా సుమహాబలః. 5

మహాతేజస్వీ! నీవు ఈ సేనను ఎంతకాలములో రూపు మాపగలవు? మహా ధానుష్కుడగు ద్రోణుడు, గొప్ప బలముగల కృపుడు ఎంతకాలములో దీనిని నాశనము చేయుదురు?

కర్ణో వా సమరశ్లాఘీ ద్రౌణి ర్వా ద్విజసత్తమః,
దివ్యాస్త్రవిదుషః సర్వే భవన్తో హి బలే మమ. 6

యుద్ధ మన్నచో పొంగిపోవు కర్ణుడు, బ్రాహ్మణోత్తము డగు అశ్వత్థామ, నాసేనయం దున్నవారగు దివ్యాస్త్రము లెరిగిన మీరందరు ఎంత కాలములో దీనిని మట్టు పెట్టెదరు?

ఏత దిచ్ఛా మ్యహం జ్ఞాతుం పరం కౌతూహలం హి మే,
హృది నిత్యం మహాబాహో వక్తు మర్హసి తన్మమ. 7

మహాబాహూ! దీని నెరుగుటకు నా హృదయమున బహుకాలమునుండి కోరిక యున్నది. నీవు చెప్పవలయును.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

అనురూపం కురుశ్రేష్ఠ త్వయ్యేతత్ పృథివీపతే,
బలాబల మమిత్రాణాం తేషాం యదిహ పృచ్ఛసి. 8

నాయనా! కురుశ్రేష్ఠా! రాజైన నీ కిది తగియున్నది. పగవారి బలాబలములను గూర్చి ఇపుడు నన్నడుగుచున్నావు.

శృణు రాజన్ మమ రణే యా శక్తిః పరమా భవేత్,
శస్త్రవీర్యే రణే యచ్చ భుజయోశ్చ మహాభుజ. 9

ఓయి మహాభుజుడా! రాజా! యుద్ధమున నాకు గల పరమశక్తి యెట్టిదియో, ఆయుధముల లా వెట్టిదియో. భుజముల సత్తువ యెట్టిదియో చెప్పెదను వినుము.

ఆర్జవేనైవ యుద్ధేన యోద్ధవ్య ఇతరో జనః,
మాయాయుద్ధేన మాయావీ ఇత్యేత ద్ధర్మనిశ్చయః. 10

మోసములేని యుద్ధమునే అవతలివాడు చేయవలయును. మాయావి కపట యుద్ధములు చేయును. ఇది ధర్మనిశ్చయము

హన్యా మహం మహాభాగ పాణ్డవానా మనీకినీమ్,
దివసే దివసే కృత్వా భాగం ప్రాగాహ్నికం మమ. 11

యోధానాం దశసాహస్రం కృత్వా భాగం మహాద్యుతే,
సహస్రం రథినా మేక మేష భాగో మతో మమ. 12

ఈ పాండవసేన నంతటిని ప్రతిదినము మధ్యాహ్నమువరకు ఒక భాగముగా చేసికొందును. అట్లే వేయిమంది రథికులు నాకొక భాగ మగుదురు.

అనేనాహం విధానేన సన్నద్ధః సతతోత్థితః,
క్షపయేయం మహత్ సైన్యం కాలేనానేన భారత. 13

ఈ లెక్క చొప్పున ఎల్లవేళల జాగరూకుడనై ఈ మహాసేనను అంత కాలములో రూపుమాపుదును.

ముఞ్చేయం యది వాఽస్త్రాణి మహాన్తి సమరే స్థితః,
శతసాహస్రఘాతీని హన్యాం మాసేన భారత. 14

యుద్ధరంగమున నిలిచి లక్షలమందిని చంపివేయు మహాస్త్రములను ప్రయోగింతునేని ఒక నెలలో ఈ సేనను రూపుమాపెదను.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

శ్రుత్వా భీష్మస్య తద్వాక్యం రాజా దుర్యోధన స్తతః,
పర్యపృచ్ఛత రాజేన్ద్ర ద్రోణ మఙ్గిరసాం వరమ్. 15

భీష్మునిమాట విని దుర్యోధనుడు అంగిరసులలో శ్రేష్ఠుడగు ద్రోణుని అడిగెను.

ఆచార్య కేన కాలేన పాణ్డుపుత్రస్య సైనికాన్,
నిహన్యా ఇతి తం ద్రోణః ప్రత్యువాచ హసన్నివ. 16

ఆచార్యా! పాండుపుత్రుని సైనికులను నీ వెంతకాలములో చంపుదువు? అనగా ద్రోణుడు నవ్వుచు నిట్లు బదులు పలికెను.

స్థవిరోఽస్మి మహాబాహో మన్దప్రాణవిచేష్టితః,
శస్త్రాగ్నినా నిర్దహేయం పాణ్డవానా మనీకినీమ్. 17

---

11. ప్రాగాహ్నికమ్ - పగటి యొక్క పూర్వభాగమున చేసెడు పని.

యథా భీష్మః శాన్తనవో మాసేనేతి మతిర్మమ,
ఏషా మే పరమా శక్తి రేతన్మే పరమం బలమ్. 18

మహాబాహూ! ముదుసలిని. ప్రాణముల శక్తి తగ్గుటవలన దేహమున వణకు మొదలగు చేష్టలు ఏర్పడినవి. భీష్ముడు చేయుదు నన్నట్లే నేనును నెలలో చేయుదును. నాకున్న శక్తియంతయు అంతమాత్రమే; నాబలమును అట్టిదియే."

ద్వాభ్యామేవ తు మాసాభ్యాం కృపః శారద్వతోఽబ్రవీత్,
ద్రౌణిస్తు దశరాత్రేణ ప్రతిజజ్ఞే బలక్షయమ్. 19

శరద్వంతుని పుత్రుడు కృపుడు రెండు నెలలలో సేనను నాశనము చేయుదునని చెప్పెను. అశ్వత్థామ పది దినములలో చేయుదునని పలికెను.

కర్ణస్తు పఞ్చరాత్రేణ ప్రతిజజ్ఞే మహాస్త్రవిత్.

కర్ణుడు మాత్రము గొప్ప అస్త్రముల నెరిగినవాడు కనుక అయిదు దినములలో శత్రుసంహారము చేయుదునని పలికెను.

తచ్ఛ్రుత్వా సూతపుత్రస్య వాక్యం సాగరగాసుతః,
జహాస సస్వనం హాసం వాక్యం చేద మువాచ హ. 20

సూతపుత్రుని ఆ మాట విని గంగాతనయుడు పెద్దగా నవ్వి యిట్లు పలికెను.

న హి యావద్రణే పార్థం బాణశఙ్ఖధనుర్ధరమ్, 21
వాసుదేవసమాయుక్తం రథే నాయాన్త మాహవే,
సమాగచ్ఛసి రాధేయ తేనైవ మభిమన్యసే,
శక్య మేవం చ భూయశ్చ త్వయా వక్తుం యథేష్టతః. 22

రాధేయా! బాణములు, శంఖము, గాండీవము ధరించి వాసుదేవునితోకూడి రథమెక్కి యుద్ధమునకు వచ్చు అర్జునునితో నీవింకను తలపడలేదు. కావున ఇట్లు తలపోయుచున్నావు. అంతవరకు నీకిట్లు ఇచ్చవచ్చినట్లు పలుకనగును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
భీష్మాదిశక్తికథనే త్రినవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున భీష్మాదులు తమ శక్తిని వక్కాణించుట యను నూటతొంబదిమూడవ అధ్యాయము.

—:o:—

## చతుర్నవత్యధికశతతమోఽధ్యాయః
## నూటతొంబదినాలుగవ అధ్యాయము

### అర్జునేన స్వస్య, సహాయకానాం యుధిష్ఠిరస్య చ శక్తేః పరిచయదానమ్
### అర్జునుడు తనదియు, సహాయకులయు, ధర్మరాజుయొక్కయు శక్తిని పరిచయము చేయుట

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏతచ్ఛ్రుత్వా తు కౌన్తేయః సర్వాన్ భ్రాతౄ నుపహ్వరే,
ఆహూయ భరతశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్. 1

కుంతీకుమారుడు ధర్మరాజిది విని తమ్ముల నందరిని సమీపమునకు పిలిచి యిట్లు పలికెను.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లనెను.

ధార్తరాష్ట్రస్య సైన్యేషు యే చారపురుషా మమ,
తే ప్రవృత్తిం ప్రయచ్ఛన్తి మమేమాం వ్యుషితాం నిశామ్. 2

దుర్యోధనుని సేనలలో నున్న నా గూఢచారులు వేకువజామున వారి వృత్తాంతము నందజేసిరి.

దుర్యోధనః కిలాపృచ్ఛ దాపగేయం మహావ్రతమ్,
కేన కాలేన పాణ్డూనాం హన్యాః సైన్య మితి ప్రభో. 3

"ప్రభూ! దుర్యోధనుడు మహావ్రతుడగు భీష్ముని ఎంతకాలములో పాండవ సేనను రూపుమాపగల వని యడిగెనట."

మా సేనేతి చ తేనోక్తో ధార్తరాష్ట్రః సుదుర్మతిః,
తావతా చాపి కాలేన ద్రోణోఽపి ప్రతిజజ్ఞివాన్. 4

---

1. వ్యుషితాం నిశామ్-కడచిన రాత్రిని-ప్రభాతసమయమున అని తాత్పర్యము.

"పరమదుర్బుద్ధి యగు దుర్యోధనున కతడు ఒక్కనెలలో అని చెప్పె నట. ద్రోణుడును అంతకాలములోనే యని మాట యిచ్చెనట.

గౌతమో ద్విగుణం కాల ముక్తవానితి నః శ్రుతమ్,
ద్రౌణిస్తు దశరాత్రేణ ప్రతిజజ్ఞే మహాస్త్రవిత్. 5

"కృపాచార్యుడు రెట్టింపు కాలమును చెప్పినట్లు మాకు వినవచ్చినది. అశ్వత్థామ మాత్రము పదిదినములలో అని పలికెనట.

తథా దివ్యాస్త్రవిత్ కర్ణః సంపృష్టః కురుసంసది,
పఞ్చభి ర్దివసై ర్హన్తుం ససైన్యం ప్రతిజజ్ఞివాన్. 6

"అట్లే దివ్యాస్త్రవేత్తయగు కర్ణు నడుగగా కౌరవులసభలో నాతడు ఆయిదు దినములలో సేన నంతటిని రూపుమాపుదు నని మాట యిచ్చెనట."

తస్మా దహ మపీచ్ఛామి శ్రోతు మర్జున తే వచః,
కాలేన కియతా శత్రూన్ క్షపయే రితి ఫాల్గున. 7

కావున అర్జునా! నేను నీ మాట వినగోరుచున్నాను. ఎంతకాలములో నీవు పగవారిని పరిమార్తువు?

ఏవముక్తో గుడాకేశః పార్థివేన ధనఞ్జయః,
వాసుదేవం సమీక్ష్యేదం వచనం ప్రత్యభాషత. 8

ఇట్లు రా జడుగగా ధనంజయుడు వాసుదేవుని పరికించి బదులు పలికెను.

సర్వ ఏవ మహాత్మానః కృతాస్త్రా శ్చిత్రయోధినః,
అసంశయం మహారాజ హన్యురేవ న సంశయః. 9

మహారాజా! వారందరు మహాత్ములు, అస్త్రవిద్యలో ఆరితేరినవారు, చిత్ర ముగా పోరగలవారు. తప్పక వారు చెప్పిన సమయములలో చంపగలరు.

అపైతు తే మనసస్తాపో యథా సత్యం బ్రవీమ్యహమ్,
హన్యా మేకరథేనైవ వాసుదేవసహాయవాన్. 10
సామరానపి లోకాంస్త్రీన్ సర్వాన్ స్థావరజఙ్గమాన్,
భూతం భవ్యం భవిష్యం చ నిమేషాదితి మే మతిః. 11

---

11. భూతం, భవ్యమ్, భవిష్యమ్ - చ - భూత మనగా పుట్టియున్నది; భవ్య మనగా - ప్రకృతమున పుట్టుచున్నది; విత్తనములవంటి ఈ రెండును నశింపగా రానున్నదాని నాశనము.

నీ మనస్తాపము తొలగిపోవుగాక! నేను సత్యము పలుకుచున్నాను. వాసుదేవుడు తోడైయుండగా ఒక్క రథముతో దేవతలతో కూడిన మూడు లోకములను, స్థావర జంగమములను, భూత వర్తమాన భవిష్యత్తులలో నుండు సర్వులను రెప్పపాటుకాలములో నాశనము చేయుదును.

యత్తద్ఘోరం పశుంతిః ప్రాదా దస్త్రం మహన్మమ,
కైరాతే ద్వన్ద్వయుద్ధే తు తదిదం మయి వర్తతే. 12

కిరాతరూపమున ఎక్కటి కయ్యము చేసినపుడు పశుపతి నా కనుగ్రహించిన మహాస్త్రము పాశుపత మున్నదే అదిగో ఇది నాకడనే యున్నది.

యద్యుగాన్తే పశుపతిః సర్వభూతాని సంహరన్,
ప్రయుంక్తే పురుషవ్యాఘ్ర తదిదం మయి వర్తతే. 13

ప్రళయకాలమున సర్వభూతములను రూపుమాపుచు ప్రయోగించునే అట్టి అస్త్రము నాకడ కలదు.

తన్నజానాతి గాఙ్గేయో న ద్రోణో న చ గౌతమః,
న చ ద్రోణసుతో రాజన్ కుత ఏవ తు సూతజః. 14

భీష్మ దది యెరుగడు. ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామయు ఎరుగరు. ఇక సూతుని కొడుకు సంగతి చెప్పనేల?

న తు యుక్తం రణే హన్తుం దివ్యై రస్త్రైః పృథగ్జనమ్,
ఆర్జవేనైవ యుద్ధేన విజేష్యామో వయం పరాన్. 15

కాని యుద్ధమున దివ్యములగు అస్త్రములతో సాధారణజనమును చంపుట తగనిపని. కావున సరియగు యుద్ధముతోడనే మనము పగవారిని పరిమార్తము.

తథేమే పురుషవ్యాఘ్రాః సహాయా స్తత్ర పార్థివ,
సర్వే దివ్యాస్త్రవిద్వాంసః సర్వే యుద్ధాభికాంక్షిణః. 16

మరియు నీకు ఆ యుద్ధమున తోడై వచ్చిన వారందరు గొప్పవారు. అందరు దివ్యాస్త్రములం దారితేరినవారు. అందరు పోరున కుత్సాహముతో నెదురుచూచుచున్నవారు.

వేదాన్తావభృథస్నాతాః సర్వ ఏతేఽపరాజితాః,
నిహన్యుః సమరే సేనాం దేవానా మపి పాణ్డవ. 17

---

17. వేదాన్తావభృథస్నాతాః - వేదాధ్యయనము ముగిసిన పిదప వివాహ సమయమున యజ్ఞము చేసి అవభృథస్నానము చేయుదురు. అని భావము.

వేదమంత్రయు గ్రహించి యజ్ఞాంతమున చేయు స్నానము చేసినవారు. ఓటమి యెరుగనివారు. రణరంగమున దేవతలనైనను చంపెడువారు.

శిఖణ్డీ యుయుధానశ్చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
భీమసేనో యమౌ చోభౌ యుధామన్యూత్తమౌజసౌ. 18
విరాటద్రుపదౌ చోభౌ భీష్మద్రోణసమౌ యుధి,
శఙ్ఖశ్చైవ మహాబాహు ర్హైడిమ్బశ్చ మహాబలః. 19
పుత్రోఽస్యాఞ్జనపర్వా తు మహాబలపరాక్రమః,
శైనేయశ్చ మహాబాహుః సహాయో రణకోవిదః, 20
అభిమన్యుశ్చ బలవాన్ ద్రౌపద్యాః పఞ్చ చాత్మజాః.

శిఖండి, యుయుధానుడు, ద్రుపదుని కొడుకు ధృష్టద్యుమ్నుడు, భీమసేనుడు, కవలలు, యుధామన్యువు, ఉత్తమౌజుడు, భీష్మద్రోణులంతు సాటివచ్చు విరాటద్రుపదులు, మహాబాహువగు శంఖుడు, మహాబలముగల హిడింబ కొడుకు, మహాబలము, గొప్ప పరాక్రమముగల అతని కొడుకు అంజనపర్వుడు, యుద్ధ విద్యలో పండితుడు, మహాబాహువు నగు సాత్యకి, బలవంతుడగు అభిమన్యుడు, ద్రౌపది అయిదుగురు కొడుకులు నీకు సహాయులు.

స్వయం చాపి సమర్థోఽసి త్రైలోక్యోత్సాదనేఽపి చ. 21

మూడులోకములను రూపుమాపుటకు నీవును సమర్థుడవే కదా!

క్రోధాద్యం పురుషం పశ్యే స్తథా శక్రసమద్యుతే,
స్వక్షిప్రం న భవే ద్వ్యక్తమితి త్వాం వేద్మి కౌరవ. 22

దేవేంద్రునికి సాటివచ్చు తేజముగల ఓ రాజా! నీవు కోపముతో వేనినైన చూచితివో వాడింక నిశ్చయముగా మిగులడు. నీ వట్టివాడవని నే నెరుగుదును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
అర్జునవాక్యే చతుర్నవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
అర్జునవాక్యముగల నూటతొంబదినాలుగవ అధ్యాయము.

—:o:—

# పఞ్చనవత్యధికశతతమోఽధ్యాయః

# నూటతొంబదియైదవ అధ్యాయము

## కౌరవసేనాయా రణాయ ప్రస్థానమ్.

## కౌరవసేన రణమునకు బయలుదేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః ప్రభాతే విమలే ధార్తరాష్ట్రేణ చోదితాః,
దుర్యోధనేన రాజానః ప్రయయుః పాణ్డవాన్ ప్రతి. 1

అంత తెల్లవారగా ధృతరాష్ట్రుని కుమారుడు దుర్యోధనుడు పురికొల్పగా రాజు లందరు పాండవులపైకి బయలుదేరిరి.

ఆప్లావ్య శుచయః సర్వే స్రగ్విణః శుక్లవాససః,
గృహీతశస్త్రా ధ్వజినః స్వస్తివాచ్య హుతాగ్నయః. 2

అందరు స్నానము చేసి పరిశుద్ధు లైరి. మాలలు ధరించిరి. తెల్లని వస్త్రములు తాల్చిరి. ఆయుధములు గ్రహించిరి. ధ్వజము లెత్తిరి. స్వస్తివాచనములతో అగ్నులను వ్రేల్చినవారైరి.

సర్వే బ్రహ్మవిదః శూరాః సర్వే సుచరితవ్రతాః,
సర్వే కామకృతశ్చైవ సర్వే చాహవలక్షణాః. 3

అందరు బ్రహ్మవేత్తలు. అందరు మంచినడవడియందు వ్రతము కలవారు. అందరు ఇష్టపూర్వకముగా యుద్ధము చేయువారు. అందరు యుద్ధపు చిహ్నములు కలవారు.

---

2. ఆప్లావ్య - నీటిలో మునిగి - స్నానము చేసి.

3. కామకృతః - అర్థము స్పష్టము కాలేదు. వర్మభృతః - అని పాఠాంతరము - కవచములు తాల్చినవారు - అని యర్థము;

ఆహవేషు పరాన్ లోకాన్ జిగీషన్తో మహాబలాః,
ఏకాగ్రమనసః సర్వే శ్రద్దధానాః పరస్పరమ్. 4

యుద్ధములో వారందరు గొప్పబలముతో పరలోకములను కూడ గెలువగోరు చెదరని మనసు కలవారు. ఒకరియందొకరు చెదని నమ్మకము కలవారు.

విన్దానువిన్దా వావన్త్యౌ కేకయా బాహ్లికైః సహ,
ప్రయయుః సర్వ ఏవైతే భారద్వాజపురోగమాః. 5

కేకయరాజులగు విందానువిందులు బాహ్లికులతోపాటు ద్రోణాచార్యుని ముందిడుకొని బయలుదేరిరి.

అశ్వత్థామా శాన్తనవః సైన్ధవోఽథ జయద్రథః,
దాక్షిణాత్యాః ప్రతీచ్యాశ్చ పార్వతీయాశ్చ యే నృపాః. 6

అశ్వత్థామ, భీష్ముడు, సింధురాజగు జయద్రథుడు, దక్షిణదేశపు రాజులు' పడమటి దేశపురాజులు, కొండరాజులు.

గాన్ధారరాజః శకునిః ప్రాచ్యోదీచ్యాశ్చ సర్వశః,
శకాః కిరాతా యవనాః శిబయోఽథ వసాతయః. 7

గాంధారరాజు శకుని, తూర్పు దేశపు రాజులు, ఉత్తరదేశపు రాజులు, శకులు, యవనులు, శిబులు, వసాతులు-

స్వైః స్వైరనీకైః సహితాః పరివార్య మహారథమ్,
ఏతే మహారథాః సర్వే ద్వితీయే నిర్యయుర్బలే. 8

ఈ మహారథు లందరు తమ తమ సైనికులతో కూడి రెండవగుంపుగా బయలుదేరిరి.

కృతవర్మా సహానీక స్త్రిగర్తశ్చ మహారథః,
దుర్యోధనశ్చ నృపతి ర్భ్రాతృభిః పరివారితః. 9

సేనాసహితుడగు కృతవర్మయు, మహారథుడగు త్రిగర్తుడును, సోదరు లందరితో కూడియున్న రాజు దుర్యోధనుడును-

శలో భూరిశ్రవాః శల్యః కౌసల్యోఽథ బృహద్రథః,
ఏతే పశ్చా దనుగతా ధార్తరాష్ట్రపురోగమాః. 10

శలుడు, భూరిశ్రవసుడు, శల్యుడు, కోసలరాజు బృహద్రథుడు - అను వారు దుర్యోధనాదులను ముందిడుకొని వారివెనుక బయలుదేరిరి.

తే సమేత్య యథాన్యాయం ధార్తరాష్ట్రి మహాబలాః,
కురుక్షేత్రస్య పశ్చార్ధే వ్యవతిష్ఠన్త దంశితాః. 11

అట్లు మహాబలముగల ధృతరాష్ట్రిని వారందరు తగువిధమున కూడుకొని చక్కగా కవచములు తొడిగికొని కురుక్షేత్రము పడమటి దిక్కున నిలిచి యుండిరి.

దుర్యోధనస్తు శిబిరం కారయామాస భారత,
యథైవ హాస్తినపురం ద్వితీయం సమలంకృతమ్. 12

దుర్యోధనుడు రెండవ హస్తిపురమా యన్నట్లు చక్కగా అలంకరించుకొన్న శిబిరమును వేయించెను.

న విశేషం విజానన్తి పురస్య శిబిరస్య వా,
కుశలా అపి రాజేన్ద్ర నరా నగరవాసినః. 13

ఎంతటి నేర్పుగలవారును నగరమునం దుండు నరులు పురమునకు శిబిరమునకు భేదము నెరుగ జాలకుండిరి.

తాదృశాన్యేవ దుర్గాణి రాజ్ఞామపి మహీపతిః,
కారయామాస కౌరవ్యః శతశోఽథ సహస్రశః. 14

కౌరవరాజు సుయోధనుడు అట్టివే యగు శిబిరములను తక్కిన రాజులకును నూర్లకొలదిగా వేలకొలదిగా చేయించెను.

పఞ్చయోజన ముత్సృజ్య మణ్డలం తద్రణాజిరమ్,
సేనానివేశా స్తే రాజ న్నవిశఞ్ఛత సఙ్ఘశః. 15

అయిదు యోజనముల మేర గుండ్రముగా రణభూమిని చక్కగా నిర్మించి సేనానివేశములు నూర్లకొలదిగా ఏర్పడి నిలిచినవి.

---

15. ఉత్సృజ్య - గొప్పగా సృష్టించి; అయిదు యోజనముల వర్తులాకారపు పరిధిని చేసి - సేనానివేశాః - సైనికులు, వర్తకులు, కూలీలు మొదలగు వారు.

తత్ర తే పృథివీపాలా యథోత్సాహం యథాబలమ్,
వివిశుః శిబిరా ణ్యత్ర ద్రవ్యవ న్తి సహస్రశః. 16

గొప్ప మూల్యము గల వేలకొలదిగా నున్న ఆ శిబిరములను ఆ రాజులందరు ఉత్సాహముతో సేనలకు సరిపడునట్లు ఎన్నుకొని ప్రవేశించిరి.

తేషాం దుర్యోధనో రాజా ససైన్యానాం మహాత్మనామ్,
వ్యాదిదేశ సబాహ్యానాం భక్ష్యభోజ్య మనుత్తమమ్. 17

సైనికులతో, వాహనములతో కూడిన ఆ రాజు లందరకు దుర్యోధనమహారాజు మేలుజాతి భోజనములను సమకూర్చెను.

సనాగాశ్వమనుష్యాణాం యే చ శిల్పోపజీవినః,
యే చాన్యేఽనుగతా స్తత్ర సూతమాగధవన్దినః. 18
వణిజో గణికా శ్చారా యే చైవ ప్రేక్షకా జనాః,
సర్వాం స్తాన్ కౌరవో రాజా విధివత్ ప్రత్యవైక్షత. 19

ఏనుగులను, గుఱ్ఱములను, పదాతులను, ఆ యా వృత్తులతో జీవించువారిని, వారి వారి సేవకులను, సూతులను, మాగధులను, వందులను, వర్తకులను, భోగమువారిని, చూడవచ్చిన జనులను - అందరను కురురాజు ఏ లోపమును రానీక అరసికొనుచుండెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అమ్బోపాఖ్యానపర్వణి
కౌరవసైన్యనిర్యాణే పఞ్చనవత్యధికశతతమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
కౌరవసేన కదలివచ్చుట యను నూటతొంబదియైదవ అధ్యాయము.

—: ० :—

# షణ్ణవత్యధికశతతమోఽధ్యాయః
# నూటతొంబదియారవ అధ్యాయము.

## పాణ్డవసేనాయా యుద్ధాయ ప్రస్థానమ్.
## పాండవసేన యుద్ధమునకు బయలుదేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథైవ రాజా కౌన్తేయో ధర్మపుత్రో యుధిష్ఠిరః,
ధృష్టద్యుమ్నముఖాన్ వీరాం శ్చోదయామాస భారత. 1

అట్లే కుంతీకుమారుడు, ధర్మతనయుడు నగు యుధిష్ఠిరు డిట ధృష్ట ద్యుమ్నుడు మొదలగు వీరులను బయలుదేరదీసెను.

చేదికాశకరూషాణాం నేతారం దృఢవిక్రమమ్,
సేనాపతి మమిత్రఘ్నం ధృష్టకేతు మథాదిశత్. 2

చేదికాశకరూషదేశముల నాయకుడు, గట్టి పరాక్రమము కలవాడు, శత్రువులను రూపుమాపువాడు సేనాపతియగు ధృష్టకేతువును ఆజ్ఞాపించెను.

విరాటం ద్రుపదం చైవ యుయుధానం శిఖణ్డినమ్,
పాఞ్చాల్యౌ చ మహేష్వాసౌ యుధామన్యూత్తమౌజసౌ. 3

విరాటుని, ద్రుపదుని యుద్ధమునకు సిద్ధమైన శిఖండిని, గొప్ప విలుకాండ్రగు పాంచాలరాజులు యుధామన్యువు ఉత్తమౌజుడు అనువారిని బయలుదేర దీసెను.

తే వీరా శ్చిత్రవర్మాణ స్తప్తకుణ్డలధారిణః,
ఆజ్యావసిక్తా జ్వలితా ధిష్ణ్యేష్వివ హుతాశనాః. 4

ఆ వీరులందరు పెక్కువిధములైన కవచములు తొడిగికొని, సువర్ణ కుండలములను తాల్చి, అగ్నిహోత్రగృహములందు నేతితో తడిసి మంటలు గ్రక్కుచున్న అగ్నులవలె నుండిరి.

---

4. ధిష్ణ్యేషు - అగ్నిహోత్ర గృహములందు,

అశోభన్త మహేష్వాసా గ్రహాః ప్రజ్వలితా ఇవ.

కాంతులు చిమ్ముచున్న గ్రహములవలె ఆ మహాధానుష్కు లందరు విరాజిల్లుచుండిరి.

అథ సైన్యం యథాయోగం పూజయిత్వా నరర్షభః, 5
దిదేశ తాన్యనీకాని ప్రయాణాయ మహీపతిః.

పిమ్మట వారివారికి తగినవిధముగా సైనికులను మన్నించి రాజు సేనలను ప్రయాణమున కాదేశించెను.

తేషాం యుధిష్ఠిరో రాజా ససైన్యానాం మహాత్మనామ్. 6
వ్యాదిదేశ సవాహ్యానాం భక్ష్యభోజ్య మనుత్తమమ్,
సగజాశ్వమనుష్యాణాం యే చ శిల్పోపజీవినః. 7

యుధిష్ఠిరమహారాజు సేనలతో, వాహనములతో కూడిన ఆ మహాత్ము లందరకు మేలుజాతి ఆహారములను సమకూర్చెను. అట్లే ఏనుగులకు, గుఱ్ఱములకు, పదాతులకు, వృత్తులతో జీవించువారికి ఆహారముల నొసగెను.

అభిమన్యుం బృహన్తం చ ద్రౌపదేయాంశ్చ సర్వశః,
ధృష్టద్యుమ్నముఖా నేతాన్ ప్రాహిణోత్ పాణ్డునన్దనః. 8

కొడుకులలో పెద్దవాడగు అభిమన్యుని, ద్రౌపదికొడుకులను, ధృష్టద్యుమ్నుడు మొదలగువారిని ధర్మరాజు యుద్ధభూమికి పంపెను.

భీమం చ యుయుధానం చ పాణ్డవం చ ధనంజయమ్,
ద్వితీయం ప్రేషయామాస బలస్కన్ధం యుధిష్ఠిరః. 9

భీముని, యుయుధానుని, పాండుకుమారు డగు ధనంజయుని రెండవ సేనగా చేసి పంపెను.

భాణ్డం సమారోపయతాం చరతాం సంప్రధావతామ్,
హృష్టానాం తత్ర యోధానాం శబ్దో దివ మివాస్పృశత్. 10

---

9. బలస్కన్ధమ్ - సేనల సముదాయమును;
10. భాణ్డమ్ - యుద్ధముల సాధనసామగ్రిని;

యుద్ధసామగ్రిని బండ్లకెత్తువారు, అటు నిటు తిరుగువారు, పరువు లెత్తు వారు, ఉత్సాహముతో పొంగిపోవువారు నగు యోధుల నాదము మిన్నుముట్టెను.

స్వయమేవ తతః పశ్చా ద్విరాటద్రుపదాన్వితః,
అథాపరై ర్మహీపాలైః సహ ప్రాయా న్మహీపతిః. 11

ఆ వెనుక విరాటద్రుపదులతోడను, తక్కిన రాజులతోడను గూడి రాజు స్వయముగా బయలుదేరెను.

భీమధన్వాయనీ సేనా ధృష్టద్యుమ్నేన పాలితా,
గఙ్గేవ పూర్ణా స్తిమితా స్యన్దమానా వ్యదృశ్యత. 12

భయంకరములగు ధనువులు కలవారి కదలికలు గలదియు, ధృష్టద్యుమ్నుడు రక్షించుచున్నదియు, నిండుగా మెల్లగా కదలుచున్నదియు, నగు నాసేన గంగవలె కానవచ్చెను.

తతః పున రనీకాని న్యయోజయత బుద్ధిమాన్,
మోహయన్ ధృతరాష్ట్రస్య పుత్రాణాం బుద్ధినిశ్చయమ్. 13

పిదప బుద్ధిశాలియగు ధర్మరాజు ధృతరాష్ట్రుని కొడుకుల బుద్ధినిశ్చయము కలవరపెట్టుచు సేనలను మోహరించెను.

ద్రౌపదేయా న్మహేష్వాసా నభిమన్యుం చ పాణ్డవః,
నకులం సహదేవం చ సర్వాం శ్చైవ ప్రభద్రకాన్. 14

గొప్ప విలుకాండ్రగు ద్రౌపది కుమారులను, అభిమన్యుని, నకుల సహదేవులను, ప్రభద్రకు లందరిని పాండవుడు నడిపించెను.

దశ చాశ్వసహస్రాణి ద్విసహస్రాణి దన్తినామ్,
అయుతం చ పదాతీనాం రథాః పఞ్చశతం తథా. 15

పదివేలగుఱ్ఱములు, రెండువేల ఏనుగులు, పదివేవురు కాలుబంటులు, అయిదువందల రథములు గల-

---

12. భీమధన్వాయనీ - భయంకరములైన ధనువులు తాల్చిన వీరుల కదలికలు గలది;

భీమసేనస్య దుర్ధర్షం ప్రథమం ప్రాదిశ ద్బలమ్,
మధ్యమే చ విరాటం చ జయత్సేనం చ పాణ్డవః. 16

భీమసేనుని లొంగదీయరాని సేనను ముందు నిలువ నాజ్ఞాపించెను. నడుమ విరాటుని జయత్సేనుని నిలువఁ బంపెను.

మహారథౌ చ పాఞ్చాల్యౌ యుధామన్యూత్తమౌజసౌ,
వీర్యవన్తౌ మహాత్మానౌ గదాకార్ముకధారిణౌ, 17
అన్వయాతాం తదా మధ్యే వాసుదేవధనఞ్జయౌ.

మహారథులు, పాంచాలరాజులు నగు యుధామన్యువు, ఉత్తమౌజుడు అనువారలు గొప్ప పరాక్రమము గల మహాత్ములు గదలు, విండ్లు తాల్చిన వారును అగు వాసుదేవుడు, ధనంజయుడును సేననడుమ నడువసాగిరి.

బభూవు రతిసంరబ్ధాః కృతప్రహరణా నరాః. 18

అనేకయుద్ధములలో ఆరితేరి ఉత్సాహముతో పొంగిపోవు నరు లచట కదలిరి.

తేషాం వింశతిసాహస్రాః హయాః శూరై రధిష్ఠితాః,
పఞ్చనాగసహస్రాణి రథవంశాశ్చ సర్వశః. 19

శూరు లెక్కి వచ్చుచున్న వారిగుఱ్ఱము లిరువదివేలు, ఏనుగు లైదువేలు, రథసముదాయములు కదలినవి.

పదాతయశ్చ యే శూరాః కార్ముకాసిగదాధరాః,
సహస్రశోఽన్వయుః పశ్చా దగ్రతశ్చ సహస్రశః. 20

విండ్లు, ఖడ్గములు, గదలు చేతబట్టిన శూరులు కాలుబంటులు ముందు వెనుక భాగములందు నడచిరి.

యుధిష్ఠిరో యత్ర సైన్యే స్వయమేవ బలార్ణవే,
తత్ర తే పృథివీపాలా భూయిష్ఠం పర్యవస్థితాః. 21

ఆ సేనయను మహాసముద్రమున ధర్మరాజున్నతావున రాజులు పెద్ద సంఖ్యతో చుట్టును నిలిచియుండిరి.

తత్ర నాగసహస్రాణి హయానా మయుతాని చ,
తథా రథసహస్రాణి పదాతీనాం చ భారత. 22

మరియు నచట వేలకొలది ఏనుగులు పదివేలసంఖ్యలో గుఱ్ఱములు, వేల కొలదిగా రథములు, పదాతులు నిలిచియుండెను.

చేకితానః స్వసైన్యేన మహతా పార్థివర్షభ,
ధృష్టకేతుశ్చ చేదీనాం ప్రణేతా పార్థివో యయౌ. 23

గొప్పసేనతో కూడి చేదిరాజగు ధృష్టకేతుడును చేకితానుడును బయలు దేరిరి.

సాత్యకిశ్చ మహేష్వాసో వృష్ణీనాం ప్రవరో రథః,
వృతః శతసహస్రేణ రథానాం ప్రణుదన్ బలీ. 24

వృష్ణివంశమున పేరుగన్నవాడు, మహారథుడు, మహాబలుడు, గొప్ప విలుకాడు నగు సాత్యకి నూరువేల రథములతో కూడి బయలుదేరెను.

క్షత్రదేవబ్రహ్మదేవౌ రథస్థౌ పురుషర్షభౌ,
జఘనం పాలయన్తౌ చ పృష్ఠతోఽనుప్రజగ్మతుః. 25

క్షత్రదేవుడు బ్రహ్మదేవుడు అనువారు రథము లెక్కి వెనుకభాగమును రక్షించుచు ధర్మరాజు వెనుక పోవసాగిరి.

శకటాపణవేశాశ్చ యానం యుగ్యం చ సర్వశః,
తత్ర నాగసహస్రాణి హయానా మయుతాని చ,
ఫల్గుసర్వం కలత్రం చ యత్కిఞ్చిత్ కృశదుర్బలమ్. 26

---

26 శకట, ఆపణ, వేశాః - శకటములు గల బండ్లు; ఆపణములు-వస్తువుల విక్రయించుశాలలు; వేశములు - వేశ్యాజనులు, యానమ్ - యుద్ధమునకు తగిన వాహనములు; యుగ్యమ్-బరువులు మోయు వాహనములు; ఫల్గు-సారము లేనిది - బాలురు మొదలగునది; కళత్రమ్ - స్త్రీ జనము.

కోశసంచయవాహాంశ్చ కోష్ఠాగారం తథైవ చ,
గజానీకేన సంగృహ్య శనైః ప్రాయా ద్యుధిష్ఠిరః. 27

యుద్ధపరికరములు గల బండ్లు, దుకాణములు, వేశ్యాజనము, యుద్ధ వాహనములు, ఇతరములగు వాహనములు, వేల యేనుగులు, పదేసివేల గుఱ్ఱములు, బాలురు, స్త్రీలు, సత్తువలేని జనములు, ధనముల సంచులను మోయు వాహనములు, వస్తుసామగ్రి గల కొట్లు, అనువానిని మోయవలసిన వానిని ఏనుగుల సముదాయములందు కూడబెట్టుకొని యుధిష్ఠిరుడు మెల్లగా బయలుదేరెను.

తమన్వయాత్ సత్యధృతిః సౌచిత్తి ర్యుద్ధదుర్మదః,
శ్రేణిమాన్ వసుదానశ్చ పుత్రః కాశ్యస్య వా విభుః. 28

ఆ ధర్మరాజును సత్యధృతి యుద్ధమున పొగరుచూపు సౌచిత్తి, శ్రేణిమానుడు, కాశ్యుని కొడుకగు వసుదానుడు అనువారు అనుసరించిరి.

రథా వింశతిసాహస్రా యే తేషా మనుయాయినః,
హయానాం దశకోట్యశ్చ మహతాం కింకిణీకినామ్. 29
గజా వింశతిసాహస్రా ఈషాదన్తాః ప్రహారిణః,
కులీనా భిన్నకరటా మేఘా ఇవ విసర్పిణః. 30
షష్టి ర్నాగసహస్రాణి దశాన్యాని చ భారత,
యుధిష్ఠిరస్య యాన్యాసన్ యుధి సేనా మహాత్మనః,
క్షరన్త ఇవ జీమూతాః ప్రభిన్నకరటాముఖాః, 31
రాజాన మన్వయుః పశ్చా చ్చలన్త ఇవ పర్వతాః. 32

ఇరువదివేల రథములు, వాని ననుసరించు భటులు, చిరుమువ్వలు గల గొప్పవి యగు పదికోట్ల గుఱ్ఱములు, నాగటియేటి కోలవంటి దంతములు గలవియు, యుద్ధము చేయునవియు, మేలుజాతివియు, మదముతో నిండిన చెక్కిళ్ళు కలవియు, అటునిటు కదలాడుచున్న మేఘములో యనదగినవియు నగు ఇరువదివేల ఏనుగులు, మరియు ఇంకొక గుంపుగా నున్న అరువదివేల ఏనుగులు, మరి యొక పదివేల ఏనుగులు - ఇట్లు ధర్మరాజునకు గల సేనా విభాగములన్నియు తిరుగుచున్న మేఘములవలె మదముకారు చెక్కిళ్ళతో, కదలాడు కొండలవలె ధర్మరాజు వెనుక నడువసాగెను.

27. కోశమనగా ధనము; కోష్ఠ మనగా ధాన్యాది సామగ్రి.

ఏవం తస్య బలం భీమం కున్తీపుత్రస్య ధీమతః,
యదాశ్రిత్యాథ యుయుధే ధార్తరాష్ట్రం సుయోధనమ్. 33

బుద్ధిశాలి యగు కుంతీపుత్రుడు దేని నండకొని ధృతరాష్ట్రుని కొడుకగు సుయోధనునితో పోరెనో యట్టి యా బలమంతయు భయంకరముగా నుండెను.

తతో௨న్యే శతశః పశ్చాత్ సహస్రాయుతశో నరాః,
నర్దన్తః ప్రయయు స్తేషా మనీకాని సహస్రశః. 34

ఆ వెనుక ,నూర్లకొలదిగా, వేలకొలదిగా, పదివేలకొలదిగా నరబలము ఉత్సాహముతో అరచుచు వెంటనంటి నడచెను.

తత్ర భేరీసహస్రాణి శఙ్ఖానా మయుతాని చ,
న్యవాదయన్త సంహృష్టాః సహస్రాయుతశో నరాః. 35

ఉత్సాహపు పొంగుగల వేలకొలది నరులు వేలకొలది భేరులను, పదివేల కొలదిగా శంఖములను మొరయించిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి అంబోపాఖ్యానపర్వణి
పాణ్డవసేనానిర్యాణే షణ్ణవత్యధికశతతమో௨ధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున అంబోపాఖ్యానపర్వమున
పాండవసేనాప్రయాణముగల నూటతొంబదియారవ అధ్యాయము.

సమాప్త ముద్యోగపర్వ.
ఉద్యోగపర్వము ముగిసెను.

—: o :—

# పరిశిష్టమ్

## పరిశిష్టము

సనత్సుజాతీయపర్వము చివర కొన్నిపుస్తకములలో ఈ క్రింది శ్లోకము కానవచ్చుచున్నది.

> విషం భుఙ్క్ష్వ సహామాత్యై
> ర్వినాశం ప్రాప్నుహి ధ్రువమ్,
> రాజన్ కేన వినా నాభ్యాం
> స్ఫీతం కృష్ణాజినం వరమ్.

రాజన్-ఓ రాజా; స్ఫీతమ్ - పుష్టిగల; వరమ్-శ్రేష్ఠమైన; కృష్ణాజినమ్ - కృష్ణాజినమును; సహామాత్యైః-మంత్రులతోపాటు; భుఙ్క్ష్వ-పాలింపుము; ఆ కృష్ణాజిన మెట్టిదనగా; విషమ్ - విగతషకారము కలది - అనగా షకారము లేనిది; కేన వినా-కకారము లేనిది; నాభ్యామ్ వినా-రెండు నకారములు లేనిది.

క్ ఋ ష్ ణ్ ఆ జ్ ఇ న్ అమ్ - అనువానిలో కకార షకార, ణకార నకారములను తొలగించినచో ఋ + ఆజి + అమ్ అనునవి మిగులును - సంధి కలిపినచో "రాజ్యమ్" అని యేర్పడును-కేవలము రాజ్యమే కాదు, ధ్రువమ్ - స్థిరమైన; శమ్ (వినా, శమ్) కల్యాణమును ప్రాప్నుహి - పొందుము అని యీ శ్లోకమునకు గూఢమగు అర్థము.

రాజన్-రాజా! సహామాత్యైః - మంత్రులతో పాటు; విషమ్ - విషమును; భుంక్ష్వ-తినుము; ధ్రువమ్ - తప్పక; వినాశమ్ - వినాశమును; ప్రాప్నుహి - పొందుము; తప్పక నీవు పుత్రుల వినాశము చూతువని భావము; ఆత్మ హననము నిషిద్ధము కావున నట్లు చేయవేని; కేన-సుఖముతో; వినా-లేక-రాజ్యసుఖ

ప్రత్యాశ లేదు కనుక అని తాత్పర్యము; నాభ్యామ్-ఉత్తమక్షత్రియ కులమునం బుట్టిన నీకు; స్ఫీతమ్ - నిగనిగలాడు; కృష్ణాజినమ్ - లేడిచర్మము (గ్రహించుట) వరమ్ - మేలైనది; సన్యసించుటయే మేలు; ఉత్తమకర్తవ్య మని భావము; సుఖము కోల్పోయిన క్షత్రియునకు సన్యాసమే మిక్కిలి సుఖమైన దను ఆచార్య వచనమువలన నీకు సంన్యాసమే కర్తవ్యమని భావము - ఇది పైకి కానవచ్చు అర్థము.

—:౦:—

